చున్నది.[7]

ఈ యుద్ధము భీష్మ నిర్యాణ మాధారముగ కాల నిర్ణయమును మరింత విస్పష్టముగ నొనర్పవచ్చును. కార్తీక అమావాస్యనాడు భీష్ముని యధినేతృత్వమున సాగిన యుద్ధమునాటినుండి పది దినములు కొనసాగెను. పది దినములు భీష్ముడు, ఐదు దినములు ద్రోణుడు, రెండు దినములు కర్ణుడు, దినార్ధము శల్యుడు, దినార్ధము దుర్యోధనుడు యుద్ధ మొనర్చిరి. అమావాస్య 1 దినము. విశ్వఘ్న పక్షము వెనుక వచ్చెడి పక్షమునకు పదునారు దినము లుండుట శాస్త్ర సమ్మతము. ఈ పక్షమున 16 దినములు, మార్గశీర్ష బహుళ ప్రతిపత్తు 1 దినము. మొత్తము 18 దినములు, అనగా కార్తీక అమావాస్యనాడు ప్రారంభమైన యుద్ధము మార్గశీర్ష బహుళ ప్రతిపత్తుతో ముగిసినది.

భీష్ముడు పదియవ దినమున శరతల్ప గతుడై యప్పటికి బది యెన్మిది దినములు గడచిన యనంతరము వ్యాసాది మహాత్ములతో డను

---

7. రవి — విశాఖ 2
చంద్రుడు — విశాఖ - 4
కుజుడు వక్రీ చిత్ర-4
బుధుడు స్వాతి—3
శుక్రుడు హస్త—2
గురువు విశాఖ—3
శని అనూరాధ—4
రాహువు—విశాఖ—1

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | | | |
| | | | |
| | శ | గు బు రా చం రవి | శు |

శని. రవి, చంద్ర, గురు. శుక్ర. కుజ, బుధ గ్రహములు తత్తద్రాశులందు క్రూరదృష్టిని కలిగియుండిరి. తత్కారణమున భీష్ముడు గ్రహస్థితను గుర్తించి నాడు ఉదయించిన ధూమకేతువును గుర్తించి వివరించి అధిక రక్తస్రావమును, అధిక జనక్షయమును సూచించెను. యుద్ధము జరుగనే జరిగెను. జన సంక్షయము, క్షామము సంభవించెను.

సితర ప్రముఖులతోఁ దను పరివేష్టితుఁడై న భీష్ముని దర్శింప సామాత్యుఁడై ధర్మజుడు సమీపించును. ధర్మజునిగాంచిన భీష్ముడు.

దిష్ట్యా ప్రాప్తోసి కౌన్తేయ సహామాత్యోయుధిష్ఠిర
పరివృత్తో హి భగవాన్ సహస్రాంశు ర్దివాకరః। 26
అష్టపంచాశతం రాత్ర్యః శయన స్యాఽద్య మేగతాః।
శరేషు నిశితాగ్రేషు యథాప్ష్ట శతంతథా 127
మాఘోయం సముపప్రాప్తోమాసః సౌమ్యోయుధిష్ఠిర।
త్రిభాగ శేషపక్షోయం శుక్లోభవితు మర్హసి 128 (273)

ఇది యీఅనుశాసనిక పర్వములోనిది, దీనిభావమిది. అమాత్య సహితుఁడవై విచ్చేసిన యుధిష్ఠిర చక్రవర్తీ! కుంతీతనయా! సహస్ర కిరణుఁడైన దివాకరుడు ఉత్తర ముఖముగా ప్రయాణ మారంభించెను. ఇప్పటికి నీ శరతల్పముమీద నేబది ఎన్మిది దినములు గతించినవి. ఈ కాలము నాకు శతసంవత్సర సమముగా నున్నది. మాఘమాసము వచ్చినది. అందు నాలుగు భాగములలో నొక భాగముగడచి మూడు భాగములింకను మిగిలియున్నవి. అని ధర్మజునకు తన పరిస్థితి నెఱుక పఱచును. మార్గశిరము, పుష్యమాసములు గడచినవి. మాఘమాసము నందు ముప్పది తిథులలో 7½ తిథులుగూడగడచినవని చెప్పుచున్నాడు.[8]

శాంతిపర్వమునందును జనమేజయుడు వైశంపాయనుని భీష్ముని పంచత్వ విధాన మడుగును.[9] దానికి వైశంపాయనుడు.

"శృణుష్వాఽవహితో రాజన్ శుచిర్భూత్వా సమాహితః
భీష్మస్య కురుశార్దూల దేహోత్సర్గం మహాత్మనః। 2

8. సౌమ్యశ్చాంద్రః మాసస్య చతుర్భాగే కటణే సార్ధ సప్తతిథేరేకైక భాగస్యాత్ అష్టమ స్యార్థస్యాఽఅనతీతత్వేన ప్రథమభాగస్య విద్యమానత్వాత్ త్రిభాగ శేషోభవతు మర్హతీత్యర్థః తేనాఽద్యాష్టమీత్యర్థః వ్యాఖ్యా.

9. శరతల్పే శయానస్తు భారతానాం పితామహః।
కథముత్సృష్టవాన్ దేహం కంచయోగమవధారయన్॥ (శాంతి. అ. 46)

ప్రపృత్తమాత్రేత్వయన ముత్తరేణదివాకరే।
శుక్లపక్షస్య చాష్టమ్యాం మాఘమాసస్యపార్థివః 3
ప్రాజాపత్యేచనక్షత్రే మధ్యంప్రాప్తేదివాకరే।
సమావేశయదాత్మాన మాత్మన్యేవ సమాహితః॥ 4

అని మాఘ శుక్లాష్టమిని స్పష్టముగా నిర్దేశించును. ఇది పై సన్ని వేశమునకు సమర్థనమేయగును. దీనివలన భీష్ముఁడు శరతల్పముమీఁద నేబదియెన్మిది దినములున్నట్లు, అష్టమీ తిథియందు దేహత్యాగ మొనర్చినట్లు స్పష్టపడును.

తత్పూర్వ దినమందు నగా మాఘశుక్ల సప్తమియందుఉత్త రాయణ ప్రవేశ కాలము. ఇప్పటికిని మనమీ తిథిని రథసప్తమియను పేరుతో స్మరించుకొనుచునేయున్నాము. అనంతరతిథి 'భీష్మాష్టమి' యను పేరుతో వ్యవహరింప బడుచునేయున్నది. పంచాంగములందీ విషయములు నేడును పేర్కొనబడుచుండుట తద్వ్యవహార ప్రాచుర్య మును సూచించును. భీష్ముఁడు శరతల్పగతుఁడై 58 దినములుండుట యనగా భీష్మాష్టమి నాటికి భారత యుద్ధ మారంభమయి 68 దిన ములు కావలయునుండును. అష్టమినాటికి నామాసమందు 7½ రోజులు గడచినవి. అనగా సప్తమీతిథిలో సగభాగమే మిగిలియున్నది. మార్గశిర పుష్యమాసముల 59 దినములు గడచి (ఏ సంవత్సరమును మార్గశిర పుష్యమాసములు 59 రోజులకంటె నధికముగా నుండ వనుట సిద్ధాంతము, కార్తీక అమావాస్య 1 దినము. మొత్తము 60 దిన ములు మాఘమాసములో 7½ దినములు. అప్పటికి 67½ దినము లగుచున్నవి. అనగా నరువది ఎనుబదవ దినములో సగభాగము గడచిన దన్నమాట. అప్పుడరువది యేడవ దినము రథసప్తమియగును. దీనిని బట్టికూడ కార్తీక అమావాస్యయందు యుద్ధ మారంభమయ్యెననుట

సత్యసమ్మతము భారతమునందే దినక్రమముగూడ పరామర్శింపబడి యున్నది [10]

ఇక ఏసంవత్సరమున జరిగెననుటకు శ్రీ టి. యస్. నారాయణ శాస్త్రిగారు ఖగోళశాస్త్ర సంబంధముగా గణనము వేసి 1917 వ సంవత్సరము నాటికి భారతయుద్ధ మెన్ని సంవత్సరములకు పూర్వము జరిగెనో లెక్క వేసిచూపెను.

భీష్ముడే ఇంకను మూడు భాగముల మాసము మాఘమందు మిగిలియున్నదని చెప్పెను. ఈ గణనము 1917–18 వ సంవత్సరము

---

10 దినములు

| | |
|---|---|
| 1–10 | భీష్ముడు |
| 11–15 | ద్రోణుడు |
| 16, 17 | కర్ణుడు |
| ½ | శల్యుడు |
| ½ | దుర్యోధనుడు |

19–34 దినములు (16 రోజులు) సైనిక సంతాపదిన పరిగణనము

| | | |
|---|---|---|
| 35 | ,, | తర్పణాదులు |
| | ,, | వ్యాసుని యుద్బోధ |
| 37 | ,, | యుధిష్ఠిరుని రాజ్యస్వీకారము |
| 33 | ,, | రాజ్యపాలనారంభము, అధికారుల నియామకము; పెద్దల యాశీర్వాద గ్రహణము, యుద్ధవీరులకు సత్కారము, భీష్మసందర్శనము, రాజనీతిని భీష్మునివలన వినుమని కృష్ణుని సూచన. |

30 నుండి 69 దినముల వరకు 27 రోజులు ధర్మజునకు భీష్మునకు నడచిన పరమార్థ ప్రసంగములు.

68వ దినము భీష్మనిర్యాణము.

# 1. విశ్వనాథ జీవిత సంగ్రహము

"శుచీనాం శ్రీమతాంగేహే
యోగభ్రష్టోఽభి జాయతే" 6_41

ఈ శ్లోకపాదము యోగభ్రష్టుని జన్మమెక్కడ ? అను ప్రశ్నకు గీతాచార్యు డొసగిన ప్రత్యుత్తరమునకు సంబంధించినది. యోగాభిలాషియయి తద్యోగము ననవరతము ననుసంధించుకొని కర్మవశమున తన్మార్గచ్యుతుడయిన యుత్తమజీవుని జన్మము నిర్మలమయి, సంపన్నమయిన వంశమునందు సంభవించునని కంఠోక్తిగా శ్రీకృష్ణుడు నిర్దేశించి యుండెను. మహానుభావుల జన్మమునకు జక్కని హేతువును సమకూర్చి పెట్టినట్లుగా దీనిని మనము భావించితిమేని శ్రీ విశ్వనాథ జననముకూడ నిట్టిదేయని నిర్ణయించవలసి వచ్చును. తత్కారణమున నీయన జననము నవతరణమనియు బిలుచుట లెస్స. సాహిత్యము విలువలు తరిగి వెలవెలవోవు తరుణమున కావ్య ప్రయోజనము నర్థవంత మొనర్చుటకై యుద్భవించిన కారణజన్మునిగా శ్రీ విశ్వనాథను మనము పేర్కొనవలసి యున్నది. ఆంధ్ర సాహితీసామ్రాజ్యమును శ్రీనాథుని యనంతరము షష్టిహాయనములు పాలించిన రసరాట్టుగా నీయనను మన మూహించితిమేని వారి పుట్టుక యవతరణమే యగుననుటలో నాశ్చర్యమునకుతావులేదు.

10_9_1895వ తేదీ కైనయగు మన్మథ సంవత్సర భాద్రపద బహుళ షష్ఠీ మంగళవారము శ్రీ విశ్వనాథుని యవతారకాలము. పార్వతీ శోభనాద్రులు వీరి జననీ జనకులు. కృష్ణామండలములోని గన్నవరము తాలూకా నందమూరు గ్రామము వీరి యభిజనము. నందమూరు గ్రామమున శ్రీ విశ్వేశ్వరస్వామివారికి ఆలయ నిర్మాణముగావించి స్వామికి నిత్య నైవేద్య ధూప దీపముల నిమిత్తము కొంతభూమిని దానమొసంగిన దానశీలి శ్రీశోభనాద్రిగారు.

ఆ శివలింగము పరమశివక్షేత్రమయిన వారాణాసి నుండి కొనిరాబడినది. ఆ స్వామి విశ్వనాథుడు. ఈ యాలయమున స్వామి విశ్వేశ్వరుడు వీరి గృహనామము విశ్వనాథ. ఇది జన్మాంతర సంబంధమేమో? వీరు నిత్య శివపూజా తత్పరులయ్యును కేశవార్చన వీరి కభిమతమే[1] ఈ హేతువుననే శివ కేశవాద్వైతముగా వీరికి విశ్వనాథ సత్యనారాయణ నామౌచిత్యము ఘటిల్లినది. అప్పటినుండి యాయూరి స్వాములు వీరికి కులదైవములు. తనకు దైవములై విలసిల్లిన యా స్వాములిరువురి పయి చెప్పియొక శతకమునల్లి 'విశ్వనాథ మధ్యాక్కరలు'ను శతక సంపుటియందు వారికి స్థానము కల్పించినాడు. తనకు జ్ఞానపీఠ పురస్కారములో లభించిన నగదులో కొంతభాగ మీస్వామి యాలయ జీర్ణోద్ధారమునకు వినియోగించి దైవఋణమును దీర్చికొనిన పుణ్యశీలి.

**బాల్యము :—**

శ్రీ విశ్వనాథకు బాల్యము తండ్రి యైశ్వర్యవాత్సల్య ప్రభావములచే శోభావహముగనే గడచినది. తండ్రి యదేచ్ఛాదాతృత్వము, తల్లి నిరతాన్నదానములు తనయులకెట్టి సంపదయు మిగులనీయ వయ్యెను. కుటుంబపు టార్థికస్థితి 'నానాటికి దీసికట్టు' అనినట్లయ్యెను. బాల్యమున వీరి చదువు వీధి బడులందే అక్కరములుదిద్దుట, పదములు కూడపలికి కొనుటతో గడిచినది. పదునొకండు సంవత్సరముల దనుక నందమూరు, పెదపాడు, ఇందుపల్లి, వెలునూతల గ్రామములలోని వీధి బడులు వీరికి ప్రాథమికవిద్యా నిలయములయ్యెను. ఈయనకంటె చిన్నవారయిన యిరువురు సోదరులు, మువ్వురు తోబుట్టువులు - ఇది వీరి కుటుంబము. ఒక తోబుట్టువు చిన్నతనమునందే గతించెను.

1 "వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితి వంచనిపించుకో"తండ్రిగారికి శ్రీరాముని యందుగల గాఢరతిని తనయునియందు వ్యక్తీకరించుట గమనార్హము.

"గర్భాష్టమే బ్రాహ్మణముపనయీత" అను శాస్త్రవాక్య సమన్వయనముగా నీయనకుపనయనము బాల్యముననే నిర్వర్తింపబడి, గాయత్రీమంత్రోపాసనము తన పూర్వసంస్కారతపఃఫలంబున తీవ్రముగ కొనసాగించుకొనుటకు వీలొసంగెను. పదునొకండవయేట వివాహము. అనంతరము బందరునందు విద్యాభ్యాసము కొనసాగెను. అచ్చట వీరికి ప్రత్యక్ష గురువులు చెళ్ళపిళ్ళవారు. తరువాత వారేవీరికి కవితా గురువులుకూడ నయిరి. వీరి గురుత్వము, పింగళి, కాటూరి, దేవులపల్లి, వేదుల, స్వామి శివశంకరుల సాహచర్యము – ఈ యన్నింటిని మించి స్వయంకృషి యీయననొక మూర్తిభవించిన సంప్రదాయభీష్ముని గను, దేశభాషావైభవ ప్రాభవములకు దాసునిగను, భారతీయ విజ్ఞాన తాత్పర్య నిర్దేశకునిగ, దేశికునిగ మలచినవి,

## శ్రీ విశ్వనాథ వైదుష్యము :

శ్రీ విశ్వనాథ వైదుష్యము ఏకసూత్రముగాదు. విశ్వముఖుని వలె నది సర్వతోముఖము, ప్రాచీన సాహిత్యమునుండి నవీనాంధ్ర సాహిత్యమువరకు నాయన గాంచని లోతులేదు. సంస్కృత వాఙ్మయ మహోదధిని మథించి యందలి వాగమృతము గ్రోలినవాడు. వాగ్దేవీ కటాక్షలబ్ధవిజ్ఞాన మూర్ధన్యుడు. ఇట్టి మహామనీషి యగుట కీయన యభ్యసించిన శాస్త్రములు, అధ్యాపనము గావించిన గురువులు హేతువులగుదురు. వీరిలో చెళ్ళపిళ్ళవారిని ముందుగా బేర్కొనుట లెస్స. ఆయన మున్ముందుగా నీయనలోని జ్ఞానచైతన్యమును కదపిరి. శ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారికడ తర్క-వ్యాకరణ శాస్త్రముల నభ్యసించిరి. బందరువాస్తవ్యుడైన సాంగవేదభాస్కరులు బ్రహ్మశ్రీ కుప్పా లక్ష్మావధానులుగారీయనను వేదవిదులుగ నొనర్చిరి. ప్రస్థానత్రయ మందగ్రేసరమయిన యద్వైత భాష్యమును సంప్రదాయ

బద్ధముగ బ్రహ్మశ్రీ పరిమి నరసింహశాస్త్రిగారు శ్రీ విశ్వనాథకు దర్శింపజేసిరి. బందరునోబులు పాఠశాలయందుపాధ్యాయ పదవి నిర్వర్తించిన శ్రీకానుకొలను త్రివిక్రమరామారావుగారు సన్యసించి విమలానంద భారతులైరి. వీరభినవ విద్యారణ్య బిరుదాంచితులు. వీరికడ నుపనిషద్భాష్యము నధ్యయనము గావించిరి. అవిధముగ వీరికి బ్రహ్మవిలోకమును కల్గించుటచేతనే తనకల్పవృక్షమున నీయనను 'సాక్షాద్బ్రహ్మము'గ భావించిరి. బ్రహ్మశ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారియన కలంకారశాస్త్రము నధ్యాపనము గావించిరి. ఇట్లు వేదవేత్తలు, శాస్త్రపారంగతులైన మహావిద్వాంసులతో జదివిన కతమున వారివాత్సల్య కటాక్ష వీక్షణప్రసార ప్రభావితుడయ్యెను. ఫలితముగా నవిద్యావరణము తొలగెను. మనస్సు స్ఫటిక సదృశమయ్యెను. ఇది సత్యదర్శనమునకు మార్గమయ్యెను. సత్యమనగా భగవత్తత్త్వమే.

## దేశీయతా వ్యామోహము

పరదేశపాలనము, పరభావదాస్యము, పరానుకరణము ఇవి యిరువదియవ శతాబ్దియందు మనదేశమును బట్టిపీడించిన దౌష్ట్యత్రి యమని చెప్పవచ్చును. వీనినెదుర్కొనుటకు భరత దేశమం దెల్లెడల నాడుద్యమములు చెలరేగెను. స్వస్థానవేషభాషోద్యమ ప్రభావమునకు పలువురు మేధావులాకర్షితులయిరి. వారితో దేశములోని వివిధ భాషాకవులు సయితము సహకరించిరి. మనదేశమందు నాంధ్రోద్యమ ముద్భవించినది. దేశదాస్యశృంఖల విచ్ఛేదనమే యెల్లర లక్ష్యము. నాటి యాంధ్రదేశమున రాజకీయ సాంస్కృతిక చైతన్యమునకు దీక్షె నిలచిన వారిలో దుగ్గిరాల, కట్టమంచి, కాశీనాథుని,

---

5) ఏండ్ల యనంతరము వీరికడ అధ్యయనమట." మేఖల. జనవరి 1979

కొమర్రాజులు పేర్కొనదగినవారు. తల్లావఝల, పింగళి, కాటూరి వేలూరి, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి, భావరాజులు తెలుగు లందు గణుతికెక్కినవారు. వీరలకు నాయకమణి రాయప్రోలు. ఈ మహనీయుల ప్రత్యక్ష పరోక్ష సాన్నిహిత్యములు శ్రీవిశ్వనాథ నొక దేశీయోద్యమ ప్రచారకునిగ ప్రాచీనౌన్నత్యమును స్తుతించెడి వైతాళికునిగ నొనర్చినవి. ఒక దేశభక్తునిగ, దేశమును సాహిత్యపరముగ దర్శించుద్రష్టగ, స్వస్థాన వేష భాషాసమారాధకునిగ ప్రభవింప జేసినది. ఆంధ్రపౌరుషము, ఆంధ్రప్రశస్తి వంటి కావ్యములలోని కవితావస్తువు దీని నే వ్యక్తమొనర్చును. హూణవిద్యాసాహచర్యముచే ననేకాంగ్లగ్రంథ పరిశీలనమున కవకాశము లభించి యందలి తత్త్వమును గ్రహించుటకు వీలిచ్చెను. ఈ సంస్కృతాంధ్రాంగ్ల భాషావైదుష్యము మున్ముందు జీవితమున వివిధదేశ సారస్వత తరతమములను నిర్ణయించి తెలుగు సాహిత్యపు నిగ్గుదేల్చుట కుపకరించినది,

## కవితా కౌతూహలము :

'సమానానాముత్తమశ్లోకోఽస్తు' అని యనిపించుకొనుటకు జీవితము నసిధారావ్రతముగ నడిపికొనిన మహామనీషి శ్రీ విశ్వనాథ బాల్యముననే కవితావాసన యబ్బిన శ్రీ విశ్వనాథను గాంచి యంతగా నాయనతండ్రి యుత్సాహపడలేదు, ప్రోత్సాహమీయలేదు, సంపద కర్పూరసామ్యము వహింపగ నాంగ్లవిద్యయైనను కుమారున కింత యన్నము పెట్టునను నాశతో బందరు నందలి పాఠశాలలో చేర్చబడిన యాతడిట్టిదగుట విచారహేతువయ్యెను, కాని శ్రీ విశ్వనాథలోని కవితా చతురాననుడు కావ్యకన్యలసృష్టి కుజ్జ్వాతి లూగుచుండగా దానినడ్డుకొనుట యెవ్వరికి సాధ్యమగును ? ప్రారంభమున శ్రీకొడాలి ఆంజనేయులు శ్రీవిశ్వనాథ జంటకవులై 'సత్యాంజనేయ'నామముతో

వ్యవహరించిరి. శ్రీ ఆంజనేయులతండ్రి శోభనాద్రిగారలు పరమ మిత్రులగుటకూడ నీకుమారద్వయు సాన్నిహిత్యమునకు దోహద మయ్యెను,

1916 వ సంవత్సరమున, ననగా నీతని యిరువదియొకటవ సంవత్సరమున 'భ్రష్టయోగి' యను శీర్షికతో కొన్నిపద్యములను రచించెను. నాటినుండి యవసానకాలము వరకు నీయన కవితాశైలి యట్టిదే. అందు హెచ్చుతగ్గులు లేవు. 1917 న 'ఆంధ్రపౌరుష'మను లఘుకావ్యము వ్రాసెను. ఇట్లీయన కవితాకౌతూహలము 1909 లో కుసుమించి 1916 నాటికి వికసించినది. అప్పటికీయన ఇంటర్మీడియట్ విద్య నభ్యసించుచుండెను.

## ఉద్యోగము — కవితా వైభవ ప్రాభవము.—

సాహితీ సమారాధనము, సహాయ నిరాకరణోద్యమము 'వలపటదాపట' గా (శ్రీ) విశ్వనాథను చేరియున్న కాలమది. బందరు నోబుల్ కళాశాలయందు 1921 లో చదువుచున్న బి. ఏ. పూర్తిగాక ముందే యచటనేయున్న జాతీయకళాశాల యందధ్యాపక పదవిని గైకొనెను. నాటి సాహితీమిత్రులీయన నత్యాదరముతో నభిమానించి యీయనలోని కవితాశక్తిని వెన్నుదట్టి లేపిరి. (శ్రీ) విశ్వనాథుని ప్రతిభ యప్పటికి బందరుపొలిమేరలు దాటినది. ఈ ప్రతిభ వన్నె చిన్నెలను రంగరించుకొని 1934 వ సంవత్సరమునాటికి ప్రచండమై 'లోకము పట్టనంత కవి' యయ్యెనని కీ. శే. మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు 'ఆనందవాణి' యను పత్రికలో వ్రాయుటవరకు వచ్చినది, 1926 నాటికి బందరులోని యధ్యాపకవృత్తి కృష్ణార్పణముకాగా సాహితీసరస్వతి నుపాసించి పెక్కు లఘుకావ్యములు రచన మొనర్చెను ఆంధ్రప్రశస్తి, గిరికుమారుని ప్రేమగీతాలు, కిన్నెరసానిపాటలు

కోకిలమ్మ పెండ్లి, నర్తనశాల, శృంగారవీథి. అనార్కలి వానిలో కొన్ని. ఈయన వాగ్దేవీవరివస్యకు నుద్యోగమెట్టి యాటంకము కాకపోయెను. ఒక్కొక్క సమయము నందుద్యోగమే తొలగి యాయనను సాహితీ క్షేత్రమునందు స్వేచ్ఛాసంచారిగ నగుటకు దోహద మొసంగె ననవచ్చును.

ఇంతయైనవాడు మఱింతయగుటకు శ్రీ విశ్వనాథకు గాల మనుకూలించుట యారంభమయ్యెను. ఇంతదనుక సహచరుల యాదరాభిమానములకు, వారిప్రభావమునకు బరవశమయిన శ్రీ విశ్వనాథ తనకుతాను వ్యక్తిత్వముతో, ప్రత్యేకతతో నుండెడి విలక్షణమార్గ నిర్మాతగా నగుట యావశ్యకమని తలంచినాడు. సాహిత్యములో నాడు చెలరేగిన భాషావాదములు వానియానుకూల్య ప్రాతికూల్యములను సమగ్రముగ తన విజ్ఞానముతో క్షుణ్ణముగ గ్రహించి, తన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములచేతను, ఆంగ్లసాహిత్యతత్త్వ దర్శనముచేతను సుసంపన్నమైన స్వీయభాషా సంప్రదాయములను, సాహిత్యపరమార్థ తత్త్వమును దనరచనలయందు ప్రవేశపెట్టి పుష్టిని, తుష్టిని సమకూర్ప గల యంతర్ద్రష్టృత్వమును సాధించెను. విముఖుడైన తండ్రి సుముఖుడై 'వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితివనిపించుకో' యని తనయునకు కావ్యరచనాపరమార్థము నెఱుకపరచి నాడే 'శ్రీమద్రామాయణకల్పవృక్ష రచనాసంకల్పమునకు బీజము నాటినాడు. అప్పుడే శ్రీ విశ్వనాథకు సర్వభాషాసాహిత్య పరమార్థము కల్పవృక్షోన్ముఖముగా బయనించెను.

కుంటుపడిన బి. ఏ. పట్టము 1927 నాటికి సిద్ధించినది. అదే సంవత్సరమున పితృపాదులు శోభనాద్రులు శివసాయుజ్యము బడసిరి. నాడు చెలరేగిన ఆంధ్రోద్యమప్రభావ మీయన నురకలెత్తించినది

"ఏకవీర" నవల యీవిధమున ప్రభవించినదే. ఆ సంవత్సరము బందరు నుండి గుంటూరుచేరి, ఆంధ్రక్రైస్తవ కళాశాలలో నుపాధ్యాయ పదవిని స్వీకరించిరి. ఇచటనే కళ్యాణభారతీస్వామికడ వేదాంతగ్రంథ పఠన పరామర్శ జరిగినది. 1933 పత్నీ వియోగము. ఆ దుఃఖమునుండి వెల్వడినదే "వరలక్ష్మీత్రిశతి" యను (వియోగ) కావ్యము.

1933 నుండి 1938 వరకు నిరుద్యోగము. సతీవియోగ దుఃఖమునుండి తేరుకొని సాహితీసతి నాలంబము గావించుకొని శ్రీ విశ్వనాథ "వేయి పడగలు" రచించిరి. ఇది నేడు దేశాంత వ్యాప్తి నొందినది[2] ఈయన యీ నవల నిర్వది ఎన్మిది దినములలో పూర్తిగావించిరి. వీరిసోదరులు శ్రీ విశ్వనాథ వెంకటేశ్వర్లుగారీ నవలకు వ్రాయసకాడు. నాడు తిక్కన మహాకవివలె 'మహాకవిత్వ దీక్షావిధి' నంది "శ్రీ మద్రామాయణకల్పవృక్ష" రచన కంకు రార్పణము గావించినారు.

1938వ సంవత్సరమున విజయవాడ కళాశాలలో నాంధ్రోపన్యాసక వృత్తి స్వీకరించిరి. విజయవాడ విశ్వనాథకు విజయకవాటమయినది. ఈయన సాహిత్యలేఖిని శైలూషికవోలె కులుకు బెళుకులతో నొయ్యారముతో నృత్యాటలాడినది. సాహిత్యరసజ్ఞుల హృదయములు ప్రఫుల్లములైనవి. కవి, రచయిత, విమర్శకుడు, నవలాకారుడు వక్త - ఇవి యిలలో విశ్వనాథుని పంచముఖములు. చేపట్టిన ప్రతి ప్రక్రియయు నాయన కీర్తి కద్దము పట్టినది. ప్రతి రచనయందు రసాభిముఖమయిన దర్శనమును పరమార్థాభిముఖముగ ప్రదర్శించుట యాయన లక్ష్యమయినది. ఇది యొక విశిష్టమయిన మార్గము.

---

2 దీనిని రష్యన్ భాషలోని కనువదించుచున్నారు.

సౌన్యతో దర్శనీయము. నాటితో యితరులు శ్రీ విశ్వనాథ ప్రభావమునకు స్పందించుట యారంభమయ్యెను. పలువు రనుయాయులు, నభిమానులు వీరి సాహిత్యతత్వమును నవగతము గావించుకొనజొచ్చిరి.

శ్రీ విశ్వనాథ రచనలు నాటినుండి వాసి యందును రాశి యందును ప్రముఖమయ్యెను. ఆ యీ ప్రశస్తి యయిన నేల? సాహిత్యములో నెన్ని ప్రక్రియలుండుటకు వీలగునో, వాని నన్నింటిని సంప్రదాయమును వెన్నుగా నిలిపి నిర్వహించిన ప్రతిభాశాలి. బహుకావ్యములకు పీఠికలను వెలయించెను. ఇతఃపూర్వపు పీఠికా రచనల యొరవడిలో వీనిని చెప్పవీలులేదు. ప్రతిపీఠిక యందును నా కావ్య రచయిత వ్రాసిన ఛందస్సులోని పరమరహస్యమును, భాష, ఛందస్సు, జీవుని లక్షణమునకుగల యవినాభావ సంబంధము, వానికి బరమేశ్వరానుగ్రహమున పూర్వజన్మ సంస్కారవిశేషము వలన వానిని దెలిపిన విధమును బరామర్శించినాడు.[3] ఇట్టి పీఠికా రచనములు వానికవియే సాటి. ఇది సాహిత్యదర్శనము, శైలీ దర్శనము, పరమార్థదర్శనముల సంగమము. త్రివేణీ సంగమము వంటిది.

1957న విజయవాడ కళాశాలలో పదవీవిరమణము గావించి కరీమునగరము కళాశాలా పాలకవర్గపు టభ్యర్థనపయి గళాశాలాధ్యక్ష పదవీ వరణము చేసెను. 1961లో నా పదవినుండి విశ్రాంతి గైకొనిరి.

## శ్రీమద్రామాయణ కల్పవృక్ష మహాకావ్య రచనము:-

ఇది శ్రీ విశ్వనాథుని రచనా రత్నమాలికలో నీలమణి సదృశము. ఇది 'దీనికి దేసాటి' యనిపించు కావ్యము. తిక్కన

---

3 నన్నయ - ఆంధ్రమహాభారత పీఠిక - సాహిత్య ఎకాడమీ ప్రచురణ. ఎమెస్కోవారి సంప్రదాయసాహితీ స్రవంతిలోని కావ్యములకు శ్రీ విశ్వనాథ పీఠికలు.

వలెనమహోదాత్తమనీషుడు. శ్రీనాథునివలె నుమ్ప్రజ్ఞా విశేషోదయా భ్యర్చితస్వాంతుడు. శ్రీ విశ్వనాథుని జీవసంపుటి యందవి యంత ర్మ్యాతములై యీయనను అలఘు స్వాదు రసావతారధిషణాహంకార సంభార దోహల బ్రాహ్మీమయమూర్తిగా మలచినవి 1934వ సంవత్స రమున్నారంభింపబడిన యీ మహాకావ్యము సప్తకాండలు పూర్తి యగుసరికి 1962వ సవంత్సరమయ్యెను. ఈ కావ్యముద్భవించుటకు బట్టిన కాలము రెండిటికి దక్కవగా త్రింశద్వత్సరములు.

## పురస్కార పరంపరలు :-

ఆంధ్రలోకము తమయభిమాన మహాకవిని, యసమాన ప్రతి భాశాలిని సగౌరవముగా సంభావించినది. ఆంధ్రదేశమేకాదు భరత భూమి యందలి వివిధ సంస్థలీయనను సమ్మానించి తమను తాము గౌరవించుకొన్నవి. 'వేయిపడగల' నవలకు ఆంధ్రవిశ్వవిద్యాలయ బహుమతి లభించినది. శ్రీ విశ్వనాథుని కీర్తి నాటినుండి యాశాంత ములను చుంబించసాగెను. భావరాజువారి యాధ్యక్షమున 'కవి సమ్రాట్టు' బిరుదప్రదానము గావింపబడెను. 1942న సంక్రాంతి పర్వ దినమున గుడివాడ పురమునందు గజారోహణోత్సవము జరిగెను, 1957లో ఆంధ్రసాహిత్య ఎకాడమీ యంధ్యక్షపదవీ గౌరవము, ఇప్పటినుండియే శ్రీమద్రామాయణ కల్పవృక్ష పఠనోత్స వములు వివిధనగరములందు నిర్వహింపబడివి, తదారభ్య కల్పవృక్ష కావ్యముపయి విమర్శలు, సమర్ధనలు. 'భారతి' పత్రిక వీరికి వివాద స్థానమయ్యెను[4] ఆ విమర్శనలే యీయన కవిత్వ తత్వమునకు. రచనా వైదగ్ధ్యమునకు నికషోపలములయ్యెను.

---

[4] విమర్శకులు : క్రొత్త సత్యనారాయణ చౌదరి, దుర్గానంద్ మొదలగువారు సమర్థకులు : రాపూరు దొరస్వామిశర్మ, జమదగ్ని, కోటగిరి విశ్వనాథరావు మొదలగువారు. పత్రికలు : తెలుగు విద్యార్థి, స్రవంతి, భారతి.

1963 లో "విశ్వనాథ మధ్యాక్కఱలకు" సాహిత్య పరిషత్తు వారి పురస్కారము.

1965 లో ఆంధ్ర విశ్వవిద్యాలయముచే "కళాప్రపూర్ణ" పురస్కారము.

1966 లో కలకత్తానగరమున పుష్పకిరీట గౌరవము.

1967 లో అఖిలభారత బెంగాలీ రచయితల సభలో శ్రీ విశ్వనాథకు ఎవార్డు లభించెను. 1970. ఇది యీయన జీవితమున విశిష్టమయిన కాలము. కారణమీ కాలమున లభించిన గౌరవము లెక్కవగుటయే, 1. కేంద్రప్రభుత్వము వారిచే "పద్మభూషణ" సత్కారము 2. "వేయిపడగలు"నవల హిందీభాషలోని కనువాదము.[5] 3, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారి 'డాక్టరేటు' బిరుద ప్రదానము లీ సంవత్సరమున లభించెను.

భరతభూమిలో సాహిత్య రంగమున విశిష్టమయిన కృషిచేసిన ప్రముఖ కవికి లభించు అత్యున్నతపురస్కారము "జ్ఞానపీఠ ఎవార్డు" శ్రీ విశ్వనాథను 1971లో వరించినది. ఒక లక్ష రూప్యముల బహుమానము, సన్నదునను గ్రహించు నీ సన్మానము పరమ విశిష్టమయినది. తెలుగుదేశము శ్రీ విశ్వనాథమహాకవిని జూచుకొని ధన్యతగాంచినది. గ్రంథమాయన యుపాస్యదైవమయిన రామునికథ యితివృత్తముగాగల శ్రీమద్రామాయణ కల్పవృక్షము.

ఆ సంవత్సరమే శ్రీ విశ్వనాథు లాంధ్ర ప్రభుత్వాస్థాన కవి వరేణ్యు లయిరి. అనంతరము పరంపరగా దేశమందెల్లెడల పెక్కు సన్మానములు బిరుదప్రదానములు లభించినవి.

---

[5] అనువాదకులు : శ్రీ. పి. వి. నరసింహారావు, నాటి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి

## శ్రీ విశ్వనాథ జీవితము:-

బాల్యము నుండి బహు మహనీయుల శుశ్రూషా సాహచర్య ప్రభావముచే నియమబద్ధమయిన జీవితముగలిగి యాదర్శప్రాయు డయ్యెను. ఒక జీవితము నా మరణాంతము నిర్మలకర్మదీక్షా పరతంత్రముగ నడుపుకొనుట యసిధారావ్రతసమము. అట్టి వ్రతమునే యవలంబించిన పరమసాహసికుడు శ్రీ విశ్వనాథ. సంప్రదాయబద్ధుడగుటచే కర్మ మార్గావలంబియయినట్లు తోచినను దీనికి లక్ష్యమయిన బ్రహ్మపథమును తానుదర్శించి యితరులకు తనరచనలయందు దర్శింపజేయ యత్నించిన ద్రష్ట. తాను పొందిన సమ్మానములకు విచలితుడుకాని మేరు నగధీరుడు. అట్లే తనపయి వచ్చిన విమర్శలకాగ్రహపడని శాంత సముద్రసముడు. "తుల్యనిందాస్తుతిర్మౌనీ" యను గీతావాక్యము కను వర్తియయి నిల్చిన యీయనను మనస్సన్యాసియని చెప్పికొనుటలెస్స.

శ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్యవిమర్శ నాటితో నారంభ మయి యొకనాటితో ముగియునదికాదు. ఆయన మహాకవిగా కీర్తింప బడుటకు, కాదని విమర్శింపబడుటకు నా కావ్యమే యాధారము. ఇది 'కుడ్యే సతిచిత్రరచనా' యనున్యాయము ననువర్తించుచున్నది. వ్యాస వాల్మీకులకే యిట్టి విమర్శ తప్పలేదు. ఆగ్రంథములు శతసహ స్రాబ్దుల నుండి యున్నవి. విమర్శలు చెలగుచునే యున్నవి. ఒక విధముగా విమర్శ చెలరేగెడి గ్రంథము యొక్క యాయుర్దాయము పెరుగుచుండునేమో! ఆయుర్దాయ మొక గ్రంథమునకు వృద్ధిపొందింప వలయుననగా విమర్శ యధికమగుచుండవలెనని తాత్పర్యము. విమ ర్శింపువారావిషయ మెఱుంగకపోవచ్చును. సత్కావ్యముల చిరంజీవిత కిది యుపాయమై యుండును. ఇది జరుగుచునే యుండును, అది పెరుగుచునే యుండును.

శ్రీవిశ్వనాథ ఆర్షధర్మమును విశ్వసించిన సంప్రదాయ భీష్ముడు. వేదచోదితమయిన చాతుర్వర్ణ్యవ్యవస్థయందు నమ్మిక గలవాడు. కొనయూపిరితో నున్న సంస్కృతి పరిరక్షణకు పాశ్చాత్య విద్యాకలుషితమయిన దేశీయబుద్ధులను సంస్కరించు నుద్దేశ్యముతో శ్రీ విశ్వనాథ తన సాహితీప్రతిభను పణముగానుంచెను. ఈ విశ్వాసము పూర్వోదితమను హేతువున గుదిరినదికాదు. అనుభవమునకు దెచ్చుకొని తత్కాల సమాజపురోగతిని ద్రష్టయై దర్శించి, సమకాలీన సమాజము దోషపథమున గమించుటకు బరితపించి, భారతీయ ధర్మవ్యవస్థ వేదమూలకమని దానిని పరిరక్షించుటయే పరమలక్ష్యముగా నిశ్చయించుకొని సాహిత్యము నాలంబము గావించుకొని చేపట్టిన ప్రతిసాహిత్య ప్రక్రియలోను నీధర్మభావమును ప్రవేశపెట్టిన ధైర్యశాలి.

ప్రకృతకాలమున దీని కాదరము లేకపోవచ్చునను శంకవిడిచి నిర్భయముగను, పక్షపాత రహితముగను విచారించి, రాజకీయ కాలుష్యము దేశవ్యవస్థ ఛిన్నాభిన్న మగుటకు హేతువు ధర్మమార్గచ్యుతియే యని, దానిని నిర్మూల మొనర్పవలయునను సిద్ధాంతమును తనరచనలందు ప్రతిబింబింపజేసి ప్రజాళియందొక చైతన్య స్ఫూర్తిని ప్రభవింప యత్నించిన సాహిత్యదివాకరుడు శ్రీవిశ్వనాథ. చేపట్టిన ప్రతిరచనము పాఠకుని మనఃకుహరమున జొచ్చి ఈ యాశయ సాఫల్యమునకై యత్నించును. షష్టిహాయనము లిట్లే తెలుగు కవితా సామ్రాజ్యమునేలి స్వల్పమయిన రుగ్మతచే 18-11-76 వ తేదీ మధ్యాహ్నము 11-00 లకు శ్రీ విశ్వనాథ యమరజీవి యయ్యెను.

ఆయన బహుజన్మలవృద్ధుడు. తన సంస్కారము నెన్ని జన్మల నుండియో వహించి వచ్చినవాడు, అట్టి సంస్కారవాహుడు మరెన్ని

శతాబ్దులకు దయించునో! ఆబాలగోపాల మాయన మరణమునకు చింతిల్లినది. సాహిత్రీలోకమే యశ్రువృష్టిని గురియించినది. అనుయాయులు, విమర్శకులు, రాజకీయధురంధరులు, వారువీరననేల, దేశమంతయు దుఃఖసముద్రమున మునిగిపోయినది.

ఒకనన్నయ్య, ఒకతిక్కన, ఒక శ్రీనాథుడు, ఒకసూరన్న, ఒకరాయలు, ఒకరామకృష్ణుడు, ఒకవిశ్వనాథ, వీరెల్లప్పుడు ఒక్కరే, వీరివంటివారిని మరియొకరిని సాహితీలోకమునం దెప్పటియెప్పటికోగాని దర్శింప వలనుపడదు, ఆంధ్రసాహిత్యాకాశామున నాయాకాలములందు భాసించిన ధ్రువతారలు వీరు. ఒక్కమాటలో—విశ్వనాథ నిర్మించిన కవితాధ్వము సంప్రదాయ సాహితీ రిరంసువుల పాలిటి దివ్యాధ్వము.

# 2. శ్రీ విశ్వనాథ - సారస్వత మహా స్రష్ట - ద్రష్ట

"ఒక జాతీ జాతీయతకు దాని సంప్రదాయము పునాది" ఇది శ్రీ విశ్వనాథ శారదా విపంచి నిక్వాణము. కావ్యగత శతాంశముల యందు తొంబదియైన పాళ్ళు మహాప్రతిభను ప్రదర్శింపగల ద్రష్ట శ్రీ విశ్వనాథ. కనుకనే యాయన అధునాత నాంధ్రసాహిత్యధ్వము నందగ్రగసనుడుగా గణుతికెక్కెను. అట్టి మహనీయుని సాహిత్య వైభవమును దిఙ్మాత్రముగా నీయధ్యాయమున గ్రహింతము.

సాహితీసృజనమునకు గావలసినవి ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాస ములు. వీనిలో నభ్యాసముకంటె వ్యుత్పత్తి, దీనికంటె ప్రతిభ యుత్తరోత్తర ప్రాముఖ్యము వహించునని యాలంకారికులందురు, రాశిగా సాహిత్యమును వెలయించుట కంటె నది వాసిగా సృజించుట శ్రేష్టతరము. రాశియు, వాసియు నేకోన్ముఖమ్మై పయనించుట శ్రేష్ఠ తమమనుటలో విప్రతిపత్తిలేదు. ప్రతిభయనగా నిట్టిది. ప్రతిభా సయతీతి ప్రతిభా' యనునది ప్రతిభా శబ్దమునకు వ్యుత్పత్తి. పరోక్ష ముగా నుండు వస్తువును ప్రత్యక్షముగా భాసింపజేయుట యని దీని తాత్పర్యము. పరోక్షమున నుండు పాత్రలను, సన్నివేశములను పాఠ కుల కట్టెదుట ప్రత్యక్షీకరించి వారి మనో నేత్రమున కయ్యనుభూతి కలిగించుటలో కవి తన ప్రతిభను ప్రదర్శించును. వ్యుత్పత్త్యభ్యాసములు వేనికవిగా రాణింపని కారణమిదియే ప్రతిభతో గలిసిన వీనికి బుర స్కారము. ఈ ప్రతిభ జన్మసిద్ధమయినది, భగవద్దత్తమయినది కావలెను. అనగా నక్షరములు, తత్సంయోజన జనితములైన శబ్ద ములు, తచ్ఛబ్ద శక్తియందు మహాకవియైన వాని జీవుడు నిత్య స్పృహణీయుడై యుండవలెను. ఇది పరమేశ్వర ప్రేరితమయిన

వాక్కయినచో నాతని సృష్టి చతురానన సృష్టి. లోకమున నెల్ల జనులు ప్రకృతి వైచిత్రిని దర్శింతురు. కాని ప్రతిభా సమేతుని దర్శనము విశిష్టముగా నుండును. ఆ భిన్నమయిన దర్శనము తత్వమయి వాగ్రూపమున బహిర్గతమగును. ఇదియే కావ్యసృష్టికి హేతువగును. తత్వదర్శనము వలన కలిగెడి యనుభూతి హృదయ కుహరము నందు పరిపూర్ణమయిన భావమయి యంతః ప్రేరణచే వాగ్రూపమున నావిష్కరింప బడినచో నదియే కావ్యమగును. ఇది రసాత్మకమయిన వాక్యము లేక వాక్యసంపుటిగా విశ్వనాథునిచే వ్యవహృతమయ్యెను. దీని నొక వాగర్థమహాయోగముగ, పార్వతీపరమేశ్వర తత్వముగ కాళిదాసాది మహాకవులు దర్శించిరి.

ఈ తత్వదర్శన మెల్లరకు సమముగానుండునా ? యనినచో నది కుదురదు. బహుముఖ స్ఫటిక వినిస్సృత వర్ణ కిరణములవలె నొకే వస్తువు భిన్న విధములుగా దృశ్యమానమగును. అది వారి జీవగత సంస్కార సంబంధిగా నుండును, ఒక ప్రభువు తన పాలితులను సామ్యముతో పెంచి పోషించి సుఖంపజేయునెంచ, మరియొక తేడా సుఖమునే విప్లవ మార్గమున నందింప జూచును. ఇరువుర లక్ష్యము సౌఖ్య సౌభాగ్య ప్రదానమే. కాని యత్నించు మార్గములు భిన్నములు. సంప్రదాయ కావ్యరచన, విప్లవ సాహితీ రచనము రచయితలు జనుల నుద్బోధింప యత్నించుటలో మార్గములు వేరుగాని ప్రయోజన మొకటియే. ఈ దృష్టితో గాంచిన వైచిత్రిగల రచనలుప్పతిల్లుటలో గల ప్రధాన హేతువు దర్శనభేదమే. ఈ దర్శనము ఔపాధికము, ఆత్మగతమని ద్వివిధముగా చెప్పవచ్చును. ఔపాధిక దర్శనమునకు నైర్మల్యముండదు, ఆత్మగతతత్వ దర్శనమయినచో నది వాగ్వ్యవహార మున కతీతము. కనుక సారస్వత స్రష్టకు ప్రధానమయిన ప్రతిభ

యుండి దానికి నుపస్కారకములయిన వ్యుత్పత్త్యభ్యాసములు సహకృతులయి యుండవలెను. ఔపాధికమయిన జ్ఞానమును ఆత్మగతమైన దానికి జోడింపవలెను, ఆత్మధర్మమునకు నౌపాధిక ధర్మమును మేళవింపవలెను. ఆత్మగత ధర్మము శ్రేయము. ఉపాధిగత ధర్మము ప్రేయము. ప్రేయోమార్గమున ప్రయాణింపవలెను. శ్రేయోమార్గము నధిగమింపవలెను. ఏవంవిధమయిన యుపజ్ఞతో కవిచే సారస్వతము సృజింపబడినచో నది మహాసారస్వతమగును అమ్మహనీయుడు సారస్వతమందలి పరమరహస్యమును తెలిసినవాడగును. ఆతడు మహాస్రష్ట అవిద్యావిద్యల సమన్వయము, మృత్యుతరణముచే నమృతత్వప్రాప్తి సాధనోపాయము తెలిసిన ఆర్షసంప్రదాయ పరాయణుడే మహాసారస్వత స్రష్ట యగుచున్నాడు. ప్రతిభ భగవద్దత్త మనుటలోని పరమరహస్యమిది.

నిత్యమయిన బ్రహ్మతత్త్వమునకు మాయాసంపర్కము లేనిదే సృష్టి లేదు. మాయాశబలితమగు బ్రహ్మమందు మాయనే యెఱింగినవారు తత్త్వదర్శనము చేసినవారు కారు. మాయను జూచుచు నందలి తత్త్వము నెఱింగినవారు మాత్రమే ద్రష్టలు. అతత్త్వమెఱుగుట, ఆతత్త్వదర్శనముచే ననుభూతుడై మాయాపదార్థ జాలముచే సృష్టి చేయగలిగినవాడు స్రష్ట. కాని ఈ మాయ యా తత్త్వము నందకుండ ప్రతిబంధించునది కారాదు దీని ద్వైవిధ్యమా యేకత్వమునకు భంజకముగా జనదు. దీని వైచిత్ర్యము దాని విశుద్ధతను భంగపఱుపరాదు. దీని వైపుల్యము ముందు అణుప్రాయముగా నుండవలెను. ఇట్టి సారస్వతమే సృష్టికి ప్రతిసృష్టి యన బరగును. ఇదానీంతన సృష్టిరహస్యమును సమీచీనముగ తెలిసిన కవియే యుపనిషత్ప్రతిపాదిత కవి: [1]అపుడే యాకవి స్వయంభూశబ్దవాచ్యుడగును తద్ధిరణ్యగర్భునిచే

---

1. "కవిర్మనీషీ పరిభూస్స్వయంభూః":- ఈశావాస్యోపనిషత్.

సృజింపబడిన విశాల జగతియందలి వైపుల్య,వైవిధ్య,వైశిష్ట్యములే కవి ప్రక్రియలయందును దర్శింపవచ్చును. ఏవంవిధ కవితా నిర్మాణ రహస్యవేది సృజించిన సారస్వతమే మహాసారస్వతము అతడు మహా స్రష్ట సృష్టిని,సృష్టిరహస్యమును,సృష్టికి కారణమును నెఱింగి,మాయా ద్వారమున మాయారహిత తత్త్వము నెఱింగి, జగత్తులో బ్రహ్మకు గల యభేదము నెఱింగి, బ్రహ్మతో తాదైక్యమై జగత్తున విహరించిన జీవన్ముక్తునిగా శ్రీ విశ్వనాథను పేర్కొనవలెను. జగద్రహస్య జిజ్ఞాసువునకు గాని విశ్వనాథ కవితామర్మ మాకళించుకొనుటకు శక్తి చాలదు.

బాహిరముగ శ్రీ విశ్వనాథ సంసార జంబాల పటల మగ్నులుగ విహరించినట్లే యాయన కవిత్వము గూడ మాయా విహితమయిన జగత్తువలె వివిధ విచిత్ర విన్యాస మనోహర సామ్యము వహించును. కాని యంతరమున ఆయన నిస్సంగి;విరాగి.అట్లే యితర సాహితీ విదగ్ధ మాత్ర కవి కృతుల వంటిదే వీరి కృతి యని భావించు వారలకు శ్రీ విశ్వనాథ సాహిత్య ప్రాంగణమందు ప్రవేశ మసంభవము. పరమ రహస్యమైన తత్త్వమొకటి యంతర్లీనమయి వీరి సాహిత్యము పరిఢవిల్లునని గమనింపగలిగిన సహృదయుడు మాత్రమే యిందు తీర్ణత సాధించును. ఆ మహాకవి ప్రసన్నహృదయుడయి పలుకరించును. పాఠకుని తన సారస్వత మహాప్రవాహమునందు మునుకలు వేయించును; తేలించును; సేద తీర్చును; లాలించును.

ఆ సంఖ్యాకులయిన తెలుగు కవులందిట్టి కావ్యస్రష్టలు లేరా? యన్నచో వారి సంఖ్య అత్యల్పము. వారిలో ప్రథమ సృష్టికర్త నన్నయ్యగారు. ఆయన గురు పద్య విద్యకు నాద్యుడు,[2] తిక్కన, పాల్కురికి, నాచన, శ్రీనాథుడు, పెద్దన, రాయలు, తెనాలి రామ

---

2 ఆంధ్రమహాభారతము - ఆదిపర్వము 21వ పద్యము. దీనిపై విపులమైన వ్యాఖ్యను శ్రీవిశ్వనాథ రచించిరి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి ప్రచురణ.

కృష్ణులు సారస్వతమనగా నేమియో తమ రచనల ద్వారమున సాహితీ లోకమునకు వెల్లడించిరి. వారి సారస్వతము తోను, వారితోను సరిగద్దియపై నధివసించగల సమర్థత గలిగిన మహామనీషి, సాంస్కృత సార్వాంత్ర శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

శ్రీ విశ్వనాథ ప్రాముఖ్యము :-

తెలుగు సారస్వతము ప్రాచీనమయినను, నర్వాచీనమయినను వైపుల్యవైవిధ్య వైశిష్ట్యముల చేతపరిపుష్టము, సుసంపన్నము. నన్నయ్యగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి, తిక్కన నేటి తెలుగు, ఎఱ్ఱన సూక్తి వైచిత్రి, శ్రీనాథుని శబ్దశక్తి, పెద్దన ప్రబంధ నిర్మాణ వైచిత్రి వానికవియే సాటి యనునట్లుగా తెలుగు సాహితీ సమారాధకుల సమాదరణమునకు పాత్రమయినవి. ఏక ప్రక్రియా నిర్వహణమందద్వితీయ మయిన కృషి యొనర్చిన కవితా కృషీవలులు వీరు. ఒక్క శ్రీనాథుడు మాత్రము ద్విపద కావ్యప్రక్రియను నయితము చేపట్టెను బహు కావ్యనిర్మాతగా విశిష్టస్థానము గడించెను. తిక్కనకు బూర్వుడగ పేర్కొనబడుచున్న పాల్కురికి సోమన గద్య, పద్య, శతక, గేయ పఙ్తులను నిర్వహించి ప్రక్రియా వైవిధ్యమును సాధించెను. అధునాతనులైన శ్రీ విశ్వనాథ సాహిత్య సృష్టి వైపుల్య, వైవిధ్య, వైశిష్ట్య సంబంధి. తత్కారణమున శ్రీ విశ్వనాథ ప్రాచీన కవులకు సముడగుచు, వర్తమానమున సాహితీ సహృదయులకు మూర్ధస్థానీయుడగు చున్నాడు.

## ఈ దృష్టితో పాశ్చాత్య సారస్వత పరిశీలనము.

పాశ్చాత్య కవి తల్లజులు సయితమేదియో యొక ప్రక్రియను చేపట్టి యందు కీర్తి ప్రతిష్ఠల నొందిరిగాని శ్రీ విశ్వనాథవంటి వారిని గాంచము. షేక్స్పియరు నాటక రచనా పితామహుడు. జాన్ మిల్టన్

పద్య కవి విరించి సోమర్ సెట్ మామ్ ఆంగ్ల వచన వాఙ్మయ బ్రహ్మ. బేకన్ ప్రభువు ఉపన్యాస కేసరి.

గ్రీకు దేశీయుడైన హోమరు మహాకవిగా ప్రసిద్ధి నందిన మహాశయుడు. అయన "ఇలియడ్" 'ఒడెస్సీ' యను కావ్యములను రచించెను. ప్రపంచ సారస్వత మహా సింహాసనము పయి యీ కావ్యములు పట్టాభిషిక్త మయినవి. ఇవి క్రీ పూ. 8వ శతాబ్ది నాటివి. ఆ దేశమున నైదవ శతాబ్దికే సాహిత్య వికాస మతివేలముగా విస్తరించినది. నాటి బహు నాటక రచయితలు 'ఇస్కిలస్', 'సోఫిక్లిస్', 'ఇయురిపిడస్' మహాశయులు. ఇస్కిలిస్ తొంబది నాటకములకును, సొఫిక్లిస్ నూట యిరువది నాటకములకును, యురిపిడీస్ పందొమ్మిది నాటకములకును కర్తలు. ఇస్కిలిస్ తాత్త్వికుడగుటచే రచనయందు పాపపుణ్యము లెక్కువగా ప్రసక్తమగును. భావ నిర్భరత, శయ్యా వైచిత్రి వీని యందు ప్రథమ గణ్యములు. ఈతడెట్టి యితర సాహిత్య ప్రక్రియలనుగాని చేపట్టినట్లుగా తద్దేశ సాహిత్య చరిత్ర ప్రవచింపలేదు.

సొఫిక్లిస్ రచించినవి నూట యిరువది నాటకములు. అందేడు మాత్రము నేడుపలభ్యములు. అందును 'ఈడిపస్ కింగ్', 'ఏంటిగాని', 'అజాక్సు', అనునవి సర్వోన్నత దశీనవి. ఈతడు మానవతా వాది. మానవ జీవిత విషయమున నీయనకు గల యుదాత్త గంభీర భావములితని రచనలందు ప్రతిబింబించును. యురిపిడీస్ మహాకవి పందొమ్మిది నాటకములను సృజియించెను. ఈతడు తత్త్వవేత్త యగును సాక్రటీసు మహాశయునకు మిత్రుడు. మానవ జీవిత సమస్యలను యథాతథముగ చిత్రించుటయం దీయన ప్రతిభ వ్యక్తమగును. ఇవి యన్నియు విషాదాంత నాటకములు.

గ్రీకు సారస్వతమును రోము రచయిత లనుకరించిరి. పూర్వులు ప్లాటస్, టెరెన్సు అను కవులు ప్రముఖులు. 'సెనకా' యను కవి పది విషాదాంత నాటకములను రచించెను.

ఆంగ్ల సాహిత్యమునకు స్వర్ణయుగము 'ఎలిజబెతెన్' యుగము. ఇందగ్రసరుడు షేక్స్పియరు మహాకవి. బెన్ జాన్సన్ గూడ ప్రముఖుడే. ఈ కాలమున వీరు ఆంగ్లేయులకు మాత్రమే గాక ప్రపంచమునకే సమున్నత మయిన సారస్వతము నందించి ధన్యులయిరి.

ఆంగ్లదేశమునందు వలెనే స్పెయిన్ దేశమునందును మోదాంత విషాదాంత నాటక రచన లతిశయిల్లినవి. అందు 'లోప్‌డివేగా' అను మహాశయుడు పదునెన్మిది వందల నాటకములను రచించెను. తత్కాల సన్నివేశముల కాకర్షితుడయి, భావోద్రేకము కలుగగా నుత్పన్న మయిన సారస్వత మిది. సారాంశ మేమన.

ప్రాచీనమున గాని, నవీనమున గాని ప్రాచ్య, పాశ్చాత్య కవితా మూర్ధన్యులెవరును శ్రీ విశ్వనాథ వలె విపులమయిన సాహిత్యమును సృజింపలేదు. సృజించినను నందే కొంతయో విశిష్టస్థాయి నందు కానరది. ప్రక్రియా వైవిధ్యమును వీరెవ్వరిలోను గాంచము. ఇది శ్రీ విశ్వనాథ ప్రాముఖ్యమును స్పష్టపఱచుటకు గావింపబడిన వివేచనము.

## శ్రీ విశ్వనాథ సాహిత్యము - వైపుల్యము.

అధునాతనులందు గాని, సనాతనులందు గాని యింత విపుల మయిన సారస్వతమును తెలుగున నేయొక్కరును సృజియింపరైరి. శ్రీ మద్రామాయణ కల్పవృక్షమున నవతారికయందు.

"సప్త సంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతి యటన్న
యట్టి కృతి శత నిర్మాత నైన బిడ్డఁ
బడసె నా తండ్రి కృతి లోక పారిషదుఁడు" 13

ఇక్కడ శత శబ్దమునకు సంఖ్యామాత్రార్థమును గ్రహింపరాదు. ఆయన నోట పలికిన వచనము ననుసరించి యిరువది యైదు వేల పద్యములే వ్రాసి ప్రకటింప బడినచో మిగిలిన సంఖ్య యెంత యుండగలదు ? కనుక పయి వ్యాఖ్యానము పాఠకుని నేర్పరితనమ్ము పయి నిర్భరమయి యుండును. ఏ ప్రక్రియ యైనగానిండు. ఆయన రచనలను లెక్కవేసినచో పయి పద్య సంఖ్య గాక నాలుగు వందల అరువదియారు రచనలున్నవి. 3 ఇంక ననేకములగు నముద్రిత రచనలున్నవని పరిశీలకు లూహించు చున్నారు. ప్రచురింప బడినవి 25000 కాగా చింపివేయబడిన పద్య సంఖ్య దానికి రెట్టింపగా నున్న వని వారే చెప్పుచున్నారు. 4 ఈ కవితా వ్యవసాయము తెలుగు నేల పయి సుమారరువది యేడుల కాలవ్యవధియందు కొనసాగించి సాహితీ ఫలములను పండించి రసజ్ఞులకు పంచియిచ్చిన వదాన్యుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

## శ్రీ విశ్వనాథ సాహిత్యము - వైవిధ్యము.

శ్రీ విశ్వనాథ సృజించిన సాహిత్యము వైపుల్యమునందే గాక వైవిధ్యము నందును వాసి గన్నట్టిది. ఈయన సారస్వతము బహుశాఖాసమన్వితమయిన మహావటవృక్షమని పేర్కొనవచ్చును. శాఖా సంయుతమైన వృక్షము చూపఱుల కాకర్షణీయ మగుటయేగాక యందాదిగిన వారికి నీడ నిచ్చి సేద దీర్చుట లోక సామాన్య విషయము. శ్రీ విశ్వనాథ సాహిత్యము కల్పవృక్ష సమము. కోరిన విజ్ఞానము నందీయగల సామర్థ్యము దానికి గలదు. ఈ వైవిధ్యము స్థూల, సూక్ష్మ భేదములచే రెండుగా నొప్పును.

---

3 "శ్రీ విశ్వనాథ వాఙ్మయ సూచిక". స్నాతకోత్తర విద్యా కేంద్రం-వరంగల్ ప్రచురణ 1974

4 నేనూ - నా సాహిత్య రచనలు "మహతి" వ్యాస సంకలనం - 1972.

స్థూలము :- పద్య, గద్య, గేయములు.

శ్రీ విశ్వనాథ కొన్ని వేల పద్యములను రచించెను. కొన్ని వందల గద్యములను వ్రాసెను. కొన్ని పదుల గీతములను వెలయించెను.

సూక్ష్మమునకు : 1. ఛందో వైవిధ్యము. 2. ప్రక్రియా వైవిధ్యము.
3. రస వైవిధ్యము. 4. వస్తు వైవిధ్యము.
5. శైలీ వైవిధ్యము 6. భాషా వైవిధ్యము అని విభాగింప వచ్చును.

1. ఛందో వైవిధ్యము :-

సంస్కృతమున వాల్మీకి యాదికవి. ఆయన తరువాత కాళిదాసును బేర్కొందురు. వీరు మహా కావ్య ప్రణేతలు. వీరి రచనందీ. ఛందో వైవిధ్యమును రెండు విధములుగా దర్శింప వచ్చును.

1 సర్గ యంతయు నొకే వృత్తమున నడపి యంతము నందు వేరొక వృత్తమును వ్రాసి ముగించుట.
శ్రీమద్రామాయణము, రఘువంశాదు లిందుల కుదాహరణములు

2. కావ్య మంతయు నొకే వృత్తముతో నిర్వహించుట.
'మేఘ సందేశ' కావ్యమిందుల కుదాహరణము ఇది 'మందాక్రాంత' వృత్తముచే నిర్వహింపబడుట సుప్రసిద్ధము.

తెలుగు నను పాల్కురికి సోమన యిట్టి వైవిధ్యమును ప్రదర్శించెను, బసవపురాణము నంతయును ద్విపద ఛందమున వెలయించెను. వృషాధిప శతకము నొక ప్రత్యేక వృత్తమున నిర్వహించినాడు. (ఉత్పలమాలా వృత్తము) శ్రీ విశ్వనాథయు తన శతకము నొకదానిని 'మధ్యాక్కర' చే నిర్వహించెను. సహజముగా శతకములను

కందములందో, సీసము లందో వృత్తములలో చంపకోత్పల శార్దూల మత్తేభములందో వెలయించుట గనుచున్నాము. కాని మధ్యాక్కరలో వెలయించుట శ్రీ విశ్వనాథ ప్రత్యేకతగనే పేర్కొన వలయును. అట్లే వరలక్ష్మీ త్రిశతి, విశ్వనాథ పంచశతిని కూడ పేర్కొన వచ్చును.

## 2. ప్రక్రియా వైవిధ్యము :-

అనేక ప్రక్రియలను చేపట్టి సాంస్వాతాభిరుచి నెట్లయినను సమాజములోని సహృదయులకు గల్గించుటయే దీని ప్రత్యేకత. లోకము విలక్షణ మైనది. జీవులును వైవిధ్యమును వాంఛింతురు. ఒకనికి రుచ్య మైనది మరియొకరి కభోజ్యము. మామిడి పండొకని కిష్టము. ద్రాక్షా మాత్ర భోగియొకరు, నారికేళముగాని యొకనికి తృప్తిగల్గింపదు. తినుటవలన లభించున దేరికైన నానందమే. సృష్టికర్త యిట్లనేక ఫల ముల నుత్పన్నము చేసి భిన్న జీవుల యిష్టమును దీర్చుచున్నాడు. కవియు ప్రతి సృష్టికర్తయగును గాన భిన్న జీవుల మోద సాధనము లను విచారింప వలయును. ప్రమోద ప్రాప్తి విధానముల నరయ వలయును వానిని సృజించినచో నాతడు కవి బ్రహ్మయగును. తజ్జీవ నాడీ స్పందన మరయగల్గిన మహాకవి చతురాననునకు నీ ప్రక్రియా వైవిధ్యము కరతలామలక మగును.

శ్రీ విశ్వనాథ యట్టివాడు. ప్రతి ప్రక్రియ యందును. రసా నందమును ప్రభవింపజేసెను. మహా కావ్యము, కావ్యము, నవల, నవలిక, గేయము, చిన్న కథ, కవిత, విమర్శ, పీఠికా రచనము, ఉదాహరణ కావ్యము. ఆ యీ యన నేల? పాఠకుని స్పందనకు హేతు భూతమగు ననెడి నిశ్చయము కలిగినచో నా ప్రక్రియలో నాయన లేఖిని నుండి సాహిత్య ముద్భవించిన దన్న మాటయే.

మహా కావ్యము నుండి ఆయన నిర్వహించిన వివిధ ప్రక్రియల క్రోడీకరణ మీ దిగువ సంగ్రహింపబడినది.[5]

మహాకావ్యము.

శ్రీమద్రామాయణ కల్పవృక్షము – 6 కాండలు

| | | | |
|---|---|---|---|
| | | ఇతరములు | 31 |
| కావ్యములు | 25 | అనువాదములు | 3 |
| నవలలు | 57 | పీఠికలు-అభిప్రాయములు | |
| విమర్శన వ్యాసములు | 9 | ఆశీస్సులు | 103 |
| సంపాదిత గ్రంథములు | 3 | రేడియో ప్రసంగములు | 22 |
| అలభ్య గ్రంథములు | 7 | వ్యాసములు | 60 |
| నాటకములు | 15 | ఉపన్యాసములు | |
| కవితలు | 40 | (రికార్డు చేసినవి) | 10 |
| అలభ్య కవితలు | 17 | చిన్న కథలు | 31 |
| నాటికలు | 3 | ఆంగ్లవ్యాసములు | 7 |
| సంస్కృత రచనలు | 7 | | |
| రేడియో నాటికలు | 10 | మొత్తము | 466 |

3. రస వైవిధ్యము :-

కావ్యము భిన్న రసముల కాలవాలమైనను అంగి రసము ప్రముఖముగా జెప్పబడుచుండును. ప్రబంధము లందితర రసము లెన్ని యున్నను శృంగార మంగి రసమని యాలంకారికులు పేర్కొనిరి. శ్రీ విశ్వనాథ కల్పవృక్ష మహాకావ్యమునందు ప్రధాన రసము శాంత

5 శ్రీ విశ్వనాథ వాఙ్మయ సూచిక - స్నాతకోత్తర విద్యాకేంద్రం-వరంగల్ ప్రచురణ 1974.

మని చెప్పవలెను. ప్రద్యుమ్నోదయ కావ్యము శృంగారరస ప్రధానము. వరలక్ష్మీ త్రిశతి వియోగ కావ్యము. గోపికా గీతలు, శ్రీకృష్ణ సంగీతము కూడ శృంగార రస ప్రపూర్ణములే. కిన్నెరసాని పాటలు చక్కని శృంగారమునకు ప్రతీక.

4. వస్తు వైవిధ్యము :-

1. వస్తువును ప్రాచీనులు ప్రఖ్యాత, ఉత్పాద్య మిశ్రమములని మూడు విధములుగా నేర్పర్చిరి.

2. ఇతివృత్త భేదముచే పౌరాణిక, చారిత్రక, సాంఘికేతి వృత్తములని రెండవ వర్గీకరణము.

1. ప్రఖ్యాతము : శ్రీమద్రామాయణ కల్పవృక్షము ఇందలి వస్తువు ప్రఖ్యాతమే.

2. ఉత్పాద్యము : ఆరు నదులు, వేయిపడగలు. విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు పులుల సత్యాగ్రహము మొదలగు పెక్కు నవలలలోని యితివృత్తము కవియొక్క కల్పితమే.

3. మిశ్రమము ; మిగిలిన శ్రీ విశ్వనాథ సారస్వత మంతయు నీవర్గమునందు చేరును.

1. పౌరాణికములు : కల్పవృక్షము, ప్రద్యుమ్నోదయము, రురు చరిత్రము, పునర్జన్మ[6] (నవల) మొదలగునవి.

---

6 మాండూక్యోపనిషత్తు నందలి పునర్జన్మ వృత్తాంతము ననుసరించి వ్రాయబడిన నవల.

2. చారిత్రకములు : ఆంధ్ర పౌరుషము, ఆంధ్ర ప్రశస్తి, ఝాన్సీ రాణి (కావ్యములు) పురాణవైర నవల , కాశ్మీర, నేపాల నవలలు, భ్రమరవాసిని, మొదలగు నవి ఈ కోవకు చెందును.

3. సాంఘికములు : నవల లందును, విశ్వనాథ పంచశతి యను కావ్యము నందును అనేక సాంఘిక సంఘటనలు స్పృశింపబడినవి.

## 5. శైలీ వైవిధ్యము :-

శ్రీ విశ్వనాథ దృష్టియందు శైలి జీవ నష్టము. అది మారనది కాదు. కాని సన్నివేశమును బట్టి, ప్రక్రియను బట్టి; పాఠకుని వివేచన ప్రమాణము ననుసరించి రచనలో వైవిధ్యము గోచరించును. నవల లందు, కథలయందు, పాఠకునకు పరిచయముగల పదములనే సంయోజన పఱచి శ్రవణ సుభగత్వమును కల్గించును. పద సంయోజన ప్రభావమున నుత్పన్న మగు మార్మికతను వీలయినంత తగ్గించును. ఈ వైవిధ్యము బాహిరమునకు గోచరించు నదియే కాని యాంతర ప్రకృతి శ్రీ విశ్వనాథుని యే రచన మందయిన నొకటే.

## 6. భాషా వైవిధ్యము :-

శ్రీ విశ్వనాథ త్రిభాషాభిజ్ఞుడు. జన్మాంతర సుకృత పరిపాక విశేషము చేత నాయన ప్రతిభ జన్మ సిద్ధ మయినది. సంస్కృతాంధ్రాంగ్లము లందాయనకు గల నిత్య ప్రస్తుత ప్రజ్ఞ, తత్తద్భాషా సారస్వత సృష్టికెంతయో యుపకరించినది. ఇతర భాషల యందును నా ప్రజ్ఞ ప్రదర్శన యోగ్యమైనది. ఈ దృష్టితో గాంచిన శ్రీ విశ్వనాథ రచనలందు భాషా వైవిధ్యము నీ క్రింది విధమున దర్శింపగలము.

1. సంస్కృతమున వెలయించిన కృతులు :-

1. నాటకములు : అమృత శర్మిష్ఠము, గుప్త పాశుపతము,

2. నాటిక : ఆశ నిరాసము.

3. కావ్యములు : దేవీ త్రిశతి. శివ సహస్రము. పుష్పగిరి సుప్రభాతము.

4. నక్షత్ర మాల : కంచి కామకోటి పీఠాధిపతుల సమక్ష మున చదివిన యిరువదియేడుశ్లోకములు,

ఆంగ్ల రచనలు :

i. Telugu Bhashalo Chando Rithulu. Review.of Dr. G. V. Seetha Pathi's book, Indian Express 1943.

ii. Treditional Values in Art & literature (Type Script) 1961.

iii. X Rays into truth : The Meha Astro Spiritual Magazine Nov. 61.

iv. Sochi Roy - The poet of the people (Commemoration Volume).

v. Culture revealed through literature October, 63 A. P. Magazine.

vi. Convocation Address (SRR & CVR COLLEGE) March 1972

vii. Bharathi Nirukti (Releasing ceremony) April 1972.

viii. Foreword to Lost Horizon (Poems by Harindranath Chatt opadhaya)

ix. Ramayana (Serialized in Bhawan's journal and published in a book form)

శ్రీ విశ్వనాథ - వైశిష్ట్యము :-

ఒక కవి పెక్కురచనలు గావించినను నవి యన్నియు వెలుగు చూడ నోచుకొనవు. వెలుగు చూచినను ప్రాచుర్యము వహింపవు.

వహించినను హృదయంగమముకావు. రాశికిని వాసికినిగల భేదమిదియని చెప్పవచ్చును. పాశ్చాత్య సాహిత్యవిద్యాంసులందు సయితము పెక్కు రచనలు చేసిన వారుండిరని యింతకుమున్నే తెలిసికొంటిమి, షేక్స్పియర్ మహాకవి సయితము ముప్పదియారు నాటకములను రచించెను. ఇందన్నియు నాయనకు కీర్తి తెచ్చినవికావు. మోదాంతము లందు "వెన్నీసు వర్తకుడు" Merchant of Venice ఖేదాంతములందు జూలియన్ సీజరు, మేక్‌బెత్‌లు తెచ్చినంత పేరు మిగిలినవి తెచ్చియుండక పోవుట నాంగ్ల సారస్వత విమర్శకు లంగీకరింతురు. మిల్టన్ మహాకవి రచించిన పెక్కు కావ్యములలో "పారడైజ్ లాస్ట్" Paradise Lost's నకు వచ్చిన పేరు మిగిలిన వానికి లభ్యము కాలేదు. అట్లే తెనుగున శ్రీనాథునకు "శృంగార నైషధము" సూరనకు "కళాపూర్ణోదయము" కీర్తి ప్రతిష్ఠల నందించిన సంగతి విదిత పూర్వము.

కాని శ్రీ విశ్వనాథ బాణిలోని వాణిలో తృణీకరింప దగిన దేదియు నుండదు. ఆయన ప్రతి రచనయు నర్థవంతము. సునిశిత భావనాత్మక మైనట్టిది. తనకు గల లోక కావ్యాద్యవేక్షణముచే సంస్కృతాంధ్రాంగ్ల వాఙ్మయ మహోదధులను మథించి అమృత కలశ సదృశ గ్రంథములను వెలికి తెచ్చి సారస్వత జిజ్ఞాసువుల కందించిన జగన్మోహిన్యవతారము శ్రీ విశ్వనాథ. ఈ హేతువున నాయన మహాకవిగా తనకు గల గురుతరమైన బాధ్యత నత్యంత సమర్థముగా నిర్వర్తించుకొన గల్గెను. కనుకనే యీయన ప్రతి గ్రంథమునను ప్రశస్తి యుండును. స్థాలీపులాక న్యాయముగా కొన్ని గ్రంథము లందు రచయిత ప్రదర్శించిన వైశిష్ట్యము విశదీకరింప బడుచున్నది.

అవిచ్ఛిన్న సంప్రదాయ మన నెద్దియో, దాని నెట్లు పరిరక్షించు కొన వలయునో రక్షణ చేసికొనకపోవుట వలన సంప్రదాయ

మెట్లు బీటిచ్చునో "వేయిపడగల" నవలలోని పాత్రల ద్వారమున ప్రవచించెను.

"ఝాన్సీరాణి" కావ్యములో నామె వీరోచితముగ నొక ధర్మ పరిరక్షణమునకై పోరాడి మడియుట యధర్మ విజృంభణమునకు ప్రతీక. కాని యామె మరణించినట్లు చరిత్ర చెప్పుచున్నది. దానిని సమర్థించుట కయి కావ్యాశ్వాసాద్యంతము లందు కాల పై పరీత్యమును పెద్దగా జెప్పి యాదోషనివృత్తిగావించినాడు.

ఏదియో యొక ప్రేరణ కావ్యావతరణమునకు బీజము. వాల్మీకికిగూడ క్రౌంచ మిథునములో నొకటి కిరాతునిచే గొట్టబడిన దృశ్యము ప్రేరణ యయ్యెను. రామాయణ కావ్య మావిర్భవింప చేసెను. "మున్నంగి" తెనాలి తాలూకాలోని యొక గ్రామము. అందుగల స్వామి వేణుగోపాలస్వామి. ఆయనకు దేవాలయము మరమ్మతు గావలెను. ఈయన నా గ్రామస్థు లొక శతకము వ్రాయ నర్థించిరి. 'మున్నంగి వేణుగోపాల' యను మకుటముతో నొక శతకము రచించెను. తెలుగు దేశమందలి పది పుణ్యక్షేత్రములలో గల స్వాములపై నొక్కొక్క శతకము చెప్పి వేయి పద్యములను చేసెను. దానికి "విశ్వనాథ మధ్యాక్కర" యని పేరుపెట్టెను. ఇదంతయు తాత్త్విక భావనలతో నిండియున్నది ఇది వ్యాజస్తుతి కావ్యము శ్రీ విశ్వనాథ ఛందస్సు నెన్నుకొనుట లోని వైశిష్ట్య మిందు గాన నగును.

ఆంధ్రుల సాహితీ కల్పతరువు. శ్రీమద్రామాయణ కల్ప వృక్షము, వాల్మీకి భావమునకు పదను పెట్టిన కావ్యమిది. సంప్ర దాయ కవిత కీకావ్యము ప్రభువు వంటిదని పెద్దలు పేర్కొనిరి. స్వాతంత్ర్యానంతరము వెలసిన సంప్రదాయ సాహితికి మకుటాయ,

మానమని చెప్ప దగిన గ్రంథమిది యని సారస్వత ప్రియంభావుకు లంగీకరించిరి. ఈయన ప్రతి రచనయు శైలిచేత, వర్ణనచేత, లోకో త్తరమగు పరిశీలనా దృష్టిచేత, శాస్త్ర కావ్యాద్య వేక్షణముచేత, ఉత్తమతత్వ ప్రతిపాదనము చేత వైశిష్ట్యము కలిగియున్నది.

1. శైలి:— వైవిధ్యమునందు సూక్ష్మముగ పేర్కొనిన యీయంశము సోదాహరణముగా ప్రస్తుతింపబడుచున్నది.

"ఇది విశ్వనాథ శైలి", ఇది శ్రీశ్రీ యనుకరణమను పేళ్ళతో ప్రచారములోనున్న రచనా మార్గములను గుఱించి మనము వినుచున్నాము. ఆంగ్లమున దీనిని 'Style' అను పేరుతో బిలుతురు. శ్రీ విశ్వనాథ దీనిని జీవనిష్ఠముగా నిర్వచింతు రని యింతకుమున్నే పేర్కొనబడినది. శ్రీ విశ్వనాథ ప్రాచీన కవితా మార్గ నిర్దేశకుడయ్యును నాధునికత నాయన తృణీకరింపలేదను విషయము మనము విస్మరింపరాదు. సాహిత్యము వెఱ్ఱితలలువేసి సంప్రదాయ విచ్ఛిన్నత కెఱవైె సాహిత్యార్థమునకే తీరని కళంకము సంభవించు తరుణమున నాధునికతను సాహిత్యార్థమున నిరసించుట యొప్పే యగును, తన భావ క్రమమును పాఠకుల హృదయమునకు హత్తుకొను రీతిని సారస్వతమును సావధముగ నొనర్చుకొని యొక విలక్షణమైన విధానములో నందించుటలో నీయన కుశలుడు. పూర్వకవుల కవితామార్గమును స్వయముగా ననుభవించి దానినుండి యొక విశిష్టమైన మార్గమును నిర్మించుకొనుటయే ఈయన ప్రతిభ. పద్యము సుకుమారముగ నుండవచ్చును. కాని జిగి, బిగి, ప్రౌఢి, గడుసుతనము, భావ నిర్భరత నిండియే యుండును. నన్నయ్యగారి వలె కవిత్వమును పద్య విద్యగా దర్శించిన ద్రష్ట శ్రీ విశ్వనాథ. కల్పవృక్షమున దీనికొక యుదాహరణము చూపబడుచున్నది. బాలకాండలోని యొక సన్నివేశములో విశ్వామిత్ర మహర్షి మహోగ్ర తప మాచరించుచుండెను. రంభ

యీయన తపమును విఘ్నమొనర్చుటకు వచ్చెను. మహర్షికి మిక్కిలి కోపమువచ్చెను. తత్ క్రోధ వర్ణనము నిట్లు చేసెను.

"క్రాచిన శూరతా నిధియుగాఁ జను మానిసి శస్త్రహతుడత్తమై
యేచిన కత్తిదెబ్బ పడినంతన బాధయు, బాధతోడనే
త్రాచు విధాన లేచిన విధంబున హానియు తాడి యెత్తునన్
జాచిన మేనుగా నిలిచి చండతరాక్షుల నగ్ని గ్రక్కుచున్

బా. ధనుస్సు ప. 2 పేజీ 272

ఇది యీయన శైలి. తెలుగువాడు తెలుగువానితో మాటాడిన తీరువలె నున్న ఈ పద్య రచనమును గమనింపవలసి యున్నది. పద్య రచనలో క్రోధ సముత్పన్నతకు గావలసినంత యుద్వేగము గాని, యోజోగుణ ప్రాకట్యముగాని కానము. జటిల పద బంధము, దీర్ఘ సమాస రచనము, పరుషాక్షర పద గుంఫనములేదు. ఉన్నదంతయు 'త్రాచు విధాన లేచిన విధంబున' 'తాడి యెత్తున చాచిన మేనుగా నిలచి, అన్న యాచ్ఛిక పదములే రౌద్రస్ఫూర్తిని గలిగించి విశ్వామిత్రుని మహోత్తాల క్రోధమును ప్రదర్శింపజేయుట మనము గమనింతుము. కేవల వ్యుత్పన్న కవులవలె శబ్దాడంబరము, సమాస స్ఫూర్తితో గాక సామాన్యమైన పద సముదాయముననే భావ వ్యక్తీకరణము గావించుట మహాకవుల విశిష్ట లక్షణము.

## 2, భావన :-

లోకోత్తరమైన భావన మహాకవిత్వ లక్షణము. సంస్కృత భాగవతమునందలి "భ్రమర గీత"లను పోతన్నగారు తెలుగులో నేడెన్మిది పద్యములను వ్రాసిరి. అక్కడ ఆయన లక్ష్యము వేరు. అవే భ్రమరగీతల నీయన భావనచే పెంచి యొక శతకమును జేసిరి. కైక పాత్రను వాల్మీకి మలచిన విధమున విశ్వనాథ రూపొందింపలేదు.

ఈయాన భావనలో కైక దుష్టపాత్ర కాదు. అనుల్లంఘనీయమైన దైవసంకల్పమున నట్లు ప్రవర్తించినదియు కాదు. వేల్పులచే నుగ్గోధితయై కర్తవ్యదీక్షలో వాత్సల్యము నింకింపచేసికొనిన మహనీయు కాంత శ్రీ విశ్వనాథుని రాజకాంత. ఆమె మన తత్వ పరిశీలన మెంత నిశితముగ నిర్వహించెనో, ఆమె మన తత్త్వము నెంత చతురముగ చిత్రించెనో తెలిసికొనవలెనన్నచో నాఘట్ట మవశ్యపఠనీయము.

## ౩. వర్ణనలు :-

ఈయన వర్ణనలు మనోహరములు, ఋతు సంహారము కవితా వస్తువుగా స్వీకరించి కాళిదాసు మొదలుగా ననేకకవులు రచన మొనర్చిరి. అత్యంత భావస్ఫోరకములుగా నీయన వర్ణనలు కన్పట్టును. ఈయన కావ్యమందలి వసంతర్తు కథానాయకుడు ఋతురాట్నానలకూబరుడుగ పేర్కొనబడెను. నలకూబరుడు సౌందర్యము నందు సాటిలేని మేటి ఆయన భార్య రంభ ఋతువులలో వసంతమట్లు ఋతురాజుగ చెల్లుబడియగునో నలకూబరుడును సౌందర్యమునకు ప్రతినిధిగా నట్లు చెల్లుబడి వహించును, కల్పవృక్షములోని ఋతువర్ణనలు కథానుగమ్యమై యుండుట పేర్కొనదగిన యంశము శిశిరము లోని చలిని బెదరించుటకు భీతహరిణాక్షులు సర్వ సత్రియాగాగ్ని సమిధలైనారని యొకవర్ణన. ఇది పాఠకుని మధురోహలతో మనసు మైమఱపించుభావము. కుమారాభ్యుదయము, రురుచరిత్రము లోని వర్ణనలు రసస్ఫోరకములు. నిస్తబ్ధ ప్రకృతి వర్ణనము చదువరులకొక భీతి పుట్టించును. అదియే చలిత ప్రకృతియైనచో నా వర్ణన మన వెంట నడచి వచ్చుచున్నట్లు మనము భావింతుము మహాకవియైనవాడు చలిత ప్రకృతి నతివేలముగా వర్ణించును, కాళిదాసాదికవులట్టివారు. శ్రీ విశ్వనాథయు నట్టిడుగనే కానవచ్చును. సన్నివేశానుగుణ

ముగ నీతనిరచనలన్నింటి యందిట్టి వర్ణనలు కానవచ్చుట యీతని ప్రత్యేకత.

## 1. లోకత్తరమగు లోకపరిశీలనము :-

మహాకవుల కుండవలసిన ప్రతిభ యనంతముగా నీరికున్నది. ఎప్పటికప్పుడు వినూత్నమై భాసించెడు ప్రజ్ఞయే ప్రతిభయని చెప్పుదురు. శాస్త్రకావ్యములను లోక వృత్తము ననుసరించి సమన్వయించుటయే వ్యుత్పత్తి. ఇచట లోకమనగా 'లోచనాత్ లోకః' యని తాత్పర్యము, చూడబడునది యగు స్థావర జంగమాత్మక సకల ప్రపంచము లోకమేయగును. అట్టి పరిశీలనాదృష్టి సీరికి పుష్కలముగా నుండుటం జేసియే ప్రతిభావంతుడయిన మహాకవిగా శ్రీ విశ్వనాథ యెనలేని కీర్తి నార్జించెను.

ఆధునిక యువత గురించి శ్రీ విశ్వనాథ పరిశీలనము.

'తెలుగు దేశాన యువకులు తిరిపెములై రి

మొట్టమొదట శాస్త్ర పురాణముల నిరసన

పైన దేవుడు లేడన్న పట్టుదలయు

నూటిగాం జెట్టుచివరకు బోషలిజము.'

విశ్వనాథ పంచశతి

ఇందు నదులే దేవతలై రను వ్యంగ్యమున్నది. మిగిలిన మూడు పాదములందు యువతవర్తనముతో గలిగిన వేదన, భవిష్యత్తునందు వారికేమి దిక్కు ? అన్న యాందోళన స్పష్టపడును. ఇట్టి యుదాహరణము లాయన ఇతరములయిన రచనలందును గాననగును

## 5. శాస్త్రకావ్యాద్యవేక్షణము :-

ప్రతిభా వ్యుత్పత్తులందు ప్రతిభ గరీయసి యయ్యును, వ్యుత్పత్తి లేని ప్రతిభ వాసనలేని పుష్పము వంటిది. అభ్యాసము సయితం మీ

వ్యుత్పత్తియందే చేరి యున్నది. వివిధ శాస్త్రముల నిత్య ప్రత్యగ్రి పరిశీలనము, పురాణేతిహాస మహాకావ్యములతో నిత్యసంసర్గము. లోకానుశీలనము కవిని మహాకవిగా నొనర్చి యాతనికి పుష్టిని, తుష్టిని, గూర్చును. నిరంతర కావ్య రచనా వ్యాసంగమభ్యాసము. ఇది లేనిచో శబ్దముల సద్యఃస్ఫురణ యుండదు. శైలి కుంటుబడును. కవికీవిషయములు బ్రాహ్మణున కాహ్నిక విధులవలె నిత్యాసన్నముగ నుండవలెను. శ్రీ విశ్వనాథ బాహిరమున నొక మంటిముద్దయైన మానవుడు. అంతరమున నొక యోగి, మనతో సంభాషించుచున్నను ఆయన యాంతరమందున్న కవితాసింహము మేల్కొని మనోరణ్యమున సంచరించుచునే యుండును. ఆవిధమున నిత్య జాగరూకమైన రస హృదయము వీరిది యని చెప్పవచ్చును. ధారణశక్తి, ఏకాగ్రిత వీరికి భగవద్దత్త శక్తులు, మనసునకు పట్టినంత ధారణచేయుట, తరువాత వ్రాయుట వీరికలవడిన గుణము. ఒక్కొక్క సమయమున నలుబదేబది పద్యములను సయితము ధారణశక్తితో నల్లుట రామాయణ రచనమున జరిగెడిదట. ఏకాగ్రతకు వీరి 'వేయిపడగ'లను నవల, 'కుమారాభ్యుదయ' కావ్యము ప్రతీక లనవచ్చును.

ఈ మహాకవి అన్ని రచనములలోను వేదోపనిషచ్ఛాస్త్రి పురాణేతిహాస విషయ చర్చలు ప్రతిబింబించును.

వేయిపడగల నవలలో ప్రాచీనాంధ్ర సాహిత్య వైశిష్ట్యము. భారతీయధర్మము వ్రాయబడినది. కల్పవృక్షమునందు వేదోపనిషద్రహస్యములు, అద్వైత శాస్త్రపరిశీలన ముల్లేఖింపబడినది. హరుచరిత్రములో యోగశాస్త్ర విషయములు పరిచయము గావింపబడెను. భిన్న జంతువుల స్వభావములు కూడ ఈ గ్రంథమునందు వ్రాయబడినవి. 'తెఱచి రాజు' నవలయందు నాట్యశాస్త్ర విశేషములు, 'ప్రమాయ

తుమ్మెద'లో సంగీత శాస్త్రము, 'పురాణవైర గ్రంథమాల'లోని పండ్రెండు నవలలందు చెప్పబడిన యనేక ప్రాచ్య పాశ్చాత్య జీవన రహస్యములు, ప్రత్యేకించి అశ్వమేధ నవల యందు ల్లేఖింపబడిన శ్రౌత విజ్ఞానము, చారిత్రకాంశములు పేర్కొనదగినవి. ప్రపంచనాగరికత భారతదేశ నాగరికతకు ప్రతిరూపము అను వాక్యము 'ఆరునదులు' అను నవల నిరూపించును. ఇట్లు ఆయన రచనలన్నింటిలో నేదియో యొక వైశిష్ట్యము గోచరించును. దీనినే వీరు ముచ్చటించుచు—

> "మొదటిది నేను ఏమి వ్రాస్తానో, తెలిసికొని వ్రాస్తాను గనుక. నేను వ్రాసినదానిలో అనంత విషయములు నేను చొప్పించి వ్రాస్తాను గనుక. అనాదినుండి ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకొంటూ వస్తున్నది. ఆ జ్ఞానం నా పాఠకులకు కల్పించి నేను సఫలజ్ఞాయి వాళ్ళను జ్ఞానవంతులను చేస్తున్నాను అనే భావం నాకు ఉన్నది కనుక."

పై వాక్యములు మూడింటిలో నొకదానికంటె నొకటి యుత్కృష్టను కలిగియున్నవి. మొదటిది అభ్యాసము, రెండవది వ్యుత్పత్తి, మూడవది ప్రతిభ. అనుస్యూతమయి మణిగణమునందు సూత్రమువలె వచ్చెడి జ్ఞానసంపదను గురించి. దానిని శ్రీ విశ్వనాథ ప్రదర్శించిన తీరును గురించి తెలియవలసియున్నది. అది రెండుగా విభాగింపనగును.

1. ధర్మానుశీలము
2. ఉత్తమత్త్వ ప్రతిపాదనము

ధర్మానుశీలనము :

మహాకవి శ్రీ విశ్వనాథ అవిచ్ఛిన్న సంప్రదాయార్థి. వీరి కృతులన్నింటియందు 'అనుగతమయిన, సుసంగతమయిన, అనుస్యూత

మయిన భారతీయ సంస్కృతి యున్నది. తత్ప్రధానకము, తత్ప్రతిపాదకము నయిన కృతి పరంపరను విశ్వనాథులు వెలయింపజేసినారు."

అని శ్రీ జమ్ములమడక వారి నిర్ద్వంద్వాభిప్రాయము.[8] వారేమి గాంచినను తెలిసికొని వ్రాయుట వారి జీవలక్షణ మనుకొనినచో నీ యనుస్యూతమయిన సంస్కృతిని పూర్వసంస్కార జనితమను ప్రథమ హేతువునకు సహకరించిన పరిస్థితులు, బాల్యమున వీరి కధ్యాపనము చేయించిన గురువులను ఇచట స్మరింపవలసియున్నది. అట్టి మహనీయుల శుశ్రూషా సౌభాగ్యము లభించుటంజేసి స్వాతి వర్షముచే పులకితమయిన ముత్తెపు చిప్పవలె వీరి జ్ఞానపేటిక విచ్చుకొన్నది. కనుకనే తాను తన గురువుల శుశ్రూష యొనర్చుటను గురువుల యపూర్వాదృష్టముగా ప్రకటించిరి.

ఈ హేతువున రచయిత శ్రీ విశ్వనాథ సంప్రదాయ పరిణత బుద్ధిని గణింపవచ్చును. తెలుగుల రాజధాని యయిన శ్రీకాకుళమును వేనకాలమునాటి ముత్తయిదువుగా నాయన దర్శించెను. వేయిపడగలు నవలలోని చాతుర్వర్ణ్య వ్యవస్థ, వేదశాస్త్ర పురాణేతిహాస సముచ్చయ విజ్ఞానమంజూష. శ్రీమద్రామాయణ కల్పవృక్షము చతుర్వర్గ ఫలప్రాప్తికి, ప్రాచీన ధర్మానుశీలనమునకు ప్రతీకగా నిలుచును. ఈ ధర్మము, సంప్రదాయపరాయణత, ప్రాచీన నవీన కావ్యములకు భూమికగా నుండినచో నవి యాదేశ ప్రజాళికి ప్రాతస్స్మరణీయము లగును. ప్రాచీనులు తమకుగల జ్ఞానమును తమ శిష్య సంతతియందు నిక్షిప్తమొనర్చెడి సంప్రదాయమును వరించినారు. గురు శిష్య సంబంధమునకు విచ్ఛిన్నతకల్గి నేడు జ్ఞానము కంఠగతమయినది. మరల శైక్ష్యోపాధ్యాయికను సంప్రదాయానుసారము జరిగించెడి బాధ్యత నమాజము స్వీకరించినచో ప్రాచీన విద్యారహస్యము లనేకము

8 విశ్వశ్రీ - సాహిత్యసంచిక

బహిర్గతము కాగలవని యాశింపనగును. ఈ రచయిత తాను దర్శించిన ధర్మమును విశ్వసించి దానిని సాహిత్యమున తన ప్రతిభా సమున్మేషముచే ప్రజాప్రయోజనమునకు ప్రవేశపెట్టి మహాకవి యయ్యెను.

## ఉత్తమత్వ ప్రతిపాదనము :

"అనంతత్వ ముదాత్త కవిత్వము నంతటికిని వర్తించు"నను షెల్లీ వాక్యము ప్రత్యక్షర సత్యము. సత్యధర్మ దయా శౌచములనెడివి భారతీయ సంస్కృతి నిర్మాణభవనమునకు నలువైపుల నుండెడి నాలుగు భూమికలని చెప్పనగును. ప్రాచీన ఋషుల చర్చా విషయములు మనకు నుపనిషత్తులలో గోచరించును. వానిని చర్చించి సిద్ధాంత మొనర్చి యాపరమోత్తమ రహస్యమును ఆర్షధిషణులు మానవ శ్రేయస్సునకయి ప్రకటించిరి. అవి వారి యనంత తపోదీక్షా లబ్ధ సారాంశములు. తపస్సునుగూర్చి తైత్తిరీయోపనిషత్తునందు పౌరుశిష్ట, రాధీతర మహర్షి, మౌద్గల్యులు వెల్వరించిన యభిప్రాయములు నాటి చర్చా విభవమును వ్యక్తమొనర్చుచున్నవి.[9] ఉత్తమ సంస్కృతి జన్యములగు విషయముల ప్రవచనము గలిగిన సారస్వత ముత్తమమయినది, ఉత్తమత్వము లేని సారస్వతము గర్హ్యమని ప్రతాపరుద్రీయము నిబద్ధించుచున్నది.[10] ఆ ఉత్తమత్వము నాయకా

---

9 తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టిః (పురుశిష్టి స్యాపత్యం)
సత్యమితి సత్యవచా రాధీతరః
స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః

10 'యత్ర పునరుత్తమ పురుషచరితం ననిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ'

శ్రేయము కావలెను. ఇట్టి కావ్యపఠనము వలన శ్రేయః ప్రేయములు సంఘటించునని ప్రాచీన గ్రంథములన్నియు విస్పష్టముచేసినవి. అందులకే 'మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని' అని కావ్యరచనా స్వరూప ముల్లేఖింపబడినది. పక్షి ఎన్ని సముద్రములు చుట్టివచ్చినను రాత్రికి గూటికి చేరును. జీవుడు నట్లే ఎంత కర్మ వశమున బహుజన్మ ప్రయాణ పరతంత్రుడయినను పరమాత్మయందు లీనము కావలయును. అది ఆనందమయము. కనుక జీవుని లక్ష్యము మోక్షప్రాప్తి. ఆనందము తత్ఫలము. కనుకనే పాశ్చాత్య సాహిత్యమునకు వలె మన యాలంకారికులు విషాదాంత సారస్వతము సృజింప ననుమతింపలేదు. చతుర్వర్గఫలప్రాప్తి కావ్యమునం దుత్తమతత్వ ప్రతిపాదనముచే కలుగును. శ్రీ విశ్వనాథ కల్పవృక్షము 'రామాదివ ద్వర్తితవ్యమ్, నరావణాదివత్' అను మహాకావ్యమునకు వ్యాఖ్యాన ప్రాయమైన మహాకావ్యము. 'ఏకవీర' నవలయందు ధర్మాధర్మ ప్రణయ సంఘర్షణము, పురాణవైరమందు ధర్మగ్లానిచే సంభవించెడి విపత్కర పరిస్థితులు ప్రవచింపబడినవి. ఇట్లు ప్రతి రచనమందును నుత్తమతత్వ ప్రతిపాదనము, ప్రాగ్యోన్మూలక మయిన సందేశము, ధర్మ ప్రస్ఫుటీకరణము మ్లేచ్ఛభావ నిరాదృతిగావించెడి యత్నమే మనము దర్శింతుము.

## శ్రీ విశ్వనాథ–సాహితీద్రష్ట :

వేదము నిర్మితమయినదికాదు, దర్శింపబడినది యని యార్ష వాక్యము.[11] ఆయా మంత్రములను ఋషులు తమ యనంత తపో విభవముచే ప్రగాఢ ప్రతిభులై దర్శించి ద్రష్టలైరి. తత్కారణమున ఆమంత్రములకు వారే ఋషులగుచున్న యంశము వేదపాఠకులకు సుపరిచయ విషయము. ఆ ద్రష్టలు మహర్షి నామకులైరి. వసిష్ఠ,

---

11 'నకశ్చిద్వేద కర్తారః,' 'మన్త్రద్రష్టారః'

విశ్వామిత్ర, వామదేవ, మధుచ్ఛందాదు లీ పరిగణన లోనికి వత్తురు. కావ్య విషయముననను దీనినే యనుసరింపవలెను. మంత్రము చదువు వారెల్లరు మహర్షులు కానట్లు, కావ్యరచయిత లెల్లరు మహాకవులు కాజాలరు. కవనకృషిచేత కవి నామము సామాన్యముగా వచ్చును. కవితా వ్యవసాయభేదముచేతను, పూర్వ పూర్వజనిత సంస్కార తరతమ భేదముచేతను కవిభేదము గలుగుట తథ్యమని రాజశేఖరుడు చెప్పెను సింగభూపాలుడు తన రసార్ణవసుధాకర భావకోల్లాసము నందు ఉదాత్తోద్ధత, ప్రౌఢ, వినీతులను చతుర్విధ కవులను బేర్కొనెను. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి (3-10) యందు వాచికాది వివేకాంతము సప్తవిధ కవులను బేర్కొనుచు వారుత్తరోత్తరోత్కర్షా సమన్వితులని నిశ్చయించెను. బహుముఖ శాస్త్రజ్ఞాన సంపన్నుడు, శబ్దార్థ వివేకగుణపూర్ణుడు, రసవదుత్తమ కావ్యనిర్మాణ చాతురీధురీణుడునైనవాడు వివేకియనియు, వివేకియే సర్వకవి మూర్ధన్యుడనియు, 'కవీనాం కవిః' యనుటకు తగినవాడనియు పేర్కొనెను ఇట్టి గుణములు కలిగిన కవి సామాన్య కవులతో విభేదింపబడుట విస్పష్టము.

శ్రుతియందు కవి పదము బ్రహ్మపరము[12] బ్రహ్మయనగా తత్త్వవాచక శబ్దము. కవులలో నేను శనుడనని గీతయందు శ్రీకృష్ణుడు వచించెను.[13] ఈ శబ్దములు ద్రిష్టార్థ సమన్వితములు. బ్రహ్మము ద్రష్టవ్యము. ఉశనుడు శుక్రాచార్యుడు, అనుగగురువు. స్మృత

[12] గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవ స్తమమ్ [ఋక్ 11-23-1]

[13] కవీనా ముశనా కవిః - గీత. 10-37

సంజీవినీ విద్యను దర్శించిన మహామహుడు. అమరసింహుని నామలింగాను శాసనమున నీ కవిశబ్దము విపశ్చిదర్థమున గానవచ్చును.[14] భట్టతౌతుడు ఋషికానివాడు కావ్యకర్త కాజాలడని చెప్పి సప్తర్షిముల్లో ద్రష్టృత్వమును సమన్వయించెను. ఋషియనగా గతాగతివేది. సంస్కారయుతుడు. యమ నియమాదిశీల సంపత్తిగలిగినవాడు ఋషికల్పుడనియు, వేద వేదాంగ తపోయోగనిష్ఠుడు ఋషియనియు శ్రీ వైఖానసకల్పసూత్రము నిర్వచించుచున్నది. ఈ గుణముల వలన రాగద్వేషరహితమైన మనస్సు, సత్త్వగుణ ప్రవృత్తత సిద్ధించును. లోకాతీతమైన తత్త్వదర్శనసిద్ధి చేత శబ్దబ్రహ్మ సాక్షాత్కారము కలిగి ఋషికల్పుడగును. ఆ సత్త్వగుణమునకు రజోగుణము సంఘటించిననే అనగా లౌకిక వ్యాపారము సమన్వయించుటచేతనే ఋషి కవి యగును. అనగా వాగ్వ్యాపార కుశలియగును. వాల్మీకి ఋషియే. శబ్దబ్రహ్మ సాక్షాత్కారము పొందినవాడే, ఆయనకు లౌకికమైన క్రౌంచ మిథునవికార దర్శనము కానిదే వాగ్వ్యాపారమునందుంచలేదు.

అట్టిడు శ్రీ విశ్వనాథ. భారతీయమైన సంస్కారమును, భారతీయ తత్త్వమును తన జీవునియందు నిండించుకొని శరీరమున పండించుకొనిరి. పద్య విద్యాతత్త్వ దర్శనులు, తన ప్రజలకాతత్త్వమును సందేశరూపమున నందించుటకు జీవితాంతము కఠోరదీక్ష పొందినవారు 'జీవుడు, కర్మ, సంస్కారము, జన్మపరంపర' - యిది యొక ప్రావాహికమైన ఊహాపద్ధతి. దీనిమీద ఆధారపడి భారతీయ నాగరికతా సౌధనిర్మాణము జరిగినది. మహాకవుల యొక్క పద్య

---

[14] విద్వాన్ విపశ్చి ద్దోషజ్ఞ స్సన్సుధీః కోవిదో బుధః ।
ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞ స్సంఖ్యావాన్ పణ్డితః కవిః ॥
దీ. కొ. ॥ బ్రహ్మవర్గము. శ్లోకము 5

రచనా శిల్పముయొక్క ఆయువుపట్టు దీనిలోనున్నదను మహా రహస్యమును క్షోదక్షమముగా దెలిసిన నాడాకవి యంతర్ద్రష్ట యగును. ఆతని సర్వ సాహిత్యము పరమాత్మోన్ముఖ మగును. వాడు అమృతత్వము నిచ్చగించిన ఆవృత్త చక్షువులుగలవాడు.

ఆంధ్ర సాహిత్యములో నన్నయ, తిక్కన్న, నాచనసోముడు, శ్రీనాథుడు, పెద్దన్న, రామకృష్ణుడు మహాకవిత్వ దీక్షపట్టినవారు ఆ వరుసలో నే విశ్వనాథను జేర్పవలయును. వీరిని గురించి శ్రీ విశ్వనాథవారు 'ఊరికే ఒట్టి పూర్వకవులనికాదు. పద్యరచనా సామ్రాజ్య పట్టభద్రులు. కథాకథనశిల్ప సూత్రాచార్యులు. వేద వేదాంగాది మహా గ్రంథస్థలు. మహావిషయ నిర్ణేతలు. బహువిషయ వ్యాఖ్యాతలు. కావ్య కథాశిల్ప రహస్య వేత్తలు. అనే దృష్టితో ఆపూర్వ కవులను నిలబెట్టుకొంటే నేనూ నిలుస్తాను."[15] అని చెప్పుటలో నాత్మ ప్రత్యయమే కాని యహంకార ప్రకటన ప్రయత్నము లేదు. కారణమిూ లక్షణము లన్నియు నీ రచయితరు పరిపూర్ణముగా నన్వయమగును. ఇదియే శ్రీ విశ్వనాథ స్థానమును నిరూపించును.

కేవలము కవి మార్గదర్శకుడు కాలేడు. ద్రష్టమాత్ర చే మార్గదర్శకత్వము వహింప సమర్థుడగును. ఈ దృష్టితో విశ్వనాథము పరిశీలింపవలసియున్నది.

భారతీయ ధర్మము వేదచోదితము. మోక్షమార్గ గవేషణ లక్ష్యముగా గలది. మన సర్వసాహిత్య మిూ లక్ష్యముతో సృజింప బడినది. 'ఏకం విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి' యను ఛాందోగ్యము నందలి వాక్యమును సాహిత్యపరముగ నన్వయించుకొనవలయును. శ్రుతి స్మృతి పురాణేతిహాసాదులన్నియు నీ లక్ష్యసాధనకయి పరిశ్ర మించుటను నిర్దేశించినవి. ఇతరములన్నియు దెలిసి యీ మార్గము

---

[15] నేనూ - నా సాహిత్య రచనలు - మహతి వ్యాస సంకలనము.

నైనంగనిచో నేదియు తెలియనితనమే మిగులును. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, భవభూత్యాదులు సంస్కృత వాఙ్మయ కుధరమునకు శిఖరములవంటివారు. తెలుగునకూడ నట్టి ఋషికల్పులు గలరు. మార్గదర్శకుని లక్షణము లేవియో శ్రీ విశ్వనాథయే చెప్పియున్నారు. 'ఎవడు భాషద్వారా తన భావ ప్రకటనను స్వతంత్రముగా నొక విలక్షణమయిన మార్గములో చేయగలడో వాడే యొక మార్గదర్శకుడుగా నుండును. దీనిని బట్టి మార్గదర్శకుని లక్షణములు రెండని స్పష్టపడినవి. 1. స్వతంత్రత, 2. విలక్షణత. స్వాతంత్ర్యమెంత ప్రాధాన్యము వహించునో వైలక్షణ్యమంత ప్రాధాన్యమువహించును. ఇవి కలిసిన తెలుగు మహాకవులలో సముడయిన పీఠమధిష్ఠింప సర్వార్హతలు గలిగినవాడు విశ్వనాథసత్యనారాయణ.

మొదటిది తన జీవలక్షణము. ఆ జీవుడు బహుజన్మల వృద్ధుడు. జీవస్వభావము జీవునకు జీవునకు భేదించును మాటయందు, నడకయందు, పలుకులందు, పద సంయోజనమందు, వైలక్ష్యము ప్రతి మహాకవిలోను గోచరించును. అనంతరము దృవించిన యొక యుత్తమ జీవగత శరీరమందు ఇవి యన్నియుగాని, కొన్నిగాని, సన్నికర్షము గావచ్చును. కాని వీనన్నిటిని పెకల్చుకొని తనదియైన యొక యాత్మగుణము పెల్లుబుకును. అది స్వతంత్రత. అనంతరచర్యలన్నియు నా స్వతంత్రత ననుసంధించుకొని వైలక్షణ్యము వ్యక్తమగును. కావ్యగతమైనచో నడి శైలి, ఇతివృత్తము, వ్యంగ్యమర్యాద, సమాస గ్రథనము- వీనిలో నేవియైనను, నన్నియునైనను విలక్షణతకు ప్రతీక లే యగును. ఆ గుణము ప్రకటీకృతమగుట ముఖ్యముగాని యే భాగమున స్పందించినదనుట ప్రధానముకాదు. ఏవంగుణవిశేషణ విశిష్టుడైనచో నాతడు ద్రష్ట, మార్గదర్శకుడు, మహర్షి, మహాకవి. లేనిచో కవిశబ్దవాచ్యుడు.

ఇట్టి మహత్తరమయిన యంతర్దృష్టిత్వము కలిగి మహా కావ్యములు సృష్టిచేయు శక్తిగలవారే నవి స్థిరమయి, శాశ్వతమయిన యశము కల్గించును. ద్రష్టయును, స్రష్టయునైన వారి ప్రతిభను గురించి ప్రత్యేకముగా చెప్పబని లేదు. కాని శ్రీ విశ్వనాథుని విషయమున దీనిని మరికొంత వివరింప వలసియున్నది. ఈయన గాఢ ప్రతిభుడు. అనగా నవి నిత్యప్రత్యగ్రము, తీక్ష్ణ భావావేశ స్ఫురితమయి ప్రతిక్షణ జాగరణా సమేతముగా నుండును. అదృష్ట ఫలము వంటి పెక్కుర ప్రతిభ లోకమున నానా మహాకవులు జీవితములో నియమిత కాలములో మాత్రమే భాసించి యంతర్హితమగును. అది యొక హేమ శలాక నుపమించు నిరమ్మదీయము. ఆ కాలమున వాడు పట్టినది బంగారము. ముట్టినది మాణిక్యము. కవులయినచో నా కాలమున తమ రచనచే లబ్ధ ప్రతిష్ఠులగుట, విశేష సమ్మాన సంభావితులగుట, జరుగును. ఇది ప్రపంచ రహస్యము. ఒక నేలకు పరిమితమయినది కాదు. షెల్లీ తన యిరువది యారవయేడు వరకు మహా ప్రతిభావంతుడయిన కవి. అనంతర కాలములో నీ మహాకవి లేఖిని నుండి వెల్వడిన గొప్ప రచన లేదు. అట్లే మరియొక పదియేండ్ల కాలము వరకు అనగా ముప్పదియారు సంవత్సరముల వరకు ప్రతిభావంతునిగా జీవించెను. బైరన్ కవి ముప్పదినాలుగు సంవత్సరములు దనుక సత్త్వపు సారస్వత ద్రష్టయయ్యెను. జీవితాంతము వారికట్టి యోగము కల్గకుండుటకు వారికి నిత్య ప్రత్యగ్రమయిన గాఢతర ప్రతిభ లేకుండుటయే హేతువని చెప్పవచ్చును.

కాని శ్రీ విశ్వనాథ ప్రతిభ పై విషయమునకు విపర్యయము. అది జీవితాంతమాయనతో ప్రయాణించినది. ఇది ఒక్క శ్రీనాథ మహాకవికి మాత్రమున్నట్లు "దివిజ కవి వరుల గుండియల్ దిగ్గు రనగ, నరుగు చున్నాడు శ్రీనాథు డమర పురికి" అను చాటువు వలన

తెలియుచున్నది. శ్రీ విశ్వనాథుడు సారస్వత షష్టిపూర్తిగావించు కొన్న మహామనీషి. అదృష్టశాలి. జీవితమునందు షష్టిపూర్తియే పరమాదృష్టముగ భావించెడి ఈ కాలమున సాహిత్యమునందు అరువదేడుల కృషి యొనర్చిన యదృష్టమును పేర్కొనుటకు సరస్వతి ప్రసన్నము కావలెను. ఆయన రచనలో నది పద్యమయినను, గద్యమయినను, ప్రప్రథమముగా వ్రాయబడినను కట్టి జిగి, బిగి, సౌకుమార్యము, శైలి కలిగి యుండెనో అట్టి లక్షణములు జీవితాంతమాయన గావించిన రచనలందు ప్రతిబింబించినవి. గాఢ ప్రతిభయన నిట్టిది. ఆయన ఒకచోట చెప్పిన మాటలు

> "నాలో పరిణామం లేదు. నా మొదటి రచన
> యైన 'భగ్నిష్టయోగి' కావ్యములోని పద్యాలెట్టివో
> 'రామాయణ కల్ప వృక్షము'లోని పద్యాలట్టివే.
> అంతమ భావాలు మారడానికి వీలు లేదు."

ఐనా నా మెఱుపు ప్రతి రచనలోను కొన్ని యెడల ప్రకాశముగను, కొన్ని యెడల గూఢముగను ప్రకాశించు చంద్రునివలె నుండును. ప్రతిభ లేనిదే పద్యము లేదు. పద్యము ప్రతిభా సముత్థితము. ఇది ప్రభాకరునకు, ప్రభకు గల యనన్యత వంటిది.

దీనిని మన మీ రచయిత యాలోచన యందును, రచనా బంధము నందును, తదావిష్కరణము నందును గమనింపనగును.

కవిత్వము ఛందోబద్ధమయిన రచనయయి, ఆలోచనకు, బుద్ధివ్యాపారమునకు సహకరించి యానంద సత్యముల యైక్యతను నాపాదించు వినూత్న కల్పన మని డా॥ జాన్సను మహాశయుని యభిసంధి. మన భారతీయాలంకారికులకు సన్నిహితమయిన యభిప్రాయమిది. సత్కవిత్వ మంతయు స్వచ్ఛంద మగు మనశ్శక్తుల స్వచ్ఛంద

విజృంభణమే యని సత్కవితా లక్షణమును 'వర్డ్సు వర్తు' మహాకవి నిర్వచించెను. మహాకవి యగువాడు తీవ్ర భావావేశమునకు వలికి దాని యుద్వేగమునకు లోనుగాక ప్రశాంతమయిన మనస్సుతో నా భావముల కక్షర రూపము కల్గించునని 'మేద్యూ ఆర్నాల్డు' పలికిన యభిప్రాయము వంటిదే మన యాలంకారిక సిద్ధాంత ప్రవక్తయగు రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో చెప్పెను. ఈయన కవితా విర్భావమునకు భావయిత్రి ప్రయోజనకారి. కవికి మాత్రము భావయిత్రి, కారయిత్రి రెండును సహకరింప వలయును. భావన మాత్ర పరిధిలో కవి యున్నచో నది హృద్గత మగును. అది యను భూతి కావలెను. పరిపక్వమయిన యనుభూతి మాత్రమే భావా విష్కరణము ప్రశాంత సమయమున నక్షర రూపమును సంతరింప చేయును. ఇప్పుడు భావుకునకు ద్రష్టృత్వము, కారకునకు స్రష్టృత్వము సమన్వయమగును. ఈ రెండు శక్తులును నిత్యనూతనముగను, పదనుగను, నదనుగను నున్నచో నాతడు మహాద్రష్ట, మహాస్రష్ట యగును. భావపుష్టి యధికమయి, వ్యక్తీకరించు నైపుణ్యము సము త్తాలమై, వలసిన సముచిత పదజాలము వెన్వెంట తరుముకొని వచ్చుచో నాతడు చేసిన రచనము మహాకవిత్వ విద్యా రహస్య గర్భిత మగును. ఇదియే 'ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోఽను ధావతి' యను వాక్యమునకు వాఖ్యానమగును.

అదియునుంగాక మహాకవికి గల యుపాధులు నాలుగు. ఆ చతురుపాధులను చతురముగా నిర్వహించిననే వానియందీ 'మహా' శబ్ద మన్వయించును. అవి

1) అనుభూతి (Experience) 2) పరిశీలనము (Observation) 3) సమాచారము (Imformation) 4) ఊహాశాలిత (Imagination)

1. అనుభూతి :-

లోకమునకు 'లోచనాత్ లోకః' యని వ్యుత్పత్తి. చూడ బడెడిది లోకము. సర్వప్రాణులకు వీక్షణ శక్తి యున్నది. జంతువులు సయితము లోకమును వీక్షించి యానందించును. అవి చేష్టాదులచే భావ ప్రకటనము చేయ గలుగునే కాని వాని కక్షర రూపము కల్గించు విజ్ఞాన వికాసములు భగవంతుడు కల్గింపలేదు. బుద్ధి జీవులందు శ్రేష్ఠుడైన మానవునకాయవకాశ మున్నది. భావింప గలడు. ఆ భావన కక్షర రూపమును కల్గింపను గలడు. అయ్యును ననేక మానవులలో భావింప గలిగిన వారి సంఖ్య అల్పము. ఆ భావన చేసి యనుభూతిని పదిల పఱచుకొను వారి సంఖ్య యత్యల్పము. ఆ పరిపూర్ణ భావమును ప్రశాంత చిత్తులై వాగ్రూపమున వ్యక్తము చేయు వారి సంఖ్య కోటికొక్కటి. అట్టి మహత్తరమయిన బుద్ధి వ్యాపారమును మహోత్తాలముగా చేయ గలిగిన కవి మహాకవి యగును. ఒకానొక ప్రతిభాశాలి యయిన మహాకవి లోకమును దర్శించి యా దర్శనము ననవరతమును భావన చేసి తద్భావము నంతస్సన్నిధి యందు పదిల పఱచుకొని యాత్మ సాక్షాత్కారము నొందిన మహాయోగి వలె దాని ననుభూతిగ మలచుకొనుచు. అంత నాతడు లోక సంగ్రహార్థమయి స్వార్థరహితుడై, తదనుభూతికి వాగ్రూప మొసంగును. నన్నయాది మహాకవుల విషయ మటుంచి పింగళి సూరన యీ పద్ధతిని వశమొనరించుకొనెను. ఆచట వస్తువు ప్రధానము కాక భావము ప్రధానమయ్యెడు. ఆ భావన కా రచన నికషోపలము. అట్లే శ్రీ విశ్వనాథ రామాయణము. అది యథా వాల్మీకమయినచో నాయన యనుభూతి యేమియు లేదు. అనంతమయిన భావన చేత నాయన పాత్రల మన స్తత్వమును తన ప్రతిభతో పరిశీలించెను. దానిని స్వాయముగా ననుభవమునకు తెచ్చుకొని యా సన్నివేశములను చిత్రీ

కరించెను. అరణ్య కాండములోని రాక్షస వధా సన్నివేశమున ప్రతి నాతుసజీవుని యరిషడ్వర్గ వేదనను వర్ణించుట సామాన్యపు టనుభూతి-జనితము కాదు. అష్టైకైక, కాలపాత్ర చిత్రణము కూడ దీని కుదాహరణములై యున్నవి. పురాణవైర నవలలోని అనేక సన్ని-వేశములను కూడ నుదాహరించ వచ్చును.

2. **పరిశీలనము :-**

ఈ మహాకవియొక్క జగత్పరిశీలనము మిక్కిలి లోతైనది. తాను పరిశీలించిన ప్రతి విషయము తన మనఃకుహరము నందు నిక్షిప్త మొనర్చుకొనును. మరియు నాటి నా యనుభవమును, పరిశీలనమును తన రచన ద్వారమున వెల్లడించును. ఇది నెమరు వేయు జంతు స్వభావమును బోలినట్టిది. తాను బాల్యమున నేటిని దాటవలసి వచ్చిన సన్నివేశమును కల్పవృక్షమున సుమాలి గంగా తరణమున ప్రతిబింబింప జేసెను. "పులిముగ్గు" నవల యందు పులిమాసిన శ్రీముఖుడు యేటి ప్రవాహమును దాటు సన్నివేశమును గూడ నిది-భాసించును. చిన్నతనమున తన తండ్రి స్వగ్రామములోని నందమూరి వేణుగోపాలస్వామివారియాలయ జీర్ణోద్ధార కార్యక్రమమును మనసున పదిల పఱచుకొని దానిని "వేయిపడగలు" నవలలో స్వామి ప్రతిష్ఠా మహోత్సవములను వర్ణించు పట్టున నుపయోగించెను. ఇట్లు కావ్యములందును, తదితర రచనము లందును తన పరిశీలనమునకు-వచ్చిన యంశములను సన్నివేశాను గుణముగా పొందుపఱచి తత్పరిశీలనమును సార్థక మొనర్చెను. విశ్వనాథ పంచశతి, వరలక్ష్మీ త్రిశతు లందు వర్ణింపబడిన పర్వవిషయము లాయన పరిశీలన జన్యములే యని చెప్ప వచ్చును. మానవుని ప్రలోభము లల్పాల్పా, బాధ్యములు 'విశ్వనాథ మధ్యాక్కఱ' లందు పరిశీలింప బడిన విధము నరసినచో నాయన పరిశీలన మెంత సునిశితమో తెలియ-గలము.

౩. సమాచారము :-

అతివేలమయిన లోక పరిశీలనము, బహుశాస్త్రకావ్య పరిశోధనము నిత్య ప్రత్యక్షముగానున్న మహాకవి రచన యందనంత మయిన సమాచారముండును. పాఠకునకు గాని, ఆ సన్నివేశమునకు గాని తానొసంగు సమాచార మంతయు నావశ్యకము గాక పోవచ్చును. 'అనంతమయిన విషయములు చొప్పించి వ్రాస్తాను కనుక' అని శ్రీ విశ్వనాథ తన రచన గుఱించి ప్రసంగించుట లోని ప్రత్యయమిదియే. అశ్వమేధమను నవలలో మైరేయ పాన ప్రసక్తి గల సన్నివేశమును చమత్కారముగా బెంచి మైరేయ నామముల నన్నింటిలో పాఠకులకు పరిచయము గావించినాడు. 'పులిముగ్గు', అను నవలయందు ప్రాణము పోవు విధమును గుఱించి ప్రసంగించు సన్నివేశమున నా ప్రభువయిన సుశర్మ పాత్ర ముఖమున వివిధ శాస్త్రములు వానిలో నీ ప్రాణోత్క్రమణ విధానమును గుఱించి చెప్పబడిన విషయమును పాఠకుల కెఱింగించినాడు. తానుద్ఘాటింప దలచిన విషయమున కనేకములయిన యుపపత్తులను క్రోడీకరించి తన సర్వతోముఖ విజ్ఞానమును ప్రకటించు నైపుణ్యమాయనకు కరతలామలకము. 'చెలియలికట్ట'లో 'ద్వీపవతి' యను పదమునకు వివరణము వ్యాకరణ శాస్త్ర విషయముగా ప్రసంగించును. 'రురుచరిత్ర' కావ్యము నందు వివిధ జంతువుల మనస్తత్త్వ పరిశీలనము గూడ నిట్టిదియే. పురాణ వైరములో 'నాగసేనుడు' అను నవలలో నార్థిక శాస్త్ర విషయము ప్రసంగింపబడినది. ఆయన నవల లందొసంగిన సమాచారమును గుఱించి ఆయనయే ఇట్లు చెప్పెను.

> "వాడు శ్రమ లేకుండా నా నవలలు చదివి మనోజ్ఞానమును సంపాదించవచ్చు — — వాళ్ల శాస్త్రాల (పాశ్చాత్యుల) లోని మహావిషయాలన్నీ ఉంటవి.

వృక్షశాస్త్రము. పశుశాస్త్రము చివరకు 'మనీ' మారకం 'MONEY'-అవసరమయితే ఇది ఉంటుంది అది ఉండదని ఉండదు, ఇటు చూస్తే వేదాలు. ఉపనిషత్తులు, భాష్యాలు, తర్కాలు, వ్యాకరణాలు-అటుచూస్తే పాశ్చాత్య విజ్ఞానములో నేను నిద్రాహారాలు లేకుండా సంపాదించిన విజ్ఞానమంతా నా నవలలలో, పుస్తకాలలో ఉంటుంది."

ఇది ప్రత్యక్షర సత్యమని వారు రచించిన గ్రంథములను పరిశీలించిన యవగతమగుట తెల్లము.

4. ఊహాశాలిత :-

ప్రతిభా సమన్వితుడయిన కవి లోకోత్తరమయిన యూహాచే పాఠకులను రంజింప చేయు శక్తి కలిగియుండును. 'ఝాన్సీరాణీ' కావ్యమున ధర్మమునకు ప్రమాదము సంభవించినది. దేశ స్వాతంత్ర్యమునకై పోరాడి ఝాన్సీలక్ష్మీబాయి తన యనుయాయుల కుట్ర వలన సంహరింపబడినది. దీనిని కావ్యమున నట్లే చెప్పినచో ధర్మమునకు చ్యుతి చెప్పినట్లే యగును. మహా ప్రతిభావంతుడైన శ్రీ విశ్వనాథ కాలమహిమచే నిట్టి దురవస్థ సంఘటిల్లినదని యూహా చేసి కావ్యము రచించినాడు. ఇది లోకోత్తరమయిన యూహకు నిదర్శనము.

పురాణవైర గ్రంథమాలలోని పన్నెండు నవలలలో వచ్చెడి ప్రతి నాయకపాత్రయగు జయద్రధుని పాత్ర శ్రీ విశ్వనాథ యూహాశాలితకు ప్రబల నిదర్శనము. ఆ ప్రణాళికయే యొక లోకోత్తరమయిన ప్రణాళిక.

మహాకవులయిన వారు తమకు తామే విమర్శకులును రచయితలును నగుదురు. కాళిదాస మహాకవి 'మేఘసందేశ' కావ్య

మున 'ధూమజ్యోతి స్సలిల మరుతాం' అను శ్లోకమును వ్రాసెను. ఇందు కవి యొక్క విమర్శయున్నది. సమాధానమున్నది. కేవలము ధూమము, జ్యోతి, సలిలము, మారుతము—వీని సన్నికర్షముచే నొనగూడిన మేఘము వార్తాహరణ కార్యము నిర్వర్తింప గలదా ! యని ప్రశ్న. ఇది పాఠకుని సందేహము. ఇక్కడ కవియే విమర్శకుని బాధ్యతను స్వీకరించి యా ప్రశ్నకు తన యూహచే సమర్థించి సమాధానము వ్రాసెను. 'కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనా చేతనేషు' కామార్తుడైన యక్షుడు నాయకుడు. భార్యా విరహము మనసును క్షుభిత మొనర్చు చున్నది. కనీసము సందేశమైనను పంప వలెను. అట్టి వానికి నిర్వర్తింప గలదా ! లేదా ! అను వివేచన గలుగదు. సందేశమును బంపుట యీ కారణముచే సమర్థనీయ మని కవి సమాధానము. అట్లే శ్రీ విశ్వనాథయు పురాణవైర నవలలలోని అశ్వమేధమునందు హింసా ప్రసక్తిని సమన్వయము చేయు సన్నివేశము నుదాహరింప వచ్చును. ఈ ప్రశ్నానుగత మయిన భావముల పాఠకునకు గిలిగింతలు పెట్టును. అనంతర మీ పాఠకుని రూపము మారి మహా మేధావి రూపమును ధరించును. ఆ విమర్శను తగు సమీర్థతతో సోపపత్తికముగా నెమరువేయును. సమన్వయ విధానమును రూపొందించును. ఇట్టివి సంవిధానమును తన లక్ష్యమును నెరవేర్చు కొనుటకుపయోగించును

## "కవీనాంకవిః"

శ్రీ విశ్వనాథ కవులకు కవి యగును. అల్ప సంస్కారులకు, కుసంస్కారులకు నాయన కవిత్వము, నాయన వ్యక్తిత్వ మవబోధము కాదు. కవులయిన వారు ముందుగా వారి నర్థము చేసి కొని, తత్సంస్కార సమీచీనులయి వారి సాహిత్యము నందున్న మెఱుపును కైవసము గావించుకొను యత్న మాచరింప వలయును.

అప్పుడు తత్సాహిత్య సేవ యె నర్చనలయిను. శ్రీ విశ్వనాథ దర్శన మవగతము కాగల స్థితి యప్పుడు లభించును. భారతీయ సంస్కారము, సంప్రదాయము. అర్ష విజ్ఞానము వీనియందభినివేశము కలిగిననే గాని శ్రీ విశ్వనాథ తత్త్వములోని యాదార్థ్యము గోచరము కాదు. ఒక్కమాటలో శ్రీ విశ్వనాథ దర్శనమిది.

"ఎంత సముద్రము మీద ఎగిరినను పక్షి రాత్రికి
గూటికి చేరును, ఇది జాతీయత.
ఇది సంప్రదాయము."

దీనిని పరిరక్షించుకొను యత్నము, దాని యాదార్థ్యమునందు ప్రాధాన్యము, విశ్వాసమున్ననో శ్రీ విశ్వనాథ రచన లర్థవంతములు. సాహిత్య లక్ష్య మార్గోపదేష్టలు. కనుకనే శ్రీ విశ్వనాథ దేశికుడు. కవులకు కవి. శ్రీ విశ్వనాథ దర్శనములోని యాయుఃస్థానమిదియే.

ఇట్లు శ్రీ విశ్వనాథ అంతర్ద్రష్టగను, మహా సారస్వత స్రష్టగను నాధునికాంధ్ర సాహిత్యము నందు విశిష్టమయిన స్థానము నందిన యశః కాయుడు.

# 3. పురాణములు

'ధర్మార్థ కామమోక్షములు చతుర్విధ పురుషార్థములు.' పురుషార్థములన పురుషులచే గోరబడునవి. ధర్మాచరణము చిత్తనైర్మల్యము నకును, నర్థార్జనము దేవతా సమారాధనమునకును, కామ రూపమయిన విషయ సంగము జీవన మాత్రమునకును వినియోగించుకొని భారతీయులు చతుర్థమయిన మోక్షము నవలీలగ కైవసము గావించుకొనినట్లు పురాణేతిహాసములు నుడువును.

వేదములు ప్రభు శాసనములు, "స్వర్గకామో యజేత, స్వాధ్యాయోఽధ్యేతవ్యః" ఇత్యాది విధి వాక్యములు వేదమందు ప్రవచింపబడినవి. పురాణములందీ వాక్యములు విస్తరమాత్రములయి మిత్రహితమువలె జనులను ధర్మాసక్తులగ నానర్చి ప్రధానఫలమయిన ముక్తితో నానుషంగిక ఫలమయిన కామాది విషయ సుఖసేవనమును ప్రసాదించినవి. కావుననే వేదముల కున్నట్టి పావిత్ర్యము, ప్రాచీనత, సత్య ప్రతిపత్తి పురాణములకుగూడ చెప్పనగును. వేదము లపౌరుషేయములు, పురాణములు విరాడ్రూపము, సృష్టిస్థితి ధ్వంసాది కార్య నిర్వహణాత్మకమైన పరతత్త్వ ప్రతిపాదనము నేకైక లక్ష్యముగా గొని మహర్షులచే విస్తరింపబడినవి.

పురాణ వాఙ్మయమును క్షోదక్షమముగా బరిశోధించిన పండితులు పురాణములను గురించి విభిన్నమైన యభిప్రాయములను వ్యక్తీకరించిరి.

పార్జితరు Pargiter [1] హిందువులకు పురాణములనునవి తాత్త్విక, మత, చారిత్రక, వైయుక్తిక, సాంఘిక, రాజకీయమయిన విజ్ఞాన సర్వస్వమని భావించెను.

1. Encyclopaedia of Religion and Ethiks Edited by Hastings

ఏ. డి. పుసాల్కరు మహాశయుడు రామాయణ మహాభారతము లెట్లు నిత్య సన్నిహితములయి మానవుని ధర్మ జీవనమునకు ప్రబోధాత్మకమయిన సాహిత్యముగ నుండెనో, యట్లే పురాణములును మానవుని రాజన్మాంతము సర్వవిషయములందు మార్గదర్శకత్వము వహించెడి యపూర్వ సర్వసమగ్ర విజ్ఞాన సర్వస్వముగ రూపొందింపబడినట్లు పెక్కురు విద్వాంసులు భావించిరని తెలిపెను.[2]

అఖిల భారత దశను ప్రాచ్య విద్వత్సభ కగ్రాసనాధిపతియైన పండిత మదనమోహన మాలవియా పురాణములను నూత్న దృక్పథముతో నధ్యయనము గావింప వలసిన తరుణ మాసన్నమయినదని హెచ్చరించెను.[3]

మిగిలిన యంశముల కంటె ప్రాచ్య పాశ్చాత్య పరిశోధకులకు చరిత్రాంశముల పయి దృష్టి పడినది. ప్రాచీన భారతదేశ చరిత్రకు సంబంధించి నేటికిని పరమ ప్రమాణ గ్రంథములుగ చరిత్రకారులు పురాణములను గ్రహించుటయే దీనికి హేతువు. రాజవంశముల చరిత్ర యొక పురాణ లక్షణము. విలియం జోన్సు విష్ణుపురాణమున కనువాద కర్త. పార్జితరు కలియుగ రాజవంశముల చరిత్ర యందు తీవ్ర కృషి యొనర్చెను. స్మిత్ మత్స్యపురాణము నందీయబడిన రాజవంశముల చరిత్ర పయి యాధారపడి ప్రాచీన చరిత్ర గ్రంథమును రచించెను. (Early History of India V. A. Smith) వీరి ననుసరించి కొందఱు భారతీయ చరిత్రకారులు పురాణములలోని భారతదేశ చరిత్రను నిర్మించుటకు విస్తృత కృషి సల్పిరి. వీరిలో రాప్సన్,

---

2. Studies in Epics and Puranas, A. D. Pusalkar, Bhavans publication Introduction Page VII.

3. 10th All India Oriental Conference. Proceedings Page 234—Tirupathi.

జయస్వాలు, భండార్కర్, రాయచౌధురి, ప్రధాన్, రంగాచార్య అల్టేకర్, జయచంద్ర ప్రభృతులీ రంగమునందు గణుతికెక్కిరి, ఇట్లు పురాణము భారత ప్రాచీన సంస్కృతియందును, ప్రాచీన చరిత్ర నిర్మాణమునందు, నవశ్యము స్వీకరింప వలసిన యొక ప్రమాణమయినది.

**పురాణములు - లక్షణములు :**

అమరకోశకర్త పురాణములకు సర్గము ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితమను పంచ లక్షణములను పేర్కొనెను.[4] ఇందలి శ్లోకము మత్స్య పురాణ మందును గలదు.[5] మహాపురాణముల లోనొకటిగా పేర్కొనబడెడు భాగవతము పది లక్షణములను పేర్కొనుచున్నది. ఇందు సర్గాదులతో వృత్తి, (జీవన విధానము) రక్ష, (భగవదవతారములు) ముక్తి, (జీవుని యంతిమ గమ్యము) సంస్థా హేతువు. (సృష్టి రహస్యము) అపాశ్రయము, (పరతత్వ విషయము) అను లక్షణము లనుసంధింపబడినవి.[6] ఈ యను బంధము పరబ్రహ్మానుసంధాన దృష్టితో బ్రతిపాదించి నట్లు పరిశీలించిన తోచును. సంసారాధ్వ నివృత్తుడయిన జీవుడు స్వస్వరూపాను సంధా

---

4. సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణిచ ।
వంశానుచరితం చేతి లక్షణానాంతు పంచకమ్॥ అమరకోశము_
వాగ్వర్గము _ శ్లోకము 5.

5. మత్స్యపురాణము, అధ్యాయము 54 _ 64వ శ్లోకము.

6. సర్గో ప్యాథ విసర్గశ్చ వృత్తి రక్షాంతరాణిచ ।
వంశో వంశాను చరితం సంస్థా హేతు రపాశ్రయ ॥ 9
దశభిర్లక్షణై ర్యుక్తం పురాణం తద్విదో విదుః ।
కేచిత్పంచ విధం బ్రహ్మన్ మహదల్ప వ్యవస్థయా ॥ 10
భాగవతము 11 _ 7 అధ్యాయం—

నము గావించుకొని, (ఆత్మ సాక్షాత్కారము) పరమాత్మను జేరు ననుట భాగవత మతము. బ్రహ్మవైవర్త పురాణము పంచ లక్షణము లుపపురాణముల కన్వయమగునని మహాపురాణములకు దశాధిక లక్షణములను పేర్కొనెను. అవి సృష్టి, విసృష్టి. జగత్పాలనము, కర్మవాసన, మన్వ్రపకాశ క్రమము, ప్రళయ వర్ణనము, మోక్ష నిరూపణము, హరినామ సంకీర్తనము, వివిధ దేవతల విశిష్ట గుణ వర్ణనము మహాపురాణ లక్షణములని నిర్వచించెను. [7] మత్స్య పురాణములో నీ పంచ లక్షణములేగాక బ్రహ్మ, విష్ణు, సూర్య రుద్రాదుల మాహాత్మ్యములు, భువన విస్తార, సంహార ప్రధానములు. పురుషార్థ సాధనములు, సాధన వైముఖ్యము వలన గలుగు వ్యత్యయ ములు, దాన ధర్మాది విధులు, వర్ణాశ్రమ ధర్మాదులును పురాణము లందు ప్రవచింప బడునవి ప్రతిపాదింపబడినవి. [8] వీనిని బట్టి ప్రాచీనత యొక్కటియే సర్వప్రధానమయిన పురాణలక్షణమని చెప్పనగును. పది లక్షణములు చెప్పినను, నంతకంటె నెక్కుడు చెప్పినను నవి యన్నియు ప్రధానమైన పంచలక్షణములంతటి ప్రాముఖ్యము వహింపజా పోవచ్చును. మిగిలిన వానిని లక్షణములనుట కంటె విషయ సూచిక

7. బ్రహ్మవైవర్త పురాణము. శ్రీకృష్ణ జన్మ ఖండము
అధ్యాయము.- 132

8. బ్రహ్మ విష్ణ్వర్క రుద్రాణాం మాహాత్మ్యం భువనస్యచ ।
ససంహార ప్రదానాంచ పురాణే పంచవర్ణకే ॥
ధర్మశ్చార్థశ్చ కామశ్చ మోక్షశ్చైవాత్ర కీర్త్యతే ।
సర్వేష్వపి పురాణేషు తద్విరుద్ధంచ యత్ఫలమ్ ॥
మత్స్య పురాణము 53 అధ్యాయము - 66, 67 శ్లోకములు

లనుట సమంజసము. "పురాణములు మానవ జీవితమం దుత్త మాదర్శమును స్వాంగము లందును ప్రతిఫలింప జేయును" అను హరప్రసాదు వాక్యము మాత్రము తప్పక స్వీకరింప దగినది.[9]

ఇట్లు పురాణములు నిర్వచింప బడుటలో ననేకాభిప్రాయములు ప్రవృత్త మయినవి. పంచ లక్షణములు, దశ లక్షణములు కూడ పురాణ ములకు సమన్వయించుచో నతివ్యాప్తి, అవ్యాప్తి దోషములు పట్టి తీరును. కేవలమీ లక్షణములకే పరిమిత మయినచో వీని విజ్ఞాన సర్వస్వములుగ పేర్కొన బనిలేదు కాని యున్నంతలో నిట్టి పరిశ్రమ యుత్తరోత్తర పరిశోధకులకు భూమికగ నుపయోగ పడుననుటలో నెట్టి సందియము లేదు. స్థూలముగ పంచ లక్షణ ప్రమాణము సర్వత్ర పరిగ్రాహ్యముగ నుండుట చేతను, నా యీ పరిశోధనకు రాజవంశ ముల చరిత్ర పంచ లక్షణములలో నొకటి యగుట చేతను, పంచ లక్షణములు మాత్రమే క్రమముగా విశదీకరింప బడుచున్నవి.

పంచ లక్షణములు : 1) సృష్టి, 2) ప్రతిసృష్టి. 3) మనువు, 4) మన్వంతరము, 5) పూర్వ రాజుల చరిత్రము. (వంశానుచరితము)

1. సృష్టి (సర్గము) :- ఇది జగత్తు యొక్క ప్రాగవస్థా నిరూ పణము. దీనిని సృష్టియని పేర్కొందురు 'సృజ్యతే అనేన ఇతి సర్గః' అని పురాణములలో పేర్కొనబడిన సర్గపదమునకు వ్యుత్పత్తి. సృజింప బడుటయే సర్గము.

పురాణము లందతి ప్రాచీనమని విశ్వసింప బడుచున్న విష్ణు పురాణమునందు నవవిధ సృష్టులు పేర్కొనబడెను. వైకృత సృష్టులెదు

9. Journal of Bihar Orissa Research Society.-Patna XIV Page 329

ప్రాకృత సృష్టులు మూడు, ఒక కౌమార సృష్టితో నవవిధ సృష్టులు జగదాకారముచే నుత్పన్నమయినది వైకృతి సృష్టి. ప్రకృతి జన్యమయినది ప్రాకృత సృష్టి. అనంతరము కౌమార సృష్టి[10] ఈ పురాణమునందు చెప్పబడిన వైకృత సృష్టి యిట్లున్నది. స్వయం వ్యక్తమయిన బ్రహ్మము తానే పురుష, ప్రధాన, కాలము లనునట్లు త్రిధా విభాజ్యమయ్యెను. కాలము పురుష ప్రధానుల నావేశించును. ప్రధానుని వలన మహత్తు కలుగును. మహత్తు అహంకారమును సృజించును. ఇప్పుడు పురుష, ప్రధాన, కాల, మహదహంకార పంచకము సృష్టికి హేతువగుచున్నది. ఇవియే పంచతన్మాత్రలు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, మనస్సు, పంచభూతములు, వీనితో రజోగుణానిష్టుడయిన బ్రహ్మ జీవులను సృజింప విష్ణు శబ్దవాచ్యుడీ జీవులను, నేతల్లోకములను భద్రము చేయును. తమోగుణాశ్రితుడయిన రుద్రుడు తమస్సుచే విశ్వవినాశ మొనర్చును.

2. మత్స్య పురాణము :- విష్ణు పురాణము తరువాత నంతటి ప్రాధాన్యము వహించునది మత్స్య పురాణము, అందు సృష్టిక్రమ మిట్లు వ్యక్తమయ్యెను. బ్రహ్మచే నానుపూర్వియయిన శ్రుతులు స్మృతికి దెచ్చుకొనబడి తద్ జ్ఞానావిష్టుడయి చతుర్ముఖుడు తన యపూర్వధిషణచే పదిమంది మహర్షులను సృజించెను. వీరే బ్రహ్మ మానసపుత్రులు, మరీచి, అత్రి, అంగిరుడు, పులహుడు, పులస్త్యుడు, క్రతువు, ప్రచేతుడు, భృగువు, వశిష్ఠుడు, నారదులనువారు. బ్రహ్మ సర్వావయవముల నుండి దక్షుడు మొదలు మాయ వరకు నీవిధముగా

---

10) పంచైతే వైకృతాస్సర్గాః ప్రాకృతాస్తు త్రయస్స్మృతాః॥
ప్రాకృతో వైకృతశ్చైవ కౌమారో నవమస్స్మృతః।
ఇత్యేతే వై సమాఖ్యాతా నవసర్గాః ప్రజాపతే।
విష్ణు పురాణము 1-5-24, 25.

నుత్పన్నమయిరి. బొటన్రవేలినుండి దక్షుడు, ఉరమునుండి ధర్మము, హృదినుండి మన్మథుడు, కనుబొమలనుండి క్రోధము, పెదవులనుండి యోగాశ, మేధనుండి మాయజనించెను. పంచభూతములు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు, శబ్ద స్పర్శ రూప రస గంధాది గుణములు, మనోబుద్ధ్యహంకారాది మిశ్రిత మయిన జీవుడు జనించిరి. నలువకీ సృష్టి తృప్తి నందింపలేదు. శతరూప, సావిత్రి, సరస్వతి, బ్రహ్మాణీత్యాది నామ సంభావ్య యగు గాయత్రిని సృజించెను. ఈమె బ్రహ్మ శరీరాంగముల నుండి జనించిన యపూర్వ సౌందర్య సమున్వేత. ఆమెను బ్రహ్మ కామించెను. శతసంవత్సరములు పద్మోద్భవుడు పద్మాంతర మున నర్ధాంగిగా నొనర్చుకొని సుఖలీలందేలెను, కొంతకాలమునకు స్వాయంభువ మనువయ్యాది దంపతులకు జనించెను. ఇది మత్స్య పురాణము నందలి సృష్టి క్రమము. [11]

౪. బ్రహ్మాండ పురాణము :- బ్రహ్మాండ పురాణమున బ్రహ్మ నాలుగు విభాగము లయ్యెననియు, నాలుగు విభాగములనుండి చతుర్విధ జీవులను సృజించె ననియు కలదు. అసురులు, దేవతలు, పితరులు, మనుష్యులే యీ చతుర్విధ జీవులు. అనంతర మన్ని జీవులు, క్రిమి కీటాదులు, ఓషధులు సృజింపబడెను. [12] ఇట్లు చతుర్దశ మనువుల జననమువరకు ప్రథమ సృష్టి కొనసాగినది.

పదునాలుగు మనువుల కాలము బ్రహ్మ కొక యహోరాత్రము. ప్రతి మనువు కాలమున కంతమున నన్యప్రళయములు సంభవించునని పురాణములు పేర్కొన్నవి. ఒక మనువు కాలము 71 మహాయుగ

---

11) మత్స్య పురాణము 3వ అధ్యాయము - ప్రథమ సృష్టి క్రమము.

12) యజుస్సంహిత 4-2-6 లో దేవతల కంటె మూడు యుగముల కు పూర్వమే ఓషధుల యుత్పత్తి యున్నట్లున్నది.
'యా జాతా ఓషధయో దేవేభ్య స్త్రియుగం పురా ।'

ములు. ఈ యనుప్రళయమున ననేక జీవు లుత్పన్నమగును. లోకములు, దేవతావర్గము, ఉత్తమ జీవులు మాత్రము యథాతథముగా నుందురు. మహత్తుల యునికికి సేలేము. ఈ యనుప్రళయాంతమున జరిగిడి సృష్టి ప్రతిసృష్టి లేక ప్రతిసర్గమను పేరుతో వ్యక్తమగును. చతుర్దశ మనువుల కాలము సహస్రమహాయుగ కాలమునకు సమము ఈ సృష్టి నైమిత్తిక సృష్టి.

పురాణములందు సృష్టి క్రమము వేర్వేరుటలో నేకసూత్రత లేదు. కల్పభేదము చేత ననేక మహాప్రళయములు పూర్వమెప్పటి నుండియో యొక సంకేతకాలమునుండి సంభవించి యుండునని భావించుచో నొక్కొక సృష్టి చెప్పబడిన క్రమమొక్కొక పురాణము గ్రథన మొనర్చినట్లు విశ్వసింపవచ్చును. ఇక నైమిత్తికసృష్టి 'ధాతా యథా పూర్వ మకల్పయత్' అను న్యాయము ననుసరించి యీ ప్రతిసృష్టి సంభవించును. ఇందు విరాట్పురుషుని ప్రమేయ ముండదు. ఈ సృష్టిని జెర్కొనుచు పురాణము లొక కథను బేర్కొన్నవి. అది చేప - మనువు కథ. దీనిని శ్రీ విశ్వనాథ తమ 'పురాణవైర' గ్రంథ పీఠిక లందుద్ధరించిరి. క్రైస్తవ మతగ్రంథ మయిన 'బైబిలు' నందు నయిత మీ పోలికలుగల కథ 'నోవాస్ ఆర్క్' అను పేరుతో నున్నట్లు రచయిత పేర్కొనియుండెను.

2. ప్రతిసర్గము :- ఇది ప్రతిసృష్టి. దీనికి సంబంధించిన వృత్తాంతము మనువు - చేప కథతో మొట్టమొదటగా శతపథ బ్రాహ్మణమున సంగ్రహముగా నున్నది ఋగ్వేదమున దీని కంఠరము గోచరించును. కాని యిది ప్రతిసృష్టికి సంబంధించిన మంత్రమే యనుట కట్టి యాధారములును జూపలేము. [13] దీనియందు మత్స్యరూపధరుడయిన

13) 'అయదృహావ వరుణశ్చ నావం ప్రయత్సముద్ర మీర యావ మధ్యమ్,'
ఋక్ 8-77-3-5

భగవానుడు, నౌకవిప్లవము, వరుణదేవుడును గానవత్తురు. ఇది ప్రతి సృష్టికి ప్రతీక గాథ కాకున్నను వేదమునందు సయితము మిట్టి యుపాహ కల్గించు యుద్ధ్యాయ మొకటి కలదనుటకు నిదర్శనమని డా॥ సూర్యకాంత శాస్త్రిగారి పరిశోధనము.[14]

శతపథ బ్రాహ్మణములో నీ ప్రళయ విజ్ఞానము సంగ్రహముగా నెఱిఁగింపబడినది. మఱియు మత్స్య, అగ్ని, పద్మ, విష్ణు, భాగవత, స్కంద, భవిష్య పురాణములందొక కొన్నిట సంగ్రహముగను, కొన్నిట విస్తృతముగను విశదీకరింపబడినవి.[15]

శతపథ బ్రాహ్మణము కంటె పూర్వకాలికమను వాదముతో నేకీభవింపకున్నను, హీబ్రూ బాబిలోనియను లందుగల ప్రతి సృష్టి క్రమమును బరిశీలించినచో నవి యొకదానికొకటి ప్రతికృతులను విశ్వాసము కలిగితీరును, లేదా యీ రెండు గాథలకు వేఱొక్క మాతృక యుండి యుండునను నూహాపోహమును. ఆ మాతృక భారతీయ పురాణములందు బేర్కొనబడిన ప్రతిసృష్టి కథకావచ్చును. బాబిలోనియనులకు సయితము భారతీయుల వలెనే పంచలక్షణ లక్షిత పురాణములు కలిగియుండురని మత్స్య పురాణపరిశోధన గ్రంథము నుదహరించుచు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు పేర్కొనియుండిరి[16]

14) (Flood legend in Sanskrit literature - Dr. Suryakantha Sastry. Introduction P. P. 7 & 8)

15) శతపథ బ్రాహ్మణము 1-8-1; మహాభారతము-వనపర్వము మత్స్యోపాఖ్యానము, అగ్ని పురాణము-1వ అధ్యాయము, పద్మ పురాణము-36వ అధ్యాయము. విష్ణుపురాణము-10వ ఖండము; భాగవతము 8-24. స్కాంద పురాణము-వైష్ణవ ఖండము. భవిష్య పురాణము ప్రతిసర్గ పర్వము 4 అధ్యాయం

16) పురాణ వాఙ్మయము, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం-పేజి 7

సృష్టి పర్వమున భిన్న విధానములు ప్రకటితమయ్యెను, ప్రతిసృష్టి విషయమున మనువు-చేప కథలో ముడివడిన యంశమును ప్రతి పురాణము స్వీకరించి యుండుట గమనార్హము. అతిప్రాచీన నాగరి కత కలిగిన దేశములుగా పేర్కొనబడుచున్న హిబ్రూబాబిలోనియలు కూడ నిట్టి కథ కలిగియుండుటను చూడ మనసారస్వతమునకు గల ప్రాచీనత స్పష్టపడుచున్నది [17] 'ధాతా యథాపూర్వ మకల్పయత్' అను వాక్యము ఈ ప్రతిసృష్టి కథను సత్యమొనర్చుచున్నదనుట నిస్సంశయము.

---

17) హిబ్రూబాబిలోనియనుల ప్రతిసృష్టి గాథలలోని సామ్యములు.

1) జీవనాశ మొనర్చుటకు దైవశక్తులు ముందుగనే నిర్ణయించుకొనును. అందులకు ప్రధాన హేతువుగా జల ప్రళయమును పేర్కొనును.

2) దేవ రహస్యమయిన ఈ వృత్తాంతము భగవంతునిచే నొక యుత్తమ మానవునకు ముందుగనే సూచింపబడును.

3) ఆ దేవుడా మానవునొక నౌకను నిర్మింపుమనును. ఆ నౌకయందా మానవుడు, వాని సంసారము (సర్వజీవ ప్రతీకలు)తో నుపస్థితుడయిననో నాతడు జలప్రళయ క్లిష్ట పరిస్థితిలో తన సహాయముచే రక్షింపగలడని యుప దేశించును.

4) దైవ వచనానుసారమొక యోడనాయుత్తమ జీవి యభేద్యముగా నిర్మించును.

5) జలప్రళయ సంభవసూచన నందుకొని యా మానవుడు తన సంసారముతో దాను నౌక నెక్కును. జలప్రళయములో సర్వము నశించిపోగా నా మహానావ మాత్రము ప్రళయ జల మధ్యమున దైవశక్తిచే సురక్షిత మగును.

3 మనువు :- ఇది పురాణమునకు తృతీయ లక్షణము. ఇది మనువుల చరిత్రము, అమరసింహుడు దీనిని వంశమని వ్యవహరించెను. వంశమనగా దైవిక వంశముల భావము. బ్రహ్మనుండి మనువువరకు దేవతా సంబంధిత సంతతి. మనువునుండి మానవసృష్టి. సాధారణముగా నీ మనువులు పదునలుగురని పురాణములు పేర్కొన్నను, మను శబ్దార్థము మరియొక విధముగ నన్వయింపబడి యనేక మనువులను పురాణములు పేర్కొనుట గమనార్హము. ఆ చరిత్ర యిట సంగ్రహింపబడుచున్నది.

---

6) ఒక పావురము, ఒక కాకి ప్రళయ బీభత్సమును పరికింప నేగును, ఎచటను నిలువ నూత గానక పావురము నౌక చేరును. కాకి గూడు చేరలేదు.

7) నౌక ఒక పర్వతసానువును సమీపించును. ఆ మానవుడు కృతజ్ఞుడై భగవచ్ఛక్తి కంజలించును. ప్రళయరూపమయిన భగవ ద్రౌద్రముపశమించును.

(ఇందు కాకి, పావురముల పర్యాటము నూత్న విషయముగా నున్నది)

(Flood legend in Sanskrit literature - Dr. Suryakantha Sastry, Introduction Page 8)

పర్వత విషయము మహాభారతము నందును గలదు. అందు తుహినగిరి శృంగముగా పేర్కొనబడినది.

ఈ నగంబు శృంగంబున నిపుడు మీరు
గట్టుడీయోడ ననిన నాక్షణమ వారు
నట్లచేసిరి, విను మమ్మహాద్రి శృంగ
మనఘ నౌబంధనంబన నవని బరగె”

ఆంధ్రమహాభారతము - ఆది పర్వము - చతుర్థాశ్వాసము-230 ప

బ్రహ్మపురాణమున, విష్ణువునకు విరాట్టు, విరాట్టునకు శతరూపవలన స్వాయంభువమనువు, ఈతనికి కామ్యవలన వీరుడు, వీరునకు ప్రియవ్రతుడు. ఉత్తానపాదుడు, ప్రియవ్రతునకు ఉత్తమ తామసులు, నుత్తానపాదునకు ధ్రువుడు, కీర్తిమంతుడు, ఆయుష్మంతుడు, వసువులును ధ్రువునకుశ్లిష్టి ఆతనికి రిపువు, రిపునకు చాక్షుసుడు, ఆయనకు నంగుడు, అంగునకు వేనుడు, వేనునకు పృథువు, పృథువున కంతర్ధానుడు, ఆతని హావిర్ధానుడు, హావిర్ధానునకు ప్రాచీన బర్హి మొదలగు వారు, ప్రాచీన బర్హికి ప్రచేతసుడు, ఆతనికి దక్షుడు, దక్షునకు దాక్షాయణి, ఆమెకు వివస్వంతునివలన వైవస్వతుడు, వైవస్వతునకు, సంజ్ఞవలన త్వాష్ట్రిడు సావర్ణివలన సావర్ణిమనువు శనైశ్చరుడు, త్వాష్ట్రినకు యముడు యమి యనువారు కల్గిరి.

ఈ పురాణములో మనువంశమునకు మూలము విష్ణువు. స్వారోచిషుని రైవతుని గురించిన ప్రసక్తి లేదు. ప్రియవ్రతాన్వయమున నిర్వురు, ఉత్తాన పాదాన్వయమున నిర్వురు మనువుల పేళ్లు కలవు, సావర్ణిమనువు వరకు నాల్వురు మాత్రమే పేర్కొనబడిరి. స్వారోచిషరైవతులు గూడ బ్రహ్మాండ పురాణమున ప్రియవ్రతాన్వయమున నే చెప్పబడిరి.[18] మనువులకు వర్ణములు సహితము పేర్కొనుట ఈ పురాణములో నొక విశేషము.[19] సావర్ణి మనువువరకు నొక

---

18) స్వారోచిషోత్తమోపి తామసో రైవత స్తథా ।
ప్రియవ్రతాన్వయే హ్యేతే చత్వారో మనవః స్మృతాః ॥
బ్రహ్మాండ పురాణము 36 - 35
భాగవతమున 2వ అధ్యాయములో 54వ శ్లోకమునను నీ విషయము స్పృశింపబడెను.

19) శ్వేత, పాండు, రక్త, తామ్ర, పీత, కపిల, కృష్ణ, శ్యామ, ధూమ్ర, సుధూమ్ర, అపిశంగ, పిశంగ, శవల, కాలంధుర వర్ణములు.

క్రమమును పాటించి యనంతర మనువుల విషయములో నాక్రమము లేకుండుటంజేసి మనువు లెన్మిమి మందియోయని యభిప్రాయపడిన పండితులు లేకపోలేదు.[20]

తొమ్మిదవ మనువునుండి పదునాలుగవ మనువువరకు వివిధ పురాణములందు పేర్కొనబడిన సావర్ణి మనువుల క్రమమును శ్రీ డి. ఆర్. మన్కాడ్ మహాశయులు తమ 'పురాణ వంశావళి' అను నాంగ్ల గ్రంథమున పేర్కొనిరి.[21]

పట్టిక యందు సావర్ణి మనువునుండి చతుర్దశ మనువులు వివిధ పురాణము లందెట్లు పేర్కొనబడిరో చూపబడినది. కొన్ని ప్రాచీన గ్రంథములనుబట్టి వీరేగాక మరికొందఱుకూడ మనువులుగా పేర్కొన బడిరి. మహాభారతమునందు ప్రచేతసుడు మనువుగా పేర్కొనబడెను.[22] భాగవతమునందు ప్రియవ్రతుడుకూడ నొక మనువుగ పేర్కొనబడుట మనము గమనింపవచ్చును.[23] వాయుపురాణములో ముప్పది ఆరు గురు మనువులు పేర్కొనబడిరి.[24]

ఇట్లు మనువులు పదునాలుగురను విషయము ప్రఖ్యాత మైనప్పటికిని కొన్ని యెడల నీ నియమమునకు విఘాతము కల్గినట్లు స్పష్టమగుచున్నది. భాగవతమందొక శ్లోక మాధారముగా మనుత్వ మొక పదవి యన్నట్లు మనము నిర్ణయమునకు రాగలము. ఈ కారణ ముచే మొదటి యేడుగురు మనువులవలె తుది యేడుగురు చరిత్ర

20) Puranic Chronology - D. R. Mankad.

22) మహాభారతము, శాంతి: 57 అధ్యాయము, 43 శ్లో.

23) భాగవతము 1_22

24) అయం యో వర్తతే కల్పే విశ్వరూప స్త్వసౌ స్మృతః।
యస్మిన్ భవాదయో దేవాః షట్త్రింశ న్మనవః స్మృతాః॥
వాయు పురాణము 23_17.

| మను వుల సంఖ్య | బ్రహ్మ | హరి వంశము | మార్కండేయ | నారద | గరుడ | శివ | కల్కి | బ్రహ్మ వైవర్త | లింగ | వామన | మత్స్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 9 | మేరు సావర్ణి | మేరు సావర్ణి | మేరు సావర్ణి | దక్ష సావర్ణి | దక్ష సావర్ణి | మేరు సావర్ణి | దక్ష సావర్ణి | దక్ష సావర్ణి | ధర్మ సావర్ణి | దక్ష సావర్ణి | రౌచ్య |
| 10 | మేరు సావర్ణి | మేరు సావర్ణి | మేరు సావర్ణి | బ్రహ్మ సావర్ణి | ధర్మ పుత్ర | మేరు సావర్ణి | బ్రహ్మ సావర్ణి | బ్రహ్మ సావర్ణి | పిశంగ | బ్రహ్మ సావర్ణి | భౌత్య |
| 11 | మేరు సావర్ణి | మేరు సావర్ణి | మేరు సావర్ణి | ధర్మ సావర్ణి | రుద్ర పుత్ర | మేరు సావర్ణి | ధర్మ సావర్ణి | ధర్మ సావర్ణి | అపిశ | ధర్మ సావర్ణి | మేరు సావర్ణి |
| 12 | మేరు సావర్ణి | మేరు సావర్ణి | మేరు సావర్ణి | రుద్ర సావర్ణి | దక్ష పుత్ర | మేరు సావర్ణి | రుద్ర సావర్ణి | రుద్ర సావర్ణి | శవల | రుద్ర సావర్ణి | రీత |
| 13 | రౌచ్య | రౌచ్య | రౌచ్య | రౌచ్య | రౌచ్య | రౌచ్య | వేద సావర్ణి | దేవ సావర్ణి | పన్ణక | రౌచ్య | రితధామ |
| 14 | భౌత్య | భౌత్య | భౌత్య | భౌత్య | భౌత్య | భౌత్య | ఇంద్ర సావర్ణి | ఇంద్ర సావర్ణి | అకారాద్య | భౌత్య | విష్వక్సేన |

21 Extract from the book "Puranic Chronology" by D. R. Mankad P. 21

ప్రసిద్ధికెక్కిన మనువులు కాకుండుటయే యీ వైవిధ్యమునకు హేతువుగా మన్కడ్ పండితులూహించిరి, ఎనిమిదవ మనువగు సూర్యసావర్ణినుండి సావర్ణి పేరుతో వివిధ దేవతల సంతతిగానుండి యుందురని కూడా మనము భావింపవచ్చును. తత్కారణమున నీమనువుల నామమునకు తుదిని సావర్ణి యనికూడ నుండి యుండును. ఇక వైవస్వత మనువువరకుగల వంశవృక్షమును పరిశీలించినచో స్వాయంభువుని వంశములోని యుత్తానపాదునినుండి నాలుగవ తరమువాడయిన చాక్షుషుడు మాత్రమే మనువయ్యెను. ఉత్తానపాదునకు సోదరుడయిన ప్రియవ్రతుని వంశములోని నలుగురును మనువులైరి. మిగిలిన మూవ్వురును మనువులు కాలేకపోయిరి. అట్లే ఆ వంశములోని దాక్షాయణికి వివస్వంతునకు బుట్టిన వైవస్వతుడు మనువయ్యెను. దాక్షాయణి యుత్తానపాదునినుండి పదునాలుగవ తరము. చాక్షుషునినుండి ఎనిమిదవ తరము. ఇట్లగుటకు హేతువును పరిశీలింప నగును.

మనుత్వ మొక పదవి యని భాగవతమునందలి వాక్యమును [25] స్థిరీకరించుకొన్నచో బరంపరాగత మయిన పైతృకరాజ్య మనుభవించు ప్రభువులకు మనుత్వార్హత యుండదనియు, అవక్ర వీర్య విక్రమముచే నూతనరాజ్యస్థాపన మొనర్చి యారాజ్యమునకు చక్రవర్తిత్వము నెఱపుచో నాతడు మనుత్వార్హత గల్గియుండుననియు, ఆకారణముననే వంశములోని వారందరు మనువులు కాలేరనియు నొక సమన్వయ సిద్ధాంతమును మనము విశ్వసించినచో పదునలుగురు మనువుల కంటె నితర మనువులు పురాణములు పేర్కొనుటలోని యౌచిత్యము బోధపడును.

---

25) యోసా వస్మిన్ మహా కల్పే తనయః సవివస్వతః ।
శ్రాద్ధదేవో ఇతి ఖ్యాతో మనుత్వే హరిణార్పితః ॥
భాగవతము 8-24-7.

పై చర్చవలన తేలిన సారాంశము.

1) బ్రహ్మనుండి కలిగిన సంతతిలోనివారు మనువులైరి. దేవతాంశ సంభూతులే మనువులగుచున్నారు.

2) బ్రహ్మ వంశమునుండి కలిగిన ప్రతి సంతానము మనువు కాలేదు. మనువులసంఖ్య ప్రసిద్ధముగా చతుర్దశాత్మకమయ్యెను. నితరాధారములచే ముప్పదియారుగురవరకు నుండిరి.

3) మనుత్వ మొకపదవి. స్వాయంత్య కర్తృత్వ రాజ్యమై యప్రతిహత ప్రభుత నెఱపు దేవతాంశసంజాతుడు మనువగును.

4) మనువునుండి యావంశములోని చివరి రాజు వరకును కొనసాగిన స్థితిని యా మనువంశము పేరుతోను, వారి మొత్తము పరిపాలనకాలమును మన్వంతరమను పేరుతోను వ్యవహృతమగును.

## 4. మన్వంతరము :-

పురాణములకిది ప్రత్యేక లక్షణము. సకల చరాచర సృష్టికొక యాదికాలమున్నదని భావించుచో నట్టి సంకేతకాలమునుండి నేటివరకు కాలవేత్త లొక క్రమమున కాలమును గుణించిరి. మన్వంతరమనునది కాలవిభాగములో లెక్కకు గొనిన యంశము. మహాభారతము నందు శాంతిపర్వములో నీకాలగణనము చేయబడినది. పదునైదు నిమిషము లొక కాష్ఠము, ముప్పది కాష్ఠము లొక కళ. ముప్పది కళ లొక ముహూర్తము. ముప్పది ముహూర్తము లొక యహోరాత్రము. ముప్పది యహోరాత్రము లొక మాసము. పది రెండు మాసము లొక సంవత్సరము. పితృదేవతలకు మాసమునందలి పూర్వపక్షు మహస్సు. అపరపక్షము రాత్రి. దేవతలకు సంవత్సర కాల మొక యహోరాత్రము. అందుత్తరాయణము పవలు. దక్షిణాయ

నము లేయి. మానవుల కొక సంవత్సరము పితృదేవతలకు పండ్రెండు దినములు కాగా, దేవతల కొకదినమగుచున్నది. దేవతలకు పండ్రెండు వేల సంవత్సరము లొక మహాయుగమునకు సమానము. లేక మానవుల చతుర్యుగ కాలమునకు (43,20,000) సమమగుచున్నది.[26]

---

26) కాష్ఠా నిమేషా దశపంచ చైవ త్రింశత్తు కాష్ఠా గణయేత్కలాంతామ్।
త్రింశత్కలా శ్చాపి భవే న్ముహూర్తో భాగక కలాయా దశమశ్చ
యాస్యాత్ ॥ 12
త్రింశ న్ముహూర్తంతు భవే దహశ్చ రాత్రిశ్చ సంఖ్యా మునిభిః
ప్రణీతా ।
మాసః స్మృతో రాత్ర్యహనీచ త్రింశత్సంవత్సరో ద్వాదశ మాస
ఉక్తః ॥
సంవత్సరంద్వే త్వయనే వదంతి సంఖ్యావిదో దక్షిణ ముత్తరం । 13
అహోరాత్రే విభజతే సూర్యో మానుష దైవికే ।
రాత్రిః స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణా మహః ॥ 14
పిత్రే రాత్ర్యహనీ మాసః ప్రవిభాగ స్తయో ర్భవః ।
శుక్లోహః కర్మ చేష్టాయాం కృష్ణ స్స్వప్నాయ శర్వరీ ॥ 15
దైవే రాత్ర్యహనీ వర్షం ప్రవిభాగ స్త్రయో ర్భవః ।
అహ స్తత్రో దగయనం రాత్రి స్స్యా ద్దక్షిణాయనమ్ ॥ 16
యే తే రాత్ర్యహనీ పూర్వే కీర్తితే దైవ మానుషే ।........
ఏతాం ద్వాదశ సహస్రీం యుగాఖ్యాం కవయో విదుః ।
సహస్ర పరివర్తే తద్బ్రాహ్మం దివస ముచ్యతే ॥ 29
రాత్రిమేతావతీం చైవ తదాదౌ విశ్వ మీశ్వరః ।
ప్రళయే ధ్యాన మావిశ్య సుప్త్వా సో న్తే విబుధ్యతే ॥ 30
సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగ సహస్రాన్తాంతేఽహోరాత్ర విదో జనాః ॥ 31
మహాభారతము శాంతి పర్వము 230 అధ్యాయము.

ఇట్టి దైవిక మానుషవిభేద మానము మనుస్మృతి లోనుగలదు.[27] దేవమాన మొకటి వ్యవహారములో నున్నటుల త్రిపాద్విభూతి మహా నారాయణో పనిషత్తు నందు ప్రమాణమున్నది. అందు పరమేష్ఠి దేవమానములో లెక్కించుటకు వీలయిన వేయి సంవత్సరములు తప మొనర్చె నట్లునది.[28] ఇట్టి బ్రహ్మకుగల యహోరాత్రములు మూడు వందల యరువది సంవత్సర మగుచున్నది. ఏవం విధమయిన నూర్లు సంవత్సరములు చతుర్ముఖున కాయుః ప్రమాణముగా నుండునట. ఈ బ్రహ్మపదవీ పరినిష్ఠులు నేటికి నొకానొక సంకేత కాలముసుండి నార్గురు గతించినట్లును, సప్తమ జన్మలో పద్మభవుడు యిప్పటి సృష్టి కర్తగా భాసించుచున్నాడని హయశిరోపాఖ్యానము పేర్కొనుచున్నది.[29]

---

27) ........

యదేతత్పరి సంఖ్యాత మాదావేవ చతుర్యుగమ్ ।
ఏతద్ద్వాదశ సాహస్రం దేవానాం యుగముచ్యతే ॥ 71
దైవికానాం యుగానాయ సహస్రం పరిసంఖ్యయా ।
బ్రహ్మమేక మహర్జ్ఞేయం తావతీ రాత్రి మేవచ ॥ 72
మనుస్మృతి । అధ్యాయము

28) "పరమేష్ఠి దేవమానేన సహస్ర సంవత్సరం తపశ్చచారః
($1000 \times 360 = 3,60,000$ల సంవత్సరములు)

29) త్వల్లోకే మానసం జన్మ ప్రథమం ద్విజపూజితమ్ ।
చాక్షుషం వై ద్వితీయం ఆసీ జ్జన్మ పురాతనమ్ ॥
త్వత్ప్రసాదా చ్చమే జన్మ తృతీయం వాచికం మహత్ ।
త్వల్లోనా శ్రావణం చాపి చతుర్థం జన్మ వై ప్రభో ॥
నాసిక్యం చైవ మే జన్మ త్వత్తః పంచమ ముచ్యతే ।
అండజం చాపి మే జన్మ కృతం షష్ఠం వినిర్మితమ్ ॥
ఇదంతు సప్తమా జన్మ పద్మజం మే మిత ప్రభ ।
హయశిరోపాఖ్యానము (శ్రీ వైఖానస మహిమ మంజరీ గ్రంథము నుండి యుద్ధృతము పేజీ 45,

ద్వాదశ సహస్ర వత్సర సమన్విత మయిన సహస్ర యుగములు బ్రహ్మ కహోరాత్రము లనియు మహాభారతమే నుడువుచున్నది. ఈ కాలము పదునలుగురు మనువుల కాలమునకు సమము. ఒక్కొక్క మనువు కాలము డెబ్బదియొక్క మహాయుగములు, ఈ విషయము మనుస్మృతి యందును పేర్కొనబడినది.[30] పురాణములందీ విషయ మెట్లు పరిశీలింపబడినదో గమనింప వలసియున్నది.

నారసింహ పురాణములో డెబ్బదియొక్క మహాయుగముల కంటె కొంత యెక్కుడు కాలము మన్వంతరముగ పేర్కొనబడెను. 8,79,000 ల సంవత్సరముల దివ్యమానమునకు సమ మయిన మానుష మానము 31,64,40,000 ల సంవత్సరములకు కించిదధికముగనుండు కాలము మన్వంతరమని యిందు చెప్పబడెను.[31] హరివంశమునందు కృత, త్రేత, ద్వాపర, కలియుగ సమన్వితమయిన మహాయుగములు డెబ్బదియొక్కటి మన్వంతర కాలమని యున్నది.[32] మార్కండేయ

30) యత్ ప్రాగ్ద్వాదశ సహస్ర ముదితం దైవికం యుగమ్,
తదేక సప్తతి గుణం మన్వంతర మిహోచ్యతే ॥ మనుస్మృతి 1-79

31) చతుర్యుగానాం సంఖ్యాచ సాధికా హ్యేక సప్తతిః ॥ 17
మన్వంతరం మనోఃకాలః శక్రాదీనా మపి ద్విజ ।
అష్టౌ పక్ష సహస్రాణి దివ్యయా సంఖ్యయా స్మృతః ॥ 18
ద్విపంచా శత్తథాన్యాపి సప్త చాన్యాని వైమునే ।
వింశతిశ్చ సహస్రాణి కాలోయం సాధికం స్మృతః ॥
19 నారసింహ. 2 అధ్యాయము

32) కృతం త్రేతా ద్వాపరంచ కలించైవ చతుర్యుగీ।
యుగం తదేక సప్తత్యా గణితం నృపసత్తమ॥
మన్వంతర మితి ప్రోక్తం సంఖ్యానార్థ విశారదైః।
హరివంశము 8వ అధ్యాయము

పురాణముకూడ 'సాధికా హ్యేక సప్తతిః' అనియు చెప్పినది. 8,52,000 ల సంవత్సరముల దివ్యమానమునకు సమమగు మూడు కోట్ల యరువదియేడులక్షల యిరువదివేల మానవ సంవత్సరముల కించుక యధికమయిన కాలము మన్వంతరమని యీ పురాణ ప్రవచనము.[33] మత్స్య పురాణముకూడ "సాధిక" అను ప్రయోగమే చేసినది. సంవత్సరములే గాక మాసమానముకూడ నీపురాణము చెప్పకుంట గమనార్హము. మానుష, దివ్యవర్ష ప్రమాణములు రెండును వేర్వేరమార్కండేయ పురాణమువలెనే చెప్పకున్నది. మానవ కాలపరిగణములోని 3',10,32,880½ సంవత్సరములు మన్వంతర కాలము. ఇందు దివ్యవర్షములలో నొసంగిన కాలము పై కాలముతో సమన్వయముకాదు. కనుక నీ పురాణమున మన్వంతర కాలగణన మందు వైవిధ్యముండుట గానవచ్చును.[33]

వాయు పురాణములోని మన్వంతర ప్రమాణము మరియొక విధముగనున్నది. ఒక మన్వంతర ప్రమాణము అష్టావింశతి కోటి సంవత్సరములు. అట్టి పదునాలుగు మన్వంతరముల కాలప్రమాణము మూడు వందల తొంబదిరెండుకోట్ల యేడు లక్షల యెనిదిమిదివేల సంవత్సరము లగుచున్నది. ఇవి మానవ వర్షములలో, దివ్యవర్షములో దీనియందు చెప్పబడలేదు గాని వీనిని మానుషమానములోనే లెక్కించబడి యుండుననని యీ బృహత్సంఖ్యను గమనించినచో స్పష్ట.

33) ఏషా చతుర్యుగాఖ్యాతు సాధికా హ్యేక సప్తతిః।
కృతత్రేతాది యుక్తా మనోరన్తర ముచ్యతే॥
మత్స్యపురాణము అ. 142

మగును. [34] వాయు పురాణమునందే ఏకవింశత్యధ్యాయమునందు త్రివిధమయిన మన్వంతర కాలగణన మీయబడినది. పదునాలుగు మన్వంతరము లొక కల్పము. సప్త మన్వంతరము లర్ధకల్పము. ఇది 28,62,70,00,000 ల సంవత్సరములు. అనగా నొక మన్వంతర కాల పరిమితి 4,0×,95,71,428 4/7 సంవత్సరము లగుచున్నది. రెండవ ప్రమాణములో సప్తమన్వంతరముల కాలపరిమితి 1,78,92,00,000ల

---

34) అష్టావింశతి రేవైతాః కోట్యస్తు సుకృతాత్మనామ్ ।
మన్వంతరేతథే కస్మిన్ శ్రుతుర్ధస్తు వైతథా॥ 16
త్రీణి కోటి శతాన్యాసన్ కోట్యో ద్విసప్తతి స్తథా।
అష్టాధికాః సప్తశతాః సహస్రాణాం స్మృతాః పురా॥ 17
వాయు పురాణము 7 అధ్యా

2. మన్వంతరాణాం సప్తానాం కాలసంఖ్యాం యథాక్రమమ్।
ప్రవక్ష్యామి సహస్రేన బృహతో మే నిబోధత॥ 16
కోటీనాం ద్విసహస్రేద్వై అష్టౌకోటి శతానిచ।
ద్విషష్టిశ్చ తథా కోటియో నియుతానిచ సప్తతిః॥ 15
కల్పార్ధస్యతు సంఖ్యాయా మే తత్పూర్వ ముదాహృతమ్।
పూర్వోక్తౌ చ గుణ చ్ఛేదౌ వర్షాగ్రం లబ్ధమాదికేత్॥ 16
శతం చైవతు కోటినాం కోటీనా మష్ట సప్తతిః ।
ద్వేచ శతసహస్రేషు నవతి ర్నియుతానిచ ॥ 17
మానుషేణ ప్రమాణేన యావద్వైవస్వతాన్తరమ్ ।
ఏష కల్పస్తు విజ్ఞేయః కల్పార్ధ ద్విగుణీకృతః ॥ 18
అనాగతానాం సప్తానాం మేత దేవ యథాక్రమమ్ ।
ప్రమాణం కాల సంఖ్యాయా విజ్ఞేయం మతమైశ్వరమ్ ॥ 19
నియుతా న్యష్ట పంచాశ త్తథాశీ శతానిచ ।
చతురశీతి శ్చాన్యాని ప్రయుతాని ప్రమాణతః ॥ 20
ఏతత్కాలస్య విజ్ఞేయం వర్షాగంతు ప్రమాణతః ।
ఏష మన్వంతరే తేషాం మానుషన్ని ప్రకీర్తితః ॥ 21

సంవత్సరములు. ఇది 'యావద్వైవస్వతాంతరమ్' అను పదముచే సూచితమైనది. ఇది ఒక మన్వంతర కాలమునకు విభాగించినచో 25,56,00,000 ల సంవత్సరములు. మూడవగణనమున భవిష్యత్సూత్ర మన్వంతర కాలపరిమితి యొసంగబడినది. 66,42,000 ల సంవత్సరము లనియున్నది ఇచట యొసంగబడిన కాల మేవిధముగ జూచినను దివ్య సవత్సరములే యగునుగాని మానవ సంవత్సరములకు సంబంధించినది గాదని డి. ఆర్. మన్కడ్ మహాశయుల నిర్ణయము. ఇది ఒక మన్వంతర మునకు విభాగించినచో 9,49,714 2/7 ల సంవత్సరములు కాగా 3,41,89,102.9 మానవ సంవత్సరము లగుచున్నది.

బ్రహ్మ పురాణమునందలి యెనిమిదవ యధ్యాయమున డెబ్బది యొక్క మహాయుగములు మన్వంతరమని పేర్కొనబడలేదుగాని యచటగల 'సాగ్రాణి' యను పదము మిగిలిన పురాణము లందుగల "సాధిక' పదమునకు సమనుగు ననుటలో నెట్టి సందేహము పొడ మదు.[35] బ్రహ్మవైవర్త పురాణమునందు డెబ్బదియొక్క దివ్య యుగము లొక మన్వంతర మనియు మూడువందల యరువది సంవత్స రము లొక దివ్యయుగమనియు పేర్కొనబడెను.[36] ఇది దేవమానమై యుండునని భావించుట లెస్స. విష్ణు పురాణము నందీ యుగపరి

35. యుగాని సప్తతి స్తాని సాగ్రాణి కథి తానిచ ॥ 54
కృతత్రేతాది యుక్తాని మనోరన్తర ముచ్యతేః చతుర్దశైతే మనవః
కధితాః కీర్తివర్ధనాః ॥ 55
బ్రహ్మ పురాణము, 8వ అధ్యాయము.

36) సత్యం (కృతం) త్రేతా ద్వాపరం కలిశ్చేతి చతుర్యుగమ్ ।
త్రిశతై శ్చ షష్ఠ్యధికై ర్వర్షై ర్దివ్యం యుగం స్మృతమ్ ॥ 5
మన్వన్తరన్తు దివ్యానాం యుగానా మేక సప్తతిః ।
బ్రహ్మవైవర్తము 6 వ అధ్యాయము

మానము సంధ్యాంశలను లెక్కగొనక గడింపబడినట్లుగా దోచును. కలియుగమునకు పరిమాణము చెప్పుచును 3,60,000 ల సంవత్సరము లని మాత్రమే చెప్పినట గమనార్హము సంధ్యాంశలు పూర్వోత్తరము లందవివి కలిపికొన్నచో పురాణములు చెప్పిన నాలుగు లక్షల ముప్పదిరెండు వేల సంవత్సరములు వచ్చును.

ఇన్ని పురాణము లిన్నివిధములైన మన్వంతర కాలగణన ముండుట కేమి హేతువయి యుండునో విచారింప వలసియున్నది. 70, 71, 72, మహాయుగముల కాలములో దేనినో యొకదాని నాధారముగా గొని మన్వంతర కాల వివేచనమునకు పురాణములు గడంగినట్లు పై యుపపత్తులు స్పష్టము చేయుచున్నవి. 'సాధికా' 'సాగ్ర' యను పదములు వీనిని సూచించుచున్నవి. పురాణములు లౌకిక గణనమును ఖగోళ గణనమును నేకసూత్రతతో గావించినట్లు పురాణ పరిశోధకులూహించి తీవ్ర పరిశోధనకు గడంగిరి. అందు ప్రముఖుడగు మన్కడ్ పండితుడు ఒక సమన్వయ మాత్రమును కనుగొనెను. వేయి మహాయుగములు పదునాలుగు మన్వంతరముల కాలమునకు సమానమయినచో నొక మన్వంతర కాలము 71.42 మహాయుగముల కాలమునకు సమమగుచున్నది. ఇప్పుడు మన్వంతర కాలమునకు రెండు గణనములు సిద్ధించుచున్నవి. అవి యేవనగా—

1) మన్వంతరము : చతుర్యుగ కాలము × 71
: 43,20,000 × 71
: 30,47,20,000 సంవత్సరములు.

2) మన్వంతరము : చతుర్యుగకాలము × 71.42
: 43,20,000 × 71.42
: 30,85,71,428 మానుష సంవత్సరములు గాని
: 12,000 × 71.43
: 8,57,143.5 దివ్య వత్సరములు గాని యగుచున్నవి.

లౌకికగణనమునకుపురాణములు మనువునుండి 71వ ప్రభువునకు లెక్కించుటగాక, 72వ రాజునకుగాని, 73వ రాజు కాలమునకుగాని కాలగణనము చేయుటతో నీవ్యత్యాసమయిన లెక్క యేర్పడినట్లు డి. అర్. మన్కడ్ పండితులూహించు చున్నారు. దీనిని సరిగా నిర్ణయించుటకు చతుర్యుగ ప్రమాణము లౌకికముగా నొక్కొక్క రాజు పరిపాలనకాలమునకు సమముగా గ్రహించి యది నలుబది సంవత్సరములుగా గ్రహింపబడి యుండుననియు, అప్పుడు డెబ్బది యొక్కటి, ఇద్దఱు రాజుల పాలనకాలము గావలెనన్నచో నది 2800 సంవత్సరములు, 2840, 2880 సంవత్సరములు వరుసగా నగుననియు ఖగోళ సంబంధమయిన చతుర్యుగ కాలపరిమితిని నలుబదితో విభాగించినచో వచ్చెడి యంకమును మనకు పురాణములందొసంగబడిన కాలముతో విభాగించినచో నది యే రాజు కథకు వచ్చుచో అది యా రాజు పాలనకాలమగు చున్నదనియు నిర్ణయించెను. దీని ప్రకారముగా మార్కండేయ పురాణములోని చతుర్యుగ కాలపరిమితిని విభాగించి చూతము.

| | |
|---|---|
| మార్కండేయ పురాణములోని కాలము | : 30,67,20.000 |
| చతుర్యుగ కాలమును నలుబదితో విభాగించుచో : | 43.20.000=40 |
| వచ్చినది | : 1,08.000 |

దీనిని భాగించుచో : $\frac{30,67,20,000}{1,08,000}$, 2,840

దీనిని నలుబదితో విభాగించగా : $\frac{2840}{40}$ :

71వ ప్రభువు కాలమునకు

నీ పురాణమునందు కాలగణనము గావింపబడినట్లు స్పష్టమగు చున్నది ఇది వైవస్వతమనువునుండి డెబ్బదియొక్కమంది రాజులు గతిం

వగా 72వ రాజు పాలనకాలములో గ్రహింపబడిన గణనము. ఇట్లే తక్కిన వన్నియు గణింప వీలగునని సవిమర్శకముగా సప్రమాణకముగా, సోదాహరణముగా నిరూపించి యున్నారు.[38] మనకు విషయమది ప్రధానము కాదుగాన నది యింతటితో వదలి వేయబడుచున్నది. దీని నింతగా చెప్పుటకు హేతు వేమియనపురాణములందీయబడిన కాలగణన మున కొక యంతు పొంతు దొఱుకక వారు బాధపడుచు నితరులను బాధించుచు గ్రంథములనే అపహాస్య మొనర్చుచు, పురాణములన్న నొక హ్రస్వదృష్టి గల్గి విమర్శించిన పాశ్చాత్య విద్వాంసులతో గలిసి యేకోన్ముఖులై భారతీయ సంస్కృతినే యవమాన మొనర్చుచున్న వారికయి స్పృశింపవలసి వచ్చినది. విషయము సమన్వయ పఱచు కొనెడి పరిశీలన దృష్టి కొంత కలిగినచో పురాణము లందలి యన్ని సన్నివేశములు సర్థవంతము లగునని తెలుపుటకు మాత్రమిది వివరింప బడినది. వైవస్వత మనువునుండి వచ్చిన రాజుల పట్టిక అన్ని పురాణము లొసంగినవి. తొంబది నాలుగవ అయోధ్య ప్రభువు బృహద్బలుడు, ఈతడు మహాభారత యుద్ధమునందు బాణగాని యసువులు బాసెను.[39] ఇట్లు మహాభారత యుద్ధమునకు బూర్వమునుండి మనువు మొదలు దేశమును బాలించిన ప్రభువుల పేర్లను పురాణములు భద్రపఱచి యుండగా, పురాణములు తప్పుడు తడకలని, యవి యప్రామాణికములని వ్రాసిరా జనుటలో నేమాత్రము సారములేదుకదా! ఇపుడు మిగిలిన పంచమాంశమైన రాజవంశములను గుఱించిచూతము.

## ౫. రాజవంశముల చరిత్రము :

ఇది పురాణముల కుండిన పంచమ లక్షణము. కలియుగము నందు ప్రారంభమునుండి భారతమును పాలించిన ప్రభువులనుగుఱించి, ఆయా రాజవంశములను గుఱించి మత్స్య, వాయు, బ్రహ్మాండ, విష్ణు

38) ibid P. 35-39

39) వాయు పురాణము 88వ అధ్యాయము.

భాగవత, గరుడ, భవిష్య పురాణములు పేర్కొన్నవి, ఇందు మత్స్య, భాగవత పురాణములు తక్క మిగిలిన యన్ని పురాణములు మహా భారత యుద్ధ కాలమునకు బూర్వ మీదేశమును బాలించిన రాజ వంశములను వైవస్వత మనువు నాటినుండి పేర్కొన్నవి. వెనువెంటనే అనగా భారత యుద్ధము జరిగిన యనంతరము పాండవులు హస్తినా పురమును, ఇక్ష్వాకు లయోధ్యను బార్హద్రథులు మగధను (రాజ గృహము) రాజధానిగ నొనర్చుకొని పాలించిన యంశములను వెల్ల డించినవి. ఇందు కౌరవులు నిచక్షుని వరకు హస్తినాపురమును, అతని నుండి కౌశాంబిని రాజధానిగ నొనర్చుకొని పాలించిన విషయము గూడ స్పష్టము చేయబడినది. మత్స్య పురాణము మాత్రము భారత యుద్ధమునకు బూర్వమున్న పురువంశమును మొదటగా వర్ణించి యుద్ధా నంతర మేలిన పురువంశమును అనంతర యధ్యాయములందు వేఱొక చోట కూర్చినది. భాగవతమందు తొమ్మిదవ స్కంధమునందు పూర్వ కౌరవులను, పూర్వ బార్హద్రథులను వర్ణించినది. బార్హద్రథులు పురు వంశమునుండి చీలిన యొక వంశమే గాని వేఱుకాదు. వీనినుండి యేర్పడిన యనంతర వంశములను గుఱించి కలిరాజవంశావళిగ పది రెండవ స్కంధములో పేర్కొనబడినది. పురాణము లందీయబడిన రాజవంశావళి ఆ యా పురాణముల కెదురుగ చూపబడిన యధ్యా యము లందు గానవచ్చుచున్నవి.

మత్స్య పురాణము 50, 57 నుండి 89 వరకు, 271 నుండి 273 అధ్యాయములు.

వాయు పురాణము 99వ అధ్యాయము 250-435 శ్లోకములు.

బ్రహ్మాండ పురాణము 3,74 అధ్యాయములు 104-248 శ్లోకములు.

విష్ణు పురాణము 1,4 అంశ 20 అధ్యాయం 12 నుండి 24,44 అ..

భాగవతము 9 స్కంధము 12 అధ్యాయము, 9-16 శ్లోకములు.
22 అధ్యాయము, 34-49 శ్లోకములు
12 స్కంధము 1,2, అధ్యాయములు, 2లో 36 శ్లోకములు
గరుడ పురాణము 140-40
141-1 నుండి 12 శ్లోకములు
భవిష్యత్పురాణము 3 ప్రతిసర్గ పర్వము, 1, 3, 6,
అధ్యాయములు

విష్ణు పురాణమున నీభాగమంతయు గద్యరూపమున గలదు. కాని వంశావళి ముగించునెడ, వంశావళికి వర్తించెడి సర్వ ఖగోళ విషయములు మాత్రము శ్లోకరూపముననే వ్రాయబడినవి. మిగిలిన పురాణములందీ భాగమంతయు (పద్య) శ్లోక రూపముననే యున్నది. మత్స్య, వాయు, బ్రహ్మాండ పురాణములందలి యీ రాజవంశములు పేర్కొనిన విధ మరసినచో నవి యొకదానినొకటి పోలి యున్నటుల స్పష్టపడును. సూతమహాముని నైమిశారణ్యమున ద్వాదశవత్సర పరిమితసత్రయాగ సందర్భమున శౌనకాది మహర్షులకు, భగవదంశ సంభూతుడు, త్రికాలవేది యగు వ్యాసుని యనుమతంబున భవిష్యద్రాజ వంశములను పేర్కొందునని నుడువును. 'తాన్ సర్వాన్ కీర్తయి ష్యామి భవిష్యే కథితాన్ నృపాన్' అను వాక్యము దీని కాధార భూత మయియున్నది. ఇక్కడ 'భవిష్యే' యను పదమునకు భవిష్య త్పురాణ గ్రథితమయిన రాజవంశ కీర్తనమనియు, పైన పేర్కొనిన మూడు పురాణములకు నీ భవిష్య పురాణమే సారమనియు పర్గీటరు మహాశయుడు పేర్కొనెను.[40] అప్పుడు భవిష్య పురాణ మితర పురాణము లన్నింటికంటె నగ్రగామి కావలసివచ్చును. ఈ విష యమును పురాణ పరిశోధకులయిన పలువురాధునికు లంగీకరింపరు.

40. Dynasties of Kari Age E. E. Pargiter Intn. P. 7

కాని పలు పురాణములందున్న ప్రాచీనతను దృష్టి యుంచిదుకొనినచో-భవిష్యత్పురాణములోని జానీసంయుక్త పృథ్వీరాజు, కథనము వరకు గల చారిత్రకాంశముల యునికి చేత నిది యనంతరమయిన గ్రంథమను వాదమునకే యెక్కువ ప్రోత్సాహమనగునని ఆధునిక పురాణవిమర్శకులు భావింతురు. విష్ణు, భాగవత పురాణములందు రాజవంశ కథనము క్రమమున సమానమయ్యును మొదటి ద్దాని యందు గద్యరూపమున నుండగా రెండవ పురాణమున నిది శ్లోక రూపముననే యుండుట గమనార్హము. మత్స్య, వాయు, బ్రహ్మాండ పురాణములందు రాజవంశములు పేర్కొనబడినంత విపులవంతముగా నీరెంటి యందు పేర్కొనకుండుట మరియొక పరిశీలనాంశము. ముఖ్యమయిన రాజవంశములను పేర్కొనుటలో కొంత వైపుల్యము నీరెండు పురాణములు జూపినవిగాని పైవాని యంత మాత్రముగాదు. పురు, ఇక్ష్వాకు వంశవర్ణనకుతుదిని, రాజవంశములకు చెందిన ఖగోళ విషయములకు సమన్వయము కుదిరించు పట్టులందు విష్ణుపురాణము గూడ శ్లోక ప్రక్రియనే చేపట్టినది. విష్ణుపురాణము నందచ్చటచ్చట శ్లోక ప్రక్రియ గలదో యా యా తావులందు మిగిలిన పురాణము లందలి యంశములనే పోలియున్నది. గరుడ పురాణము పురు, ఇక్ష్వాకు బార్హద్రథ వంశములను, నావంశము నందుద్భవించిన ప్రభువులను నామమాత్రముగా పేర్కొన్నదే కాని వివరము లించుగానము. వీని తరువాత పాలించిన రాజవంశముల గురించి యీ పురాణ మేమియు పేర్కొనకుండుటయు నాశ్చర్యమే.

ఈ పురాణము లన్నియు భవిష్యద్రాజ కథనమును ముందు జరిగెడి విషయముగా దర్శిష్టమై చెప్పుచున్నట్లే గోచరించును. కౌరవ వంశ కీర్తనమున సూతునిచే 'భవిష్యాన్ న్వవాయే వక్ష్యామి భవిష్యే కథితాన్ నృపాన్' అని మత్స్య పురాణముననుం 'భవిష్యే తావతో,

అని వాయు పురాణమునను, ఇక్ష్వాకు వంశ రాజ కథన సందర్భమున 'భవిష్యజ్ఞై రుదాహృతాః' అని వాయు, బ్రహ్మాండ పురాణములందును, 'విప్రైర్గీతా పురాతనైః' అనియు మత్స్య పురాణమునను జెప్పఁబడుట గ్రంథాంతమున సమర్థించును. కలిరాజ వంశావళి వర్ణనాంతమున 'భవిష్యే తే ప్రసంఖ్యాతా పురాణజ్ఞైః శ్రుతర్షిభిః' అను శ్లోకపాద మీ పురాణము లన్నింటియందు నున్నది. ఈ వాక్యము శ్రుతర్షులు, పురాణజ్ఞులు అను వారిని పేర్కొని పురాణ వేత్తలు త్రికాల వేత్తలుగా నభివర్ణించినది. విష్ణు పురాణమంతయు వ్యాస జనకుఁడయిన పరాశరుఁడు మైత్రేయ మహర్షికి జెప్పెను. నైమిశారణ్యమున జరిగిన సత్రయాగ సమయమున బహు పురాణజ్ఞులు, శ్రుతర్షులు వేదవేత్తలుండఁగా ప్రముఖ పౌరాణికుఁడైన సూతుఁడు రాజప్రీతి కయి పురాణములను విన్పించినట్లు మత్స్య వాయుపురాణములు పేర్కొన్నవి. వీరు సూతుని కలియుగారంభమును, తత్ప్రభావమును గుఱించి ప్రశ్నింతురు. వానికి సమాధాన మొసగిన యనంతరము భవిష్యద్రాజ కథనప్రసంగ మొనర్తురు. ఈ సత్రయాగము జరిగిన కాలము పురు వంశములోని యధిసీమ కృష్ణుని కాలము. ఈతఁడు యుధిష్ఠిరునకు నారవ ప్రభువు. ఈతఁడు హస్తినాపుర చక్రవర్తి కాఁగా మగధ రాజ్యమును శ్యైనజితుఁడు, నయోధ్యను దివాకరుఁడు పాలించిరి. ఈ యాగము జరిగిన నాటికాలము నుండి మున్ముందు పాలించెడి ప్రభువులను క్రమముగా మత్స్య, వాయు, బ్రహ్మాండ పురాణములు పేర్కొనినవి. భాగవత, గరుడ పురాణము లధిసీమకృష్ణుని నుండియే భవిష్యద్రాజ వృత్తాంతము నారంభించియు నీతనికి బూర్వులయిన జనమేజయ పరీక్షిత్తుల నుండి వంశక్రమమును పేర్కొన్నవి. (భాగవతము 9 స్కంధము 1 అధ్యాయము 6 శ్లోకము, గరుడ పురాణము 140 అధ్యాయము, 40 శ్లోకము). విష్ణు పురాణము

భాగవతమునే యీ విషయమున ననుకరించెను మరియొక యంశము నీ సందర్భమున గమనింపవలసి యున్నది. అధిసీమకృష్ణుని యాధ్వర్యవమున హస్తినాపుర ప్రభువుయొక్క యౌదార్యమున నీయాగము నైమిశమున నిర్వర్తింపబడియు, కౌరవ వంశోద్భూతుడయిన యారాజుకోరికపయి యీ వంశకథనము ప్రారంభింపబడియు నన్ని పురాణములను మగధరాజ్యము నందుప్పతిల్లిన మార్పులపయి, నా రాజ్యమును బాలించిన క్రమానుగత వంశప్రభువుల కీర్తనముపయి దృష్టిని కేంద్రీకరించినట్లుగా దోచును. దీనికి భారతమందు మగధ సామ్రాజ్యము చిరకాలము వెలుగుచు నుండుట, సమకాలీనమయిన హస్తినా అయోధ్య రాజ్యము లచిరకాలములో వాని యస్తిత్వము గోల్పడుటను హేతువుగా జెప్పనగును. మగధ రాజ్యమును బాలించిన రాజవంశములను, రాజులను ప్రత్యేకముగా నొక శ్లోకమునగాని, శ్లోకపాదమునగాని చెప్పుట గమనార్హము. ఇట్టి ప్రాధాన్యము పృథు, ఇక్ష్వాకు ప్రభు కీర్తనమున గానము. ఇదియునుంగాక నన్నిపురాణములును మహాభారతయుద్ధమును, ధర్మజుని రాజ్యస్వీకారము, రాజ్యపరిత్యాగము, పరీక్షిత్తు రాజ్యపాలనము, కలి ప్రవేశమును వివరించినవి. కలిప్రవేశము నాటినుండి కలిరాజవంశావళిని గీర్తించుట యుచితమయినదిగా భావించి పురాణములు క్రమానుగతమైన వంశావళులను బేర్కొన్నవి. మత్స్యపురాణము నందాంధ్ర రాజ్య పతనము వరకును, వారి యనంతర మల్పరాజ్యము లయిన కిల్కిల యవన రాజ్యముల ప్రస్తావనము చేయబడినది. వాయు, బ్రహ్మాండ, విష్ణు భాగవత పురాణము లందాంధ్ర రాజవంశము, అనంతరము ఆంధ్ర భృత్యులనెడు గుప్త వంశజులు సవివరముగా బేర్కొనబడిరి. ఈ యంశము బ్రహ్మవైవర్త పురాణ మందును గలదు. భవిష్య పురాణ మందు గుప్త వంశజుల తరువాత దేశము నందలి విభిన్నకర పరిస్థితు

లను తెల్పెను, యనంతరము పాలించిన ప్రమర వంశజులను జెప్పె-
నెను. ఈ వంశమునందు ప్రముఖులైన శకకర్త లిద్దరు. వారు విక్ర
మార్క, శాలివాహనులు, ఈ వంశమునకు సమకాలీన వంశములు
చౌహన్, శుక్ల లేక చాళుక్య, పరిహార లేక ప్రతీహార వంశములు
ప్రమర వంశమునకు పాణ్వారు వంశమనియు పేరున్నది. వీరు ఉజ్జయి
నిని రాజధానిగా జేసుకొని పాలించిరి, చౌహాను వంశీయులు తోమర
వంశములోనివారు. వీరికి రాజధాని అజ్మీరు. శుక్ల వంశజులకు రాజ
ధాని ద్వారక. ప్రతీహార వంశీయుల రాజధాని కలింజరపురము. ఇది
బంగాళ దేశముననున్నది. ఈ రాజ్యము లన్నియు క్రీ, శ, 1193 వ
సంవత్సరము వరకు తమ యస్తిత్వమును నిలుపుకొన్నవి. ఈ సంవత్సర
మందే జరిగిన కురుక్షేత్ర (స్థానేశ్వర) సంగ్రామములో మహమ్మదీయ
ప్రభువు మహమ్మదు ఘోరిచే నీ వంశములు నిర్మూలనము గావింప
బడినవి.

ఇది సంగ్రహముగా పురాణము లందలి రాజవంశ చరిత్ర.
సంప్రదాయబద్ధమై యనుస్యూతముగా వచ్చుచున్న నీ చరిత్రను
విరోధించుటయే పురాణవైరము.

పురాణవైరము :-

మహాభారత యుద్ధానంతర మీ దేశమున మగధ ప్రధాన
సామ్రాజ్యము. ఈ సామ్రాజ్యము భారత యుద్ధమునకు పూర్వా
పరముల యందును ప్రశస్తి గన్నట్టిది. జరాసంధుడు పాండవులకు
సమకాలికుడు, ఈతని శ్రీకృష్ణుని సాహాయ్యముతో భీముడు
సంహరించి ధర్మజునిచే రాజసూయాధ్వరమును నిర్వర్తింపజేసినట్లు భార
తము పేర్కొనుచున్నది. ఈతనికి తొమ్మిది తరములకు ముందు
వాడయిన యొకటవ బృహద్రథునిచే నీసామ్రాజ్యస్థాపనము జరిగెను

ఇది కలి ప్రారంభమునకు నాలుగువందల ఎనిమిదియేండ్ల నాటి మాట. కలి ప్రారంభమయినది క్రీ. పూ. 3102వ సంవత్సరము. అప్పుడీ సామ్రాజ్యస్థాపన కాలము క్రీ. పూ. 3709 వ సంవత్సర మగును. మగధకు గిరివ్రజము, రాజగృహములను నామాంతరములు గలవు. దీనిని ముఖ్యనగరముగా జేసికొని బార్హద్రథులు, ప్రద్యోతులు, శైశునాగులు, నందులు, మౌర్యులు, శుంగులు, కాణ్వులు, ఆంధ్రులు పాలించిరి. వీరి మొత్తము పాలనకాలము మగధ సామ్రాజ్య స్థాపన కాలమునుండి మూడు వేల మూడువందల ఎనుబదిమూడు సంవత్సరములు (3383) అప్పటికి మగధ నేలిన రాజుల సంఖ్య నూట ఏడుగురు (107) ఇది సంగ్రహముగా మగధ రాజ్యమున కాద్యంతములకుగాల సూచిక. వీరి తరువాత సామ్రాజ్యము, వంశముకూడ మార్పునకు లోనైనది. ఆంధ్రభృత్యులు అను నామాంతరముగల గుప్తవంశజులు పాటలీపుత్రమును రాజధానిగా నొనర్చుకొని పాలించిరి. వీరి పాలన కాలము రెండువందల నలుబదియైదు సంవత్సరములు. అప్పటికి క్రీ. పూ, 82వ సంవత్సర మగుచున్నది. అది విక్రమార్కుని పాలనము ఉజ్జయినీ నగరమున జరిగిన సమయము. ఈతడు నూరేండ్లు పాలించెనని భవిష్య పురాణము చెప్పును. ఈతని యనంతర మీతని మునిమనుమడు శాలివాహనుడు క్రీ. శ. 78 వ సంవత్సరమున ఉజ్జయినీ సింహాసన మధిష్ఠించి శకులను రూపుమాపి శకకర్తయయ్యెను. తాత మనుమ లిరువురును శకకర్తలే. ఈతని పాలన కాలము షష్టివర్షములు. ఇట్లీ వంశమునందుద్భవించిన ఇరువది యొకటవ ప్రభువు

3) ఈతడే ప్రసిద్ధుడగు చేదివంశసంభూతు డయిన ఉపరిచర వసువు కుమారుడు. ఈతనికి మొదటి బృహద్రథుడనియు, జరాసంధునకు రెండవ బృహద్రథుడనియు పేర్లు. ఈ విషయమంతయు భవిష్య పురాణమున ప్రతిసర్గ పర్వమున నున్నది.

భోజరాజు. ఈతడు ధారానగరమును రాజధానిగా నొసర్చుకొని పాలించినట్లు పురాణము పేర్కొనుచున్నది. ఇందు చివరి ప్రభువు గాంగసింహుడు. ఈతడు మహమ్మద్ ఘోరీచే నొనర్పబడిన కురుక్షేత్ర సంగ్రామమున సంహరింపబడెను. అది క్రీ. శ. 1193 వ సంవత్సరము.

ఏవం విధమయిన సృష్ట్యాది పంచక లక్షణ లక్షితమగు పురాణ వాఙ్మయమందొక ద్వేషమే పురాణవైతము. దేశమునగల యాధునిక విద్యాంసులకు పురాణము లందొక యపప్రథను జూపుటకు హేతువుగా నీపంచలక్షణ విషయము బాగుగా కుదిరినది. సృష్టిజరిగి నూట దొంబదియైదు కోట్ల సంవత్సరములని యనుశ్రుతముగా, సంప్రదాయ బద్ధముగా నున్న గ్రంథములు చెప్పుచుండగా, వానిని ఖగోళ శాస్త్ర గ్రంథములు, పాశ్చాత్య పండితులు సయితము నంగీకరించుచుండగా దీనిని కాదనుటయే సంప్రదాయ విరోధము, వేదము లిటీవలి కాలపు గ్రంథములు. అపౌరుషేయములుగావు. రామాయణ భారతేతిహాసములు కల్పిత కథా స్వరూపములు. పురాణములు దోష భావ జనితమయిన వ్రాతలు. వీనియందు సత్యమావంతయులేదు. అని యాధునికుల యాక్రోశము. పురాణమునందు పేర్కొన్న చారిత్రికాంశములు సత్య సమ్మతము గాదన్నది మఱియొక యారోపణము. ఇది మనకు పాశ్చాత్య విద్యా సముపార్జనమున గలిగిన వ్యామోహ ఫలితమని సంప్రదాయజ్ఞుల యభిప్రాయము. పురాణములందలి చరిత్ర సత్యమా! కాదా! యను విషయమున తీవ్ర వాదోపవాదము లున్నవి. మొన్న మొన్నటివరకు నాంగ్లేయ పాలనముననున్న మనము, వారిచే బరిశోధింపబడి వారు నిర్ణయించి రూపొందించిన చరిత్రనే పాఠశాల లందును గళాశాలలందును, తుదకు విశ్వవిద్యాలయము లందును జదివింపబడుచుండుట మనమెఱింగియే యున్నాము. కడకు

భారతయుద్ధము, తదనంతరము ధర్మజుడు ముప్పదియారు సంవత్సరములు పాలించిన విషయము, కలి ప్రవేశకాలము, అక్కడనుండి పాలించిన రాజవంశములు. వారికాలము - లివి యన్నియు వీరికి వివాదాంశములే. మౌర్య, గుప్తచంద్రగుప్తులందు అలెగ్జాండరు భారతదేశమునకు దండయాత్ర నిమిత్తము వచ్చిన దెవరికాలమున నన్నది మఱియొక వివాదము. కాని యీ చరిత్రకారులు ఈ కాలముననున్నది మౌర్య చంద్రగుప్తుడేయని, యది నిర్వివాదమైన విషయముగా చరిత్ర గ్రంథములందు ప్రకటించిరి. ఇట్లు సాహసముతో ప్రవర్తించిన యీ చర్యచే భారతదేశ ప్రాచీన చరిత్ర తారుమారయినది. ప్రమర వంశ ప్రభువులైన విక్రమార్క, శాలివాహనులు తమ పేర శకములను స్థాపించుకొనిన చిరకీర్తికాయులు, కాని చారిత్రకుల దృష్టిలో వీరులేరు. ఒకచో నున్నచో వారు కల్పితగాథా జనిత ప్రభువులు. ఎంత విచిత్రము!

భారతీయ ఖగోళ జ్యోతిర్విజ్ఞాన విషయములు వీరి దృష్టిలో నవిశ్వసనీయములు. పురాణములు మత ప్రచారమునకయి వ్రాయబడిన గ్రంథములని యాధునికుల నమ్మిక. ఇది మొదట పాశ్చాత్యులతో నారంభమయి స్వదేశీయులకును ప్రాకినది. కాలముల మార్పు, రాజుల మార్పు, సిద్ధాంతముల మార్పు, శ్లోకముల మార్పు- ఈ మార్పులతో బురాణముల సత్యప్రతిపత్తిని గూల్చుటకయి వీరు యథాశక్తి దోహదమొనర్చిరి. పురాణములందు చెప్పబడిన యంశముల నితర చారిత్రకోపపత్తులతోడను జ్యోతిర్విజ్ఞానము తోడను సమన్వయించుకొనినచో సత్యచరిత్ర లిఖింపవీలగునని సంప్రదాయజ్ఞులు చెప్పెడిమాట. కాని యీ సమన్వయ విధానమును పాశ్చాత్యులు గాని, వారి యనుయాయులయిన స్వదేశీయులుగాని యంగీకరింపరు.

ఇట్టియెడ భారతప్రజకు ప్రాచీన చరిత్ర గ్రంథములు లేవని యొక ప్రక్క విశ్వసింప జేయుచునే మరియొక ప్రక్కను నీ పురాణములందలి చారిత్రకాంశములనే తమకు సమన్వయపడు తావులందు గ్రహించి ప్రాచీన చరిత్ర పేరున వ్రాయుగడంగిన వారి సాహసము నేమనవలయును ?

చారిత్రకులు తమ సిద్ధాంతముల కుపోద్బలకముగా భావించెడి శాసనములు, పురావస్తువులు, నాణెములు, సత్యచరిత్ర ప్రకటనమునకు దోడుపడుననుటలో సందేహము లేదు. కాని యట్టివి లభ్యపడనంత మాత్రమున నా కాలమున చరిత్ర లేదనుటగాని మానవులే నివసించ లేదనిగాని నిర్ణయము చేయుట సాహసమగును. ప్రాచీనకాలపు సాహిత్యము సైతము నొక్కొక్క సమయమున చారిత్రక విజ్ఞాన సాధనము గావచ్చును. సాహిత్యము, శాస్త్రములు పరస్పరము సమన్వయ పడినచో నంతకంటె ప్రత్యక్ష సాక్ష్యము చరిత్ర లిఖించుటకు మరియొక్కటి యుండనక్కర లేదు, చారిత్రకాంశములయిన వానిలో ననేక శాసనములు, పురావస్తుసంచయము, అమూల్య గ్రంథాలయములు మహమ్మదీయుల దండయాత్రలందు సమూల నిర్మూలనము గావింపబడినవని యాధునిక చరిత్రకారులే యంగీకరించుచున్నారు. పురాణమనగా 'ననాది' యున్న యర్థ మొకటి యున్నది. అనాదియైనది భగవద్విషయము దక్క నన్య ముండదు. నాస్తికము నటుంచి యాస్తికమతము లన్నియు నీ విషయమును నిర్ద్వంద్వముగా సమర్థించును, ఆ విషయమందలి విరోధమే యీ పురాణవైరము. ఇది పాతపగ. సంప్రదాయ సిద్ధముగా, ననుస్యూతముగా వచ్చుచున్న చారిత్రక విషయమును కాదనుటచే సాధించినది చరిత్ర యందొక యనిశ్చిత స్థితి. లోకమున మానవుని బుద్ధి ద్వైధా విభక్తము. సంప్రదాయ బుద్ధి, తదితర బుద్ధి. వీనిలో నా మానవుని సంస్కార బలము చేత నేది యధః కరింపబడి యేది యున్నతమై

యుండునో దానిచే నా మానవుడు ప్రభావితుడగును. కనుక లోక మున నీ విషయమయిన భేదముచేత సంప్రదాయ, సంప్రదాయేతర ములు తెగ లుండుట సహజము. సమాహార స్వరూపముగా నీరెండింటిలో నెయ్యది యధికమై విజృంభించునో యదియే యా యా కాలము లందు విహారము సలుపును. సంప్రదాయజ్ఞత యధిక ముగా వర్తిల్లు సమయమున తద్విరుద్ధమయిన బుద్ధి చేయునది లేక దాని కణగి మణగి యుండును. లేనిచో నట్టి బుద్ధి సమూహ మొక జాతియయి వీరిని దోలగి యితర ప్రదేశములందు జేరి యేతదసంప్ర దాయ పరిపుష్టమయిన సిద్ధాంతములను నిర్మించి ప్రచార మొన ర్చును. కాలక్రమమున నేండ్లు, యుగములు గడిచిన వెనుక నా సిద్ధాంతములకు గుర్తింపువచ్చును. దాని ననువర్తించెడి వారి సంఖ్య విస్తృతమగును. ప్రపంచమందు నీరెచ్చటనున్నను సిద్ధాంత మదియే. అది సంప్రదాయ విచ్ఛిన్నత. ఏతత్స్వరూప విరోధమే- పురాణవైరము. ప్రాచీనవైరము, సంప్రదాయ విరోధము, భగవద్వైరము.

ఇక సంప్రదాయజ్ఞుల స్వరూపమిట్లుండును. వీరికి భారత దేశమే తొలుతనున్న మొట్టమొదటి భూభాగమనెడి విశ్వాసము. భగవంతుడు తొలుత నిచటనే సృష్టి కావించెను. మహాప్రళయ ములు, అన్యప్రళయము సంభవించినపుడు మనువుచే ప్రతిసృష్టి యొనర్ప బడిన ప్రదేశమిదియే యని వీరందురు. జన్మరాహిత్యము వీరి లక్ష్యము. భగవదిష్టత సంప్రదాయానుసరణముచే కలిగిన నది ముక్తిసాధన మగును. ఆ సంప్రదాయము, భగద్వి రోధము పెరిగి పెచ్చరిలినచో పరమేశ్వరుడే మానుష వేషధరుడై భూమి యందవతరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ గావించును. వేదములు, పురాణేతిహాసములు, ప్రస్థానత్రయము వీరికి ప్రమాణ గ్రంథములు. ఇది పురాణానుకూలము, పురాణవైర వైరిమార్గము.

వీరికిని వారికిని నెప్పుడును విరోధమే. ఇది యనాదివైరము. సృష్ట్యాది నుండి నేటిదనుక వ్యాప్తము. ఒకటి దైవీ సంపద, రెండవది ఆసురీ స్థితి. ఇది నిత్యాపహరోత్రము. ఒకప్పుడసుర ప్రవృత్తికి విజయము లభించినను నంతిమ జయము ఆ దైవ సంపదకే. ఆ సంప్రదాయ విచ్ఛిన్నతకే జయధ్యానము.

వీనిని సవివరముగా నిరూపణము గావించు లక్ష్యముతో నున్న గ్రంథమాల శ్రీ విశ్వనాథవారి పురాణవైర నామక వకుళమాల. ఇది యన్వర్థము. విమర్శించినకొలది భావపరిమళము గుబాళించును.

గ్రంథ రచనా సముద్దేశము :

పురాణములందు చారిత్రకాంశములున్నవి. సృష్ట్యాదినుండి కాలపరిగణనమున్నది. మనువుల చరిత్రయున్నది. యుగ పరిమాణము లెక్కింపబడినది. కృతాది ద్వాపరాంతమువరకు బాలించిన రాజవంశ క్రమమును సూక్ష్మముగా బురాణములు పేర్కొన్నవి. గజేంద్ర మోక్షము, తారకాసుర సంహారము, భగవంతుని వివిధావతారము లకు సమన్వయింపబడిన గాథలు — ఇవి యన్నియు నొకనాటి చరి త్రాంశములే. కాలాధిక్యముచే నివి గాథలయినవి. కల్యాది చరిత్రను పురాణము లొక క్రమమున, ననుస్యూతమయిన రాజవంశావళితో సమన్వయింపుచు పేర్కొన్నవి. వీనిని గ్రహించి పాశ్చాత్యులే ప్రప్రథ మమున పరిశోధన గావించి కలిరాజవంశ క్రమమును బ్రకటించిరి. అట్టి వారిలో ప్రథమ గణ్యుడు పార్జిటరు మహాశయుడు. స్మిత్, జోన్సు పండితులుగూడ పురాణములలో చారిత్రకాంశములను పరిశోధనము సల్పినవారే. వీరి ననుసరించిన భారతీయులు సయితము పురాణము లందలి చరిత్రాంశములను బరిశోధించి పాశ్చాత్యుల వాద మునే సమర్థించిరి.

పురాణముల ననుసరించియు వీరెవ్వరును కల్యాదినుండి చరిత్రను ప్రారంభించి యుండలేదు. నాడు భారతదేశమునందు వర్ధిల్లుచున్న శక కాలములు పాశ్చాత్యు లెఱుంగరు. ఇవి రెండును సమీకరింప బడిన ఘటన యొకే యొకటియున్నది. [అది గ్రీకు దేశీయుడయిన అలెగ్జాండరు ప్రభువు భారతదేశమునకు దండయాత్రకయి వచ్చినకాలము. క్రీ. పూ. 327 వ సంవత్సరమది. అప్పుడు మగధ సామ్రాజ్యమును పాలించుచున్న ప్రభువు గుప్తవంశములోని చంద్రగుప్తుడు. వీనిని మౌర్య చంద్రగుప్తునిగా భావించి యటనుండి పూర్వాపరములకు చరిత్ర సల్లిరి. ఆ కారణముచే గుప్తచంద్రగుప్తుల కాలము క్రీ. పూ. 327వ సంవత్సరము గావలసి యుండగా నది. క్రీ. శ 320వ సంవత్సర మయినది. దీనితో క్రీస్తుశకమునకు పూర్వాపరము లందొక శతాబ్ది యందున్న విక్రమార్క- శాలివాహన ప్రభువులకు దేశచరిత్రలో స్థానము లేకపోయెను. వారు కల్పిత ప్రభువులైరి. వీరి స్థానములో క్రీ. పూ 600వ సంవత్సరముల నాటి యాంధ్ర రాజులు దేశపాలకులయినట్లు చరిత్ర వ్రాయబడెను.

ఇట్లు పాశ్చాత్య చరిత్రకారులు దేశీయ చరిత్రపయి నధికారమును సంపాదించిరి భారతయుద్ధకాలము నుండి యీ దేశమునకుగల చరిత్రను క్రమానుగతముగా రచించినచో మౌర్యులు క్రీ. పూ. 14వ శతాబ్దికి వత్తురు. గుప్త చంద్రగుప్తుని కాలము గ్రీకు ప్రభువు కాలముతో సమన్వయపడును. శాలివాహనుడు, వీరి తాతయగు విక్రమార్కుడు వారి వారి కాలములందు స్థానము నందుదురు, ఈ విధమయిన చరిత్ర సంగ్రథన మొనర్చుటకు గావలసిన చారిత్రక పత్రములున్నవి. పురా గ్రంథములున్నవి. శాసనములున్నవి. అన్నింటికి ముందుగా భారతయుద్ధ కాలనిర్ణయము చేయవలయును. ఈ పరిశోధన గావించిన వారున్నారు. వారిలో నగ్రగణ్యుడు శ్రీ టి. యస్.

నారాయణశాస్త్రిగారు. వీరు శంకరుని కాల నిర్ణయము; 'మగధరాజులు' అను గ్రంథములను నాంగ్లమున రచించిరి. అందు మహాభారత యుద్ధకాలము నిర్ణయింపబడెను. నరసరావుపేట వాస్తవ్యులు, ప్రముఖ న్యాయవాదియగు నడింపల్లి జగన్నాథరావుగారు రెండవ వారు. వీరు పురాణ, పురాణేతర, శాస్త్ర, చారిత్రక గ్రంథములను బరిశోధించి యీ యుద్ధకాలమును క్రీ. పూ. 3138వ సంవత్సరముగా నిర్ణయించిరి. ఉత్తరదేశ పండితులందు మన్కడ్ మహాశయు లీవిషయమున బహుధా కృషిసల్పిరి. శ్రీ కోట వెంకటాచలంగారు భారతీతిహాస భాస్కర బిరుదాంకితులు. వీరు భారతదేశమందు చరిత్ర విషయములో ప్రథమమున పాశ్చాత్యులచే, ననంతరము స్వదేశీయులచే గావింపబడిన దురన్యాయమును సమర్థవంతముగ సవిమర్శముగ నెదుర్కొని పెక్కు గ్రంథములను రచించిరి. ఈ చరిత్ర భారతదేశ చరిత్ర పునర్నిర్మాణ మహాసౌధమునకు బటిష్టమయిన పునాదులు నిర్మించుటకు నాధునిక చరిత్రకారులచే నవశ్యము స్వీకరింపవలసిన ప్రమాణపత్ర మనుటలో విప్రతిపత్తిలేదు. ఇదియే శ్రీ విశ్వనాథ వారికి ఈ బృహత్తర కార్యక్రమమును చేపట్టుటకు వీలు కల్గింపచేసినది. సాహిత్యవేత్తకు సంస్కరణాభిలాష సహజముగనే యుండును. ఆ సంస్కరణము నాన్యతోదర్శనీయమైనచో నట్టిది పలువురు గ్రసించుటయు జరుగును. అంతమాత్రముచేత వెనుదీసినచో నది రచయిత తనపట్ల మహాదోష మొనర్చుకొనిన వాడగును. కందుకూరి, గురజాడ వీరి సంస్కరణలు మొదట వ్యతిరేకతతో నారంభింపబడినవే. కాని నేడు వారి సంస్కరణలు దేశ ప్రజలకు శిరోధార్యము లయినవి. వారు యుగకర్తలుగా గీర్తింపబడిరి. శ్రీ విశ్వనాథనుగూడ మనమట్టి భావమున దర్శించితిమేని యాయన సంస్కరణౌత్సుక్యము మనకు గోచరించును. దీనికై రచయిత 'పురాణవైర గ్రంథమాల' యన్న శీర్షిక నేర్పఱుచుకొని మగధరాజు

లలో సహదేవుని నాటినుండి యాంధ్రభృత్యులయిన గుప్తవంశ జుల వరకు, ఉజ్జయిని రాజధానిగా గలిగి పాలించిన విక్రమార్క-శాలివాహనులకాలము వరకుగల సుమారు మూడువేల సంవత్స రముల చరిత్రను సాహిత్యముతో రంగరించి పదిరెండు నవలలలో సంప్రదాయ బద్ధముగా రచించిరి. ప్రధానముగా నవలాప్రక్రియ యొక్క కళాఖండముగా రూపొందించుటకు బు రా ణ ము ల ం దు ను ల్లే ఖ ం ప బ డి న సం ఘ ట న ల నితివృత్తముగా స్వీక రించిరి. సహజప్రతిభ గల శిల్ప కళాకారుడు మలిచిన మనోహర శిల్పమువలెనే శ్రీ విశ్వనాథ యీ నవలాశిల్పమును నిర్వహించెను. సంప్రదాయ విచ్ఛిన్నత జరుగుటకు నా యా కాలములందు పెచ్చరిలిన తీవ్ర ప్రయత్నములు, అసంప్రదాయములు చోటు చేసికొనిన తావులు ఆయా పరిస్థితులు, జీవుల జన్మ సంస్కారములు, భారతదేశ మందా సంప్రదాయ మెట్టకేలకు ప్రవేశించినను, నది కాలూనక ముందే విచ్ఛిన్నము గావించుటకు దైవ (కాల) చోదిత ప్రయత్నములు-ఇవి యన్నియు నీనవలల యందాసక్తికరమైన విషయములు. ఒక వంక ననుస్యూతముగా నీపంద్రెండు నవలల యందు (తీవగా) సాగిన భార తీయ ధర్మ ప్రవంతిని పాఠకుడు దర్శించును.

సాహిత్యస్రష్ట సత్యవిషయ ప్రతిపాదనము చేయుట యవశ్య కర్తవ్యము. కాని ఆ సత్యమును ప్రత్యక్షముగ వ్యక్తీకరించినచో నదిశాస్త్ర విషయము. పరిమిత ప్రయోజన సాధకము. సాహిత్య ప్రయోజనము దీనితో సంకుచితమగుచున్నది. సాహిత్యము విశ్వ శ్రేయ సాధనమయినను రసానందజనకత్వమును గావలయును. రసా నందజనకమయి, ప్రయోజన రహితమయినచో నది మధ్యమము. ప్రయోజనాత్మకము గూడనయినచో నది యుత్తమము. ఈ ప్రక్రియ రసానందతుందిలమయి సరసజనామోదము బడసినది. సహృదయైక

వేద్యమగు చున్నది. సత్యచరిత్ర ప్రకటనమను ప్రయోజనము సిద్ధింప జేయుచున్నది. సాహిత్యాచార్యలోక సత్య విషయమును లోకమున కెఱింగింప వలయునన్న తపనతో ననేకోపయోగానుప యోగములయిన విషయములను పాఠకులకు ప్రబోధించును. అందే తాను ప్రకటింపదలచిన ప్రధాన విషయమును కూడ కించిద్గాఢముగ నాలపించును. గీతాచార్యుడును తన యుపదేశములో ననేకోపాయ ములు, సామాన్య విశేష ధర్మములను ప్రబోధించును. తుద కంత స్సారమయిన శరణాగత ధర్మమును, తన యంతర్యామిత్వమును లోక మున కెఱుకపఱచెను గదా! ఈ మహత్తర పథము నవలంబించిన వారే శ్రీ విశ్వనాథ. దీనియందలి చారిత్రకాంశములు విస్పష్టము. మిగుల సూక్ష్మము. కాని యీ యంశము విశ్వమందఱివు వలె 'యానవలాంతము' వ్యాపృతము. ఆశ్చర్యజనకము. ఇట్టి నిర్వ హణము నాన్యతో దర్శనీయ మనునంత సూక్ష్మముగా దీనిని నిర్మించిరి. సాహిత్యమున నీయన సృజింపని ప్రక్రియ లేకపోవుటం జేసియు. చేపట్టిన ప్రతి ప్రక్రియను నత్యంతసమర్థవంతముగా నిర్వ హించుటం జేసి, యేప్రక్రియ వలన నేప్రయోజనము సాధింప వచ్చునో, యా విషయము నాప్రక్రియా మార్గముననే నిర్వహింప నెంచి యీ నవలా ప్రక్రియను బహుళజన ప్రయోజనార్థమై చేబూని నట్లు విస్పష్టమగుచున్నది. ఆధునిక సాహిత్య ప్రపంచములో పద్య మున కంటె గద్యమునకే పెద్ద గద్దియ. సంసారతరణమునకు తరుణో పాయము శరణాగతి యన్న విధమున సాహిత్య సమాలోచనమునకు సులువయినదియు, పెక్కు పిపాసుల తృష్ణ నుపశమింప జేయునదియు గద్యము. ఆబాలవృద్ధులకీ ప్రక్రియ నేడు సుపరిచితము. అత్యంతా కర్షకము. ప్రజాభిప్రాయము నామూలాగ్రముగా నాపోశనము పట్టిన శ్రీ విశ్వనాథ వేఱొక ప్రక్రియ జేపట్టి విషయ వ్యాప్తిని

సంకుచితముజేయ సుంకింపలేదు. ఈ నవలలందుగల కల్పనాచమత్కృతులతో గూడిన సంప్రదాయ, సంప్రదాయేతర వస్తుసంగ్రహణము, బ్రహ్మము నావరించుకొని మాయా సదృశముగా భాసించెడి నాటి రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక, సాంస్కృతిక సంఘట్టన సహిత సృష్టిని ప్రజావళి విస్పష్టముగా నెఱుంగ వలయుననియే యాయన యుద్దేశ్యము. ఇదియే యీ గ్రంథమాలా లక్ష్యము.

ఈ లక్ష్యమును నెరవేర్చుటకు శ్రీ విశ్వనాథ తాను గ్రహించిన చారిత్రకోపపత్తు లేవియో ముందుగా తెలిసికొందము.

# 4. చారిత్రకోపపత్తులు

## 1. మహాభారత యుద్ధకాలము

ఒక దేశచరిత్ర లిఖించుటకు గల యాధారములు పెక్కుండును. వానిలో నాదేశ సంప్రదాయజ్ఞులకు నిత్యప్రస్తుతముగ నుండెడి సాహిత్యము గూడ నవశ్యము ప్రాగస్త్యమ్యము వహించును. ఒకనొకచో నవియే ప్రబల నిదర్శన దర్శకత్వము పూనును. ఏవిధమయిన యితర ప్రబలోపబలక రహితమయిన కాలపు చరిత్ర వ్రాయుచో నాకాల మందుద్భూత మయిన సాహిత్య సంపద నిరసింపబడినదన్నచో నాకాలపు చరిత్రపుటలు వర్తమాన ప్రజకంధకార బంధుర మగును అది తమకు ప్రాచీనతయే లేదనెడు విశ్వాసము కల్గించుట కవకాశ మిచ్చును. ఇది యాదేశప్రజల కాదేశచరిత్రకారు లొనర్చెడి తీవ్ర ద్రోహ మనవచ్చును. ఇట్టి ద్రోహ మీదేశమున కాంగ్లేయుల పాలనమందు తద్దేశీయ చరిత్రకారుల చేతను, వారి యనుయాయు లయిన స్వదేశీయ చారిత్రకుల చేతను సంభవించిన దనుటకు నిదర్శనము లున్నవని తజ్ఞులు భావించిరి.

భారతదేశమున కత్యంతప్రాచీనత యున్నదని యొప్పుకొనెడి పాశ్చాత్యులు - చరిత్రవిషయమున దానినంగీకరింప లేకపోయిరి. ఈ దేశచరిత్ర సమగ్రముగా పునర్నిర్మింప వలెనన్నచో నీక్రింది యంశము లను పక్షపాతరహిత బుద్ధితో శోధించి వ్రాయవలెను. అవి 1. మహాభారత యుద్ధకాలము నుండి చారిత్ర కాంశములను సేకరించి గ్రంథస్థ మొనర్చుట, 2. మౌర్యగుప్త, చంద్రగుప్తుల కాలమున అనుకరణ బుద్ధితో గాక నాత్మప్రత్యయముతో నిర్ణయించుట, 3. పాశ్చాత్యులచే మిథ్యాచక్రవర్తులుగా ద్రోసివేయబడిన విక్రమార్క, శాలివాహనుల

కాలమును, వారి చరిత్రను సమగ్రముగా బరిశోధించి చరిత్రగ్రంథము లందు సముచితమయిన స్థానమొసంగుట.

వీనిని సత్యాన్వేషణ బుద్ధితో పరిశోధించిన పండితుల యభిప్రాయము లాధునిక చరిత్రజ్ఞుల కవశ్యస్వీకార మనుటలో నెట్టి సందేహమును లేదు. ఇట్లయినచో గల్యాది నేటిదనుక నీదేశమున కనుస్యూతమయిన, సమగ్రమయిన, విశ్వాసమయిన చరిత్ర సమకూర్చి పెట్టిన ఘనత వీరికి దక్కును. భారతీయులు తమ ప్రాచీనచరిత్ర నెఱుంగరనెడి యపప్రథ తొలగిపోవును.

ఇందు ప్రథమసమస్య మహాభారత యుద్ధకాల నిర్ణయము. ఇది యథార్థమా? కల్పితమా? యను వివాదము నేటికిని నిలిచియే యున్నది. పాశ్చాత్యుల విషయమటుంచి భారతీయ చారిత్రక పరిశోధకులకే యీ యంశము సందేహాభిప్రాయము కుదరకున్నది. ప్రాచీనగ్రంథములపయి విశ్వాసము పూజ్యమగుటయే దీనికి హేతువు కావచ్చును. యుద్ధము జరుగలేదనెడి ప్రబుద్ధులున్నారు! కుటుంబ కలహమే గాని యితరము గాదని త్రోసిపుచ్చిన వారున్నారు? సరియయిన యాధారము లేక విశ్వసించు టెట్లని మూకీభావము వహించిన వారున్నారు. ఇక యుద్ధము జరిగినదని యెట్టిటో నమ్మిక గలవారీ యుద్ధకాలమును క్రీ. పూ. 1400 ల నుండి యారువేల సంవత్సరముల వరకు నిర్ణయించిరి. సంప్రదాయమును నమ్మరు. ఆనాటి గ్రంథము

---

1. The History of Maha Bharata, by N. V. Thadani, 1-IV Volumes, Karachi 1931-34 as quoted in the article. "Five thousand years Ago Maha Bharata war" by D. S. Triveda, Poona, P. 515.

2. An article in "Indian Express" D/Monday, 15 Sept., 1975 opinion given by Dr. D. C. Sircar". A Myth having no Historical Value or a small family fued perhaps a tribal struggle'...

లందలి యంశము లవిశ్వసనీయ మందురు. తామొక నిర్ణయమునకు రాలేరు. ఇట్టి కాలనిర్ణయము చరిత్రలేఖనములో కీలకభాగ మయ్యును, చారిత్రకులకు నిర్ణయింప రాని యంశమయి పరిశోధకుల కెదిరినిల్చినది.

ఈ కాలమును సంప్రదాయ గ్రంథము లన్నియు నొకేవిధముగ పరిష్కరించిరి. ఆ విధమును మనమంగీకరించినచో నాదినుండి క్రీస్తుశక మారంభించు వరకు చరిత్ర కేకసూత్రత ఘటింప వీలొసంగును. ఆ పరిష్కారము నొకక్రమములో రూపొందించిన మహామహుల యభిప్రాయములు మన కవశ్య స్వీకారములు. ట్రోజను యుద్ధ మున్నది. అది ప్రపంచచరిత్ర యందే విశిష్ట స్థానమును సంపాదించుకొన్నది. ఆ యుద్ధవిఖ్యాతికి ముగ్ధులయి పాశ్చాత్యకవులయిన యురిపిడీయస్, ఇచ్చలిస్, హోమరు, సొఫిక్లిస్ తమ కావ్యములందు గానము చేసిరి. ఈ యుద్ధకాల సత్యత్వమును గురించి యెట్టి ప్రశ్నయు నుదయింపలేదు, సూక్ష్మాంశములను సయితము పొందుపఱచి ప్రత్యక్షానుభవముతో చెప్పిన యీ భారతయుద్ధ గాథను వర్ణించిన పట్టును మాత్రము మనము విశ్వసించుటలేదు. ఇది నేటి మనస్థితి, ఈ సందర్భమున మనము (Michael Temple) మైకేల్ టెంపిల్ చెప్పెడి వాక్యములను స్మరింపవలెను. ఆయన ప్రాచీనగాథల యందలి సత్యత్వస్థితిని గురించి పలుకుచు. "సత్యము దాని యందంత ర్లీనముగా నెచ్చటనో నిక్షిప్తమయి యుండుననియు, గాథలు నేల విడిచి విహరింప జాలవనియు, మొక్క మానుగా మార్పునొంది విభిన్నమయిన శాఖోపశాఖలతో విస్తరించి విచిత్రాకృతి బూనినను, అద్దాని ప్రస్తుత స్థితిని బట్టి దాని పూర్వాపూర్వ రూపమయిన సూక్ష్మ రూపమును గుర్తింప లేనంత మాత్రమున దానికి మూలమయిన

* "Englishman" Feb., 1927 – an essay by "Michael Temple"

యుంకురముండుటను విస్మరింప లేమనుచు నుదాత్తముగా బ్రవచించి యుంటుట గమనార్హము. కనుక మహాభారత యుద్ధగాథ సత్యసమ్మత మనియే భావించుట కెట్టియవరోధము కానబడదు. ఈ కాలమును నిర్ణయించుటలో నీక్రింది యంశములు క్రమముగా విపులీకరింప బడుచున్నవి.

1) సంప్రదాయ గ్రంథము లందు యుద్ధప్రసక్తి, యుద్ధవీరుల ప్రసక్తి.

2) పాశ్చాత్యపండితులు, వారిననుసరించిన భారతీయ పండితుల వాదములు.

3) కల్హణుని రాజతరంగిణి యుద్ధకాల పరామర్శ

4) శాసనము లందీ యుద్ధ ప్రసక్తి

1) ఐహోలా 2) నిధనపూర్ శాసనములు

5) ఖగోళశాస్త్ర గ్రంథము లందీ యుద్ధకాల ప్రసక్తి

6) ఐని అక్బర్ (ANI AKBAR)

7) భారతగ్రంథములోని యాంతరంగిక సాక్ష్యము.

ఏ ప్రాచీనత లేకచో మానవుని యద్యతన మయిన మనుగడయే నిరర్థకమయి చనునో, యే సంస్కృతిని తన జీవలక్షణముగా ప్రభావితము చేసికొని తాను సుసంపన్నత నొంది సచ్ఛీలసముపార్జనకు గడంగునో, తత్ప్రాచీనత, తత్సంస్కృతి సంప్రదాయసంబంధి యగును. అవి వేదశాస్త్ర పురాణేతిహాసములందు నిక్షిప్తమయినవి. ఈ దేశప్రజలతో వానికి విడదీయరాని యనుబంధము గలదు. ఇట గల 'స్త్రీ పురుషులు సీతారాములు, రుక్మిణీ కృష్ణులు-వట్టి లక్ష్మమ్మ

లక్ష్మయ్యగారు' అను విశ్వనాథ వాక్యమున కిది వివరణము- వీనిని కాదనుటయన్న తానున్న కొమ్మను తాను నఱకు కొనుట వంటిది. శతపథ బ్రాహ్మణమందు మహాభారత వీరుల ప్రసక్తియున్నది.[4] ఛాందోగ్యమున మహాభారతమునకు సూత్రధారుడు శ్రీకృష్ణుడుగ పేర్కొనబడెను. బృహదారణ్యకోపనిషత్తునందు[6] కురుపాంచాలు రుద్ధరింపబడిరి. ప్రప్రథమ సంస్కృత వ్యాకరణ గ్రంథమయిన

---

4. అబధ్న దశ్వం జనమేజయ సారగ మితి । ఏవఒఏవ పూర్వేఒహని, జ్యోతి రతిరాత్రస్తేన భీమసేన మేతేఒఏవ పూర్వేఒహని, గౌ రతిరాత్ర స్తేనోగ్రసేన మేతేఒఏవ పూర్వేఒహని ఆయురతిరాత్ర స్తేన శ్రుతసేన మిత్యేతే పారిక్షిత యా స్తదేవ గ్గాథయామి గీతం పారిక్షిత యజమానా అశ్వమేధైః. పరోఒవర మజుహుః కర్మ పాపకం పుణ్యాః పుణ్యేన కర్మణా॥ 3 శతపథ బ్రాహ్మణము 13_5_4.

5. తద్ధైతద్ఘోర అంగిరసః కృష్ణాయ దేవకీ పుత్రా యోక్త్వో వాచా పిపాస।
ఛాందోగ్యము 111_17_6.

6. కురుపాంచాలానాం బ్రాహ్మణా సత్యవాదీ, 111_9_19
కురుపాంచాలానాం బ్రాహ్మణా అభిసమేతా బభూవుః 111_1_1
క్వ పారిక్షితా అభవన్నితి, క్వపారిక్షితా అభవన్
సత్వాపృచ్ఛామి, యాజ్ఞవల్క్య క్వపారిక్షితా!
అభవన్నితి బృహదారణ్యకోపనిషత్ 111_3_1

పాణిని యందును.[7] వరరుచి వార్తికము లందును. పతంజలి మహాభాష్యము[8] నందును నీ కురువీర నామములు స్పృశింపబడినవి. ఈ గ్రంథకారు డయిన పాణిని కలి యనంతరము నాల్గవ శతాబ్దియందు గలడని శ్రీ కోట వెంకటాచలంగారి సూచన.[10] అయినచో నీ ప్రసిద్ధ నామములు పేర్కొనుటలో గల ప్రామాణ్యమును గమనింప వచ్చును.

ప్రాశ్చాత్య ప్రాచ్య పండితుల వాదములు :- అలెగ్జాండరు కాలమును క్రీ. పూ. 322వ సంవత్సరముగా నిర్ణయించి యంతకు ఎనుబదేండ్లకు ముందు వానిగా నందుని కాలమును పార్జితరు నిర్ణయించెను. ఈతని దృష్టిలో నందులు క్రీ. పూ. 402 నాటి వారగు చున్నారు. బార్హద్రధులు లిరువది యిద్దరు 920 సంవత్సరములు, ప్రద్యోతు లైదుగురు 133 సంవత్సరములు శిశునాగులు పదుగురు

---

7) భీమాదయోఽపాదానే Panini 111-4-74 కురూనాదిభ్యో ణ్యః 1-172 Panini

స్త్రియా మవన్తీ కున్తీ కురూభ్యశ్చ 1-176

వాసుదేవార్జునాభ్యాం వృణ్ 4-3-98 గవి యుధిభ్యాం స్థిరః Ibid 8-3.95

Vartika on panini IV 197

8) వ్యాన వరూన్నిషాద చండాల విమ్యానాం చేతి వక్తవ్యమ్

Abid V 1-168 పాండో ణ్యన్

Bhashya Panini III-1-16.

9) కంసవధ మాచష్టే Abid II 3-36.

సాధుఃకృష్ణో మాతరి అసాధు మాతలె Ibid III 2-118.

యుజతి స్మ యుధిష్ఠిరః /

10) 'భారతీయ శకములు' K. Venkata Chalam, Page 90.

383) సంవత్సరములు పాలించిరని ఈయన లెక్క. మహానందుని కాలమునకు నిది 1330 సంవత్సరము లగుచున్నది. మహానందుని కాలము క్రీ. పూ. 402 వ సంవత్సర మయినచో పరీక్షిత్తు కాలము నుండి క్రీస్తు శకమున కంతరము 1782వ సంవత్సరమగును. ఈయన మతమున మహాభారత యుద్ధము క్రీ. పూ. 1782 వ సంవత్సరమున జరిగినట్లుగా భావింపదగును.[11] ఈయనయే మరియొక గ్రంథమున నీయుద్ధకాలమును క్రీ. పూ. 950 వ సంవత్సరముగా వ్రాసెను.[12] ఒకే వ్యక్తి ఒకే విషయము పయి తన పూర్వాభిప్రాయమును ఖండింప కనే వేర్వేరభిప్రాయములను గ్రంథస్థమొనర్చుట చింత్యము. ఈయన యభిప్రాయమే మరియొకటెగూడ అనగా నీయుద్ధకాలము క్రీ. పూ. 1783 గా నున్నట్లు శ్రీ కృష్ణమాచార్యులుగారు తమ గ్రంథమం దుట్టంకించిరి,

కల్నర్ విల్ఫోర్డు గణనము ప్రకార మీయుద్ధము క్రీ. పూ. 1370 వ సంవత్సరమున ముగిసినట్లు హెచ్. హెచ్. విల్సన్ విష్ణు పురాణగ్రంథమునకు వ్రాసిన ఆంగ్లవ్యాఖ్యానమున నుదహరించెను[14] మేక్డోనాల్ పండితుడి[15] యుద్ధ మెట్టి పరిస్థితుల యందును 10వశతాబ్దికి పూర్వము జరిగి యుండదని నిష్కర్షగా పలికెను. హాప్కిన్సు[16] క్రీ. పూ. 4వ శతాబ్ది యుందనెను. పాశ్చాత్య పండితులందు

11. 'Dynasties of Kali Age'. Pargiter, introductory passage.
12. Anecient Indian Historical Tradition by F. E. Pargiter, Lond. 1922 edn. P. 179
13. History of Sanskrit Literature, by Sri M. Krishnamacharyulu Introduction P. IXXXII
14. Vishnu Purana, H. H. WILSON IV 232
15. History of Sanskrit Literature Macdonol P. 284-86
16. The great epic of India, 397-400.

మాత్రమే యీ యనైక్యతగాదు, ప్రాచ్య పండితుల యభిప్రాయములు గమనించినచో నీ యభిప్రాయ వైరుధ్యములు మరింత స్పష్టపడును.

శ్రీసీతానాథ ప్రధానుడు యుద్ధకాలమును క్రీ. పూ. 1151 గా నిర్ణయించెను. బార్హద్రథులలో చివరి వాడైయున రిపుంజయుని కాలము క్రీ. పూ. 563గా నిర్ణయించి అంతకు పూర్వ ముండిన యిరువది యొక్క రాజుల పాలన కాలమును 588 సంవత్సరములుగా జూపెను. వీరికి సగటు 28 సంవత్సరములు పాలనను గ్రహించెను.[17]

రమేశచంద్ర దత్తు కురు పాంచాల యుద్ధ కాలమునకు బుద్ధుని కాలమునకు నడిమి ముప్పది యైదుగురు రాజులున్నట్లు లెక్కగట్టి (మగధ రాజవంశముల ననుసరించితినని చెప్పెను) యొక్కొక్క రాజునకు సగటుపాలన నిరువది సంవత్సరములు విధించెను వీరు బుద్ధుని కాలము క్రీ. పూ. 600తో గలిపికొన్నచో నీయుద్ధ కాలము క్రీ పూ. (35 × 20+600) 1300గా నిర్ణయింపనగునని వ్రాసిరి.[18]

శశిభూషణ విద్యార్ణవ[19] క్రీ. పూ. 1922న యుద్ధము జరిగినట్లు భావింపగా ధీరేంద్రనాథ్ పాల్[20] క్రీ. పూ. 15, 16 శతాబ్దుల కాలములోనని వ్రాసెను. డా. రాయ్‌చౌధురి పరీక్షిత్తుని కాలము

---

17. Chronology of anecient India, by S. N. Pradhan P. 248.

18. Civilization in anecient India, by R. C. Dutt Vol. I. P. 10 & 36.

19. Matsya Purana, Introduction App. II. XXIV

20. Krishna - his life and teachings-Introductory Pages-Dhirendranadh Paul.

క్రీ. పూ 1412గా నిర్ణయించెను. ఈయన చంద్రగుప్త మౌర్యుని కాలము క్రీ. పూ. 322గను అంతకు ముందు పాలించిన నందుని కాలము 40 సంవత్సరములుగను, పరీక్షిత్తుని నుండి నందుని వరకు గల యంతరము 1015 సంవత్సరములని చెప్పి యీ యుద్ధకాలము క్రీ. పూ. 1412గా సమన్వయ పరచెను.[21] డా. జయస్వాలు నందుని కాలము ఎనుబది యేడు సంవత్సరములుగా భావించెను, మిగిలిన దంతయు డా॥ రాయ్ చౌధురినే స్వీకరించెను. ఈయన చెప్పినన భారతయుద్ధ కాలము క్రీ. పూ. 1424 అగుచున్నది.[22] డా. యన్. సి. విద్యా భూషణులు, ఎల్. ఎస్. కాక్ మహాశయులు నందుని పాలన కాలమును శత సంవత్సరములుగా నంగీకరించిరి. పరీక్షిత్తు నుండి నందునకు గల యంతరము 1600 సంవత్సరములుగా స్వీకరించిరి. వీరి మతము ననుసరించి (320+100+1500) 1922 క్రీ. పూ. భారత యుద్ధకాలముగా[23] నున్నది.

పాశ్చాత్య చారిత్రకులుగాని వారి యనుయాయులయిన భారత చారిత్రక పరిశోధకులుగాని పురాణములందలి రాజవంశావళిని తావన్మాత్రముగ గ్రహించిరి. అందీయబడిన కాలమును యథాతథముగ గ్రహించి పరిశీలింపలేదనుటకు పై యుదాహరణములు చాలును. పై విషయమునందు లోపములు 1. పురాణములలోని వంశములను యథాతథముగా స్వీకరింపకుండుట.

---

21. The political History of anecient India,
R. C. Choudary Page. 15

22. Journal of Bihar, Orissa Research Society
Vol. 1 Part 1. P. 109

23. Sacred Books of Hindus series, Matsya Purana,
Allahabad (1916)
Introduction P, XXX XIV.

2) అలెగ్జాండరు కాలమును సాండ్ర కొట్టస్ చంద్రగుప్తునితో ముడిపెట్టి యది క్రీ. పూ. 322గా నిర్ణయించుట.

3) సగటు పాలనకాల నిర్ణయపద్ధతి- పురాణములందు పేర్కొన బడిన కాలము హెచ్చుగా వ్రాయబడినదని వీరు భావించి వీరిచ్చవచ్చిన విధిగా కాలములను సవరించుట,

4) నందుడు (మహాపద్మనందుడు) తాను, తన కుమారులు కలిసి శత సంవత్సరములు పాలించినట్లు పురాణము లందుండగా నొకరు నలుబది సంవత్సరములనియు, నొకరు ఎనుబది సంవత్సరములనియు నా వంశమునకు కాలమును నిర్ణయించుట.

5) పరీక్షిత్తునుండి మహాపద్మనందుని వరకుగల కాలము పదునైదు వందల సంవత్సరములని స్పష్టముగా జెప్పియుండగా నీచరిత్రజ్ఞులు 1015, 1115, 1050, 1500లలో తమ కనుకూలమయిన లెక్కను స్వీకరించుట.

పై లోపములు పరిష్కరింప బడకుండుటచే నిన్ని కాలములు ఎవరికి వారు నిర్ణయించిన సిద్ధాంతములు విస్తరించినవి.

**కల్హణుని రాజతరంగిణి :-**

కాశ్మీర రాజవంశచరిత్రను క్రోడీకరించి రాజతరంగిణి గ్రంథమును వెలయించిన కవి కల్హణుడు, ఈతడు తనకు పూర్వమున్న చారిత్రకులను తన గ్రంథమున ప్రసక్తి మొనర్చెను, ఈతడు క్రీ. శ. 1148 వ ప్రాంతమువాడు. ఇందొకటి రెండు శ్లోకములలో భారత వీరులను గురించి, యుద్ధ ప్రసక్తిని గురించి ప్రస్తావింపబడెను. ఆ శ్లోకములలో నొకటి యిది.

శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే।
కలేర్గతేషు వర్షాణా మభవన్ కురు పాండవాః॥ 1_51,

దీనికి వ్యాఖ్యాత యగు పి. సి. సేన్‌గుప్త కలి ప్రవేశించిన యనంతరము 653 సంవత్సరములకు (100×6+50-3) నీ యుద్ధము కురు పాండవుల నడుమ సంప్రాప్తించెనని వ్రాసెను.[24] కలి ప్రారంభము క్రీ. పూ. 3101 యనెడు విషయములో కల్హణుడును సందేహించ లేదు. అప్పుడీ సంఖ్య క్రీ. పూ. 2448 (3101_653) నకు సమానము. ఈతడే భారత యుద్ధము ద్వాపరాంతమున జరిగియుండె నని, ప్రజలు తాను చూపిన యీ కాలమును నమకు గొనలేదని వ్రాసి యుండుట గమనార్హము.[25] కల్హణుని గ్రంథమును సమగ్రముగా పరిశీలించితిమేని యీ యభిప్రాయమున కాతడు వచ్చుటకు వృద్ధ గార్గుని, వరాహ మిహిరుని గ్రంథములందున్న యొక శ్లోకము హేతు వనుట తెల్లమగును. మీదు మిక్కిలి యా శ్లోకమును తన గ్రంథమునందును నుదహరించుట దానిపై యాతనికి గల ప్రత్యయ మును స్పష్టమొనర్చు చున్నది. ఆ శ్లోక మిది_

ఆసన్ మఘాసు మునయః శాసతి పృథ్వీమ్ యుధిష్ఠిరే
నృపతౌ।
షడ్ద్విక పంచ ద్వియుతః శక కాల స్తస్య రాజ్ఞస్య॥
రాజ తరంగిణి 1_56

---

24. Journal of Royal Asiatic Society. Bengal, 'Bharata Battle Traditions'' by P. C. Sen Gupta, Vol. IV (1938) PP. 393-413.

25. భారతం ద్వాపరాన్తే భూ ద్వార్తయేతి విమోహితాః।
కేచి దేతాం మృషా తేషాం కాల సంఖ్యాం ప్రచక్రిరే।
రాజ తరంగిణి 1_49.

వరాహమిహిరుని బృహత్సంహిత, అధ్యాయము 12, శ్లోకము 3. వరాహమిహిరుడు విక్రమార్కుని యాస్థానము నందుండిన నవ రత్నములలో నొకడు. అనగా క్రీ. పూ. 1వ శతాబ్దియందుండెను. గర్గుడు క్రీ. పూ. 4, 5 శతాబ్దుల నున్నవాడు. అట్లు కాకున్నను నిశ్చయముగా వరాహమిహిరునకు పూర్వుడు. వరాహమిహిరుని కాలము నాటికి శాలివాహనశక ప్రసక్తి లేదు. శాలివాహనుడు క్రీ. శ. 78వ సంవత్సరమున నుండెను. గర్గ, వరాహమిహిరుల గ్రంథము లందు నుదహరింపబడిన శక కాలము అప్పటికే ప్రవర్తితమగుచున్న సైరసు శక కాలమే యగునుగాని శాలివాహన శక ప్రసక్తి నను సంధింపవలనుపడదు. గర్గుని యీ శ్లోకము నుదహరించిన వరాహ మిహిరుని బృహత్సిద్ధాంతమునకు చింతామణి వ్యాఖ్యను భట్టోత్పలుడు వ్రాసెను. అందీశ్లోక వ్యాఖ్యానమిట్లున్నది.

"కలి ద్వాపర సంధౌ స్థితాః పితృ దైవతమ్ మునయో ధర్మనిరతా

ప్రజానాం పాలనే రతాః తస్య చ యుధిష్ఠిరస్య రాజ్ఞః షడ్ద్విక

పంచ ద్వియుతః శక కాలో గతః శక నృపకాలో యుక్త కార్యః .... ... ... ...

ఈయన శక నృపకాల మనియే పేర్కొనెను గాని శాలి వాహన శకమని పేర్కొనిన వాడు కాదు. క్రీ. శ. 880వ సంవత్సరమున నున్న యీ భట్టోత్పలునకు శాలివాహన శకము పరిచితమేయగును. కాని శ్లోకము నపమార్గమును పట్టింపకుండుటకీయన వరాహమిహిరుని యంతరంగమున నున్న శక నృప కాలమునే పేర్కొని వ్యాఖ్యానించెను అప్పుడీ శ్లోకమున కర్థ మీ విధముగా జెప్పనగును. యుధిష్ఠిరుడు భూమిని పాలించు కాలమునాటికి సప్తర్షులు మఖ

యుందుండిరి. షట్ (6) ద్వి (2) పంచ (5) ద్వి (2), 'అంకానాం వామతో గతిః' యను న్యాయమున 2526 సంవత్సరములకు శక కాలమును జోడించినచో యుధిష్ఠిరుని కాలము వచ్చును కృష్ణుని కాలమునకు ప్రవర్తితమగుచున్న శాలివాహన శకమునే స్వీకరించి యుధిష్ఠిరుని కాలమును క్రీ. పూ. (2526-78) 2448 వ్రాసి యున్నట్లు 'శతేషు షట్సు' శ్లోకము వలన తెలియుచున్నది. చింతామణి వ్యాఖ్య వలన దీనియర్థము మరింత విపులమగుచున్నది. శక నృప కాలమున పారశీక దేశమున శక సామ్రాజ్యమును స్థాపించిన 'సైరసుద్గ్రేటు' (Cyrus the Great) అను ప్రభువు జ్ఞాపకమున బరగిన దగుటయు, దాని నాకాలమున మనదేశీయులును గ్రహించి యుండి రనుటకు నీకాల ప్రసక్తి నుదహరించిన గ్రంథము లుండుట చేతను దీని ప్రామాణికతకు మరింత బలము చేకూరినది. ఈ శక కాలము శకేంద్ర కాలము,[26] శక నృప కాలము.[27] శక భూప కాలము[28] అని గ్రంథములందు వివిధ నామములతో పేర్కొనుటయే దీనికి సాక్ష్యము. ఈ శక కాలము క్రీ. పూ. 550వ సంవత్సరముగా ప్రాచ్యపాశ్చాత్యులచే సంగీకరింపబడిన సత్యము. ఈ విధముగా జూచినచో యుధిష్ఠిరుని కాలము (2526+550) క్రీ. పూ. 3076 అగుచున్నది. కలి తర్వాత యుధిష్ఠిరు డిరువదియారు సంవత్సరములుండెను. కనుక కలి

26) రస గుణ పూర్ణ మహీ సమ శక నృప సమయే భవ న్మమో త్పత్తిః।
రస గుణ వర్షేణ మయా సిద్ధాంత శిరోమణి విరచితః॥

భాస్కరాచార్య

27) 'గతాని వర్షాణి శకేంద్రకాలోద్ధతాని రుద్రైర్గుణయే చ్చతుర్భిః ।'

28) 'లబ్ధేన యుక్తం శకి భూప కాలం.... ....
'బృహత్సంహిత- అ. 8, శ్లో. 20, 21.
సప్తాశ్వి వేద సంఖ్యం శకకాలమపాస్య చైత్ర శుక్లాదౌ ।
పంచసిద్ధాంతిక-వరాహమిహిర-అధ్యాయము1, శ్లోకము 8.

ప్రారంభము (3076+26) 3102 అగుచున్నది. ధర్మజుడు మహాభారత యుద్ధానంతరము ముప్పదియారేండ్లు రాజ్యము చేసినట్లు మహాభారత గ్రంథమే చెప్పుచుండుటచే నీ యుద్ధకాలము క్రీ పూ.(3101+36) 3138 వ సంవత్సర మగుచున్నది.

శాసనము లందీయుద్ధ కాల ప్రసక్తి :- భారత యుద్ధకాలమును స్పృశించిన శాసనము లొండు రెండుగలవు, శాసనములు ప్రాచీనమయినవి యెక్కుడుగా లభింపకుండుటకు ప్రముఖ కారణము మహమ్మదీయుల దండయాత్రలు. పుస్తకములలోని వ్రాతలను విశ్వసింపచేయని పరిస్థితిని మన కాంగ్లేయులు సమకూర్చగా శాసనములు దొరకనీయకుండ వానిని ఛిన్నాభిన్న మొనర్చి మహమ్మదీయులు మనకు సాయపడిరి. ఎట్టకేలకు జనమేజయుని శాసనము బ్రతికి బట్టకట్టినది.*
ఇక నీయుద్ధ ప్రసక్తిగల శాసనములు - 1) ఐహోలా శాసనము, 2) నిధనపూరు శాసనము, వీని నొకటొకటిగా పరిశీలింతము.

**1. ఐహోలా శాసనము :-**

మైసూరు రాష్ట్రములోని ధార్వారు జిల్లాలోగల 'ఇబ్బళి' గ్రామమునగల నొక శివాలయమున లభించిన దీశాసనము. చాళుక్య వంశపు రాజయిన రెండవ పులకేశి (క్రీ. శ. 634) కాలమున రవికీర్తిచే నిర్మింపబడిన జినాలయ ప్రశస్తి యిందలి వస్తువు. ఇది యుధిష్ఠిరుని కాలమును, భారత యుద్ధమును పేర్కొన్నది. ఇండియన్ యాంటిక్వరీ (సంపుటము 5, పుటలు 67-71) లో ప్రచురిత మయినది. తిరిగి 'చాళుక్య వంశోద్భూతస్య శ్రీ పులకేశినః శిలాలేఖః అను శీర్షికతో ప్రాచీన లేఖా మాల (1వ భాగము, పుటలు 68-72)లో

Chronology of ancient India, V. S. Gopal Ayer PP. 68-77.
* ఇది "భగవంతుని మీది పగ" యందుగల చారిత్రక పూర్వరంగమందు సమీక్షింపబడినది.

ప్రచురింపబడినది. శాసనములోని రెండవ పాదమున రెండింటికిని నీషద్భేదమున్నది, ఆ భేదము.

"సప్తాబ్ద శత యుక్తేషు శతే ష్వబ్దేషు పంచసు" (ఇండియన్ యాంటిక్వరీ)

"శతాబ్ద శతయుక్తేషు గతే ష్వబ్దేషు పంచసు" (శిలాలేఖమాల)

ఈ శాసనమును శ్రీ టి. యస్. నారాయణశాస్త్రిగారు (Age of Sankara)

శ్రీ కోట వెంకటాచలంగారు (Chronology of ancient Indian History Part II)

శ్రీ కె. డి. సేత్నాగారు (The editor, Mother India, Aravind Ashram, Pandicherry)

శ్రీ డి. యస్. త్రివేదగారు (An article on Mahabharata war - Five thousand years ago)

పరిశీలించినట్లు వారి గ్రంథములనుబట్టి తెలియుచున్నది.

## శాసన పాఠము

త్రింశత్సు త్రిసహస్రేషు భారతా దాహవాదితః।
సప్తాబ్ద శత యుక్తేషు శతే ష్వబ్దేషు పంచసు॥
పంచ శత్సు కలౌ కాలేషట్సు పంచ శతాసుచ।
సమాసు సమతీతాసు శకానా మపి భూభుజామ్॥

తస్యాంబుధి త్రయ నివారిత శాసనస్య।
సత్యాశ్రయస్య పరమా ప్తవతా ప్రసాదమ్॥
శైలం జినేంద్ర భవనం భవనం మహిమ్నా॥
నిర్మాపి మతిమతా రవికీర్తి నేదం॥

ప్రశస్తేర్వసతే శ్చాస్యా జినస్య త్రిజగద్గురోః,
కర్తా కారయితా చాపి రవికీర్తిః కృతీ స్వయమ్॥

యేనా యోజి జిన వేశ్మ స్థిర మర్థ విధౌ వివేకినా జినవేశ్మ।
సవిజయతాం రవికీర్తిః కవితాశ్రిత కాళిదాస భారవికీర్తిః॥ 6

(INDIAN ANTIQUERY V. Vol. PP. 66-71)

శాసనపు తేదీ క్రింద వ్రాయబడినది. భారత యుద్ధానంతరము 3735 సంవత్సరములకు తరువాత, శక సంవత్సరమునకు 556 సంవత్సరముల యనంతరము శాసనము వేయబడినట్లున్నది.

శతాబ్ద శత యుక్తేషు గతేష్వబ్దేషు పంచసు॥
(కించిద్భేదముతో ప్రకటింపబడిన భాగము. ప్రాచీన లేఖామాల)

ఈ శాసనములోని మొదటి నాలుగు పాదములలో మన కుపయుక్తమగు విషయమున్నది. ఈ విషయమై కె. జి. శంకర్ అయ్యరుగారు సాధించిన విధము.

రెండవ పాదము మూడవ పాదము యాంటిక్వరిలో నున్నది మారినది.

"సప్తాబ్ద శత యుక్తేషు గతే ష్వబ్దేషు పంచసు।
పంచాశత్సు కలౌ కాలే షట్సు పంచశతాసుచ॥"

(30+3000+700+5) భారత యుద్ధ మారంభమయిన 3735 సంవత్సరములకు, శక కాలము 556 (50+6+500) సంవత్సరముల యనంతరము జినాలయము రవికీర్తిచే నిర్మాణము గావింపబడినది. (3735–556) 3180 సంవత్సరములు గడిచిన వెనుకనని చెప్పి శక కాలము శాలివాహన శకము 78వ సంవత్సరముగా నీయన గ్రహించెను. శాలివాహన శక కాలము తీసివేసినచో భారత యుద్ధ కాలము వచ్చును (3180-78) అది 3102 అగుచున్నది.

5506 సంవత్సరములకు శక కాలము 78 కలిపినచో క్రీ. శ. 634 రెండవవపుల కేశి 1 కాలము వచ్చుచున్నది.[30]

టి. యస్. నారాయణశాస్త్రిగారు Age of Sanksra లో దీనిని గ్రహించి రెండవ పాదమున 'సప్తాబ్ద'కు మారు 'సహాబ్ద' యని మార్పు నొనర్చిరి. (30+3600+100+5) భారత యుద్ధము - గడచిన 3135 సంవత్సరములకు, లేక (50+6+500) శక రాజుల కాలము గడచిన 556 సంవత్సరములకు నీజినాలయము రవికీర్తిచే నిర్మితమయిన దని దీని భావము. ఈయన మహాభారత యుద్ధకాలము 3139వ సంవత్సరముగా నిర్ణయించి దానియందు 3135 సంవత్సరమును తీసి వేసెను. అప్పుడు క్రీ పూ. 5వ సంవత్సరము వచ్చుచున్నది. రెండవ గణనమున 556వ సంవత్సరము నుండి శకకాల మీాయన గ్రహించిన 550 సంవత్సరములు తీసివేయగా క్రీ. శ. 6వ సంవత్సరమగును. కాని యీాయన తన గ్రంథమున క్రీ. పూ. 6 అనియే వ్రాసెను.[31] ఈ రెండు కాలముల కెట్టి సంబంధముగాని మనకు మహాభారత యుద్ధ కాలమును బట్టి యిచ్చుటగాని జరుగలేదు.[32] ఇక కె. జి. శంకర అయ్యరుగారు నిర్వహించిన విధమున, శక కాలము నెందులకు 556కు కలుపవలెనో, మొదట నెందులకు తీసివేయవలెనో సకారణముగా నిరూ

30. Ihole Inscription, T. S. Narayana Sastry, "Age • Sanksra, a letter from K. G. Sankar Iyyar, dated 10-10-1917.

31. Ibid P. 224

32. A letter addressed by K. D. Setna to P. K. Venkatachalam, Published in Ancient Indian History Part II, P. 113 in that he said "Narayana Sastry's Miscaliculation may be small, but it is very unfortunate". Saka Era is not 550 B. C. as is taken by Narayana Sastry. Reply by the author, Ibid P. 116

పింప లేకపోయె, కనుక నా వివరణము కూడ సందిగ్ధమును ననమగ్ర ముగనే యున్నది.

కోట వెంకటాచలంగారి నిర్వాహణము [33]

ప్రాచీన లేఖామాలలో నొనర్పబడిన రెండవ పాదములోని మార్పులు రెండు.

(1) 'సప్తాబ్ధ'కు 'శతాబ్ద'

(2) 'శతేషు'కు 'గతేషు'

ఈయన రెండు మార్పులనావశ్యక మనియు 'గతేషు' అను పదము మార్పు ఒక్కటే సరిపోవు ననుచు లెక్కవేసి చూపిరి. మహా భారతయుద్ధ కాలానంతరము కలియుగాది వరకు నీయన చూపిన సంఖ్య శాసనములో గానము. భారతయుద్ధము గడచిన తరువాత 37+(30+3000+700+5) 3772 సంవత్సరములు శకకాలమునుండి 556 వ సంవత్సరములు (శకకాలము నీయన శాలివాహన శకము క్రీ. శ. 78 సంవత్సరమునే స్వీకరించెను.) అనగా (556+78) క్రీ. శ. 634వ సంవత్సరమున జినాలయము నిర్మింపబడెను. ఇప్పుడు (3772–634) క్రీ. పూ. 3138. మహాభారతయుద్ధ కాలమునకు సరిపోవు చున్నది. (కలౌ కాలే) యనుటచే కలినుండి 3735 సంవత్సరములుగా భావించుటకు వీలున్నది. కోట వారిభావమునే గ్రహించిరి. ఈ మూడింటి యందును కోట వెంకటాచలంగారి నిర్వాహణము ప్రశస్త ముగను విమర్శరహితముగను నున్నది. ఆ కారణము చేతనే కె. డి. సేత్నాగారు కోట వారి నిర్వాహణ మత్యంత ప్రతిష్ఠా కరమని ప్రశంసించిరి. ఐహోలా శాసనమును మహాభారతయుద్ధ కాలము క్రీ. పూ. 3139 సంవత్సరముగనే నిర్ణయించినదని సారాంశము.

---

33. Ibid P. 117 & 118.

2) నిధనపూరు శాసనము.

ఈ శాసనము 'ఎపిగ్రాఫికా ఇండికా' 12వ వాల్యూము సంపుట 65వ పుటలో ప్రచురింపబడినది.

శాసన పాఠమీ విధముగా నున్నది.

తస్మా దదృష్ట నరకా దజనిష్ట నృపతి ర్ద్విసేసఖః
భగదత్తః ఖ్యాత జయం విజయం యుధియః సమాహ్వాయత్॥
తస్యాత్మజః క్షతారే ర్వజ్రగతి వజ్రనామాభూత్।
శతమఖ మఖింతల మలగతి రతోషయద్య స్సదా సంఖ్యే॥
వంశ్యేషు తస్య నృపతిషు వర్ష సహస్త్రత్రయం పద మావాస్య.
యాతేషు దేవభూయం క్షితీశ్వరః పుష్య వర్మాభూత్॥

దీనిని (శ్రీ) డి. యస్. త్రివేదగారు పరిశీలించిరి. ఇది తామ్ర శాసనము. నరకుని పున్నామ నరకమునుండి విముక్తి నొందింప భగదత్తుడు కుమారుడయ్యెను. ఈతడింద్రసఖుడు. అతి విజయోత్సాహముతో నర్జునునితో బోరి వీరస్వర్గ మలంకరించెను. ఇతనికి వజ్రదత్తుడను వాడు కుమారుడు. ఇంద్రుని వజ్రాయుధమువంటి వేగముతో శత్రువులను దునుమాడును. ఈ వజ్రదత్తుడు తన యువక్ర పరాక్రమముతో నెల్లప్పుడును యుద్ధమునందు శతమఖుని సంప్రీతి నొందించును. ఈ వంశము నందీతనికి మూడువేల సంవత్సరముల యనంతరము పుష్యవర్మ జన్మించెను. ఈ పుష్యవర్మకు 12 వ తరము వాడు భాస్కరవర్మ. ఈ భాస్కరవర్మ వేయించిన దీ శాసనము. శాసన కాలము క్రీ.శ. 590 నాటిది. ఈతడు కనోజి హర్షవర్ధనునకు సమకాలికుడు.

మహాభారత గ్రంథమునుబట్టి చూచినచో నీభగదత్తుడు ప్రాగ్జ్యోతిషమునకు ప్రభువు, కౌరవ పక్షపాతి. యుద్ధమునం దీతడు మడిసెను.

ఈతని కుమారులైన కృతప్రజ్ఞ వజ్రదత్తులలో శాసనమునందు పేర్కొనబడిన వజ్రదత్తుడీతడే. కృతప్రజ్ఞు తజ్ఞునుని చేతను, వజ్రదత్తుడు సకులుని చేతను భారతాహవమునందు మృతినొందిరి. ఆ కారణముచే నీ భారతయుద్ధకాలము 3137వ సంవత్సరమందు జరిగినదని రూఢిచేసి కొనవచ్చును.[36] అని వ్రాసిరి.

ఈ పుష్యవర్మ క్రీ. శ. ప్రారంభముననున్న వాడయివచో వీతనికి పంచెండవ తరమువాడు భాస్కరవర్మ యగుచున్నాడు. భారత యుద్ధవీరుల తరువాత మూడు వేల సంవత్సరములు గడిచిన యనంతరము పేర్కొనబడిన యితివృత్త మిందున్నది కనుక మనకు భారత యుద్ధకాలము ప్రత్యక్షముగ గాకున్నను కించిద్గూఢముగ నిందున్నదని యంగీకరించుటలో నెట్టి సంశయముండదు. ఇదియును భారతయుద్ధ కాలమును క్రీస్తు పూర్వము మూడు వేల సంవత్సరములకు పూర్వమే యని నిర్ణయించుట గమనార్హము. ఈ శాసనము లోని యితివృత్త కాల మింకను పరిశోధన విషయమే,

## ఖగోళశాస్త్ర గ్రంథములందలి యుద్ధకాల ప్రసక్తి :

హైందవుల ఖగోళశాస్త్ర విజ్ఞాన మపారమైనది. ఆశ్చర్య జనకమైనది. ఈ విషయమును పాశ్చాత్య ఖగోళ శాస్త్రవేత్త లంగీకరించిన

---

34) Five thousand years ago, The Maha Bharata War, P. 523

D. S. Triveda in the P. V. Kane Shasti Poorti Book.

తతః సమభవ ద్యుద్ధం ఘోర రూపం భయానకమ్

పాండూనాం భగద త్తేన యమ రాష్ట్ర వివర్ధనమ్। మహాభారతం,

ద్రోణ, 95-25

తతః ప్రాగ్జ్యోతిషః కృద్ధ స్తోమ రాన్వై చతుర్దశ॥

మహాభారతం, 95-46.

సత్యము. ఖగోళశాస్త్ర మాధారముగా కలి 3102వ సంవత్సరము ఫిబ్రవరి 20వ తేదీ 2-27-30 సెకనులకు ప్రారంభమయినట్లు విస్పష్టముగా లిఖింపబడినది. ఈ విషయమును గురించిన హిందూజ్యోతి శ్శాస్త్రవేత్తల ప్రతిభను సుప్రసిద్ధ ఫ్రెంచి ఖగోళశాస్త్రజ్ఞుడయిన బెయిలీ పండితుడు[35] "హిందూ సుపీరియారిటి" అను గ్రంథమున ప్రశంసించెను. కౌంట్ జారన్‌స్జర్నా[36] (Count Bjornstjerna ద్వారా ప్రముఖ గణనమున కంజలి ఘటించెను. కలి ప్రవేశ కాలమును ముఖ్య శకముగా గుర్తించి 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' గ్రంథమందుదహరింపబడినది.[37] భారతీయజ్యోతిశ్శాస్త్ర గ్రంథములందు పేరెన్నిక గన్న సిద్ధాంత శిరోమణి,[8] బ్రహ్మస్ఫుట సిద్ధాంత

35. Hindu Superiority, P. 284

36) Ibid, P. 283, 284, and others like sir W. Huntur in Indian Gazeteer Vol. IV P. 218, by the same Author of "A brief History of the Indian people" P.55

37) "The Kaliyuga Era is the principal Astronomical Reekoning of the Hindus. It is frequently, if not generally shown in the Almanacs. Its intial point lay in 3102 B. C. and the year 5002 began in A. C. 1900 (Encyclopaedia Britanica (4th Edition)

5 Vol. – P. 658

28) నందాద్రీన్దు గుణా స్తథా శాక నృప స్యాన్తే కలే ర్వత్సరాః ॥
భాస్కరాచార్య, సిద్ధాంత శిరోమణి. కాలమానాధ్యాయము,

28 శ్లోకపాదము

(9 71 3) అంకానాంవామతో గతిః అను న్యాయానుసరణముచే
3179-78 (శాలివాహన శక కాలము) 3102 కలి ప్రారంభము

గ్రంథము ³⁹ జ్యోతిర్మకరందము,⁴⁰ లందీ కలియుగ ప్రమాణ సంఖ్య స్పష్టీకరింపబడినది. ఇవి యన్నియు శాలివాహన శక కాలమునకు సరి చూడబడి క్రీ. పూ. 3102వ యేట కలి ప్రారంభమని కంఠోక్తిగా చాటుచున్నవి. కలి ప్రారంభమునకు పూర్వము ధర్మరాజు ముప్పది మూడు సంవత్సరముల నుండి హస్తినను పాలించుచుండెనని మహా భారత గ్రంథము నుడువుచున్నది. యుద్ధకాలము, పరీక్షిజ్జననము, ధర్మజుని పట్టాభిషేకము కొంచెమించుమించుగా నొకే సంవత్సరమున జరిగిన సంఘటనలు. కనుక మహాభారత యుద్ధకాలము క్రీ. పూ. 3138వ సంవత్సరమనుటయే సత్య సమ్మతము.

ఆల్బెరూని:

ఈతడు ప్రముఖ ఖగోళ శాస్త్రజ్ఞుడు. గజనీమహమ్మదు ఆస్థానమున నుండినవాడు, పదునొకండవ శతాబ్దికి చెందిన యీతడు భారతదేశములోని ప్రముఖ ఖగోళ విద్వాంసుల యొద్ద ననేక రహస్యములు గ్రహించినవాడు. భారతదేశమును, అందలి ప్రజలను గురించి యీయన 'ఇండియా' అను గ్రంథమును వ్రాసెను. అందు "గాళ శకము" 400 తన కాలము నాడు 9-3-1031వ తేదీన సంప్రాప్తించెననియు,నది 953 శాలివాహన శకమునకు, 1088 విక్రమ శకమునకును, శ్రీహర్ష శకము 1488వ సంవత్సరమునకు, 4132 కలి సంవత్సరమునకును సమమని తెలిపియుండెను. ఇదియును మనకు కలిప్రారంభము

---

39) 'గ్రాగ్నైకగుణాః శకాస్తైర్ద్వా' బ్రహ్మగుప్త, స్ఫుట సిద్ధాంతము 9713_3179_78_3102 కలి ప్రారంభము,

40) "శాకోననగేందు కృశాను యుక్తః కలేర్భవత్యబ్దగణో యుగస్య," జ్యోతిర్మకరందము 9743_3179_78_3102

3102వ సంవత్సరముగ స్పష్టము చేయుచున్నది. అందుచే(4132-1031)
(3102+86) : 3189 మహాభారత యుద్ధకాలమనుట విస్పష్టము.[41]

**అని అక్బరి :-**

ఇది ప్రఖ్యాత మహమ్మదీయ ప్రభువులలో నొకరగు అక్బరు కాలమునాడు రచింపబడిన విధి నియమముల గ్రంథము. ఈతని ప్రధానమంత్రియగు 'అబ్దుల్ ఫజల్ అలామి'చే ప్రకటితమయ్యెను. ఈతడాతని యాస్థానములోని నవరత్నములలో నొకడుకూడ. ఈతడు పర్షియన్ సంస్కృత భాషా పారంగతుడు. అక్బరు కాల ప్రసక్తితో యుధిష్ఠిరుని కాలము స్పృశింపబడెను. కనుక నిది యవశ్య స్వీకార మయినది. ఈ కలియుగారంభమున ధర్మజుడు ప్రపంచమును తన పరాక్రమముచేత శాసించి శకారంభకుడయ్యెను. అప్పటినుండి నేటికి అక్బరు నలుబదవ పాలన సంవత్సరమునకు 4696 సంవత్సరములు

---

41. Alberuni "India" – Translated Edward E. Sachan Vol. II, Chapter XLIX, P. P. 5–7 as inscribed in "The Age of Maha Bharata War" bv N. Jagannadha Rao P. 6
953 +78 A.D. - 1031 (శాలివాహన శక) A. D.
1088 - 51 B. C. – 1031 (విక్రమ శక) A. D.
1488 - 457 B C. - 1031 (హర్ష శక) A. D.
According to Alberuni: The same is carried by Sri N. Jaghnnadha Rao vide Page 65.
4131 – 1031 A. D. 3102 (కలి శక) B. C.

గడచినవని యా గ్రంథమున వ్రాసెను.[42] అక్బరు పరిపాలన కాలము మొదలయినది 1556 క్రీ. శ.[43] దీనికి నలుబది సంవత్సరముల యనంతరము అనగా 1596 క్రీ. శ. నాటికి కల్యాది (4696–1596) 3101 క్రీ. పూర్వ మగుచున్నది.

## భారత గ్రంథములోని యంతరంగ సాక్ష్యము :

మహాభారత గ్రంథములోని మౌసల పర్వమున నీ కలి ప్రవేశ కాల విషయ స్పష్టముగా బేర్కొనబడినది. తన ముప్పది యారవ రాజ్యపాలన సంవత్సరమున ధర్మజుడు దుర్నిమిత్తములు గాంచి నట్లున్నది.[44] శ్రీ కృష్ణపరమాత్మ తనబంధు, పుత్ర, మిత్ర పరివారము నశింపగా, నేకాకియై యొక భిల్లునిచే శరమున గొట్టబడి

42. దరసరి ఆగాజ్ ఈ రాజా యుధిష్ఠిర్ హమాగియే
జహాదర్ కుషాద్ వ (మరియు) సరాఫాయ తారియు
ఫిరోసీథా ఫర్మారవాయె భీష్ రాసరె అగాజ్ గర్దా
నీద్ వ (మరియు) దరియ హాల్ (ఇప్పటికి) క్యహాల్లుం (40)
ఇలాహి (అక్బరు పాలనాకాలము) చనహార్ హజార్
(4000) వ సష్సద్ (600) నహొనద్ (99) వషష్ (6)
అజుగు జిష్తా'

"An, I Akbari' Tanslated from original

43. Akbar - the great Moghal by Vincent Smith' Oxford. 1919. P. 448.

44) షట్త్రింశే త్వథ సంప్రాప్తే వర్షే కౌరవనందనః
దదర్శ విపరీతాని నిమిత్తాని యుధిష్ఠిరః ।
మ. భా. మౌ. 1అ. - 2శ్లో.

యవతార సమాప్తిగావించినట్లు.[45] దానిని తెలిసి ధర్మజాదనుజులతో, ద్రౌపదితో స్వర్గారోహణ యాత్ర నారంభించినట్లు మహాభారతమే నుదువుచున్నది. విష్ణుపురాణము[46] కలి ప్రవేశకాలమిదియే యని స్పష్టీకరించుచున్నది. ఈవిషయమే భాగవత[47] మత్స్య పురాణము[48] లందును పేర్కొనబడినది. కలి ప్రవేశకాలము క్రీ. పూ. 3102వ సంవత్సరమని పయి ప్రమాణములచే నిర్ద్వంద్వముగా స్పష్టీకరింప బడినపుడు భారతాహవము తత్పూర్వము ముప్పదియారేండ్లనాడు జరిగినదనుటలో సందేహింపబనిలేదు. మహాభారతమున పదునెన్మిది దినములు జరిగిన యుద్ధ క్రమమును, ఉద్యోగపర్వారంభమునుండి మాస, పక్ష, తిథి నక్షత్రాదులను బహుసూక్ష్మ

---

45) త్వమ వ్యుపస్థితే వర్షే షట్త్రింశే మధుసూదన ।
హత జ్ఞాతి రహతా మాత్యో హత పుత్రో వనేచరః ॥
కుత్సితే నాభ్యుపాయేన నిధనం సమవాప్స్యసి । మ. భా. స్త్రీ. 14.
షట్త్రింశే తతో వర్షే వృష్ణినా మనయో మహాన్ ।
అన్యోన్యం ముపతైస్తేతు నిజఘ్నుః కాలచోదితాః । మౌసల 1-13

46) యదైవ భగవ ద్విష్ణో రంశో యాతో దివం ద్విజ ।
వసుదేవ కులోద్భూత స్తదైవ కలి రాగతః । వి. పు. 4. అంశ.
24 శ్లో. అ. 14 4

47) యస్మిన్ కృష్ణో దివం యాత స్తస్మి న్నేవ తదా హని ।
కలియుగం ప్రమాణం తస్య మే శ్రుణు ॥
మత్స్య పురాణము 271 అ. 51 శ్లో.

48) విష్ణో ర్భగవతో భానుః కృష్ణాఖ్యో సా దివంగతః ।
తదావిశ త్కలిర్లోకం పాపేయ ద్రమతేజసః ॥
భాగవతం 12-2-29

ముగా, నిశితముగా శోధింపబడెను.[49] ఒక కావ్యకర్త, లేక రొకపుక్కిట పురాణ గాథయే భారతమయి యున్నచో, లేక వ్యాసుడు దీనినట్లు కల్పించియే యున్నచో, యిన్ని సూక్ష్మాంశ సమన్విత సంఘటనలు సమకూర్పవలసిన యావశ్యకతయే యుండదు. ఈ దృష్టితో నయినను భారతయుద్ధగాథను యథార్థమని విశ్వసించి తీరవలయును. ఏవంవిధ మయిన సూక్ష్మాంశములను కడు శ్రద్ధతో బరిశీలించి గుణించి శ్రీ. టి. యస్. నారాయణశాస్త్రిగారు, యమ్. కృష్ణమాచార్యులుగారు [50] శ్రీ యస్. జగన్నాథరావుగారు [51] కలియుగ ప్రారంభమునకు పూర్వము ముప్పదియారు సంవత్సరములనాడు మహాభారత యుద్ధముజరిగి యుండినట్లు స్పష్టపఱచి యున్నారు. ఇన్ని యంశములు జతపడుచుండగా యుద్ధము జరుగలేదనుమాట యేటి మాట ?

49) 1వ యనుబంధమునందు వివరింపబడినది.

50) శ్రీ టి. యస్. నారాయణశాస్త్రి "Age of Sankara" as is taken in (the plot in Indian Chronology) by K. Venkatachalam P.P 173-182.
1917వ సంవత్సరము కాలయుక్తి (1918-1919) సంవత్సరమువ గల పంచాంగముతో భారతయుద్ధ కాలము సమముగా నుండుటను గనిపెట్టి ఆ పంచాంగములోని యంశముల నాధారముగా గొని గుణించి అప్పటికి భారతయుద్ధము జరిగి 5056 సంవత్సరములయినట్లు నిర్ణయమునకు వచ్చెను. అప్పుడు క్రీ. పూ. (5056-1917) 3139-3140వ సంవత్సరారంభమున నీయుద్ధము జరిగినట్లు స్పష్టమగుచున్నది.
M. Krishnamacharyulu. The History of Sanskrit literature.
'Age of Sankara' లోని విషయమును యథాతథముగా తమ గ్రంథములో ప్రకటించినది. పుటలు 81-83.
నడింపల్లి జగన్నాథరావుగారు "The Date of Maha Bharata War." అను గ్రంథములో 1930వ సంవత్సరమునకు నీ యుద్ధకాలమును గుణించి నాటికి 5069 సంవత్సరములకు పూర్వము యుద్ధము జరిగియుండెనని వ్రాసిరి. అప్పుడు 5069-1930-3139 క్రీ. పూర్వము యుద్ధము జరిగినదని స్పష్టపడినట్లే కదా! పుటలు 69-95.

## 2- (మౌర్య గుప్త) చంద్రగుప్తుల కాలము :

మన ప్రాచీన చరిత్రమున చంద్రగుప్తులిద్దరు, ఇందొకరు మౌర్యసామ్రాజ్య స్థాపకులు. గుప్తసామ్రాజ్య స్థాపకులు మరి యొకరు. పురాణములు నందునకు మురవలన గలిగిన సంతానముగా మౌర్యచంద్రగుప్తుని పేర్కొన్నవి.[1] ఆంధ్రరాజ్యమునకు వెనుక నేలిన వంశము గుప్తవంశము. ఆంధ్రభృత్య వంశముగా కూడ పురాణములు పేర్కొన్నవి. పార్జిటరుగారు తన కలిరాజ వంశావళియందు దీనిని వివరించెను.[2] పాశ్చాత్య వర్తమాన చరిత్రకారుల లెక్కననుసరించి క్రీ. పూ. 327 నాటికి మౌర్య చంద్రగుప్తుడు భారతదేశము నేలెను. క్రీ. శ. 328 నాటికి గుప్తసామ్రాజ్యము చంద్రగుప్తునిచే స్థాపింపబడెను. ప్రాచీన చరిత్రకు సంబంధించి పురాణములు, ఇతర గ్రంథములాధారముగా నీదేశమును మౌర్య చంద్రగుప్తుడు క్రీ. పూ. 1532 వ సంవత్సరమున పాలించెను. క్రీ. పూ. 322 వ సంవత్సరము నాటికి గుప్తవంశము రాజ్యమునకు వచ్చెను. ఇరువురకు నడిమిగల కాలము 1200వ సంవత్సరములు. ఈ కాలమంతయును చరిత్రకారులు గుప్త వంశము లందు గుప్తమొనర్చి రన్నట్లయ్యెను.

దీనికి ప్రధానమయిన హేతువు మన చరిత్రలోని రాజవంశములకు సమన్వయింపబడిన కాలమును గ్రీకు చక్రవర్తియగు అలెగ్జాండరు భారతదేశము పయి దండయాత్రకు వచ్చిన కాలముతో ముడిపెట్టుట.

1) 'నందస్యైవ భార్యాయాం మురసంజ్ఞాయాం సంజాతమ్' ఇతి శ్రీధర స్వామీ. విష్ణుపురాణమ్ 4 అంశ. 24 అధ్యాయం.

2) "మాగధమ్ మహావీర్యో విశ్వఫణిర్ భవిష్యతి, Pargiter Dynasties of Kali Age P. 52 ఈ విశ్వఫణి సముద్రగుప్తుని కంటె వన్యుడుకాడు" See Puranic Chrolonogy D. R. Mankad, P. 284.

ఆ సమయమునయున్న రాజు గుప్తచంద్రగుప్తుడు కాగా మౌర్య చంద్రగుప్తుడని పాశ్చాత్యచరిత్రకారులు వ్రాసిరి. దానితో మనదేశ చరిత్ర తారుమారయినది. అది యెట్లు జరిగినదో హేత్వాధార నిరూపణము చేయబడుచున్నది. పురాణములు కలియుగాదినుండి కాలగణనమును ద్వివిధముగ రూపొందించి యున్నట్లు పరిశీలనవలన తేలిన సారాంశము. ఒకటి కల్యాదినుండి యీ దేశము నేలిన యనుస్యూతమయిన రాజవంశావళులు. వారిపాలన కాలములు. రెండవది సప్తర్షి చలన మాధారముగా కాలమును గుణించు విధము. ఈ రెండును, ఒకదాని కొకటి సమర్థమగునే కాని విరోధము కాదు.

రాజవంశావళి ప్రకారము కాలగణనము

| రాజవంశము | రాజుల సంఖ్య | పాలించిన కాలము |
|---|---|---|
| 1. బార్హద్రథ | 22 | 1,006 |
| 2. ప్రద్యోత | 5 | 138 |
| 3. శైశునాగ | 10 | 360 |
| 4. నంద | 1+8 | 100 |
| 5. మౌర్య | 12 | 316 |
| 6. శుంగ | 10 | 300 |
| 7. కాణ్వ | 4 | 85 |
| 8. ఆంధ్ర | 32 | 506 |
| | 104 | 2,811 |

ఆంధ్ర వంశాంతమునకు మహాభారత యుద్ధమునుండి[3] యుధిష్ఠిరుని పాలన కాలమును తీసివేయగా నెన్మిది వంశములు, నూటనల్గురు రాజులు ఇరువదియెన్మిదివందల పదునొకొండేడులు పాలించినట్లు విదితమగుచున్నది.

## 2. ఆంధ్రవంశాంతమునకు సప్తర్షి గతి ననుసరించి పురాణములు పేర్కొనిన కాలగణనము :

సప్తర్షి మండలమునగల నక్షత్రములేడు. క్రతువు, పులహుడు, పులస్త్యుడు, అత్రి, అంగీరసుడు, వసిష్ఠుడు, మరీచి యనువారు. 28వ మహాయుగమునందు కృతయుగాది గల సప్తర్షి స్థితిని గురించి బ్రహ్మసిద్ధాంతము పేర్కొన్నది. క్రమమున నొకటవ పాదమున క్రతువు, రెండవపాదమున పులహుడు, ధనిష్ఠ ద్వితీయతృతీయపాదములందు పులస్త్యత్రి మునులు. శతభిష 4వ పాదమున నంగీరసుడు, పూర్వాభాద్ర ప్రథమచరణమందు వసిష్ఠుడు, ఉత్తరాభాద్ర ప్రథమచరణమునందు మరీచియున్నట్లు వ్రాయబడెను.[4] వీనికి ప్రాగ్గమన మనియు సంవత్సరములో నెన్మిదిలిప్తలు మాత్రము గతించుననియు కూడ

3) సంగ్రామే భారతే వృత్తే సహదేవే నిపాతితే। (తస్మిన్)
సోమాధి స్తస్య దాయాదో రాజాభూత్ సగిరివ్రజే ॥
మత్స్య 270-19

4) యుగాదే విష్ణుతారాయా క్రతు చాద్య స్సమంతతః।
ప్రాచ్యాత్ర్యంశైః పులహః పులస్త్యోథ దశాంశకైః॥
అత్రి స్త్రిత త్రిభి ర్భాగై రంగిరా అష్టభి స్తతః।
వసిష్ఠ స్సప్తభి స్తస్మా న్మరీచి ర్దశభి స్మృతః॥
"ప్రత్యబ్దం ప్రాగ్గతి స్తేషా మష్టా లిప్తా మునీశ్వరః"
బ్రహ్మసిద్ధాంతము

పేర్కొన్నవి. ఈ ప్రకారమయినచో నొక్క పర్యాయము క్రాంతి వృత్తము చుట్టివచ్చుటకు డిగ్రీకి 60 లిప్తలు గావున 7½ సంవత్సరములలో నొక డిగ్రీని చుట్టి, 360° లను తిరుగుటకు 360×7½=2700 సంవత్సరములు పట్టునని తెలియును. పురాణము లన్నియు నీసప్తర్షి చలనమును నిరువదేడు నక్షత్రములకు నొక్కొక్క దానియందు నూఱు సంవత్సరము లుండునట్లు పేర్కొన్నవి. ఇట్లే నక్షత్రము లన్నింటిని జుట్టివచ్చుటకు సప్తవింశచ్ఛతాబ్దులు గడచును.

సప్తర్షి గమన విషయమున వాదములున్నవి. సవ్యగమనము, అపసవ్యగమనము లేక పశ్చాద్గమనము. ఏ నక్షత్రమున సప్తర్షుల యునికియో గ్రహించుటలో మూడు అభిప్రాయము లున్నట్లు పురాణములు పేర్కొన్నవి.

1. సప్తర్షులుదయించు సమయమున ముందుగా గానవచ్చెడి పులహక్రతువులకు సమముగ దక్షిణోత్తరముల కొక యూహారేఖగీచిన యారేఖ యే నక్షత్రమందుండునో యానక్షత్రమున సురమునులున్నట్లు గమనించు విధాన మొకటి. ఇది విష్ణుపురాణ మతము. దీనికి వ్యాఖ్యాన మయిన "ఆత్మప్రకాశిక"లో నీవిషయము గలదు కలి ప్రవేశ కాలము నాటికి మఘలో మూడు పాదములు గతించి నాలుగవ పాదమందు ప్రవేశమయినట్లు వ్రాయబడినది. ఇది సవ్యగమనము. సప్తర్షులందు పాగ్దిశయందుండు నక్షత్రములకు మధ్యసమముగ నే నక్షత్రము కన్పట్టునో యా నక్షత్రమే సప్తర్షుల యునికి యని యొక వాదము దీని ప్రకారముకూడ కల్యాదికి వీరు మఘయందే యుండిరి, వీరి మతము ననుసరించి యపసవ్యగమనమును సమన్వయింతురు. ఇది రెండవ వాదము.

సప్తర్షులుదయించు సమయమునకు ప్రాగ్భాగమున తొలుదొల్త కనుపడు పులహక్రతువులకు మధ్యగ నర్ధరాత్రమందు, ఏ నక్షత్ర దర్శన

మగునో నానక్షత్ర మందుండు నన్నది మూడవ వాదము. ఇది కలి ప్రారంభమునకు కృత్తికానక్షత్ర మందుండుట సూచించును. 5

ఈ మూడింటి యందును రెండు మఘయందును, మిగిలినది కృత్తికయందును నున్నట్లు చెప్పబడిన వాదములు. మఘయందొకటి సవ్యము రెండవది యపసవ్య గమనమును సూచింప కృత్తికయంద పసవ్యమే కానవచ్చుచున్నది. వరాహమిహిరుని సిద్ధాంత మపసవ్య గమనమున కృత్తిక కాగా వృద్ధగార్గ్యుని మతమపసవ్యము మఘయగు చున్నది. వేర్వేరు నక్షత్రము లందుండు వాదమటుంచినచో గమనము నొక్కొక్క నక్షత్రమునకు శతసంవత్సరకాల పరిమితిని వీరంగీక రించుట స్పష్టము.+

ఈ కాలము ననుసరించి పురాణము లందలి కాలగణనము: సప్తర్షులు కలికి బూర్వమే డెబ్బదియైదు సంవత్సరములకు ముందు మఘయందు బ్రవేశించిరి, పశ్చాద్గమనశీలుర యాశ్లేషనుండి పుర మునులు ప్రవేశింపగా ధర్మరాజు సోదరులతో స్వర్గారోహణ మొనర్చెను, అది లౌకికాబ్దమను పేరను, సప్తర్షి శకమను పేరను బరగుచున్నది. సప్తమునులు శ్రవణానక్షత్రమును జేరుసరికి మహా పద్మనందుడు రాజ్యమేలుచుండును. అపసవ్యగతిని శ్రవణము మఘకు పదునారవ నక్షత్రము. మఘయందున్నది యిరువది యైదేండ్లు మాత్రమే. భారతయుద్ధమునుండి ముప్పదియారేడులు కలిసి మొత్త

5. Kali Saka Vijnanam Part I K. Venkatachalam

+పరీక్షితః కాలే సప్తర్షయో మఘా యుక్తా నన్దకాలే పూర్వాషాఢా యుక్తాః తేషాం శతంశతం శీర్షాణి నక్షత్ర ఏకైకస్మిన్ స్థితి రిత్యాది పౌరాణిక కల్పనం జ్యోతిర్విదో నాంగీకర్తుం ప్రభవేయుః ఇతరేషాం నక్షత్రాణా మివ సప్తానాం ఋషీణామపి స్థిరగోళత్వాత్ । "కావ్యకంఠ గణపతి-భారతచరిత్ర పరీక్ష" పే. 43.

మునువదియొక్కయేడులు, శ్రవణములో నలుబదిరెండు జరుగుచో నప్పుడు పదునైదువందల యేడులగును. ఇదియే పురాణములందు పరీక్షిత్తునకు మహాపద్మనందునకు నడిమికాలము పదునైదువందల సంవత్సరముల కాలమని పేర్కొనబడినది. ఇక్కడకు శిశునాగ వంశాంతము, నందరాజ్యారంభము జరిగినది. నందాభిషేచనమునకు నాంధ్రరాజ్యారంభమునకు ఎన్మిదివందల సంవత్సరము లంతరమున్నది. ఆంధ్రరాజు లందిఱువదినాల్గవవాడగు శివశాతకర్ణి రాజ్యమునకు వచ్చునాటికి మరల మఘలోనికి సప్తర్షులు ప్రవేశింతురని చెప్పబడినది. అనగా సప్తర్షులు కలికి పూర్వమే భారతయుద్ధకాలము నాటికి (36 సంవత్సరములు) మఘయందుండిరి. అప్పుడు కల్యాదినుండి తిరిగి మఘలోనికి వచ్చునాటికి 2665 సంవత్సరములు మాత్రమే గతించు టను గమనింపగలము. ఒకవేళ యీ సప్తమునులు పరీక్షితునికాలము నాటికి కృత్తిక యందుండెనని యంగీకరించినను ఆంధ్రుల పాలన కాలములో నిది మరల కృత్తికకు జేరుచున్నదని మత్స్యపురాణము పేర్కొనుటచే నిందు విరోధమే విధముగను జూడము. [6] నందవంశము క్రీ. పూ. 1503న ప్రారంభముకాగా నాంధ్రవంశమునకు నీవంశము నకు గల యంతర షట్టశతాబ్దులను గలిపికొన్నచో నాంధ్ర సామ్రా జ్యము 2301 వ సంవత్సర మగుచున్నది. ఆంధ్రరాజుల పాలన కాలము పురాణముల ననుసరించి 506 సంవత్సరములనుట నింతకు మున్నే నిరూపింపబడినది. సప్తర్షి చలనము ప్రకార మిరువదినాల్గవ రాజునకు 2665 సంవత్సరములయి వీరిపాలన కాలములో 396 సంవత్సర ములు గతించి ఇంకను 110 సంవత్సరములు మిగిలియున్నవి. ఆంధ్ర రాజులంతమగుచో నిది 2775 సంవత్సరములగును. బార్హద్రథులందు

---

6. సప్తర్షయ స్తదా ప్రాహుః ప్రదీప్తే నాగ్నినా సమాః। సప్తవింశతి భావ్యానాం ఆంధ్రాణాంతు యథాపునః॥ మత్స్యపురాణం-271-41.

సోమాధి భారతయుద్ధమనంతరమే రాజ్యమునకు వచ్చెను గనుక ధర్మజుని ముప్పదియారుసంవత్సరముల పాలనమును గలిపికొన్నచో పురాణములో పేర్కొనబడిన 2811 సంవత్సరములు వచ్చును. పునర్వసు నక్షత్రమును సప్తర్షి మండలము ప్రవేశించినదన్నచో నది రెండవయావర్తి నారంభించిన దనుట తెల్లమే. అప్పటికి రాజ్యము గుప్తవంశజులను వీడును. అన్యులను వరించును. ఆంధ్రుల యనంతరము మగధ సామ్రాజ్యము పాటలీపుత్రమునకు మారును. గుప్తులు పాలింతురు. ఇచట పునర్వసు అనుటతో మఘనుండి 39 సంవత్సరములు గతింపగా మిగిలినది మూడువందల యరువదియొకటి. ఇది ఆంధ్రరాజులయందు యిరువదియవనాలుగవ రాజగు శివశాతకర్ణి రాజ్యకాలమగు 2665వ సంవత్సరమునకు గలిపికొన్నచో 3026వ సంవత్సరమగును. దీనితో గుప్త సామ్రాజ్యమున కస్తమయము. చివరి యాంధ్రరాజు పాలనకాలము 2775వ సంవత్సరము. చంద్రగుప్తుని రాజ్యస్వీకారము అలెగ్జాండరు దండయాత్రాకాలముతో సరిపోవుచున్నది. అది క్రీ. పూ. 327వ సంవత్సరము. రెండును కలిపినచో కలి ప్రారంభ సంవత్సరము క్రీ. పూ. 3102నకు సమన్వయమగును.

సప్తర్షి చలనముతో, పురాణములలోని వంశావళి యొకదానికొకటి యెట్లు సమన్వయపడునో చూపబడినది. దీని హేతువున చంద్రగుప్తు లిరువురు క్రీస్తు పూర్వములోని వారనియు ఒకరికొకరికి ద్వాదశ శతాబ్దుల కాలమంతరమున్నదనియు నిర్ణయమైనది.

డి. ఆర్. మన్కడ్ మహాశయులు గుప్తచంద్రగుప్తుని కాల నిరూపణమునకు క్రీ. పూ. మూడవశతాబ్దియందున్న మెగస్తనీసు, క్రీ. శ. 2వ శతాబ్దియందు ఏరియన్ వ్రాతలను మెక్రిండిల్, సోలిన్‌ల గ్రంథములనుండి యుదహరించెను. ఆ వాక్యములు—

1. బాకస్ నుండి అలెగ్జాండరు వరకు గ్రీకుదేశము నేలినరాజుల సంఖ్య 154 కాలము 5451 సంవత్సరములు.

2. డయోనిసోస్ నుండి శాండ్రకోట్టస్ వరకు భారతదేశమున లెక్కింపబడిన రాజులసంఖ్య 153. పాలనకాలము 6,042 సంవత్సరములు.

ఇది గ్రీకులచే రూపొందింపబడినను మొదటిది యాదేశమునకు, రెండవది మన దేశమునకు సంబంధించినట్టిదని భావింప వచ్చును. వారి యలెగ్జాండరు మన శాండ్రకోట్టస్ సమకాలికులే గనుక లెక్కింపబడిన మొదటి ప్రభువు కూడ సమకాలికులేయైయుండి తీరవలయునని వారియూహ. లేనిచో వీరీవిధమయిన గణనము చేయుట వ్యర్థము. వారి బాకస్ ఎవరయినను ఈ డయోనిసోస్ భారతీయ పౌరాణికులచే వ్యాప్తి యొనర్పబడిన వైవస్వతమనువు కావలసి యుండెనని డా॥ మన్కడ్‌వారి సారాంశము. ఈ విషయమున పురాణము లందెట్టి వివరణముగానము. కాని దీనికి బరిష్కారమింకొక విధముగా నేటికి గానము. పురాణములలో మహాభారత యుద్ధమునుండి రాజుల కాలములు, రాజుల సంఖ్య క్రమముగా బేర్కొనబడెను కాని యంతకు బూర్వమింత వివరముగా రూపొందింపబడలేదు.

| రాజుల సంఖ్య | భాగవతముననుసరించి | కాలము |
|---|---|---|
| 22 | బార్హద్రధులు | 1000 |
| 5 | ప్రద్యోతులు | 138 |
| 10 | శిశునాగులు | 362 |
| 9 | నందులు | 100 |
| 12 | మౌర్యులు | 316 |
| 10 | శుంగులు | 300 |
| 4 | కాణ్వులు | 35 |
| 32 | ఆంధ్రులు | 506 |
| | | 2807 సంవత్సరములు |

పురాణము లాధారముగా సహదేవుని సంఖ్య నైపస్థలమునవ్వ
నుండి 36, 39, 41, 44, 46, 48గానున్నది. అందు 48వ సంఖ్య
గైకొన్నచో (104+48) 153వ సంఖ్య గుప్తసామ్రాజ్యస్థాపకుని
యగుచున్నది. కాని 47వ సంఖ్య మౌర్యచంద్రగుప్తునిది కానేరదు.
ఇక సంవత్సరములను గురించి యోచించినచో యుగసిద్ధాంతము
ఖగోళసంబంధిగను; గణనకు సులువగునట్లు వేరొక రీతిగను వివరించి
నట్లు పురాణములందే గానవచ్చును. దీనిని ప్రధానముగా వెలువ
రించినవారు ప్రొఫెసర్. రంగాచార్య. గోపాల అయ్యర్, తిలక్ గారలు.

| | (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|---|
| కృత | 18,28,000 | 4,800 | 1,200 | 1,000 |
| త్రేత | 12,96,000 | 3,600 | 1,200 | 1,000 |
| ద్వాపర | 8,64,000 | 2,400 | 1,200 | 1,000 |
| కలి | 4,32,000 | 1,200 | 1,200 | 1,000 |
| | (ఖగోళసంబంధి) | (సంధితో) | (సంధ్యాంశ) | సంధ్యాంశ లేక |

మహాభారత యుద్ధము ద్వాపరాంతమున జరిగినదిగా నిర్ణయించిన
మూడవ వర్గీకరణములోని 3,600+2,807 : 6,407 సంవత్సరములు
వచ్చుచున్నది. ఇది మెగస్తనీసు సూచించిన దానికంటె 44 సంవత్స
రములు తక్కువ. ఈ విధమునగూడ మౌర్యచంద్రగుప్తుడు అలె
గ్జాండరు కాలపువాడను వాదము పరాస్తము చేయబడినది.

Maccrindle "The Invasion of Alexander the Great"
అను గ్రంథమును వ్రాసెను. దానియందు Greek Writers లో నొకడగు
Diodorus వ్రాసిన విషయము నుట్టంకించెను. "అందు పేర్కొనబడిన
భారతదేశపు ప్రభువు జాండ్రేమ్సు. ఈతనికడ 20,000 గుఱ్ఱములు
ద్విలక్షకాల్బలము రెండువేలకు రథబలము చతుస్సహస్రగజబలము
కలదని యలెగ్జాండరు పురుషోత్తముడను వానిచే నిశ్చితముగా నెఱిం
గెను. ఈ జాండ్రేమ్సు దుశ్శీలుడనియు అల్పజాతివాడనియు (The
son of a Barber) సౌందర్యసముపేతుడయిన యీతని తండ్రి మగధ

రాణితో నక్రమ సంబంధముగలిగి యుండి యామె సాహాయ్యముతో కుట్రచేసి క్రూరముగా రాజును సంహరించి తాను రాజయ్యెనని యున్నది". ఇదియే విషయమును కొంచెమించుగా క్వింటస్ కర్టియస్ రూఫస్ (Cuintus curties Rufus)[2] అను వ్రాతను (క్రీ. శ. 40)కూడ పేర్కొనియుండెను. కాని జాండ్రేమ్స్‌కు బదులు 'ఆగ్రేమ్స్' అని వ్రాసెను. ప్లూటార్కు అను చరిత్రకారుడు (క్రీ. శ. 40) గంగానది యొక్క పొడువులను నిమ్నతను పేర్కొని యానది యొడ్డున నాదేశపు రాజుచే వాహరింపబడిన లక్షల సైన్యమును అందున్న రథగజతురగపదాతిభేదములతో వివరించెను. అక్కడి రాజైన ఆండ్రకొట్టస్‌ను ప్రజలు ద్వేషించుచున్న హేతువున అలెగ్జాండరు సులువుగా నీదేశమును సర్వమును తన స్వాధీనమునకు దెచ్చుకొనిన వాడని వ్రాసెను. క్రీ. శ. 2 శతాబ్ది యందుండిన జస్టిన్ వ్రాత.[3]

అలెగ్జాండరునుండి విడిపోయిన యనంతరము సెల్యూకస్ యుద్ధోన్మాదియయ్యెను. బాబిలోను బాక్ట్రియాలను కబళించెను. అలెగ్జాండరు మరణానంతరమీతడు భారతదేశమునకు వచ్చెను. పూర్వము అలెగ్జాండరుచేత పట్టుబడి మరణశిక్ష విధింపబడిన శాండ్రకోట్టస్' అప్పుడు దేశమునకు రాజు. విప్లవ నాయకుడుగానుండి మొదట రాజ్యమునకువచ్చి, ఆ ప్రజలచేతనే తరుమబడెను. కాని చిత్రముగా దైవికముగా మరణశిక్షను తప్పించుకొని యడవులబారెను. అయ్యరణ్యమున నాదమఱచి నిద్రించుచుండనొక సింహము సమీపించి సంహరించుటకు బదులుగా నాతనిని ప్రేమతో నిమిరిన ట్లాదరించెను. దీనిని శుభపరిణామముగా నెంచి అటవీ పరిసరములందు తిరుగాడు దొంగల నాయకులను మచ్చికజేసికొని వారిని వెంటనిడుకొని యప్ప

1, 2, 3, Translations from Puranic Chronoogy, Mankad, P, P. 243-245,

టికి రాజ్యమేలుచున్న వానిని విప్లవాత్మకముగా భ్రష్టునొనర్చెను. అలెగ్జాండరుచే నియమింపబడిన నగరపాలకుల నెదిర్చి రాజ్యమును కైవసము గావించుకొనెను. భవిష్యత్తునకై నిశ్శ్రేణికల సమర్చి సెల్యూకస్ ఈతనితో మైత్రి సంధించుకొని తిరిగి స్వదేశమునకు మరలెను. ఏప్పియన్ (Appian) (పేజీ 404) సెల్యూకసును గురించి భాషించుచు 'అతడు సింధునదిని దాటి 'ఆండ్రకోట్టస్' తో యుద్ధము సాగింప యత్నించుచుండగా ఆ రాజు నదిని దాటనీయక ఒక సంధి కుదురునంత దనుక నెదిరి నిల్చెనని. తుదకు సెల్యూకస్ కొమారితె నా రాజు వివాహమాడుటకు సంధి కుదిరెను,

మెగస్తనీసు భారతదేశ మంతయును విస్తృతముగా పర్యటన సలిపియుండలేదనియు, ఫిలిప్ కుమారుడయిన యలెగ్జాండరుతో నీదేశమునకు వచ్చినపుడు కొంతభాగము తిరిగినమాట సత్యమయి యుండ నగుననియు, అప్పుడు దేశమును పాలించెడి చక్రవర్తియగు శాండ్ర కోట్టస్‌ను, అతనికంటె మిన్నయగు పోరస్ 'Poros' ను దర్శించె ననియు ఏరియన్ అను చరిత్రకారుడు 'ఇండికా' గ్రంథమున వ్రాసెను.[4]

**సారాంశము :-**

జాండ్రమ్స్, అగ్రామ్స్ అనునవి యొకే వ్యక్తికి సంబంధించిన పేర్లగుట కవకాశమున్నది. ఈ పేర్లురెండు నొకటియని 'శాండ్ర కోట్టస్' అనుపేరు 'ఆండ్రకోట్టస్' అని పేర్కొనుటను బట్టిజూచినచో స్పష్టమగును. 'శ, జ' లొకదాని కొకటి భాషాశాస్త్రముచే బర్యాయములని నిర్ణయింప వచ్చును.

---

4. Indica - Arrian P, 495

* Sandracottus and Sandracyptus may apply only fo one individual i.e., Samudragupta

మొదటి 'హయోడిరస్' 'జాండ్రేమ్సు' పదమును వాడెను, ఈతడు వృద్ధరాజు కుట్రముగా మరణించిన యనంతరము ప్రభువయ్యెను. కర్టియస్ వ్రాతకూడ నిట్లేయున్నది. వీరి ప్రకారము అలెగ్జాండరు రాక పూర్వము ముదుసలిపోడు. వచ్చినపుడు యువకుడయిన జాండ్రేమ్సు దేశమును బాలించిరి.

జస్టిస్. ఏప్పియనులు జాండ్రేమ్సునుగాని అగ్రేమ్సునుగాని తమ వ్రాతలందు పేర్కొనలేదు. వీరు శాండ్రకోట్టస్‌ను గురించియే వ్రాసిరి. ఈ శాండ్రకోట్టస్ అలెగ్జాండరు భారతదేశమున నుండగా ప్రభువుకాడు, సెల్యూకసు తిరిగి ఈ దేశమునకు వచ్చినపుడేలుచుండిన రాజు అలెగ్జాండరునకు సమకాలికుడు జాండ్రేమ్సు. సెల్యూకస్‌నకు సమకాలికుడు శాండ్రకోట్టస్ అని గమనింపవలెను. పాలన విషయమునగూర్చి గ్రీకు రచయితలెట్టి సూచననుగావించి యుండలేదు. ఈ హేతువులచే మౌర్యులతో ముడిపెట్టుట యత్యంత క్లిష్ట కార్యమగును. ఇవి గుప్తవంశముతో బోల్చినచో గానవచ్చెడి విశేషాంశములు.

హయోడిరస్, కర్టియస్ లిరువురును వృద్ధరాజపత్ని సౌందర్యవంతుడయిన యల్పజాతివానిని ప్రేమించి (Barber) వాని వలన 'జాండ్రేమ్సు'ను సంతానముగా పొందినట్లు చెప్పుచున్నారు. తరువాత రాణి తన ప్రియుని చేత రహస్యముగా వృద్ధరాజును నశియింపజేయుట సహజ పరిణామమే. ఈ జాండ్రేమ్సుగా బిలువబడెడి గుప్తచంద్రగుప్తుడు లిచ్ఛవ వంశీయులలోని కన్యను బెండ్లియాడి వారి సాహాయ్యముతోడనే మగధ రాజ్యము నాక్రమించెను. మగధరాజులలో నెవ్వరును చంద్రగుప్తునకు బూర్వాపరములందు లిచ్ఛవుల సాయముతో రాజ్యమధిష్ఠించిన వానిని జూడము. జయస్వాలు పండితుడు తాను జూచిన 'కౌముది మహోత్సవ'మను నాటకమున

గల చండసేనుడు మరెవ్వరో కాదనియు గుప్తచంద్రగుప్తుడేనని సప్రమాణముగా నిరూపించెను. ఈ విషయము నుదాహరించుచు డి. ఆర్. మన్కడ్ మహాశయుడు దానిని కొద్ది సవరణలతో సమర్థించెను.+

ఈవిధముగా మనకు మూడు పేర్లు కానవచ్చును.

జాండ్రేమ్సు ఆగ్రేమ్సు ఈతనికి పూర్వమున్న వృద్ధరాజు, సాండ్రకోట్టస్, ఈతని కుమారుడయిన 'అమిత్రోఖేట్స్' అను పేరు

---

+సుందరవర్మ మగధకు ప్రభువు. అతనికి సంతానము లేదు. రాజ్యమునకు వారసులు లేరు. చండసేనుడను వానిని దత్తతకు తెచ్చుకొనెను. కాని కొంతకాలమున కీయనకు సంతు కలిగెను. చండసేనుడు రాజు కాకపోవలసి వచ్చెను. లిచ్ఛవుల వంశములోని కన్యను పెండ్లియాడి వారి సాయముతో వృద్ధరాజును సంహరించి తానే రాజయ్యెను. మంత్రి యగు మంత్రిగుప్తుడు సుందరవర్మ కుమారుని యడవులకు తరిమెను. అతడు కల్యాణవర్మ. ఈతడు పెరిగి పెద్దవాడయి చండసేనుడు మగధయందు లేని యవకాశమును జూచుకొని సింహాసనము నాక్రమించెను. చండసేనుడు సంహరింపబడెనని చెప్పబడిన జయస్వాలు పండితుని వాక్యమును సమర్థింపక నాతడు తిరిగి కల్యాణవర్మను సంహరించి మగధరాజ్యమును పొందెనని సవరించెను. ఆ కారణముననే అలెగ్జాండరు వచ్చినపుడు చంద్రగుప్తుడు రెండవసారి రాజ్యమధిష్ఠించి యుండెనని చెప్పవలెను. మొదటి పర్యాయము రాజ్యము చేపట్టినపుడున్న గాథలను గ్రీకు చరిత్రకారులు తమ గ్రంథములందు ప్రోదిచేసి యుంచిరనుట కిది యుచితమయిన సమర్థనమగును.

కూడ 'స్ట్రాబో' (Strabo) అను చరిత్రకారుడు పేర్కొనెను, ఈ లెక్కప్రకారము మౌర్యగుప్త చంద్రగుప్తుల వంశావళిని బరిశీలింతము.

| మౌర్యవంశము | గుప్తవంశము |
|---|---|
| మహానందుడు | వృద్ధరాజు |
| 1 | 1 |
| మహాపద్మనందుడు | జాండ్రేమ్సు |
| 1 | 1 |
| 1 లేక 8 కుమారులు | శాండ్రకోట్టస్ |
| 1 | |
| మౌర్యచంద్రగుప్తుడు | |

మహానందునకు గాని, పద్మనందుని రాణులకుగాని నల్పప్రతిపత్తిగల వంశజునితో నెట్టి సంబంధ ముండినట్లు మన పురాణము లందు ప్రవచింప బడియుండలేదు. నందుడు 'ద్వితీయ ఇవభార్గవః' 'సర్వక్షత్రాంతకోనృపః' అను విశేష నామములచేత నే కీర్తింపబడినట్లు గుర్తింప గల్గుదుము. అదియుంగాక జాండ్రేమ్సు అనుపదమును 'నందునకు' భాషాశాస్త్ర వాదముచేగాని లేక యితరవాదముచేగాని, యెట్టి సమన్వయము కుదిరింపజాలమును. సాండ్రకోట్టస్ అను పదము చంద్రగుప్తునకు సమన్వయించుటయు మిగుల క్లేశము. ఈ సాండ్రకోట్టస్ విప్లవాత్మకమయిన వ్యక్తిగా గ్రీకులు పేర్కొనిరి. కాని అట్టిస్థితి చంద్రగుప్తునకట్టి పరిస్థితిలో నున్నట్లు కానము. మగధసింహాసనాధిపత్య మీతనికి తనకై తాను ప్రయత్నించి సంపాదించినట్టిదికాదు. మహాకుటిల నీతిజ్ఞుడయిన చాణక్యుడీ సామ్రాజ్యమును కూర్చిపెట్టెను. చంద్రగుప్తునకు సింహాగాథనుగాని మఱియే యితరమయిన అదృష్టదేవతావరణగాథను గాని సమన్వయింప జాలము. ఒకవేళ చంద్రగుప్తుడు మౌర్యవంశ సంజాతుడేయయి, ఆతడే గ్రీకులచే బేర్కొన

బడినచో, నాతని రాజ్యమునపహరింపజేసిన యశేషశేముషీ ధురంధరు డగు చాణక్యుని పేర్కొనకుండిరేల? ఈ ప్రశ్నకు మనముసరియైన యుత్తరమొసంగ జాలము. మహాపద్మనందునకు గల ఎన్మిది కుమార్లతో కోట వెంకటచలంగారు తమగ్రంధములో జాంద్రీమ్సును చంద్రశ్రీగా బోల్చియున్నారు [1] ఈతఁ డాంధ్ర రాజులలో చివరి వాడయిన చంద్రశ్రీ యనిచెప్పిరి. కాని గ్రీకుల వ్రాతలలోని వృద్ధ ప్రభువుతో నీతని బోల్పజాలముకదా! అదియుంగాక సముద్ర గుప్తునిగా బోల్పబడిన గ్రీకుల శాంద్రకోట్టస్ రాజ్యములేక యుండెనని వ్రాసిరి, ఆ సమయములో నలెగ్జాండరును దర్శించి మరణదండనకు బాత్రుడై దైవవశమున ప్రాణమును రక్షించుకొని యడవులబడెను. ఆతరువాత అడవులలోని దొంగలను, వారి నాయకులను కూడగట్టు కొని అలెగ్జాండరుచే భారతదేశమున నియమింపబడిన రాజప్రతినిధులను సంహరించి మగధ సింహాసనమును కైవసము గావించుకొనినట్లు గ్రీకు చరిత్రకారులు చెప్పుచుండిరి. సముద్రగుప్తుడు అలహాబాదు శాసన మున తాను మగధ రాజ్యస్థాపనము గావించితినని స్పష్టముగా జెప్పు కొనెను. అనగా తనకు సామ్రాజ్యము పిత్రాగతమైనదికాదు. జస్టిన్ యీతనిని విప్లవకారునిగా పేర్కొనెను. పురాణములీతని విశ్వఫణిగా బేర్కొని యీతని తీవ్రతను గుర్తించినట్లు మనకవగతమగును. కాని పురాణములు ప్రాంతీయ రాజ్యపాలక వంశముగా నీయాంధ్ర భృత్యు లను పేర్కొనుట చేతను, బ్రార్హద్రధుల మొదలుకొని మగధ సామ్రాజ్య పాలకులను బేర్కొందునని పురాణకర్త ప్రవచించుట చేతను వీనికి తగిన ప్రాధాన్యము వచ్చియుండలేదు. పార్గిటరు కూడ తన

1. Kali Saka Vijnanam Part III P, 9 K. Venkatachalam
2. దండం గ్రాహయతేవ కోట కులజమ్ పుష్పాహ్వయే క్రీడతా।

Inscription of Allahabad. Quoted by Dr. Mankad P. 266 vide Puranic Chronology :

కలిరాజవంశములందు క్రీ. శ. మూడవశతాబ్దిలోని పల్లవులను పేర్కొనుచు 'విశ్వఫణి'ని పేర్కొనుటచేనాతడు సముద్రగుప్తుడే కాని యన్యుడు కాడనుటకు దోహదమొసంగుచున్నది. కాళిదాసు 'మాళవికాగ్నిమిత్రము'లో తపనీయాశోకమును గురించి పెక్కుమారులు పేర్కొనియుండుట సముద్రగుప్తుని స్మరించుటయేయని యొక అభిప్రాయమున్నది. సముద్రగుప్తున కశోక నామముండుట, ఆదిత్య బిరుదముండుట నీ సమయమున స్మరింపదగును. ప్రియదర్శి శాసనములశోకునివని చరిత్రకారులు నిర్ణయించిరి. ఈ యశోకుడు మౌర్యాశోకుడు కాక మహాశోకుడని పేర్గాంచిన సముద్రగుప్తునకు సంబంధించినవని యొక సమర్థనమున్నది. కళింగయుద్ధ మొనర్చిన ప్రభువు కూడ మౌర్యప్రభువు అశోకుడు గాడని సముద్రగుప్తుడేనని డా॥ మన్కడ్ పండితులు తమ గ్రంథమున సోపపత్తికముగా నిరూపించినారు.

వీనినన్నింటిని పరిశీలించినచో నలెగ్జాండరు ప్రభువు కాలమున నున్నది గుప్తచంద్రగుప్తుడు గాని మౌర్యచంద్రగుప్తుడు గాడని రూఢి యగుచున్నది. సెల్యూకసు భారతదేశమునకు వచ్చినపుడు ఈ దేశమునేలినది సముద్రగుప్తుడను వాదము దీనిచే సమర్థనీయమగుచున్నది.

చరిత్రకారులింకను నీ విషయమున పక్షపాతరహితబుద్ధితో తీవ్ర పరిశోధన మొనర్పవలయును. అనేకోపపత్తులు క్రీ. పూ. గుప్తుల కాలముతో నలెగ్జాండరు దండయాత్ర సమన్వయమునకు వీలుకల్పించుటచేత ఈ దృక్పథముతో బరిశోధింపవలసిన యావశ్యకత హెచ్చయ్యెను. సత్యాన్వేషబుద్ధితో మన చరిత్రపరిశోధకు లీయంశమున పురోగమించిరేని యమూల్యమగు విషయము లనేకము బహిర్గతము కాగలవు. వారు పరిశోధనకు గడంగుటకు తగినయుపపత్తులు చేయబడియున్నవి. నిగ్గుతేల్చి ప్రపంచకమునకు భారతదేశ పురాణేతిహాసము లందుగల చరిత్రయందలి యాదార్థ్యము ప్రకటింపవలసిన

బాధ్యులె వారిపయినున్నది. దానిని విస్మరింపక కర్తవ్యమునకు గడంగుదురని మనము విశ్వసింతము.

### 3. విక్రమార్క - శాలివాహనులు :-

భారతీయ చరిత్రకారులు పక్షపాతరహితబుద్ధులై, యాత్మ ప్రత్యయముతో దేశచరిత్రయందు శకకర్తలయిన విక్రమార్క శాలివాహనులకుగల స్థానవిషయమై పరిశోధింప వలసియున్నది. ఇది తృతీయాంశము. శ్రీ విశ్వనాథ తనకు లభించిన యుపపత్తులతో పేరుపొందుచుండి యితివృత్తముల నాశ్రయించి రెండునవలలు రచించెను. 1వ నవల 'వేదవతి' విక్రమార్కసంబంధి. ఆ నవలా పీఠికలో "శ్రీ విక్రమార్కుడు, హర్షుడను బిరుదములు కలిగిన ప్రభువు విక్రమాదిత్యుడు. కాళిదాసాది మహాకవులను పోషించినవాడు. శకకర్త. అవతార పురుషుడు. ఉజ్జయిని యందు నూరేండ్లు రాజ్యము చేసెను. దీనికి కాళిదాసాది కవుల రచనలు, పురాణములును, కల్హణుని రాజతరంగిణియు సాక్ష్యములు" అని శ్రీ విశ్వనాథ వ్రాసెను. వీని యాధారముతో శ్రీ విక్రమార్కుని కి చరిత్ర యందుగల స్థానమును మనకు లభించిన యాధారములతో నిరూపింప ప్రయత్నించుట కర్తవ్యము.

ఇప్పటికి మనము చదివెడి భారతదేశ చరిత్రగ్రంథములలో వీరికి స్థానము లేదు. కాళిదాసకవిని భోజరాజునకు సమన్వయించిరి. నిజముగనే యీ రాజులు లేరా? ఉన్నచో చరిత్రకారులు మిన్నకుండుటలోని రహస్యమేమి? ఈ విషయములు పరిశీలింపబడును. వీనికి ప్రధానమయిన యాధారముల వర్గీకరణము :

1) పురాణములు 2) రాజతరంగిణి 3) ఇతర గ్రంథములు 4) పాశ్చాత్యుల అభిప్రాయములు 5) శాసనములు

ఈ వర్గీకరణ మాధారముగా నొక్కొక్క విషయమును పరిశీలింతము.

1. పురాణములు :

పురాణములన్నియు మగధరాజ వంశావళిని మాత్రము కీర్తించినవి. భవిష్య పురాణమునందు భరత భూమిని పాలించిన యన్ని వంశములను గూడ పేర్కొనబడెను. భవిష్య పురాణ ప్రామాణ్యమును గురించి పార్జిటరు అభిప్రాయమును సమర్థించుచు వి.ఎ. స్మిత్ పేర్కొనిన భావము మెచ్చదగినది.

"M. R. F. E. Pargiter in his valuable work, "The Dynasties of Kali Age" (Clarendon press 1913) has succeeded in obtaining more defenete results. He suggests that the Bhavishya purana in its early form was the original authority from which the Matsya, Vayu and Brahmanda derived their dynastic lists. The variations of the lists as now found in the Matsya, Vayu and Brahmanda puranas grew out of one and the same original text".

quoted by V. A. Smith in his early History of India P. 23'

ఈ పాశ్చాత్య పండితుల ప్రమాణమును గ్రహించిన యనంతరము భవిష్యపురాణమున నీమహనీయుల చరిత్ర యెట్లు వ్రాయబడినదో గమనింతము.

భవిష్యపురాణములోని ప్రతిసర్గపర్వము నాలుగుఖండములు కలిగినది. ఈ నాలుగు ఖండముల యందును శతాధ్యాయములున్నవి. ఇందు నలుబది నాలుగధ్యాయములు విక్రమార్క శాలివాహనుల యితివృత్త సమన్వితము. ఇందు శౌనకాది మహర్షులు సూతుని నగ్నివంశపు రాజవృత్తాంతమును విశదీకరింప ప్రార్థింతురు. అనంతరము

సూతుడిట్లు చెప్పను. ప్రమర, చౌహాని. శుక్ర, పరిహారములను రాజవంశములు కలిగి యగ్నివంశమను నైకైక నామముతోనున్నవి. ఇందు ప్రమరులు ప్రమరుడను ప్రభువుతో నారంభింపబడిరి. ప్రమరుడు బ్రాహ్మణుడు. సామవేదమును సాంగోపాంగముగ నధ్యయనము చేసెను. అంబావతియను దేవతానుగ్రహ లబ్ధమయిన అంబావతీ * పురిని రాజధానిగ నొనర్చుకొని దక్షిణ దేశమును పాలించుచుండెను.

చౌహానులు యజుర్వేదులు. రాజపుత్ర స్థానములోని అజ్మీరు వీరికి ముఖ్యపట్టణము. శుక్లుడు త్రివేది. ఈయన కశ్యప నను బ్రాహ్మణుని కుమారుడు, గుజరాతునందలి ద్వారక ఈయనకు రాజధాని. పరిహారుడథర్వవేదీయుడు. బంగాళమునందలి కలింజరపుర మీయనకు రాజధాని. వీరు రాజ్యములకు వచ్చి పాలించుట మొదలయిన వెంటనే దేశము మ్లేచ్ఛ దురాక్రమణముచే బీడింపబడినది ఇది వీరికి క్లిష్టత గూర్చిపెట్టెను, వీరి బాధను గ్రహించి యొక కన్యాకుబ్జ పండితుడు వీరికి సన్నిహితుడయి రాజపుటానాలోని 'అబూ' పర్వతమునకు గొనిపోయి యచట అగ్నిని వ్రేల్చి అనేక మంత్రముల నుచ్చరించి, వీరి రాజ్యదురాక్రమణమును నిరోధించుటకు వలయు వీర్య విక్రమ పరాక్రమ సంపత్తిని ప్రసాదింప నాదేవుని వేడి వెడలెను. ఎవరి రాజ్యములను వారు పాలించుకొనుచు మ్లేచ్ఛ దురాక్రమణ విషయమై యప్రమత్తులై మెలగ జొచ్చిరి. ప్రమరుడట్లాఱేండ్లు పాలించెను. ఆయన కొడుకు మహామరుడు మహామరుని సూనుడు దేవపి, ఆతని పుత్రుడు దేవదూత, వీరుమువ్వురు నొక్కొక్కరు మూడేసి యేడులు పాలించి శకులతో తలపడి యుద్ధమున నిహతులైరి.

* ఈ అంబావతీపురమును కొందఱు శ్రీశైలమని చెప్పుదురు. పెక్కుఱు ఉజ్జయని యని పేర్కొందురు.

ఈ దేవదూత కుమారుడు గంధర్వసేనుడు. ఈతడు ప్రమర వంశములో పరాక్రమశాలి. శకులతో దలపడి వారి నుసుమాడి ఏబది సంవత్సరములు రాజ్యమును పాలించెను. అనంతర మీయన కుమారుడైన శంఖునకు పట్టాభిషేకము గావించి తపమొనర్ప నరణ్యమునకు జనెను. ఈ శంఖుడు ముప్పదేడులు రాజ్యపాలన మొనర్చి విఖ్యాత యశుడయ్యెను. తపమొనర్ప నరణ్యములకు జనిన గంధర్వసేనుడు తిరిగి రాజ్యమునకు వచ్చెను. మరల నాయనకొక పుత్రు-

---

భవిష్య పురాణము :

"ప్రమర స్సామవేదీచ చపహాని ర్యజుర్విదః ।
త్రివేదీచ తథా శుక్లోఽథర్వాచ పరిహారకః ।
ఐరావత కులేజాతాన్ గజానారుహ్యతే పృథక్॥ 3-1-6-47
"అంబావతీ నామ పురీ మధ్యాస్య సుఖితో భవత్ । 3-1-6-49
చిత్రకూట గిరౌ ప్రదేశే పరిహారో మహీపతిః ।
కలింజరపురం రమ్య మ్మక్రోశాయతనం స్మృతం॥ 3-1-7-1
రాజపుత్రాఖ్య దేశేచ చపహాని ర్మహీపతిః ।
అజమేరపురం రమ్యం విధిశోభా సమన్వితం॥ 3-1-7-2-3-
శుక్లో నామమహీపాలో గత ఆనర్త మండలే ।
ద్వారకా నామ నగరీ మధ్యాస్య సుఖితో భవత్॥ 3-1-7-4

రాజ్యపాలన కాలము :

సప్తవింశతిశతే వర్షే దశాబ్దే చాధికే కలౌ । (2710) 392 క్రీ. పూ.
ప్రమరో నామ భూపాలః కృతరాజ్యంచ షట్సమాః 3 7 7, 8
"పూర్ణేత్రింశ చ్ఛతేవర్షే శకా ప్రాప్తే భయంకరే" 3 1 7 14
'శకానాంచ వినాశార్థ మార్యధర్మ వివృద్ధయే
జాత శ్శివాజ్ఞయా సోఽపి కైలాసా ద్గుహ్యకాలయాత్॥ 3 1 7 15.

డుదయించెను. గుహ్యకులు కైలాసవాసులు. పరమశివుడు కైలాస పతి. ఆయన యాజ్ఞచేత గుహ్యకులలో నొకడు గంధర్వసేనునకు బుత్రుడుగా జనించెను. ఆర్యధర్మమును సంరక్షించుటకు శకులను రూపుమాపుటకు నీయన యవతరించెను.

పుత్ర జననోత్సాహమునొంది గంధర్వసేనుడు కుమారునకు విక్రమాదిత్యుడను పేరుంచెను. ఈతని కైదవయేడు వచ్చుటతోడనే తపమొనర్ప నడవులకేగి పండ్రెండు సంవత్సరములు ఘోరతప మొనర్చి దివ్యశక్తులనేకము దేవతావర ప్రసాదమునబడసి యుజ్జయిని కేతెంచెను. అతని పట్టాభిషేక సమయమున పార్వతీదేవి పనుపున భేతాళుడు బ్రాహ్మణరూపమున వచ్చి 32 సాలభంజికలుగల యొక సింహాసనమును సమర్పించి దానినెక్కదలచిన యా ముప్పదిరెండు బొమ్మలు చెప్పెడి కథలను వినవలెనని యాదేశించెను. ఈ ముప్పది రెండు కథలు ముప్పది రెండధ్యాయములుగా ప్రతిసర్గపర్వమునందు ద్వితీయ ఖండము నందుదహరింప బడినవి.

ఈ ప్రమరులు మొదటగా నవంతి రాష్ట్రము నుజ్జయిని రాజ ధానిగ జేసికొని పాలించిరి. తరువాత మాళవ దేశమంతయు నాక్ర మించుకొనిరి. ఆంధ్రదేశమువరకు దక్షిణమున వీరి రాజ్యము విస్తరిల్లెను. కాని రాష్ట్రము, రాజధానియైన యుజ్జయిని శకుల పర

---

విక్రమాదిత్య నామానం పితాకృత్వా ముమోదహ ,
సబాలోపి మహాప్రాజ్ఞః పితృమాతృ ప్రియంకరః ॥ 3-1-7-16
పంచవర్షే వయఃప్రాప్తే తపసోఽర్థే వనంగతః ।
ద్వాదశాబ్దం ప్రయత్నేన విక్రమేణ కృతంతపః ॥ 3-1-7-17
పశ్చా దంబావతీం దివ్యాం పురీం యాతః శ్రియాన్వితః ।
దివ్యం సింహాసనం రమ్యం ద్వాత్రింశ న్మూర్తి సంయుతం॥
3-1-7-1

మయ్యెను. అప్పుడీవంశీయులు దక్షిణమున గల శ్రీశైలమునకేగి యచట రాజధాని నేర్పాటుగావించుకొని దక్షిణదేశమును పాలింప వాడగిరి, గంధర్వసేనుని యుదయముతో ప్రమరవంశమునకు క్లిష్ట దశ తొలగెను. ఉజ్జయినిని హస్తగతము చేసికొని రాజ్యమును పాలించెను. ఈయన కుమారుడు విక్రమార్కుడు పూర్వుల నుండి సంక్రమించిన యుజ్జయినిలో పట్టాభిషిక్తుడయ్యెను.

ఈయన తన యవక్ర పరాక్రమముతో, ధైర్యసాహసములతో ఉదాత్తగాంభీర్యములతో దేశమును శతసంవత్సరములు పాలించెను. దేవభక్తునకు పట్టాభిషేకముగావించి దివికేగెను. దేవభక్తుడు విక్రముని సూనుడు. పదిసంవత్సరములు పాలించి క్రూరులయిన శకులచే నిహతుడయ్యెను. పురాణము లందొకటి యయిన భవిష్యత్పురాణ మాధారముగ నీవిక్రమార్కుని చరిత్ర వివరింపబడినది. దీని యనంతరము కల్హణుని రాజతరంగిణి యందేమి వ్రాసియున్నదో తెలిసికొందము.

## 2. రాజతరంగిణి :

కల్హణుని రాజతరంగిణి యందలి మూడవతరంగము విక్రమార్కుని విషయమై అమూల్యమయిన వివరము లొసంగును. సత్యమైన చరిత్ర వ్రాయుటకు దగిన దీక్ష బూని నిర్వర్తించు నాతనిని

---

శివాజ్ఞయాచ నృపతి ర్విక్రమ స్తనయ స్తతః।
శతవర్షే కృతం రాజ్యే దేవభక్త స్తతో భవత్॥
దశవర్షం కృతంరాజ్యం శకైర్దుష్టైర్యయం గతః।

భవిష్య పురాణము 6-4-22

హర్షుని చరిత్రరచన విషయముననే శంకింపబూనుట హాస్యాస్పదము. కాశ్మీర రాజులీ తరంగమున మేఘవర్ణునితో నారంభ మగుదురు. అనంతరము ప్రవరసేనుడు, తోరమానుడు, మాతృగుప్తుడు కాశ్మీరము నేలిరి. ఉజ్జయినిలో విక్రమార్కుని యాంతరంగిక సేవకులలో నీమాతృగుప్త డొకడు. ఈ విక్రమార్కుడే మాతృగుప్తుని కాశ్మీరప్రభువుగా నొనర్చెను. రాజతరంగిణిలో

తత్రానేహ స్యుజ్జయిన్యాం శ్రీమాన్ హర్షాపరాభిధః॥
ఏకచ్ఛత్ర శ్చక్రవర్తీ విక్రమాదిత్య ఇత్యభూత్॥ 3-125
మ్లేచ్ఛోచ్ఛేదాయ వసుధాం హరే రవతరిష్యతః।
శకాన్వినాశ్య యేనాదౌ కార్యభారో లఘూకృతః॥ 3-128

మ్లేచ్ఛులను సంహరించుటకై భూమియందు నవతరించనున్న మహావిష్ణువు యొక్క కార్యభారము మొట్టమొదట శకులను జంపి యేవిక్రమార్కునిచేత తేలిక చేయబడినదో అట్టి విక్రమాదిత్యుడు ఏకచ్ఛత్రాధిపత్యముగ నుజ్జయినియందు హర్ష నామాంతరముతో నుండెనట.

ఈ మాతృగుప్తుడు కాశ్మీరము నైదు సంవత్సరములుమాత్రమే పాలించెను. ఈ మాతృగుప్తుడు మిగుల సహనశీలి. తనకయి తాను రాజ్యవిభవములను గోరువాడు కాడు. అతని సంస్కారమును, కవితానైశిత్యమును ప్రభువయిన విక్రముని దృష్టినుండి మరలిపోలేదు. బుద్ధిపూర్వకముగనే యాతనిని లక్ష్యపెట్టకుండెను. దుర్భరదారిద్ర్యముతో సముచితమయిన యాహారవిహారములు లేకున్నను తన ప్రభువును కడుశ్రద్ధతో సేవించుచుండెను. ఫలితములేదు. ఎట్టకేల కతని యదృష్టము వెన్నుతట్టు సమయము సమీపించెను, ఒకనాటి రాత్రి ఎల్లరు రక్షకులు నిద్రించుచుండిరి. సుడిగాలిచేత రాజశయన మందిరమున చిన్నవి చేయబడిన దీపములు మలిగెను. రాజు దీపమును దీపింప

జేయ నుంకించెను. సేవకు లెవ్వరటలేరు. బిగ్గరగా కేకవేసినను బదులులేదు. వాకిటనున్న మాతృగుప్తుడు రాజాభీష్టమును నెరవేర్చెను. మాతృగుప్తుడు సెలవు తీసికొనుచుండగా రాజుపిలిచి యాతని స్థితిని తెలిసికొనుచు నాయర్ధరాత్రమున మేలుకొనుట కేమి కారణమని ప్రశ్నించెను. వెంటనే మాతృగుప్తుడీ శ్లోకమును జదివెనట. మాషముద్గవృతులవలె శీతముచేత మడుచుకొనబడినట్టియు,

"శీతేనోద్ధృషితస్య మాషశిమివచ్చింతార్ణవే మజ్జతః।
శాంతాగ్నిం స్ఫుటితాధరస్య ధమతః క్షుత్ క్షామ కంఠస్య మే।
నిద్రాక్వా ప్యవమానితేవ దయితా సంత్యజ్య దూరంగతా।
సత్పాత్ర ప్రతిపాదితేవ వసుధా నక్షీయతే శర్వరీ"॥ రాజ 3-184.

చింతాసాగరమున మునిగినట్టియు, శాంతాగ్నిని అధరము నందు ప్రస్ఫుటితమొనర్చునట్టియు, క్షుద్బాధను కొలిమితిత్తివలె నూదునట్టి కంఠముగల నాకు, భర్తచేత నవమానింపబడిన భార్యవలె నిద్ర నన్ను వదలి యెటకో దూరముగా బోయినది. ఈ రాత్రి యోగ్యశాసకునిచే పాలింపబడు భూమివలె క్షీణింపకున్నదని ఈ శ్లోక భావమైయున్నది.

ఆశ్లోకము విన్న ప్రభువు తన యలక్ష్యమునకు బశ్చాత్తప్తుడై యా మహాకవి కేవిధమయిన యుపకార మొనర్పవలెనో యాలోచన చేయుచుండెను.

ఉదయమయినంత రాజు మాతృగుప్తునికి చేయవలసిన యుపకృతి విషయమై ప్రభువు నిర్ణయించుకొనెను. కాశ్మీరము నాడు రాజు లేకయుండెను. ఆ రాజ్యము తనకు సామంత మగుటచేత దానికి రాజును నియమింప వలసిన బాధ్యత తనపయినుండెను. మాతృగుప్తుని బిలిచి యొక అధికార పత్రమును కాశ్మీరమునగల తన మంత్రులకొసంగ వలసినదని యాజ్ఞాపించెను. అందు మాతృగుప్తుని కాశ్మీర

మున పట్టాభిషిక్తుని చేయవలసినదిగా మంత్రులకు వ్రాయబడెను. తాను కాశ్మీరమునకు బయలుదేరుటకు మున్నే, త్రోవ యందనేక సుశకున ములు పొడమెను. ఆ యుత్తరమును కాశ్మీర మంత్రుల కొసంగెను. రాజాజ్ఞ ననుసరించి మంత్రులు మాతృగుప్తుని ప్రభువుగా నభిషే కించిరి. నాటినుండి మాతృగుప్తుడైదు సంవత్సరములు కాశ్మీరమును జయప్రదముగా బాలించెను. త్రిగర్తమండలమును జయించి కాశ్మీరము నకు తిరిగి వచ్చునంతలో విక్రముని మరణమును తెలిసెను. అది మాతృగుప్తునకు హృదయ విదారక మయ్యెను. ఆ దుఃఖభారముతో నచటనే తనువు చాలించెను. (రాజతరంగిణి 3-285 నుండి 287)

## 3. విక్రమార్కుని యునికి దెలిపెడి యితర గ్రంథములు :

1) కాళిదాసుని జ్యోతిర్విదాభరణము 2) జ్యోతిషఫల రత్న మాల 3) నేపాల రాజవంశావళి 4) సిద్ధాంత శిరోమణి 5) నాటక లక్షణ రత్నకోశము 6) కథా సరిత్సాగరము 7) బృహత్సంహిత — శకునశాస్త్రము 8) పత్రికా సాక్ష్యము

1. కాళిదాసు కావ్యనాటక రచయితయే గాక జ్యోతిష గ్రంథ మును గూడ రచించెను. ఆ గ్రంథము జ్యోతిర్విదాభరణము. అందు విక్రమార్కుని యాస్థానమున గల నవరత్నములను బేర్కొనెను. నాడు అతని కొలువున ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంకువు, భేతాళభట్టు, ఘటకర్పరుడు, కాళిదాసు. వరాహమిహిరుడు, వరరుచి అను మహానుభావులున్నట్లు పేర్కొనినాడు. ఆ శ్లోక మిట్లున్నది.

ధన్వన్తరి క్షపణ కామరసింహ శంకు ।
భేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః ॥ 22-19
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం ।
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య ॥ 20

ఇంక విక్రమార్కుని యాస్థానమున నవరత్నము లున్నట్లు, అందు తానొకడయినట్లు విస్పష్టమయినట్లేకదా !

## 1. జ్యోతిషఫల రత్నమాల :

శ్రీకృష్ణమిశ్రుడీ గ్రంథమునకు గర్త. విక్రముని యాస్థానమున నుండెను నవరత్నములకున్న ప్రశస్తి యీయనకు లేక పోవచ్చును. డెబ్బది సంవత్సరములనుండి తనను బంధుగణముతో కోటి సువర్ణ శలాక లిచ్చి పోషించిన విక్రమార్క చక్రవర్తి మనువులతో సాటి యయిన కీర్తి గలిగి విజయపరంపరలతో చిరకాలము జీవించుగాక' యని 'జ్యోతిషఫల రత్నమాల' అను గ్రంథమునందు ఆశీర్వదించిన యొక శ్లోకమును బట్టి యీ యంశమును నిర్ణయింపనగును.

"శ్రీ విక్రమార్కో జగతీతలేస్మిన్।
జీయా న్మను ప్రఖ్యయశా నరేంద్రః॥
ప్రపోష్య కోటి సువర్ణతో
మాం సబాంధవం సప్తతి వత్సరాణి॥"

## 3. నేపాలరాజ వంశావళి :

ఇండియన్ యాంటిక్విటి 13వ భాగమున 411వ పేజీనుండి 428 వరకు నేపాళరాజవంశావళిని గురించి ప్రకటింపబడినది. భారత యుద్ధమునుండి యీ రాజవంశ క్రమము క్రోడీకరింపబడినది. మొదటిది గోపాలవంశము, అహీరవంశము, కిరాతవంశము, సోమవంశము. సూర్యవంశము, ఠాకూరివంశముల వరుస కానవచ్చును. సూర్యవంశములోని చివరిరాజు విశ్వదేవవర్మ. ఈవంశములో నీతడు ముప్పదియొకటవవాడు. ఈతని కుమార్తెను ఠాకూరువంశములోని మొదటి ప్రభువయిన యంశువర్మ కిచ్చి యాతని నల్లుని జేసికొనెను. విక్రమార్కుడు రాజ్యమునకు వచ్చుసరికి అనేక చిన్ని చిన్ని రాజ్యము

లన్నియు సంతఃకలహములలో నుండెను. వానినన్నింటిని తన రాజ్య పరిధి క్రిందకుదెచ్చు నుద్దేశ్యముతో ప్రయత్న మారంభించెను. అట్లు చేరినచివరి రాజ్యము నేపాలము. చివరిప్రభువు అంశుమంతుడు. విక్ర మార్కుడు స్వయముగా క్రీ. పూ. 57వ సంవత్సరమున నేపాళమున నంశుమంతునిచే గృతస్వాగతుడై శంకుస్థాపనతో తన చక్రవర్తిత్వము నంగీకరింపజేసెను. శాలివాహనశకము క్రీ. శ. 78 కి సమానము. అప్పుడు విక్రమవంశమునకు శాలివాహనశకమునకు మధ్యకాలము 135 సంవత్సరములుగా నుండును. కీ.పూ. 57వ సంవత్సరమున విక్రమ శక మారంభింపబడినది, నేపాళదేశమునని చెప్పుటకు నా సంవత్స రముననే నేపాళదేశముతో నన్నిరాజ్యములు విక్రమార్కుని పాలబడికి వచ్చెను. అన్ని రాజ్యములు విక్రముని చక్రవర్తిత్వ మంగీకరించినవి. నేపాళరాజు అంశుమంతుడు రాజధానిని మధ్యలఘు నగరమునకు మార్చెను. విధువర్మ అనునాయనచే నొక 'అక్విడక్టు' నిర్మింపబడెను. దానికి ఏడు తూములున్నవనియు నది పంటకాలువల నిమిత్తమయి నిర్మాణమయ్యెనని, నా కట్టడము పయి వ్రాయబడిన శాసనముతో విక్రమార్కుడు నేపాలమునకు కలి 3044(క్రీ.పూ. 57) నదర్శించెననియు నచట తనదైన విక్రమశకము స్థాపించెనని యున్నది. క్రీ. పూ. 57 నుండి విక్రమ శకమట్లు వ్యవహరింప జొచ్చెను.

## 4. సిద్ధాంత శిరోమణి :

భాస్కరాచార్యుడు గొప్ప ఖగోళ శాస్త్రవేత్త. ఈయన మహా దేవుని కుమారుడు. కర్ణకుతూహలము, లీలావతి గణితము, బీజ గణి తము, సిద్ధాంత శిరోమణీ త్యాది గ్రంథములకు గర్త. 'సిద్ధాంత శిరో మణి'లో కాలమానాధ్యాయమున 28వ శ్లోకమున నొక పాదమున విక్రమ శకాంత్యకాల విషయము కానవచ్చును. ఆశ్లోక పాదము.

"సంఖ్యాక్రమ గుణాశ్చ విక్రమ నృపస్యాంతే కలే ద్వత్సరాః"

నందులు-9., అద్రులు-7, ఇందు-1, గుణములు-3, అంకానాం వామతో గతి న్యాయమున కలి 3179 విక్రమశకాంతము.

క్రీ. 1 కి కలి 3102 సమము. క్రీ. శ. 3179-3102=77+1 : 78 శాలివాహన శకారంభము. క్రీ. పూ 57 విక్రమశకారంభమగుచో నీశకము వ్యవహారమందున్నది 57+77 - 134+1 : 135 సంవత్సరము లని తాత్పర్యము.

5. నాటక లక్షణ రత్నకోశము :

13వ శతాబ్దికి జెందిన 'సాగరనడి' యను నాయన 'నాటక లక్షణ రత్నకోశ'మను పేర నొక శాస్త్ర గ్రంథమును సంకలన మొనర్చెను. ఆగ్రంథమునందలి చివరి శ్లోకములో విక్రమనరాధిపుని ప్రశస్తి చేయబడినది.

ఆ శ్లోకము :

"శ్రీహర్ష విక్రమనరాధిప మాతృగుప్త
గర్గా శ్మకుట్ట నఖకుట్టక బాదరాణామ్।
ఏషాం మతేన భరతస్య మతం విగాహ్య
ఘుష్టం మయా సమనుగచ్ఛతో రత్నకోశమ్॥

నాటక విషయమయి భరతమతము నెఱింగి, దానికి హర్ష విక్రముడు, మాతృగుప్తుడు, అశ్మకుట్టుడు, నఖకుట్టుడు బాదరుడు మొదలగు వారు గావించిన వ్యాఖ్యానముల నవగాహనము గావించుకొని యీ సంకలనము గావింపబడినట్లు పేర్కొనెను. ఇచట శ్రీహర్ష విక్రముని వెంట మాతృగుప్తుని పేరుండుట కల్హణుని రాజతరంగిణిని స్ఫురింప జేయుచున్నది. 13వ శతాబ్దినాటికి హర్షవిక్రముని, మాతృగుప్తుని నాటకలక్షణ గ్రంథముల యునికిని స్పష్టము చేయుచున్నది.

ఇది శ్రీహర్షుని పేర సమన్వయము చేయజాలని కారణము విక్రమ శబ్ద మవ్యవధిగ శ్రీహర్ష శబ్దమున కనుబంధింప బడియుండుటయే యగును. కనుక నీ హర్షవిక్రము దుర్జయుని ప్రభువయిన విక్రమార్కుడే యగుచున్నాడు.

శారదాతనయుని 'భావప్రకాశిక' యను నాటకలక్షణ గ్రంథము నందును, నాట్యశాస్త్రమునకు (భరతుని) వ్యాఖ్యానగ్రంథమును రచించి అభినవగుప్త పాదాచార్యుని 'అభినవ' యను గ్రంథమునను, నాట్యశాస్త్రమునకు రచించిన వార్త్తికమున హర్షుని శ్లోకముదహరింప బడుట,X మాతృగుప్తుని గ్రంథములోని శ్లోకము లిట్లే యాగ్రంథము నందు నుదహరింపబడుట తెల్లము. కనుక శ్రీహర్ష మాతృగుప్త లిర్వురచరిత్ర రాజతరంగిణిలో చెప్పబడినట్లు జరిగియుండుట సత్య మను విషయమును విశ్వసింప కుండుటలో న్యాయము లేదు.

**4, కథాసరిత్సాగరము:**

కాశ్మీరదేశమును క్రీ. శ. 1029 - 1064 సంవత్సరముల దుమ పాలించిన అనంత ప్రభువుకడనున్న సోమదేవవిరచిత మీ కథాసరిత్సాగరము. ఇందు 24,000 శ్లోకములతో (లంబక) విభాగ ములు కలవు, గుణాఢ్యుని పైశాచిక భాషలోని బృహత్కథకు సంస్కృత సంగ్రహము కథాసరిత్సాగరమని గ్రంథకర్త నుడివియుండెను.

కథాసరిత్సాగరమునందు చరమలంబకములో విక్రమాదిత్యు నకు సంబంధించి కొన్నికథలు పేర్కొనబడినవి. ఈ లంబకము విషమ శీలలంబకమను శీర్షికతోనున్నది. విక్రమాదిత్యుని బహువిధ శౌర్య ప్రతాపములన్నియు నుల్లేఖింపబడి, యాతడు విషమశీల నామముతో వ్యవహరింపబడెననియు పేర్కొనబడెను.

---

X. Abhinava Bharathi Gayakwad Oriental Series PP. 172.207 Bhava Prakasika P. 238.

"నామ్నాతం విక్రమాదిత్యం హారో కైరాఒకరోత్పితా।
తథా విషమశీలంచ మహేంద్రాదిత్య భూపతిః॥ 18. 1-51.

ఇచట విక్రమాదిత్యునకు విషమశీలునకు నభేదము చెప్పబడినది. కల్హణుని రాజతరంగిణిలో విక్రమాదిత్యుని కుమారుడు ప్రతాపశీలునిగా జెప్పబడెను.

వైరి నిర్వాసితం పిత్ర్యే 'విక్రమాదిత్య' జన్యథాత్।
రాజ్యే 'ప్రతాపశీలం' సశీలాదిత్యా పరాభిధమ్॥ 3

విక్రమాదిత్యునకు 'విషమశీలు' డను పేరు ప్రతాపశీలుడయిన వాని కుమారనామముచే నిర్ధారణము గావించుకొనవచ్చును కాని భవిష్యపురాణములో విక్రముని పుత్రుని పేరు దేవభక్తుడనియు, నాతడు పదేండ్లు రాజ్యమొనర్చెననియు గలదు. ఆదేవభక్తుడు ప్రతాపశీలునిగ బిలువబడెడి యాధారమేది యైననున్నదో, ప్రతాపశీలుడు విక్రమునకు మఱియొక కుమారుడో తెలియదు. చారిత్రకు లీవిషయమై దృష్టి పఱుప వలసియున్నది. ప్రతాపశీలునకు శిలాదిత్యుడను వేఱొకనామమున్నట్లు తెలియుచున్నది కదా !

బృహత్సంహిత :- వరాహమిహిరుడు జ్యోతిర్విద్వాంసుడు. బృహత్సంహితా ద్యనేక ఖగోళ శాస్త్రగ్రంథములనురచించెను, శకున శాస్త్రము బృహత్సంహిత యను గ్రంథములో నొక భాగము.అందు-

"యచ్ఛుక్ర శక్ర వాగీశ కపిష్ఠల గరుత్మతామ్।
మతేభ్యః ప్రాహఋషభో భాగురే ర్దేవలస్య॥ 86-1
భారద్వాజమతం దృష్ట్వా యశ్చ శ్రీద్రవ్యవర్ధనః।
ఆవన్తికః ప్రాహ నృపో మహారాజాధిరాజకః।-2

ఈ విషయసేకరణకు తాను, తనకు బూర్వులయిన శుక్ర, వాగీశ, కపిష్ఠల, గరుత్మదాది ప్రాచీనశాస్త్రజ్ఞుల మతములు పరిశీలించినట్లును

నొక్క శ్రీద్రవ్యవర్ధనుడు మాత్రము తక్క, యందఱును ప్రాచీన ఋషులనియును జేర్కొనెను. ద్రవ్యవర్ధనునకు శ్రీయని యారంభించుట, మహారాజాధిరాజ, అవ స్తి ప్రస్తావనలు, ద్రవ్యవర్ధనుని విక్రమార్క ప్రభువుగా భావించుటకు నాలోసంగుచున్నవి. ఈ ద్రవ్యవర్ధనుడు ఉజ్జయిని నేలెడు హర్షవర్ధన నామకుడయిన విక్రమాదిత్యుని కంటె నన్యుడుగాకపోవచ్చునను డి. అర్. మన్కడ్ గారి యూహ సమంజసమనుట కీహేతువు బలముగానున్నది. మాలవదేశమునకు నవంతిరాజధాని. మొదట మాలవదేశముననే యీ ప్రమరవంశీయులు పాలించిరి. అనంతరము నుజ్జయినిని రాజధానిగ నొనర్చుకొనినట్లు భవిష్యపురాణము చెప్పినది. ఈ గ్రంథమాధారముగ వరాహమిహిరునకును విక్రమార్కునకును సాన్నిహిత్యమున్నట్లు స్పష్టపడుచున్నది. ద్రవ్యవర్ధనుడే విక్రమార్కుడనుటకు దగిన యాధారమునకుజయస్వాల పండితునిచే సంకలనము చేయబడిన 'ఆర్యమంజు శ్రీమూలకల్ప మను, గ్రంథ ముపకరించుననుట నిస్సంశయము. ఈ విషయమింకను పరిశోధింపదగిన యంశము.

## 8. పత్రికా సాక్ష్యము [ఆంధ్రప్రభ - దినపత్రిక 9-7-76]:

ఈ తేదీగల దినపత్రికలో 'కాళిదాసు - విక్రమార్కుడు సమకాలికులే' అనుశీర్షికతో నొకవార్త ప్రచురింపబడినది. ప్రముఖ పురాతత్వవేత్త డాక్టరు వి. యస్. నాకంకర్ నేడు ఉజ్జయినిగా వ్యవహరింపబడుచున్న యానాటి 'ఘర్ కాలికా' సమీపమున లభించిన క్రీస్తు. పూర్వము 1వ శతాబ్దినాటి మృణ్మయముద్రిక యొకటి విక్రమార్కుని పరిపాలనకాలమును ధృవపఱుచునని స్పష్టీకరించిరి.

ఆముద్రిక పయి స్వస్తికచిహ్నము నాటి బ్రాహ్మీలిపిలో 'కృత' అను ప్రభునామము ముద్రితమైనట్లు ప్రకటించిరి. విక్రమశకము నొక

నాడు కృతశకముగా వ్యవహరించెడివారని, క్రీ. పూ. 1వ శతాబ్ది యందు పశ్చిమక్షత్రప రాజు లుజ్జయినిపై దండెత్తుటకు రాగా వారిని విక్రముడు చిత్తుగా నోడింపగా నా విజయోత్సాహమున 'కృతశక' స్థాపన జరిగినదనియు తెలియజేసిరి.

ఆ కాలమునాడు లభించిన మరియొక ముద్రికపై సింహము దాని పలువరుసను పరికించెడి భరతుడు చెక్కబడెను. కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతల' మందు భరతుడు సింగము పలువరుసను లెక్కించి నట్లు పేర్కొన్న సన్నివేశము కలదు! ఈ రెండు ముద్రికలొకే కాలమునకు సంబంధించియుండుట చేత నింతవరకు వివాదాస్పదముగనున్న విక్రమార్కుని కాలము, కాళిదాస విక్రమార్కుల సమకాలీనత వివాదము సమసిపోగలదని డా॥ నాకంకర్ స్పష్టీకరణము. విక్రమ శకముతో పాటు ఆతనిచే నేర్పఱుపబడి ఇంతవరకు నజ్ఞాతముగా నున్న కృత శక మొకటి వెలుగులోనికి వచ్చుట యిందలి ప్రధానమయిన ఘట్టము.

**శాలివాహనుడు :**

"Salivahana is a later and corrupt form of Satavana". ఈ వాక్యము పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయమునకు యమ్. ఎ. పట్టసిద్ధికై సమర్పింప బడిన సిద్ధాంతవ్యాసములోని ఉపోద్ఘాతములో నున్నది. శాతవాహనుల కాలము నందలి మహత్తరమయిన యభివృద్ధిని కథలుగా రూపొందించుకొని బ్రాహ్మణ, జైన, బౌద్ధ గ్రంథములు ఈ కాలమును శాతవాహనశకమనినవట. దానికి తరువాత శాలివాహనశకమని మార్పు కలిగెను. ఈ అభిప్రాయ మా గ్రంథమున రచయిత వెలిబుచ్చెను. Andhra Satavahanas–D. S. Naidu, M. A.
M. A. (Pen) Intr. P. 2

ఇంచుమించుగా పాశ్చాత్యచరిత్ర గ్రంథములందుగాని, భారతీయ రచయితలచే నిర్మాణమయిన ప్రాచీన భారత చరిత్ర గ్రంథములందుగాని యీ శకకర్త చరిత్ర లేనే లేదని చెప్పినచో నాశ్చర్యము లేదు బ్రాహ్మణ గ్రంథములనగా బంచాంగములే రచయితల యుద్దేశ్యము కావచ్చును. పంచాంగములయినచో శాలివాహన శకము క్రీ. శ. 78 యని స్పష్టముగా వ్రాయుచునే యున్నవి. ఇది యొక్కటియే యీ మహా ప్రభువును చరిత్ర పురుషునిగా నొనర్పదని యున్నను ఈతని యునికిని స్థిరీకరించెడి యితరమయిన సాధనములను గూడ క్రమముగా గమనింతము.

ఈ శాలివాహనుడు క్రీ. పూ. 57వ సంవత్సరమును శకస్థాపకుడయిన విక్రమార్కచక్రవర్తికి ముమ్మనుమడు. విక్రమార్కుడు శత సంవత్సరములు రాజ్యముచేసినట్లు భవిష్యపురాణము చెప్పును. శాలివాహనుడు రాజ్యమునకు వచ్చునాటికి దేశమునందు గల పరిస్థితులను భవిష్యపురాణమిట్లు వర్ణించినది !

విక్రమాదిత్య ప్రభువు స్వర్గతుడైన వెంటనే రాజ్యము మరల పూర్వపు స్థితికి వచ్చెను. చక్రవర్తి లేనికతమున ప్రభువులుస్వతంత్రులైరి. సామ్రాజ్యము పదునెన్మిది విభాగములయ్యెను. పశ్చిమమున సింధుకావలి భాగమును. దక్షిణమున సేతువును, ఉత్తరమున బదరీస్థానమును, తూర్పున కపిలదేశమును (Westren Assam) సామ్రాజ్యమున కెల్లలు. ఇది భగ్నమయ్యెను. కాగా నేర్పడిన చిన్న రాజ్యములు. 1) ఇంద్రప్రస్థము, 2) పాంచాలము, 3) కురుక్షేత్రము, 4) కపిలము, 5) అంతర్వేది, 6) వ్రజ. 7) అజమేరు, 8) మరు 9) ఘూర్జరము, 10) మహారాష్ట్రము, 11) ద్రవిడము, 12) కళింగము, 13) అవంతి,

* నేడుభారతీయ చరిత్రలని చదివింపబడుచున్న గ్రంథములను రచించినవారు*

14) ఉడుపము (Udipi In Karnataka) 15) వంగ, 16) గౌడ, 17) మగధ, 18) కోసలరాష్ట్రములు. రాజ్యములో నార్యధర్మము క్షీణించుచున్నదని మ్లేచ్ఛులు సింధునదిని దాటి దాడులు చేయ మొదలిడిరి. స్త్రీల నవమానించుట, దోచుకొనుట మొదలగు దుష్కార్యములను కొనసాగించుట మొదలిడిరి, ఈ సమయమున విక్రమాదిత్యుని మునిమనుమడయిన శాలివాహనుడు రాజ్యమునకు వచ్చెను. ఆయన హిమాలయములలో నివాస మేర్పఱచుకొని చిన్నచిన్న రాజ్యములను కొనసాగించుకొనుచున్న భారతీయ మ్లేచ్ఛులయిన చీనులను జయించెను, బాహ్లీక, కామరూప, రోమకులను జయించెను. క్రూరులయిన ఖురాసాను దేశీయులను మట్టుపెట్టెను. దోచబడిన ధనమంతయు తెప్పించెను. సింధు దేశమునుండి వెడలనడిపి సురక్షితముగా దేశప్రజలను. వారి ధర్మములను సంభావించి మ్లేచ్ఛదేశములకు నార్యభూమికి హద్దుల నేర్పఱచెను. ఇది క్రీ. శ. 78 లేక కలి 3179వ సంవత్సరమునకు సాధింపగలిగెను. నాడు శాలివాహనుని పేర నొక శక స్థాపనము జరిగెను. ఇప్పటికిని సర్వవ్యవహారములు నీదేశమున నీశక పరముగనే జరుగుచున్నవి.

క్రీ. శ. 78 శాలివాహనశకము. 57 క్రీ. పూ. విక్రమశకము క్రీ. పూ. 550 సైరసు శకములు వ్యవహారములో నుండుట మనము

---

స్వర్గతే విక్రమాదిత్యే రాజానో బహుధా భవన్ ।
తథాఽష్టాదశ రాజ్యాని తేషాం నామాని మే శృణు ॥ 3_3_2_9
పశ్చిమే సింధు పర్యన్తే సేతుబంధే హి దక్షిణే ।
ఉత్తరే బదరీ స్థానే పూర్వేచ కపిలాంతికే ॥ 10
అష్టాదశైవ రాష్ట్రాణి తేషాం వ్యభూవిరే ।
ఇంద్రప్రస్థంచ పాంచాలం కురుక్షేత్రంచ కాపిలం ॥ 11
అంతర్వేదీ వ్రజయ్యై ర్వాజమేరు మరుధన్వచ ।

గమనింపవచ్చును, శాలివాహన చక్రవర్తి సామ్రాజ్యస్థాపన మొనర్చిన యనంతర మశ్వమేధయాగ మాచరించెను. అరువది సంవత్సరములు భరతభూమి నేలి స్వర్గము నలంకరించెనని భవిష్యపురాణ కథనము.

పంచాంగములు :

భారతీయ పంచాంగములు సంప్రదాయ వ్యక్తీకరణ విధానములు. ఇందు తిథి, వార. నక్షత్ర, యోగ, కరణములుండును. శుభాశుభపరిజ్ఞానము, యజ్ఞ యాగాది క్రతు నిర్వహణమునకు గావలసిన

---

గౌర్జరంచ మహారాష్ట్రం ద్రావిడంచ కళింగకం ॥ 12
అవంత్యం చౌడుపం వంగం గౌడం మాగధమేవచ ।
కౌశల్యంచ తథా జ్ఞేయం తేషాం రాజా పృథక్ పృథక్ ॥ 1
ఏవ మష్ట శతం జాతం తత స్తే వై శకాదయః ॥ 14
శ్రుత్వా ధర్మ వినాశంచ బహుబ్యందై స్సమన్వితః ।
కేచిత్తీర్త్వా సింధునదీ మార్యదేశం సమాగతాః ॥ 15
హిమపర్వత మార్గేణ సింధు మార్గేణ చాగమన్ ।
జిత్వార్యాన్ లూఠయిత్వా తాన్ స్వదేశం పునరాయయుః ॥
గృహీత్వా యోషిత స్తేషాం పరం హర్ష ముపాయయుః ॥
ఏతస్మిన్నంతరే తత్ర శాలివాహన భూపతిః ॥ 17
విక్రమాదిత్య పౌత్రశ్చ పితృరాజ్యం గృహీతవాన్ ।
జిత్వా శకాన్ దురాధర్షాన్ శ్చీన తైత్తిరి దేశజాన్ ॥ 18
బాహ్లీకాన్ కామరూపాంశ్చ రోమజాన్ ఖురజాన్ శ్చటాన్ ।
తేషాం కోశాన్ గృహీత్వా చ దండయోగ్యా నకారయత్ ॥
స్థాపితా తేన మర్యాదా మ్లేచ్ఛార్యాణాం పృథక్ పృథక్ ।
సింధుస్థాన మితి జ్ఞేయం రాష్ట్ర మార్యస్య చోత్తమం ॥ 20

గ్రహసంప్రాప్తి నిరూపణము వంటి ప్రధాన ప్రయోజనము లెన్నియో గలవు. వానినందుగల పీఠిక యొక్క పంచాంగ మాధారముగా గమనింతము. [2]

ఈ విధముగా ప్రతి సంవత్సరము వ్రాయుబడుచుండిన వానిని కాదనుట కెట్టియైన ప్రబలమైన విషయము చూపవలెను. దానిని చూప జాలక ప్రభువులే లేరు. వారు మిథ్యా చక్రవర్తులని త్రోసి వేయుట దుస్సాహసము.

---

మ్లేచ్ఛస్థానం పరం సింధోః కృతం తేన మహాత్మనా ॥ 21
స్వరాజ్యం ప్రాప్తవాన్ రాజా హయమేధ మచీకరత్ ।
రాజ్యం కృత్వా షష్ట్యబ్దం స్వర్గలోక ముపాయయౌ ॥ 33

"The Saka or Era of Salivahana," the saka or Era of the glorious and victorious king salivahana the year of the Saka or Era established by Salivahana and the popular belief in that ths Saka Era was founded by a king Salivahana beginning in A. D. 78 at Prathistana (?) which is the present paithan on the Godawary in the Nizam territory."J.E. Fleet J.R.A.S. (1916) P. 809. Journal of Royal Asiatic society.'.

(?) ప్రతిష్ఠానపురమని యున్నది. ఇందు శాలివాహనునకు శాతవాహనుడని రూపాంతరము చేయబడిన భావము ద్యోతకమగును.

2. కల్యాద్యబ్దాః_5079_1978_1978_3101 క్రీ. పూ. కలిప్రా.
శాలివాహన శకాబ్దాః_1900+78 శా. శకము
విక్రమార్క శకాబ్దాః_2035_135_విక్రమార్క శకము
ఇంగ్లీషు 1978—79
ప్రభవాది గతాబ్దాః 51
కాళయుక్తి నామ సంవత్సర పంచాంగమ్. తి. తి. దేవస్థానము, తిరుపతి

విషయ మిట్లుండ పాశ్చాత్యచరిత్ర కారుడయిన వి. ఏ. స్మిత్ క్రీ. శ. 78వ సంవత్సరము కనిష్కుని పట్టాభిషేక కాలమయినదనియు దానిని శకముగా వ్యవహరించుచున్న కారణమున నీవ్యవహారము గలిగెనని వ్రాయుట బుద్ధిపూర్వకమయిన ద్రోహమని చెప్పవలెను.[3]

భోజరాజు కాలమును పేర్కొని యింకను నీవంశములోని ప్రముఖులను భవిష్యపురాణ మాధారముతో గ్రహించి దానిని గ్రంథములందు జేర్చుకొని యీ ప్రభువుల చరిత్రను తమ వ్రాతలచే నిరోధించి యుపహాస్యము కల్గించునను భావముతో వదలివేసి వారు చరిత్రలో లేనివారుగ మనలను నమ్మింప జూచుట చరిత్ర పరిశోధకుల నియమమునకే తీవ్రాపచారము.

భారతదేశీయ చరిత్రకారులయినను పాశ్చాత్య చరిత్రాధినేతలు నిర్మించిన యుక్కుచట్రములనుండి వెడలి తమయపూర్వ మేధాశక్తివైశిత్య ముతో నీదేశ ప్రాచీన చరిత్రను పక్షపాత రహిత బుద్ధితో నిర్మించినచో నది దేశమాతకొక సేవ. దీనిపయి విశేష కృషిసలిపి, యిదే జీవితముగ భావించి పరిశోధనలకై తమ ధన ప్రాణములను తృణప్రాయముగ నెంచి యసువులు గోలుపడిన వారి యాత్మలు పులకించును. విశేషించి శ్రీ విశ్వనాథ వారి పురాణవైరసవలల కొక ప్రామాణికత సిద్ధించును. దానికయి మనభారతీయ చరిత్రకారులు నడుము బిగించి పరిశోధనల కుపక్రమింతురు గాక !

3. Oxford Students History of India, V. A. Smith, P. 74

—o—

# 5. పురాణవైర నవలలు-స్వరూపము - స్వభావము

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।

అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ 4-7 గీ.

ద్వాపర యుగాంతమున ధర్మాభ్యుత్థానమున కవతరించిన శ్రీకృష్ణుని ప్రవచన మిది. కృతాంతమున దేవాసుర సంగ్రామము, త్రేతాంతమున రామరావణ యుద్ధము, ద్వాపరాంతమున పెచ్చరిలిన యధర్మమునకు ప్రతీకగా నిలిచిన దుర్యోధనాదుల దుస్సమూహ సంకల్పించిన మహాభారత భీషణాహవము, ధర్మాభ్యున్నతిని కల్గించునని యితిహాస పురాణముల వక్కాణము. కలియుగాంతమున గూడ మ్లేచ్ఛ వ్రాత వినాశనమునకు భగవానుడగు శ్రీ మహావిష్ణువు తన పదియవ యవతారముగ కల్కియై గనుంగునని భవిష్యత్పురాణాదులు నినదించినవి.

భారత భూమి జంబూద్వీపములోని యొక భూఖండము. దీనిని కర్మభూమిగా పురాణములు పేర్కొన్నవి. జీవుని యొక్క సంతత పుణ్య విశేష ఫలమున గాని సహస్రానేక జన్మలలో నెప్పుడో యీ భూమి యందు మనుష్య జన్మ లభించునని విష్ణుపురాణ వచనము[I]! పుణ్య పాపములనునవి జీవుని సుకృత దుష్కృతఫలములు. ఇవి వేదశాస్త్ర ప్రామాణ్యము ననుసరించునవి. వేదములు విధి నిషేధాత్మకములు. శాస్త్రములు వీనిని వ్యాఖ్యానించును. కార్యాకార్యము లందు శాస్త్ర

---

I. అత్రాపి భారతం శ్రేష్ఠం జంబూద్వీపే మహామునే ।
యతో హి కర్మభూ రేషా హ్యతోఽన్యా భోగ భూమయః ॥ 3-22
అత్ర జన్మ సహస్రాణాం సహస్రైరపి సత్తమ ।
కదాచి ల్లభతే జన్తు ర్మానుష్యం పుణ్యసంచయాత్ ॥ 23

మంతే ప్రమాణ మనుచున్నదని గీతాచార్యుని వాక్యము 2. సుకృత దుష్కృతఫలములనునవి కార్యములయినచో దైవాసుర ప్రవృత్తులు కారణ మగుచున్నవి అధర్మ నివృత్తి ధర్మప్రవృత్తికయి కర్మభూమి యందు దైవిక సంపత్తిచే జరిగెడి యహరహ ప్రయత్నము. ఇచట ధర్మమనగా వేదమూలకమయిన ధర్మము. ఆ ధర్మమే జగత్తును ప్రతి ష్ఠించును [3] వేద మూలమయిన యేధర్మమున్నదో దాని నితిహాస పురాణములు విస్తరించి చెప్పుచున్నవి

సృష్ట్యాదినుండి ధర్మాధర్మ సంఘర్షణ మున్నట్లే యున్నది. కాని ప్రారంభమున దాని కౌద్ధత్య మత్యల్పము. సురాసుర సంఘర్ష ణము కలిగినను నయ్యసురులుకూడ నొక దివ్యత్వమును తమ తపో విభూతిచే దర్శించి దర్పిష్టులయిరి. కాలాంతరమున వరగర్వబలదర్పోన్న తిచే తామె తమకు తద్దివ్య శక్తినాధానము జేసికొనిరి. తామే భగ వంతుడన్న భావమును లోకములకు గల్పించి వారిని భయభ్రాంతముగ జేసిరి. ఇది యొక విపరీతస్థితి. దీనికంటె నాశ్చర్యకర మయిన పరి ణామము నాస్తికత్వము. 'నాస్తికో వేదనిందకః' యను నార్షవాక్యము ననుసరించి వేదములను నిరసించి, భగవంతుడే లేడు అని చెప్పుతత్వ మేయిది. నాడు బీజప్రాయముగ నున్న యీ భావము నేడు మహా వృక్షమయి పెకలించుటకు వీలు కానంతగా వేళ్లు తన్నుకొన్నది. ఈ దైవాసుర ప్రకృతులు రెండును అవిచ్ఛిన్న సమాంతర ప్రవాహ మార్గములతో బోల్ప వచ్చును. ఇవి రెండు నొకదాని నొకటి యాక్ర మింప సతత ప్రయత్నము సలుపుచునే యుండును. అది ధర్మప్రవాహ మయినచో ధర్మాభిరతిచే లోకము భద్రమగును. తద్విపరీత మయినచో

2. 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ' ।

3) "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"

ధర్మహ్రాసము. అధర్మ రతి. ఇదియే ధర్మగ్లాని. ఈ ధర్మగ్లాని నిక సహింపలేనను స్థితి వరకు ప్రజ వచ్చినప్పుడు ధర్మాభ్యుత్థానమునకయి భగవంతుడవతరించి మర్త్యశిక్షణము జరుపునని పురాణ వాక్యములు.[4] అధర్మ విజృంభణమును శుష్కింప జేయుట, ధర్మమును యథేచ్ఛగా వర్తింపజేయుట తన కర్తవ్యముగా భగవంతుడు పేర్కొనెను. ఇది మన భారతీయ ధర్మమునకు మూలకందములుగా పేర్కొనబడిన శ్రుతి స్మృత్యుపనిషద్గ్రంథములు, పురాణేతిహాసములు. ఈ కర్మభూమి యందుద్భవించిన ప్రజకందించిన సుసంభిళసువర్ణ నిక్షేపము ఇది సృష్టిరహస్యము.

ధర్మాధర్మములు, దైవాసుర ప్రకృతులు భగవత్స్వరూపములే కాని యన్యములు కావు. ప్రకృతి సంభవములయినవి త్రిగుణములు. తానే మాయాసృజన మొనర్చ విశ్వమును సృజింపగోరి రజోగుణావిష్టుడుగను, జగమునందు క్రీడింపగోరి సత్వాత్మకుడుగను, నిద్రింపగోరి తమోగుణాన్వితుడుగనునగుటకు వీనిని నుత్పాదించెను. సత్వగుణముచే దేవతాదులను రజోగుణంబున నసురులను తమోగుణంబున యక్షరక్షోగణములను విభజించినట్లు భాగవత పురాణము నుడివెను. సత్వగుణముచే దేవాదులకు వృద్ధియు, రజస్తమోగుణాదులచే రాక్షసాది శత్రుగణంబులకుహానియు పరమేశ్వరుడొనర్చుననియు దీనిచె దెలియును.[5] కనుక నసురవృత్తిని త్యజించి ధర్మాభిరతులుగ భారతీయుల నొనర్చుటయే వేదద్రష్టల, సనాతనుల యహరహ ప్రయత్నమని భావింపవచ్చును. దీనికి సృష్ట్యాది నుండి వచ్చుచున్న శ్రుతిస్మృతీతిహాస పురాణవాఙ్మయములే తార్కాణము.

---

4) మర్త్యావతార స్త్విహ మర్త్య శిక్షణం రక్షో వధాయైనకేవలం.
భాగవతం 5వ స్కందము, 19 అ.

5) భాగవతము – 9 స్కంధము 7 శ్లోకము.

ఏవంవిధమయిన ధర్మాభిరతి గలిగి సత్సంప్రదాయ పరిణతబుద్ధు లయిన భారతీయులకు గలి నుండి నాల్గువేల యెన్మివందల యేండ్లకు (4,800) నాంగ్లేయుల పాలనము ప్రారంభమయ్యెను. ఇది యధేచ్ఛగా రెండువందల యేండ్లు కొనసాగినది. మన సంస్కృతి, సంప్రదాయము లను సమూలముగా నాశమొనర్చుటకో యను నటుల నయ్యాంగ్ల పాలకులు పాలించిరి. కాలము వారి కనుకూలమయ్యెను. సహజసంప్రదాయజ్ఞులైన ప్రజ యనవరతకుసంస్కారబోధనాజనిత నాస్తికాహంకారధిషణులయి. వివేకులు సయితము పరంపరాప్రాప్తమయిన సంప్రదాయ మార్గమును పరిహరించిరి. సామాన్యుల మాట చెప్పనేల ? ఈ విధముగా నాంగ్లేయులు మన సంస్కృత, సంప్రదాయ పరిత్యక్తతాబుద్ధి పయి విజయము సాధించిరి. అట్లు పరిత్యజించిన బహుమార్గముల యందు భారతదేశమున గడచిన సత్యచరిత్ర విస్మరణ మొకటి. ఈ విస్మరణమునకు విఘాతము కల్గింపవలెను. సత్యావబోధమునకు మార్గోపదేష్టలు కావలెను. ప్రాచీన మార్గమున విదేశీయులచే నిక్షిప్తమయిన సత్యాభాసమును దొలగింప యత్నింపవలెను. దీనికి భారతీయ సంస్కృత్యుదధి నామూలముగ నాపోశనము పట్టజాలిన యగస్త్యుని వంటి ద్రష్టలు కావలెను. సాహసవంతులైన ధర్మాభిరతులు కావలెను. ఈ గుణ వైశిష్ట్యము గలిగిన వారి వలననే గాని ప్రజలకీ యపమార్గభావ పరిత్యక్తత సిద్ధింపదు. అట్టివారు సాహితీస్రష్టలైనచో బంగారమునకు తావి యబ్బినట్లు.

సార్వకాలికమయిన భారతీయ ధర్మము నాదినుండి యూకళింపు గావించుకొని దానికి హేతువులయిన వేదశాస్త్ర, పురాణేతిహాసములందు సంపూర్ణ ప్రమాణబుద్ధి గలిగిన యాధునిక సాహితీవేత్తలలో నగ్రసరులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. వీరు పైన పేర్కొన్న యగస్త్యుని వంటివారు. అనాదియయిన యీ దైవాసుర సంపత్సం

ఘర్షణము నంతర్లీనమయిన సూత్రాత్మగా దర్శించి తన పురాణవైర గ్రంథమాలా నవలామణులకు దానిని సంధించి భారతీయ చరిత్రాంశ ములకు సాహిత్యప్రతిపత్తి గల్గించి కవిసమ్రాట్టు లితిహాస సమ్రాట్టులునయ్యిరి.

పురాణములందు చరిత్ర యొక యంశము. కాని పురాణకర్తలు గాని,పురాణ విమర్శకులుగాని పురాణములను కేవలముచరిత్ర దృష్టితో నెన్నడు ననుసంధించి చూడలేదు. రామాయణ మహాభారతాది గ్రంథ ములందనేక ఖగోళిక చారిత్రకాంశములు వివరింపబడెను. కాని యవి ఏకదేశముగా చరిత్ర గ్రంథములుకాలేక పోయినవి. వీనియందు ప్రధా నమయినది ధర్మాభిరతి, ధర్మపథ నిర్దేశము. వీని లక్ష్యమఖండ భారత సంక్షేమము. అందువలన నన్నయాదులు సయితము భారతాది గ్రంథ ములందు దానినే దర్శించి సనాతన ధర్మపథమునే యుపదేశించుటను లక్ష్యముగా నెన్నుకొనిరి. ఇచట సనాతన ధర్మము సార్వకాలికమైనది యనియే వారు భావించి యుండిరనుట యుచితమగును. కాని కాల ముతో నీనాటి ప్రబుద్ధుల బుద్ధులును పలుచనయినవి. కావ్యాదులందలి భాష, శైలి, రసాలంకారాదులు నేటి సామాన్యునకు దురవగాహము లైనవి. అదియుంగాక నేటి సామాన్య మానవునకు విరామకాలము బహ్వల్పము. సంతతము బహు కార్యవ్యాపృతుడు. సాహిత్య శ్రమ యేగాదు యే శ్రమయు కించిత్తయినను నోర్వజాలడు. అట్టి వానికి సూక్ష్మమున మోదమొసగు సాహిత్యప్రక్రియ నవలయే యగుట నిస్సంశయము. బహు సాహిత్యప్రక్రియానిర్వహణాదక్షుడగు శ్రీ విశ్వ నాథకు నీప్రక్రియ నిర్వహించుట యననొక లెక్కలోనిదికాదు. తాను మహా కావ్యములను మాత్రమే వెలయించుట కుదయించితి నన్న నియ మము గలవాడు కాదు. ప్రక్రియ ఏదైననేమి ? ప్రజలకింత వివేకోద యము గలిగి తమ ప్రాచీన సంస్కృతి సంప్రదాయ పరిరక్షణ మందా

కింత యాసక్తులయ్యెదరేని యది శ్రీ విశ్వనాథకు మేరువు నెక్కుట వంటిది. ఈ లక్ష్యసిద్ధికయి గావించిన యత్నమాయన చేపట్టిన ప్రతి సాహిత్య ప్రక్రియ యందును ప్రతిబింబించును. లక్ష్య మాత్మవంటి దయినదో సాహిత్య ప్రక్రియ యయ్యాత్మకు నుపాధి సమకూర్చుట వంటిది. ఈ పురాణావైర నవలలు మొత్తము పదిరెండు. వీని యందు చరిత్రాంశ మాద్యంతమున్నది. అంతమాత్రముచే నివి కేవలచరిత్ర గ్రంథములు కాజాలవు. పురాణము లందు నయితము బహ్వల్పమయిన చారిత్రకాంశములున్న మాత్రమున నవి చరిత్రగ్రంథములని పేర్కొన లేము గదా ! మన పూర్వులు చరిత్రను చరిత్రగా వ్రాయలేదను నిదానీంతనుల విమర్శకు నర్థమిది.

ఆంధ్ర సాహిత్యములో నిట్టి ప్రత్యేక లక్ష్యసిద్ధికయి పూనిన యత్న మనిదంపూర్వము. అడివిబాపిరాజు, నోరినరసింహశాస్త్రిగారలు చారిత్రక నవలలు వ్రాసిరి. చారిత్రక దృష్టిచే నివి మిక్కిలి యధునాతనములయినవి. ఒక ప్రత్యేక లక్ష్యసిద్ధికై కొనసాగించిన సాహిత్య వ్యవసాయము వీనియందు కానబడదు. నవలాసంఖ్యయు పరిమితము. శ్రీ మధునాపంతులవారు "ఆంధ్రపురాణ"మను చారిత్రక కావ్యమును వెలయించిరి. దానియందు కావ్యగౌరవమేగాని చారిత్రక దృష్టి యధునాతనులను మించిపోదు. చరిత్రయు నత్యంత ప్రాచీనమయినది గాదు. ప్రాచీనముగా తెలిసిన పద్యకావ్యములందు కేతన 'దశకుమార చరితము' కొరివి గోపరాజు 'సింహాసనద్వాత్రింశిక'లను పేర్కొనవచ్చును. కాని వీనియందు స్వరూప సాదృశ్యము, స్వభావ సాదృశ్యము కూడ పురాణావైర నవలలయందు సమన్వయింపలేము. ఆంగ్ల సాహిత్యములో నిట్టివి కొన్ని గలవుగాని యీయన నవలలకవి బీజములనిగాని మాతృక

అనిగాని చెప్పుట కష్టము.[6] కాని యాంగ్లేయ సారస్వతముతో గూడ గాఢమయిన పరిచయముగల వాడగుటచే నీ రచయిత కవి కొంత యాలోచన నొసంగి యుండనగును. ఇట్లాంధ్ర సాహిత్యమున గాని, ఆంగ్ల సారస్వతమున గాని యే మహాకవియు యూహింపని యొక లక్ష్యసిద్ధితో సర్వజన సులభమగు లఘుప్రక్రియయైన నవల నెన్నుకొని తన యంతర్భావములకు సాహిత్య రూప కల్పన మొనర్చిన యీ మహాకవి సంప్రదాయనిశితత్వ మసదృశమని చెప్పవలెను.

పురాణములందు చరిత్రలోని చరిత్ర దృష్టి సాహిత్యముతో మేళవింప బడినట్టిది. అది ధర్మబద్ధమయినదో చారితార్థ్య మగును. కనుకనే యాధునికులు భావించెడు చరిత్రాంశమందు మన పూర్వులు భావింపలేదు. వారు గడచిన చరిత్రతో భావికాల గతులను గూర్చి ప్రవచించిరి. నేటి చారిత్రకులు భవిష్యత్తు నూహింప జాలరు. అట్లే రామాయణ భారతాదులందు గల యనేక భౌగోళిక చారిత్రకాంశములు విశ్వశ్రేయ ప్రాప్తి సాధనమగు సాహిత్య గౌరవ సుప్రతిష్ఠితములగుటచే నవి మరుగున పడినవి. వీని యందలి చరిత్ర యథార్థమా? లేక కల్పితమా? యను విషయము విచారణీయము వీరికి గాకుండెను. కాని పాశ్చాత్య విద్వాంసులు మన దేశమునకు చేరినది మొదలు మన గ్రంథములను బరిశీలించి సంస్కృత సాహిత్యము నధ్యయనము గావించి మన ప్రాచీనత కచ్చెరువొంది దీనిని యథాతథముగా బ్రచురింప సాహసింప లేకయో యనునట్లు విపరీత దృష్టితో నపమార్గమును బట్టించి దానిని మనలచే బఠింప జేయ గల్గిరి. ఇది వారికై వారు చేయ గల్గినది కాదు. తమ ప్రభుత్వముచే నాయుధములచే, కర్కశత్వముచే, దాసభావారోపణముచే జేయ గల్గిరి.

6. Shakespeare's Dramas Henry IV & V.
Galsworthy - Forsyte Saga, etc.

పాశ్చాత్య విద్వాంసులలో గొందఱు బుద్ధిపూర్వకముగా నీ దుస్థితిని బట్టించిన వారు కలరు. వారిలో ప్రముఖుడు విలియం జోన్సు మహాశయుడు. ఈయనకు భారతదేశ చరిత్ర యత్యంత ప్రాచీన మయినదని తెలియును[7] మన సంస్కృతియందసాధారణ ప్రజ్ఞజూనిపి యాత్మావగతము గావించుకొనిన మాక్సుముల్లరు మహాశయుడు సయితము బుద్ధి పూర్వకముగనే మన చరిత్ర కపమాన మును సమర్థించెను.[8] ఇది స్వదేశాభిమానమని వేరుగా నుడువ వలసిన యవసరము లేదు. శ్రీ విశ్వనాథ దీక్షిత 'Blood is thicker than water' యను నాంగ్లోక్తితోనే నిరసించెను. పాశ్చాత్యులు ప్రకటించిన చరిత్ర అలెగ్జాండరు భారతదేశమునకు దండెత్తి వచ్చిన సమయమును క్రీ. పూ. 327 సంవత్సరమును కేంద్రముగా నిలిపి దానికి ముందు వెనుకల కాలమును సమన్వయము చేసికొని వారికి దోచినట్లు భారతదేశ చరిత్ర నల్లిరి. ఏ దేశచరిత్ర కయినను నిట్టి దుర్యోగము సంభవింప రాదు. చరిత్ర ప్రారంభము నుండి యుండును. మధ్య ప్రారంభము ముందు వెనుకలు మార్చుకొని చరిత్ర నల్లుకొను దుస్థితి యీ భారతదేశమునకు మాత్రమే పాశ్చాత్యుల వలన కలిగినది. ఇట్లు వీరు ప్రకటించిన యీ చరిత్ర భారతదేశ సంప్రదాయమునకు విరుద్ధముగా కల్యాది నుండి గాక క్రీస్తు పూర్వాపరములచే ప్రసక్తమయి యున్నది. సృష్ట్యాది నుండి బహుముఖ వ్యాప్తమయిన చరిత్ర గల్గిన యీ దేశమునకు మరింత స్పష్టమయిన, విస్తృతమయిన చరిత్రను కల్యాది నుండి పురాణములు పేర్కొనెను. వీని యందలి చరిత్రాంశములను నుద్దిష్ట మొనర్చిన పాశ్చాత్య విద్వాంసులు విషయమును గహనముగా నొనర్చిరి. తాము చెప్పినదే సత్య చరిత్ర యనుభావమును దేశమున వ్యాప్త మొనర్చిరి. శ్లోకములకు దురర్థ

7. "Cambridge History of India" william Jones.
8. "History of anecient Sanskrit Literature" Max Muller

ములు కల్పించిరి. మొత్తము మీాద భారతదేశమునకు సమగ్రమగు చరిత్రలేదను వివయమును నిర్వివాదాంశముగా భ్రమనొందింప జేయ గల్గిరి. దీని నామోదించిన పలువురు భారతీయ విద్వాంసులునుగలరు. అట్లే వీరిని గాదని పురాణములందలి చారిత్రక సత్యములను ప్రకటించి లోకమునకు నందించిన దక్షిణోత్తరదేశ పండిత ప్రకాండులును గలరు. వారిలో ప్రముఖులు మహాభారత యుద్ధమును, దానికాలమును నిరూపించిన నడింపల్లి జగన్నాథరావుగారు, టి. యస్. నారాయణ శాస్త్రిగారు, కోట వెంకటాచలంగారు, అరవిందాశ్రమమునందు సంపాదక పదవి యందున్న కె. డి. సేత్నాగారు పేర్కొనదగినవారు. అట్లే జాత్తరాహులందు డి. ఆర్. మన్కడ్, జయస్వాల్, ఎ. డి. పుసాల్కర్ మహాశయుల నెన్నవచ్చును. వీరు పురాణములందలి రాజవంశావళులను, వాని యాదార్థ్యమును తమ ధిషణా నైశిత్యముచే బరిశోధించి పెక్కు గ్రంథములను రచించిరి. ఈ గ్రంథములందలి సత్యత్వమును గ్రహించి (శ్రీ) విశ్వనాథవారు భారతీయ ప్రాచీనతను, ధర్మాభిరతిని, దైవాసుర సంపత్సంఘర్షణమును. తత్ఫలితమును చారిత్రకాంశములకు సమన్వయింపజేసి, వానికి కల్పనా శైలీ రసాలంకా

9. 'The Date of Mahabharata war' N. Jagannadha Rao, 'The Age of Sankara......' T. S Narayana Sastry, 'The Plot in Indian Chronology' K. Venkata Challam 'The History in Puranas Articles & of Sri K. D. Setna Editor 'Mother India' Aravindashram, Pondycherry. The Puranic Chronology' D. R. Mankad, Professor of Sanskrit, Vallabhaipatel University, Anand. 'The Epics and Puranas' A. D. Pusalkar, Bharatiya Vidya Bhavans' Publications, Bombay.

రాదులను రంగరించి సాహిత్య సౌందర్యమును లక్షించి మహన్నారీ శిరోరత్నము నుపమించు నవలా స్వరూపముగా నవతరింప జేసెది.

ఈపురాణపై రనవలలు ప్రత్యేక పరిస్థితులు, పాత్రలు, సన్నివేశములుగలిగి యున్నప్పటికి మణిహారమునందుండు సూత్రమువలె వీని నన్నింటిని గలిపియుంచు నొకభావమున్నది. ఇది రెండుపేటల దారము పేనబడిన యొకేసూత్రముల అందొకటి చరిత్రాంశము, రెండవదిధర్మాభిరతిని నిర్దేశించెడి యితివృత్తకల్పనము, ఈ సూత్రము జీవనదులయందు ప్రవహించెడి జీవనమునంటిది.

ఒకదేశములోని, యొకజాతిలోని పరంపరగావచ్చెడు సంప్రదాయములను విశ్వాసములను ఒకానొకప్రత్యేకపరిస్థితి, లేక యుపద్రవము కారణముగా దాత్కాలికముగనైనను విస్మృతినొందింప జేయవచ్చును. ఆవిస్మృతి శాశ్వతమే యయినచో నాదేశసంస్కృతికి, సంప్రదాయమునకు, నాతరువాత ప్రభవించెడి ప్రజకు సాన్నిహిత్యము తొలగింపజేయుట నిస్సందేహము. ఇది జాతికి యవ్యవస్థ సంస్కృతి రాహిత్యమును తెచ్చిపెట్టును. ఇది యొకవిధమయిన జాతి, దేశ విద్రోహమగును. కనుక నీ విస్మృతి శాశ్వతము కారాదు. ఇట్టి పరిస్థితిని చక్కదిద్దెడి యనేక మార్గములందుత్తమోత్తమమైన మార్గము సాహిత్యమని విజ్ఞులందురు. సాహిత్యముజాతికి, దేశమునకుగల పూర్వవు ఔన్నత్యమును ప్రస్తుతప్రజకు దెలిపి తద్వారమునప్రజలను భావికర్తవ్యోన్ముఖులుగా నొనర్పగలదు. సాహిత్యమునకు ముఖ్యప్రయోజనము విశ్వశ్రేయయమయినచో నా శ్రేయఃప్రాప్తికై చేయు ప్రయత్నము తదవ్యవస్థను దొలగించుటలో ప్రముఖపాత్ర వహించును. దీనికి సూత్రధారుడు కవి లేక రచయిత యగుచున్నాడు, అతడు మనీషియై స్వాయంభూప్రాయుడై ధర్మసంస్థాపనమునకు భగవంతు డవతరించిన ట్లవతరించును, అట్టిడు మాత్రమే యీ యసంస్కృత భూజములను

భేదించి సంస్కారభావబీజనిక్షేపణ మొనర్చును. నిర్మూలనము జరుగ వలసినది దుష్టభావములుగాని యవియాశ్రయించిన ప్రజకుగాదుకదా! ఆకవి క్రాంతదర్శనుఁడయి, ఋషియైనచో నేతన్మ్లేచ్ఛభావములను దొల గింప వీలులేనిస్థితిని సయిత మెదిర్చినిలుచును. సరిదిద్ద రాదనువారిని సహేతుకముగ తార్కికముగ ప్రశ్నించును. ఈ గుణమే మహాకవిని సంస్కరణాత్మకసాహిత్యస్వయంభువుగా నొనర్చును. రచయిత దేశ చరిత్రకు నాంగ్లేయపాలనము వలన, వారి భావదాస్యము వలన గలిగిన దుష్ఫలితములను. తత్ఫలితముగా జాతికిగల్గిన సత్యచరిత్రవిస్మృతిని స్వయముగా దర్శించినవాఁడు, అనుభవించినవాఁడు. ఆ యనుభవము వాసుకివిషమై పాలమున్నీట హాలహాలము వెల్వడిన వెనుక ప్రభవించిన యమృతమువలె పురాణవైరగ్రంథమాల నవలాకృతియై యుద్భ వించెను.

## పురాణవైరనవలలు-స్వరూపము :

స్వరూపము బహిరాకృతి. స్వభావ మాంతరప్రకృతి. దూరము నుండియైనను స్వరూపమును గుర్తింపవచ్చును. దరిచేరనిదే స్వభావ మవగతముకాదు. కొందఱు బహిరాకృతితో తృప్తిపొందుదురు. కొందఱు స్వభావమునకు ప్రాధాన్యమిత్తురు. స్వరూపముతో సరి పెట్టుకొనువారికి ముందుగా స్వభావము తెలుపవలెననెడి దృష్టితో స్వభావము ముందు పరిచయము గావింపబడినది. ప్రకృతము పురాణ వైరనవలాస్వరూపము పరిశీలింపబడుచున్నది.

ఇతివృత్తము నవలకు సూక్ష్మశరీరమువంటిది ఇది ప్రఖ్యాత, ఉత్పాద్యమిశ్రభేదములచే మూఁడువిధములు. పురాణములందు గల రాజవంశచరిత్రలు కలికిపూర్వము సంగ్రహముగను కల్యాది త్రిసహస్ర వర్షపర్యంతము విస్తృతముగను పేర్కొన్నవి. అన్ని పురాణముల కంటె నెక్కుడువిషయములు భవిష్యమహాపురాణము పేర్కొన్నది. ఇది కల్యాదినాలుగువేల సంవత్సరములవరకు. అనగా గోరీమహమ్మదు

చే గావింపబడిన కురుక్షేత్రసంగ్రామమువఱకు వివరింపబడినది. ఇందు నశించినరాజవంశములు ప్రమర, చౌహాను, శుక్ల, పరిహారవంశములు.

ఈ యుద్ధము క్రీ. శ. 1193వ సంవత్సరమున జరిగెను. ఇది కలి ప్రారంభింపబడి 4295 యేండ్లకు సమానము. భారతదేశచరిత్ర పునర్ని ర్మింపబడవలెనన్నచో నది కలియుగాదినుండి, మహాభారత యుద్ధ కాలమునుండి యారంభింపవలెను, పురాణములు సత్యదూరములనియు, నందలి విషయములు ప్రమాణములుగావనియు నొక హేతువాదమును నిర్మించి యాంగ్లేయులు భారతదేశమును కైవసముగావించుకొని నాటి నుండి ప్రచారమొనర్చిరి. అది 'యింతింతై, వటుడింతయై' యనునట్లు పెరిగి భారతీయచరిత్ర విద్వాంసులకు సయితము వ్యామోహజనక మయ్యెను. ఇదియునుంగాక నీపురాణము లగ్రవర్ణములవారు వారిసాధి కారమును స్థిరీకరించుకొనుటకు సామాన్యజనులపయి ప్రసారముచేసిన యమానుషసారస్వతమనెడు నిక్షేపుకప్రథ కల్పింపబడెను. ఏతత్ఫలిత ముగా పురాణములపయి సామాన్యప్రజ కొకయసహ్యమును, దానిని సమర్థించెడి శాస్త్రవిషయములందు విద్వాంసులబుద్ధి జొరనీకుండెడి స్థితిని ప్రాపింపజేసినది. పైన పేర్కొనిన శాసన, శాస్త్రేతిహాసగ్రంథ ప్రమాణములతో కొందరుభారతీయ పండితులు భారదేశసత్యచరిత్రను నిర్మించి కృతకృత్యులయిరి. కాని యవి యింకను దేశమున బహుళ వ్యాప్తి పొందినట్లు గానము, సామాన్యులందీసత్య విషయములను వ్యాప్తినొందింపవలెనన్నచో నేకైకాయుధముసాహిత్యమే యను విష యము నెఱింగిన రచయిత, ఆంగ్లేయులు ప్రధానముగా మనచరిత్రలో గావించినప్రమాదములను పసిగట్టి వాని నేకసూత్రగ్రథితముగ నొనర్చి భారత యుద్ధకాలమునాటినుండి శాలివాహనశకకాలమువరకు గల రమారమి త్రిసహస్రవర్షములసత్యచరిత్రకు సాహిత్యప్రతిపత్తి గల్పించి వానికి పురాణవైరమని నామమిడి పదిరెండు నవలలను ప్రకటించిరి.

ఇది యొక విధముగా సిద్ధాంతీకరింపబడిన సత్యవిషయ (established truthd) ప్రబోధ ప్రయత్నముగా నెన్నవచ్చును.

ఇందలివిషయము ప్రఖ్యాతము. యథార్థము, కాని పదిమందికి పరిచయము గానిది, ఈ నవలయందు పేర్కొనబడిన రాజవంశములు, ప్రభువులు కూడ ప్రఖ్యాతవిషయమునకు హేతుభూతులే యగుదురు, ఇక నుపపాత్రలు, సన్నివేశములు, కల్పనలు గావచ్చును. నడుమ నడుమ గల్పింపబడు ననేక ప్రాసంగికేతివృత్తములు సయితము కవి కల్పనకు ప్రతీకలు కాగలవు. ప్రఖ్యాతవిషయముతో మిళితమయిన యనేకకల్పనల సమాహారస్వరూపము నవలాకృతివహింపగా నితివృత్త మందిది మిశ్రభేదముగా వర్గీకరింపబడుచున్నది. ఇతివృత్త మాధార ముగా కథాకాలమునాటి పరిస్థితులు, జీవనము, పాత్రకల్పనము ఇత్యా దులు కవి యూహానైశిత్యముచే గల్పింపబడి యుండుటచే కూడ నిది మిశ్రమమని చెప్పవచ్చును.

ఈ నవలాస్వరూపమును వెలువరించుటలో రచయిత మరికొన్ని విచిత్రములను జూపెను. ఒకటి ఇతివృత్తస్వీకరణము, రెండవది గ్రంథ మునకు చేసిననామకరణము, మూడవది మాలారచనము, ప్రతినాయక పాత్ర ప్రాధాన్యము తురీయము. ఈ విచిత్రములు ఆంధ్రసాహిత్య రంగమునందే విచిత్రమని చెప్పనగును, పురాణములందలి చరిత్రను ప్రధానేతివృత్తముగా గ్రహించి నవలాప్రక్రియను నిర్వహించుట యన్నది మిపులకష్టమయినది. అల్పమయిన చరిత్రాంశమును బహు విషయపరితమయిన నవలగా రూపొందించుట శ్రీ విశ్వనాథ మేధా నైశిత్యమును ప్రకటించును, ఆయనకుగల బహుముఖపాండిత్యవైభవ మీనవలారచనమున స్వైరవిహారము సల్పినదన్నచో నాశ్చర్యము లేదు. చరిత్రకు సాహిత్యగౌరవముకూర్చి పాఠకునిచేత నవలాపఠనముగనే యూహింపజేయవలెను గాని తానుచరిత్రగ్రంథమును చదువుచున్నటుల

భావింపనీయరాదు. ఈ యభిప్రాయము పాఠకునకు గలిగింపవలెనన్నచో రచయిత యపూర్వశాస్త్రకావ్యాద్యనేకవిజ్ఞానకుశలుడై సముచిత బోధ శాలియై యుండవలెను. ఈ నవలను చదివినచో నట్టియభిప్రాయము, విమర్శకునకు, పాఠకునకు తప్పక కలిగితీరును. పాఠకునకు చరిత్రాంశమే విషయముగనే యుండును, కవికథా సూత్రము చరిత్రప్రధాన విషయము. కవికి కల్పనలు, కథాసంవిధానము ప్రధానములు గావు. పాఠకున కవియే ముఖ్యమగును. ఈ యాంతర్యమును రచయిత కూలంకష ముగా నెఱుగును. పాఠకునకు చారిత్రకవిషయము మీదికి సయితము మనసుపోయినచో నది నొక్కదెబ్బకు రెండుపక్షులు పడినట్లు. అట్లు గానిచో వచ్చెడునష్టి లేదు. కనుకనిదియొక విచిత్రమయిన సంవిధానము.

ఇక గ్రంథమున కుంచిననామకరణ విషయము. పురాణవైర గ్రంథములని వీనికి పేరుంచెను. ఈ నామమే విచిత్రమయినది. ఇందును కవి తన ప్రత్యేకతను జూపెను. ఇదియే 'అలఘు స్వాదు రసావతార ధిషణాహంకార బ్రాహ్మీమయమూర్తి' యను దాని కొకయుదాహరణముగా జెప్పవచ్చును. లోకమున కావ్యములకు పేర్లుంచుట చూచుచునే యున్నాము. వానియందలి యుత్తమ ధర్మపథ నిర్దేశము ననుభవించుచునే యున్నాము. వేదధర్మమును, పురాణోత్కృష్ట్యమును, ఉపనిషద్గౌరవమును బ్రకటించెడి గ్రంథములు సంస్కృతాంధ్ర సారస్వతములందనేకమున్నవి. కాని యే యొక్క గ్రంథమునకు నిట్టి విచిత్రమయిన నామకరణము లేదు. తెలుగు సాహిత్యములో రామకృష్ణుడొక గడుసు పిండమని, వంకరమాటల వాడని, పదగుంభనమువాని సొత్తని యేమేమో వింటిమి. ఆతడును పాండురంగ మహాత్మ్యము, ఉద్భటారాధ్యచరిత్రము, ఘటికాచల మాహాత్మ్యమనియే పేర్లుంచెను. వానియందెట్టి విశేష వైదగ్ధ్యమును కానరావు. కాని ఈయన యింతకంటె గడుసుపిండమువలె

నున్నాడని చెప్పుట కాయన తన గ్రంథమాలలోని నవలలకు బురాణ వైరమని నామకరణముచేసెను. ఈ గ్రంథమాలయందలి మొదటి నవల భగవంతునిమీద పగ యనునది. "పురాణవైర" మనునామకరణ మెట్టి విచిత్రమయినదో ఈ భగవంతునిమీది పగ యనుపేరుగూడ నిట్టిదియే. ఈ నవలలు బాహ్యము కొకవిధమయిన భావము కల్గించును. అంతరముగ తత్త్వము వేరు. ఇపుడు నవీనముగా వెలువడిన రామాయణ విషవృక్షమను గ్రంథమున్నది. అది బాహ్యాంతర ప్రకృతులచే దారతమ్యము కానబడనిది. ఇది యట్లుగాదు. బాహ్యమైన నామమునకు భిన్నమైనదిగాలోనివిషయముండును. పురాణవైరమనగా బురాణ వైరులను గుఱించి, యా వైరప్రకృతిని గుఱించి ప్రసంగించును. కావి నది సందేశము కాదు. వేదములనుండి, యుపనిషత్తులనుండి, పురాణములనుండి, ఇతర ప్రాచీన వాఙ్మయమునుండి మహోత్కృష్ట విషయములను, ప్రసంగించుటయే దీనియాంతర్యము. ఇది శ్రీ విశ్వనాథవారి వైచిత్రి. బుద్ధుని యవతారమున్నది. అది నాస్తికమతమును బోధించును. బుద్ధుడు భగవంతుడే కదా ! ఆయన చెప్పినది ఆచరణాత్మకము కావలెను కదా ! మఱి యదేల యవైదికమగుచున్నది ? దానినేల మనమాచరింప రాదనినచో దేవతలందు విరుద్ధవర్తనముకలిగి దుస్స్వభావులై యుండువారికి ధర్మమందధర్మబుద్ధియు, నధర్మమునందు ధర్మబుద్ధిని మోహముచే కల్గింతునని బుద్ధుడనుడివినట్లు హరివంశమున నున్నది.[10] కనుక బౌద్ధమతము, తన్మతకర్త యెట్లుభగవత్స్వరూపుడయ్యు నాతనిబోధలు వేదప్రామాణ్యము కాకపోవుటచే ననుసరింప

---

9) 'అహన్తు దుష్టభావానాం యుష్మాసు సుదురాత్మనామ్ ।
అసమ్య గ్వ్యర్తమానానాం మోహం దాస్యామి దేవతాః॥' అధ్యా 48.

10) 'యథా హి చోర స్సతథా హి బుద్ధః ।
తథాగతం నాస్తిక మత్ర విద్ధి ॥' అయోధ్యాకాండ సర్గ 109.

దగనివయ్యేనో అట్లు భగవద్విరోధమును గుఱించిన యీ గ్రంథమాల యేతద్విరోధ మవశ్యపరిహారమను సందేశమొసంగును. దైవసంపత్తి నిట్లవలంబముగొనవలెనో ప్రపంచించును.

తర్కశాస్త్రము నందన్వయవ్యతిరేకములచే విషయమును ప్రతిపాదించుట విశిష్టమార్గము. ఒకసత్యమును ఋజువుచేయవలసి వచ్చినపుడు రెండుపద్ధతు లవలంబింపనగును. ఆ సత్యమును వృద్ధిచేసి దాని యందు ప్రమాణ బుద్ధికల్గించుట. ఇది అనుకులాన్వయ మందురు. అసత్యము నభివృద్ధిచేసి దాని యందప్రమాణబుద్ధికల్గించి సత్యమార్గ గవేషణమునందు బుద్ధిపుట్టించుట. ఇది వ్యతిరేకాన్వయము.

ఈ వ్యతిరేకాన్వయము లేక పరోక్షమయిన యుపపత్తిని సాధనముగా పురాణవైరనవలలందు రచయిత మలచుకొనియున్నాడు. ఇట్లు వ్యవహరించుటకు మఱియొక కారణముగూడ నుడువవచ్చును. నవలను ప్రజచదువుట యభీష్టమయినచో నవలాలక్ష్యమును పాఠకుడు గ్రహించుట పరమార్థము. సామాన్యులను వివేకులను నయిత మీ ప్రబోధాత్మకసాహిత్య మాకర్షింపవలెను. 'పురాణోత్కృష్టత' యనియో లేక 'భగవత్కరుణ' మనియో నామకరణముచేసినచో సామాన్యునకు రుచింపదు. వివేకుడు దీని జోలికి పోడు. ఇరువురనాకర్షింపవలెనన్నచో నిట్టి వైరానుబంధము ననుసంధించుకొనవలెను. ఇప్పుడు కావలసినది యున్నదేమో యని సామాన్యుడు, యింతటి మహాకవి వ్రాయుగ్రంథములిట్టివా యనునాశ్చర్యమున వివేకుడు వత్తురు. ఇరువురకు సత్యావబోధముకలిగి తృప్తినందుదురు. ఇట్టి రహస్యవేది శ్రీ విశ్వనాథ. కనుకనే యిట్టి పేర్ల నుంచెను. ఇది నిజముగా గడుసుతనము. మెడలువంచి చదివించుటయనగా నిట్టిది. ఏవంవిధమయిన యుపజ్ఞతో నీయన తన గ్రంథమాల కిట్టి నామకరణముంచెను.

ఇందు కానవచ్చు మూడవవైచిత్రి మాలారచనము.

శ్రీ విశ్వనాథ తమ గ్రంథమాలా పీఠికలందు పదునారు నవలలను వెలయింతునని వ్రాసిరి. ఆరవ నవలయైన 'యశ్వమేధము' లోని పీఠిక వరకు పదునారు నవలల ప్రణాళికయున్నట్లు వ్రాసిరి. కాని ఏడవనవల 'అమృతవల్లి' పీఠికయందు పదిరెండునవలలని వ్రాయబడెను. అసదృశమైన మహాభారతాహవమాదిగా స్థానేశ్వరము (నేటిథానేశ్వర్) వద్ద ఘోరీమహమ్మదుకు చౌహాన్‌వంశీయులలో 30వ వాడైన పృథ్వీరాజునకు జరిగినయుద్ధమువరకు కలికి పూర్వము 36 వ సంవత్సరమునుండి కల్యాది 4295 సంవత్సరముల వరకు జరిగిన భారతదేశ చరిత్రను నవలల ద్వారమున స్పష్టపఱచవలెనని యొకప్రణాళికను సిద్ధపఱచుకొని యున్నట్లుగా పాఠకునకు నూహకలుగుచున్నది. కాని ప్రసిద్ధమయిన మార్పులకు, దురూహాలకులోనైన విషయములు నాలుగు మాత్రమే. అందు మహాభారత యుద్ధకాలము మొదటిది. రెండవది అలెగ్జాండరు చక్రవర్తి భారతదేశమునకు వచ్చినపుడు మగధ సామ్రాజ్యమేలెడి రాజు గుప్తుడేగాని మౌర్యచంద్రగుప్తుడు కాడను విషయము. మూడవది విక్రమార్క మహారాజుకాలము క్రీ. పూ. 57వ సంవత్సరమనియు, నాయనకడ నవరత్నములనుపేర మహాపండితులైన వరాహమిహిర కాళిదాసాదులున్నట్లు స్పష్టపఱచుట. ఇక నాల్గవది మనము వాడుకొనుచున్న, ప్రభుత్వమువారు సయిత మంగీకరించిన శాలివాహనశకకర్త మిథ్యకాడు. సత్యముగా నాయన క్రీ. శ. 78వ సంవత్సరమున యుజ్జయినిలో రాజ్యముచేసెను. ఆయన విక్రమార్కునకు మనుమడను విషయమును స్పష్టముచేయుట. ఇంతవరకు మాత్రమే తనప్రణాళికను కుదించుకొనెను. ఈ వంశమునందే ప్రభవించిన భోజరాజును గుఱించిన నవలయొకటి, పృథ్వీరాజ్ రాణీసంయుక్తలకు సంబంధించిన నవలయొకటి, చారిత్రక ప్రసిద్ధములైనవి, జనబాహుళ్యములో ననవరత విమర్శకు గుఱియగుచున్నవి

కనుక శ్రీ విశ్వనాథవారి మొదటిప్రణాళికలో నవి తప్పకయుండి యుండును కాని వీనికంతటి ప్రాధాన్య మీయదలంచకయో, ప్రధాన చరిత్రకాంశములను జనులకవబోధ మొనర్చుట మాత్రమే కర్తవ్యముగా భావించియుండుటచేతనో, శాలివాహనశకమునుండి ప్రజలు, ప్రభుత్వమును గ్రహించి సత్యకాలమును వర్జించియుండుటచేతనో యీనవలా మాలికను పండ్రెండుతో సమాప్తి యొనరించిరి.

ఇక నీమాలారచనములోని విశిష్టతనుగురించి మరికొంత పరిశీలింప యత్నింతము. జనమేజయుని శాసనము సహార్ధత మొనర్చుటకు గావించిన ప్రయత్నముగా మొదటినవల 'భగవంతునిమీదపగ' గోచరించును. అక్కడనుండి ఒక్కొక్కవంశమున కొక్కొక్కనవల వ్రాసినట్లు గానవచ్చును. బార్హద్రథవంశాంతము ప్రద్యోతవంశారంభమును రెండవనవలయైన నాస్తికధూమమున' గోచరించును. ప్రద్యోతవంశనాశము శైశునాగవంశావతరణము 'ధూమరేఖ' యను మూడవనవల యందు గాననగును. శైశునాగవంశానంతర మేలిన నందవంశవిషయమును 'నందోరాజాభవిష్యతి' అను నాల్గవ నవలయందు నిక్షేపించెను. నందవంశము తరువాత నేలిన మౌర్యవంశమును గురించి 'చంద్రగుప్తునిస్వప్న' మను నైదవ నవలయందు ప్రకటించెను. దీని తరువాత శుంగవంశమును 'అశ్వమేధము'నందును, కాణ్వవంశమును 'అమృతవల్లి' యను నవలలోను రూపొందించెను. తరువాత నేలిన ఆంధ్రరాజ్యప్రారంభమునుగురించి "పులిముగ్గు" నవలను, అందే అనగా నాంధ్రవంశమునందే శివస్కంధవర్మ ఇరువదినాలుగవ వాడు. వీనిని గురించి 'నాగసేనుడను'నవలలో వ్రాసెను. "హెలీనా" యను నవల ద్వారమున అలెగ్జాండరుకాలమున నున్నది. గుప్తచంద్రగుప్తుడే యని నిరూపణముచేసెను. "వేదవతి" నవల విక్రమార్కుని కాల నిర్ణయమునకును, ఉపయుక్తమైన "సవేదిత" నవల శాలివాహనుని శకకర్తగా నిరూపించుటకొరకును వ్రాసినట్లు స్పష్టమగుచున్నది.

ఆంధ్రసాహిత్యరంగములో నవలాప్రక్రియలో నేవంవిధమయిన యితివృత్తసమ్మేళనముతో సాగించినకృషి కీతడే స్రష్టయని చెప్పవలెను. కల్యాదినుండి శాలివాహనశకాదివరకు సుమారుమూడు వేల సంవత్సరములు పాశ్చాత్యచరిత్రకారులు గావించిన దురాగతములన్నియు నీకాలమునందే యనుటస్పష్టము. ఇంతటి దీర్ఘకాలికచరిత్రాంశములను, పురాణము లందాసంగిన విషయమూధారముగా, సాహిత్య రస సిద్ధిని ప్రపూర్ణముగా వానియందుకల్గించి పదిరెండునవలలనొకమాలగా గుదిగ్రుచ్చి నిర్వహించుటలో బహుశః నాంధ్ర సాహిత్యముననే గాక ప్రపంచసాహిత్యములోనే యపూర్వచరిత్రను సృష్టించి శ్రీ విశ్వనాథ మహామేరువువలె భాసించుచున్నాడు.

నాలుగవది ప్రతినాయక ప్రాధాన్యము. బంగారమునకు పుటము పెట్టనిదే వన్నెరాదనునది జగత్సత్యము. అసురప్రకృతి విజృంభణముననే దేవతాప్రకృతికి నివాళులు. రావణుని యౌద్ధత్యము లేనిచో రాముని తలచెడిది యెవరు? ఇట్లు లోకవృత్తము లందును, మహాకావ్యాదులందునయితము ప్రతినాయక ప్రాధాన్యముననే నాయకునకుకీర్తి. గుణవిశిష్టత స్థిరీకరింప బడుచున్నది. ఆకారణముననే రామునివలెనే ప్రవర్తించుటకొఱకు రావణునిచరిత్రనెఱుంగుట యపరిహార్యమనుట తెల్లమే, కావ్యములందు నాయక ప్రాధాన్యమును మాత్రమే యాలంకారికులు నిర్వచించిరి. ప్రతినాయకుని యౌద్ధత్యగుణము నాయకుని ప్రాధాన్యము నినుమడింప జేయుటకే యగును. వేణీసంహార నాటకమునందు ధర్మజుడు నాయకుడని యనలేము. అట్లే ముద్రారాక్షసమునందు రాజగు చంద్రగుప్తుడుగాని, రాక్షసుడుగాని నాయకులని చెప్పలేము. మొదటిదానిలో భీముని యవక్రపరాక్రమము, రెండవదానియందు చాణక్యుని బుద్ధి

"రామాదివవర్తితవ్యమ్ నరావణాదివత్"

నైశిత్యము నాటకాద్యంతములు ప్రకాశించును. వీరివలననే నాయకునకు యశము గలుగుచున్నదనిచెప్పుట విధి. ఈ కారణముగా ప్రతినాయకునకు లేక కతిపయనాటకములలో నిర్వహింపబడినట్లు నాయకేతరునకును కొన్నియెడల ప్రాధాన్యమనివార్య మగుచున్నది. శ్రీ విశ్వనాథయు ప్రతినాయక ప్రాధాన్యముగా భగవదౌత్కృష్ట్యమును నిరూపింప దలచినట్లు తోచును. ప్రతిభ యనగా నిట్టిది. నిరూపింపబడవలసినది పురాణములసత్యత్వము, వేదములప్రామాణ్యము. ఉపనిషద్వాక్యవిచారము. మఱుగుపడిన చారిత్రకసత్యములను బహిర్గతముగావించుట. కాని నిరూపించువిధానము మాత్రము వైరుధ్యభావకోణము నుండి. ఇది చిత్రమైన సంవిధానమని చెప్పక తప్పదు. ప్రారంభించిన మొదటి నవల 'భగవంతునిమీది పగ'. ఈ నవలకుగల పేరు మిగిలిన పదునొకండు నవలలకు ననుస్యూతముగా నంతర్లీనముగా నన్వయించును. సమన్వయపడును. ఇంక మిగిలిన నవలలకు వేర్వేరు పేర్లున్నవి. కాని ప్రధానమయిన పేరిదియే. అట్లే చివరినవలపేరు చమత్కారమయినది. అది 'నివేదిత'. నివేదితమనగా నివేదింపబడినది, సమర్పింపబడినది, ఎఱుకపఱుప బడినదను నర్థములు కల్గును. ఏవంవిధమయిన వైరుధ్యమన్ని కేంద్రములనుండి ఎఱుకపఱుప బడినది, భగవంతునకు సమర్పింపబడినది యని రచయిత అంతర్గతభావము కావచ్చును. ఇందు ప్రతినాయక జీవుడొక్కడే. అతడు కాలమువలె ననంతమయిన యాయుర్దాయము గల్గిన వాడన్నట్లున్నది. అర్జునునికైనను లేకున్న పూర్వజన్మజ్ఞాన మీ పురాణవైరనవలలందు ప్రతిబింబించు ప్రతినాయక జీవునకున్నది. అసురప్రకృతి కదా! అతడే జయద్రథనామకుడు, వెలియోనస్ కబంధుడు, కటకటయోగి, ఫిలిప్ యోనస్, నిరాకులుడు. మహాభారత యుద్ధకాలమున సంభవించిన సైంధవవధతో ప్రారంభమయిన యీ భగవద్వైరమును నాతని మేనల్లుడయిన కనకసింహునిచే

జయద్రథనామకముగనే కవి నడిపించెను. ఇందు ప్రాచ్యదేశమునందు జనించినవారు జయద్రథుడు, కబంధుడు, నిరాకులుడనువారు, మ్లేచ్ఛభావతాడిత దేశములందు జనించిన భగవద్విరోధులు విలియోనస్, ఫిలిప్‌యోనస్ లనువారు. వీరి యాత్మ ఒక్కటియే. అది మహాభారత యుద్ధమున సైంధవుని మరణానంతర మాతనిమేనల్లుడయిన కనక సింహుని యాత్మ. అది జయద్రథనామక మయ్యెను. ఈ పాత్రద్వారమునసే కవి తాను దేశమున గనుచున్న యసంస్కృతభావములను, వాని దుష్ఫలితములను వ్యంగ్యముగా బహిర్గతమొనర్చెను. ఇది యొకవిధముగా వైరానుబంధమువంటిది. భక్తియుందును వైరముండును. అది వైరముగాదు. బౌద్ధమతము వంటిది. మతముండును. అది మతముగాదు. అయినను ఆదరణీయము. ఆచరణీయముగాదు.

# 6. పురాణవైరనవలలు - సమీక్ష

—నవలలు

1. భగవంతునిమీది పగ
2. నాస్తికధూమము
3. ధూమరేఖ
4. నందోరాజాభవిష్యతి
5. చంద్రగుప్తునిస్వప్నము
6. అశ్వమేధము
7. అమృతవల్లి
8. పులిముగ్గు
9. నాగసేనుడు
10. హెలీనా
11. వేదవతి
12. నివేదిత

ఇందుతో—

1. చారిత్రకపూర్వరంగము
2. ఇతివృత్తసంగ్రహము
3. ఇతివృత్తనిర్వహణము
4. విశేషాంశములు

## 1. భగవంతునిమీది పగ - చారిత్రక పూర్వరంగము

భారతాహవానంతరము నూఱేండ్లు గడిచిన వెనుక కాలము నాటి యితివృత్త మీనవలయందు సంధింపబడినది. మనకు లభ్య మయిన యాధారములతో నాటిచారిత్రకాంశములను స్థూలముగా బరిశీలింతము.

బహూపపత్తులతో నీసమరము క్రీ. పూ. 3139వ సం॥న జరిగి నట్లు నిర్ధారణము చేయబడినది. ఇందు ధర్మరాజాదులు దక్క పర పక్ష సైన్యము, పాలకులు నిహతులైరి. విజయము సిద్ధింపగా ధర్మజు డనుజులతో గూడి ముప్పదియాఱేండ్లు హస్తినను రాజధానిగ నొనర్చు కొని పాలించెను. అది క్రీ. పూ. 3102వ సంవత్సరము. కలిప్రారంభ సూచనమయ్యెను, శ్రీకృష్ణనిర్యాణము సంభవించెను. కలిప్రవేశ మును ధర్మజాదులు గమనించిరి. అంత ధర్మజుడు రాజ్యపరిత్యాగ మొనర్చి పరీక్షిత్తునకు పట్టాభిషేకము గావించి యనుజులతో దీర్ఘ యాత్రలు నడిపెను. పంచవింశతి సంవత్సరము లిట్లు గడచిన యనంత రము ధర్మజాదులు స్వర్గారోహణ మొనర్చిరి. ఇది క్రీ. పూ. 3077 వ సంవత్సరము. పరీక్షిన్మహారాజు అఱువదియేడులు రాజ్యమును బాలించెను. ఇది క్రీ. పూ. 2941వ సంవత్సరమునకు సమము, ఈతని యనంతర మీతని కుమారుడు జనమేజయుడు రాజ్యమునకు వచ్చెను. ఈ మొదటినవలయందలి యితివృత్తము జనమేజయుడు పాలించు నప్పుడు ఆంధ్రదేశమున జరిగినట్లుగా వ్రాయబడినది.

కాశ్మీరరాజచరిత్రను శ్రీ ఆనందకౌలు పండితులు Journal and proceedings of Asiatic Society of Bengal" అను ప్రతికలో ప్రక టించిరి, 'రత్నాకరపురాణ, మను గ్రంథములోని యంశములనుకొన్నిం టిని ఆయన పేర్కొనెను, రెండవగోనందుని తరువాత జనమేజయుని

సోదరుడయిన హారణదేవుడు పాలించినట్లు గల యంశమొకటి. కల్హణుడు 'రాజతరంగిణి' లోని చరిత్రను మహాభారతయుద్ధకాలమునుండి ప్రారంభించెను. ఒకటవ గోనందుడప్పుడు కాశ్మీరప్రభువు. మగధ నేలెడు జరాసంధునకు సమకాలీనుడు, జరాసంధుడు భీమునిచే మడియగా నాతని పుత్రుడు సహదేవుడు మగధేశు డయ్యెను. అప్పుడు నేపాళమును కిరాతవంశపు జితేదాస్తి, కాశ్మీరమును గోనందుని కుమారుడు దామోదరుడు పాలించిరి. మహాభారతయుద్ధమున వీరెల్లరు మరణించిరి, దామోదరుడు యుద్ధమునకు ముందే చనిపోయెను. హస్తినను ధర్మజుడు, నేపాలురాజ్యమును గాలి, మగధను మార్జారి, కాశ్మీరమును దామోదరుని కుమారుడైన రెండవగోనందుడు (యుక్తవయస్కుడగు నంతదనుక తల్లియైన యశోవతి) పాలించిరి. రెండవ గోనందుని యనంతరము కాశ్మీరరాజ్యమేలిన ప్రభువు హారణదేవుడని రత్నాకరపురాణము పేర్కొనుచున్నదని డా॥ మన్కడ్ మహాశయులు వ్రాసిరి.[1] కథాకాలము నాటికి హస్తినను జనమేజయు డేలుచుండగా కాశ్మీరము నాతని సోదరుడయిన హారణదేవు డేలిన చరిత్రాంశ విశానవల యందు స్పృశింపబడినది. నేపాలమున సుయస్మ్రుడు, మగధ యందు శ్రుతశ్రవుడు జనమేజయునకు సమకాలికులు. అయోధ్య, కోసలలు గూడ నాటి పెద్దరాజ్యములలో నున్నవి. మగధసామ్రాజ్యపు కీర్తిప్రతిష్ఠలు హెచ్చిన తరువాత నివి యల్పరాజ్యములుగా బరిగణింపబడి పురాణములందు వీనిప్రసక్తి అల్పముగా నుండెను. మన కథా కాలము నాటికి నాంధ్రదేశమునగల చారిత్రకపుబరిస్థితిని గమనింతము. తుంగభద్రానదీతీరమున జనమేజయ ప్రభువు నాడొక దానశాసనమును వేయించెను. ఇదియొక చరిత్రాంశము.[2] అటగల (శ్రీ) సీతా

---

1. Puranic Chronology, Kashmir . DR. Mankad P. 106.
2. "The Tirthahalli plates of Mysore state record that king Janamejaya granted to the ascetics of the loca-

రాములవారి యాలయ పరిసరముల నివసించెడి మునిబృందమునకు నాలయార్చనకు సంబంధించినట్టి దీ శాసనము. దీనిని భారత పురాతత్వపుశాఖ తమ శాసనపత్రికలో ప్రచురించినది. ఆ శాసనము:—

శ్రీ కురువంశావతంస శ్రీ జనమేజయ భూపాలానాం దానశాసనపత్రమ్—

శ్లో॥ పాంతు వో జలదశ్యామాః శార్ఙ్గ జ్యాఘాత కర్కశాః।
త్రైలోక్య మండప స్తంభా శ్చత్వారో హరి బాహవః॥

స్వస్తి। శ్రీ జయాభ్యుదయే యుధిష్ఠిరశకే ప్లవంగాఖ్యే (ఖ్య) ఏకోన నవతి (89) వత్సరే సహస్యమాసి అమావాస్యాయాం సోమవాసరే శ్రీమన్మహారాజాధిరాజపరమేశ్వరో వైయగ్రణీ వైయాఘ్ర (?) పాదగోత్రజః శ్రీ జనమేజయభూపః కిష్కింధానగర్యాం సింహాసనస్థః సకలవర్ణాశ్రమ ధర్మప్రతిపాలకః పశ్చిమదేశస్థ సీతాపుర వృకోదర క్షేత్రే తత్రత్య మునిబృందమఠస్య గరుడవాహనతీర్థ శ్రీమచ్ఛిష్య కైకయనా (చా) ర్యై రారాధిత సీతారామస్య పూజార్థం కృత భూదానశాసనమ్ అస్మత్ప్రపితామహ యుధిష్ఠిరాధిష్ఠిత మునిబృంద క్షేత్రస్య చతుస్సీమా పరిమితిక్రమః పూర్వభాగే - ఉత్తరవాహిన్యా స్తుంగభద్రాయాః పశ్చిమే-దక్షిణభాగే - అగస్త్యాశ్రమ సంగమా దుత్తరే-పశ్చిమే-పాషాణనద్యాః పూర్వే-ఉత్తరభాగే - భిన్ననద్యాః దక్షిణే - ఏతన్మధ్యస్థిత మునిబృందక్షేత్రం భవచ్ఛిష్య పారంపరా చంద్రతారార్కపర్యన్తం నిధినిక్షేపజల పాషాణాక్షిణ్యా (?) గామి

---

lity for worship of the God Seetharama some land constituting a property name Munivrinda Keshetra in the place called Vrikodara on the west of the Tunga-Bhadra in the plavanga year 89 th of Yudhisthira saka", Fleet Journey through Mysore, Canara, & Malabar, History of Sanskrit literature. M. Krishnamacharyulu, P, 69.

సిద్ధసాధ్య తేజస్స్వామ్యసహితం మునిభిః ప్రోక్తం స్వబుద్ధ్యాయుకూత్యే నాస్మ న్మాతృపితౄణాం విష్ణులోకప్రాప్త్యర్థం హరిహరసన్నిధౌ వుపరాగ సమయే సహిరణ్యేన తుంగభద్రాజలధారాపూర్వకం క్షేత్రం యతిహస్తే దత్తో (దత్తవాన్ (?) స్మ్యహం ఏతద్ధర్మసాధనస్య సాక్షిణ్యః ఆదిత్యచంద్రావనిలో నలశ్చ (చతా) ర్ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ (మన) అహశ్చ రాత్రిశ్చ ఉభేఽపిసంధ్యే ధర్మస్యజానాతి నరస్యవృత్తం.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాద్ద్విగుణంఫలం । 3
స్వదత్తాద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనే ।
పరదత్తాపహారేణ స్వదత్తం విష్ఫలం భవేత్ । 4
మద్దత్తా పుత్రికాజ్ఞేయా పితృదత్తా సహోదరీ ।
అన్యదత్తాతు జననీ దత్తభూమిం పరిత్యజేత్ । 5
తతఃకష్టో తతోపిచః స్వయందత్తాపహారకః 6
స్వదత్తం పరదత్తాంవా బ్రహ్మవృత్తిం హరేతయః ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతేక్రిమిః ॥ 7 పేజి 333_34

ఇది జయాభ్యుదయ యుధిష్ఠిరశకమునుండి 89వ సంవత్సరమున తుంగభద్రానదీతీరస్థమైన శ్రీసీతారాములవారి యాలయమందు పూజా నిమిత్తమై యటగల మునిబృందమునకు ప్లవంగ సంవత్సర సహస్యమావాస్య సోమవారమున జనమేయప్రభువు సమర్పించిన దానశాసనపుబత్రము, ఇది క్రీ. పూ. 3102వ సంవత్సరము. కల్యారంభము, * జయకావ్యరచనారంభము కూడ నిదే వత్సరము. జనమేజయుని పాలనము క్రీ. పూ. 3042న (3102-60) నారంభమయ్యెను. ఈతని 29వ పాలనసంవత్సరము శాసనములోని జయాభ్యుదయ యుధిష్ఠిరశక

• సహసి - పుష్యమాసము. * జయకావ్యము - మహాభారతము.

సంవత్సరము 89వ యేడునకు సమానమగుచున్నది. ఇది క్రీ. పూ. 3013నకు సమానము, ఈ సంవత్సరమే యీయన ఆంధ్రదేశ ప్రర్యటనము, దానశాసన సమర్పణము. కలియుగాది ప్రమాది సంవత్సరమని చెప్పబడినది. దీనికి 89వ సంవత్సరము ప్లవంగ ఈ సంవత్సరముననే శాసనము సమర్పితమయ్యెను. ఇది క్రీ. పూ. 3013వ సంవత్సరమునకు సమము. ప్లవంగసంవత్సర పుష్య అమావాస్య సూర్యోపరాగ దినము. గ్రహణసమయమున జపమంత్ర దానములు బహుఫలావాప్తికి, పుణ్యసంగ్రహణమునకు సముచితసమయములని పెద్దలు చెప్పుదురు. అదేదినమున ఉత్తరహిమాలయములందున్న కేదారక్షేత్రములోని కేదారనాథుని పూజానిమిత్తమై ఉషామఠమునకు జెందిన గోస్వామికి ఆయన శిష్యుడైన జ్ఞానలింగజంగము ద్వారమున సమర్పితమయిన దానశాసనము నేటికిని యామఠమునందు భద్రపఱుపబడియున్నదట. ఈవిధముగా నీరెండు శాసనములును చారిత్రక ప్రాధాన్యము కల్గియున్నవి. ఇందు మొదటిది ఆంధ్రదేశమునకు సంబంధించి యుండుటచేతను, రచయిత తద్దేశవాసియగుటచేతను నీ శాసనమును మాత్రము తననవలయందు సముచిత ప్రాధాన్యముతో నుపయోగించినాడు. ఆంధ్రదేశపుచరిత్రను గుఱించియు, వారి ప్రాచీనత గుఱించియు నీనవలయందు స్పృశింపబడినది. దానికిగల చారిత్రకాధారములను పరిశీలింతము.

ఆంధ్రదేశము–ఆంధ్రులు :– "అంగవంగకళింగాద్యా సుంహ్మపుండ్రాంధ్ర సంజ్ఞితాః॥ జజ్ఞిరే దీర్ఘతమసోబలేః క్షేత్రేమహీక్షితః। చక్రుస్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాచ్యకాంశ్చతే। భాగ. 9–13–6

అనువువంశములో యయాతివంశమునుండి ప్రముఖ వంశములను లెక్కింపగా 13 వ వంశములో బలి జన్మించెను. బలికి దీర్ఘతముడను మహర్షి యనుగ్రహముచే నారుగురు పుత్రులుదయించిరి.

వారు అంగ, వంగ, కళింగ, సుంహ్మ, పుండ్ర, ఆంధ్రములను పేళ్లు గల వారు. బలి పాలించెడి దేశమునకు ప్రాచ్యకమని పేరు. కిరాతార్యులను నా ప్రాచ్యకమును విభాగించుకొని పాలింపదొడగిరి. ఏ ప్రభువు పాలించెడి ప్రదేశ మా ప్రభునామముననే బరగెను. తత్కారణమున నాంధ్రరాజు పాలించెడిప్రదేశ మాంధ్రసంజ్ఞితమయ్యెను. బలియొక్క పూర్వులను సంస్కృతాంధ్రభాగవతములు పేర్కొన్నవి.[5] తితిక్షునకు, వానికి రుశద్రథుడు, వానికి హేముడు, వానికి సుతపుడు, వానికిబలియు పుట్టిరి అనికలదు. ఈ ఆంధ్రరాజులు, దశరథుని కుమార్తెను పెంపక మునకిచ్చిన రోమపాదుడును సమకాలికులు. ఈ రోమపాదుడు చిత్రరథుడను నామాంతరము గలవాడు. తితిక్షున కన్నగారయిన ఉశీనర నృపతి సంతానమున నేడవవాడు రోమపాదుడు. అప్పటిది ఈయాంధ్ర సామ్రాజ్యమని భాగవతము నుడువుచున్నది. దానినినాడు ప్రాచ్యక మని పిలిచెడివారు[6] దీనినిబట్టి యాంధ్రులయొక్కయు, వారి పాలకుల యొక్కయు ప్రాచీనతస్పష్టపడినది. సారాంశ మేమన—

---

5. అనో సభానరశ్చక్షుః పరోక్షశ్చత్రయః స్సుతాః ।
సభానరాత్ కాలనరః సృంజయ స్తత్సుత స్తతః ॥ 9-23-1
జనమేజయ స్తస్యపుత్రో మహాశీలో మహామనాః ।
ఉశీనర స్తితిక్షుశ్చ మహామనస ఆత్మజౌ ॥ 2
శిబిర్వనః శమిర్దక్ష శ్చత్వారో ఉశీనరాత్మజాః ।
వృషాదర్భ సువీరశ్చ మద్రః కైకయ ఆత్మజాః ॥ 3
శిబే శ్చత్వార ఏవాసం స్తితిక్షోశ్చ రుశద్రథః ।
తతో హేమోఽథ సుతపాః బలిః సుతపసోఽభవత్ ॥ 4

6) ధ్వనపానోఽజగ్తో జజ్ఞే తస్మా ద్దివిరథ స్తతః । 9-24-6
సుతో ధర్మరథో యస్యజజ్ఞే చిత్రరథో ప్రజాః ।
రోమపాద ఇతి ఖ్యాత స్తస్మై దశరథః సఖా ॥ 7
శాంతాం స్వకన్యాం ప్రాయచ్ఛ దృష్యశృంగ ఉవాహతామ్ ॥

1) ఇతివృత్తము జనమేజయునికాలము నాటిది. 2) జనమే జయుని శాసనములకు జారిత్రకప్రతిపత్తి గలదు. 3) కాశ్మీరమును పాలించునది జనమేజయుని సోదరుడు హరణదేవుడు.

## 2. ఇతివృత్త సంగ్రహము

సుసంపన్నము, సుధామధురవాహినీ సంయుతము, వేదవేదాంగ విద్యలకాలవాలమునయిన యాంధ్రభూమియందలి ధాన్యకటకము నాటి ప్రభువులకు రాజధాని, నాడు ప్రభువు రోమపాదుడు ఆయన వయసుచే శతాధికుడు. మనసుచే కౌమారుడు. ఈయనకు మూవ్వురు కుమారులు. శ్రీముఖుడు, విజయుడు, నాగార్జునుడు, శ్రీముఖుడు యువరాజు. భావతీవ్రత గల్గినవాడు, విజయుడు ఖడ్గవిద్యానిపుణుడు. సర్వకార్యము లందు నిర్లక్ష్యము గలవాడు, నాగార్జునుడు రూపసి. పసివాడు, మనసునకు మాత్రమే.

శ్రీముఖుడు తనకుగల భావతీవ్రతను, తనచేష్టాదులచే దన యందు నర్మముగా మిత్రత్వమునునెఱపెడి జయద్రథునకు దెలిపి సల్లయ్యెను, వాని రహోవర్తనమును యువరాజుగా నాతడు కనుపెట్ట లేదు- అతని నిత్యనూతన విషయాన్వేషణ లగ్నబుద్ధి యీ విషయమై విచారింపనీయులేదు. తన విజ్ఞానము దొడ్డది. అప్పటికే వ్యాప్త మయిన వ్యాసకృత బ్రహ్మసూత్ర,పురాణాదులను జక్కగాజదివెను. గీత నధ్యయనము గావించెను. సంప్రదాయ మానసుడు. ధర్మమార్గ ప్రవర్తకుడు. సుఖానుభవ చేతస్కుడయ్యును రాచరికపు ఠీవి వెల యించును. సుఖప్రథమానుభూతి రహస్యమును జయద్రథుడెఱింగింప తత్సాధనమిత్త్రమై రాజధాని సమీపమున గల చంద్రభాగాఝరీదర్శ నోత్సాహియై, ఆ ప్రవాహవేగముతో సమముగా తానును నా నదీ లోయలో దుముకును. వెనువెంట యువరాజరక్షణార్థ మొక రాజపురుషుడు శ్రీముఖు ననుగమించనిచో ననంతరేతివృత్తము లేదు.

ఆ రాజధానికి సమీపమున నెలకొన్న నొకపర్వతము. దాని నింద్రకీలాద్రి యనియచటివారందురు. ఆపర్వతముమీదనే యర్జునుడు తపంబొనరించెనని యిప్పటికి జీవించియున్న శతాధికవృద్ధులు కథలుగా జెప్పికొందురు. దేశము ధాన్యమునకు, తమ్ములపాకులకు ఖడ్గ విద్యకు ప్రశస్తి వహించినది. సామ్రాజ్యమందలి భోగులెల్లరు నీబియ్యమే తిందురు. శ్రీకృష్ణుడు సయిత మీతమ్ములమే కోరుకొను. నాటి ఆంధ్ర పదాతిసైన్యమనగా బరరాజులకు గుండె దిటవుతప్పును. ఖడ్గవిద్యలో నతిప్రతిష్ఠుడు విజయుడు. విజయుడు కాముకుడు, కత్తియొడుపునందు లాఘవము కలవాడు. కోపి, వేగరి. సోదర మధ్యము డగుటచే నాతని ప్రతిచర్యయు నలత్యమునకు బట్టాభిషేకము చేసినట్లుండును.

నాగార్జునుడు గురుత్వము వహింపగల ఖడ్గవిద్యావిశారదుడు. వేత్తృత్వ, నేతృత్వముల నాయన యవలీలగా నిర్వహింపగలడు ఆతనిపై నాతనికి ప్రత్యయములేదు. విపరీత ప్రకృతి. అది యాతని జీవ నిష్ఠము.

నిరంకుశుడు గ్రామాధికారి. ఆ గ్రామము దొడ్డపట్టు. అది రాజగోధన నిక్షేపస్థానము. ఖడ్గవిద్యయందున్నత ప్రాజ్ఞుడైన నిరంకుశునకు నాగార్జుననితో విద్యాపరమయిన మత్సరము కలదు. నాగార్జునునకుగల లాఘవము విజయసింహునకుగలసూక్ష్మాభినివేశము నిరంకుశుని యెడ మృగ్యము. ఎట్లైనను విజయసింహునిపయి విజయము సాధింపవలెనన్న తీవ్రవాంఛ నిరంకుశుని నిలువనిచ్చుటలేదు. తన యధికారపరిధికి లోబడిన ప్రదేశములో నున్న 'గంగు'అను మహా నిపుణతగల్గిన ఖడ్గవిద్యావేద్యునికడ "బగళా, కాలంజరి" యను లొచ్చు విద్యలు నేర్చి విజయునికంటె తానెక్కువయన్న తృప్తిని సాధించుటలో కృతకృత్యు డగును, ఇట్లుండగా రాజకుమారుల కుద్వాహము

లయ్యెను. శ్రీముఖుని దేవేరి కాళింది. విజయుని సతి భామ. నాగార్జునుని కళత్రము నీల. కాళింది పట్టపురాణి కానున్నది. మిగిలిన యిరువురు సతులు రాజసమీప బంధుతనయలు కాగా కాళిందిరాజ దుహిత. నాగార్జునునకు నీలకు జరిగినపెండ్లి ప్రేమపెండ్లి వంటిది. రాచపోకళ్లు లేనిది. అట్లని నీల యమాయకురాలు కాదు. రాజనీతి నామె నొత్తు. ఆమెకు సామ్రాజ్ఞీత్వము సంక్రమించుననీ, ఆమె కను సన్నలలో తాను మెలగి రాజ్యమును తానేలగల వీలుదననియు నాగార్జు నుడు భావించును.

జయచంద్రధునిమాత దుస్సల. ఈమె కాశ్మీర రాజదుహిత యని జయచంద్రుడు చెప్పును. కారణాంతరములచే నొకమహాతీవ్రప్రతిజ్ఞా పాలనకు గట్టువడి యజ్ఞాత జీవితమును గడపుచుంటిమని శ్రీముఖునితో ననును. శ్రీముఖుడు వానియందుగల పరమవిశ్వాసముచే వారికి విడిది భోజనసౌకర్యములను సమకూర్చెను. దుస్సల మ్లేచ్ఛభావ సంపుటి ఆమె తన యసంస్కృత భావములను రాజస్నుషలలో నెవరి యందు సులభముగా బ్రవేశపెట్టుటకు వీలున్నదో గ్రహింపయత్నించు చుండెను. నీల యామె వాగుర జిక్కిన పక్కి యయ్యెను. అంతకు మున్నే బాల్యాది రేలంగి యను దాసి యీ యసంస్కృత విజ్ఞాన మామెకధ్యాపనము గావించినది. అరమగీలా ప్రణయము నుపదేశించి రేలంగి నీలను, సనాతనసంప్రదాయచ్యుతి నొందింప యత్నించినది నీల నల-దమయంతుల ప్రణయసాఫల్యమును కాళిందినుండి వినెను కాని మ్లేచ్ఛభావదోషదూషితమయిన మనస్సు రేలంగి చెప్పిన గీతమందే రమణము నొందెను. ఫలితముగా నీలానాగార్జునులకు సంప్రదాయాను సరణము పయి వివాదము. గెలుపు నీలది. ఈ వివాదము కోటలో పురాణము జెప్పెడి వినయశర్మను విమర్శించుట వరకు బోయెను. ఈ వినయశర్మ గోదావరీప్రాంతము వాడు. ఈతనికి గల యిరువురు కుమా

యులలో నొకడు జనమేజయుని కొలువునను మఱియొకరు శ్రుతశ్రవుని యొద్దను కొలువుండిరి. ఈ శ్రుతశ్రవుడు మగధేశుడు. బహుపురాణజ్ఞునిగా నాంధ్రరాజ్యమున ప్రవేశము సంపాదించి కోటలో రామాయణప్రవచనము గావించును. ఈతని సౌకర్యములు చూచుటకు ప్రభువుయొక్క ఆంతరంగికుడు చంద్రశేఖరవర్మ నియమింపబడెను. పురాణప్రవచనముతో రాజకీయపరామర్శ లితనివైశిష్ట్యము. ఈయన సతి జాహ్నవి. యంతఃపురములోని రాజకాంతల వృత్తపరిశీలనము చేయుచుండును.

నిరంకుశుని సోదరి జాంబవతి. ఆమెతో విజయునకు కలుగరాని నెయ్యము సంభవించెను. ఇది నిరంకుశునకు తీవ్రవిషయ మయ్యెను. విద్యాస్పర్థయొకటి వీరినడుమ వర్ధిల్లుచునే యున్నది. జయద్రథుని చేతినుండి శ్రీముఖుడు జారిపోయిన తరువాత నాగార్జునుడు చిక్కెను. నాగార్జునునకు తానెప్పుడు మహారాజగుదుననియే యాతురత. తుదకొక భీకరకాళరాత్రమున జయద్రథోపజ్ఞముగ కృష్ణాతీరమునగల యన్నికుల క్షత్రియ గ్రామమున జయద్రథుడు తన యనుయాయులతో జరుపు సమావేశమునకు జనెను. తనసోదరుల మరణమునకు తాను ప్రత్యక్షముగనో పరోక్షముగనో హేతువు కాగల్గినచో తనకు సామ్రాజ్యపదవి లభించునట్లుగా ప్రబోధితు డయ్యెను. ఇది జయద్రథుడు నాగార్జునుని పయి సాధించిన విజయమునకు సంకేతము.

జయద్రథునిపథక మారంభమయ్యెను. విజయసింహుని నిరంకుశుడు సంహరింప చూచుచుండెను. దానికి నాగార్జునుడు దోహదమిచ్చెను. విజయసింహునకు జాంబవతిమీద ననుమానము కల్గుటకు వీలయిన యసూయాబీజములను నాటెను. విజయసింహుని పరకాంతాసక్తతను ప్రత్యక్షముగ దర్శింపవీలగునని శ్రీముఖుని యాయత్తపఱచి యా ప్రదేశపు వివరములు దెలిపెను. ఇదియంతకు బూర్వమే విన్న

లోమపాద మహారాజటకు బోయి విజయసింహుని చేత నిహతుడయ్యెను. విజయసింహుడు నిరంకుశుని కాలంజరీవిద్య చే ద్రోహాఘాతములకు గురియయ్యెను. అచటకు చేరిన శ్రీముఖ, వినయశర్మ, చంద్రశేఖరులీ దురాగతమును గాంచిరి, సర్వము భద్రము చేయబడెను. శ్రీముఖుడు ప్రభువయ్యెను. విజయుని, తండ్రిశవమును, కోటకు గొనివచ్చిరి ఈ ఘోరదురంతమును గాంచి యాత్మహత్య గావించుకొన్న జాంబవతి మరణమును సహజమరణముగా నిరూపింపుమని ప్రభువు నిరంకుశునాజ్ఞాపించెను,

తనపథకము సర్వము నిష్ఫలమయ్యెనని నాగార్జును డెఱింగెను. శ్రీముఖున కెదురుపడుటకే నిశ్చయించుకొని పశ్చాత్తప్తుడై విష నిష్క్రియా ప్రయోగము నెఱింగి యుండుటచే తన్నిర్వాహణముచే విజయుని స్వస్థునిగావించెను. ఇతఃపూర్వమే నిర్ణయముకాబడిన శ్రీముఖ పట్టాభిషేక దర్శనోత్సాహియై దక్షిణాపథమున కేతెంచిన జనమేజయ భూజాని తుంగభద్రానదీతీరమున సీతారాములవారికి నిత్యపూజా నిమిత్తమై దానశాసనసమర్పణము గావించి ఆంధ్రమునందలి ధాన్యకటకమునకు విచ్చేసెను, సర్వవిషయ పరిజ్ఞాతుడై శ్రీముఖుని సామర్థ్యమున కలరి కార్యార్థియై కాశ్మీరదేశమునగల తనసోదరుని సందర్శించు మిషతో నిష్క్రమించెను, జయద్రథుడు బందీయయ్యెను. చంద్రశేఖర వర్మచే వాని యావద్వృత్తాంతము సభలో వినయశర్మాదుల సమక్షమున సభాముఖముగా శ్రీముఖునకు నివేదింపబడెను. జయద్రథుని మ్లేచ్ఛభావతాడిత మయిన ప్రత్యుత్తరము సభాముఖముననే వ్యక్తమయ్యెను, అతని ద్రోహమునకు మరణదండనము విధింపబడెను. నాగార్జుననీలలు తమకుమార్తె సుభద్రను విజయున కప్పగించి వానప్రస్థమును స్వీకరించిరి, విజయసింహుడు మహాసేనానియయ్యెను. నిరంకుశు డుపసేనాని,

జయద్రధుడు సంహరింపబడెను. అతని కుమారుడయిన జయ ద్రధుడు తల్లిమైన దుస్సలచే సమయ స్వీకృతుడయ్యెను. ఆకల్పాంతము భగవద్విరోధము. నాస్తికభావ సంకలితముగా ప్రపంచకమును మార్చ వలెను. భార్యదుస్సల. తల్లిదుస్సల తండ్రిజయద్రధుడు. కుమారుడు జయద్రధుడు. ప్రమాణము ప్రతిసంతాన పరివ్యాప్తము. ఇది ఆ ప్రతిజ్ఞ "భ గ వ ం తు ని మీ ది ప గ"

## ౩. భగవంతునిమీదిపగ-ఇతివృత్త నిర్వహణము

ఒక్క జానశాసనపత్రము చారిత్రికవస్తువుగాస్వీకరించి రచ యిత యీ 'భగవంతునిమీదిపగ' యను నవల యందితివృత్తమును నిర్వహించెను. మిగిలిన భాగమంతయు కల్పనము. అల్పమైనచారిత్రాంశ ముతో నవల్పమైన కథాసంవిధానమును సమకూర్చుటకు హేతువు లెన్నియో ప్రప్రథమమున బరిశీలింపవలసి యున్నది.

1. జయద్రధునిపాత్రకు మహాభారతకథకు సన్నిహిత సంబంధ మున్నది. సోదరీసదృశయగు పాండవసతిని కామించి, పాండవులచే నవమతియై తదవమానమునకుకనలి క్రోధసముద్దీప్తుడై శివునిగురించి ఘోరతపముచేసి యచటను తన ప్రతినతీడుట యసంభవముకాగా నర్జున శరనికృత్తమైన తన శిరమే తనతండ్రి మరణమునకు హేతువయ్యెను. ఇంతవఱకు భారతకథ. ఇటనుండి పురాణవైరకథ ఈపాత్ర యితి వృత్తానుగుణ్యముగ క్రీ. శ. 1వ శతాబ్దివరకు కొనసాగింపబడినది. ఇదిలోకములోని యొక ప్రత్యేకదుష్టత్వమునకు చిరకాలానుగతస్థితి చిరంజీవితకు ప్రతీకయైన పాత్ర. జయద్రధపాత్ర నిర్మాణములోనిపరమ రహస్యమిది. మహాభారతాహవానంతరకథను క్రమానుగతమయిన చారిత్రికపాత్రలతో పరిచయముసమకూర్చు నాశయముతో నినవల వ్రాయబడినదనవచ్చును.

యుద్ధానంతరము కొద్దికాలమువరకు మాత్రమే హాస్తిన, కోసల రాజ్యములు తమయస్తిత్వమును నిలుపుకొన్నవి. బార్హద్రథవంశము జరాసంధవధతో ప్రాధాన్యము కోల్పడెను. జనమేజయుడు హాస్తిన నేలుచున్నప్పుడు చంద్రవంశమునకు కొంతగౌరవ ప్రాభవము లున్నవి. దీనిని తెలుపుట మరియొక ప్రయోజనము. మగధను రాజధానిగా జేసి కొని వేయేళ్లు బార్హద్రథులేలుట, పురాణము లావంశమునే పేర్కొనుట, మగధ సామ్రాజ్యముగ వాసికెక్కుట, అనంతర రాజవంశము లన్నియు నాంధ్రసామ్రాజ్యాంతమువరకు మగధ నాశ్రయించుకొని యుండుట, మిగిలిన రాజ్యము లల్పరాజ్యములయి రాజ్యాధిపతులు సామంతులవలె పరిగణింపబడుట-నివియన్నియు మగధరాజ్య వైభవ మును చెప్పకనే చెప్పుచున్నది. ఆ రాజ్యప్రాముఖ్యము విస్మృత మయ్యెను. ఇచయిత మగధనేలిన ప్రతిరాజవంశమున కొక నవలను రూపొందించుటకు ప్రణాళికను సిద్ధము చేసికొనెను. యుద్ధానంతర కాల పరిచయమున కీనవలను రచించినట్లు స్పష్టమగును.

2. మగధరాజ్య పరిధినుండియే రచనా ప్రణాళిక నారంభించి యున్నచో దక్షిణాపథముతో జనమేజయునకు సంబంధమున్న చారిత్ర కాంశము లుప్తమగును, చరిత్రకారులకు దీనిని విస్పష్టపఱచు ప్రమాణ పత్రమును ప్రచ్ఛన్న మొనర్చినట్లగును. తత్కారణమున నీయితివృత్త సంబంధితమైన యీ నవల యావశ్యకమైనదనుట తథ్యము.

3. తాను ప్రదర్శింపబోవు పురాణవైరమునకు ప్రతీకగా భగవ ద్వైర లక్షణములు, భావములు దిఙ్మాత్రముగా పరిచయము చేయబడు నుద్దేశము గూడ నీనవల రూపొందింపబడుటయు నొక హేతువు.

## 5. భగవంతునిమీదిపగ-శీర్షిక ;

కడువిచిత్రమయిన శీర్షికతో నీనవలామాలిక రూపొందినది. బహుదూరమయిన లక్ష్యమును్నినిర్దేశించుకొని యడుగువేచు నొకా

నొకదీర్ఘప్రహసనాత్మకరచనాకుశలుడు ప్రదర్శించునై పుణ్యముతో నీశీర్షికా వతరణ మొకభాగము. ఇది జయద్రథపాత్ర భాషణముగనుచో స్పష్టమగును.

"ఈ సృష్ట్యాదినుండి మేమొకప్పుడు రాక్షసులము, ఒకప్పుడు దస్యులము, ఒకప్పుడు మ్లేచ్ఛులము, ఒకప్పుడు యవనులము, ఒకప్పుడు హూణులము. మాబాధ మీకెప్పుడు తొలగినది"! (348) ఇందు పురాణవైరమునకు బీజమును గమనింపవచ్చును. "కొందఱు సంప్రదాయము నందిష్టము గలవారు. మరికొందఱు దాని నెదుర్చువారు. వారికి వీరికి నెప్పుడు విరోధమే. ఇదే పురాణవైరము (127) 'నేటి కొందఱు మనపురాణములు, మనవేదములు, శాస్త్రములు నబద్ధములు. నిన్నగాక మొన్న కన్నుదెఱచినవారు చెప్పెడి మాటలు నిజములు. దీనికే పురాణవైరమని పేరు," పే. 126.

ఈ మూడు నిర్వచనములు మహార్థవంతములు, ఇందారోహణ క్రమమునగల వాక్యసంపుటి యొకదాని కొకటి యుత్తరోత్తర ప్రాధాన్యము వహించును. పురాణవైర సామాన్యార్థముతో, చరిత్రార్థ సమన్వయము గల్గినట్టిది. రెండవది విశేషార్థము. సంప్రదాయార్థ సమన్వితము, మూడవది రహస్యార్థము, దుష్టసంస్కార బద్ధజీవున కన్వయము. వీనిని వివరించు భాగములు నవలయందు ప్రాధాన్యము వహించుటచే నీశీర్షిక ప్రాధాన్యము స్పష్టపడును. పండ్రెండు నవలకును ప్రధానశీర్షిక యిదియే. మిగిలిన నవలలకున్న శీర్షికలు శీర్షికా ప్రాయములు లేదా యుపశీర్షికలు. అదియునుగాక పురాణుడు భగవంతుడు. అతడు పురాతనుడు![12] ఆయన యందు వైరము భగవద్వైరము. అదియే పురాణవైరము. ఈ నవలకునుంచబడిన శీర్షిక

11. 'విష్ణు స్సర్వేషా మధిపతిః పరమః పురాణః' శ్రీమత్పరమాత్మికోపనిషత్ 1-1

12. (పురాతనః) కాలేనా పరిచ్ఛిన్నత్వాత్ పురాభవతీతి పురాతనః (శం. భా).

ప్రచ్ఛన్నముగా నీమహార్థములను నిండించుకొన్నది. ఈ శీర్షిక సంపుటమునందు నవలాకారుడు కడు వైలక్షణ్యమును ప్రదర్శించెను.

ఇక నితివృత్తనిర్వాహణమున చూపిన నైపుణ్యమును పరిశీలింతము. ఈ నవలకు రంగస్థల మాంధ్రదేశము. ధాన్యకటకము రాజధాని. నాటి కృష్ణానది, ఇంద్రకీలాద్రి, హంసలదీవి యిత్యాది ప్రదేశములను, తదనుబంధ సన్నివేశములును కల్పనాజనకములే. ఈ ప్రదేశము నధికాధికముగ వర్ణించిననే గాని శాసన విషయమును ప్రవేశపెట్టుటకు తగినయవకాశము లభింపదు.

జనమేజయమహారాజు ఆంధ్రదేశమును దర్శింప నావశ్యకత యేమి? కేవలము దానశాసనమును సమర్పించుటకు హస్తిననుండి రానేల? కేదారక్షేత్రములోని యుమామఠమునకు సమర్పించిన శాసనమునకు వలెనే పరోక్షవిధానము సమర్థనీయము కదా యనుచో నొక చక్కని సన్నివేశకల్పనముచే నీ విరోధమును తొలగించెను. రోమపాదుడు నాటియాంధ్రదేశపు రాజు. ఈతడు శ్రుతిస్మృతీతిహాసముల యందు ప్రత్యయము గలవాడు. విశేషించి యోగమార్గానురక్తుడు. దీనితో జనమేజయునకు రోమపాదునకు సాన్నిహిత్యము సంభవించెను. తాను వానప్రస్థమును స్వీకరింపబోవుచు శ్రీముఖుని పట్టాభిషేకపు టాహ్వానము పయి జనమేజయు డాంధ్రదేశమునకు విజయము చేసినట్లు కల్పనగావించి సమన్వయమును సాధించెను. శ్రీముఖుడు రోమపాదుని జ్యేష్ఠపుత్రుడు, యువరాజు. జనమేజయుని కాశ్మీరయాత్రయు నర్థవంతము. ఆయన చూడబోవుటతో నటగల చారిత్రక పురుషుడు, జనమేజయ సోదరుడయిన వారణదేవుని 'కాశ్మీరపాలన' మను చారిత్రకాంశమును పరిచయము గావించుటకువీలయ్యెను.

వినయశర్మపాత్ర పౌరాణికపాత్రగా బాహ్యదృష్టికి గోచరించును. అంతరమున నాతడొక రహస్యచారుని వోలె వర్తించును.

ఎంతటి సంప్రదాయజ్ఞుడైనను. బ్రాహ్మణధర్మానుగామి యయ్యును, రాజకార్యముల సమీమాంసకునిగా నెంచు లక్షణము విప్రుని యందుండి తీరవలయునని నిర్దేశించుటకు విజయశర్మపాత్రను నిర్మించెను. మూర్ఖుడు, కేలంగి పాత్రల యాంతర్యమును, సంతతపురములోని వారిసఖ్యలు గనిపట్టుటకు విజయశర్మ సతి జాహ్నవి యుపకరించునట్లుగా జేసెను. వీరెవరో తెలియకుండునట్టుల చివఱ వరకు నామార్మికతను గాపాడి కథాసంవిధానమునకు బిగువు కూర్చెను.

రోమపాదునికుమారులు ముగ్గురు మూడు విభిన్నమైన పాత్రలు. ఒకడు సుఖాన్వేషణా తత్పరుడయ్యును సంస్కారముగల ప్రాజ్ఞుడు విజయుడు సుఖభోగాభిలాషి. కాముకుడు. నాగార్జునుడు పరవైదుష్యము, పరప్రజ్ఞలపయి యాసలు మోసులెత్తికొనిన వివేకహీనుడు. ఈతనికి రాజ్య మొసలు సంపాదించి యీవలెను. దానిని వెనుక నుండి తనభార్య రాజనీతి పాలింప వలెను. రాజుగా తాను వ్యవహరించును. ఈ ప్రకృతిలో నీపాత్ర మలచబడెను. వీరి కనుకూలమయిన సతులే వీరికి లభించిరి. కాళింది పుండ్రదేశాధీశుని తనూజ. పట్టమహిషీత్వమునకు యోగ్యురాలు, విజయుని సతి భామ. ఒక లక్ష్యమును బెట్టుకొనకున్నను కాళింది ననుసరించును. ఇక నాగార్జునుని సతి నీల, వింతప్రకృతి. ఈ సమన్వయము చేత కవి రాజలక్షణములు, పట్టమహిషీత్వపు గౌరవాదరములను తత్తదర్హతనిరూపించినట్లయ్యెను.

<u>నిరంకుశుడు, గంగు</u> :- గంగు నిరంకుశునకు గురుస్థానీయుడు. ఒక సాధనకయి, ఒకని యందు స్పర్ధనర్థవంతముగా జయించుటకు విద్యావైదుష్యముల పరాకాష్టయే రాచబాట యను సత్యమును బోధించుటకు ప్రవేశపెట్టిన పాత్ర నిరంకుశుడు. జాంబవతి తన సోదరి. విజయునకు తనసోదరితో గల సంబంధము సయితము ఈతని

విద్యాస్పర్శనుజయింప లేదు. ఈ పాత్రల వలన కొన్ని క్షుద్రవిద్యలు, వాని యుత్తమాధమ వివేచనము పాఠకులకు పరిచయము చేసెను.

ఇతివృత్త పరిపోషణమునకు ప్రాసంగికేతివృత్తములు, కలవు.

## 4. ముఖ్యపాత్రలచిత్రణము

బహుపాత్ర సమన్వితమయిన నవల యిది. ఇందు జనమేజయుడు, హారణదేవుడు తక్క నితరపాత్రలన్నియు కల్పితములే. ఈ నవల యందున్న కొన్నిముఖ్యపాత్రలు పరిశీలనము చేయబడుచున్నవి.

శ్రీముఖుడు - ఆంధ్రరాజయిన రోమపాదుని ప్రథమ పుత్రుడీయన. యువరాజు. అనుభూతి వేళ సద్యోమరణము జన్మయొక్కచారితార్థ్యమని జయద్రథునిచే నుపదేశింపబడి చంద్రభాగాపతీవాహము వెంట, దుమికిన సాహసికుడు. జయద్రథుని కుట్ర యెఱుంగనిసాధుశీలి. అప్పటి దేశమందువ్యాప్తమయిన భగవద్గీత, బ్రహ్మసూత్రములు, పురాణాదులను జదివినవాడు. రాచరికపు లక్షణములుగలిగియు రాజ్యాసక్తి లేనివాడు. ఈతని భార్య కాళింది. సింధురాజతనయ. నవలయందీ పాత్రవైశిష్ట్యము రాజ్యాధికారము గ్రహించిన యనంతరము స్పష్టపడును. జనమేజయునకు యోగమార్గమున తనతండ్రి మరణించినట్లు ప్రకటించుట, జాంబవతిమరణమును సహజమరణముగా నిరూపణకు నిరంకుశునికాజ్ఞ యిచ్చుట, నాగార్జునునిచే విజయసింహునిపయి జరుపబడిన ప్రయోగమును రహస్యముగా ద్రిప్పజేయుట, విజయసింహునకు, నిరంకుశునకు సేనాపతి యుపసేనాపతుల పదవీప్రదానము-లివి శ్రీముఖుని రాజత్వమునకు వన్నెతెచ్చు సంఘటనలు. జయద్రథునకు మరణశిక్షయు నీతని దుష్టశిక్షణను వ్యక్తము చేయును.

విజయ నాగార్జునులు :- వీరిద్దరు శ్రీముఖుని సోదరులు.

ఇందు విజయసింహునకు రాజ్యస్వీకారాభిలాషకంటె కామినీ సమాలింగనాభిలాష హెచ్చు. తనసతి భామయందు రమణము తృప్తి కల్గించలేదు. నిరంకుశుని సోదరియైన జాంబవతిని ప్రేమించినాడు. విజయసింహునిపయి నిరంకుశునకు విద్వేషస్పర్థ యున్నది. విజయసింహుని సంహరించుయత్నము నిరంకుశు డొనర్చును జయద్రథునిచే నుపదేశింపబడిన పథకము నాగార్జునుని పరముగా నిర్వహింపబడు చుండెను. శ్రీముఖునిగా దెలియకనే యాయనను సంహరింప విజయసింహుడు, విజయసింహుని సంహరింప నిరంకుశుడు జాంబవతీ గృహాప్రాంగణమున యత్నించుచుండిరి. పథకము విఫలముకాగా నాగార్జునుడు రాజయిన శ్రీముఖునియెదుట పడుటకే నిశ్చయించుకొనిన ఋజువర్తనుడు, విజయసింహుని గాయము మాన్ప తన మంత్రశాస్త్రము ను ప్రయోగించిన భాతృవత్సలుడు. అంతటి రాజ్యకాంక్ష యింత యకాండతాండవము గావించినను వానప్రస్థమును గోరుకొనిన నిస్సంగుడు నాగార్జునుడు. ఈ రీతిగా నాగార్జునుని యందలి విభిన్నప్రకృతులను కవిప్రదర్శింపజేసి యాపాత్రపయి సానుభూతిని గల్గింపజేసెను.

రాజనతులు :- కాళిందీ భామ పాత్రల కంటె నధ్యయనము చేయవలసిన పాత్రనీల. ఈమెమైనపుముద్ద, సౌందర్యవతి. కనుకనే నాగార్జును డీమెపై నెన్నియో ఆశలు పెట్టుకొనెను. బాల్యమునుండి మ్లేచ్ఛభావమును జీర్ణించుకొన్నది. శేలంగి, దుస్సల దీనికి బోషకులు, ఈమెకు రాజ్యకాంక్షకంటె స్వేచ్ఛావర్తనమే యభిమతము. ఏ గూటిచిలక ఆ గూటె పలుకు పలుకును. అను న్యాయమును బోషించుట కీమె యొక యసంస్కారియయ్యును తుదకు జీవసహజమైన వివేకముతో తమకు తగినది వానప్రస్థమని పతితో నయాశ్రమము స్వీకరించినది. రచయిత యీమెద్వారమున నీపరమ రహస్యమును బోధింప నీపాత్రను సృజించి యుండెనేమో ?

కేలంగి - దుస్సల పాత్రలు :- 'కేలంగి బుద్ధి బహుమ్లేచ్ఛ కథా సంపుటి' కేలంగి నీలకు గురువు. వీలయినప్పుడెల్ల నామ్లేచ్ఛ కథలను నీలకు వినిపించును, నీల నొకవిధమయిన యసంస్కృతభావ పరీతగ నొనర్చుటకు రూపొందింపబడిన పాత్ర కేలంగి. ఈ విధ మయిన మ్లేచ్ఛభావదోషదూషితమైన మనోక్షేత్రము తనకనుకూలమని భావించినది దుస్సల. దుస్సలకు కాళింది దుస్సహ యయ్యెను. భామ దరికి చేరనీయదు, నీలకు చేయగలిగినంత చేయును. నీలవలన నాగారు నుడు జయద్రథునకు పట్టుపడవలెను. అనాదిగా నున్న స్వచ్ఛమయిన సంప్రదాయములను నిస్సంకోచముగా నిర్మూలము చేయవలెనను తీవ్ర శపథముతో జీవనయాత్ర సాగించెడి తల్లి కొడుకులు దుస్సలా జయ ద్రథులు, వీరు రహోవర్తనులు, తమ పథకమెంత జాగ్రత్తగా ప్రయ త్నించి నిర్వర్తించినను నదియధర్మ మగుటచే ఫలింపలేదు. ఇది సృష్టి పరమరహస్యమని వ్యక్త మొనర్చుటయే రచయిత లక్ష్యము.

కులకనంది - గంగు - నిరంకుశులు :- గంగు పాత్ర కొక ప్రయోజనమును కవి సాధించినాడు. నిరంకుశుడొక గ్రామాధికారి. ఆ గ్రామము దోబుపట్టు, నిరంకుశునకు శ్రీముఖుని తమ్ముడయిన విజయసింహునకు ఖడ్గవిద్యావిషయమున స్పర్థకలదు. సర్వవిషయముల నా విజయుని మించవలెనని నిరంకుశుని తీవ్రతపన, గంగు దానికి తోడుపడినాడు, తనకడనున్న 'కాలంజరి' విద్యను మంత్రపూర్వక ముగ, చంద్రోపరాగసమయమున నుపదేశించెను. ఇది మ్లేచ్ఛవిద్య. దీనినే విజయసింహునిపయి ప్రయోగింపవలసి వచ్చినది, ఈ విద్య నుపదేశింప ప్రోత్సహించినది జయద్రథుడు. అతడును కులకనంది శిష్యు డిగా బరిచయము చేయబడి గంగునకు బూర్వస్మృతులను గల్గింప జేయుటలో నీవృత్తాంతము స్పష్టమయినది. కాని యిచట నితివృత్తము

భారమయినట్లుగా శాకులు భావించుటకు వీలొసంగుచున్నది. గంగు యొక్క విస్తృతదేశపర్యాటకమునకు పరిచయమునకు పాత్రమిది యుపకరించును. కులకనంది రాము దేశవాటి ఈతడు గంగునకు విద్య నేర్పిన గురువు, ఈ పాత్రవలన మ్లేచ్ఛవిద్యలు, వానికి గల ప్రాభవము, వాని కొనర్పవలసిన నీచకార్యములు జుగుప్సావహమయిన పద్ధతులను బరిచయమొనర్చుటను, వైదికవిద్యలు పోనికంటె పరమార్థమును సాధించిపెట్టగలవని నిరూపణమొనర్చుట యిందలి విషయము.

వినయశర్మ - చంద్రశేఖరవర్మలు :- వీరి మేధావిలసనమే యీ నవల యంతటను బ్రపంచింపబడినది. శ్రీముఖుని సంరక్షించుటలో నారంభమున చంద్రశేఖరవర్మ, మధ్యయందు వినయశర్మ బాధ్యత వహించిరి. వినయశర్మ భార్యజాహ్నవి. యంతఃపుర పరిశీలనమొనర్చి కాళింది యోగ్యతను పట్టమహిషీత్వార్హతను నిర్ణయించినది. వీరు హస్తినకుజెందిన గూఢచారులని తెలియనీయకుండునటుల రచయిత యితివృత్తమును నిర్వహించినాడు. నవలలోని సంభాషణలో-

జాహ్నవి :- (తన కుమారునుద్దేశించి) వట్టి యుద్యోగి యయనచో నేను తొందరపడుదాననుగాను, గూఢచారి దళాధిపతి కను కనే తొందర పడుచున్నాను.

వినయశర్మ :- వినచో నన్ను గురించి కూడ తొందరపడవలెను. నిజమేలే ! నేను వృద్ధుడను. ఎట్లయిన నీ కేమి? పేజి 175.

వినయశర్మ మాటలో నాతని యుద్యోగము స్పృశింపబడలేదా? ఇది శ్రీవిశ్వనాథుని ప్రతిభకు అద్దము. వినయశర్మ, చంద్రశేఖర వర్మల విశ్వరూపము శ్రీముఖుడు రాజయిన యనంతరము స్పష్ట మగును. శ్రీముఖుని రాజ్యపాలన సామర్థ్యమును గురించి సర్వము జనమేజయున కెఱింగించి యుందురు, సందేహములేదు. కాని నవల యందదిద్యోతకముకాదు, కానిచ్చినచో నవలాకర్త విశ్వనాథ కాడు.

జయద్రథుడు :- ప్రతినాయకపాత్ర. ప్రధానపాత్ర ఎంత నైపుణ్యముతో, నేర్పుతో నీపాత్రను మలచెనో దిఙ్మాత్రముగా ప్రదర్శింపబడుచున్నది. ఈ పాత్రతో సంబంధములేని పాత్రలేదు. ముస్సలతో సమావేశము గాని స్త్రీ పాత్రయు లేదు.

శ్రీముఖునితో లిప్సైకదేశసుఖానుభూతి పరమప్రమోదమని రెచ్చగొట్టి యాతని యడ్డుతొలగింప దలచిన యితివృత్తముతో నీనవల ప్రారంభింపబడినది. చంద్రశేఖరవర్మయను అంతరంగికపుటుద్యోగిచే శ్రీముఖుడు రక్షింపబడెను. ఆ పథకముపీగిపోయెను. విజయసింహునితో సమాగమము నభిలషించెను గాని సమకూడలేదు. నాగార్జునునితో యథేచ్ఛగా సంభాషించి యాతనికి దనపయి యానుకూల్యము పుట్టించి తనపథకమైన మ్లేచ్ఛరాజ్యస్థాపనను కొనసాగింతమనుకొనెను గాని ఈతనికంటె నాగార్జునుడు గండరగండడు. జయద్రథుడే ఒప్పుకొనిన సందర్భము—

'నాగార్జునుడు సహజముగా విపరీతబుద్ధి. మ్లేచ్ఛభావము లంకాదరము లేదు. అనాదరము లేదు. యక్షిణి గుఱించి తాను చేసిన కృత్యమును నాగార్జునుడు గ్రహించియే యుండెను. 'ఏమయ్యా! ఆ గుహాలో వెనుక నింకొక గూడున్నదా! ఆ ముసలిదాని నందులోనికి బంపించితివని యడుగును. తెల్లబోవుట జయద్రథుని వంతు, తానేమయన చెప్పబోయినచో 'నాగార్జునుడు నిర్వికారముగ నవ్వును'— 'నాకు దెలియునులే యనును' పేజీ 236.

జయద్రథు డనుకొనినంత సులభుడు కాడు నాగార్జునుడు. అక్కడనుండి పథకమును నాగార్జునుడే వేసెను. జయద్రథుడు బంధితుడయ్యెను, శ్రీముఖుని యెదుట తనసర్వదుష్ట ప్రయత్నములు ప్రపంచింపబడెను. దుష్టసంప్రదాయపరిపోషకులకు విధించవలసిన మరణదండన విధింపబడెను. అపుడు జయద్రథుని మాటలు—

"ఈ విరోధము ప్రళయాంతము మీకు తప్పదు" భగవద్వైరము కొన్ని జీవులకు గల్పాంతము, ప్రళయాంతము, జన్మాంతము. ఇట్టివి యెన్నియో వైనములు.

ఈ పాత్రను గుఱించి శ్రీవిశ్వనాథ విస్పష్టము చేసినతీరు తాను నిర్వహించనున్న ప్రణాళికాస్వరూపమును ప్రదర్శించినట్లే యున్నది. 340వ పేజీలోని అంశమును బరికించినచో నవగతము కాగల సత్యమిది. మే మొకప్పుడు రాక్షసులమనగా భగవద్వైరము బూని రాక్షసులు సృష్టిని విచ్ఛిన్నము చేయ ప్రయత్నించిన కృతయుగములోని హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, త్రేతలోని రావణ, కుంభకర్ణులు, ద్వాపరమందలి శిశుపాల దంతవక్త్రులు స్పృశింపబడిరి. రాక్షసులు సురద్విషులు కదా! మ్లేచ్ఛుల మనుటలో ధర్మచ్యుతులయిన వారిని మ్లేచ్ఛులని మనపూర్వులు వీరికి దేశనిష్కాసన శిక్షవిధించిరనియు, వారడవులలో, కొండలలో స్థావరములు సంపాదించుకొని రాజ్యము లేలెడి ప్రకృతులయి యుండిరనియు, వారికే దీక్షవహించిన ధర్మభ్రష్టులనియు పెద్దల విశ్వాసము. యవనులు యవనదేశములందు పాలనము కొనసాగించి భారతదేశమును కొల్లగొట్టి సంపదనంతటిని సొంతము చేసికొనవలెననెడి దుష్టభావన గలవారు. హూణులన నాంగ్లేయులు, వీరు భారతదేశచరిత్రనే మార్పుచేసిన ప్రబుద్ధులు. ఇట్టి వీరి బెడద సృష్ట్యాది నుండి కలదని చెప్పి వారి స్వరూపములను రచయిత వెల్లడిచేసినాడు. తానొక తీవ్రమయిన ప్రతినకు గట్టుబడి రహోవర్తనము నడుపుచుంటినని జయద్రథుడు శ్రీముఖునితో వాచ్యము చేసెను. తాను ముందు కూడ నేదియో రూపమున ప్రత్యక్షమయి ధర్మవిఘాతము కల్గింతునని వ్యంగ్యము చేయబడినది. దీనితో జయద్రథుని పాత్ర యీ నవలామాలికయందు ననుస్యూతముగ సాగుచుండునని రచయిత నిర్దేశించి నట్లయ్యెను. ప్రతి నాయక ప్రాధాన్యమెట్టిదియో దీనివలన స్పష్టపడినట్లే కదా!

వర్ణనలు :- కావ్యకుటీర ప్రాంగణమున దీర్చిన రంగవల్లికలు వర్ణనలు. ఇవి కావ్యసౌందర్యమునకు దోహద మొనర్చుననుటలో విప్రతిపత్తి లేదు. రచయిత మహాకవి యగుచో ప్రక్రియ యేదియయినను నందు గవిత్వపుఛాయ దృశ్యమగుట తథ్యము, ఈ నవలయందు సన్నివేశానుగుణమయిన వర్ణనలు పఠితృ పఠనాభిలాషను వృద్ధిచేయుట కుపకరించుచున్నవి. వానిని దిఙ్మాత్రముగా బరిశీలింతము.

ఆరంభమున నిదాఘవర్ణనము. లోకోత్తరమైన, సునిశితమైన పరిశీలనాదృష్టికిది ప్రతీక, వెంటనే జలపాత వర్ణనముతో తరుచ్ఛాయా శీకరసమావిర్భావ మొక వింతయనుభూతిగా మలచి దానిని వర్ణించినాడు. శ్రీముఖుని తీవ్రప్రకృతికి జయద్రథుని నిశిత పరిశీలనాదృష్టికి నీ వర్ణనలు దర్పణస్థానీయము లనునట్లుగా నిర్వహించెను.

"ఈ నదీజీవితములో నీజలపాతము, నీలోయ, యీపవిత్రౌషధీ నికాయసమావిర్భావము నిదియొక విచిత్రమయిన యనుభూతి 'ఏతదనుభూతి నిత్యతాపరమమాహేశ్వరీదేవి. ఈనదీదేవత పరమా దృష్టవంతురాలు."

2. ప్రతివిషయము నందు దైవత్వమును జూడగల్గిన రచయితకు జగద్దర్శనము దైవదర్శన మనుటలో వింతయేమి ?

నాటి ప్రభువులకుగల సంపదలో గోసంపద యొక భాగము. భారతములోని యరణ్యపర్వమున నీ గోకదంబవర్ణము నెట్టన గావించెను, కాని శ్రీ విశ్వనాథ గోకదంబమును గాంచుడు.

"అచట గొన్నివేల పశువులు గలవు. ఎఱ్ఱావులు, తెల్లావులు, దోరావులు, మొగాన మచ్చలుగల యావులు, పొట్టివి, భారీయావులు, పలువిధములయిన గోవుల సమూహములు తొట్టిపట్టున గలవు." తెలుగు నుడికారపు సొంపుతో నీయాలమందను చిత్రవిచిత్రముగా

పాఠకుడు దర్శించును. వర్ణనలో తెలుగు నుడికారపు సొంపు ఎంత మధురమో సంస్కృతసమాస నిబిడితతోడి వర్ణనము నంత ద్రఢిమమే యగును. సూర్యోదయ వర్ణనలో-

ఉదయదంభోజాత బంధుమందార కుసుమసందోహారుణకిరణ సంతాన తంతన్యమాన ధరణీరుహ కిసాలయచ్ఛవిచ్ఛటా పరిదీప్త మైన యాప్రదేశము నాకబలి ముగ్గులు పెట్టినట్లుండినదట. అలమంద గల ప్రదేశమున సూర్యోదయమును పాఠకుడిట్లు దర్శించును. ఈ సూర్యోదయముననే బహూపమా సమన్వితముగా నుడికారముతో వర్ణించినతీరు పాఠకుని కిలికింతలు పెట్టును,

"తూరుపున బారిజాతపుపూలు చల్లినట్లు, తెల్లగన్నేరు పూలు వికసించినట్లు, సితపుండరీకములు వికసించినట్లు, తెలిముద్దమందారములు విశీర్ణము లయినట్లు తెల్లావుల మందలు విహరించినట్లు, సిత వాలుకాప్రదేశములు పాతర్వాయువులను చిన్నచిన్న మెట్లుగా నలంకరింపబడినట్లు-" ఇట్లు కొనసాగినది. పేజీ 314.

శృంగారానుభావ వర్ణనము :- నీలపై నాగార్జునునకు ప్రేమ గుదురుకొను సన్నివేశమున చేయబడినది. "బుజములు బుజములు రాచుకొని తిరుగుటలు హేలాదృక్ప్రసారములు మధురమందహాస వికాసములు......కామభావనా దృఢీకరణములు..." ఇత్యాద్యను భావ ప్రకరణము లలితపదసంయుతాల్పసమాసములలో రమణీయముగ కొనసాగినది. ఇంకను ఉత్సవసందర్భమున ఖడ్గవిద్యాప్రదర్శనము (33) వివాహవర్ణనము (146, 147, 148) కృష్ణానదీవర్ణనము (226, 229) శృంగారవర్ణనములు (260, 261) పేర్కొనదగినవి.

వాక్యవిన్యాసము :- నవలయందు వాక్యరచన మొకకళ పేలవమయిన వాక్యసంపుటి రసావిర్భావమును కల్గింపలేక పాఠకుని

సంతృప్తికి దూరముచేయును. కాని మహాసారస్వతనిర్మాత యగు వాని రచనలో విచిత్రమై, విశిష్టమైన వాక్యవిన్యాసమే పాఠకుని పట్టి చదివించును. ఈ వాక్యవిన్యాసము నవలయంతయు నిండియున్నను కొన్ని ముఖ్యమైన తావులందు మాత్రము బరిశీలింతము.

స్నేహమును గుఱించి చెప్పుచు కొందఱు స్నేహము చేయు కొలది నింకను కొనసాగింపవలెననియే యుండునని చెప్పెదు సన్నివేశమున శ్రీ విశ్వనాథవారి "అతని స్నేహము మద్యము వంటిది. అనుభవించిన కొలది మత్తెక్కించును."(పేజి 9), ఇందు మద్యమువంటి స్నేహము విడువవలెనను ధ్వని యున్నది.

విద్యానిపుణుల ప్రకృతి గుఱించి జంతువులలో నన్వయించి చెప్పుచు జంతుస్వభావమును ప్రకటించుట యీ వాక్యములందలి ప్రత్యేకత.

"ధనుర్విద్యానిపుణుని ప్రకృతి పొంచియున్న పెద్దపులి లక్షణము." "గదావిద్యానిపుణుని ప్రకృతి మత్తేభ ప్రకృతి." "ఖడ్గవిద్యానిపుణుని పద్ధతి పీరికంటె పెఱ యయినది. వాడు త్రాచుపాము వంటి వాడు." ఇందు ఏ పీరునకెట్టి స్వభావమున్న రాణించునో స్పష్టము చేయుట గమనింపగలము.

<u>నిర్వచనములు</u> :- శ్రీ విశ్వనాథ కొన్ని చిత్రములైన నిర్వచనములు చేయును. ఆపదములు నిత్యవ్యవహారములో నున్నను వాని నిర్వచనముల జోలికి పోయెడివారు స్వల్పము. అట్టివానికి స్పష్టార్థ ప్రతిపత్తిని గల్గించుటలో నీయన నిపుణుడు.

ప్రతిభయనగా "ఒకానొకనికొక్కొక్క విద్యయందుగల ప్రతిభాసంపత్తి సంప్రదాయబద్ధమై సంప్రదాయేతర విషయమన్నట్లు భాసించి చర్చింపబడినచో సంప్రదాయబద్ధమైనదిగనే నిరూపించ

బడును. దానినే ప్రతిభ యందురు,'' (పేజి 48) ఇది ప్రతిభకు నిర్వచన మని చెప్పవీలులేదు. ఇందు భగవద్వైరనిరూపణప్రక్రియ యెట్లు నవలయందనుసంధింపబడినదో నిర్వచింపబడిన ప్రణాళిక ధ్వనించు చున్నది. ఇప్పుడు ప్రతిభకు నిర్వచనము చూడుడు-'ప్రతిభయనగా దాను నేర్చినవిద్యయందుగల సర్వదేశములందు ప్రత్యేక ప్రత్యేకో పాసన చేసి సాధించినట్లుగా నిత్యవ్యగ్రత కల్గియుండుట.'-(పేజి 48) ప్రతిభా రహితునకు ప్రతిభావంతునకు గల భేదమిది.

"ప్రతిభారహితుడు క్రమబద్ధముగా ననుసరించును. కాని ప్రతి భావంతుడు క్రమరహితముగా సర్వప్రదేశములయందు నెచ్చటబడిన నచ్చట హఠాత్తుగా నైనను సరే తానుమేల్కొనిన వాడయి ప్రవర్తించును." పేజి 46. విద్యకు చదువుకు గల భేదము-

"కొన్నివిద్యలు ముఖము నందుండునవి. కొన్నివిద్యలుచేతిలో నుండునవి. ముఖములోనుండు విద్యపేరు చదువు. చేతిలోనుండు విద్యపేరే విద్య." (పేజి 144)

చమత్కారము:- పాశ్చాత్యులు చెప్పిన తారుమారు చరిత్రకు చిత్రమయిన చమత్కృతిని నెఱపెను. రాజు పూర్వుల పేర్లనడిగెడి యొకరాజు, వానిని చెప్పెడి గడుసుకథకుడు యిందలి పాత్రలు.

"గడచిన కాలమును గుఱించి పలుమందికి దెలియదు, యథేచ్ఛ ముగా నూహింపవచ్చును. వ్రాయవచ్చును. ఏవడో సాహసి తన యిష్టమువచ్చినట్లు వ్రాయును. అవివేకులు వానిని విశ్వసింతురు ఎల్లరును సోమరులు, పరులు చెప్పిన దానిని వెంటనే అంగీకరింతురు." (పేజి 125). ఇందు వ్రాసిన వారాంగ్లేయులు. విశ్వసించినవారు భారతీయులు. వ్రాసినది భారతదేశపు ప్రాచీన చరిత్ర. ఇందు ధ్వనితో రచయిత వేదనయు స్పష్టమగుచున్నది.

ఉపాసనలు :- రచయిత తానురించిన ప్రతినవలయందును వైదిక, వైదికేతర విద్యలను కొన్నింటిని పరిచయము చేసెను ప్రాచీనమునుండియు నీవిద్యలు మనదేశమున వ్యవహారములో నున్నవి. నేడు వీనికి నామమాత్రపుటునికి లేదు. నాడు తీవ్రవ్రతులైన వారిసురప్రకృతియందైనను, దైవీప్రకృతియందైనను తద్విద్యకొఱకు పరిశ్రమించెడివారు, పరపాలనము చేత గాని, సాంఘికముగా నావిద్య లకు గౌరవాదరములు సన్నగిల్లుటచేతగాని లుప్తమైనవి. వైదికవిద్యల పరమార్థము మోక్షము, జన్మరాహిత్యము. తాంత్రికవిద్యల పర మార్థము జనులనుప్రతారించుట. అట్టి విద్యలలో కొన్నింటిని పరిచయముచేసి వానిపరమార్థము నాయన పాత్రలద్వారమున నే వెల్లడించెను.

గంగు తనకుమారునిచే నొకకోటి రామమంత్రము నుపాసింప జేసి తానునేర్చిన తుచ్ఛమంత్రమును వానిపై ప్రయోగించెను. కాని కుమారుని మంత్రశక్తికి వీగిపోయెను. వైదికమంత్రోపాసనమాత్మరక్షో పాయ ద్రఢిమగలదని నిరూపించుటయే యిందలి పరమార్థము. మంతారం త్రాయతీతి మంత్రః' యని మంత్రశబ్దమునకు వ్యుత్పత్తి.

తుచ్ఛవిద్యలలో బగళావిద్య పేర్కొనబడినది. బగళాదేవతను గుఱించి శత్రుమారకతంత్రముగా గంగు నిరంకుశున కుపదేశించినట్లు రచయిత తద్విద్యాపరిచయము గావించెను. 'సర్వదుష్టానాంవాచం ముఖం స్తంభయ' యనునది దీని సంకల్పము.

1) స్తంభనకారిణీ, 2) ఉల్కాముఖీ, 3) జాతవేదముఖీ 4) జ్వాలాముఖీ, 5) బృహద్భానుముఖీ. అను నైదువిధములుగ నీ మంత్రోపాసన గలదు. మూర్తిధ్యాన మీ క్రింది విధముగా నున్నది.

చతుర్భుజాం త్రినయనాం కమలాసన సంస్థితాం
త్రిశూలాం పానపాత్రంచ గదాం జిహ్వాంచ బిభ్రతీం
బింబోష్ఠీం కంబుకంఠీంచ సమపీన పయోధరాం
పీతాంబరాం మదాఘూర్ణాం ధ్యాయే బ్రహ్మాస్త్ర దేవతా

యథావిధిగా సంగన్యాసకరన్యాసములతో నీదేవతా మంత్రమును గురుముఖముగా నుపదేశింపబడి యుపాసింపవలయును. ఇట్లే వైదికవిద్యలందు అక్షిపురుషోపాసనము. అగ్న్యుపాసనములు, తాంత్రికవిద్యలందు కాలంజరివిద్య చేర్చఁబడినవి.,

• బృహదారణ్యకము, ఛాందోగ్యములందు అక్షిపురుషోపాసన కలదు. అగ్న్యుపాసనకు ప్రాణాగ్నిహోత్ర విధానమునకు కొందరు ప్రాధాన్యమిత్తురు.

బగళామూర్తిని శ్రీ అరవిందుడు ధ్యానించినట్లు వారిజీవిత గ్రంథమున వ్రాయబడెను, ఆ మూర్తి యాకారము అతిభీకరము. స్థూలము. పీతవర్ణ. పీతాంబరధారిణి. ఒకహస్తమున ముద్గరము, పాశము, మరొక హస్తమున శత్రువును గదాఘాతమున బరిపీడితుని జేయుచు వానిజిహ్వాగ్రమున భరించియుండెను.*

అరవింద జీవితము. (తెలుగు) క్రీ. శే సి. హెచ్. వెంకటకృష్ణయ్య పేజి 53

# 2. నాస్తిక ధూమము

—చారిత్రకపూర్వరంగము – మగధ సామ్రాజ్య పాలకులు—

బార్హద్రథులు మహాభారతయుద్ధకాలమునకు పూర్వము కొన్ని వందలయేడులనుండి మగధను పాలించుచుండిరి. వైవస్వత మనువు నుండి 31వ రాజు సంవరణుడు. అతనికి కురు డుదయించెను. ఈయన పేరనే కురువంశము స్థాపనమయ్యెను. ఈతడు తన రాజధానిని ప్రయాగనుండి కురుక్షేత్రమునకు దరలించెను. ఈతనికి నలుగురు కుమారులు. సుధన్వుడు, పరీక్షిత్తు, ప్రజనుడు, జిష్ణు డనువారు. వీరిలో సుధన్వుడు ప్రభువయ్యెను. ఈయననుండి యాఱవప్రభువు చైద్యనాముడు. ప్రతీపుడనియు నుపరిచర వసువనియు నామాంతరము లీయనివి. ఈయన పుత్రుడు మొదటిబృహద్రథుడు. ఈయన తన రాజ్యమును కురుక్షేత్రమునుండి మగధకు సమీపమునగల గిరివ్రజమునకు మార్పుచేసెను. అది మగధ సామ్రాజ్యముగా వ్యవహరింపనయ్యెను. గిరివ్రజమునకు రాజగృహమనియు నామాంతరము. ఇది మత్స్యపురాణములో 50వ యధ్యాయమున నున్నది.

మహాభారతమందలి సభాపర్వమున నైదధ్యాయములలో నీ వంశచరిత్ర కలదు.

ఉపరిచరవసువు యొక్క ప్రథమసూతి మొదటి బృహద్రథుడు. ఈతడు చంద్రవంశీయుడయిన కురుప్రభువున కాఱవవాడు. ఇంతదనుక రాజధానిగనుండిన కురుక్షేత్రమును వదలి గిరివ్రజమును నూతనరాజధానిగ నొనర్చుకొని మగధసామ్రాజ్యమును స్థాపించెను. ఇది కలి ప్రారంభమునకు 600 యేండ్ల నాటివృత్తాంతము. మొదటి బృహద్రథునినుండి 9వ వాడు రెండవబృహద్రథుడు. ఈత డిరువురు కాశీరాజకన్యకలను పెండ్లియాడెను. చండకౌశికుడను మహర్షి యను

గ్రహముచే నమితబలశాలి యగు జరాసంధుని కుమారుని బొందెను ఈ జరాసంధుడే శ్రీకృష్ణుని పదునెన్మిదిపర్యాయములు పరాజితుని గావించెను. అనంతరము కృష్ణార్జునసమేతుడై వచ్చిన భీమునితో గదా యుద్ధము చేసి యాతనిచే మడిసెను.

జరాసంధుని పుత్రుడు సహదేవుడు. ఈతడు భారతరణమున కౌరవపక్షమున బోరి స్వర్గ మలంకరించెను. ఈతని కొడుకు మార్జారి. యుధిష్ఠిరునకు సమకాలీనుడు. మార్జారి, కొడుకు శ్రుతశ్రవుడు, జనమే జయునకు సమకాలీన ప్రభువు. సోమాధి లేక మార్జారి నుండి యిరువది రెండవ ప్రభువు మన కథాకాలమునాటి రిపుంజయుడు. ఈయనతో బార్హద్రథవంశ మంతరించి ప్రద్యోతవంశము మగధ సింహాసన మధిష్ఠించునట్లు పురాణములు పేర్కొన్నవి

ఉపరిచరవసువు కుమారుడయిన యొకటవబృహద్రథుని నుండి రిపుంజయునివరకు ముప్పదియిద్దరురాజులు మగధనేలిరి. పురాణములు మహాభారతయుద్ధకాలము నుండియే రాజులను వారి పాలనకాలమును లెక్కించినవి. బార్హద్రథులైన ఇరువదియిద్దరు రాజులు వేయి సంవత్సరములు పాలించినట్లు పురాణకథనము.[1]

---

1. "ద్వావింశతి నృపా హ్యేతే భవితారో బృహద్రథాః ।
పూర్ణం వర్ష సహస్రంతు తేషాం రాజ్యం భవిష్యతి॥"
మ. పు. xcl x 308 శ్లో.

వాయు, బ్రహ్మాండపురాణము లందెట్టిమార్పు లేక ఈ శ్లోకమున్నది.

"బార్హద్రథశ్చ భూపాలా భావ్యాః సహస్ర వత్సరమ్ ।
" భాగ. 9-22-49

"ఇత్యేతే బార్హద్రథాః భూపతయో వర్ష సహస్రమేకం భవిష్యతి॥"
వి. పు. 4-23-12 శ్లో

ఇక పిమ్మట నందు బార్హద్రథులలో చివరివాడైన రిపుంజయుడు పాలించుచుండగా నాతని మంత్రి, మహాసేనానియునైన మునీకుడు సర్వాధిపత్యము స్వీకరించి యుండెను. ఈ మునీకుని పులకుడనియు పురాణములు వ్యవహరించినవి. మునీకుడు రిపుంజయుని క్రూరముగా జంపి ప్రజలయందు తనపయిగల్గిన యసహ్యాతను, విప్లవమును నేర్పుతో నప్పించుకొనుటకై తనకుమారుడయిన ప్రద్యోతుని మగధరాజ్యమున ప్రతిష్ఠించెను. అంతట ప్రద్యోతవంశము మగధరాజ్యమును బాలించును. వీరు మగధను 138 సంవత్సరములు పాలించిరి. పాలనకాలమును పెక్కు పురాణములు 138 సంవత్సరములని, ఐదుగురు ప్రద్యోతులనియు జెప్పియుండుటంచేసి దానిని ప్రమాణముగా గ్రహించుట లెస్స. [2]

ప్రద్యోతుడు, పాలకుడు, విశాఖయూపుడు, జనకుడు, నందివర్ధనులవారు పంచప్రద్యోతులు !

ఇందుమాత్రము 152 సంవత్సరములు పాలనకాలముగా జెప్పినిన యంశము గమనార్హము. ప్రద్యోతులైదుగురను విషయమున మార్పు లేదు.

---

"ద్వావింశతి నృపా హ్యేతే బార్హద్రథ కులోద్భవాః"
పూర్ణం వర్ష సహస్రం వై భోక్ష్యన్తి మాగధాన్ కలౌ!"
క. రా. వృ. 3-1-24.

నందివర్ధన స్తత్పుత్రః పంచప్రద్యోతనా ఇమే ।
అష్టత్రింశోత్తరం భోక్ష్యన్తి పృథివీం నృపాః॥ భాగ. 12-2-4

అష్టత్రింశచ్ఛతం భావ్యాః ప్రద్యోతాః పంచతే నృపాః ॥
వాయు, బ్రహ్మాండ.

as taken from Anecient Indian History Part-I P. 36.
ద్విపంచాశచ్ఛతే భుక్త్వా ప్రణష్టా పంచతే నృపాః॥ మ. పు. 270-5

మత్స్యపురాణమున—

బృహాద్రథే ష్వతీతేషు వీతిహోత్రే ష్వవంతిషు ।
పులకః స్వామినం హత్వా స్వపుత్ర మభిషేక్ష్యతి । ౪
మిషతాం క్షత్రియాణాంతు బాలకః పులకోద్భవః ।
సవై ప్రణత సామన్తో భవిష్యో నయవర్జితః ॥ 5

బార్హద్రథులు మగధను వీతిహోత్రు లవంతిని పాలించిన యనంతరము పులకుడు తన స్వామియైన రిపుంజయుని సంహరించి తన పుత్రుని మగధసింహాసనముపై నధిష్ఠింప జేసెను. పులకసుతుడయిన బాలకుడు క్షత్రియుల నందఱను వీక్షణ మాత్రముననే తన సామంతులుగా నొనర్చుకొని రాజనీతిని నెఱపునని' భావమయియున్నది. కాని దీనికి పలువురు పండితులు భిన్నవ్యాఖ్యానములను జేసిరి.[3]

---

యోఽయం రిపుంజయో నామ బార్హద్రథో న్త్యః। తస్యామాత్యో మునికో నామ భవిష్యతి సచైనం స్వామినం హత్వా స్వపుత్ర ప్రద్యోత నామానభిషేక్ష్యతి। తస్యాపి బలాకనామా పుత్రో భవితా। తతశ్చ విశాఖయూపః। తత్పుత్రో జనకః। తస్యచ నంది వర్ధనః। తతో నందీ (?) ఇత్యేతే షట్త్రింశ దుత్తర మష్టశతం పంచ ప్రద్యోతాః పృథివీం భోక్ష్యన్తి। 8

వి. పు. 4-24.

(838) సంవత్సరములుగా జెప్పుట 'తతోనందీ' యని అరువవానిని జెప్పుట ప్రామాదికమని శ్రీకోట వారిమాట. పంచ ప్రద్యోతులనియే యీ పురాణమును బేర్కొనుట గమనార్హము. కాని యమ్. కృష్ణమాచార్యులుగారు వ్రాసిన "The History of Classical Sanskrit Literature"నందు నిట్టి దోషము లేని మరియొక విష్ణుపురాణములోని శ్లోకమును ప్రకటించియుండిరి. "పంచ ప్రద్యోతనాఇమే అష్టత్రింశోత్తరశతం భోక్ష్యన్తి పృథివీం నృపాః।"

XII - II Intro. P XIV.

When the Barhadradhas, the vitihotras and Avanthins have passed away, pulaka after killing his master (King

బార్హద్రథులు మగధను, వీతిహోత్రులు అవంతిని పాలించిన యనంతరమని కోటవారభిప్రాయపడగా కృష్ణమాచార్యుల వారు బార్హద్రథులు, వీతిహోత్రులు, అవంతినులు అని మూడుగా జేసిరి.[4] ఇది విచారణీయాంశము. పులకుడు తన స్వామియైన రిపుంజయుని సంహరించుట, తనపుత్రుని యువరాజ్యమందభిషేకించుట, దానికి కారణముగా మత్స్యపురాణములోని యంశము నుదహరించుట, పులకుని కుమారుడయిన బాలకుడు పరిసరరాజ్యవిస్తరణ కాంక్షతో సామంతులనుగా ప్రభువుల నొనర్చుట - నివి యన్నియు సమముగనే స్వీకరింప బడినవి. ఇది యిట్లుండగా ప్రద్యోతులు మగధను పాలింపనే లేదనియు, శిశునాగుల విషయమున, నిదియే సంభవించిన దనియుగనుక వారి వంశములను మగధరాజవంశావళిలో గాక అవంతీపాలకుల క్రమములో నుండవలెననియు డి. ఆర్. మన్కడ్ గారు తమ పరిశోధన గ్రంథములో తెలిపియున్నారు.[4] ఈ విషయములను చారిత్రకులు

---

Ripunjaya) will install his Balaka as his king. The son of Pulaka, will in the very sight of the Kshtriyas of his time subjugate these neighbouring kings by force and will be devoid of Royal policy''.

"Instead of crowning himself as king against the wishes of the people, pulaka got the only daughter of Ripunjaya married to his son pradyotana and installed him on the throne". Ibtd. P. IXIV.

(ii) "When the Barhadradhas, the vitihotras of Avanitles have passed away" (Palaka after killing his master (King Rupunjaya) మ. పు. ఇంత వరకు మాత్రమే భేదము.

4. "Pradyotas ruled at Avanthi and not at Magadha. Therefore they should have no place in the magadha lists...... Saisunaga list also as it is found at present, is not what is was originally."

బరిశీలించ వలసియున్నది. పర్గీటరు అభిప్రాయము ప్రామాదికమని భావించుటకు అవంతిపాలకులెవరో స్పష్టపడకుండుట హేతువగు చున్నది.

మన్కడ్ పరిశోధనలో నీక్రిందియంశములకు స్పష్టమయిన కారణములు లభింపకున్నవి. ఏరు పర్గీటరు అభిప్రాయమును కాదనుచు నవంతిని వీతిహోత్రులే పాలించిరను నిర్ణయము చేసిరి. అంతవరకు సమంజసముగనే యున్నది. ఇక - 1) రిపుంజయుని సంహారము మగధరాజ్యమున మునీకునికుమారు నభిషేకించుటకు బూర్వరంగము. శ్లోకములోని రెండవపాదమున నావిషయము సుస్పష్టము. కుమారుని అవంతియందు పాలనచేయించుచో నవంతీపాలకులను సంహరించుటచే నదిసాధింప వచ్చును గదా! రిపుంజయుని క్రూరముగా సంహరింప నేల ? 2) రిపుంజయుని కుమార్తెను వివాహమాడిన ప్రద్యోతుడు మగధసింహాసన మధిష్ఠించును గాని అంతగా పేరుప్రతిష్ఠలు లేని అవంతీ సింహాసనమునకయి వేచియుండునా ?

3) రిపుంజయుని సంహరించుటలోని యౌచిత్యమేమి ? రిపుంజయుని సంహరించిన యనంతరము మగధ యరాజకమయ్యెనా?

వీనికి స్పష్టమయిన యభిప్రాయములు మన్కడ్ గ్రంథమున లభింపకున్నవి. ఇంతకంటె నెక్కుడు స్పష్టమయిన భావసమీకరణము జరుగనంతవరకు మనము మత్స్యపురాణములోని యంశములనే చారిత్రకప్రతిపత్తికయి స్వీకరింపవలసి యున్నది. ఇది కోట వారి యభిప్రాయము కూడ. పర్గీటరునే స్వీకరించిన శ్రీ కృష్ణమాచార్యుల వారు మూడురాజ్యములని పేర్కొనుటలో దక్కు నన్వయవిషయమున సమాసమని భావింప వచ్చును.

శ్రీ విశ్వనాథ తన యితివృత్తమునకు సంబంధించిన చారిత్రక విశేషములను మత్స్యపురాణము నుండియే స్వీకరించెను.

## ఇతివృత్త సంగ్రహము

వింధ్యగిరిస్వామి చండీదేవతార్చనతో నీనవల యారంభమయెను. ఈ స్వామి దేవికి వామాచారము నెఱపును. ఉపాసనాతీవ్రతచేత నా డొనర్చు సర్వదుష్కార్యము లాత డొనర్చు కొన్ని సత్కార్యముల మాటున నణగి యుండును. కనుక నీతని నీచప్రకృతి యెల్లరకు నవగతముకాదు. నాడు మగధను బార్హద్రథులలో నిర్వదిరెండవ ప్రభువు రిపుంజయు డేలుచుండెను. ఈతనితో నీ వంశమంతరించి నూత్నవంశము సామ్రాజ్యమును గైకొనునని కార్తాంతికు లనుచుండిరి. ఈతని పట్టమహిషి కాశ్మీరము నేలు నలసేనుని సోదరి మాహేశ్వరి. ఈమె బాల్యముననే మ్లేచ్ఛ ప్రకృతి కలవడినది. దానికి వెలియోనస నామక మ్లేచ్ఛుడు హేతువు. ఈతడే మగధలోని రిపుంజయునకు కాశ్మీరములోని మాహేశ్వరికిని సంధానముచేసెను.

బాల్యమున నలవడిన మ్లేచ్ఛ ప్రకృతి మగధకు వచ్చినను వదలక పోగా వింధ్యగిరిస్వామి నెఱపు చండీదేవతార్చనను రాణి మాహేశ్వరి యనుమోదించెను. వేదోపనిషన్మూలక మతమును విశ్లథ మొనర్చి యసంప్రదాయ స్వరూపమయిన నాస్తికమును వ్యాపృత మొనర్చు లక్ష్యములో దేవి యనుగ్రహమున నీ మాహేశ్వరిని, రిపుంజయుని సాధనములుగా దీర్చుకొననెంచెను. ఆరంభమున వీరిరువురుశిష్యులైరి. క్రమముగా రిపుంజయునకు వీని మహిమపై విశ్వాసము సడలెను. మగధయందున్న గంగాధరశర్మ చాతుర్వర్ణ్య వ్యవస్థకు వ్యాఖ్యానముచేసెను. దానిని నీరు గారించుట యీ జటాధారి లక్ష్యములలో నొకటి. ఈ జటాధారికి వింధ్యగిరిస్వామి. జయద్రథ నామాంతరములు గలవు.

మునీకుడు మగధకు మంత్రి. మహాసేనాపతి, మకుటము లేని

మహారాజు, కిరీటము మాత్రము రాజునకుంచుకు, బాల్యమున నీతడు చేసిన నిత్యాటపీసంచారముగ కొన్ని క్షుద్రవిద్య లీతని కలవడినవి. ఆ విద్యలతో మగధకు జేరి యెట్టులనో రిపుంజయుని తండ్రి కడ సేనాని యయ్యెను. అప్పటి నుండియు నీతడు చెప్పినది వేదమయ్యెను ఈతనికి ప్రద్యోతనుడు కుమారుడు, పద్మావతి కుమార్తె, రిపుంజయుని కూతురు తులసి. తులసీ పద్మావతులు నాట్యవిద్యాభ్యాసమున సహాధ్యాయులు. ప్రద్యోతనుడు వీరికి నాట్యవిద్యలోని మెలకువలు తెలుపు గురువు కాని గురువు.

ప్రతియేట వింధ్యగిరిస్వామి వింధ్యకాంతారమునగల యా చండీదేవతకు బూజలు జరుపును. స్వామి శిష్యబృందము లనేకము లందు బాల్గొనును. కొన్నియేడులు రిపుంజయుడును బాల్గొనెను, మహేశ్వరీదేవి మాత్రము ప్రతిసంవత్సరమును పాల్గొనెడిది. రాజు లేకున్నను రాజానుమతితో నీమె వెళ్లెడిది, ఈ యేడా యనుమతి లభ్యముకాలేదు, తత్సంబంధమయిన యుద్యోగి యయ్యనుమతి పత్రమును దేలేదు.

వింధ్యగిరిస్వామి నెఱపు వామాచారములలో సత్కులీన స్త్రీ మానభంగము ప్రాధాన్యము వహించును. ఆ స్త్రీలును నీ విధానము పరమేశ్వరీ సమర్పణముగనే భావింతురు, తన కూతు రయిన తులసిని కూడ నిట్టి తుచ్ఛకార్యమున కంగీకరింప జేయుమనెడి స్వామి యాదేశమునకు మాహేశ్వరి యంగీకరింపలేదు. స్వామి తన తుచ్ఛశక్తిచే తులసికి విపరీత శిరోవేదన కల్పించెను. మగధ యందున్న గంగాధర శర్మ యను సదాచారశీలి తన మహామంత్రి సామర్థ్యమున దానిని దూరీకరించెను.

తనకు రాజానుమతి లభింపమికి మునీకుని పన్నుగడయే హేతువని

యనుమానించి మహేశ్వరి రాజును స్వయముగ దర్శింప నిచ్ఛగించి నది, మునీకుని కుటిలనీతి నెదుర్కొనుటకు వింధ్యగిరిస్వామి శిష్యులను, సోదర తుల్యులయిన పితిహోత్రులే లాధారమగుదురని విశ్వసించెను. కాని మునీకుని నీతికాంతారమునందలి మృగరాజు వారిని గబళించెను. ఫలితము మునీకునకు విజయము. మాహేశ్వరికి నిరాశ్రయము.

మాహేశ్వరిచే నర్థింపబడి యంతఃపురదాసి యన్నపూర్ణ రాజ మందిరమున కేగెను. రాణి యనురాగమును విన్నవించెను. మునీకుడు నచటనే యుండెను. రాజు వ్యాధిగ్రస్తుడని యన్నపూర్ణ గ్రహించెను. మునీకుడు రిచ్చపడి యన్నపూర్ణ వెనుకగల రాణి ప్రవర్తన నెఱింగి తన కుత్సిత నీతివిభవము ప్రకాశించు తరుణ మాసన్నమయినదని నిర్ణ యించుకొనెను. దాసి రాజున్న పరిస్థితిని గమనించెను. మునీకుని కౌటిల్యము రాజు నాశ్రయించెనని యు తత్ఫలితమే వ్యాధి యని నిర్ణయించుకొని యటగల సర్వప్రదేశము మునీకుని యంగరక్షకులచే భద్రమయ్యెనని గ్రహించెను.

రాణికి సర్వము నన్నపూర్ణ నివేదించెను, ఇరువురును ప్రభువును దర్శించిరి. అంతఃపుర సేనాని గంధవాహుడు వీరి ననుగమించెను, గంధవాహుడు సర్వము రాణి యాదేశమున బరిశీలించెను. రాణి మాటాడింప ప్రయత్నింప రాజునకు కంఠ్లనీరు పర్యంత మయ్యెను. రాజునకుగల విశ్వాస్యుడయిన యంగరక్షకుడగు సింహబలుని మునీకుడు సంహరించెను. మునీకుడు, ఆయన యుద్యోగులు మాత్రమే నేడు రాజరక్షణ నియుక్తులు.

మునీకుడు రాణిని, నన్నపూర్ణను గాంచెను. తన కుతిత్సపు టొరనుండి కొత్తశస్త్రమును దీసెను. రాజునకు రాణివలన గలిగిన యగౌరవము, మనస్తాపము, శారీరకమయిన దుర్గతి, రాజవైద్యము జరుగురీతులు, రాణిపయిగల యపవాదమును దొలగించుటకు తాను

రాజును మభ్యపెట్టుచున్న విషయములను కుటిల ప్రతిభాస్ఫోరకబుద్ధితో నేకరువు పెట్టెను.

మాహేశ్వరి నిర్విణ్ణురాలయ్యెను. అన్నపూర్ణయు రాణియు సంతఃపురమునకు బోయిరి. కుమార్తె తులసి విషయమై మాహేశ్వరి కాందోళన కలిగెను, మునీకుని దుష్టనీతి యచటను ప్రసరించియుండు నేమో యని యనుమానము. అన్నపూర్ణయు, నాతులసిని సంరక్షించెడి కన్యాంతఃపుర రక్షకురాలు, సుశీలయు తులసియొక్క సత్ప్రవర్తనను గుఱించి విశదీకరించి ధైర్యము చెప్పిరి. అన్నపూర్ణ తులసి యొక్క సర్వవిషయముల నెఱుంగునని యెంచిన నాట్యశాలాద్వారిక యగు ఇంద్రవర్మను పిలిపించి మాహేశ్వరి సమక్షమున పెట్టెను. నర్తన శాలలో తులసికి, ప్రద్యోతనునకు జరుగుచున్న ప్రణయము నామూల చూషముగ నాతడు విశదీకరించెను.

దానిని వినిన రాణి భయసంభ్రమాశ్చర్యమగ్న యయ్యెను ఇదియు మునీకుని పన్నుగడగనే భావించి వానిని సాధింప నిశ్చయించు కొనెను, ఇంతలో సంతఃపుర ద్వార సమీపమున గంధవాహునితో నెవరో కత్తియుద్ధమునకు దలపడిరను వార్తవచ్చెను. రాణి యన్న పూర్ణతో ద్వారసమీపమునకు వచ్చెను. ఎదిరివాడు మునీకుడు. వాడు 'మాహేశ్వరీ!!' అని రాణిని పేరున బిలిచి యవమానించెను. గంధవాహుడు రాణి మర్యాదారక్షణము చేయవలసి వచ్చెను. యుద్ధ మసహ్య మయ్యెను. కాని గంధవాహుడు తాను చేసిన యవి వేకపు టాలోచన రాణికి దలవంపులు తెచ్చెను. మునీకుడు వెడలెను.

వఱువాత రాణికి రాజదర్శనమునకై కబురువచ్చెను. రాణి హతాశయయ్యెను, రాజు మరణించెనని నిశ్చయ మయ్యెను. అంతః పురమునుండి రాజభవనమున కేగి రాణి సర్వపరిస్థితులను సమీ క్షించెను. అచ్చట ప్రతి సన్నివేశమునను మాహేశ్వరిరాణితనమునే

నెఱపెను. అనటకేసిన మఠాధికారాధికార ప్రముఖు లీమె వైఖరి
రిస్తుపోయిరి. మునీకుడు భయపడెను, రాజభక్తితో నటుగల వారెల్లరు
మునీకుని విద్రోహము నధఃకరించి మగధ రాజ్యమును వినాశమునుండి
రక్షింపగా వర్థించెను. ఇది రాజోద్యోగుల నిర్లక్ష్య మనెడు సుజ
కౌషధ మయ్యెను.

మగధయందు రాజకీయ చాతుర్య మారంభమయ్యెను. రాణి, మునీకులు యుద్ధవాగులైరి. సర్వప్రదేశములను రాణి తన విశ్వాస్యులచే భద్రము చేయించెను, గంధవాహుడు, సేనాపతి విశ్వపతి, వీరసేనుడు రాణిపక్షమయి సర్వముసన్నద్ధము చేయుచుండిరి. మునీకునకు తన సైన్యమే నానబలహీనుడు డెను. మునీకుని కుమారుడయిన ప్రద్యోతనుని జోక్యముతో యుద్ధచ్ఛాయలు తొలగిపోయెను. మునీకునకు విశ్వపతి, రాణిమా సేనాధ్యక్షుని, గంధవాహుడు తన యూహకు బట్టిన వారుగాదని తెలిసికొనుసరికి వ్యవహారము మించిపోయెను.

ప్రద్యోతనుని రాణి విశ్వసింపవలసి వచ్చెను. అతడు సర్వము తీర్చిపెట్టెను. ప్రజయెల్ల ప్రద్యోతనుడు తమకు రాజుగావలెనని యాశించిరి. తులసి సభాముఖమున తన భర్త ప్రద్యోతనుడనియు, నాతడే తన తండ్రి కపటక్రియలు నిర్వర్తించుననియు, భవిష్యద్రాజ్యరమా వైభవానుభోక్త ప్రద్యోతను డగుననియు బ్రకటించెను.

మునీకుడు కారాగారమందుంచబడెను. విశ్వపతి యందేమియు దోషములేదని నిరూపణమయ్యెను. కారాగారమందున్న మునీకుడుపారిపోయినట్లు ప్రకటింపబడెను, కోటకు వచ్చిన వింధ్యగిరిస్వామి తులసి పయికి తెచ్చు ప్రక్రియలు నడుపగా నవి గంగాధరశర్మ మంత్రోపాసనముచే విఘటితమయ్యెను. రాణి తాను వింధ్యకాంతారమునకు వత్తుననియు, గంధవాహుని తనకు దోడు తెత్తుననియు, అరణ్యమున నున్న మునీకుడు స్వామికి సాయ మొనర్పగలడని నాతనివెడల నడిపెను.

గంధవాహుడు, నాటివమాహేశ్వరి వింధ్యగిరి కాంతారమున నుండెను. మునీకుడు, గంధవాహుడు మొదట పోరిరి. మునీకుడు సంహరింపబడెను. అనంతర యుద్ధమున గంధవాహుడు వింధ్యగిరిస్వామిచే మరణము పొందెను. స్వామి మాహేశ్వరిని కూడ మట్టుపెట్టెను.

స్వామి తనకు దాను చితిని జేర్చుకొని ఇంధనవిద్య నుపాసించి యందాహుతి యగుచుండెను. అందుండి వెడలిన ధూమములు నాస్తిక భావ నిర్గతములు. అవి మగధకుగల పరిసర రాజ్యములందే కాక సముద్రాంతర ప్రదేశములకును వ్యాపించుచుండెను. ఆ విధముగా వెడలినధూమమే "నాస్తిక ధూమము."

## నాస్తికధూమము - ఇతివృత్తనిర్వహణము

'భగవంతునిమీదిపగ' మొదటి నవల. రెండవ నవల పేరు 'నాస్తికధూమము.' రచయిత తనప్రణాళిక సువ్యక్తమగుటకు పీఠికగా మొదటి మూడు నవలలను రచించెను. ధూమరేఖ యనునది మూడవ నవల. వర్తమానమునందున్న రచయిత సంప్రదాయము నందు, వేదోక్తధర్మమునందు. తద్ధర్మాచరణమునందు గాఢమయిన ప్రత్యయముగలవాడని మనము విశ్వసించితిమేని తత్ప్రణాళికా రహస్యము సుస్పష్టమగును. అది యిట వివరింప బడుచున్నది.

ద్వాపరాంతమున జరిగిన భీషణ సంగ్రామము ధర్మవిజయమునకు నధర్మనాశమునకు సంకేతము. రచయిత వర్తమాన సమాజ సమ్యక్పరిశీలనాదిదృక్షువు. ఈనాడు సమాజమునందున్న అన్నిరంగము లందు నిర్లిప్తత, నిస్పృహ, అతృప్తి వృద్ధినొందుచున్నవి. తాత్త్విక పరిశీలనకంటె లౌకికవస్తు సందోహసంపాదన యందాసక్తి చెలరేగు చున్నది. ధర్మమునందు బద్ధాదరులైన వారియెడ యవహేళన సంప్రాప్తించుచున్నది. సరియగు విషయావగాహనలేకనే యిట్టి

పునర్థము కలుగుచున్నదనుటలో విప్రతిపత్తిలేదు. దీనికి ప్రధానమయినది హేతుబద్ధముగాని నాస్తికభావ సంచయప్రాచుర్యమగును. ఇది ప్రారంభమున ధూమసదృశముగా వాయువునందు మిళితమయి తజ్జనుల యుచ్ఛ్వాసనిశ్వాసము లందనవరతము సంయోగము చెంది, మానసికమయిన భావమయి, జీర్ణింపబడి, స్త్రీపురుషుల కలయికచే నేర్పడిన గర్భస్థపిండమునకు తద్గతాస్థిమాంసమున కది వ్యాపించి నెల్పడిన ప్రజ కట్టిదయిన నాస్తికభావద్రవ్యము సమకూరును. అట్టి ప్రజాళియే వర్తమానమందధిక సంఖ్యలో కన్పట్టుచున్నారు. ఈ ధూమవ్యాప్తి రచయిత దృష్టియందు వర్తమానమున జరిగినది కాదు. ఇది కల్యాదినే జయద్రథోపజ్ఞకముగ నయినదని తన యూహాబలముతో నీసవలలంతు జేర్కొనుచున్నాడు. లోకమునందు సర్వవిషయములకు గార్యకారణ సంబంధమున్నదని వేదాంతు లంగీకరింతురు. కారణములేనిది కార్యముత్పన్నము కాదని యీ సిద్ధాంతములోని సారాంశము. వర్తమాన కార్యమయిన నాస్తిక భావోత్పన్నతకు బూర్వ పూర్వ కాలమందలి యేసంఘటనయో సన్నివేశమో హేతువు కావచ్చును. ఇచట రచయిత దృష్టిలో జయద్రథుని యక్రమ కామవాంఛావైఫల్యము, అతనికి బాండవులచే గలిగిన యవమానము, పాండవులను రూపుమాపవలెననెడి కఠోరదీక్ష, తద్వైఫల్యము, మరణము-ఈ సన్నివేశముల సమాహారస్వరూపము నుండి యొక వింతయయిన యూహను కవి భావించెను. అది నాస్తికభావావిర్భావమునకునాంది గాదలచెను, కనకసింహుడను జయద్రథునిస్యాలకుని దీనికి హేతుభూతునిగా నొనర్చెను. భారతమునందు జయద్రథుని సంతానము నర్జునుడు రక్షించెను. జయద్రథుని భార్య నూరార్చెను. దీనికడ నేమియు విపర్యయము లేదు. ఇది కనకసింహుని ప్రతిజ్ఞ. వాని చెల్లెలయిన దుస్సలచే నీసమయమును ప్రతిసంతాన వ్యాప్తముగ

నొనర్చెను. వారెల్లరు జయద్రథనామకులే, వారి భార్యలెల్లరు దుశ్శలానామములు. భగవద్వైర ప్రతీకముగు నాస్తికమతస్థాపనము వారిలక్ష్యము. కనకసింహునకు దీనిననుసంధించుటలో రచయిత యుద్దేశ్యము బలమయినది. వర్తమానమున విదేశీయుల వలననే మనసంస్కృతి, సంప్రదాయములు లుప్తమయినవని యంగీకరింపక తప్పదు. అట్లే వారు చరిత్రయందును చేయవలసిన అన్యాయము చేసిరి. వారినుండి మనమెంతయో నేర్చుకొంటిమని సమాధానపడినను వారికప్పటికి లభించిన యాధారములలో నట్లు నిర్మించిరని కొందఱు పేరువాదులు సమర్థింప జూచినను, భారత యుద్ధము కూడ వారి దృష్టిలో నూహాచే వ్రాయబడినదని చెప్పుటకు సంశయింప నప్రదు పై సమర్థనలో న్యాయమేమి కలదు? ఇది మన సంస్కృతి పయినను, సంప్రదాయము పయినను వారేర్పఱుచుకొనిన వైరముచే నొనర్చినయకాండతాండవముగా భావించి దానిని తన నవలా ప్రజాళికకు కేంద్రముగా నొనర్చెను. అదియునుగాక జయద్రథుడు సింధుదేశాధీశుడు. వాని వలన నుత్పన్నమయిన మ్లేచ్ఛ, నాస్తికభావములు తద్దేశగతములుగా భావించెను. మనకు బ్రవేశించిన యసంస్కృతి యంతయు నటనుండియే వచ్చినది, యవనులు, సకల మ్లేచ్ఛదేశప్రజలు మనదేశమునకు సింధును దాటియే వచ్చిరనుట సత్యసమ్మతము. వారు మొదటగా నీసింధువును దాటియే వెళ్లిరి. వారి యసంస్కృత భావములకు, వేదవిదూరాచారములకు గినిసి యిట ధర్మప్రవర్తకులు, ధర్మశాసకులు వారిని వెడలనడపిరి. ఏ సమయములందు నీ దేశమున ప్రభువు లేడో ఆ యా సమయములందు నీయసంప్రదాయకభావ దూషిత ప్రజాప్రవేశ మనివార్యమయినట్లు విశ్వసించిన రచయిత దీనినంతయు బరిశీలనగావించి సింధుదేశమును కేంద్రముగా దీసికొని జయద్రథుని సంకేతముగా నొనర్చుకొని వాని నాస్తికధూమభావసంజనితమయిన ప్రజను బీజముగా జేసి

యచ్చట తన నవలను ప్రారంభించెను. ఏతద్విధమున నీనా స్త్రీకథానా మను నవల నామసార్థక్యమును బొందియున్నది. రచయిత ప్రణాళికకు మూలభావమిదియే.

ఇవి ప్రతినాయక ప్రాధాన్యముతో నడచినవని గతములో బేర్కొనబడినది. ఇందు ప్రారంభమున పరిచయము చేయబడిన పాత్ర విలయోనసుడు, ఈతడు మ్లేచ్ఛదేశములనుండి వచ్చి సింధుదేశమును దాటి కాశ్మీరమున నుండి యచట విశ్రుత సంగీతాదులను బాడుకొనుచు తన మ్లేచ్ఛ సిద్ధాంతమును ప్రవర్తింపించుచుండును. మాహేశ్వరి యను నామె కాశ్మీరము నేలెడి నలసేనుని సోదరి. ఈమెను మగధ రాజయిన రిపుంజయునితో నుద్వాహమునకు సంధానము చేయువరకు గొనసాగిన విలియోనసు పాత్ర నిష్క్రమించును. అనంతర మీ పాత్ర లక్ష్యమును జయద్రథుడు కొనసాగించును.

మన పురాణములను జదివి, వాని తాత్పర్యమును గ్రహించి, వానియందు తాదాత్మ్యముచెంది, యీ సంస్కృతిని మెచ్చుకొని మన గ్రంథముల పయి వ్యాఖ్యలు వ్రాసి మనకు జరిత్ర తెలియదనియు కాలగణనము సరిగా లేదనియు, చెప్పుటయేగాక తానుగా రాజులకు గాలనిర్ణయముచేసి ఉన్న రాజులను లేరనియు, ఒకరాజునకు మరియొకరాజును వ్రాసిన యొకానొక ఆంగ్లేయ చరిత్రజ్ఞుని మనస్సును స్థిరీకరించుకొని యతనిని స్వదేశీయుడగుచో జయద్రథునిగను విదేశీయుడయినచో విలియోనసుగను చూపి, తత్పాత్రను ప్రళయకాలమందలి పాపరాశి (విలయ, యోనస్)గా భావించి, వారిశరీరములు వేరు గావచ్చును గాని తన్నిష్ఠజీవు లేక భావ సంస్కృతులే యను భావమును ప్రస్ఫుటింప చేయుటయే యిందలి మార్మికత. ఇందు విలియోనసు లక్ష్యము జగద్ద్రోహ మయినచో నీజయద్రథుని లక్ష్యము జగద్ద్రోహముతో నాత్మద్రోహము కూడనిమిడి యున్నది, వర్తమాన

సమాజస్థితిని సృష్టించుటకొరకు ఏవంవిధములగు లక్షణములు గలిగిన పాత్రలను నేటి నాస్తికభావ సంస్కృతికి ప్రతీకలుగ సమన్వయించు పరిచయము చేసెను.

ఈ నవలలో చారిత్రక పాత్రలతో సమానమగు కల్పిత పాత్రలను సృష్టించి చరిత్రాంశ సమన్వయమును సాధించిన యంశములు పేర్కొనబడుచున్నవి.

1) మునీకుని కుటిలనీతితో రిపుంజయుని సంహారము జరిగిన రీతి. 2) రిపుంజయునితో బార్హద్రథ వంశమునకు గల్గిన విచ్ఛిత్తి. 3) ప్రద్యోతవంశము మగధరాజ్య స్వీకారమును గావించిన యంశము. 4) వీతిహోత్రవినాశము.

పురాణములలోని మునీకుడు కుటిలస్థితిలోనివాడు నవలలోనీతని చర్యలావిధముననే ప్రదర్శింపబడి యాకుటిలనీతి బహుమార్గముల బహిర్గతమొనర్పబడినది. ఈతడెవడు, ఎక్కడనుండి వచ్చెను ? వీనికి కుటిల నీతి యలవడిన దెట్లు ? అనువానికి సమాధానములను పాఠకుల కొసంగెడి యుద్దేశ్యముతో నాపాత్రను తీర్చిదిద్దును. ఇటు లాతడు వచ్చిన విధము, పెరిగినప్రదేశము, అతని కందిన యధికారము, దానిని దుర్వినియోగమొనర్చిన తీరు. అతనికుటిలస్థితని ప్రముఖముగా ప్రదర్శించుటకు వీలైన తావులనూహించి నిర్వహించెను. కొన్ని సన్నివేశము లీ సందర్భమున పేర్కొనదగినవి.

1) ఆతడు కుటిలనీతి విశారదుడగుటకు బాల్యమున నీతడాగమ్మకాకి. తిరుగని చోటు, తెలియని విద్య లేదు. ఖడ్గయుద్ధము నందు పరమప్రామాణికతను సాధించెను. శాబరమంత్రతంత్రములను నేర్చెను. అటవీసంచారి యగుటచే విషౌషధి పరిజ్ఞానము కరతలా మలకము. అటవీజనస్నేహలాభము. వీని యన్నింటికి నొక్కొక్క

ప్రయోజనమును నవలయందు సాధించెను.

2) రిపుంజయుని తండ్రికాలమున నీతడు సేనాపతి పదవిని పొందెను. అది యెట్లీతనికి లభించెనో యొక సమన్వయము చేత కథిత మయ్యెను. రిపుంజయుని నాటికీతడు మంత్రి. అధికారములో నుండి చేసెడి సర్వదుష్టకార్యములు ప్రజలు భరింపజాలరైరి. మునికుని పయిన నసహ్యము ప్రకటింపసాగిరి. ఈతని దుష్టనీతికి గురియైన వారిలో రిపుంజయుడు, వీతిహోత్రులు. మహేశ్వరి, తులసియు. గలరు. ఇందు ప్రయోజనము పొందినది ఒక్క తులసి మాత్రమే.

పులకుడని మునికునకు పురాణములలో నామాంతరమున్నది. ఈతడు స్వామియైన రిపుంజయుని హత్యచేసి తనంతతాను సింహాసన మధిష్ఠించుటకు ప్రజావిరోధమున్నదను విషయమెఱింగి తనకుమారుని సింహాసనముపయి నుంచెను. యథాతథముగా దీనిని రచయిత తన నవలయందు ప్రదర్శింపలేదు. రసాభియుక్తముగ చారిత్రక వైరుధ్యము లేని విధమున దీనిని బరిష్కరించెను. రిపుంజయునకు దానుపొందిన ఓషధీవిజ్ఞానముచే విషప్రయోగము చేసెను. మూలములోని హత్యకు మారురూప మిది. రాజు శవప్రాయుడు. దీనికి తానుబాధ్యుడు కాడనుటకు సర్వవిధములయిన ప్రమాణములు సంతరింపబడునట్లు శ్రద్ధనుబూనెను. మహేశ్వరియే ప్రధానహేతువనునట్లు లోకమునకు బ్రదర్శించెను. మహేశ్వరికి సోదరప్రాయులయిన వీతిహోత్రులను తన కుటిలనీతిచే కాంతారాంతర్గత వీతిహోత్రుని పాలుచేసెను. మహేశ్వరి కుమార్తెతన కుమారునిచే బ్రేమింపబడుటకు సన్నివేశమునుగల్పించెను.

ప్రద్యోతనుడు ప్రభువయ్యెనని మూలమునన్నదిగాని యిట్టి దుష్టుని కుమారుని రాజ్యస్వీకారవార్తను ప్రజలెట్లామోదించిరి? రాణియెట్లు స్తిమితపడెను! వీనికి చక్కని సమన్వయమును చేసెను. ఈ నవలయందు ప్రద్యోతనుడు సాధుశీలి, మధ్యమవయస్కుడు.

బాల్యమును దాటి యప్పుడే రాజభవన ప్రాంగణమున నడచిన రిపుంజయసుతుడగు తులసీహృదయచోరుడు. ఇతనిచేతనే ప్రద్యోతనుడు భవిష్యన్మహారాజగుననియు నాతని తానువరించితిననియు రాజసభలో పరిష్కారము చేయించును. రాజేశ్వరికాని, ప్రజలకుగాని నీతినియెడ వైముఖ్యము గలుగనిరీతిలో నిర్వహించినాడు. రిపుంజయుని క్రూరముగా సంహరింపనక్కఱయే లేకపోయెను. మునికుని కావ్యము వింధ్యగిరిస్వామి పయినను గంధవాహుని పయినను ప్రసరించినది.

2. భారతయుద్ధమునుండి రిపుంజయుడు ఇరువదిరెండవ రాజు. బార్హద్రథులు వేయేండ్లు మగధను బాలించిరనియు ననంతరము వంశము మారుననియు, చివరిప్రభువు రిపుంజయుడనియు పురాణములు పేర్కొన్నవి. ఇదిచరిత్రాంశము. దీని నవలయందిట్లు సమన్వయించెను.

జరాసంధుడు భైరవీపూజాసక్తుడు, చండి ఆయన యుపాస్యదేవత. ఆ దేవతకు నిత్యము జరాసంధుడు రక్తతర్పణము చేయును. ఈ విషయమంతయు మహాభారతము పేర్కొన్నది. ఈ అంశముతో రచయిత సమన్వయభావమును గూర్చినాడు. ఇది యెంతటి చాకచక్యముతో గూడిన యూహయో గమనింపదగును. జరాసంధుని చండి రక్షింపలేదట అతని కుమారుడైన సహదేవుని నయితమీ చండి రక్షింపలేదు. అతడు మహాభారత సంగ్రామమున మరణించెను. కనుక తదనుయాయులా విగ్రహమును మగధనుండి వింధ్యకాంతారమునకు దరలించిరి. తరలించుటకు బట్టిన రోజు లిరువదిరెండు, అందరు రాజులుమాత్రమే బాలింతురనియు ననంతరము వంశము మారుననియు, జనులలో నొక ప్రవాదమున్నట్లు కల్పింపబడెను, దీని కుపోద్బలకముగా నాటి కార్తాంతికులు రిపుంజయునితో బార్హద్రథవంశమునకు బదులు మగధయందు వేఱొకవంశము పట్టాభిషిక్తమగునని పేర్కొనుచుండిరి.

3. రిపుంజయునకు స్త్రీసంతానమున్నట్లును నామెను మునీకుడు తనకుమారుడయిన ప్రద్యోతనునకు తెలివిగా నుద్వాహము గావించినట్లు కలియుగరాజవృత్తాంతము, మత్స్యపురాణములలో నున్నట్లు కోటవారు చెప్పుచున్నారు. మిగిలిన పురాణములలో నీవిషయము ప్రస్తావింపబడలేదు. ఏదియేమైనను నీ సంఘటనను (శ్రీ) విశ్వనాథ తన నవలయందు స్వీకరించి నవలను రసాభిప్లుతముగ నిర్మించినాడు. ప్రద్యోతనుడు రిపుంజయుని కూతురును తులసిని ప్రేమించుటగాక తులసియే యట్టి కార్యము నందుచొరవగైకొని. దానికి పలురాచరికపు బనులను సమన్వయించి యాతనినొక పరమోదాత్త కావ్యనాయకునిగ జిత్రించెను చరిత్రయందున్నతీవ్రత, ప్రాశస్త్యము నవలయందుండరాదు, ఉన్నచో నది కావ్యరచనము వచనకాదు. హఠాత్తుగా ప్రద్యోతనుడు యువరాణిని వివాహమాడెనా? లేక మునీకుడు బలవంతముగా రాజ్యాశచేత తనకుమారున కామెను కట్టబెట్టెనా? ఇట్లు చేసినచో పరిసర రాజ్యములు, రాజబంధువులు, రాణిమాహేశ్వరి యూరకొనిరా? వీనిలో నేయొక్కటియయినను చరిత్రలో సంభవించి యుండుటకు వీలున్నది, లేదా కవి కల్పించినటుల ప్రణయోదంతము కూడ హేతువు గావచ్చును, వీనియందన్నింటిలో 'సాహిత్యపరమార్థ ద్యోతక మగునది రసాభిముఖమయిన తరుణమున' ననుదాని నంగీకరించినచో కవి స్వీకరించిన ప్రణయమార్గము సర్వోత్తమమగును ప్రధానమయినచరిత్రాంశము కాదుగనుక నిది బాధకమునుగాదు. ప్రద్యోతనుని పాత్రను మలచిన విధముగూడ నితివృత్తనిర్వాహణమున రచయిత

---

2. ఖలుడు బృహద్రథాత్మజుడు గర్వితుడై మహిలోని రాజులం
బెలుకుఁబట్టి తెచ్చి చెఱబట్టి గిరివ్రజ మన్పురంబులో
జొలయిక నిత్య మొక్కొకని నూనరి వోలె వధించి వీమమున్
బలిమియు నేర్పడం గడగి భైరవపూజ యొనర్చు నుగ్రుడై. సభా 1-119

చూపించిన మెలకువగనే యెంచవచ్చును. దుష్టుని కుమారుడు దుష్టునిగనే యుండవలెనా! హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు, రావణుని వంశములో విభీషణుడు యాదవకులమున ముసలము-లివియన్నియు సృష్టిగహస్యములు, సిద్ధాంతమునకంటె భిన్నమైన మహారహస్యమొకటి యీజగత్తును బరివర్తింపచేయుచున్నదని తెలుపుటకే నీప్రద్యోతనుని సౌశీల్య సౌమనస్య గుణముగల పాత్రగ సృజించినాడు. ఈ పాత్ర నిర్వహించిన రాజకీయకార్య నిర్వహణానైపుణ్యముచేత ప్రజలలో నాతని కొక విశిష్టస్థానము లభ్యమయ్యెను. తులసియే తనకీతడు భర్తయగుననియు, నీతడే తండ్రి కపరకర్మలు గావించుననియు మగధరాజ్య వైభవప్రాభవముల కనుభోక్తయగుననియు సభాముఖమున ప్రకటించుట ప్రద్యోతన పాత్రకు గవి ప్రజలలో గల్పించిన సౌమనస్యముగా జెప్పవలయును.

4. ఈ కథాకాలము నాటికి నవంతీరాజ్యమును వీతిహోత్రులు పాలించుచుండిరి. దీనికిగల భిన్నాభిప్రాయములు చారిత్రక, రంగమునందు ప్రస్తావనచేయబడెను. 'వీతిహోత్రులు గూడ గతించిన తరువాత' నను నర్థముగల చారిత్రకాంశమును సమన్వయించుటకు మాహేశ్వరీదేవికి సోదరప్రాయులుగ వీతిహోత్రులు కల్పింపబడిరి మహాసేనానియగు మునీకుడు తనదుర్జననీతిచే వీతిహోత్రులను మట్టుపెట్టెను, మహారాణి మునీకు నెదుర్కొనుటకు దగిన యండ యను కొన్న సోదరప్రాయులైన వీతిహోత్రులీవిధముగ మడియింపబడినుట్లు కల్పనగావించి వీతిహోత్రులతో మగధకు సమన్వయమునుర గుదిర్చెను. ఈ విధముగా నీచారిత్రకాంశము నవలయందుచోటు చేసికొన్నది.

5 స్వప్నవాసవదత్త నాటకమునందు, కథాసరిత్సాగరము

నందును గూర్చి ప్రసక్తి యున్నది. వాసవదత్త నుదయను డుద్వాహము గావించుకొనినప్పటికి రాష్ట్రభద్రతకును, రాజ్యవిస్తరణకు, రాజకీయ బాంధవ్యసంధానమునకును పద్మావతిని పెండ్లి చేసికొనును.[3] ఉదయనుడు పాండవ వంశములోని వాడు. పద్మావతి ప్రద్యోతవంశము లోనిదిగా కథాసరిత్సాగరమునందును జెప్పబడినది ఈమె, తొలుత చెలికత్తె, సహాధ్యాయినిగా నీనవలయందు కల్పింపబడినది. పద్మావతి యొక రాజ్యాధినేతకు దేవేరికావలెనని మునీకుని ఆశయము. తానే సేనాని. సేనానికూతు దేవేరియగు టెట్లు? అందులకుగూడ తలపి ప్రద్యోతుని వరించుటలోని యొక రహస్యముగా నామెచేత జెప్పించినాడు. మునీకున కిట్టి సమన్వయము కుదిరినచో ద్వమునుమరాలికి పట్టమహిషీ యోగము సిద్ధించునని సంకల్పించుకొనెను. ఈ విధమయిన కల్పనలో నీవృత్తాంతమును ప్రధానకథ కనుబంధము చేసి చారిత్రకపు టంశమును సమన్వయించెను.

ఏవంవిధమయిన చారిత్రకాంశములకు రసపుష్టి కూర్చి సాహిత్యమును మేళవించి రసికజనరంజకముగ నీనవేను సృజించిన శ్రీ విశ్వనాథ ప్రతిభ చిరస్మరణీయ మగుచున్నది.

## పాత్రచిత్రణము

మునీకుడు :- పురాణములలోని మునీకుడు సర్వాత్మనా

2. మత్స్యపురాణము వీతిహోత్రు లిర్వదిమందిగా జెప్పుచున్నది.
'శూరసేనా స్త్రయోవింశ ద్వీతిహోత్రాశ్చ వింశతిః' 273-17 పార్జితరు

3) "పరిపంథీచ తత్రైకః ప్రద్యోతనో మగధేశ్వరః ।
పార్ష్ణిగ్రాహః సహి సదా పశ్చాత్కోపం కరోతినః ॥ 10
తత్తస్య కన్యకారత్న మస్తి పద్మావతీతి యత్ ।
తదస్మై వత్సరాజస్య కృతే యాచా మహేపయమ్ ॥ 20
కథాసరిత్సాగరం, లావాణకం, తృతీయలంబకం, ప్రథమస్తరంగం.

దుష్టుడు, కనుకనే రాజును హత్య చేసెను. ప్రకృతులందు దానిమీద యసహ్యత వ్యక్తమగుటచే రాజ్యమును కుమారపరము గావించెను. నవలలోని మునీకుడు మారికకాలమునకు ద'నవాడు. బాహ్యమునకు దుష్టత భాసింపదు. అంతరమున నవియే ఆలోచనలు, నయవంచకుడు, గోముఖవ్యాఘ్రము. అతని కుటిలనీతి అప్రతిహతము.

మునీకుని దౌష్ట్య కౌటిల్యములను నిరూపించుటయే రచయిత యుద్దేశ్యము. యంత్రసంహ మొకదానిని రూపొందించి రాత్రులందు మాత్రమే గూఢచారులచేత దానిని ప్రయాణింపజేసి అవంతీ పరిసర కాంతారమధ్యమ్మున ప్రవేశపెట్టించి, పీతిహోత్రుల మృత్యువుకు హేతువై నిలిచిన సంఘటనచే మునీకుని కౌటిల్యము ప్రస్ఫుటమగు చున్నది రిపుంజయుని వ్యాధి మునీకుని విషౌషధీపరిజ్ఞాన ఫలము, రాణి మాహేశ్వరి వచ్చిరాజును సందర్శించినది. మునీకుని కుటిలనీతికాంతాతము దట్టమయినదని తెలుసుకొనది. మునీకుని యప్పటిభాషణము నయ వంచనా శిల్పములోని నిగనిగలు కానుపించునట్లుగా రచయిత వ్యక్త పఱచెను. సర్వము మాహేశ్వరిదే దోషమనియు తాను రాజ్య మర్యాదాసంరక్షణ చేయుటచేతనే యింతవరకైన నాపద లేకుండెనని విశ్వసింప జేయుచూచుటలో నీ కౌటిల్య మినుమడించును. మునీకునకు రాణిపై నగౌరవము నెఱపు భావమే యెక్కువ. ఒకనాటి రాత్రి యందు మునీకుడు రాణి యంతఃపురమునకు బోవనెంచెను. అంతఃపుర ద్వారమునకప గంధవాహుడు కాపుండెను. రాణి మర్యాదా రక్షణ మక్కడ గంధవాహునకు ప్రధానమయ్యెను మునీకుడు రాణిని 'మాహేశ్వరి' యని సంబోధించెను. ఇది మునీకుని దౌష్ట్యమునకు బరాకాష్ట. అంతకుమున్నే రాజుకడ నాతడొనర్పవలసిన కౌటిల్యమును నెఱపెను, రాజు యొక్క అంతరంగికులను సంహరించుట, తనకు విశ్వాసపాత్రులయిన శబరకాంతలను రాజునకంగరక్షకులుగా నియమించుట

దానిలోని భాగములే. ఇక్కడ శ్రీ విశ్వనాథ మూడుపాత్రల మన స్తత్వ ములను పరిశీలన చేయవలసివచ్చెను, అవి సేవకుడయిన గంధవాహుడు, మహాసేనానియయిన మునీకుడు, పట్టమహిషియయిన మాహేశ్వరి, గంధవాహుని సంహరించి రాణిని 'మాహేశ్వరి' యని సంబోధింతునని మునీకుని శపథము. ఇది పాఠకుని యుత్కంఠను బరీక్షించు ఘట్టము, మునీకుడు తలచుకొన్నచో గంధవాహుడెంత! యని యన్పించును. గంధవాహుని ప్రజ్ఞ మునీకున కర్థమయ్యెను. మునీకుడు వానిని సంహరింపలేదు. 'మాహేశ్వరి' నామము నుచ్చరింపలేదు అది జరిగినచో కథ వేఱొకరీతిగా నుండెడిదని పాఠకుని యూహ, కాదని రచయిత సమాధానము. 'మాహేశ్వరి' నామముచ్చరించిన తక్షణమే మునీకుని తన ఖడ్గముచే నుత్తరింపగల సామర్థ్యము మాహేశ్వరికి గలదని యచట నిరూపించెను.

రాజు మరణించెను. రాణికి కబురువచ్చెను. రాణి అస్త్రపూర్ణతో రాజభవనమునకు విచ్చేసెను. అప్పటి మునీకుని స్థితి పరమాధమ మయినది. పులియయిన మునీకు డప్పటినుండి పిల్లియయ్యెను, రాణి రాజశవమును వైద్యపరీక్ష నిమిత్తమై రాజవైద్యులను బిలిపింప వలసినదిగా మంత్రుల నాజ్ఞాపించెను. మునీకుని యోధులు జలదరించెను. సైన్యమంతయు తన చేతియందుండు ననుకొని విశ్వసించిన సమయమున నది సేనాధిపతి విశ్వపతి యధీనమయ్యెను. ప్రద్యోతనునకు నైతమాంతర్యము తెలియనీయని వింతప్రకృతిగా నీపాత్రను రచయిత తీర్చెను. తనకుసంబంధించిన విషయములలో తనస్వార్థమును కుమారుని కంటెకట్టి, దానిని స్పష్టముగా నిర్దేశించిన నిర్భీతి కలవానిగా నీపాత్రను పాఠకులు దర్శింతురు,

ఏగంధవాహునకు దానుభయపడి వానిఖడ్గచాలనము స్ఫూర్తి మంతమని భావించెనో వానిచేతనే వింధ్యకాంతారమధ్యమున ఖడ్గ

యుద్ధమున మరణించెను.

ఈపాత్రను మలచుటలో రచయిత మునీకుని ధార్ష్ట్యముతో కౌటిల్యమును కూడ సమన్వయించి చూపుటయే లక్ష్యముగా నిర్దేశించుకొనెను. మునీకుని రాజనీతి, కౌటిల్యము వానిమందహాసములో నుండునట, అదెట్లన-

'అతని మనసులోని కోపము కనుబొమల మీద కనిపించవలయును గాని పెదవులమీద గనుపించదు.' 'మునీకుని నీతి కాంతారము వంటిది' యనుటలో సర్వమవగతమగును.

రాజ్యము హస్తగతము సులువుగా నగునని భావించినాడు కాని తనకు లొంగిన వ్యక్తులే తనను మించిన స్థితియందుందురని భావింపలేని పేదమనసు గలవాడు మునీకుడు.

### గంగాధరశర్మ

"గిరివ్రజములోనున్న గంగాధరశర్మ 'చాతుర్వర్ణ్యమునకు' వ్యాఖ్యానము చేసినాడు. వాని వ్యాఖ్యానమును నిజముగావింతును.'

ఇవి వింధ్యగిరిస్వామి పరుషోక్తులు. గంగాధరశర్మ యీ నవలలో నీవింధ్యగిరిస్వామికి ప్రతిస్పర్ధి. ధర్మాధర్మ ప్రతీకలు.

రాణీమహేశ్వరి కూతురుతులసి. ఈమెకు స్వామిచే కల్పింపబడిన శిరోవేదనమును గంగాధరశర్మ తన తపశ్శక్తిచే నిష్క్రియగా చేసెను. ఇది వైదికశక్తికి విజయము. స్వామిపంపిన శక్తిస్వరూపము-

'ఒకానొక స్త్రీ కరాళవదన శ్మశ్రుభీకర ఖడ్గహస్త లంబకేశి, దీనిని తన తపస్సుచే నశింపచేసెను. ఇట్టివి మరికొన్ని-వానిని గూడ రూపుమాపెను. అప్పుడు స్వామి నోట వెల్వడిన మాట - 'ఓసీ ! గంగాధరశర్మ యింత వాడనుకొనలేదు. ఇదివైదికశక్తిసామర్థ్యము-

### వెలిమోనన - జయద్రధులు.

ఈ దేశమునకు గల విచిత్రమయిన సంస్కృతిలో దైవికశక్తి

సంపాదన మొకభాగము. మంత్రశక్తులు దైవికానుగ్రహమువలనఁ బొందఁబడునవి. అసుర శక్తిని తాంత్రికమనియు ననవచ్చును. దైవికశక్తులు సాత్త్వికములయ్యు మహాఫలవంతములు. అస్త్రవిద్యములు కాలాంతరమున నను వాజీవున కుపకరించునవి. వీని నుపాసించుటకు సదాచార సంపన్నత, ధర్మమార్గానుసరణము కావలయును. సద్యఃకాలమున ఫలింపక పోవుటయు వీనిలక్షణము. కాని తాంత్రికశక్తుల వశీకరణ మింతకు భిన్నము. తంత్రానుగతమయిన విధానక్రమము ననుసరించినచో నాశక్తులు శీఘ్రముగా వశమగును.

మహాభారతయుద్ధమునందు పెక్కు శస్త్రాస్త్రప్రయోగములు జరిగెను. కాని యారణమందు కురుపాంచాలవీరులందరు నశించుటచే నా మంత్రప్రయోగ విజ్ఞానమే మనకు దూరమయ్యెను. ఘటోత్కచాదుల తాంత్రికశక్తులను సయితము మనమందు దర్శింపవచ్చును. కాని వీనన్నింటిని సమర్థముగా దైవశక్తిమాత్రమేయెదుర్కొననని రచయిత నిరూపింపదలచినాడు. మొదటినవలలో నాభేదమును గంగు అతనికుమారుల నడుమజరిగిన ఖడ్గయుద్ధమున నిరూపించెను.

ఇక నీనవలయందు విలియమ్ యోనను మ్లేచ్ఛభావ ప్రచార వృత్తిలో నుండి కాశ్మీరదేశమున తననేర్చిన యసంస్కృతగీతములను బాడు కొనెడి యొకానొక తీవ్రప్రకృతి క్షుద్రవిద్యోపాసకుడు. అతడీవిద్యను వెంటబెట్టుకొని దేశదేశములు తిరుగును. మగధయందు నాటి ప్రభువగు వీరజిత్తుని కుమారుడైన రిపుంజయునకును కాశ్మీరదేశపురాజయిన నలసేనునిసోదరి మహేశ్వరికిని వివాహము కుదుర్చును. ఈ మహేశ్వరి మ్లేచ్ఛభావమును వెలియోనను వలన బాల్యమునుండి వంటబట్టించుకొనినది. వివాహముతో నీ వెలియోనను పాత్ర నిష్క్రమించును.వీరి

ఈ పాత్రను ప్రవేశపెట్టి యీనామెయందు మ్లేచ్ఛభావబీజప్రతిష్ఠాపన చేయుటలో నీతడు కృతకృత్యుడయ్యెను. అనంతర మీపాత్ర లక్ష్య

మును జయద్రథపాత్ర సాధించెను. ఈ లక్ష్యము భగవద్వైరభావమును భారతమున పెంపొందించుట. దాని నాపాత్ర యిట్లు వ్యక్తీకరించును.

> "ఇంకెన్నాళ్లీ భారతీయ సంస్కృతి! వైయాసిక నాగరికత!
> కృష్ణవిరచిత భగవద్గీతా పఠనము, వేదోపనిషత్తుల రాజ్యము
> సాగనిత్తుము! సాగనీయము!..... వానికి భ్రష్టత
> చేకూర్తును. నేను దానికొఱకే నవతరించినవాడను."

ఇది జయద్రథుని యవతార సంకేతము. వామాచారమును నెఱపుట. దానికయి శక్తి నుపాసించుట-తల్లక్ష్యసిద్ధికి సాధనములుగా నీతడు భావించును. వింధ్యగిరిస్వామి, జటాధారి యితనికి పేర్లు. ఈ వామాచారమున మూడుసూత్రములు గలవు. 'తినుమురా! త్రాగుమురా! సంభోగించుమురా!' యనునవి యిందు ప్రాధాన్యము వహించును. రచయిత ఈపాత్రకు వాని ననుసంధించెను. జరాసంధునిచే పూజింపబడిన దేవీవిగ్రహము నుపాసించు తీవ్ర ప్రకృతిగా నాతని మలచెను. వింధ్యగిరి కాంతార మధ్య మందున్న యీ విగ్రహమునకు బలులొసంగుట, దేవీసమక్షమున కులీన స్త్రీలను చెఱచుట, మద్యము త్రాగుట, ఉపాస్యదేవియగు చండిని రండా! ముండా! యని దుర్భాషలాడుట కూడ వామాచారములోని భాగములే. వామాచారములోని నీచత్వమును, దుష్టత్వమును, అసంస్కృత సంప్రదాయములను, భయానకమగు పూజలను పాఠకులకు పరిచయము చేయుటయే వీనిని జయద్రథునిపాత్ర కన్వయించుటలో కవి లక్ష్యము.

పట్టమహిషి మాహేశ్వరిని సయితము తనశిష్యురాలిగా నొనర్చుకొని తన నాస్తికతకు స్థిరత్వమును సంపాదింప యత్నించెను. కాని దౌష్ట్యము యుగధర్మాను సారముగ బహిరంగము నకు నాదుష్టత భాసించదు. చూడుడు-ఆకడు.

"భయంకరాకృతియైన చాముండీదేవతా ప్రసాదము నంది యామె మహత్తు చేత బలుమందికి నల్పబాధలు నివారించుచు వైదిక మార్గమునందు విరోధము నెఱపుచు పలువేషములు వేయుచుండెను."

"వారికి మ్లేచ్ఛాచారములు నెఱపును. తానో విచిత్రముగా వైదికాచారములు నెఱపును." "పెద్ద సంతర్పణలు చేసినను, నెవరికో ధనమిప్పించినను, మఱొకరికి మహాధికారమిప్పించినను నీ సర్వమైన మహిమ వెనుకనున్నది శ్రీ వాంఛ" (పే. 48.) ఇట్లు సర్వజనులకు నాతడొక మహనీయుడు, వేదాంతి, సాధువు వింధ్యగిరిస్వామి.

మహేశ్వరికి తనవలన సంతానము కలిగినచో నా ప్రజ మ్లేచ్ఛాశయ సంపన్నతా ధురీణమై దేశమునేలి సర్వభారతమును నాస్తిక భావమయముగా నొనర్పవలయునని సంకల్పించెను. కాని అది నెరవేర లేదు. ఇది వింధ్యగిరిస్వామి లక్ష్యమును సాధించుకొనెడు మార్గము. ఈ మార్గము నడ్డుకొన్నది గంగాధరశర్మ. కొన్ని యేండ్ల మీద వీని తత్త్వమును గ్రహించినది రిపుంజయుడు. మాహేశ్వరి, గంధ వాహులు వీని లక్ష్యములో వ్రేల్పబడిన సమిధలు. తులసి గంగాధర శర్మచే ననుగ్రహీతయై వైదిక మార్గనిష్ఠ యయ్యెను.

తుచ్ఛశక్తులకు, వైదికశక్తులకు ప్రతీకలు వింధ్యగిరిస్వామి గంగాధరశర్మలు. ఇది ధర్మాధర్మ సంఘర్షణమునకు నుదాహరణము. ఈ పాత్ర చిత్రణలోని చిత్రమిదియే. తుదకు వాని చితినుండి వెల్వడిన ధూమము నాస్తికధూమముగా కవిచే నూహింపబడెను. అదియే ఈ నవలకు పేరు.

గంధవాహుడు:-రాణిమహేశ్వరి యంతఃపురరక్షణకు నియుక్తుడైన సేనాని గంధవాహుడు. పట్టమహిషియొక్క మర్యాదారక్షణము చేయ వలసిన సమయమున తనదైన వెఱ్ఱియాలోచన గావించి, యామెచే నిరసింపబడి, విధ్యగిరిస్వామి ఖడ్గమునకు బలి యయ్యెను.

రాణి యందఖండమైన గౌరవాదరములు కలిగినవాడు గంధవాహుడు. కాని రాజసేవా నియుక్తుడు. రచయిత యీ పాత్రవలన నీప్రయోజన మాశించెను.

1) కర్తవ్యనిర్వహణమును దైవాదేశముగా జూడవలెను గాని, క్రమశిక్షణలేని సైనికవృత్తి గంధవాహుని వలె సిలుగుల బడద్రోయుట తథ్యమని నిరూపించుట.

2) సైనికునకు, సంగరక్షకునకు సొంతపుటూహ నిషిద్ధమని తెలుపుట.

గంధవాహుడు తానొనర్చినది యసమంజసమని భావించి "అది యేమైనను సరే! నెత్తిమీదకు వచ్చినను సరే! లోకములు ముంచుకొని పోయినను సరే! ముందు వెనుకలు చూడకుండ తనకప్పుడు విధింపబడిన ధర్మమును దానెవ్వడు చేయునో వాడు తీవ్రవ్రతుడు. వాడు సాహసికుడు. వాడు వీరుడు." ఇది తెలియకపోవుటయే గంధవాహుని లోపము. ఈ పాత్రయందు దీనిని రచయిత చక్కగా సమన్వయించెను.

అన్నపూర్ణ :- అంతఃపురరహస్యము లితరులకు దుర్భేద్యమయినవి. అట్టి ప్రదేశమునకు పరమ రహస్యముగా రక్షింపవలసి యుండును. అవరోధవ్రాతమునకు బరిచారికగా నియుక్తురాలయిన "స్త్రీ" యెట్లుండవలెనో శ్రీ విశ్వనాథ అన్నపూర్ణపాత్ర ద్వారమున ప్రదర్శించెను.

అన్నపూర్ణ వివేకవతి. అల్పపు టూహలు లేనిది. రాణీ మర్యాదా సంరక్షణము చేయుట తన ప్రధానకర్తవ్యముగా భావించినది. రాణియాదేశమున తనవివేకము పోగొట్టుకొనిన సమయమందు నీమె వివేకము ప్రాధాన్యము వహించును. సాధువర్తనముతో రాణిని, వివేకముతో మునీకుని, ధైర్యసాహసములతో గంధవాహుని, వాత్సల్యమత్కృతితో కన్యాంతఃపుర పరిచారిక సుశీలను, అధికారముతో

నాట్యాగార రక్షకు నింద్రవర్మను,తనపరిధిలోనికి తెచ్చుకొనిన పరమ ప్రధానమైన పాత్రగా నీమె మనకుదర్శనమిచ్చును.తత్ప్రాధాన్యముతో జిత్రించుటయే యిందలి పరమార్థము, ఒక్కమాటలో నన్నపూర్ణ గురించి యాశ్చర్యపడిన మునీకుడు, "ఈ యన్నపూర్ణ బ్రాహ్మణ స్త్రీ వృద్ధురాలు. సౌశీల్యవతి, నాకు గ్రొత్తగా దెలిసినవిషయము మిక్కిలి వివేకవతి."

ఈ వివేక గుణము లేనిచో నన్నపూర్ణ పాత్రయే లేదు.

ప్రద్యోతనుడు :- ఈతనితో నీవంశ మారంభమగుచున్నది. బార్హద్రథవంశ మంతరించి ప్రద్యోతవంశము మగధనేలునని పురాణప్రవచనము.

ప్రద్యోతుడు మునీకుని సుతుడు, తండ్రికి పూర్ణముగా విరుద్ధ ప్రకృతి. చరిత్రలో నీతడిట్టివాడని లేదు, మునీకుడు తనపయి ప్రజలకుగల యసహ్యతను గమనించి కుమారుని రాజుగా నభిషేకించెనని పురాణము పేర్కొనది. దీనిని నిర్వహించుటకు కవి యీ పాత్రను జక్కగా దీర్చిదిద్దెను. ప్రద్యోతనుని సకలవిద్యావిభూషితునిగను; సాధువర్తనునిగను, సచ్ఛీలునిగను నవలయందు పరిచయము గావించెను. ఈయన కొకకుమార్తె, పేరు పద్మావతి. ఈమె యీడుగల కూతురు మహారాజయిన రిపుంజయునకు గలదు. ఆమె పేరు తులసి. ప్రద్యోతనునకు వచ్చిన బహువిద్యలందు నాట్యసంగీత శాస్త్రములు గలవు.అవి తనకుమార్తెతో నాట్యవిద్యాగురువు చెప్పని విషయములను దులసికి నేర్పును.

చరిత్రలో రిపుంజయుని కూతును ప్రద్యోతనునకు వివాహ మొనర్చినట్లున్నది. దానికయి యీ సన్నివేశమును గల్పించి వారికి సాన్నిహిత్యమును సమకూర్చెను.

ప్రద్యోతనుడు పంచాశద్వర్షప్రాయుడు. తులసి పంచదశ వర్ష ప్రాయి. వీరిరువురకు సంధానము. లోకవిరుద్ధము. దీనికి ప్రద్యోతనుడు చొరవచేసికొనినచో నదివిమర్శకు బాలయ్యెడిది. కాని తులసియే తానాతని ప్రేమించితిననియు, తన్నువివాహమాడినచో వింధ్య గిరిస్వామి యాటగట్టింతుననియు జెప్పెను. ఆమె యందలి శృంగార రసాధిదేవత ప్రద్యోతనునకు ప్రత్యక్ష మయినట్లయ్యెను.

ఈ వివాహము సర్వుల యంగీకారమును బడయవలెనుగదా ! దానికే కొన్ని సన్నివేశముల సమకూర్చి పాత్ర యొక్క యుదాత్తతను గాపాడెను. ఆ సన్నివేశములు.

1) అన్నపూర్ణచే సీతని గుణగణములు రాణియొద్ద ప్రస్తుతింప బడుట. 2) నాట్యాగారరక్షకుడైన ఇంద్రవర్మ తులసీ ప్రద్యోతనుల ప్రణయగాథను యథార్థముగా విస్తరించి రాణిమాహేశ్వరికి దెలియ జేయుట. 3) రాణికడ ప్రద్యోతనుని వినయ, సౌశీల్య, సౌహార్ద ప్రవర్తనము. 4) ప్రజలెల్లరు మగధరాజ్యమును కల్లోలము లేకుండ సంరక్షించినది ప్రద్యోతనుడే యను సుభాషితము ననుమోదించుట. దీనిని రచయిత యీ వాక్యమున ధ్వనింపజేసెను.

"ఆ రాత్రి పేరునకు రాత్రి. నిదుర పోయిన వాడెవ్వడును లేడు. ఆనిదురలేమికి మన్మథుడు హేతువే కాలేదు. ప్రద్యోతనుడే సర్వథా హేతువయ్యెను."(304)

5) రాజదుహిత తులసియే సభాముఖమున ప్రద్యోతనుడే తన భర్తయని, యాయనయే భవిష్యద్రాజ్యశాసకుడనియు నాయనయే తనతండ్రి కపటక్రియలొనర్చువాడనియు నిర్ద్వంద్వముగా బలికె ఇతరులే యీ వివాహప్రసక్తి తెచ్చెడి యవస్థను కవినైపుణ్యములో దప్పించెను. ఇతరులే యడిగినచో నది పేలవమయి రసాభాసమయ్యెడిది.

మాహేశ్వరి :- ఈమె రిపుంజయుని పట్టపుదేవేరి. బాల్యమున విలియమ్‌యోనస్ కాశ్మీరమునను, యౌవనమున వింధ్యగిరిస్వామి వింధ్యకాంతారమున చండీవిగ్రహ ప్రాంగణమునను నాస్తిక భావదోషపరీత మనస్కగ నొనర్చిరి. కాశ్మీరపు రాజయిన నలసేనుని సోదరి యీమె రిపుంజయుని వలచినది. వలపింప జేసకొన్నది. విలయ మోనస్ యీ వివాహసంధాత.

ఈమె చారిత్రకపాత్ర గాకున్నను నితివృత్తమున నీమె ప్రాధాన్యము వహించుపాత్రయే యగుచున్నది. ఈమె వింధ్యగిరి స్వామిశిష్య. భైరవ్యర్పణముగా భావించి యా స్వామికి సర్వాత్మనా శిష్యయైనది. కాని కూతురును సైతమట్లు జతకూర్పుమనెడి స్వామి యాదేశము నిరాకరించినది.

తాననుమోదించినంతవరకు పరమశాంత. విపరీత పరిస్థితి యయినచో నీమెయే చండప్రచండ. ఈమె స్వభావము నీమెతో మెలగిన వ్యక్తులే గ్రహింపలేకపోయిరి. వారు1) వింధ్యగిరిస్వామి "నీవు నాకు బరమ శిష్యురాలవు. నాకు బంగనామములు పెట్టితివి" (పే. 376) 2) మునీకుడు "మాహేశ్వరి కింత శక్తియున్నదా! ఇంకను నేను బొరపడుచున్నాను. ఆమెకున్న అనంతమైన శక్తిని గూర్చి సందేహించుట మొదటినుండియు నేను బడిన పొరపాటే." (పేజి. 342) 3) గంధవాహుడు "అంతటి మహావీరుడైన గంధవాహు డును గుర్రిక్కిన పేనువలె వెడలిపోయెను."...ప్రక్కనున్న పదునేను గురు పరిచారకులకు రాణియున్నచో భయము వేసెను." (పేజి 242)

4. తులసి "నా తల్లి చండీభక్తురాలు, నా వివాహ విషయము నాలోచించుటలేదు." (పేజి 209)

ఇట్లన్ని పాత్ర లామె వివిధప్రకృతులను బాహిరముగా దర్శించిరే

గాని యామె యాంతరప్రకృతిని బరిశీలింపరైరి. రచయిత యీ పాత్ర పరమార్థము ప్రకటించుచు-

"ఆమె ప్రకృతిలో నద్వైతీ భావమున్నది. తలకు మించి వచ్చినపుడామె యెదురుతిరుగును. వట్టి యప్పుడామె మంటికొయ్య, ఎదురు తిరిగినపుడు పడగవిప్పిన గోధుమ వన్నెత్రాచు." (పేజి ౪౬౫)

అట్లే యీ పాత్ర చిత్రింపబడినది. వింధ్యగిరిస్వామికి ప్రారంభమున నీమె మంటికొయ్యయే. రాజు మరణించిన యనంతరము యామె స్వామికి బడగవిప్పిన నాగుపాము, మునీకుని విషయమున, గంధవాహుని విషయమున గూడ నీ సమన్వయము తగియున్నది.

మాహేశ్వరి మానసికక్షోభను బహుసుకుమారముగా వెలయింపజేసినాడు రచయిత. రిపుంజయుని వ్యాధిగ్రస్త శరీరమునకు గాంచినపుడు, వింధ్యగిరిస్వామి దౌష్ట్యము తనకూతుపయినను ప్రసరింపనున్నదను యోజించిన సమయమునను, మునీకుని దుర్వృత్తి పరాకాష్ఠకు జెందినవుడు, తులసి శీలము, వర్తనము లెట్లు పరిరక్షింపబడుచున్నవో యనువిచారణ సందర్భమున వెలయించిన మానసిక క్షోభ, ఇంద్రవర్మ రాజోద్యానమున జరిగిన ప్రణయ ప్రమాణ సంభావణ విన్పించినపుడు వ్యక్తమగును.

ఇంతక్షోభయు రాజ్ఞీత్వము బడయుసరికి గుండెలో నింకిపోవును, సర్వరాజకార్యములందు తీక్ష్ణత ప్రదర్శించును. మానసికోద్వేగము, భర్తృమరణము, కుమార్తె భవితవ్యము రాజ్యపాలనము వీనినన్నింటిని సంయమనములో స్వీకరించియెల్లరకు సంభ్రమాశ్చర్య సంతోషజనకముగా నాకార్యములు నిర్వర్తించును,

తన నెదుర్కొన్న సమస్యలను సర్వసమగ్రముగ బరిష్కరించినది. తాను వింధ్యగిరిస్వామిని, మునీకుని సంహరించినది. మునీకునకు

గంధవాహునెన్నిక చేసినది. రాజ్యమును భద్రస్థితికి దెచ్చినది, తన శరీరము సయితమాత్మాహుతి నొనర్చుకొనుటకు ప్రయత్నించియు, నది వింధ్యగిరిస్వామి యీమెను ముందుగనే సంహరించుటచె నెరవేర్ప జాలక పోయినది.

తులసి :- భవిష్యద్రాజ్యరమావల్లభుని సతి కుండవలసిన లక్షణములన్నింటిని యీ పాత్ర యందు నిక్షిప్తమొనర్చి రచయిత ప్రశంసావహుడయ్యెను. ఈమె :-

1. తల్లివలె దుష్టసంస్కారసంజనిత భావదోషదూషిత కాదు.

2. తండ్రివలె మతమునందు నిర్లిప్తత గలిగినది గాదు.

3. చండీదేవ్యుపాసకుడయిన వింధ్యగిరిస్వామి క్షుద్రశక్తులకు లొంగినది కాదు.

4. ఉపనిషదుద్యానమున పూలుపూయింప నిశ్చయించిన ధీరవనిత.

ఏవంవిధమయిన పరమాభినివేశముతో నీపాత్రను రచయిత రూపొందించెను. ఇది చారిత్రక పాత్ర కాకున్నను నర్లే మలచెను. ఈమె పంచదశవర్ష ప్రాయ. నాట్యశాలయందు నాట్యశాస్త్ర విద్యను తన చెలిమికత్తెయయిన పద్మావతీదేవితో నేర్చుకొనును. ప్రద్యోతనుడు నాట్యవిద్యాభిజ్ఞుడు పద్మావతికి నావిద్యయందలి మెలకువలు తెలుపుచు నీతులసికి గూడ వానిని దెలియజెప్పుచుండెను. అతని వయసేబది. క్రమముగా నీనాట్య విద్యాభ్యాసము, పరస్పరావలోకనమున శృంగార రసావిర్భావదశకు వచ్చెను. వీరిరువుర శృంగారము సమర్థనీయమేనా? యనుటకు కవి "యౌవనావిర్భావమునందలి శరీరము సర్వాణుగతమై నిత్యజాగ్రదవస్థా భూతమయిన వాంఛాగతముగా నుండును. ఆ వాంఛ తెలియక పోవచ్చును. జీవగతమై యుండును అని చెప్పించును." ఈయన యందనురాగమునకు నీతని యుదాత్తప్రకృతియు, సౌందర్యాదిగుణ

విశేషములు సోమప్రభాసుమతీసల్లిచంద్రుల నిర్లక్ష్యముచేత తానదౌర్భాగ్య హస్తగ్రస్త నగుదునేమో యను కాణాచమును జూపించి వయస్సౌర తమ్యము ప్రేమగాంచోట పట్టరాని శకుంతలా దుష్యంతులు, రేవతీ బలరాముల దాంపత్యవైభవమును ప్రశంసింపజేసెను. గంగాధరశర్మ తనలో వెలిగించిన జ్ఞానజ్యోతి తనను సహస్రజన్మలవృద్ధగా జేసెనని తన చర్యను సమర్థించెను.

ఈ విషయమునే మఱింత విస్పష్టముగా సభాముఖమున దులసిచే జెప్పించి యీ వివాహములోని యనౌచిత్యమును దొలగించి యది సమర్థనీయమే యనునట్లు నిర్వహించెను. వర్తమానమున కిట్టి వివాహములు విపరీతముగను, దోషదూషితములుగ నుండుట సహజము. కాని నాల్గువేల యేండ్లక్రిందట ప్రజలకుగల ఆయుఃప్రమాణమును బరిశీలించుచో దీనియందు తప్పుపట్ట నవకాశముండదు.

విశేషములు:-

1) విమర్శ　2) లోకజ్ఞత 3) వర్ణనలు　4) చమత్కారము 5) నిర్వచనములు　6) విచిత్రపదములు　7) విశేషాంశములు.

1. విమర్శ :- క్రైస్తవులైన ఆంగ్లేయులు మనదేశమునకు రాకపూర్వ మీదేశమున నీ మతములేదు. వారు తమ మతములోనికి జేర్చుకొనుటకు బన్నిన యుపాయములలో నీవైద్యాలయముల స్థాపన మొకటి. వారిచే నెలకొల్పబడెడు వైద్యాలయములలో నాపత్సమయమున రోగుల నయ్యాపద నూతగా గాని తమ మతమునకు మార్చుగావించుకొనెడి యత్నములను స్పృశించుచు రచయిత "శారీరకమయిన యల్పబాధలు నివారింపబడుట స్వల్పహేతువుచే జరుగవచ్చును. ఆహేతువే పరమేశ్వరు డనుకొనెడువాని కంటె మూఢుడెవడు? (3)

1) మతముపై విమర్శ:- వింధ్యగిరిస్వామి సన్న్యాసాకృతి ధరించినవాడు. వాని యాకృతికి జర్యలకు సంబంధము లేదు ఇది లోక

ములో తాము పరమేశ్వరస్వరూపులమని చెప్పుకొని తిరిగెడి సన్యాసుల” పయి తీవ్రవిమర్శ.

2. అధికారులుండవలసిన రీతి :- తిక్కన ధర్మరాజాదులకు సామాన్యపౌరులెట్లు మెలగవలెనో హితవుచెప్పినాడు. శ్రీవిశ్వనాథయు నధికారుల ప్రవర్తనా నియమావళియందు వాఙ్నియమ ప్రాధాన్యమును ప్రత్యేకముగా వివరించెను. అవి 1) అధికారులను రాజులును సామాన్యులవలె వ్యవహరించరాదు, (ప్రజాస్వామ్యములో నిది కొనసాగునా!)

2. విరోధములు పెంపొందించుకొనరాదు.

3. వాగ్వ్యయముచేత విరోధములు మిక్కిలిగా బెంపొందును. అది తమకు నష్టమగుట యటుండగా బలుమందికి నష్టహేతువగును. అందుచేత రాజులు, నధికారులు వాఙ్నియమము గలవారై యుండవలెను. వాఙ్నియమము లేకనే పీతిహోత్రులు వీతిహోత్రుని పాలైరి.

3. భయమును గుఱించి:- 1) పాపబుద్ధియు భయమును సమానకక్ష్యకు జెందినవే. 2. మనుజునియొక్క భయముయొక్క ప్రమాణము వాని దుష్టత్వమును బట్టియుండును. వాడు దుష్టుడయిన కొలది వానికి భయమెక్కువ. 3) పులిని జూచి మనుష్యుడెంత భయపడునో, మనుష్యునిజూచి పులియు నంతే భయపడును.

4. చమత్కారము :- మునీముడు “మందహాస విషయమున పెద్దబేహారి. బేహారి తక్కెడలో గలిగిన దాగా మనకుదెలియకుండ చేయును, చేతితో నొక్కును, ఒక్కొక్కప్పుడుమోకాటితో దక్కెడబుట్ట పై కెత్తును. ఇవి మునీముని మోసములోని వివిధదశలు.

2. వాక్య చమత్కారము :- “శివుడుకన్పించలేదు గాని నిత్యము శివదర్శనమయ్యెను,” (శివ మనగా నక్క)

5. విద్యకునిర్వచనము:-ఒకవిద్య యుపయోగించుట యనగానావిద్యను దానికి దానికి దెలిసికొనుట కాదు, లోకము దెలిసి, లోక రహస్యము దెలిసి, కాలము దెలిసి, దేశము దెలిసి, యౌచిత్యము దెలిసి, ప్రయోగార్హత దెలిసి, రాబోవు ఫలితము యొక్క మాహాత్మ్యము దెలిసి ప్రవర్తింపగలిగినవాడుగాని లేనిచో వట్టి వేదపాఠకుని వంటివాడు. ఇది సకల విద్యారహస్యము.

6. విచిత్రపదములు :- 1) విరోధోపశ్ప్భుదు- ఉపప్భుదనగా వహ్ని (విరోధాగ్ని) 2) అదర్శనీయాగ్ని - శ్మశానాగ్ని.

7. విశేషాంశములు :

1) ఇంధనవిద్య 2) శమంతపంచకము 3) విచ్ఛిన్నాగ్ని.

అక్షమాలికోపనిషత్తునందు అకారాది క్షకారాంత వర్ణముల నుపాసించు విధానమునకు మాతృకాన్యాసమని పేరు కలదు. ఒక విధముగా నిది యక్షరోపాసనమని చెప్పవచ్చును. సర్వవిద్యలు, మంత్ర తంత్రము లీవిద్య ననుసరించి యుండునని యీ యుపనిషత్తు చెప్పును. ఈ విద్య నుపాసించుటచే సృష్టిస్థితి సంహారకర్తృత్వములు సిద్ధించునట. ఇందు 'ర'కార మగ్నిబీజము. దీని నుపాసించి యగ్నిని సృజింప వచ్చుననియు, సర్వదహనకర్మలను సులభముగా నిర్వర్తింపవచ్చుననియు నయ్యుపనిషత్తు వచించినది.

ఈ మంత్రమునకు స్థాణ్వాఖ్యుడుఋషి, ఆకృతిఛందము శ్రీరకారమాతృకాదేవి ప్రసాదేన మమ మనోభీష్టఫలసిద్ధ్యర్థే జపే, వినియోగః' అనునది సంకల్పము. యథావిధిగా నంగన్యాసకరన్యాసములొనర్చి ఈ శ్లోకముతో ధ్యానింపవలెను.

"నీలవర్ణాం మహారౌద్రీం రక్తాస్యాం రక్తలోచనాం।
రక్తవర్ణా మష్టభుజాం రక్తపుష్పోపశోభితాం।

రక్తమాల్యాంబరధరాం రక్తాలంకార భూషితాం।
మహామోక్షప్రదాం నిత్యా మష్టసిద్ధిదాయినీం।
నమామి శిరసా దేవీం వాణీం సర్వార్థదాయినీం।

ఈ ధ్యానము నొనర్చి గురుముఖమున మంత్రముపదేశము పొంది యుపాసించవలెను. *

శ) ఈ గిరివ్రజమును శమంతపంచకముగా జేయదలచ లేదు. (329) మునీకుని వాక్యము.

2. త్రేతద్వాపరసంధికాలమున పరశురాముడు ముయ్యేడు మారులు వైరిధరాతలేశ్వరులను క్రూరకుఠారముతో జంపి తత్కుఠార విదళిత సకలక్షత్ర రుధిరాపూర్ణములుగా గావించి తద్రుధిరజలంబు లను బితృతర్పణంబు వేసెను. వారి ప్రార్థన చేతనే యపగత క్రోధు డయ్యెనని, తత్సమీపప్రదేశమును శమంతపంచకమని బిలుతురని రోమ హర్షణ తనయుడు మునులడుగ సమాధానించినట్లు భారతమునగలదు.

3. క్రతుమధ్యమందుగాని. అగ్నిహోత్ర మధ్యమందుగాని, యత్కారణముననైనను నగ్ని లుప్తమగుచో దానిని విచ్ఛిన్నాగ్ని x యను పేర బిలుతురు. ఆహవనీయమందు అగ్న్యుద్వాసమయినచో గార్హపత్యమునుండి, అందు లుప్తమైన పునర్మంథనము గావింపవలెను.

---

* మహామంత్ర మంజరి, 'వ్రాతప్రతి' (శ్రీ) త్రిపురారిభట్ల వీర రాఘవస్వామి.

"త్రేతద్వాపరసంధి నుద్ధత మదాంధీభూత విద్వేష జీ
మూత ప్రగ్వసనుండు రాముడలుకన్ ముయ్యేడుమారుల్ రణ
ప్రీతిన్ వైరిధరాతలేశ్వరుల జంపెం బల్మిచే దీర్ఘవి
ఖ్యాత క్రూరకుఠార లూన నిఖిల క్షత్రోరు కాంతారుడై ఆది. 1-79

x "యదాహవనీయే ఉద్వాసయేత్ గార్హపత్యా దుద్ధరేత్
యద్గార్హపత్యా ఉద్వాయేత్ అతయేవ పునర్మంథయేత్" సూత్రకారేణ.

# 3. ధూమ రేఖ

చారిత్రకపూర్వరంగము :— బార్హద్రధులు, ప్రద్యోతనులు పాలించినయనంతరము మగధసామ్రాజ్యమును శిశునాగవంశమేలునని పురాణములు పేర్కొనుచున్నవి.

శిశునాగుడు కాశీరాజు. ఈతడు మగధను జయించి సామ్రాజ్యమును నలబదిరెండేండ్లు పాలించెను. బుద్ధజననము, నిర్యాణము వీరి వంశపాలనముననే యని బౌద్ధగ్రంథములు పేర్కొనుచున్నవి.[1] ఈనవల యందీవిషయము స్పృశింపబడినది.

శిశునాగుని మగధ విజయయాత్రను కల్కిపురాణము విస్తరించినది మగధసామ్రాజ్యమువలె స్వతంత్రప్రతిపత్తిగల రాజ్యములు అవంతి, కోసల, కాశి, హస్తినలు.

అవంతిని విశాఖయూపుడు.[2] కోసలను సుమిత్రుడు.[3] కాశీ రాజ్యమును శిశునాగుడు.[4] హస్తినను క్షేమకుడు నాడు పాలించు

---

All Buddhistic and Jain Receros are agreed in describing Bimbisara (Srenika) as being 5 years Junior to Gouthama Buddha, who is said to have attained his Nirvana in the 8th year of the reign of his sucessor Ajatha Satru (Asoka, Vadana, Mahavamsa, Deepa Vamsa). V. A. Smith calls him Bimbisara and adds that he built Raja griha and was a Contemporary of Buddha" Early History of India. V A. Smith.

2. ప్రద్యోతవంశములోని మూడవరాజుగా బురాణకథనము.

3. ఈతనిని "మరు" గా "కల్కి" పేర్కొనెను.

"తస్మాన్మరుం మాంకేఒపీహ బుధంచాపి సుమిత్రకమ్". 3-4-8.

4. శశిధ్వజుడనియు నీవంశమునకు ముందున్న నందివర్ధనుడు వేఱురాజుగా :ఎయు నది యీతని బిరుదనామమని. Puranic Chronology P. 80

చుండిరి. కల్కియు విశాఖయూపుడు నొక్కదేశమువారు. బద్ధా దరులు. వీరందఱు నొకకూటమిగ నేర్పడ, కాశీరాజయిన శశిధ్వజుడిందు చేరలేదు. కల్కితో మిగిలినకూటమి శశిధ్వజునిపై దండెత్తిరి. శశిధ్వజుని సతి సుశాంతాదేవి, కల్కి విష్ణ్వవతారమనియు నాతనిపై యుద్ధమునకు డిగవలదని భర్తయైన శశిధ్వజుని ప్రార్థించినది, కాని ఆతడు వినలేదు. యుద్ధమునందు కల్కిని గాయపఱచి తన భార్యకు దర్శనమిప్పించు నుద్దేశముతో నాకల్కిని తన యంతఃపురమునకు దీసికొనివచ్చెను. చివరకు కల్కికి తమకూతునిచ్చి, రాజకీయ బాంధవ్యమును సంపాదించిరి. ఈ రాజ్యకూటమి యందు శశిధ్వజుడును కలిసెను. అందఱును కల్కి, విశాఖయూపుల నాయకత్వ మగధపై దండెత్తిరి. మగధను, నాడు జిన, శౌద్ధోదని యను వారు పాలించుచుండిరి. వారిని జయించిరి. రాజ్యకూటమిలోని వారెల్లరు శశిధ్వజు నేకగ్రీవముగ మగధయందు రాజుగ బ్రతిష్ఠించిరి. తన కుమారుడైన కాకవర్ణునకు కాశీరాజ్యమిచ్చి తాను మగధనేలెను.

మహాకవి శ్రీ విశ్వనాథ శశిధ్వజుని వృత్తాంతమును గల్కి పురాణ మాధారముగా బరిశీలించియుండలేదు. అట్లు పరిశీలించియే యున్నచో నీధూమరేఖయందు శిశునాగునిపాత్ర మఱియొక విధముగా నుండెడిది. పరిపాలనకాలము, రాజులసంఖ్యను గుఱించి పురాణములు విభిన్నముగా బేర్కొన్నవి.[6] రాజులసంఖ్య 10యనుటలో నేకవాక్యత

---

5. కల్కి పురాణము - 3వ అధ్యాయము.
హత్వా తేషాం యశః కృత్స్నం శిశునాగో భవిష్యతి ।
వారణాస్యాం సుతం స్థాప్య శ్రయిష్యతి గిరివ్రజమ్ ॥ **D. K. A. P. 24**

6. "శిశునాగా దశైవైతే షష్ట్యుత్తరశతత్రయం । [10, 360]
సమాభోక్ష్యన్తి పృథివీం కురుశ్రేష్ఠ కలౌయుగే॥ భాగ. 12-11-8
భవిష్యన్తిచ వర్షాణి షష్ట్యుత్తర శతత్రయం । [10, 360]
శిశునాగా దశైవైతేరాజానః క్షత్రబంధవః ॥ బ్రహ్మాండ **3-LXXIV-135**

యున్నది. పాలనకాలములో 360, 362 సంవత్సరములుగా భేదముగాన వచ్చును. శిశునాగుడు, కాకవర్ణుడు, క్షేమధర్ముడు, క్షేమజితుడు, బింబిసారుడు అజాతశత్రువు, దర్శకుడు, ఉదయనుడు, నందివర్ధనుడు మహానంది. అనుపదుగురు శిశునాగవంశములోని రాజులు.[7]

## ధూమరేఖ - ఇతివృత్తసంగ్రహము

శిశునాగుడు కాశీరాజ్యపు యువరాజు, మహాభారత యుద్ధమనంతరము 1138 యేండ్లు గడచినది. కాశీరాజ్యము మగధకు సామంతరాజ్యము. మగధకు నందివర్ధనుడు ప్రభువు. ఆయనకు వేదమరీచి యొక్క తెయే కుమార్తె. తల్లి బాల్యముననే చనిపోవుటచేత నీమె పోషణ మగధయందు సరిగా జరుగదని యెంచి నందివర్ధనునకు పినతల్లియు కాశీదేశపు రాణియునగు చంద్రమతీదేవికడకు పంపబడెను. శిశునాగుడును వేదమరీచియు వరుసకు పినతండ్రియు, కూతురును.

---

7) ఇత్యేతే భవితారోవై వంశేఽస్మిన్ శిశునాకజాః । [360]
శతాని త్రీణి పూర్ణాని షష్టిర్వర్షాధికానిచ॥ మత్స్య. CCLXX-14
ఇవి 360 సంవత్సరములని చెప్పగా, విష్ణుపురాణ, వాయుపురాణములు 362 సంవత్సరములని చెప్పినవి.
ఇత్యేతే శైశునాభా భూపాలాస్త్రీణి ॥ [362]
వర్ష శతాని ద్విషష్ట్యధికాని భవిష్యన్తి ॥ విష్ణు 4-24-19.
ఇత్యేతే భవితారో వై శైశునాకా నృపాదశ ॥ [10, 362]
శతాని త్రీణి వర్షాణి ద్విషష్ట్యభ్యధికానిచ ॥ వాయుపురాణము
శైశునాగా దశైవైతే భోక్ష్యన్తి పృథివీం నృపాః । [10, 360]
శతాని త్రీణి వర్షాణాం షష్టిర్వర్షాధికానిచ ॥ కలిరాజ వృత్తాంతము, 3-11
As taken by K. Venkatachalam, "The Ancient Indian History" Part I Page. 42.

నగుదురు. వయస్తారతమ్యము తక్కువగుటయు, కాశీపురమందు బాల్యాది యొక్కటియైన క్రీడాసాహచర్య ముండుటం జేసియువారి యొక యొక యనూహ్యమైన, యసంస్కృతమయిన సంబంధ ముద్భవించినది. ఆరహస్యము వారిరువురి నడుమనే గూడుకట్టుకొని యుండెను. ఇట్లుండగా వయసుచే వృద్ధుడును, కుమారైపయి గాఢానురాగుడు నయిన నందివర్ధనుడు వేదమరీచిని మగధకు బిలిపింప వృద్ధమంత్రులను బంపెను. వారు కాశీరాజ్యమున కొకటి రెండు పర్యాయములు జని, తిరస్కృతులయ్యును బ్రతికృతులయు, వృద్ధమంత్రులయు నభ్యర్థనపయి వేదమరీచి మగధకు బయనము కాక తప్పలేదు. ఈ ప్రయాణమునకు శిశునాగుని యామోదము లేదు.

శిశునాగుడు వేదమరీచి చూపిన యలక్ష్యవైఖరికి, దానామె యొడ గావించిన పాపమునకు మనసు నిలుపుకొనజాలక నాటి సాయం సమయమున కాశీపురపు కోటగవను దాటి భాగీరథి ప్రవహించని దిశాభిముఖముగా బయనమయ్యెను. పోయి పోయిశ్మశాన సమీపమున నటగల నగ్నికాంతి లక్ష్యము కాగా జేరెను. అచట నొక పిశాచ సదృశుడు కఱ్ఱకు నిప్పంటించి తద్ధూమపానము చేయుచుండెను. శిశు నాగుని పరిస్థితినిపరికించి యాతనికి బ్రతీకారము చేసిపెట్టెదనని, తద్ధూమ పానము చేయుమని ప్రోత్సహించెను. ఆతని గురుత్వమును స్వీకరించి ధూమపాన మొనర్చిన శిశునాగునకు దాను చేసినది పాపము కాదనియు, సహజమనియు నన్పించెను.

రాత్రి యంతయు శిశునాగుని కయి యన్వేషించిన భటులు యెటులనో తత్ప్రదేశమును గాంచి కోటకు యువరాజును జేర్చిరి. తండ్రి శిశునాగునికయి పరితపించుచుండెను. తండ్రికడ కేగి యాతనివైఖరి గాంచి యాతని యకారణవృద్ధత్వమునకు సంభ్రమమంది 'అయ్యో తండ్రీ!' యని సంబోధించెను. తచ్ఛబ్దము కాష్ఠగత ధూమ రేఖా

పరిమళభరిత వాయు సహితమైన వృద్ధరాజు నాసాపుటముల లోనికి జొరబడెను. తత్సమయమున రాజు కంటికో నొక విపరీతమైన భావమును గాంచినది శిశునాగు డొక్కడే. తల్లి బిడ్డను బరామర్శించినను నిర్లిప్తతయే ప్రత్యుత్తరము. సమీపించిన కుమారునితో "నీరాజ్యమును నీవు పాలించుకొనుము. నీ శత్రువులను నీవు దండించుకొనుము. నీ ప్రతీకారమును నీవు దీర్చుకొను మని పలికెను, ఇది గూఢ విషయముగా భావించి, రాణి గూఢచారి యయిన చిత్రశిఖండికి శిశునాగుడు కోట వదలిన నాటిరాత్రి యుదంతము సరయు నానతిచ్చెను.

చిత్రశిఖండి కాశీపురమందున్న మహా మంత్రవేత్త, ఖగోళ, జ్యోతిషశాస్త్రములందు విద్వాంసుడునయిన పరాశర శాస్త్రితో నీవిషయమును ముచ్చటించెను.ఉభయులు నయ్యదర్శనీయాగ్నిస్థానమునకు బోయి యచటగల స్థల పరిశీలనము జరిపిరి. మహోద్దండులై రాజభక్తిగలిగిన నలువురు వీరుల నక్కడ కాపుంచగా జిత్రశిఖండికి నానతియొసంగి యట బాటింపవలసిన నియమములను బేర్కొని పరాశర శాస్త్రి గృహోన్ముఖుడయ్యెను. చిత్రశిఖండి చంద్రమతీదేవి కడకు జని ఎవడోయొక దుష్టమతి, పిశాచస్వభావుడు రాజభవనములోనికి బ్రవేశింపనున్నాడనియు, వానిని రానీయకుండుటకు జేయవలసిన సకలచర్యలు పరాశరశాస్త్రి గైకొనుచుండెననియు జెప్పెను ధూమరూపమున వాడీ వరకే చేరెననియు, నింకేరూపమున రానుండెనో ప్రతీక్షింపవలసి యున్నదనియు రాణిచెప్పగా నాశ్చర్యపడుట చిత్రశిఖండి వంతయ్యెను.

పరాశరశాస్త్రికి జిత్రశిఖండి రాణి పలుకులను జెప్పెను, ఆయన రాణిని దర్శింప నుద్దేశించెను. చిత్రశిఖండి పరాశరుని రాణికడకు గొనిపోయెను. రాజ్యరక్షణ నిమిత్తమై, యాపద నెదుర్కొనుట కావశ్యకమయినచో నొక మ్లేచ్ఛవిద్య నుపాసింప వలసియుండుననియు నది రాణితో బ్రసంగించిన యనంతరము నిర్ణయింతునని చెప్పెను. ..

వచ్చినవాడు జయద్రథ నామకుడని చెప్పెను. కోట్లో శిశునాగుడు వచ్చెడు గురువునకయి నిరీక్షించుచుండెను. రాజుతో పరాశరుడు తచ్ఛరీరమున ప్రవేశించిన వానిని మున్నెఱింగిన వానివలె సంభాషించుట రాణి కాశ్చర్యమయ్యెను.

పరాశరుడు మ్లేచ్ఛమంత్రోపదేశ మొనర్చిన గురువు చెప్పిన నియమములను పాటించి జపము చేయుచుండెను. రిపుంజయుని కాలము నాటి జటాధారి, వింధ్యపర్వత కాంతారమందున్న భైరవీదేవత, వాని శవము, చితి; శవనిర్గత ధూమమును వెలార్చుచున్న కొన్ని దుబ్బులను గాంచెను. శిశునాగు డట్టి దుబ్బులకు సంబంధించిన కాష్ఠగతాగ్ని సముద్భూత ధూమమును పీల్చుటయు తన మనోనేత్రముతో గాంచెను.

ఉదయము పరాశరశాస్త్రి శిశునాగదర్శనము జేసెను. తన గురువును రానీయకుండుటకీ పరాశరుడే ప్రముఖహేతువని భావించి యాతడు విముఖుడయ్యెను. శిశునాగుని రాజదర్శనముచేయ నభ్యర్థించెను. ఇష్టము గాకున్నను శిశునాగుడు రాజదర్శన మొనర్చెను వివాహప్రస్తావన జరిగెను. ప్రభువునకు నాంధ్రరాజ దుహితను శిశునాగునకు బెండ్లిచేయవలెనని సంకల్పము కలిగెను. శిశునాగుడు మాటాడలేదు.

పరాశరశాస్త్రి నాటిరాత్రి మరల జపము చేసెను. అతనికి మున్ను శ్మశానమందు గాంచిన దుబ్బుల క్రిందనున్న నైదుదుంపల నొకసర్పాకృతి త్రవ్వి వాని నొడిచి పట్టుకొని వాయువేగ మనోవేగములతో నాదుంపకజ్జును నిప్పుచేసి తద్ధూమము నాంధ్రరాజదుహితచే బీల్పించుట జూచెను. వింధ్యపర్వత ప్రదేశములందున్న దుబ్బులను, శ్మశానమునందున్న దుబ్బులను త్రవ్వి తేవలసినదిగా జిత్రశిఖండిచే నియమింపబడిన సేవకు లాజ్ఞప్తులైరి.

ఇంతలో బరాశరుడు జయద్రధుని గుఱించి రిపుంజయుని కాలమున జరిగిన యితివృత్తమును గుఱించి నాటి పల్యంకికా వాహకులలో నొకడు కాశీక్షేత్రమున వసింపుచుండగా వానివద గ్రహించెను. ఆ జయద్రధుడు దుష్టసంస్కారయుత జీవుడని యెఱింగి వాసిసిద్ధాంత మేదియో ప్రచారముచేయ నిట్టి యవస్థ పడుచున్నాడని గుర్తించెను. రాజువద్దకేగి నాంధ్రరాజ దుహితను శిశునాగునకు జతగూర్చుటకు నంగీకారము కోరెను. రాణియు బరాశరశాస్త్రియు గలిసి, యేకాంతముగా రాజునకు శిశునాగునితో సమావేశ మేర్పాటు చేసిరి. రాజు శిశునాగుని బెండ్లి కంగీకరింప చేసెను, వివాహానంతరము తానువాంఛించిన ప్రతీకారము జరిగితీరుననియు పలికెను. శిశునాగుడు గురువునకై ప్రతీక్షింప నక్కఱలేదనియు తానే సర్వము సమకూర్తునని రాజశరీరములోని జయద్రధుడు పలికెను.

ఆంధ్రరాజ పరివారము పెండ్లికయి తరలివచ్చిరి. నిర్ణీత సమయమునకు ముందే విచ్చేయుటకు హేతువు ఒక అస్థిగత శరీరుడు, వాని వలన నంతత్వరితముగ జేరగల్గిరి. వారు కాశీనగరమునకు కొంతదూరమందుండి రాజమర్యాద నభిలషించిరి వీరికి గల యవాంతర మిషచే నారాత్రి కాశీపురమున వారు నడుగిడ వీలులేకపోయెను. రాత్రి పరాశరుడు జపమున గూర్చుండెను. తన్మంత్రసామర్థ్యముచే నా హేతువు పురములో నడుగిడజాల కుండెను.

పిఱువాత వారందఱు పురస్కృతులై కాశీపురమున బ్రవేశించిరి. శిశునాగునకు, నాంధ్రరాజ దుహిత వంకజాబిల్లికిని బెండిలి యయ్యెను. వేదమరీచి మగధచేరునప్పటికి తనతండ్రికి సన్నిహితుడుగా నుండి సర్వరాజ్య వ్యవహారములందు మేటియె యజాతశత్రు వను వాడు వ్యవహరించుచుండెను. ప్రకృతిచే నభ్యర్థింపబడి యధికారులచే వర్తిడులకు గుఱియైన పిదప వేదమరీచి సింహాసన విషయ నిర్ణయ

సమావేశము జరిగెను. వృద్ధమంత్రి, రాజు, వేదమరీచి అజాతశత్రులు సమావేశులైరి. వేదమరీచి జరిగిన యథార్థమును తండ్రికి నివేదించెను. అయ్యకృత్యమునకు విచారించి యది బహిర్గతము కాకుండు నటుల తగిన కట్టుదిట్టములు ప్రభువొనర్చెను.

అజాతశత్రువు జరిగినవిపరీతమునకు దట్టుకొనలేక వేదమరీచి, ప్రభువుల యనుమతితో గాశీపురమేగెను. శిశునాగుని జూచి తనకు శిశునాగుడు శత్రువనియు వేదమరీచి వివాహమాడ బోవుచున్నదనియు చెప్పి మఱలెను. శిశునాగుడు సంతోషించి వంకజాబిల్లితో కొంత కాలము సుఖించెను. కాకవర్ణుడను కుమారుని బడసెను. శిశుజనన మనంతరము వంకజాబిల్లి మనఃకాలుష్యము తొలగెను. బుద్ధి పాదరస సదృశమయ్యెను.

వంకజాబిల్లి సర్వాధికారి యయ్యెను. ఆమె జయద్రథునితో నాతడు రాజశరీరము నుండి వెల్వడి మగధయందు శిశునాగుని రాజ్యస్వీకారమున కనుకూలపరిస్థితులను వేదమరీచి సహాయముతో జేయవలసినదిగా ప్రబోధించి వానిని బంపెను. కాశీరాజు మరణించెను. శిశునాగుడు ప్రభువయ్యెను.

మగధయందు ప్రభువయిన నందివర్ధనుడు, వృద్ధమంత్రియు మరణించిరి. వేదమరీచి ప్రకృతుల యలజడి వయి యజాతశత్రుని పెండ్లియాడెను. దాంపత్యములేని పెండ్లియది. ఒకనాడు జటాధారి రూపమున జయద్రథుడు మగధయందు ప్రవేశించెను. వేదమరీచి వాని నాదరించెను. నాటినుండి సర్వము నాతని కనుకూలము.

వంకజాబిల్లి పరాశరశాస్త్రికి మరణోపదేశము గావించెను. మరునాటి యుదయము కాకవర్ణుడు, శిశునాగుడు వంకజాబిల్లి పరాశర శాస్త్రి యింటికేగిరి. అటనొక రేచుకుక్క యుండెను. అది కాష్ఠగత ధూమనిపీత. ఆ ధూమముపీల్చినచో నా వాసన యున్న వాని

రక్తము పీల్చును. ఆ శునకము శిశునాగునకు మచ్చిక చేయబడెను. కాకవర్ణుడు, వంకజాబిల్లియు గూడ మచ్చిక జేసికొనిరి. సాయంత్ర మునకు నాశునకముతో వారు రాజభవనము చేరిరి. వఱువాత పతాకరశాస్త్రి లేడు.

అజాతశత్రునకు పూర్వపు గౌరవమును లేదు. అప్రథ లాతనిపై పెచ్చు పెరిగెను. తనపయి కుట్ర జరుగుచున్నదను సంగతిగ్రహించెను. ఇట్లుండగా కాశీరాజు శిశునాగుడు వేదమరీచిని జూచుటకు సతీసమేత ముగా వచ్చెను. రెండు నెలలైనను వారు పోలేదు. రాజ్యగ్రహణ. మునకు సర్వము సిద్ధమయ్యెనని యజాతశత్రునకు దెలిసెను. శిశునాగు నితో దలపడనెంచెను. వేదమరీచి హత్య గావింపబడి యానేర మజాత శత్రునిపై మోపబడెను. శిశునాగాజాతశత్రులు ద్వంద్వయుద్ధ మొనర్చునట్లును, నజాతశత్రుడు విజయుడయినచో నాతనికి శిక్ష తప్పుననియు సమయము చేయబడి కోటలో యుద్ధమేర్పాటు చేయ బడెను. దానిలో శిశునాగుడు డస్సిపోగా నాజటాధారి అజాతశత్రుని చంపెను. ఆ జటాధారి, వంకజాబిల్లిచే బంపబడిన శునకము పరస్పర ప్రాణఘాతుకము లయ్యెను.

## ఇతివృత్త నిర్వహణము

రచయిత యీ నవలయందు ప్రదర్శించిన కథాసంవిధానము,

1. కాశీరాజ్యమునకు మగధకును సంబంధమును గల్పించుట

2. మగధపయి వైరమునుబూని తల్లక్ష్యముతో శిశునాగుడు సామ్రాజ్యమును సంపాదించుట కుద్యుక్తుడయినట్లుగా నితివృత్తమును కొనసాగించుట.

3. అనూహ్యమైన సంఘటనలు సంభవించుటకు ద్వివిధమైన అభౌమశక్తులను ప్రవేశపెట్టుట.

4. అనుస్యూతమయిన జయద్రథపాత్ర యీ నవలయందు పురాణవైరమును కొనసాగించుట కుచితమయిన కాలముగా భావించి తత్ప్రయోజనమును సాధించునట్లు పాత్రను నిర్మించుట.

5. ధర్మాధర్మహానివృద్ధులను గౌతమబుద్ధుని జననముతో సమన్వయించుట.

6. అవసరముతీరినంతనే పాత్రను నిష్క్రమింప జేయుట.

1. కాశీరాజ్యమునకు మగధకు నేవిధమయిన సంబంధమును పురాణములు పేర్కొనలేదు. కల్కిపురాణము పేర్కొన్నను నీరచయిత దానిని స్వీకరింపలేదు. నాడు మగధ ప్రముఖమైన రాజ్యమయ్యును, కొన్ని స్వతంత్రరాజ్యములు గూడ నున్నవి. అవంతి, కోసల, హస్తిన భల్లాట (కాశి) అట్టివానిలో గలవు. ఈ రాజ్యములకు రచయిత సంబంధమును గల్పింప వలసియున్నది. రచయిత కాశీరాజు పేరు పేర్కొనలేదు, కల్కిపురాణములో శశిధ్వజుడు కాశీరాజుగా బేర్కొన బడెను. ఈ శశిధ్వజుడు శిశునాగుడే గాని యన్యుడు కాదని డి. ఆర్ మన్కడ్‌గారి నిర్ణయము! మగధను బాలించెడు నందివర్ధనుడు చారిత్రక పాత్ర. నవలలో వీరిరువురు బంధువులు, నందివర్ధనుని తల్లి, శిశునాగుని తల్లియు సోదరులు, కాశీరాజు దేవేరి పేరు చంద్రమతీదేవి. కాశీ రాజు కుమారుడు శిశునాగుడు నందివర్ధనుని కూతురు వేదమరీచి. వేదమరీచి కల్పితపాత్ర, ఈ సంబంధము నాధారము చేసికొనియే మగధ కాశీరాజ్యములకు విడదీయరాని యితివృత్తము పురోగమించినది.

2. వేదమరీచియు, శిశునాగుడును తండ్రియును, కూతురును. వేదమరీచి బాల్యముననే నందివర్ధనుని సతి చనిపోవుటచే నామెను శిశునాగుని తల్లి చంద్రమతీదేవి కాశీపురమున బెంచుటకు నిశ్చయించినది, రచయిత కావ్యత్వమునకు దోహదము గావించెడి నిర్వాహణమిట్లు చేసినాడు. ఇచట రచయిత గావించిన వేదమరీచీ శిశునాగుల యత్రము

సంబంధము సర్వత్ర వర్జనీయమే. 'కావ్యాలాపాంశ్చవర్జయేత్' అను న్యాయ మవశ్యము స్వీకారమగును. తారాశశాంకాది కావ్యముల నాలంకారికులు నిషేధించివారు. కాని యిచ్చట రచయిత చెప్పదలచిన యంశము కలి విడంబనము. గౌతమబుద్ధుని జననము, ఆయన మతము నాస్తికము. నాటికాలమున నిదివిజృంభించినది. పైదికవస్తుతత్త్వముపరిహ సింప బడుచుండెను. ఈకాలమునకు శిశునాగ వేదమరీచుల యక్రమ సంబంధమునకు దగిన హేతువును జూపుటకు రచయిత కవకాశము గల్గి, కలి పరాకాష్ఠను స్థిరీకరించెను, దీనికి రచయిత—

"వింధ్యగిరిస్వామి తనశరీరమును వింధ్యపర్వతగుహాసమీప మున దగ్ధము చేసె వెలార్చిన ధూమసంతానమునందు కలివిడంబించెను. ఆధూమ రేఖలతో గలి తాదాత్మ్యము నొందెను." ( 34) ఆ ధూమ రేఖ యెట్టిదనగా !

"దాని హేతువు వింధ్యగిరిస్వామియొక్క దగ్ధశరీరసంగత ధూమ సంతానవాహినీ సమాక్రాంతకలిపురుష లక్షణోపహితమైనయొకగుమ్మ్మ వాని తత్పూర్వ జన్మకృతాభ్యవహార భూతాన్నాదిక ద్రవ్యసంపన్న మైన యాధూమరేఖ" లే 'వావాని తల్లి దానిని గర్భమునందు వహించి నపుడభ్యవహరించిన యన్నాదికములకు హేతువులై సస్యమునందు సంక్రమించిన మేఘజలాంతర్గత తత్కలిపురుషమహస్సంతానము."(37)

"అట్టి అధర్మము శిశునాగుని జీవసంపుటి యందుగలిగెను."
( 37 ) అని తదధర్మ ప్రవృత్తిని ప్రస్ఫుటీకరించును,

ఏవంవిధమయిన ప్రముఖహేతువుచే నాపాత్ర రచింపబడినది, అధర్మమయినచో నది కాలదోషము. కలిదోషము. నాస్తిక దోషము. వాని జీవసంపుటిలోని దోషమగును. అనగా రచయిత మాటలలో-

---

1. Puranic Chronology. Page 78.

"బ్రహ్మకు సరస్వతి భార్యయగుట లోనిదోషము. సూర్యునకు ఛాయాదేవి భార్యయగుటలోని దోషము. అనగా నీసృష్టి గుణ దోషసంకరమైనదని యర్థము" (250)

జీవులయందసంస్కృత భావమెట్లు వ్యాపించును? రచయిత యన్నట్లు సర్వజీవులకు వెలుగభిమతము, చీకటి యనభిమతము. అట్లే ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తి ప్రతిజీవుడు వాంఛించును, ప్రతిజీవియు తాను కోరినది తనకు లభించినపుడు కర్మసిద్ధాంతమే లేదు. లోకమందట్లు సంభవించుట లేదు, బహుపూర్వాపూర్వజన్మల సంస్కారబద్ధుడై జీవి పుట్టునని 'తం విద్యాకర్మణీ సమన్వారభేతే, పూర్వ ప్రజ్ఞాచ, యనునట్లు, తత్సంస్కార మసంస్కారమయినచో, ధర్మబద్ధముగానిచో, నిట్టి జన్మలు కలుగును. వానినివ్యక్తమొనర్చుటయే లక్ష్యముగా వేదమరీచి, శిశునాగుల పాత్రలను నిర్మించెను.

2. రాజ్యము వీరభోజ్యము. వైవాహికబంధము వలనను రాజ్యముసంప్రాప్త మగుట కద్దు. రాజ్యవిస్తరణకాంక్షయు నదనపు కారణము కాగలదు. చారిత్రకముగ మగధను శిశునాగుడు జయించినట్లే యున్నది. కాని యిచటి పరిస్థితి వేరు. ఒక బంధుత్వమును, దానియందసంస్కృత వ్యాపారమును యీ యిరురాజ్యముల నడుమ పొందు పఱచెను. శిశునాగుని యనుమతి లేకనే వేదమరీచి మగధకు ప్రకృతుల యభ్యర్థనపై వెళ్ళెను. ఇది శిశునాగునకు కోపహేతువయ్యెను. కాని రాజ్యమును కబళించి వేదమరీచిని సంహరింపవలసినంత క్రోధము మాత్రముకాదు. అది యెంతవరకుండెననగా "ఈ పాపము నాయందు సాధించినంత ద్రఢిమ యామె యందు సాధించలేదనియా? ఆ దోషము నాయందధికముగా నారోపించుటయా" ( 54 ) అను తార్కికమైన యూహా చేయుట వఱకు నున్నది. ఇది కోటగవను దాటి శ్మశాన సమీపమునను వస్థితుడైన పిశాచ సదృశ మానవాభాసజీవి యాడిన

పలుకులలో నీ వైరము దృఢమయ్యెను.

"ఆ స్త్రీ నీయందు తనకున్న ప్రేమకంటె మఱి యింకొకచోట యెక్కువప్రేమను కలిగించుకొన్నది. దానికి ప్రతిక్రియచేయుట యెట్లనగా నేయితరమైన స్థానము తత్ప్రేమభాజనమైనదో ఆస్థానమును నీవు నశింపజేయుట దానిమీద నీవధికారివగుట." అపుడొక అత్యాశ్చర్యకర సన్నివేశము. శిశునాగుడు "తత్కాష్ఠమును జేతబూని నోటిలో ముక్కులలో నాధూమరేఖను బోసికొనుటయు జరిగెను." అంతవరకు బాగుగనే యున్నది. అతడొక మదాంధీభూత చేతస్కుడయ్యెను. కవికల్పించిన యూహ "తనయు వేదమరీచియు సంబంధము పాపమను కొన్నాడేమి! అది సహజమైనది. పిశాచసదృశమైన మానవహేతుకముగ వాని సాధించిపెట్టుట పయి నీవైరమారంభ మయ్యెను. అట్లే తద్వైరమును కొనసాగించి మగధరాజ్యసంపాదనమను లక్ష్యమును సాధించెను.

మొదటి మూడు నవలల యందు అభౌమకత ప్రవేశపెట్టబడెనని రచయిత పేర్కొనెను. అద్భుతావహసంఘటనలు భారతీయ పాశ్చాత్యసాహిత్యములందువిచిత్రావహమైనట్టివిగావు. వీనియౌచిత్యానౌచిత్యచర్చయు విచారణీయము కాదు. ధర్మాధర్మముల సంఘర్షణము జగత్తునందనివార్యము. ధర్మము వర్ధిల్లినను, అధర్మము విజృంభించినను సంఘర్షణము సంఘర్షణమే. ఈ సిద్ధాంతమే పాటింపబడి యితివృత్తమున కొక నూతనోత్తేజము సంతరింపబడినది.

1) పాంచభౌతిక శరీరముతో నొనర్పజాలనివి యభౌమ మనియే పేర్కొనబడును.

అభౌమశక్తులు ద్వివిధము. మ్లేచ్ఛశక్తులు, దైవికశక్తులు. ఇందు మొదటివి యధర్మ ప్రభావమును పెంపొందించును. దైవికశక్తులాస్తిక్యమును, ధర్మభావనమును వృద్ధిపఱచును.

1. జయద్రథపాత్ర :- ఈతడు సశరీరికాడు. వాయువుతోఁగలిసి, శిశునాగుని యుచ్ఛారణముతోఁగలిసి కాశీరాజు నాసాపుటములలో బ్రవేశించి యాజీవు నధఃకరించి తానధికృతుడయ్యెను.

2. శ్మశానస్థలమున నుపస్థితుడయిన పిశాచసదృశుడు కోటయందు బ్రవేశించి శిశునాగునకు వైరమును తీర్చిపెట్టెద నన్నవాడు పరాశర శాస్త్రి మహామంత్రానుష్ఠానమహిమచే కోటప్రవేశింప జాలకపోయెను.

3. ఒకసర్పాకృతి శ్మశానస్థలసమీపమున నున్న దుబ్బులలో నైదింటిదుంపలను కొఱికి కాశీపురము నుండి యాంధ్ర రాజధానికి ననూహ్యమైన వేగముతో జని తద్రాజదుహిత వంకజాబిల్లికి నాఘ్రామ మును బీల్పించి శిశునాగునకు యోగ్యమయిన వధువుగా రూపొందించి యతిమానుషక్రియను నిర్వర్తించిన వాడయ్యెను. దీర్ఘఫలితమును సాధించెను.

4) బహుదీర్ఘకాల ప్రయాణగమ్యమగు నీ కాశీపురమున కాంధ్ర రాజదుహితృపరివారము బహ్వల్పకాలముననే శ్రమరహితముగ జేరుట.

5) జయద్రధుని పరకాయప్రవేశము,

ఇక ధర్మవిషయమైన యఘటామములు, వీనికి 1. పరాశరశాస్త్రి మహామంత్రానుష్ఠానపరుడయి, జ్యోతిష శాస్త్రసంవేద్యుడయి, రాజ రక్షణకు జేసినసేవయందీ యఘటామకతలు దర్శనమిచ్చును. ఒకమ్లేచ్ఛ మంత్రము నుపాసించి తద్దేవతనుప్రత్యక్షమొనర్చుకొని.తదుపజ్ఞకముగ జయద్రధుని సర్వరహస్యములను గ్రహించును, తద్రహస్య గ్రహణముతో నా వచ్చిన యాపదలను సయితము ననుష్ఠానముతో నెదుర్కొనును. 2) శిశునాగున కుపదేశమొనర్చి కోటలోనికివచ్చెదనన్న నాగురువునుతనమంత్రశక్తిచే నష్టదిగ్బంధనము చేసిప్రవేశింపనీయలేదు. 3) ఆంధ్రరాజదుహితతో వచ్చెడి మ్లేచ్ఛ విద్యాపారంగతుడైన

యా 'పంగలక్ర' 'బిల్లలత్రాడు' నామకుని తనమంత్రశక్తిచే గట్టెను.

4) రాజశరీరము నందధిక్రృతుడైన జయద్రథజీవుని పల్క-రించి వాని లక్ష్యములనుద్దేశము లెఱింగి తత్తత్సన్నివేశానుగుణమయిన కార్యములు నిర్వర్తించెను.

మొదటిరెండు నవలలందున్న జయద్రథపాత్రకిది భిన్నమైనది. ఆ నవలలందున్న జయద్రథపాత్రలు సశరీరులు. సతీసుతులు గలరు. అచట వాని యభీష్టము మాహేశ్వరి ద్వారమున నెరవేఱక పోవుట చేత మఱియొక రూపమున నీనాస్తిక భావప్రభావమును భూమిపై కల్పింపనెంచి దగ్ధమైనట్లు రెండవ నవల చెప్పుచున్నది. తద్ధూమము వాయువయి, అది యభ్రరూపమై వర్షించి సస్యముల పుట్టువున కాధారమై, వానిని దినిన జీవుల మనస్సంపుటి నాస్తికభావ దోష దూషితము కావలెనను లక్ష్యముతో నింధన విద్య నుపాసించి శరీరమును చితికర్పణము చేసెను. పంచాగ్నివిద్యలో జీవుని పునఃప్రవేశమున కీ మార్గము ప్రవాహణుని చే శ్వేతకేతువునకు నాతని కుమారునకు నుపదేశింపబడినది. కనుక వానికి శరీరము లేదు. వాయుసంచారము, పరకాయప్రవేశాదులు, అల్పజీవుల శరీరమునందు ప్రవేశించి యాజీవుల నధఃకరించెడి బ్రతుకు మాత్రము మిగిలియున్నది. ఈ నవల యందీ పాత్ర బహుముఖీనమై వర్తిల్లినది. అధర్మభావ వ్యాప్తికి సంకేతమయి తత్త్జీవసంపుటిని బరిశీలించి నవలకు బరిపూర్ణత్వమును సిద్ధింపజేసినది.

కల్యాది 1188 సంవత్సరములు గడచినది. నాస్తిక భావము బీజదశనుండి మొలకలయినది. ఇట్టి భావములు గలవారు ద్వాపర యుగమందును లేకపోలేదు. శిశుపాలుడు, దంతవక్త్రుడు, జరాసంధుడు, పౌండ్రకవాసుదేవుడు మొదలయిన వారి పైని చారిత్రలోనే నశించినది.అట్లుదీర్ఘకాలప్రయోజనాపేక్ష సాధింపగలచి జయద్రథుడీ యెత్తుయెత్తినట్లు చెప్పుచున్నాడు. వానికి [illegible]

గౌతమబుద్ధు డుదయించనున్న కాలమది. నాస్తికమును బృహస్పతి సృజించెను. 'నాస్తికో వేదనిందకః' యని మనువు చెప్పెను. వేద దూషణము, శ్రుత్యాచారవిరుద్ధవర్తనము వీనిలక్షణములు. తదనుసరణ కాలము నాటి కారంభమయ్యెను. తద్విజృంభణమును ప్రవేశపెట్టి తత్పరాకాష్ఠలోని యనౌచిత్యమును రచయిత పరామర్శించెను కనుక నీనవలయందు ధర్మప్రహాసము సంభవమయ్యెను. అధర్మవిజయ సంకేతముయిన శిశునాగులు రాజ్యపాలన మొనర్చిరి. ఎంత అధర్మాభిభూత కాలమయినను ధర్మముండితీరును. ఆ ధర్మమే వంకజాబిల్లి, అజాతశత్రువు, పరాశరశాస్త్రి, చంద్రమతీ దేవ్యాదులు. ధర్మమున కధర్మమట్లే. వీరు జయద్రధాదులు. ఇవి వెలుగు చీకట్లు వంటివి. వెలుగు తెలియవలెననగా చీకటి యుండవలెను. చీకటికి నట్లే. ఈ నవలయందు సూచనప్రాయముగా దెలియజేయ బడిన గౌతమబుద్ధ జనన వృత్తాంతము నీరీతిగనే సమన్వయించుకొనినచో నట్టి యసంస్కృతుడైన శిశునాగునకు మగధ రాజ్యసింహాసనాధిపత్యము లభించుటలోని యాంతర్యము, కవిహృదయము వ్యక్తమగును.

ఈ నవలయందు మఱియొక విచిత్రాంశమును కవి సంతరించెను. పాత్రావశ్యకత తీరినంతనే వాని నిర్గమన క్రియ సూచించుటయే యీ విచిత్రాంశము.

1) శిశునాగుని తండ్రి కాశీరాజు. కాశీరాజు జీవించి యున్నంతదనుక శిశునాగునకు రాజ్యార్హత లేదు. రాజ్యము స్వీకరించనిదే ప్రతీకార చింతనయే జరుగదు. ఇవి అన్యోన్యాశ్రయములు. కనుక ప్రభువు మరణించుటకు జయద్రధాత్మ ప్రభుశరీరమునుండి నిష్క్రమింపవలెను. ఆ జయద్రధుడు కోటగవను దాటుటకు పరాశరశాస్త్రి బ్రతుకరాదు. పరాశరశాస్త్రి బ్రతికియున్నచో నాయుష్టదిగ్బంధనము వీడదు. జయద్రధుడు బయటపడవలెనన్నచో నీ పరాశరశాస్త్రి మరణింపవలెను.

తదన్యో న్యాశ్రయమిచ్చుటను సమన్వయపడుచున్నది. కనుక రచయిత దీనికి నాయికను వంకజాబిల్లిని జేసెను. రాజశరీరమునుండి జయద్రధుని వెడలనడిపెను. పరాశర శాస్త్రికి మరణోపదేశము గావించెను. మరణమునకు ముందే జయద్రధుడు ప్రవేశించిన శరీరమును విదళనము గావించుటకు తత్కాష్ఠాగ్నిధూమ నిపీతశ్వానమును తానుమచ్చిక చేసికొని సిద్ధపఱచుకొనెను. ఇది కవి యొక్క కథాసంవిధాన నైపుణికి, నూహాశాలితకు ప్రముఖోదాహరణము. అనంతరము వేదమరీచి హత్య. ఆమె యున్నచో బ్రకృతులు శిశునాగాదుల నిష్టపడరు. ఆమె హత్య అజాతశత్రునిపై మోపబడి మగధరాజ్యపుటధికారానధికారవర్గము వానిపయి తీవ్రాసహ్యాసైముఖ్య ప్రకటనము నిర్వర్తింపబడెను. వానిని వంకజాబిల్లి తననీతిచే జంపించెను.

శ్వానమునకు జయద్రధుడు, జయద్రధునకు శ్వానము పరస్పర మృత్యుహేతువులగుట వంకజాబిల్లి నీతికోశములోని శ్లోకమయ్యెను నది విశ్వనాథ మనోభూజమున ఫలించిన మధుర రసాలము.

## పాత్ర చిత్రణము

శిశునాగుడు :- అధర్మ సంకేతమునకు బ్రతీకలై నాస్తికతకు నిదర్శనములైన పాత్రలివి. వర్ణాశ్రమములు పాషండబహుళధర్మములై యుండుట, పాపపరులు సిరియు, నరోగతయు పరమాయువును గలిగి యుండుట కవి లక్షణములని మహాభారతము చెప్పుచున్నది![1] కేవలము స్త్రీత్వ పుంస్త్వములు సంయోగమున కాకరమగును.[2] రచయిత యీ పాత్రలచే కలిధర్మనిరూపణము చేయనెంచినట్లు తోచును.

శిశునాగుని దుష్టచేతస్కతకు హేతువును ప్రవచించి వేదమరీచి కొక సుఖాపాదకమయిన స్థితి కల్పింపబడెను.

---

1. అరణ్యపర్వము - చతుర్థాశ్వాసము. కలిధర్మప్రకారము.
2. "స్త్రీత్వే పుంస్త్వే చ విహితద్విప్రత్వే సూత్రమేవచ"

వేదమరీచి మగధకు బోయినది. శిశునాగుని యాలోచన మారంభమయ్యెను. తత్స్వరూపము "శరీరముయొక్క యచ్ఛమైన పాశవమైన పాపభూయిష్ఠమయిన స్పష్ట్యథోగతమైన యొక భావమునకు, మనస్సునందొక తెరపిగలిగి బహుప్రజాసుఖ సమ్మిశ్రితమైన భావనతో గూడుకొనిన పుణ్యసంస్పర్శకలిగిన ధర్మసంబంధమైన రాజ్యాధికార వాంఛకు నెంతటి దవ్వు. అది యెచ్చటనో స్వర్గలోకపు బొలిమేరల లోనిది. ఇది నరకలోకపు నడిమి ప్రదేశమునగల మూలసౌధములోని యంతఃపుర ప్రదేశమువంటిది." (51) ఇది శిశునాగుని యంతఃకరణము నందలి మెఱవు. రచయిత దీనినత్యంత మార్దవముతో వ్యక్తీకరింప చేసెను.

ఇంత యాలోచనచేసి దానిని బోగొట్టుకొనుటకు తీవ్రమయిన ప్రయత్నము చేయువఱకు సకలకలుషవినాశిని యయిన గంగానదిని సైతము తాకదలచని యాద్రఢిమ యేమయ్యెను. గురుదత్త కాష్ఠగత ధూమపానమందాంధీభూతస్థితి యాతనికి దానొనర్చినది పాపము కాదని పించెను, అది సహజలక్షణముగా దన యూహాకు దోచెను. కనుక నే యాతడు విరోధమును సాధింప నుద్యమించినాడు. దానికి దంద్రి యందు ప్రవేశించిన జయద్రథాత్మ దోహదము చేసినట్లు "నీ ప్రతీకారము నీవు పాలించుకొనుము, నీ శత్రువులను నీవు దండించుకొనుము." అనువాక్యములచే స్పష్టమగును.

ప్రతీకార సాధనమేది? అది వంకజాబిల్లి ఈ జయద్రథాత్మయే శిశునాగున కాంధ్రరాజదుహిత యగు వంకజాబిల్లిని పెండ్లికి గుదిరించెను. శిశునాగుడు మొదట నంగీకరింపక పోగా జయద్రథుడే, "నీకీ వివాహమయినచో నీ ప్రతీకారము సాగును. ఆ ప్రతీకారము సాగుట వాని (పరాశరశాస్త్రి) కిష్టములేదు. నేను గురువని నీకు తెలిసినదా!" (209) యని సాధనమును బహూకరించును. వంక

జాబిల్లికి సుమారు దుదయించును, అనంతరము సాధనము తన ప్రయత్నము కొనసాగించును. శిశునాగుని పని యూరక చూచు చుండుటయే. ఈతడామె కర్థమయినది పిశాచగురువునకు శిష్యుడనియే.

"ఆ గురువు పిశాచము, ఈమె దేవత. నన్ను పిశాచశిష్యునిగనే పాలించుట కీమె నిశ్చయించుకొనెను" అను శిశునాగుని వాక్యములో దీనిని జూడవచ్చును. ఈ విధముగ శిశునాగుడు మగధసామ్రాజ్య చక్రవర్తిగ నగుటకు వీలయ్యెను.

ఈ నవలలో శిశునాగుడు తానుగా మగధరాజ్యమునకు చక్రవర్తిత్వమును సాధించుట కెట్టి ప్రయత్నము చేయలేదు. సర్వము వంకజాబిల్లి సిద్ధము చేసిపెట్టెను. తుదకు శిశునాగు డజాతశత్రునితో పోరు సయితము నొనర్పలేకపోయెను. ఇది పాత్రకు పెద్దలోపముగనే చెప్పవలయును. ఈ నవల యందు శిశునాగుడు పరప్రత్యయబుద్ధి.

2) పరాశరశాస్త్రి :- మొదటినవలలో "వినయశర్మ" రెండవ నవలయందు గంగాధరశర్మ రాజకుటుంబములందు నైరాశ్యము, క్లిష్టత సంభవించినపుడు వానిని తమకుగల యసమానశాస్త్ర పరిచయముచేతను, నఖండ తపోవిభవముచేతను బరిష్కారములు వెదకి భద్రత చేకూర్చిరి. ఈ నవల యందట్టి పాత్ర పరాశరపాత్ర. కాశీపురమున నెక్కడనో పర్ణకుటీరమునందు తపశ్శక్తిమాత్రమే తోడుగా నివసించు విప్రుడు. రాజ్యమునకు బ్రాహ్మణుని బుద్ధియావశ్యకమనియు, నాతనికి. ధర్మబద్ధమైనవర్తనము, వేదవేదాంగవేత్తృత్వము, సకలస్మృతీతిహాసాద్యభిజ్ఞత మంత్రానుష్ఠానశీలము, రాజభక్తి, దేశభక్తి నిత్యప్రత్యగ్రమైన పరిశీలనాపాటవములు ముఖ్యమని మనువు పేర్కొనెను. కవి తల్లక్షణముల నీ పాత్ర యందు నిక్షేపించెను.

చిత్రశిఖండి సామాన్యమైన విషయముగా భావించిన శ్మశాన ప్రదేశ దృశ్యము నవశ్యమైన రాజవ్యవహారముగా పరాశరుడు భావిం

చుట తన యసమాన ఋగ్వేద జ్యోతిషవిజ్ఞాన మంత్రానుష్ఠాన పంజనిత ప్రభావముతో కాశీరాజ్యమునకు గడ్డురోజులు దాపురించెనని దానిని తొలగించుటకయి సర్వాత్మనా కృషియొనర్చిన యీ పాత్ర అలౌకిక దర్శన శక్తి కల్గి అధిభౌతిక శక్తుల చర్యలను గమనించుచు, రాజ్యసంక్షేమమునకయి కుత్సితనియమములు పాటించి యైనను వానిమూలమును కనుగొని పరిష్కారోపాయములు సూచించుటలో నీపాత్ర పాఠకుల ప్రశంసకు పాత్రమగును. జయద్రథాత్మను పరిశీలించుట, వాని చర్యలను గమనించి కాశీరాజ్యమున వానినడుగిడ కుండ చేయుట, ఆంధ్రరాజదుహితయైన వంకజాబిల్లికి గాఢ్ఠసర్గత ధూమపానము చేయించిన వ్యక్తి యామెతో కాశీపురము వచ్చుటకు యత్నింపగా నారాకను నిషేధించుట, వంకజాబిల్లి మరణోపదేశ మొసంగగనే సద్యోమరణము పొందుట ఈ పాత్రవైశిష్ట్యము.

1. భామా ఒభామ శక్తులను స్వాధీనపఱచుకొనిననేగాని రాజ పురోహితుడు తన కర్తవ్యనిర్వహణమును సమర్థముగా చేయజాలడు.

2. సత్త్వశక్తులెప్పుడును తామసిక శక్తుల నథఃకరించును.

3. రాజకీయముగ క్లిష్టపరిస్థితి కలిగినప్పుడు రాజపురోహితుడు పీఠైనంతగా నారాజ్య సుస్థిరత్వమునకు దగినకృషి యొనర్చి తన పురోహితత్వము నన్వర్థ మొనర్పవలెను.

4. జీవితమందు తృణప్రాయమైన దృష్టియుండవలెను.

వేదమరీచి:- "మనయిద్దరి రహస్యమునకు నెప్పుడో, యెక్కడో యొకచివరని యుండవలయును. ఆ చివర దానియంతట నది సంభ వించదు. దానికి మనమే తుది నేర్పఱచవలయును. అదియెట్లు పరిణ మించునో మనకు తెలియదు.........ఏదియైనచో గాని మ్మా నేను దానికి సిద్ధము. నీవును సిద్ధముకమ్ము" వేదమరీచి శిశునాగునితో నన్న

మాటలివి. ఇది సంస్కార ప్రబోధకముగా సాగిన మానసిక వేదనము. పాపమును పాపమునుగా జూడగలిగిన సంస్కారవతి 'వేదమరీచి'.

చిత్రశిఖండి గిరివ్రజమునకు జేరి శిశునాగుని వివాహవిషయమై వేదమరీచితో ప్రస్తావన చేయును. ఆమె అర్ధరాత్రమున శిఖండి విడిదికి వచ్చి యావార్తవిని కుప్పకూలిపోవును. ఇక్కడ కవిమఱేమియు వివరింపలేదు, పాపమును పాపము కాదనుకొను వాని యూహ యదిం. పరాశరశాస్త్రి చిత్రశిఖండితో "అతడు వివాహము చేసికొనునని తెలియగా నొక స్త్రీ యంత దుఃఖించినా అతడారాటపడడు." ఇందు వేదమరీచీశిశునాగుల యధర్మ రహస్యమంతయు నిక్షేపించినాడు. ఆమెదుఃఖమునకు హేతువు వేఱు, అతడారాటపడని కారణము వేఱు ఈ రెండింటిని సమన్వయము చేసినాడు కవి.

శిశునాగునకు వివాహ పరమార్థమేమియో తెలిసినచో తన్నిట్లు జేసియుండడనియు, నట్లు చేసిన ఖలునకు వివాహమేమిః యని దుఃఖము. తమ సంబంధమును మదాంధతచేత స్త్రీపురుష సంబంధముగా భావించుట చేత ననాసక్తత.

వేదమరీచికిని వివాహమయ్యెను. అక్కడ వసుడజాతశత్రువు. వంకజాబిల్లి సర్వము గుప్పిట నుంచుకొని రాజకీయ చక్రమును పరివర్తింపించుచుండెను. జయద్రథుని పరకాయ ప్రవేశము జేయించి మగధకు బంపెను. యోగిగా వచ్చిన జయద్రథుడు వేదమరీచిని స్వాధీనము చేసికొని రాజ్యాధికారము నిష్కంటకము జేయవలసినదని వంకజాబిల్లి యాదేశము, వేదమరీచి నిజముగా యోగికి లొంగినదా! శిశునాగునకు రాజ్యమప్పగింత పెట్టదలచినచో తానే ప్రత్యక్షములో జరిపించవచ్చునుగదా! తనకయి త్యాగమొనర్చిన సచ్చీలు డయజాత శత్రుని తానవమానించుటేల! తాను నిస్సహాయురాలయ్యెనా! అజాత

శత్రుని బలపరాక్రమములను విశ్వసింపలేదా ! ఈ పాత్రపట్ల కలుగు సందేహములివి.

ఇది యోగమాయ యని సులువుగా దేప్పవచ్చును. అంత కంటె తానుపొందిన నిస్పృహ నిస్సహాయతను గూడ సమన్వయింప వచ్చును. అజాతశత్రుని పరిశీలనమున "ఈ యోగి వేదమరీచి కేదో మందు పెట్టెనో మంత్రోపదేశము చేసెనో, మైకము క్రమ్మించెనో, వేదమరీచి మొగమును జూచినచో దొలుతటి కళలేదు. తొలుతటి వివేకములేదు. తొలుతటి యుత్సాహములేదు. తొలుతటి సౌందర్యము కూడ భాసించుటలేదు." (139) ఈమెను శిశునాగుడు చంపించెను.

వీరి వివాహ మభారతీయము. అభారతీయమనగా రచయిత దృష్టిలో రఘువంశములోనున్న "ప్రజాయై గృహమేధినాం" అన్నది యుండి తీరవలయును. 'ప్రజయాహి మనుష్యః పూర్ణః' అనునది శ్రుతి. ఇదిలేని దాంపత్యమని తాత్పర్యము.

"వేదమరీచి" అను వైదికనామమును ధరించిన యాజీవుడు తనహృదయమెంత వైదికసంస్కృతమయ్యును లౌకిక నాస్తిక భావ ప్రతాడితమైన జీవుడు ఎట్టి సుడుగుళ్ళకు లోనగునో వాని యంత మెట్లుండునో యాపాత్ర ద్వారమున రచయిత తెలియజెప్పి తన ప్రతిభా నైశిత్యముతో నద్దాని నిరూపించెను.

4) వంకజాబిల్లి :- ఈమె ఆంధ్రరాజ దుహిత, పెండ్లికూతురని శాబోలు కవి ఈమె సౌందర్య వర్ణనము చేసెను. సర్పాకృతిని బూని జయద్రథుడు కాశికాపుర సమీపస్థ శ్మశానస్థితమైన దుబ్బుల క్రింద వేళ్ళను గొటికి యా దుంపలను గొని యాంధ్రరాజధాని కేగి వానికి నిప్పుముట్టించి యామె నిద్రావశమైయుండ నామెచేత వేయి పర్యాయములు పీల్పించెను. అనంతర మామె మనశ్శరీరము లామె వశమునలేవు. అత్మాభిజ్ఞ మాత్రము కలదు. దానితో నీసర్వదుష్టత

నెదిర్చు గలిగిన శక్తివచ్చును. మనశ్శరీరధర్మములు కీని కి లొంగుట లేదు. అనగా నాత్మాభిజ్ఞత మనశ్శరీరములపై పెట్టు అని నిరూపించుటయే యీపాత్రలక్ష్యము. ఇట్లు పోల్పించి యీమె శిశునాగునకు ద్వాహ మగుటకు సిద్ధము చేయబడినది. ఇది ఆంధ్రరాజదుహిత విషయముననే గాదు. ఏ రాజదుహితయైనను శిశునాగునకు గాబోవు భార్యార్హత యట్టిది. శిశునాగుడీ గుమ్మును బీజగతముగనే యుంచుకొనెను. అది శ్మశానమున బీజ్వబడిన కాష్ఠగతాగ్నిధూమమున ప్రథమ మయ్యెను. అట్టిధూమనిపీత జీవియే శిశునాగునకు సమాగమమగుచో నిక నేమున్నది. తత్సంతానమట్టిది. వాని భావములట్టివి. అవి వ్యాప్తములు కావలయును గదా! జయద్రథాత్మ యందుకే యీ నందివర్ధనుని గుండెలో పీట వైచుకొని కూర్చుండెను. రచయిత యీ పదకము నిట్లు నిర్వహించెను.

వంకజాబిల్లి వచ్చి తన సర్వదుఃఖమును పరాశరశాస్త్రి కడ వ్యక్తమొనర్పగా శాస్త్రి యీమెతో "వాడాత్మ లక్షణములను నిర్మూలింపలేడు.. నీమనస్సు మీద నీకుగల యధికారము నెవ్వడు నపహరింపలేడు, నీకడుపున నెవ్వడు పుట్టినచో నీకేమి ? నీవు శివుని యందు భద్రాకృతిని గన్నా" (243) శివునియందు భద్రాకృతి కాగల్గినది గనుకనే యీమె శివశిరచ్చంద్రరేఖ-వంకజాబిల్లి.

వాడాంధ్రదుహిత నెన్నుకొనుటకు హేతువును కవి యిట్లు సమన్వయించెను. "ఆనాటి దీ యాంధ్రరాజధాని పరిచయమేకదా! నేడు మా యువరాజును నాంధ్రరాజదుహిత కిచ్చి పెండ్లి చేయించవలయునన్న యూహకు హేతువైయుండు." (183) ఇది 'భగవంతునిమీదిపగ' యను నవలలోని జనుడ్రుడు, వాని యాంధ్ర దేశపర్యాటనము. అతడచట నడిపిన వృత్తము. వైషల్యములను స్పృశించుటయే.

వివాహమయ్యెను. మనసు తేలికపడినది. వంకజాబిల్లి శిశు నాగునకు మొగిలిలోని జాబిల్లివలె నయ్యెను. వారికి పుత్రసంతానము. వానిపేరు 'కాకవర్ణుడు.' అన్వర్థ నాముడు, వేదమరీచి వివాహ వార్తను విని శిశునాగునితో నామె "మన వివాహమెట్టిదో యావివాహమట్టిదే, మన వివాహమునకు నీపిల్లవాడు ఫలితము, ఆవివాహమున కిట్టి ఫలితలు గూడ నుండదు." ఇందు వంకజాబిల్లి వేత్తృత్వ, నేతృత్వము ము రెండును ప్రతిఫలించును.

"నేను నీచేతనే యా ప్రతీకారము చేయించెదను. నీ జీవితము యొక్క పరమార్థ మాప్రతీకారమే కదా! నీ గురువు రాడు. నీ గురువు యొక్క స్థానమును నేనే వహించుచున్నాను." అని సర్వము తత్ప్రతీకారోన్ముఖముగ వంకజాబిల్లి తన ప్రజ్ఞను నడిపించినది. నవల పూర్వార్థమున జయద్రథుడు ప్రేరేపించిన ప్రతీకారమును తాను నిర్వహించినది.

మఱియు నది కుకవి భావవిలసనమైన వ్యవహారముగాని సత్కవి యైన పరమేశ్వరసృష్టి సహజలక్షణముగాదు. సృష్టికి వ్యతిరేకమైన విషయము' వేదమరీచి, శిశునాగుల నడుమగల రహస్యమున కిది హేతువా! యని పరిశీలనము చేయగల్గిన కాశీరాణి చంద్రమతీదేవి, రాజనీతి కౌశల్యమునకు, కర్తవ్య నిర్వహణమునకు దీక్షబూనెడి చిత్ర శిఖండి, "ఈ మగధయందలి ప్రజలు ప్రజలుకారు, వీరు మనుష్యులు కారు, వీరు పశువులు, రాజద్రోహులు. కృతఘ్నులు ఈ రాజ్యమున కిట్లే కావలయును" అని ధర్మపరాభవమునకు కృంగిన యజాతశత్రువు లిందు పేర్కొనదగిన పాత్రలు.

జయద్రథుడు, (ఇది అనుస్యూతమయిన పాత్ర, ఈ నవలలోని యీ పాత్రకు శరీరములేదు. కాశీరాజాత్మనధఃకరించి తానధికారియై శిశునాగుని వైరము తీర్చిపెట్టెదనని విశ్వాసంప జేసినాడు.)

2) కాశీరాజు కుమారుడయిన శిశునాగునకు పెండ్లిచేయ నాంధ్రరాజదుహితను దెచ్చిన యాగంతకుడు. నెలలు పట్టెడి ప్రయాణమును నాంధ్ర నుండి మగధకు కొన్నిరోజులలో పూర్తి గావించెను. పంగలకఱ్ఱ - బిల్లలత్రాడు అని రచయిత వీనికి నామ ముంచెను.)

3) సర్పాకృతితో, శ్మశానసమీపముననున్న దుంపలను గొని పోయి యాంధ్రరాజదుహితృ నాసాపుటములకు తత్కాష్ఠధూమమును బట్టించినవాడు.

4) జటాధారియై జయద్రధాత్మ కాశీరాజును విడచి రెయిక శరీర మున ప్రవేశించి వేదమరీచికి నానుకూల్యముఁగల్గించి యామె హత్య చేయబడగా నానేరము నజాతశత్రునిపై త్రోయించి మగధరాజ్యమును వంకజాబిల్లి యానతి ననుసరించి కాశీరాజు శిశునాగునకు నప్పగించి శ్వానము తనను జంపగా, తానును శ్వానమును జంపినవాడు. ఈ పాత్రలన్నియు నొక్కడే అతడే జయద్రధుడు.

## వ ర్ణ న లు

2) వంకజాబిల్లి వర్ణన:- ఈ నవలయందిది ప్రత్యేకత సంత రించు కొనును. దీనిని కవి రెండు ప్రదేశములందు నొనర్చెను,

"రాజదుహితపేరు వంకజాబిల్లి, ఆమె వంకరగా జూచును. ఆమె ఫాలము చందురుని విదియనాటి వెండిసన్నని కొడవలి తనమును వెలార్చెను. ఆమె నేత్రములు వంకజాబిల్లి క్రిందనున్న రెండు నక్షత్రములవలె నుండెను, అవి నక్షత్రములుకావు, బృహస్పతియు, శుక్రుడును వచ్చి నాసా రేఖకు నిరుదెసల కాపుండి నట్లనిపించును, ఆమె శిరోజములు మత్తమధుకరగరుదంచల పీనశోభాసనాథములై భాసించు చుండెను..." ఇట్లు సౌందర్యవర్ణనముసాగినది, భౌమాభౌమసంబంధి

నవల, సౌందర్యమునఁ జేఁ వర్ణింపబడుట విశేషము. నేత్రములు, ముఖము (ఫాలము) అభౌమములు. మింగిలిన శిరోజములు, చెక్కిళ్లు, శరీరము, వసనము, ఇవి భౌమములు. (పే. 205) ఇది కాశీపురమునకు వచ్చు నప్పుడు గావించిన వర్ణనము.

పరాశరశాస్త్రి చిత్రములో జూచినపుడు భావించిన వర్ణనము సరిగా నిదియే. (పే. 22౦) దీనికి ప్రతికృతియా యని యామెను జూడగనే యాశ్చర్యపడినాడు.

1) చీకట్లు ముదురుచున్న సమయమున శిశునాగుడు కాశీపుర బాహ్య ప్రదేశమును దాటి పోయెను. ఆ చీకట్ల వర్ణనము (పే. 55)

"ఎరువు చిక్కఁగా నంటుకొన్న చోట బొలములో గట్టిన వరిదుబ్బు ముదిరి నలుపెక్కినట్లు, తరిగిన యాచ మరునాటికి బిరుసెక్కి చేతుల కంటుకొనునట్టి శ్యామలత్వమునకు దిరిగినట్లు, పాంసులా సాయంకాల విట ప్రతీక్షాశకలితాపాంగ సన్నిహిత గాఢాంజన రేఖ యట్లు, బ్రహ్మదండిగింజ నూనెచేత బిరుసెక్కి నునుపెక్కి యొక మెత్తదనముతో పొడిపోళ్ళాడు మాతంగకన్యా శిరోజములట్లు, దుష్ట భర్తృదత్త గాఢచపేట వికృతాస్రగ్ధసిభవ ద్బిందుసంచయ సమాలోకిత సాధుభార్యా సితచ్ఛటాకలిత మృదుకపోల దృశ్యమాన శలాకా రేఖ యట్లు......అదర్శనీయాగ్ని సంజనిత బహుధూమరేఖా సమాహార భూత నీలమేఘములట్లున్నదట యాచీకటి.

ఈ వర్ణనములో రైతుల పొలములు - వరిచేలు, ఎరువులు, వాని వలన పైర్లదుబ్బుకట్టుటలు, దుష్టభర్త సాధుభార్యల గృహకల్లోల ములు, జీడిగింజలనూనె మాతంగకన్యలు తలకువాడుదురను విషయము, యంకాలమందు విటప్రతీక్షచేసెడి పాంసులావర్తనములు వర్ణింపసా బడినవి. శ్మశానాగ్ని, ధూమరేఖలు చెప్పుటతో భవిష్యత్సన్ని వేశ

సూచనము చేయబడినది. అంటియూచ కూర బహుళకాలవ్యయలబ్ధ వ్యంజనము. దానికయి రాత్రిపూట యూచనుతఱిగి పీటియందుంతురు. తఱిగిన కూర బిరుసెక్కకుండుటకు పసుపు వేయుదురు. దానివి వఱువాత చిన్నచిన్నముక్కలుగా కోయుచో చేతులకు నల్లదనమంటుకొనును. ఇట్టి చక్కని యూహ యిందుచోటు చేసికొన్నది. మొదటి రెండువాక్యము లల్పపదసమాహార సమాసములుకాగా పిదపవి దీర్ఘ సమాస సముచ్చయము.

ఇంక నిల్లే ధూమము శిశునాగునిచే బీల్పబడిన వాసనావర్ణనము (పే. 67, 68) పేర్కొనదగినది.

# 4. నందో రాజా భవిష్యతి

చారిత్రక పూర్వరంగము :- బార్హద్రథులు వేయి, ప్రద్యోతులు 138, శిశునాగులు 362, యేండ్లు భారతయుద్ధకాలమునాటినుండి పాలించిరి. అనగా భారతయుద్ధము, నాటికి పదునేనువందల సంవత్సరముల క్రితపు గాథ యని చెప్పవలెను. శిశునాగవంశములోని చివరిరాజు నందుడు. ఈయన కొడుకు మహాపద్మనందుడు. పురాణములు కాలగణనమును మహానందుని వఱకు, మహాపద్మనందుని వఱకును చేర్కొన్నవి.

మత్స్యపురాణమందు పరీక్షిత్తునుండి మహాపద్మనందుని వఱకు జరిగినకాలము 1500 సంవత్సరములుగా పేర్కొనబడగా.[1] బ్రహ్మాండ పురాణము 1050 సంవత్సరముల కాలము మహానందుని వరకు గడచెనని పేర్కొన్నది.[2] కలిరాజవంశావళిని రచించిన పర్గిటరు మహాపద్మనందుని వరకు గడచిన కాలము 1050 సంవత్సరములని చెప్పెడు శ్లోకము నుదహరించి యధఃసూచికయందు "పంచదశోత్తరమ్" (1015), "పంచశతోత్తరమ్" (1500) "శతమ్‌పంచదశోత్తరమ్" (1115), శతమ్ పంచాశదుత్తరమ్" (1150) అని పురాణములలోని వివిధ పాఠముల నుట్టంకించెను. ఈ గణనము స్పష్ట

1) మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరీక్షితః (1500)
ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరం మత్స్య. 271_36శ్లో.

2) మహానందాభిషేకాంతం జన్మ యావత్పరీక్షితః । (1050)
ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరం ॥ బ్రహ్మాండ, 11_74_227

3) మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరీక్షితః । (1050)
ఏవం వర్ష సహస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరమ్ ॥ D. K. A. P. 58.

నిర్ణయము చేయుటకు వీలులేని విధముగ పురాణములన్నియు తికమకను బెట్టినవనవచ్చును. ఒకటి మహానందునివఱకు. మఱియొకటి మహాపద్మనందుని వఱకు జరిగిన గణనమిందు చూడవచ్చును. మహానందుడు శిశునాగ వంశములోని చివఱి వాడనియు, మహాపద్మనందుడు నందవంశీయుడనియు పురాణవచనము. ఇద్దఱును తండ్రికొడుకులు వీరిరువుర నడుమ 450 యేండ్ల భేదమున్నది. ఇది ఎట్లు సమర్థనీయమగును?

మహాపద్మనందుడు పాలించినకాలము 42 యేండ్లని పురాణ వచనము. ఈతని పాలనమయినంతనే మహాపద్ముడు ప్రభువగుచున్నాడు. భేదముపర్గీటరువారియధఃసూచికననుసరించి 350 యేండ్ల నుండి కానవచ్చుచున్నది. దీనిని పురాణములు సయితము సమన్వయింపజాలకున్నవి. వీనిపయి విశేషపరిశ్రమ చేసినశ్రీకోటవారును పరిష్కారమును సూచింపరైరి. పైగా వారిది సరియయినదే ననుచువ్యాఖ్య వ్రాసిరి.[4] ఇచటనున్న కీలకమును గమనించినచో సమన్వయము సిదించును.

ఏరియన్ వ్రాసిన 'ఇండికా' గ్రంథములో[5] డయోనిసిస్ నుండి సాండ్రకోట్టస్‌వరకు గలరాజులసంఖ్య 153 అనియు, వారిపాలన కాలము 6,042 యేడులనియు, వీనిలో మూడుపర్యాయములు రాజులేని పాలనము[6] సాగెననియు, అందు మొదటి పర్యాయము

---

4) కలిశకవిజ్ఞానం. శ్రీ కోట. భాగ. 2 పే. 18, 19.

5) Fragments of the Indica of Megasthanese collected by Dr. E. H. Sehwan Back – translated by Jw. Maccrindle, Calcutta - 1926 P. 208.

6) Kingless period means "The period without imperial king from a recognised dynasty" it is of the openion of D. R. Mankad.

(అంకెలేదు) [7] రెండవపర్యాయము మూడువందలయేడులు, మూడవ పర్యాయము నూటయిరువది యేడు లనియు కలదు.

రాజులేని పాలనకాలమనగా ఒక సుప్రసిద్ధమయిన వంశము కొన్నివందల సంవత్సరము లనుస్యూతముగా పాలింపలేదనియే తాత్పర్యము. ఇక్కడ మొదటి పర్యాయము రాజులేనికాలము వ్రాయబడి యచట విచ్ఛిన్న మగుటచే నది విరామముగా సూచింపబడినది. పురాణములందీ గణనము రెండు విధములుగా నున్నది. ఒక వర్గమున ప్రధానరాజవంశములు, వారిపాలనకాలములు వ్రాయబడి, రాచరికము లేని కాలము పూర్తిగా వదలివేయబడెను, రెండవవర్గమునందీ రాచరిక మనుభవింపని కాలమును పూర్వవంశమునకో, తరువాత వంశమునకో కలుపబడిన విధానము బ్రహ్మాండపురాణము మొదటి వర్గమున కుదాహరణముకాగా మిగిలినవి రెండవ వర్గమునకుదాహరణ మగును. ఈ సందర్భమున మన్కడ్ గారు శిశునాగుడు పాలించినది 18 సంవత్సరములని బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవనియు కాని అది 12 సంవత్సరములుగా నుండుననియు మహానందునకు, మహాపద్మనందునకు నడిమిగల 350 సంవత్సరములను శిశునాగ వంశమునకు కలిపి 362 సంవత్సరములా వంశము పాలించెనని పురాణములు పేర్కొనెననియు చెప్పినదే యుచిత మనిపించుచున్నది. అప్పుడు శిశునాగ వంశమునందు 10 మంది రాజులుండక పోవలసివచ్చును, బార్హద్రథులనుండి రాజులు 22, ప్రద్యోతులైదుగురు, శిశునాగులు పదుగురు మహాపద్మడు ఒకటి మొత్తము (22+5+10+1) 38 మంది రాజులగుచున్నారు. వీరి మొత్తము పాలనకాలము 1500 సంవత్సరములని చెప్పబడగా వీరి సగటు పాలనకాలము 40 సంవత్సరము లగుచున్నది.

మహానందునివరకు లెక్కించినచో బార్హద్రథులు 22, ప్రద్యో

7) Vacancy shown – not filled up as fragment.

తులు 5, శిశునాగులు 10_కలిసి 37 గురు రాజులగుచున్నారు. వీరి మొత్తము పాలనకాలము పెక్కు_పురాణముల ననుసరించి 1150 యేండ్లను కొన్నచో మహానందుని వెంటనే మహాపద్ముడు వచ్చును. కాలభేదము 350 సంవత్సరములగును. కనుకనే ఏరియన్ గ్రంథములోని విరామ స్థలములోని రాచరికము లేనికాలము 350 సంవత్సరము లయియుండు నని యూహించుట లెస్స. అప్పుడు రాజుల క్రమము సయితము మారును. ప్రద్యోతు లైదుగురు అవంతీరాజ్యమున స్థానము సంపాదించుకొందురు.* శిశునాగుడు, కాకవర్ణుడు శిశునాగవంశములోని నందివర్ధన మహానందుల స్థాన మాక్రమింతురు. క్షేమధర్ముడు, క్షేమ ధ్వజుడు, బార్హద్రధుల యనంతర పాలకులు. పురాణములందున్న యీ పట్టిక చూచినచో విది సుబోధకమగును.

1 నుండి 22 వరకు బార్హద్రధులు, 23 ప్రద్యోతుడు, 24 పాలకుడు, 25 విశాఖయూపుడు, 26 జనకుడు, 27 నందివర్ధనుడు.

శిశునాగు వంశము 1) శిశునాగుడు 2) కాకవర్ణుడు 3) క్షేమ ధర్ముడు 4) క్షత్రధ్వజుడు 5) విధిసారుడు (బింబిసారుడు) 6) అజాత

---

8) మహానందాభిషేకాన్తం జన్మ యావత్పరీక్షితః ।
ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరం ॥ 227
ప్రమాణం వై తథావక్తుం మహాపద్మోత్తరం చ యత్ ।
అంతరంచ శతాన్యష్టౌ షట్త్రింశచ్చ సమాస్తృతాః ॥ 228
ఏతత్కాలాంతరం భావ్యా న్ధ్రాన్తాద్యా ప్రకీర్తితాః ।
(బ్రహ్మాపురాణము 74 అధ్యాయము

(ఇందు మహాపద్మునకు పరీక్షిత్తునకు కాలము పేర్కొనబడలేదు. తరువాత శ్లోకమున మహాపద్మునకు నాంధ్రులకు 836 సంవత్సరము లంతరమని చెప్పబడినది.)

* ప్రద్యోతులు మగధను పాలింపలేదను వాదమున్నది

శత్రుడు 7) దర్భకుడు 8) విజయుడు 9) నందివర్ధనుడు 10) మహానంది

మార్పు చేయవలసిన క్రమము :- మగధపాలకులను, అంవతీ పాలకులను వేర్వేరుగా చూపవలసిన యవసరము కలదు.

1. మగధ పాలకులు :- 1 నుండి 22 వరకు బార్హద్రథులు 23 క్షేమధర్ముడు, 24 క్షత్రధ్వజుడు; 25 బింబిసారుడు, 26 అజాత శత్రుడు, 27 దర్భకుడు, 28 విజయుడు, 29 శిశునాగుడు (నందివర్ధనుడు), 30 కాకవర్ణుడు (మహానంది)

2. అవంతీపాలకులు :- సోమాధి నుండి సేనజిత్తు వరకు గల మగధ పాలకులతో సములుగా 5 గురు, ఇరువదిమంది వీతిహోత్రులు, 26 ప్రద్యోతుడు, 27 పాలకుడు, 28 జనకుడు, 29 నందివర్ధనుడు. 30 విశాఖయూపుడు.

బౌద్ధగ్రంథమయిన మహావంశమున మగధరాజులలో ప్రద్యోతులు లేరు. అందు బార్హద్రథుల యనంతరము పాలించిన రాజులలో వారి పాలనకాలముగూడ వ్రాయబడుట ప్రత్యేకత.

బార్హద్రథులు 1000, బింబిసారుడు 52, అజాతశత్రుడు 32. ఉదయి 16, అనిరుద్ధకుడు, ముండకుడు8, నాగదశకుడు24, శిశునాగుడు, 18, యేండ్లు మగథను పాలించిరి. వీరి మొత్తము పాలన కాలము 1150 యేండ్లు.[9]

ఈ శిశునాగుని పాలనమువరకు 1150 సంవత్సరములని పేర్కొనుట మన పురాణములలో పేర్కొనబడిన కాలముతో సరిపడు చున్నది.

మహాభారతయుద్ధము క్రీ. పూ. 3138 వ సంవత్సరమయినచో మహానందుని అభిషేక కాలమును (1150) తీసివేసిన 1988 వచ్చును.

9. Extracts taken puranic Chronology PP 78 - 88
Ancient Indian History Part I – P. 42

అది మహానందుని యభిషేకకాలమగుచున్నది. ఇప్పుడు మహానందుని వఱకు 1150 సంవత్సరములయినచో మహాపద్మనందుని వఱకు 1500 యేడులు సరిపోవుచున్నది.

మహానందుని నుండి మహాపద్మనందుని వఱకుగల యంతరము 350 సంవత్సరములు. ఏరియన్ గ్రంథములో విరామస్థలముగా సూచింపబడిన ప్రథమ ప్రజారాజ్యకాలమునకు సరిపోవుచున్నది. అదియునుగాక మహానందునివఱకు లెక్కించి వెంటనే తరువాత రాజు కాలమునే పురాణములు గణింపవలసిన యవసరమేముండును ? యన్నది కూడ నొకయాలోచన. ఆ నడిమికాలమును పురాణములు కొన్ని లెక్కింపనట్లు బ్రహ్మాండపురాణములోని శ్లోకమున గమనించియే యున్నాము. లెక్కించినవారు శిశునాగవంశమునకు గలిపి 1500 సంవత్సరములుగా తేల్చియున్నారు. దీనిని మనము సమన్వయము జేసికొనుటలో నున్న క్లేశమేగాని యదార్థములేక యని మాత్రము భావింపరాదు. దీనిని కోట వారు నిశితముగా పరిశీలింపలేదని వారికలిశక విజ్ఞానగ్రంథమును బట్టి యవగతమగును. సమన్వయము నీ క్రిందివిధముగా సరిచూడవచ్చును.

మహానందుని లెక్క— 1000+138+12= 50—1150
మహాపద్మనందుని లెక్క— 1000+138+362—1500 (350+12)
మహావంశములోని లెక్క— 1000+150—1150 *

ఇంక నందులను గుఱించి పురాణము లనుసరించిన వైఖరిని గమనింతము. నవనందులనియు, వీరందఱును గలిసి నూఱేండ్లు పాలించిరని చెప్పుట యొకమార్గము. నందులు తొమ్మిదిమందియని చెప్పెడి పురాణములుమహాపద్మనందునిపేరు మాత్రము చెప్పి సుమాల్యాద్యాక

* ఇందు ప్రద్యోతవంశము లేదు. శిశునాగునకు 18 సంవత్సరము లీయబడినవని తెలుపబడినది.

అనియు 'అష్టపుత్రాః' అనియు పేర్కొన్నవి. ఏ యొక్క పురాణము మొత్తము పేళ్లను చెప్పలేదు. మహావంశము నందు కాలాశోకుడు వానికుమారులు పదుగురు కలిసి 22 సంవత్సరములు పాలించిరని మాత్రమున్నది. పురాణము లాధారముగా జెప్పవలెనన్నచో శిశు నాగుని నుండి చంద్రగుప్తుని వఱకు 9 మంది నందులు, నూఱేండ్ల పాలనమును జెప్పవలెను. మహావంశము ననుసరించి 20 మంది (1 కాలాశోకుడు+10 వానికుమారులు+9 నందులు) అని చెప్పి వారి పాలనకాలమును (22+22) 44 సంవత్సరములుగా జెప్పవలయును. ఈ రెండింటికి భేదము కావచ్చుచున్నది.

మహానందుని రాజ్యస్వీకారము క్రీ. పూ. 1988. ప్రసిద్ధ రాజ వంశము మగధనేలని కాలము ఏరియన్ వ్రాత ప్రకారము 350 సంవత్స రములు. అపుడది (1988_350) క్రీ. పూ. 1638 అగుచున్నది. ఇది మహాపద్మనందుని రాజ్య స్వీకార కాలము. ఒక్కొక్కరాజు సగటు పాలనకాలము 40 సంవత్సరములను మన్కడ్ మహాశయుని సిద్ధాంతము ననుసరించి 350/40_8+1=9 మంది రాజులగుచున్నారు. ఈ మహా పద్మనందుడు కూడ మహానందునకు చెందినవాడే కావచ్చును, బౌద్ధ గ్రంథములందు నంది, నందినులని పేళ్లు వాడబడినవి. కనుక నీపేళ్లు ఒకేవంశమునకు జెందినవేమో యని ముఖర్జిగారి యూహా. [10] తాత్కారణముననే శిశునాగుని నందివర్ధనునిగను, కాకవర్ణుని మహా నందునిగను పేర్కొనుచు నివి వారి బిరుదనామములై యుండునని మన్కడ్ మహాశయు లభిప్రాయపడిరి [11] ఈతడు నూఱేండ్లు మగధను పాలించినట్లు పురాణము లేకగ్రీవముగ దెల్పుచున్నవి కాన క్రీ. పూ.

---

10. Chandragupta Mourya and History of his times. Prof. R. K. Mukharjy P. 22

11. Puranic Chronology P – 86.

1383 న నారంభమయిన యీయన పాలనము క్రీ. పూ. 1638 తో నంతమయ్యెను. అనంతరము సూర్యచంద్రగుప్తుని పాలనము.

కాకవర్ణుడు మహానందుడయినచో నీతని తరువాత మగధ రాజ్యము తన సామ్రాజ్యవైభవమును కొంతకాలము పోగొట్టుకొని సామంతరాజ్యముగ మనుగడ సాగించియుండును. x 350 యేండ్ల యనంతరము, మహాపద్మనందుడు మగధకు తిరిగి పూర్వోన్నతిని కల్గించెను. నా మూజ్యస్థానము గావించెను. చక్రవర్తి యయ్యెను, దీనిబట్టి యీ కాలమున నీరాజ్యము ప్రధానమయిన రాజకీయ కేంద్రము కాకపోయెనని యూహింపవలెను. ఇట్టి సామంతపాలనమును మన పురాణములు గుర్తించినను, వానికి బురాణములందు స్థాన మొసంగలేదని దీనివలన దెలియుచున్నది, చక్రవర్తిత్వము నెఱపిన శిశునాగుని, కాకవర్ణుని, మహాపద్మనందుని పేర్కొన్నవి. మిగిలిన మధ్యకాలములోను నందులే పాలించిరనియు వారు సామంతులగుట చేతను ద్వివిధమయిన నందులను పేర్కొనుటలో నొక యుక్తవ్యక్తను కలుగుననియు భావించి పురాణములందు నవనందులు మాత్రమే పేర్కొనబడిరి. 350 సంవత్సరములు (సామంతపాలనము) + 100 నందులు='50 యేండ్లు, దీనిని సగటు పాలనకాలముచే భాగింపగా 450/40 11 రాజులు) 9 నందులు ( సామంతులు ) 1 మహాపద్మనందుడు సుమాల్యాదులు(చక్రవర్తులు) 1,అనిపురాణములు పేర్కొని నట్లయెను. [12] చారిత్రకముగా నీనందుల స్థానమిది యగుచున్నది. మహాపద్మ నందుని గుఱించిన పురాణకథన భుట్లునున్నది.

---

x అప్పుడు మహాపద్మనందుని మహానందుని సుతుడనుట పొసగదు.

12. "Accordi ng to a Buddhist source, founder of Nanda Dynasty who is there called Ugrasena (Mahananda according to Puranas) had in his early life fallen in the hands of brobers, later became the leader of robberers.

ఈతడు మహానందుని నటుడు. ఈతడు శూద్రగర్భోద్భవుడని అన్నిపురాణములు చెప్పినవి [13] ఈతడతిలుబ్ధుడనియు నతిబలుడనియు విష్ణుపురాణవచనము[14] శూద్రప్రాయులు నధార్మికులు ప్రభువులుగా నుందురని వాయుపురాణ కథనము[15] మహాపద్మనందునకు ధననందుడనియు నామాంతరమని కలియుగరాజవృత్తాంతము పేర్కొనును [16] బ్రహ్మాండ, మత్స్య, వాయు పురాణములు నందుని, నాతని కుమారుల పాలనకాలములను 88 సంవత్సరములు, 12 సంవత్సరములని వేర్వేరుగా పేర్కొన్నవి. [17] విష్ణు, భాగవతములు కుమాళ్లు, తండ్రియు గలసి నూరేండ్లు పాలింతురని చెప్పినవి.[18] కలియుగరాజవృత్తాంతము నందలి విశేషమేమన 'సర్వక్షత్రాంతకో నృపః,' 'ద్వితీయ ఇవ భార్గవః' అను వానిని వివరీకరించి చెప్పబడుట. ఇక్ష్వాకులు, పాంచాలురు, కౌరవ్యులు,

---

He followed the policy of "Pillage is preferble to Tillage." This does he was a robber king This period that is Robber King's period was ended with accession of Mahapadmananda".

Chandra Gupta Mourya and his Times P. 31.

13) "శూద్రగర్భోద్భవః" వి. పు. 4-24-20, "శూద్రాయాం కాల సంవృతః" వా. పు. "శూద్రాయాం కలికాంశజః" మ. పు.

14 'అతిబలోఽతిలుబ్ధో మహాపద్మః' విష్ణు. 4-24-20 అ.

15. తతోనృపా భవిష్యన్తిశూద్రప్రాయా స్త్వధార్మికాః"-వాయుఅXCLX-9

16. "ఉత్పత్స్యతే మహాపద్మో ధననంద ఇతిశ్రుతః" క.రా.వృ.శిఖా. 2 అ.

"According to Buddhistic Accounts Mahapadma is known as Dhanananda.

17. అష్టాశీతింతు వర్షాణి పృథివీ పాలయిష్యతి" వాయు 328

అష్టాశీతింతు వర్షాణి పృథివీ పాలయిష్యతి బ్రహ్మాండ 141

18. సంహత్య తత్సుతాహ్యష్టౌ సమా ద్వాదశ తే నృపాః" వాయు అ. 329

"తత్పశ్చాత్ తత్సుతా హ్యష్టౌ సమాద్వాదశ తే నృపాః" బ్రహ్మాండఅ142

కలియుగరాజవృత్తాంత మిట్లే చెప్పినది.

హైహాయులు, కాలకులు, ఏకలింగులు, శూరసేనులు, మైథిలులు వీరందఱు నాటిక్షత్రియరాజులు. వీరిని జయించిమహాపద్మనందు డఖిల క్షత్రాంతకుడనను, ద్వితీయ భార్గవుడనను నమ్మెవని చెప్పబడినది. వింధ్యహిమాలయముల నడుమగల ప్రదేశమునేకచ్ఛత్రముగ నీ నందు డేలుననియు యీ వృత్తాంతము వలన సూచింపబడినది[19]

ఈ చరిత్రాంశములలో శ్రీవిశ్వనాథ యీ నవలను సంతరించెను.

## "నందోరాజాభవిష్యతి" - ఇతివృత్త సంగ్రహము.

మహానందుడు మగధదేశమునకు చక్రవర్తి. మగధకున్న ప్రాముఖ్యముచే నాటి యార్యావర్తమునగల నితరములగు సల్పక్షత్రియ రాజులు వానిచక్రవర్తిత్వము నంగీకరింతురు. అతని సేనాని యుత్తుంగ భుజుడు. వీరిరువురు సూర్యుడు, వహ్నివంటివారు. ఆతని తైక్ష్ణ్యముచే నొకడు తేరిచూపరాని వాడు, దరిచేరకున్నను తనకు తానై వచ్చి పిపీలికలను సైతముభస్మీపటలము గావించునట్లు ప్రజలను మారణహోమ మొనర్చునంతటివాడు. మహానందునకు దనయులు మువ్వురు. ప్రథముడు కాలాశోకుడు, ఉత్తుంగభుజుడు నివ్వి. వీడు నేయి, మిగిలిన వారు రిపుంజయ, విధుసారులు. వీరు కామాగ్ని కింధనప్రాయ లు.

మహానందునకు క్షత్రియాపత్యముగాక శూద్రాపత్యమొకండు

19. మహాపద్మ స్తత్పుత్రాశ్చ ఏకంవర్షశతం అవనీపతయో భవిష్యన్తి॥"
'య ఇమాం భోక్ష్యన్తి మహీం రాజానః స్మ శతం సమాః॥భాగ 12-2-11
"ఇక్ష్వాకవాంశ్చ పాంచాలాన్ కౌరవ్యాం శ్చైవ హైహయాన్॥
కాలకా నైకలింగాంశ్చ శూరసేనాశ్చ మైథిలాన్।
జిత్వాచాన్యాంశ్చ భూపాలాన్ ద్వితీయ ఇవ భార్గవః॥
శాసిష్యతి మహాపద్మో మధ్యే వింధ్య హిమాగయోః॥"
కలియుగ రాజవృత్తాంతము 3 భాగము - 1 అధ్యాయం

కలదు, ఆతడును నందరాముడే. క్షత్రియ ప్రముఖు లీతని క్షత్రియునిగా స్వీకరింపకుండిన కారణముగా శూద్రుడే కావలసివచ్చెను. బ్రాహ్మణుల యాధిపత్యముచే నితరవర్ణము లధమస్థితికి దొలగ ద్రోయబడెనని యెంచెడినాటి క్షత్రియకులమునుండి మారిన బౌద్ధ ప్రపంచ మగ్రవర్ణ నిర్మూలనమునకు గంకణము కట్టుకొనెను. అప్పటికే తగుపిధముగా వారితో నితరవర్ణముల వారినిగూడ కాలాశోకోత్తుంగభుజులు బాధాతప్తులుగ నొనర్చిరి. ఇది యగ్రవర్ణ నిర్మూలనముగా నారంభమయి నను సర్వవర్ణ, సర్వప్రజాసంబాధకముగా బరిణమించెను. దానితో ప్రజలు విసివి నందరాజ్యవినాశమును, కాలాశోకోత్తుంగభుజుల మరణమును గోరికొనిరి.

సర్వక్షత్రియరాజ సమావేశము మగధలో నేర్పాటు గావింపబడెను. ఇక్ష్వాక, పాంచాల, హైహయ, శౌరసేన, మైథిలీ, కౌశాంబి రాజ్యాధిపతులు సమావేశమైరి. మిగిలిన ప్రభువులందఱు బ్రాహ్మణ వధను నిర్ద్వంద్వముగా నంగీకరించినను, కౌశాంబి ప్రభువయిన క్షేమకుడు మాత్ర ముగ్రవాదులయిన బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులను మాత్రము శిక్షింపదగునని భావించెను. అతని యందుండు ప్రీతిగౌరవాదులచే నా భావము క్షత్రరాజ సంఘము మామోదించెను. ఆ సభకు క్షత్రియులు గాని వారెవ్వరు నాహ్వానింపబడలేదు, కాలాశోకుడు, నుత్తుంగభుజులు మహారాజు నానతిగొని నందుని లోనికి బ్రవేశింపనీయలేదు. ఇది నందునకు పెట్టకల్గించెను. తాను ప్రజాపక్షము నవలంబింతునని, సర్వక్షత్రియులు తనకు శత్రువులనియు, వారి నిర్మూలనము తనధ్యేయమనియు శపథముగావించి కోటగవను దాటెను. ఇది క్షత్రసంహారమునకు బీజమయ్యెను.

నాటినుండి సర్వార్యావర్తమునందుగల క్షత్రియరాజ్యములు నిక్షత్రము గావింపబడుట మొదలయ్యెను. మొదట రేవానదీతీరస్థ

మాహిష్మతీపురము నేలెడిరాజు. ఇతడు హైహయవంశీయుడు. కార్తవీర్యార్జునుని వంశములోని వాడిగా దన్ను దలంచును. తనకు బితృదత్తమైన ప్రసేనజిత్తు నామమును బరిత్యజించి కార్తవీర్యార్జునుని పేరుంచుకొనెను. మరల పరశురాముడు గానవచ్చినచో దనచే మరణము తప్పదని యాతని దృఢవిశ్వాసము. ఆ విశ్వాసమును బెంచుకొనుచు తనరాజ్యమున గలవిప్రుల నందఱను వారివృత్తిని మాన్పించి పశుబాహులుగ నొనర్చి కాష్ఠవిక్రేతలుగా నియమించెను. నాటినుండి యారాజ్యమున బ్రాహ్మణులు పరశురాములైరి. వారిలో కొందఱు వ్యూఢోరస్కులు, ఆయసపరిఘులు నయిన యువక విప్రులను హేలగా రాజసదనమునకు బిలిపించి 'నీవు పరశురాముడవటరా!' యని వానిని వెక్కిరించి స్వయముగా సంహరించెడివాడు! ఒక్కొకచో సంహరింపించెడి వాడు. ఇది యా రాజ్యమున బ్రాహ్మణేతరులకును జుగుప్స కల్గించెను. తుదకొకనాడు వాని పాపము పండిన దన్నట్లు, ఒక పరశుధారి యయిన బ్రాహ్మణ యువకవీరుని చేత నాటి కార్తవీర్యార్జునుడు భార్గవుచే బడి చచ్చినట్లు హైహయాన్వయ సంజాతుడు నఱుకబడెను. ఆ బ్రాహ్మణ యువకుడు బ్రాహ్మణుడో లేక ఛద్మవేష ధారియో, యద్దేశాగతుడో. యద్దేశమునకు జనెనో తెలియదు.

కౌశాంబీరాజయిన క్షేమకుని కుమారుడు నిరమిత్రుడు ద్వితీయ కబళము. వీరు కౌరవాన్వయులు. హస్తినసుండి మనకథాకాలము నాటికి రాజ్యము కౌశాంబికి మార్పు గలిగెను. క్షేమకు డుపనిషన్మతవాది. ఈ రాజ్యమునకు, రాజ్యమును బాలించెడి ప్రభువులకు నొకగౌరవాధిపత్యములున్నవి. క్షేమకునకు సకల రాజన్యులందును చక్కని ప్రత్యయ ముండుటచే నాతడు బౌద్ధుడు గానంతమాత్రమున సంహరింప వలనుగాదు. ఆతని జంపినచో సకలక్షత్రియులతో విరోధము తెచ్చి పెట్టుకొనవలెను. దానికై బౌద్ధమతానుయాయులయిన క్షత్రియ రాజ్యాధినేతలాతని నుపేక్షించిరి కా క్షేమకుని

కుమారుడు బౌద్ధానుకూలుడు. తండ్రి చనిపోయి తానురాజ్యమునకు వచ్చుచో దేశమును బౌద్ధము చేయవలెనని యెంచెను. క్షేమకుడు పిలువబడి నాటి మగధరాజ్య మహాక్షత్రియసభలో నియన వెలువరించిన యభిప్రాయము చేతనే బ్రాహ్మణవధ మాగినది, కనుక నీతని ప్రత్యయ మసాధారణము. కుమారుని కైన నిరమిత్రుడు గదాపాణి. తాను బౌద్ధుడయ్యును నీవిషయమున బలరామ దుర్యోధన భీమాదులతో బోల్చుకొనును, గదావిద్యను బెక్కుశిష్యులకు నేర్పెను. తాను పోరుటకుమాత్రము తనయంతటివాడు లేకపోవుటతో నీతని స్థితి పరమేశ్వరుని ప్రాంగణమునందున్న బాణాసురునివలె నయ్యెను. తుదకు తనశిష్యులందు కొందర బాటవిక లుండగా వారిలో నొకడితని గురుత్వమును, విద్యానైశిత్యమును నిరసించి, యయ్యాటవిక నెదిర్చి గురుత్వమను సార్థకమొనర్చుకొని శిష్యుల ప్రతిష్ఠ నినుమడింప జేయు నావశ్యకతను శిష్యులు విపులీకరించిరి. యుద్ధసన్నద్ధుడై తండ్రిని బదరీయాత్రా నిమిత్త మనుమతిగొని హిమాలయ పర్వతప్రాంతాటవీ స్థిత ప్రదేశమున నా గదాధారి నెదిర్చి వాని నిలువరింపలేక కుప్పకూలి పోయెను. ఈ వార్తా శ్రవణముననే క్షేమకుడు మరణించెను. ఈత డశ్వత్థామకు ద్రోణుని వంటివాడు.

సింధునది పంచశాఖలు గల్గినది. సుదామ, విపాశ, గోకులి, శతద్రులు కలిసి పంచసింధు వైనది. పంచసింధు పరివర్తిత దేశములు పాంచాల బాహ్లిక కేకయ మద్రరోహిత దేశములు. వీనిలో పాంచాలమునకే యాధిపత్యము. వీరికి మన కథాకాలము నాటికి బౌద్ధమందు బద్ధాదర ముదయించిన హేతువున మ్లేచ్ఛులతో మత విషయమున కొంత యంగీకారము కుదిరినది. రెండును నవైదికము లగుటయే దీనికి ప్రాతిపదిక. పాంచాలమునందు యథేచ్ఛముగా బౌద్ధము విహరింప జొచ్చెను. ఇట్లుండగా బాహ్లికములోని నలగిరియను పట్టణమున వంశ

ధనుసను రాజవంశీయున కప్రయత్నముగా పాంచాలరాజ్య కాంతు కలిగెను. కోట, పట్టణము, సైన్యములేని పేదియూన పిచ్చివాని యానగా జనులు చెప్పుకోసాగిరి. ఒక సహోదరుని సాయముతో విపాశానదీ తీర మున నీతని రాజ్యము సాగుచుండెను. పాంచాల ప్రభువుపద్దను రాజు బారమేగి యాతనిచే దృణీకరింపబడి, కోటకు సేనతో తరలివచ్చెను. రాజసేనానితో నా నీయుడు తులాయుద్ధమొనర్చి వానిని, రాజునుగూడ సంహారించెను. ఈ విధముగా బాంచాలక్షత్రియులు మడసిరి.

ఒకనాడొక వృద్ధబ్రాహ్మణుడు, తానొక యజ్ఞమును సంకల్పించితి ననియు, దానిని కోసలదేశమున నిర్వహింప నెంచితిననియు, తన్నిర్వహ ణార్థము కోసలకు విచ్చేయవలసినదిగా విదేహరాజగు నుశీనరుని ప్రార్థించెను. కోసల బలవంతమైన రాజ్యము. బౌద్ధము చాల చేసినను నుశీనరుడున్నచో గ్రామము సమీపమున నున్న భల్లాటరాజాజ్ఞచే నాయజ్ఞ మారంభమయ్యెను. అచటచేరిన బౌద్ధశ్రమణకులు కొందఱా యుశీనరుని కుతర్కముతో వాదించి వేధించిరి. తుదకు వారి కాష్ఠవాద ములో, గుడుసులాటలో బడి వృద్ధుడైన యుశీనరుడు పరమపదము నొందెను.

ఏకలింగ, శూరసేన, కాలక దేశములు నాడు పెద్దజలపాతములు గల దేశములు. వీనిలో శూరసేన దేశమందలి జలపాతము ప్రశస్తి గన్నది. ఆ జలపాతధార వెంబడిదూకుట, పైకెగసి యటనుండి కొండల నొరసికొని తీవ్రవేగమున ప్రవహించు సన్నని మార్గమున నొక క్రోసెడీదుకొని బయటకువచ్చుట, అదియొక వినోదముగా కొనసాగింప బడుచుండెను. అది రాచవారి ప్రదర్శనమైనచో దాని కదియొక ప్రత్యే కత. ఆతూరి రాచవారి ప్రదర్శనమే యగుటచే ప్రశస్తియును మిక్కిలి యయ్యెను. ఆ సంవత్సరమున నొక రమ్యరమణీయరమణి తజ్జలక్రీడా వినోద ప్రదర్శనమున భాగస్వామ్యము వహించుననియు నామెతో

నెవ్వరు సమముగా భృగుపాతము చేసి, యీాడికొని వత్తురో వానినామె వరించుననుటచే నా వినోదము మతింత తీవ్రతరమయ్యెను. నిర్ణీత దివమున రాచకుమారులతో నామెయు దూకెను. ఎందఱు పైకి వచ్చిరో, ఎందఱేది దరిచేరిరో లెక్క పెట్టుట కెవ్వరును మిగుల లేదు. అందఱును, భృగుపాతము చేయబడిరి. ఆ స్త్రీ యెవ్వరో, యే మయ్యెనో దేవరహస్యము. ఇట్లా ప్రదేశములందు గల సర్వక్షత్రియ సంహారమయ్యెను.

కోసలరాజు సుమిత్రుడు విదేహాధల్లటముల నాక్రమించుకొనెను. మగధకు సమీాపరాజ్యములు కోసలుని కైవసమగుటచే నిదిమగధకు ప్రక్కలోని బల్లెమయ్యెను. అదియును గాక సీయాలమానములలోను మగధదేశప్రజల కడగండ్లు మిక్కుటమయ్యెను. రాజకుమారుల, సేనానుల యాగడములు మిన్నుముట్టెను. ప్రజలేకగ్రీవముగా కోసలాధిపతి తమదేశపురాజైనను నంగీకరించు స్థితికి వచ్చిరి. ఇదే సమయమున మహానందునిచే నుద్బోధితుడయి నందునకు ప్రియతముడైన రాక్షసుని బిలిపించి యాతని బుద్ధివైశారద్యమునకు, వాక్చమత్కృతికి, గంభీర కంఠనినదమునకు నచ్చెరువొంది యాతని సుమిత్రుని కడకు రాయబార మంపెను. సుమిత్రుడును రాక్షసుని రాయబారమును గూలంకషముగా నికాంతములో విని వాని సంహరింప నుద్యుక్తుడయ్యె నది యంత తేలికగాదని తెలిసికొని పంపెను.

రాక్షసుని స్వోపజ్ఞమైన ప్రజ్ఞాహేతువుగా సుమిత్రుడు మగధపయి దండెత్తి రాలేదు. దేశమును రాజు మతముచే బాలింపబడునేని యది యెట్టి దురవస్థ తెచ్చిపెట్టునో కాలాశోకుడు మగధయందు చెలరేగుచున్న మతకల్లోలముచే నెఱింగెను. మగధ బౌద్ధులకు విఖ్యాత కేంద్రము. నాడుబౌద్ధు లందు సంఘనియమాచరణముచే రెండువర్గము లయ్యెను. పిటకములను యథాతథముగా గ్రహించిన వారు స్థవి

నాకులు, దేవదత్తుని, అజాతశత్రుని మంత్రియగు వశ్యకారుని సప్త నియమపాలన మాచరించు వారు వజ్జిభిక్షువులు. వీరే లిచ్ఛవులు. గిరివ్రజ మున నీ వివాదముల పయిబౌద్ధభిక్షువుల సమావేశము జరుగుచుండెను. వాదములు తీవ్రతరమయ్యెను. కాలాశోకుడు తీర్పునిచ్చుట మాత్రము మిగిలెను అంతలో తన సోదరులతో రిపుంజయుడు కాముకతచే సంహరింపబడెనన్నవార్త వచ్చెను. తన మాటమీఱి యుత్తుంగభుజుడు మిథిలకు సైన్యము దండించుకొని పోయెనను వార్తవచ్చెను. మంత్రి యగు పరంతపుని వలన సర్వక్షత్రియ నిర్మూలనము చేసెదనన్న రాక్ష సుని సర్వవ్యూహము నెఱింగెను. బౌద్ధభిక్షు సంఘ సమావేశమును, నావ్యూహములో నంతర్భాగమని మంత్రిస్పష్టము చేసెను. ఈ విధమయిన క్లిష్టస్థితిలోనున్న కాలాశోకునకు నర్ధరాత్రమున దేవ భయంకరు డన్న వానివలన నెఱింగిన వార్తాహరునిచే విధుసార సంహారము వ్యక్తము కాబడెను మహారాజయిన మహానందునకు బౌద్ధశ్రమణకు లలో నగ్రసరులగు యోగులు ప్రాణాయామపూర్వక యోగాభ్యాసము నభ్యసింపజేసిరి. కొన్నినాళ్లకు రాజున కొక్కొక్కటిగా నుత్తుంగ భుజుని దుర్వృత్తిసహితముగా పుత్రుల మరణము నివేదింపబడెను. చివఱకు నందుడు రాజయినచో నీదుర్గతి రాజ్యమునకు తొలంగునని యాయనచే నన్పించిరి. వారి మరణమును విన్న మహారాజ యోగముచే ప్రాణములు వదలిపెట్టినట్లు బహిరంగప్రకటనము మాత్రము చేయబడెను.

కాలాశోకుడు వజ్జియుల పక్షమున తీర్మానించెనన్నవార్తయెట్లో వెలువడెను. ఆతడును మరణించెను. ఎట్లు మరణించెనో యెవ్వరికిని దెలియదు. ఒక మహాసభ రాజభవనప్రాంగణమున జరిగెను. సుమిత్రోత్తుంగభుజులు బందీలుగా గొనిరాబడిరి. వారిలోవారికి తులాయుద్ధము నియమింపబడెను. గెలిచినవానికి కోసలరాజ్యబహుమానము. ఇరువురును మహారాజుగా సింహపీఠిక నధిష్ఠించిన నందునితో యుద్ధము గోరు

కొనిరి. రాక్షసమంత్రి యంగీకరింపకపోగా, తానే యుద్ధమాచరింపగా ని వారింపగ నొక్కే పర్యాయ మొకరొకరు. రాక్షసుడు సంహరించిన మహామంత్రియు వినాశమయె. ఉత్తుంగభుజుడు కబంధుడు. నందుడు మహా సింహాసనము నధిష్ఠించెను. శిశునాగవంశ మంతరించెను.

## 'నందోరాజా భవిష్యతి' - ఇతివృత్త నిర్వహణము

ఈ సృష్టియందు కాలము గడచుచుండగా నొక యుత్కృష్టమైన కార్యమాచరించిన వ్యక్తిని తమనిత్య జీవితమునకు సన్నిహితునిగా దమకుదాము భావించుకొను పద్ధతి పరమోత్కృష్టమయినదిగా కన్పించు చున్నది. రాముడేనాటివాడు ? అతని యేకపత్నీత్వము నేటికిని మనకు శిరోధార్యము. శిబిచక్రవర్తి దాతృత్వము నేటికిని మన కత్యంత శ్రేయోదాయకమయిన సుపథము. హరిశ్చంద్రుని సత్యవాక్పాలనము ధర్మజుని ధర్మాభిరతి, అర్జునుని పరాక్రమము-లిట్టివి మన ప్రజ కత్యంత సన్నిహితమై యొక ధైర్యమును, ప్రశాంతతను, కర్తవ్యోపదేశమును, నోరిమిని ప్రసాదించుచున్నవి. అట్లే ఈ నందుని రాజ్యపాలనము నాటి బాధాతప్తమైన ప్రజ కాశాజ్యోతి వంటిదయ్యెను. నాటినుండి 'నందో రాజాభవిష్యతి'యను లోకోక్తితో నందునిపాలనము పీడితులకు బరమౌషధముగా భాసించెను. రచయిత బౌద్ధమును స్వీకరించిన క్షత్రియు లేనపము లేకనే యన్యవర్ణముల నెట్లు బాధించినది, వానిని రాక్షసనీతి సహకారముతో ప్రజాపక్షమవలంబించి నందు డెట్లెదుర్కొని నదియు, నాతడు మగధేశ్వరు డెట్లయినదియు, నవలయందు నిరూపణ చేసెను. అశేష బాధితప్రజలకు సుఖహేతువయిన నందుడు రాజ్య స్వీకారమొనర్చుటచే కవి దీనికుచిత నామమునే యుంచెను.

ఈ యితివృత్తము ముఖ్యముగా మూడు అంశములమీద నడచినది. పురాణములు అఖిల క్షత్రాంతకో నృపః' 'ద్వితీయ ఇవ భార్గవః' యని

నందుని గురించి వ్యాఖ్యానించినవి. భార్గవరాముడు ముయ్యేడు మారులు క్షత్రియుల నంతఱును వెదకిమట్టుపెట్టెను అపరభార్గవుని వలె నందుడును నఖిలక్షత్ర వినాశకుడయి క్షత్రియేతర రాజ్యస్థాపనాచార్యు య్యెనని పురాణములు పేర్కొనుచు సమ్మానించినవి, దీని రచయిత చక్కగా నీ దశ యితివృత్తమునందు కౌశలముతో నిబంధించెను.

ఐక్ష్వాకులు,(కోసలులు), పాంచాలురు, కౌరవులు, హైహయులు, కాశులు, వీతలింగులు, శూరసేనులు, మైథిలులు ( విదేహ ) నందఱను జయించి వింధ్యహిమాద్రుల నడుమ నున్న రాజ్యమును మహాపద్ముడు శాసించినట్లు కలియుగరాజ వృత్తాంతము వచించెను. ఈ రాజ్యములను జయించిన విధమును నవలయందొక్కొక్క రాజ్యమున కొక్కొక్క విచిత్రమయిన కథను నిర్మించి చాతుర్యముతో నీ ప్రక్రియ నిర్వహించెను.

## కథా సంవిధానము

ఉత్తుంగభుజుని యాగడముల పరాకాష్ఠను రచయిత యిట్లు పేర్కొనెను.

“కొందఱి ముఖారవిందములయందు నేండ్లుగా తమ్ము బాధించు చున్న సూడు నేడుతీరినట్లు గర్వరేఖ కన్పించుచున్నది, ఉత్తుంగభుజుని చేత, ముప్వురు రాజకుమారులచేత, నేయే ధనవంతుల యిండ్లు దోచు కొనబడినవో, యే గృహములయందలి స్త్రీలు మానభంగము లందిరో, ఆ యా కుటుంబములలోని పురుషులందఱు సముత్సాహ రేఖా వికసితా పఘన ముఖాది లక్షణములు గలవారైరి...” (28) ఉత్తుంగభుజునితో రాక్షసుని ద్వంద్వయుద్ధ విషయము విన్న ప్రజల యానందోత్సాహ ములు తమకు బాధ తొలగినదన్న యొక తృప్తిని తెలియజేయుచున్న వాక్యము లీయవి.

వీడు చేసెడి కార్యము లిట్టివి కాగా ప్రజలు తమంత తాము

వీని యాగడములు మాన్పలేరు. భరింపలేరు. ఆ స్థితిలో ప్రజలుండిరి. ఎవరైనను నొక్క మహామహుండీ యాపదగడపి పెట్టగల వాడుండడా! అని యెదురు చూచునట్లు కవి తహతహలాడించి నందుని ప్రవేశపెట్టెను. తాను క్షత్రియుడు కాని కతమున సకలక్షత్రరాజ సమావేశమున నాహ్వానింపబడలేదను భావమునకు గురి చేయబడెను. అది నందునకు పెట్ట కలిగించెను. ఈ సన్నివేశమును కల్పించుటచే నందునకు ప్రజా పక్షమవలంబించుటకు దగినబలమైన హేతువును సృష్టించి నట్లయ్యెను. భావియుతివృత్త సాధనకు బీజమయ్యెను. నందునిచే "ఇదిగో ఈ నిము సమున క్షత్రియులకు ప్రబలవిరోధి సముద్భవించినాడు. ... ... ఈ దుష్టక్షత్రియులకు దేశమంతయు విరోధముగా నున్నది. నే నిన్నాళ్లు వారి పక్షమవలంబింపలేదు, ఇప్పుడవలంబించుచున్నాను" అని రచయిత నందుని నోట బల్కించెను.

ఇవియన్నియు నందుని రాజుగా నొనర్పబడక తప్పని పరిస్థితిగా మహానందుడు సయితము హా చేయుట కవకాశమిచ్చినట్లు రచయిత నిర్వహించినాడు. బౌద్ధభిక్షులతోడి రాజకీయములు వీరికి దోడయిన విశేషములు. ఇదియంతయు రాక్షసుని మంత్రాంగమే యనునట్లుగా సంవిధాన పఱచెను.

తుదకు రాక్షసునిచే నుత్తుంగభుజుడు, సుమిత్రుడు సంహరింప బడుదురు. నందుడు మహారాజగును. వృద్ధుడయిన మహానందుడు రోగముచే మరణించెనని బౌద్ధభిక్షువులచేతనే ప్రకటింపజేసి, యా మతమందున్న యసహ్యతను, ధర్మగ్రాహిదృష్టిని పాఠకునకు స్పష్ట మొనర్చెను.

ఇదియంతయు శ్రీవిశ్వనాథుని మేధావిలసనము. కథాసంవిధాన చాతుర్యము. ఆరంభమున క్షత్రియదురహంకారమును, ప్రజల హాహా కారములను వర్ణించి, మహానందునిలో సూర్యుని వేడిమిని, ఉత్తుంగ

భుజునియందు నగ్నిని నిరూపించి తదనుగుణముగా వారి వినాశమును, నందుని రాజ్యస్వీకారమును నిరూపించెను.

## పాత్రచిత్రణము

చారిత్రకపాత్రలు నందుడు, మహానందుడు, రాక్షసుడు, సహస్రాంగ భుజులు. ఇతర పాత్రలన్నియు కథానుగుణముగా కల్పితములైనవి.

నందునిపాత్ర యాతని క్షత్రవైరముతో కొలమానగును. కాని సర్వము రాక్షస ప్రజ్ఞావిశేషములచే నందునిపాత్ర యనుస్యూతముగా నవలయంతయు నిర్వహింపబడెను. రాక్షసునిపాత్రను జదివినచో నందుని పాత్రయంతర్గతమైనట్లే భావింపవచ్చును. కనుక నీ నవలయందు ప్రధాన పాత్ర రాక్షసుడే యగుచున్నాడు.

రాక్షసుడు:- మహానందుని శూద్రాపత్యము మహాపద్మనందుడు. ఈతనికి గల విశేషణములు సర్వక్షత్రాంతకుడు, ద్వితీయభార్గవుడు. ఈరెండింటి నీనవలయందు రాక్షసోపజ్ఞముగ గవి నిర్వర్తించెను. సర్వక్షత్రాంతకు డెట్లయ్యెనో పురాణములు చెప్పలేదు. కవియొక సన్నివేశమును గల్పించెను. దానితో నందుడు క్షత్రియులకు విరోధి యయ్యెను. రాక్షసునకు బనిగల్గెను. ఈ నవల యందీపాత్ర లక్ష్యము నందుని చక్రవర్తిగా జేయుట. నందునితో నిట్లనును. “నిన్ను సర్వార్యావర్తమునకు జక్రవర్తిని జేసెదను. నేను చెప్పినట్లు నడువుము.” ఈ లక్ష్యము నక్షరశః పాటించిన నందునకు రాజ్యశ్రీని సమర్పించెను.

ముద్రారాక్షసమున నందునకు మంత్రి రాక్షసుడు. ఈతనికి బ్రతిస్పర్థి చాణక్యుడు. దానికి సంబంధించిన యితివృత్తముగల నవల ముందు వచ్చును. నందునకు మిక్కిలి ప్రీతిపాత్రమయిన మంత్రిగ నచ్చట చెప్పబడిన కతమున నాయనకు సామ్రాజ్యస్థాపనవిషయమునను ప్రముఖస్థానము నీ యితివృత్తమున కల్పించెను.

ఇందు సర్వక్షత్రసంహారము రాక్షసోపజ్ఞమే. హైహయుని

బసిరూపుతో బ్రాహ్మణరూపమున జంపుట, పాంచాలుని రాజ్యమును గైకొని వానిని సంహరించుట, విదేహరాజును విదేహునిగ నొనర్చుట, కాలిక, నీకలింగ శూరసేన క్షత్రియవీరులను జలపాత క్రీడయందు భృగుపాతము చేయించుట కౌశాంబి రాజ తనయుడు నిరమిత్రుని యమాలయ మిత్రునిగ నొనర్చుట, రాక్షస ప్రచ్ఛన్నహస్త నైపుణ్య విశేషములు. ఇందొక్కొక్కకథ యొక్కొక్క రసగుళిక. ప్రతికథయందు రాక్షసుని మేధాసంపద, ప్రణాళిక, తన్నిర్వహణము ప్రతిబింబించును.

నాడు బౌద్ధమతమును రాజులందఱు మెక్కించిరి. అది క్షత్రియుడైన బుద్ధుని దీక్షాతపఃఫలమగుటచే క్షత్రియులు నెత్తిన బెట్టుకొని మోయుచుండిన కాలము. రాజులెల్లరు మతమునకు లొంగినవారు. మహానన్దాదులు నాయకులు. ఇట్టిసమయమున మగధకు సుమిత్రుని వలన యెద్దడివచ్చెను. రాక్షసుని కాలాశోకుడు బిలిపించి దానిని తీర్చిపెట్ట వర్థించెను, ఇచట సుమిత్రునితో రాక్షసుడు నడిపిన రాయబారము ఆంధ్రనేయ దౌత్యమును జోలినది.

## రాక్షసపాత్రలో కానవచ్చెడి వైశిష్ట్యము-తన్నిర్వహణ.

1. బ్రాహ్మణుడైనను. రాజకార్యమగుచో నెన్నియడ్డంకులైనను తుదివఱకు నిర్వహించుటకే యత్నింపవలెను. కాలాశోకునితో "నేను బ్రాహ్మణుడను.నా రాజవంశమును రక్షించుట నా కర్తవ్యము. రాజు నన్నువధించినను నేను బ్రాహ్మణుడనుగాన నేను న్యాయముగా నిర్వర్తింతును." (142) అని తన చర్యను సమర్థించును.

2. రాక్షసుడిట్టివాడని. యింతటిప్రణాళికా ధౌరంధర్యముగలవాడని తెలిసినవాడు మహానందుడొక్కడే.దుర్గాధిపతి పరంతపునకును తెలియును, మహానందుడును దేశమున జరుగుచున్న మహావిప్లవమునకు వెనుకనందుడు, రాక్షసుడు నున్నారని యూహించెనేగాని స్పష్టముగా నిశ్చయ పఱచుకొనలేకపోయెను. కుమారుడయిన కాలా

క్రోధనితో నందుడు "ఆరునెలలలో నింతపని జరిగినది. నందు డీపని చేయనాడని నేననుకొనుచున్నాను,'' అనిపల్కెను. 'నందుని స్నేహితుడు రాక్షసుడు. మహావివేకి." యని సుమిత్రునితో రాయబారము జేయ కాలాశోకునకు సలహా నొసంగును.

3, రాక్షసు డొనర్చిన రాయబారములో దూత లక్షణములను తెలియజేసెను. ఇది రామాయణములో సుందరకాండయందు హనుమంతుని దౌత్యమును బోలినది—అవి

"రాయబారితనము సులభమైనదికాదు. దానికి పాండిత్యము కావలయును, (దూతాః పండితమానినః—రామాయణము) ధైర్యము కావలయును. రాజనీతి నెఱుంగవలయును. లోకజ్ఞత కావలయును. ఇతరరాజ్యములందు జరుగు సర్వవార్తా పరిజ్ఞానము కావలయును.'' (142) వీనినన్నింటిని రాక్షసునియందు రచయిత నిరూపించినాడు. వానిని వరుసగా జూతము.

పాండిత్యము:— "వాని మేధావిలసనము పరమతీక్ష్ణమై యున్నది. అతనికీ భాషవచ్చును. ఈభాషరాదని లేదు, దేశమంతయు పాళీభాష. అందులో నతడు మహాపండితుడు. నేడార్యావర్తమందు సర్వమును సంస్కృత భాషావికృతులు. ఎచ్చట నే వికృతి గలదో నచ్చట యా వికృతి యతనికి గరతలామలకము."(274) తత్తీక్ష్ణమైన వివేకములేనిచో సుమిత్రునిచేతబడి యాభవనమునందే యసువులను గోల్పోవువాడు

2) వాగ్నైపుణ్యము :— సుమిత్రునితో రాయబార సందర్భమున (151, 152)"రాక్షసుని కంఠధ్వని మేఘగంభీర నిస్వానముగా నున్నది. అతని స్వరము విస్పష్టముగానున్నది. మాటాడెడి వైఖరి మహాపరాక్రమశాలియు, మహాధైర్యవంతుడును, మహావేత్తయు నన్నట్లుగా నున్నది. మాటాడుచున్నప్పుడు సర్వము వాక్యములందును, శబ్దగతాక్షరముల మీదను సువిభక్తమై హెచ్చుస్థాయియు తగ్గుస్థాయియు, కాకువును పరామృష్టములై భాసించుచుండెను.'' (తచ్ఛ్రుత్వా

వాక్యం వాక్యవిశారదః 33_1 (శ్రీమద్రామాయణం, సుందరకాండ.

3) రాక్షసుని రాజనీతి :- ఈతని రాజనీతి సర్వత్ర వ్యాపించి యున్నది. నందుని వెనుక తానుండియు సర్వక్షత్రనిర్మూలన మెవ రొనర్చిరో నవలయొక్క చివఱిగాని బోధపడ నీయలేదు. రాక్షసుడు సుమంత్రునితోను, కాలాశోకునితోడను సంభాషించినదంతయు నాతని రాజనీతిని వ్యక్తమొనర్చును. సుమంత్రునితో "ఎవరితో ప్రయోజన ముండునో వానియందు విరోధమున్నను, రాజనీతివేత్తలు తమ ప్రయో జనము తీరువరకు వానిని వధింపరు." (151) యని తన్ను వధింపవచ్చిన యాతనికి నీతి నుపదేశించును. మగధదేశ మింతకాలము పరరాజుల కభేద్య మగుటలోని రహస్యమును నయితము బహిర్గతమొనర్చును. ఇట్టివి యనేకము రాక్షసుడు తన రాయబారమందు గుంఫించెను.

4) లోకజ్ఞత :- విశ్వనాథుడు తనలోకజ్ఞత నంతయు రాక్షస పర ముగా ప్రతిబింబింపజేసెను. లోకజ్ఞత యనగా లోకమును తెలియుట. నాడు మగధయందు ప్రబలిన నైరాశ్యమును బాగుగా దెలిసి దానికి సమన్వయ రూపమును సాధించెను. రాక్షసుడు. మగధప్రజలు 'నందో రాజాభవిష్యతి' యను నాశతో బ్రతుకుచున్నారని తెలియును. ఉత్తుంగభుజుని దుష్టప్రకృతియు నెఱుంగును. కాలాశోక, విధుసార, రిపుంజయుల నైచ్యము నెఱుంగును. తమకు గాలాశోకుని వలన ముప్పు వాటిల్లెనని తల్లడిల్లిన వజ్జీభిక్షువుల నెఱింగి వారి కభయమొసంగి తన కార్యమును వారివలనగూడ సాధించుకొనుట యెఱింగిన రాక్షసుడు లోకజ్ఞుడు. ఇది రాక్షసుని రాజనీతి,లోకజ్ఞతకు గూడ నుదాహరణమే.

5) సర్వవార్తాపరిజ్ఞానము:- నవల పూర్వభాగమున రాక్షసుని కడకు నందుడు బోయి "కోటనుండి వెనుదిరిగి రమ్మంటివిగదా ! ఏమి చేయ మందు"వనిన వానితో రాక్షసుడు 'సర్వదేశములందు రహస్యవిప్లవము లను నేను లేవదీసెదను. ఆయా దేశముల రాజులయొక్క సర్వరహస్య ములను నాకు దెలియును." అని తన సర్వదిశాగత వార్తాపరివేత్తృత్వ

మును ప్రకాశింప జేసెను. ఇట్లు ధైర్య, స్థైర్యములు, శౌర్య ప్రాకట్యము, పాండిత్యము, వాక్చాతుర్యము, రాజనీతి, లోకజ్ఞత, సర్వ వార్తాపరిజ్ఞానమను గుణములు రాక్షస పాత్రను హిమగిరిశిఖరాగ్రమున నిలువబెట్టినవి.

## ధార్మిక చర్చ

ఈ నవలయందు చేయబడిన ధార్మికచర్చలో ప్రధానమయినది బౌద్ధమతనిరాసము. దానిని నిరాకరించుటకు మన ధర్మవిషయములను దక్కువ ప్రసంగించి వారిమతమును గురించి యధికముగా బరిచయము చేయబడినది. ఇది యొక చాతుర్యము. వారి మతము యొక్క అవిర్భావము, అందుద్భవించిన వివాదములు, భేదములు, వానిస్వరూపము, మనమతముకంటె నామత మెట్లెక్కువకాదో ప్రసంగింపబడినది. ఈ ప్రసంగము కాలాశోకుడు రాక్షసుని నడుమను, సుమిత్రుని రాక్షసుని నడుమను నడచినట్లుగా రచయిత నిర్వహించెను.

1. మతమును తర్కించు విధానములో 'నందఱు సన్యాసులైనచో భిక్షపెట్టెడి వారెవరు ?' (157) "బౌద్ధమతముపై నవహేళన,

"సన్యాసులైన వారికే, యెట్లు బ్రతకవలయునో బుద్ధుడు బోధించెనుగాని తక్కినవారి విషయ మట్లు చెప్పలేదు. తక్కిన ప్రజలందఱు వైదికవిధానమున మనవలయుననియే బుద్ధుని యభిప్రాయమై యుండును.'' (157) బౌద్ధులలో నొకడు "యజ్ఞార్థము మేకలను జంపుటకాదా"యనెను. దానికి మిథిలాధిపతి యుశీనరుడు''ఓయీ ఒక్కయజ్ఞములో మేకను జంపుటయే హింసయా ! బౌద్ధభిక్షువులును మాంసాహారము తినుచున్నారు. మేకలు, పశువులు చంపబడకుండ మాంస మెట్లువచ్చును ? అని సమాధానము. (101) వైదికమతము లోని హింసకును తదితర హింసకును గలభేద మిట సూచిత మయ్యెను.

ఉత్తమ విమర్శ :- రచయిత యిచ్చట కొన్ని ప్రశ్నలను వైచి వానికి సమాధానము లొసంగిన తీరు ప్రశంసనీయము.

1, ఒకపురుషుడు సర్వమహిమలు ప్రదర్శించు తావులుండును. కాశ్యపుని యజ్ఞమున నగ్నిపుట్టించక బుద్ధుడు తాననుమతించినపుడు మాత్రమే అగ్న్యుత్పన్న మగునట్లు చేసెను. దానితో నా కాశ్యపులు, తద్యజ్ఞమండలి ఋత్విక్కులు మొదలైన వారందఱు బుద్ధునకు శిష్యులేల కావలయును ? (శ్రీ)విశ్వనాథ ప్రశ్న. సమాధానము "కాశ్యపాదులు ప్రత్యక్షమందధికాభిమానము గలవారు, యజ్ఞము జరిగినచో నేఫలితము పుట్టునో యది అప్రత్యక్షమైన విషయము." (92) దీనివలన తేలెడి సారాంశము-లౌకికమువలన నలౌకిక ముత్పన్నమగును. కాని లౌకికము నందభిమానము కూడదు. అని హెచ్చరిక.

2. తాను సర్వజ్ఞుడైనచో గపిలవస్తునగరమున జరిగిన మహావిప్లవము నేల యాపలేదు ? క్షత్రియాహంకార మధికమైనది, అది సర్వనాశము కావలెను. యాదవకులమున ముసలము జనించి యాదవుల యహంకారము నడచలేదా ! ఇచట రచయిత తెచ్చిన పోలికను గమనింప వచ్చును. ఎక్కడైనను నహంకారము పనికిరాదనియే సిద్ధాంతము,

3. కాలాశోకునితో రాక్షసుని ప్రసంగమున 'మీమతోక్తుల ప్రకారము మనభాషలోనున్న సర్వవాక్యములు, సర్వోక్తులు దుష్టోక్తులుగా భాసించుచున్నవి. వానికర్మమనుటయు దప్పే. భగవంతుడన్నను దప్పే. వాడు నరకలోకమునకు బోవునన్నను దప్పే. ఇవి యన్నియు బౌద్ధమతమున లేవని తాత్పర్యము. ఇట్లు వ్యంగ్యమర్యాదతో నితర మతములోని దోషములను జూపించుట యొకకళ. ఇంకను నీమతములోని నియమములను, దోషములను జూపి తన్మతనిరాసమున కెట్లవి హేతువయ్యెనో ప్రసంగించుటయు ధార్మికచర్చలోని భాగమే.

## ఈ నవలయందు రచయిత సమకూర్చిన బౌద్ధమత విజ్ఞానము

బౌద్ధమతము తొలుత భారతదేశము నందెంత వేగముగా వ్యాపించెనో యంత వేగముగా నిష్క్రమించిన సంగతి జగద్విదితము. మనదేశము నందట నటగల 'లంకాదిబ్బలు' తన్మత ప్రాచీన ప్రాభవ ప్రలోభములను మాత్రము వ్యక్తీకరించును. బౌద్ధమతమునకు సంబంధించిన గ్రంథములు నయితము మృగ్యమయ్యెననగా మఱియొక విధముల బైవాక్యమును సమర్థించ నక్కరలేదు. బుద్ధుడు నిర్వాణము పొందిన యనంతరము తనమతమును మొదట శ్రావస్తి, కపిలవస్తు నగరములందు స్థాపించెను. వీరిని వజ్జిభిక్షువులనియు, లిచ్ఛవులనియు నందురు. బుద్ధుని శిష్యులలో ప్రముఖుడు దేవదత్తుడు ఈత డష్టాంగములను, చతుర్థమైన పరమార్థమును బోధించి దానిని మాధ్యమిక మార్గమనెను.[1]

ఇది లౌకిక ప్రవర్తనకు మార్గము. అజాతశత్రుని మంత్రి వశ్యకారుడు. ఈతడు వజ్జీయులను దేవదత్తుని మార్గమున నడిపించెను. సప్తధర్మములనుగూడ నవలంబింప జేసెను [2]

---

1) 1. సత్యదృష్టి కావలయును, 2. యథార్థమైన మనోనిశ్చయము కావలెను, 3. అబద్ధమాడరాదు, 4. తానుచేసినకార్యము సత్కార్యమే కావలెను, 5. జంతుహింస చేయరాదు. 6. దొంగతనము చేయరాదు, 7. కామమార్గమున బోరాదు. 8. సురాపానాదులు చేయరాదు, 9. భిక్షుకులకు దానము చేయవలయును. 10. సంఘమునకు సేవచేయవలెను. 11. దయకలిగి యుండవలెను.

2) 1) బౌద్ధులు నిత్యమును సమావేశము కావలయును. 2) ఏపని చేసినను నేకాభిప్రాయముతో చేయవలెను. 3) దేవదత్తుడు చెప్పిన నియమములు పాటింపవలెను. 4) పెద్దలను గౌరవింపవలెను. 5) స్త్రీలయందు మర్యాద నెఱపవలెను. 6) ఎచ్చట నున్నను పుణ్యక్షేత్రములకు బోయిదర్శించు చుండవలెను. 7) రాష్ట్రములోనున్న యర్హతులకు భిక్షపెట్టుచుండవలయును.

ఇట్టి పాలన చేయుచున్నచో బౌద్ధమతమున కెట్టి సేవ లేదని వశ్య కారుడు చెప్పెను.

వినయ, సుత్త, అభిధమ్మ పిటకములను యథాతథముగా గ్రహించిన వారు స్థవిరవాదులని పిలువబడిరి దీనికి వ్యతిరిక్తులైన వారు వజ్జీయులు. కాళందకుడను బౌద్ధుని కుమారుడు యశుడు, ఈతడు లిచ్ఛవులలోని పది దురాచారములను లెక్కపెట్టి వారిని నిందించి వారి యభియోగములను విచారించుటకు సర్వసంఘమును కోరెను. అందు కొన్ని దోషములను రచయిత చేర్కొనెను. విచిత్రమైన యీ పేర్లను గమనింపవచ్చును.

1) జాతరూపరజితము, 2) జాలోంగి పాతము, 3) సింగిలోణ కప్పము. 4) ద్వ్యంగులకప్పము, 5) ఉత్క్షేపణకర్మ, 6) పటిసారణీయకర్మ [3]

ఇతర విశేషములు:- మహాకవుల లక్షణములలో నిఖిల విజ్ఞాన ప్రదర్శనమొకటి. ఒక విషయము చెప్పవలసివచ్చినపుడు వారు దాని **మూలమునుండి యారంభింతురు, పాఠకునకు** తద్విషయమైన **సంపూర్ణ** పరిజ్ఞాన మందించవలెననియు, నాతడు పరిజ్ఞాత కావలెయుననియే యీ రచయిత యుద్దేశ్యము. ఈ నవలయందు దానిని బరిశీలింతము.

**1.** మాహిష్మతి రేవానది ప్రక్కనగలదు. దానిని బాలించెడు రాజు తాను కార్తవీర్యార్జునుడనుకొనును, బ్రాహ్మణులను బరశు

---

3) 1) (ఎవరైనను భక్తులు బంగారమును, వెండియు భిక్షకుల కొసంగినచో గ్రహింపరాదు.) 2) బౌద్ధభిక్షులు సారాయి త్రాగరాదు. 3) శృంగలవణ గ్రహణమున కిది పాళీభాష, లవణమును కొమ్ములో బెట్టి మోసికొనిపోరాదు. 4) సూర్యుని నీడ రెండంగుళముల వెడల్పుగా నుండగా భోజనము చేయరాదు. భోజనము చేసిన తర్వాత మజ్జిగ త్రాగరాదు. తాను పరుండెడి బొంతకు నంచుండ రాదు. 5) బౌద్ధమునుండి బహిష్కరింపబడు కర్మ 6) చేయబడిన దోషమునుండి విముక్తుడగుటకు నొనర్చెడి ప్రాయశ్చిత్తకర్మ)

రాముఁలని పిలిచి హేళన చేయును. తాను పరశురాముని కాలము నున్నచో నాతని నతిక్రమించి వాదించును. తుదకొక పరశుధారి చేతిలో బడిచచ్చును. దీనికి ఆయన చెప్పిన కథలు.[4]

కౌశాంబి రాజసంహారేతి వృత్తమందు కొన్ని కథలను నిక్షేపించెను.

పాంచాలాధిపతి యితివృత్తమందు "మ్లేచ్ఛదేశములు పుట్టిన విధానమునకు హేతువు కల్పించియే సమన్వయించెను. శతద్రూ నదీ నిర్మిత వశిష్టమహర్షి దుఃఖజనితవిలక్షణ సంస్కారజనితమైన యొకజాతిగా నచట ననుసరించి గాంధారములు దాటి మ్లేచ్ఛ జాతులుగా బరిణమించినది." (59) ఇందు శతద్రూనది పుట్టుకకు హేతువులు, శతద్రూశబ్దార్థము, (శతధా ద్రవించినది యని యర్థము) ద్రౌపదీ దృష్టద్యుమ్నుల జననము, చెప్పబడినది. ఇట్లనంతమైన విషయముల ననంతముగా నీనవలయందు ప్రసంగింపబడినవి.

శ్రుతి విషయికమయిన విజ్ఞానము:- సృష్టిలో ననులోమమేగాని భూతవిషయములందు విలోమములేదు (67) ఈ విషయము నుదహరించుచునిట్లు చెప్పును ఆకాశమునుండి వాయువు, వాయువునుండి యగ్ని, అగ్ని నుండి నీరు, నీటినుండి పృథివి. పృథివి నుండి యోషధులు, ఓషధుల నుండి యన్నము, అన్నము నుండి-పురుషుడు -ఇదియుత్పత్తి

4) 1) రేణుకాదేవి కథ (25)
2) రంభామంత్రపు కథ (కవి చమత్కారముచే కల్పించిన కథ)
3) ఆనుశాసనిక పర్వములోని బ్రాహ్మణుని కథ.

5) 1) దీనిలో ప్రసిద్ధుడయిన ఉదయనుని చరిత్రము, కౌశాంబీ శబ్దనిర్వచనము. (వైదికమైన విజ్ఞానమునకు వ్యాసుడు కోశము. ఆకోశమే అంబగా గలిగిన పురము కౌశాంబి. (52) 2) 3) అశ్వత్థామకు విరమిత్రునకు బోలిక ద్రోణునకు ద్రుపదునకు బోలిక (మరణమునందు మాత్రము). (56) శివుడు, బాణాసురుని కథ.

క్రమము. దీనికి విలోమవిధానములేదు. తైత్తిరీయమునందు-

"ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః
పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఅన్నమ్, అన్నాత్పురుషః"
అనునది మూలము.

వర్ణన :- జలపాత సౌందర్య వర్ణనమంతయు, నల్పసమాస సహితరమణీయరచనము,

"కొండయంచునుండి యొకేధారగా వెడల్పుగా నెండవేసిన యప్సరస్త్రీల చీరవలె," ......నైరావణాభ్రమువ వివాహవేళా వినిర్మితబంధు దంతావళ స్త్రీ సమూహములవలెనున్న జలపాత"మింతచక్కనిదిగదా యని దర్శితమన్నచో నది 'దర్శనమాత్ర సంపాదయితృనిర్వాణమట' కనుకనే పోయిన వారందఱకును భృగుపాతమైనది.

ఇట్లు నవలయంతయు జమత్కారజనితము, విజ్ఞాన సముపేతము, చారిత్రకాంశ పరిచాయకము, హాస్యరస పరిపోషకమునై యున్నది.

# 5. చంద్రగుప్తుని స్వప్నము

చారిత్రక పూర్వరంగము : ఒకే పేరుగలరాజు లిద్దరు మన దేశమును విభిన్నకాలములందు పాలించి చరిత్రకారులచే నొకరి కొకరుగా గుర్తింబడి చరిత్ర గ్రంథములలో నట్లే వివరింపబడుట ప్రపంచ చరిత్రయందే యపూర్వము. ఇట్టి మహావిషయ హేతుభూత నాములు చంద్రగుప్తులు. ఇందొకరిది మౌర్యవంశము, గుప్త వంశజులు మఱియొకరు.నందవంశానంతరము మగధనేలినది మౌర్యవంశము. శాతవాహన వంశము తరువాత నాంధ్ర భృత్యులను పేరుతో గుప్త వంశజులు మగధను పాలించిరి. పురాణముల ననుసరించి మౌర్యులు క్రీ. పూ. 1538 నుండి 316 యేండ్లు పాలించిరి. గుప్తవంశజులు క్రీ. పూ. 327 వ సంవత్సరమునుండి పాలించిరి. పాశ్చాత్యుల లెక్కననుసరించి మౌర్యులు క్రీ. పూ. 327 నుండియే పాలించిరని చో కీ. పూ. 1538 నుండి క్రీ. పూ. 327 వఱకు భారతదేశ చరిత్ర గతియేమి ? ఈ విషయమంతయు 'చారిత్ర కోపపత్తు'లను నధ్యాయమున సమగ్రముగా బరిశీలింపబడియే యున్నది. ఇక్కడ మౌర్య చంద్రగుప్త వంశమును గుఱించి పురాణములేమి చెప్పినవో పరిశీలింపబడుచున్నది.

చంద్రగుప్తుడు-పురాణములు :- కౌటిల్యుడను బ్రాహ్మణుడు నందులను నిర్మూలించి చంద్రగుప్తుని మగధ సింహాసనమున బ్రతిష్ఠించెనని పురాణముల నిర్వాహము. విష్ణుపురాణ మందీతడు మహాపద్మ నందునకు మురయను స్త్రీకిని జన్మించినవాడని యున్నది. మౌర్యవంశపు రాజులు వరుసగా చంద్రగుప్తుడు, భద్రసారుడు, అశోకుడు, కుణాలుడు, దశరథుడు, ఇంద్రపాలితుడు, హర్షవర్ధనుడు, శాలిశూకుడు, సోమశర్మ,

శతధనువు, బృహద్రథుడనువారలు. ఈ పదుగురు రాజులు 316 యేండ్లేలుదురని చెప్పబడెను. [1] రాజుల సంఖ్య, పాలనకాలమున పురాణములందు భేదమున్నది. [2]

---

1) "తతశ్చ నవచైతాన్ నందాన్ కౌటిల్యో బ్రాహ్మణ సముద్ధరిష్యతి । తేషామభావే మౌర్యాఃపృథివీం భోక్ష్యన్తి। కౌటిల్య ఏవచంద్రగుప్త ముత్పన్నం రాజ్యేభిషేక్ష్యతి।" (నందస్యైవభార్యాయాం మురసంజ్ఞాయాం సంజాతమ్ ఇతి శ్రీధరస్వామి.) వి. పు. 4-24

"తేషామభావే జగతీం మౌర్యా భోక్ష్యన్తి వైకలౌ ।
స ఏవచంద్రగుప్తంవై రాజ్యమభిషేక్ష్యతి॥" భాగ. 12-2-13

"కౌటిల్య శ్చంద్రగుప్తం స తతో రాష్ట్రేభిషేక్ష్యతి ।
భుక్త్వా మహీం వర్షశతం తతో మౌర్యాన్ గమిష్యతి॥"
మత్స్య. cclxx అ. 13 శ్లో.

"ఉద్ధరిష్యతి తాన్సర్వాన్ కౌటిల్యోవై ద్విజర్షభః। (Bombay Edition)
చంద్రగుప్తం నృపంరాజ్యే కౌటిల్యః స్థాపయిష్యతి॥ వాయు.
XCLX. P. 331.

"ఉద్ధరిష్యతితాన్ సర్వాన్ చాణక్యాఖ్యో ద్విజోత్తమ ।
చంద్రగుప్తం స తద్రాజ్యేకౌటిల్యః స్థాపయిష్యతి॥" క. రా. వృ. 3-2

2) "ఇత్యేతే దశచ ద్వేచ యే భోక్ష్యన్తి వసుంధరామ్ ।
శతాని త్రీణి వర్షాణి తేభ్యః శుంగాన్గమిష్యతి॥" మ. పు. శ్లో. 300

"ద్వాదశైతే నృపామౌర్యాశ్చంద్రగుప్తాదయో మహీం।
శతానిత్రీణి భోక్ష్యన్తి దశషట్చ సమాకలౌ । కలి. రాజ. వృ.
(ఈ రెంటింటికి 16 సంవత్సరముల భేదమున్నది)

"ఏవమేతే మౌర్యా దశభూపతయో భవిష్యన్తి, అబ్దశతం సప్తత్రింశదుత్తరమ్ । వి. పు. 4-24-25.

"మౌర్యాహ్యేతే దశనృపాః సప్తత్రింశచ్ఛతోత్తరమ్ । భాగ. 12-1-25.

మౌర్య గుప్తచంద్రగుప్తుల పేర్లను గుర్తించుటలో నాంగ్లేయ చరిత్రకారులు నందుని అంద్రేమ్సుగను శాండ్రకోట్టసును మౌర్య

చంద్రగుప్తునిగను గుర్తించి. సర్ విలియమ్ జోన్సు మహాశయుడు మొట్టమొదటగా నట్టి యకాంశతాంశమ మొనర్చెను.

"It was Sir William Jones, the founder and president of the Society Instituted in Bengal for enquiry into the History and Antiquities, the Arts, Sciences and Literature of Asia. Who died on 27-4-1794, that suggested for the first time an indentification to the notice of Scholars. In his tenth Anniversary discourse delivered by him on 28-2-1793 on "Asiatic History Civil and National" referred to so called discovery by him of the Identity of Chandragupta the founder of the Mourya Dynasty of the Kings of Magadha, with the Sandracottus of the Greek writers of the Alexander's adventures".

By M. Krishnamacharyulu, Introduction Page IXIV

ఈ యభిప్రాయమునే మనజాతీయందును, సంస్కృతియందున మహాభిమానముగల మాక్సుముల్లరు కూడ బలపరచి 'శాండ్రకోట్టస్' శాండ్రసిప్టస్ పేర్లు మౌర్యచంద్రగుప్తునికే చెందునట్లు వ్రాసెను [3]

ఈ యనక తప్పను వారిలోనే ట్రాయర్ మహాశయుడు గుర్తించి బహిర్గత మొనర్చెను. కాని దానిని వారు బుద్ధిపూర్వకముగనే త్రోసిపుచ్చిరి.

"Wilford, Prof Wilson, and Prof. Lassen have afterwards added further evidence in confirmation of Sir William Jones conjuncture, and although other Scholars and particularly Mr. Troyer, in his edition of the Raj Taranginl, have raised objections.

We shall see that the evidence in favour of the Iden-

3. History of Anecient Sanskrit literature.
Max Muller P. 141

tity of Chandragupta and Sandrocyptus is such as to admit of no reasonable doubts".

అనంతరము 'కుప్పయ్య' యను ఆంధ్రదేశచరిత్రకారుడు 'ప్రాచీనభారతదేశచరిత్ర' యను గ్రంథములో[4] నీదోషము నెత్తి చూపి శాండ్రకోట్టస్ గుప్తచంద్రుడని ప్రకటించెను. శ్రీ టి. యస్. నారాయణశాస్త్రిగారు,[5] నడింపల్లి జగన్నాథరావుగారు,[6] పండిత శ్రీ కోటవెంకటాచలం గారలు[7] పై విషయమును తమగ్రంథములందు సప్రమాణముగ నిరూపించిరి.

ఇక పురాణములందు, జైనబౌద్ధ గ్రంథములందును, మహాపద్మ నందునకు శూద్రాపత్యము చంద్రగుప్తుడుగా చేర్కొనబడెను. ఈతడు రాజ్యమునకు వచ్చినకాలమునకు గ్రీకు చక్రవర్తి అలెగ్జాండరునకు నామరూపములుగూడ లేవు. అదియునుగాక మౌర్య చంద్రగుప్తుని కాలములో నెట్టి యుద్ధములును జరిగినట్లు నే పురాణమును చెప్పి యుండలేదు. విదేశీయుల విషయముల నేమియు ముచ్చటింపలేదు.[8] కనుక నీమౌర్యచంద్రగుప్తుని కాలము గుప్తచంద్రగుప్తుని కాలము కంటె మిగుల పూర్వమున నుండెనని చెప్పవచ్చును.

అశోకుని కాలము :- మౌర్యచంద్రగుప్తుని కాలములో నొక యశోదున్నట్లే కాశ్మీరపాలకులలో నొక యశోకుడుగలడు. కాశ్మీర

---

4 Ancient Indian History pp. 198, 199

5. Age of Sankara, Part B. P. 53

6. Age of Mahabharata War. N. Jagannadha Rao.

7. Ancient Indian History, Part I. pp. 49-61

8. Having "Traversed India with an Army of SixLakhs of men and conquered the whole as stated by plutarch. This and other various discriptions given by various writers will be found to apply on all forms to Chandragupta of Samudragupta Dynasty and not to Chandragupta Mourya at all." (Age of Sankara, Part B. P. 53)

మున మొదటిగోనందుని పాలనమునుంతరించిన వెనుక మూడవవానిగా నీ యశోక నామమున్నది ఇందు కనిష్కుని తండ్రి రెండవ దామోదరుడు. ఆతని తండ్రి రెండవ దామోదరుడు. ఆతని తండ్రి జలౌకుడు. ఆతని తండ్రి ధర్మాశోకుడు [9] ఈతడు గోనందవంశములో నలుబదియెనిమిదవ వాడు మౌర్యాశోకునకు నీ యశోకునకు సమకాలికులు.

9. ఒకటవ గోనందుడు, దామోదరుడు, యశోవతి, రెండవగోనందుడు — 4
తరువాత 35 మంది రాజుల పేర్లను రచయిత పేర్కొనలేదు 35
అనంతరము లవ, కుశ, ఖగేంద్ర, సురేంద్ర, గోధర, సువర్ణ, జనక శచీనార, అశోకులు 9
మొత్తము 48

ఈతడు తన రాజ్యమును మ్లేచ్ఛుల దండయాత్రలవలన పోగొట్టుకొని అరణ్యములలో మరణించెను. ఈతని కాలము క్రీ. పూ. 1448—40. అశోకుని కాలముకూడ క్రీ. పూ. 1402—31 అగుచున్నది. కనుక వీరి సమకాలీనత చంద్రగుప్తునికాలమును పురాణములు చేర్కొనిన ట్లే స్థిరీకరించుటకు వీలగుచున్నది. ఈ విషయమును చరిత్రజ్ఞులు నిశితముగా పరిశీలించి నూత్నదృక్పథముతో చరిత్ర రచనకు గడంగవలసియున్నది.

మహాపద్మనందుని రాజ్యపాలనము గూర్చినిందుండుటంచే జేసి యారాజును గురించి ఈ క్రింద విషయములు ప్రస్తుతింపబడుచున్నవి.

1. మహాపద్మనందునకు ధననందుడనియు నామాంతరము. కలియుగ రాజవృత్తాంత మీయునను ధననందుడనియే పేర్కొన్నది. ఈతడతిలుబ్ధుడు, నతిబలుడని విష్ణుపురాణవచనము. ఈ లుబ్ధత్వము రాజుచే నధికమైన పన్నులు విధింపజేయుటయేగాక వానిని తుదకు చర్మములు, పళ్ళు, వృక్షములు, శిలల పైనను పన్ను విధించు వరకు బోయెను. ఈ ధనమంతయును యెనుబదికోట్లకు ప్రోవయ్యెను. దానినంతయును గంగానదిలోదాచుట కుద్దేశించి, నదీప్రవాహమును మళ్లించి యచటనొక మహాధనాగారమును నిర్మించెను. దాని యందీ ధనమంతయును నిక్షేపించి యనంతరము గంగానదీ ప్రవాహమును సహజ

ముగా మళ్లించిన వాడయ్యెను. తనజీవిత మంతయు నిట్టి నిధిని ప్రోవుచేయుటకే వ్యయము చేసి యా ధనమంతయును నానదీగర్భమున దాచుచుండెను. చాణక్యుడు నందుని కుమాళ్ళను సంహారించి యా ధనమును స్వాధీనము చేసికొని రాజ్యమునకు నూత్నాగతుడైన చంద్రగుప్తునకు రాజ్యనిర్వహణార్థము దత్తముచేసెను. [12]

విచిత్రాంశము :- మహానందునకు శూద్రగర్భమున జనించిన వాడు మహాపద్మనందుడు. మహాపద్మనందునకు శూద్రాపత్యము చంద్రగుప్తుడు. మహానందుని, మహాపద్మనందుని పట్టమహిషీ సంతానము రాజ్యము చేయలేదు. మహానందుడు,ఆయనసంతానము రాక్షస మాయచే సంహరింపబడిరి. రాక్షసుడు మహాపద్మనందుని రాజుగా చేసెను. మహాపద్మనందుని, అతని సంతానమును చాణక్యమాయ సంహరించినది. చంద్రగుప్తుడు చాణక్యునిచే రాజ్యమును సంపాదించెను. ఇరువురకును రాజ్యమును సంపాదించి యిచ్చినది బ్రాహ్మణులే రాజు లిద్దరు బౌద్ధులే, లేక బౌద్ధమతాభిమానులు. మహాపద్మనందు డతిబలుడు, నతిలుబ్ధుడు. ఆగుణములు చంద్రగుప్తున కున్నట్లు పురాణములు చెప్పలేదు.

2. కథాసరిత్సాగరమందు [13] నందున కొకడే కుమారుడు,

---

12. Prof. S K. Iyengar points out in a Tamil poem contents "Dhanananda from his being adicted to hoarding treasure... ... ...he collected the riches to the amount of eighty koties in a rock in the bed of river Ganga having caused a great excavation to be made, he buried the treasure there levying taxes among other articles on skins, gums, trees and stones, he amassed further treasures which he deposed of similarly" Mahavamsa

P. XXXIV. A. I, H. Part. 1. P. 44

13) కథా పీఠలంబకము 5, 6 తరంగములు.

పేరు చంద్రగుప్తు. నందుడు చాణక్యునిచే శప్తుడై యేడుదినములలో సంహరింపబడినపు డింద్రదత్తుడను వాడు నందుని శరీరమున ప్రవేశము చేసెను. ఆ యోగనందుడు రాజ్యము చేసినపుడాతనికి రాణివలన నొక కుమారుడు కలిగెను. అతడే సత్యానందుడు లేక హిరణ్యగుప్తుడు. ఇంతకు మున్ను నందునకు గల ఎనిమిది కుమారుల ప్రస్తావన మీగ్రంథమున లేదు. ఈ చంద్రగుప్తుడు ప్రత్యేకముగా రాజ్యస్థాపనమునకు చేసినప్రయత్నముగాని, సాధించిన విజయములుగాని లేవు. రాజ్యస్థాపనకయి కృషి యొనర్చినది శకటాలుడను మంత్రి. చాణక్యుడను బ్రాహ్మణుడు. అతరువాత చాణక్యుడు మంత్రియయ్యెను. నందుని, నందకుమారుని సంహరించినది వీరే. మహాపద్మనందునకు న్యుగ్రసేనుడను' బిరుదమున్నట్లు, నీత డిరువది రెండేడులు రాజ్యపాలనము గావించినట్లును కొన్ని బౌద్ధగ్రంథములు పేర్కొనవి.[14] నందుని. సుమాల్యుని పేళ్లు మాత్రము మన పురాణములు పేర్కొనుచున్నవి.

మహాబోధివంశములో నందవంశములోని వారివిగా 1) పాదుక 2) పండుగతి, 3) భక్తపాల, 4) రత్నపాల, 5) గోవిశంక, 6) దశసిద్ధక, 7) కైవరస, 8. ధననందులను పేళ్లున్నవి, మిలింద పన్హాయందు నందులకు, మౌర్యులకు నొకసంఘర్షణ జరిగినట్లు వ్రాయబడినది. నందుని రాజ బంధువులందు భద్రసాలుడను నొక సేనాని యుండినట్లు నాతడు చంద్రగుప్తునిపై యుద్ధమును ప్రకటించి నట్లుందుకలదు.

మహావంశమునందు ధననందునకు మురదాసీకాంత, ధననందుని యనుగ్రహముచే మురకొక పుత్రుడు కలిగెను. ధననందుని వలన కలిగిన రాజ్ఞీత్వమున తనకుమారుని మగధరాజ్యమున మహారాజుగా ప్రతిష్ఠింపగలిగెను.

---

14) సిలోనీయుల బౌద్ధగ్రంథములందున్నవని ఆర్. కె. ముఖర్జీగారు తమ **Mourya Chandragupta and his times** అను గ్రంథమున వ్రాసిరి.

ఉత్తరభారతమునకల బౌద్ధగ్రంథము లాధారముగా చంద్రగుప్తుడు శకకుటుంబములోని యుడమాని. ఈతడు రాజకీయకుట్ర నెపముపై దేశమునుండి తరిమి వేయబడెను. అప్పు డీతడు హిమాలయ పర్వత ప్రాంతములలో నొక నగరమును, మయూరకంఠాకృతితో నిర్మించెను. ఆతడు మౌర్య చంద్రగుప్తుని యాకారణముచే బిలువ బడెను. మౌర్యశబ్దమును 'మయూర'గా భావించుటచే నుత్పన్న మయిన కథయిది. చంద్రగుప్తుడు గర్భస్థుడై యుండగా నీతని తండ్రిని పౌరుగురాజు యుద్ధమొనర్చి మరణింపజేసెను. రాణి గర్భరక్షణ కయి సోదరుని యొద్ద రహస్యస్థితిలో రక్షింపబడెను. చంద్రుడను వృషభ ముచే గర్భయుక్తయగు బిడ్డ రక్షింపబడి, పెంచి పోషింపబడెననుటలో చంద్రగుప్తుని పిలువబడెనను కథయొకటిగలదు. సారాంశమేమన-

1) ఈవంశమున కంటె బూర్వమున్న వంశములు బురాణ ప్రసిద్ధములుగానుండి చరిత్రాంశమున కుపాదేయము లయినవేగాని మహాపద్మనంద, చంద్రగుప్త వంశములు విస్తృతమయిన చారిత్రక ప్రశస్తి నందలేదు. 2) నందుడు మాత్రమే పేరుగా నుండి 'మహా పద్మ' యనునది యాయన నిధి నిక్షేపములకు సమన్వయించెడి బిరుద నామమయి యుండెనగును. కొన్ని గ్రంథములలో నీయనకు ధననందు డనియు పేరు. 3) జగత్ప్రసిద్ధుడైన 'యలెగ్జాండరు విజేత' యీయన కాలములో వచ్చినట్లుగా జరిత్రకారులు నిర్ణయించి గ్రంథములు వ్రాయుటచేత నీవంశములోని చంద్రగుప్తునకు విస్తృతమయిన కీర్తి ప్రతిష్ఠలు వచ్చెనేమో! 4) నందునకుగల యెన్మిదికుమాళ్ళ విషయమై గ్రంథములం దేకాభిప్రాయము లేదు. పురాణములన్నియు సుమాల్య నొక్కనే పేర్కొన్నవి. చంద్రగుప్తు డొకడేయని బౌద్ధగ్రంథములు పేర్కొన్నవి. మఱికొన్ని యెన్మిదిమందిని బేర్కొనుట పైయభిప్రాయ మును బోషించుచున్నది. 5) అన్ని గ్రంథములందును జంద్రగుప్తుని రాజ్యసంపాదనము చాణక్యోపజ్ఞముగనే చెప్పబడెను. 6) మహా

పద్మనందుని యనంతరము రాజ్యమునకు వచ్చినది చంద్రగుప్తుడు. ఈతడు మురయను స్త్రీ సంతానము. 7) ఈతడు క్రీ. పూ. 1533 నుండి 1504 వఱకు మగధను పాలించెను. ఈ వంశము 316 సంవత్సరములు మగధసామ్రాజ్యము నేలినది. 8) ఈతని కాలములో నెట్టి విదేశీయ దండయాత్రలు జరిగియుండలేదు.

## చంద్రగుప్తుని స్వప్నము - ఇతివృత్త సంగ్రహము

మురయను శూద్రవనిత మహాపద్మనందుని యనుగ్రహము బడసి చంద్రగుప్తనామక సంతానమును సాధించెను. నందుని కుమారుల దుష్టాధిపత్యముచే జంద్రుడు కారాగార నివాసి యయ్యెను. తల్లిప్రేమ, కడుపుతీపి నిలువనీయక మురను ప్రభువుకడకు బోవునట్లు చేసినవి. పూర్వానురాగ ప్రముదితుడైన ప్రభువు చంద్రుని విడిపించుటకు సహాయ్యని రాజచిహ్నమును ముర కొసంగెను. ఆమె కుమారుని విడిపించుటలో సఫల యయ్యెను.

చంద్రగుప్తుడు విడుదల యయ్యెను. ఆకసమున చంద్రోదయమయ్యెను. ఇది చంద్రునకు నాశోదయమన్పించెను. బంధన చిహ్నములలో చేతికి వేయబడిన కడియము మాత్రము రాలేదు. మరునాటి నిశాదియందు తనమిత్రుడయిన వసుమిత్రు నింటికేగెను. ఈతని జూడగనే వసుమిత్రునకు సంభ్రమాశ్చర్యములు గలిగెను. వారిరువురు నంత తమ మిత్రత్వమును పరస్పర స్పృహణీయముగా నొనర్చుకొనిరి. వసుమిత్రుడు చంద్రుని కలాలిచే సంస్కృతునిగా నొనర్చెను. ఆతనికి గావలసిన సర్వసౌకర్యములను సమకూర్చెను. కలాలి యంబష్ఠుడు. వసువు రాచరికపు టుద్యోగము నిర్వర్తించును. వారి ప్రవర్తనము రాచరికము రాచరికమే, నెయ్యము నెయ్యమే యనునట్లుండెను.

గిరివ్రజమునకు నాలుగామడ దూరముననున్న గ్రామము 'చణకము'. అందున్న పదికుటీరములలో నొకకుటీరము చాణక్యునిది.

ఈతడు బ్రహ్మచారి, పాణిని విరచితమైన వ్యాకరణము నధ్యాపన మొనర్చు శక్తి సంపన్నుడు. అతనికడ చదువుకొనవలెనన్నచో నాయన చెప్పెడి పనులు చేయవలెను. తిట్టెడి తిట్లు తినవలెను. సర్వరాజకీయ ములు, సర్వమతములు, సర్వకార్యాన్వేషణలు - అన్నియు నక్కడే అన్నియు నాశిష్యుల వరముగనే యుండును.

ఒకనాడు వసుచంద్రు లిర్వురు నీయనను దర్శింప వత్తురు. వసు వాయనతో చంద్రునకు నందులతోగల శతృత్వమును జెప్పి దాని సాధనోపాయము ననుగ్రహింప ప్రణామ పూర్వకముగా వేడెను. విరోధము నందులతో నని తెలిసి విష్ణుగుప్తుడు తనకును న్నె నందులతో గలిగిన విరోధమును సాధించుకొనుటకు సాధనముగా జంద్రగుప్త నెన్నుకొనెను. కౌటిల్యునకు రాజు సన్మానసభలో గావించిన యగౌర వము, తిరస్కారము, అవహేళనకు దానచట రాజవంశనాశము చేసి గాని శిఖాబంధనము చేయనని చేసిన శపథము విస్తరముగా వసు మిత్రుడు చంద్రునకు వివరించెను.

నాటినుండి రాజలోకములో నొక భయమావరించెను. చాణక్యుడు యక్షకిన్నర గంధర్వులలో నొకడేమో యని భావింప జొచ్చిరి. కోట తలుపులు ఛేదింపవచ్చిన మత్తగజము చాణక్య రూపమేననియు, చాణక్యసామర్థ్యమును హేళనచేసిన భటుని పీకికొనితినిన భల్లూకము నాతడే యని భావించుచుండిరి. అనంతరము పునరాగతుడైన వసు చంద్రులలో చంద్రుని పదిమంది శిష్యుల సమక్షమున జాణక్యుని యాజ్ఞచే కౌశికనామకుడు రాజ్యాభిషేక మొనర్చెను. వసుమిత్రుని యంగరక్షకునిగా నియమించెను. రాక్షసుని వలన కలిగెడు సర్వ విపత్తులను జెప్పి నిత్యప్రత్యగ్రమయిన జాగరూకత నుపదేశించెను. తాము వసుమిత్రుని దగ్గము కాబోవు భవనము నుండి యెట్లు బయట పడవలెనో యుపదేశింపబడి చాణక్యుని వీడుకొనిరి

చాణక్యనీతి యారంభమయ్యెను. చంద్రుడు ధరించిన యయో మయహస్తకంకణము నందవంశ నిర్మూలనాత్మకమగు ప్రతిజ్ఞాపాలనమునకై ధరింపబడినదని తన్ను దర్శించువారికి జెప్పించుట ప్రథమసూత్రము. తన్ను చూడవచ్చినవారికి రత్నములు దానముచేయుట రెండవది. పరరాజుల ప్రమేయ మిందున్నదని రాజ్యమున వ్యాపింపజేయుట మూడవ నీతిసూత్రము. తల్లియందు గౌరవసూచకముగా తన కడగల రాజముద్రికపయి మురనామము చెక్కింపబడుట నాల్గవది.

నీతియందలి ద్వితీయభాగము ప్రారంభమయ్యెను. నందుని రెండవపుత్రుడు సుగంధ్యుడు. అతడు శకరాజ ప్రతినిధి యింటికడ వధింపబడెను. అయోమయ శృంఖలముతో సుగంధ్యుని వలెనుండు వానిని జంపవలెనని రాక్షసాదేశము. వీరు సుగంధ్యునే చంపినారు రాక్షసుడు చనిపోయినది చంద్రగుప్తుడే యని ప్రచారము చేయవలసినదిగా నాజ్ఞాపించెను.

ఇది యిట్లుండగా జంద్రగుప్త డెట్లు తప్పించుకొని పోయెను ? అను విషయముపయి విచారణ జరుగుచుండెను. దీని పరమరహస్యము తండ్రియగు మహాపద్మనందుడని తెలిసెను. సుగంధ్యుడు చనిపోయెనుగాన నాడు రాజ్యమున రాజులేడు. ఒకనాటి సాయంతనమున జంద్రగుప్తుని జయఘోషలు పెట్టుచు శృంగాటక మధ్యమున నూరేగింపు సాగిపోయెను, మరునాడు దాని విషయమై విచారణ పుట్టెను, ఫలితము పుట్టలేదు. ఇట్టి పరిస్థితిలో నందుడే రాజ్యము స్వీకరించెను, అతనికి రాక్షసుడే మహామంత్రి. మిగిలిన మంత్రులమాత్యులని పిలువబడరాదు. ఇది ఆయన ఆజ్ఞ. రాజునకు కడగొట్టు కొడుకు దండపాణి. రాజునకు దండపాణి తల్లి మాధవి యన్నచో గాఢానురాగము. చంద్రగుప్తుడు మురకొడుకుగాడని నిరూపించుట కనేకాధారములను జూపించి యాతని బంధింప ననుమతి బుట్టింపుమని తల్లిని కోరును. కోదండపాణికి గల యుంపుడుగత్తెపయి తన సోదరుడు భూమిమిత్రుడు మరులు

గొన్నాడను భ్రమకల్పింపబడి యాయింటికి బోయి యా యింట నెవ్వరుగానక నాయింటికిగల పెరటి ప్రదేశమునకు బోయి యటగల నొక భూవివరములోనికి బడెను. ఆ వెలచేడియ నాగర యువకుని వెదకుటకు వచ్చి యామె తన్మార్గమునే వరించెను. ఆ పురుషు డట్లు కన్పించుట చాణక్యనీతి, ఫలితము రెండవ యాహుతి దండపాణి.

చంద్రగుప్తునికై మఱింత తీవ్రయత్నములు చేయబడుచుండెను. చాణక్యనీతి భంగించుటకు రాజకుమారులు, మంత్రులు, సేనాపతులు యథోచితముగా ప్రయత్నములు జరుపుచుండిరి. ప్రజలలో జాణక్య నీతికి ప్రశంసలు కురిపించువారు కొందఱు కాగా, రాక్షసు డీతని జంపి వేయునని చెప్పుకొనజొచ్చిరి. నందునకు రాక్షసుడు రహస్యలేఖ బంపెను. అందు వ్రాయబడినది చాణక్యనీతియే తన్ను రాజధానికి జేరనిచ్చుట లేదని, కాలంజరుని మంత్రిగా నియమించి మిగిలినవారి కుద్యాసన చెప్ప వలెనని యాలేఖయందలి సారాంశము. భూమిమిత్రుని పయి చాణక్యుని గరుడదృష్టి పడకుండ కాపాడవలసినదని రాక్షసుడు హెచ్చరించెను.

నందుని సప్తమపుత్రుడు రాహులుడు. అతని సతి మాయ. ఈమె సుమాల్యుని భార్య యశోధర, బృహద్రథుని భార్య యామ్ర పాలి బౌద్ధమును నెఱపుదురు. వైశాలికి చెందిన నాగానందుడను బౌద్ధభిక్షువు గిరివ్రజమున కేతెంచెను. రాజసతు లందఱు బౌద్ధాభి మానులే గనుక ఆయన ప్రవచనము శ్రవణము చేయగోరిరి. మాయారాహులు లిరువురు ప్రత్యేకరథములో బోయిరి. ఆ ప్రదేశ మున రాహుల సంహారము, మాయాపహరణము సంభవించినదని ప్రథ పుట్టెను. వీరి యాచూకీ తీయవలసినదిగా సువారమునున్న రాజ బంధువులను వినియోగింపుడని రాహులుని తల్లి సునీథాదేవి రాజునకు జెప్పెను. వారు కత్తులతో వ్యాయామశాల లోనికి బోయిరి. అచట జరిగెడి యల్లరికి రాజు తత్ప్రదేశమునకు బోయి. వారిలో నొకరిచే సంహరింప బడెను. వాడు రాజబంధువుగాడు. సుమాల్యుడంతయు

జూచెను. ఆతనికి జాణక్యనీతి భయము గొల్పుచుండెను.

కారాగృహమువైపు నుండి సైన్యరూపమున చాణక్యనీతి ప్రవేశించుచుండెను. భూమిమిత్రుడు కారాగృహమును బరిక్షింపనేగెను. చంద్రగుప్తుడు బంధింపబడిన గదిలో నీతడు బంధితుడయ్యెను. అంతర్దుర్గద్వారమును నందుని యారవపుత్రుడు సహదేవుడు రక్షించుచుండెను. మురాదేవి, చంద్రగుప్తుడు కోటలోనికి వచ్చి మరణించిన రాజశవమును దర్శించిరి. సంకులసమరములో సహదేవుడు మరణించెను. సుమాల్య శతానీక,బృహద్రథ వినయంధరాదులు ప్రత్యేక భవనమున నుంచబడిరి. సుమాల్యుడు రాజశరీరమునకు పైదిక మృత సంస్కారమును జరిపెను.

రాహులుడు, మాయు, భూమింజయులు కోటకు వచ్చిరి. రాజమృతసంస్కారానంతరము బ్రాహ్మణసభ జరిగెను. సుమాల్యుడు వారికి బారితోషికమీయ నిర్ణయమయ్యెను, రాహులుడు క్షత్రియుడయ్యెను. వసుమిత్రుని పేరిట వచ్చిన నిరంజనుడు భూమిమిత్రుని క్షత్రియుద్ధములో జంపెను, సుమాల్యాది సోదరచతుష్టయముతో నిరంజనుడు యుద్ధము చేయనెంచెను. చాణక్యమహామాత్యుడంతలో సభకు విచ్చేసెను. అందఱును ప్రత్యుత్థానము చేసిరి. నిరంజనుడు క్షత్రియుద్ధమారంభించెను. నల్వురును వానిచేతిలో బిచ్చుకలైరి. చంద్రగుప్తుడు రాజయ్యెను. కాలంజరుడు మంత్రియయ్యెను. రాక్షసుడు మహామాత్యుడయ్యెను, బ్రాహ్మణు లుచితరీతిని సమ్మానింపబడిరి.

నాటిరాత్రి చంద్రగుప్తున కొకస్వప్నము వచ్చెను. అందు అలక్షంధరుడను చక్రవర్తి సేనలు తనచే దరుమబడినట్లు, తనకీర్తి దశదిశల వ్యాపించినట్లు నా స్వప్నమున జూచెను. పిమ్మట ఆస్థాన జ్యోతిష్యులను బిలిచి యడిగెను. వారు భవిష్యద్రాజయిన గుప్త చంద్రగుప్తు కీర్తి తన్నాశ్రయించునని జెప్పిరి.

# ఇతివృత్త నిర్వహణము

రచయిత యీ యితివృత్తమును కొద్దిమార్పులతో 'నందో రాజా భవిష్యతి' లోని పథకమునే యనుసరించెను. నవలాలక్ష్యము దానికంటె భిన్నము. రాజ్యసంపాదనమున మేధయు, బరాక్రమమును ప్రాముఖ్యము వహించుననని పూర్వపు నవల తెలుప, మేధ యొక్కటియే చాలునని యిది నిర్ధారణ చేసినది. అక్కడ రాక్షసుడు దీనికాలంబము. ఈ నవలయందు చాణక్యుడు దీనిని ఋజువు చేయును ఇందు—

1) పాలనకాల సన్నివేశ ప్రకల్పనము :- చరిత్రలో పన్నిద్దఱు మౌర్య వంశపు రాజులు 310 సంవత్సరములు బాలింతురని యున్నది. ఇక్కడ దానిని సమర్థించుచు రచయిత యొక సన్నివేశమును గల్పించును. కౌశికుడు చాణక్యుని శిష్యుడు. చతుర్వేది, చాణక్యుని యాజ్ఞచే జంద్రగుప్తుని పట్టాభిషేకమునకు పూర్వాంగముగ ప్రమిదలలో దీపములను వెలిగింతురు. ప్రమిదలు యిరువది, దీపములు ముప్పది, - వీని యాంతర్యమును కౌశికుని చేతనే రాజవంశమునందలి రాజులసంఖ్య వారి పాలనకాలమును జెప్పించును. కౌశికుడు "మహారాజా! వారు చెప్పిన సంగతి మనవి చేయుచున్నాను, పది ప్రమిదలనగా మీవంశమునందు పదిమందిరాజులు వెలయుదురట. ఒక్కొక్కవర్తికి పదియేండ్ల చొప్పున ముప్పదివర్తులకు మూడువందల యేండ్లు మీమౌర్యవంశము సుగధను బాలించునట." యని చెప్పును. ♦ చారిత్రక విషయమునకు సాహిత్యత్వము గల్పించుట యనగా నిట్టిది.

---

♦ శ్రీ విశ్వనాథ "నీకుమారుడును మీవంశములో జిట్టచివరివాడునుగాక నడుమ పదిమందిరాజులందురని మౌర్యవంశమున బ్రండ్రెండుగురు రాజులును, 318 సంవత్సరములను జెప్పి పురాణములను సమర్థించెను. కాని యిచట, ప్రమిదలు యిరువదిగా జెప్పి వానిలో రెండింటికొక దీపపు ప్రమిద నేర్పాటు చేయుగా నవి పదియైనవి పదుగురు రాజులని చెప్పి దీనిని సమన్వయించెను. దీనివి

చరిత్రలో నందుని కుమారు లెన్మిదిమందియని చెప్పుచు నే పురాణము సుమాల్యుని కంటె నితరమైన రాజులను పేర్కొని యుండలేదు. బౌద్ధగ్రంథము మాత్రము పేర్కొనెనుగాని యానామముల నీకవి స్వీకరింపలేదు. కవి ప్రత్యేకముగా నీరాజులపేళ్లను పేర్కొనెను. రాజ్య స్వీకార క్రమమును కల్పించెను. కవి యీరాజులకు బెట్టిన పేళ్లివి. 1) సుమాల్యుడు (పురాణములలోనీ పేరు కలదు.) 2) శతానీకుడు. 3) బృహద్రథుడు, 4) సుగంధ్యుడు. 5) భూమిమిత్రుడు, 6) సహదేవుడు. 7) రాహులుడు, 8) కోదండపాణి. వీరందఱు నందు డెనుబది యెన్మిది సంవత్సరములు పాలన చేసిన తరువాత నొక్కొక్కఱుగా నెన్మిదిమంది పాలన చేసిరి. ఈ కథాకాలము నాటికి సుగంధ్యుడు రాజ్య పాలనము చేయుచున్నాడు నందులపాలనము మొదలయి నూఱవ సంవత్సరమారంభమయ్యెను. ఈ పాలన మీ సంవత్సరముతో నంత మగునని కార్తాంతికుల చేతను, చంద్రగుప్తునకు బట్టాభిషేక ముహూర్తమును సూచించిన చక్రవర్తి నామక కాలజ్ఞునిచేతను బాలకులకు సూచింప జేసినాడు.

2) మైత్రీకల్పనము : చాణక్యునికకకు చంద్రగుప్తుని కేర్పడు వసుమిత్రుని పాత్రను మధ్యవర్తిగా కల్పించి చంద్రగుప్త వసుమిత్రుల మైత్రీ సన్నివేశమును జక్కగా నిర్వర్తించెను.

3) రాజ్యహేతుకల్పనము :- మహాపద్మనందుని లుబ్ధత్వ మాతని కుమారుల రాజ్యపాలనకు హేతువుగా నొనర్చి కథకొక బిగువు తెచ్చెను. లేనిచో నందు డుండగా కుమాళ్ళపాలనకు హేతువేమున్నది? ఎట్లన "నందుడు పరమలోభి. ఎట్టిని యేగాని దొరకి రోలే కన్పించి

మొదటివాడు, చివరివాడు గాక పదిగురిగా సమన్వయించు కొనవచ్చును వర్తులు మూడువేసి 300 సంవత్సరములను సాధించెను. ఆ పదుగురు రాజులకే ఈ కాలముగాని మొదలు, చివరి రాజుల పాలనకాల మెక్కడ చెప్పినట్లు ? ఇది విచార్యము.

నచో నది యింకొక మహాపద్మము కాదగిన స్థితి కెదురు చూచు చుండును." (59) కనుకనే తన కుమారులకు సొంతముగా వ్యయపెట్టు కొనుటకు కోలీ యిచ్చుటకు నందునికి ప్రాణమొప్పలేదు. దీనికై యాతడెత్తిన ఎత్తులో "నా దగ్గర ధనము లేదు. రాజ్యము మీాద వచ్చెడు ధనమంతయు రాజ్యమునకే వ్యయమగుచున్నది. ఒక్కొక్క యేడాది తరువాత మీారొకని తరువాత నొకరు రాజ్యము చేయు చుండుడు. ఆ సంగతి మీాకే తెలియును." అని సుమాల్యాదుల రాజ్యపాలనమునకు హేతువును కల్పించెను. "ఆ ధనమంతయు నచట గంగానదియొక్క పడకలలో గోతులు త్రవ్వించి దానినిండ నిట్టుకతో సున్నముతో గోడలు కట్టించి యాగదులలో నినుపపాత్రలలో రత్నాలు వజ్రాలు, మణులు, హేమ నిష్కములు పోయించి మూతలు బిగింపించి యా నేల పూడ్పించి గంగానదీ ప్రవాహమును దీనిపైకి మళ్లించును. ఈ విషయమంతయు బౌద్ధగ్రంథములు పేర్కొనియే యున్నవి.

4) బంధహేతుకల్పనము : ప్రతి సంవత్సరము నొక్కొక్కడు రాజ్యముచేయుచో నెన్మిదిమంది నందుని కుమాళ్లెన్మిదేళ్లేలుదురు. చంద్రగుప్తుడు కూడ రాజ్యమేలినచో నందఱకొక్కొక్క సంవత్సర మాలస్యముగా రాజ్యము వచ్చును. ఈ ఆలస్యమును భరింపలేక తండ్రితో నందుని కొడుకులు చంద్రగుప్తుడు శూద్రాపత్యముగనుక వానికి రాజ్యార్హతలేదని తండ్రిని యొప్పించి బయటనున్నచో నెప్పటి కయిన నిది ప్రమాదహేతువని నిర్ణయించుకొని చంద్రగుప్తునకు శాశ్వత కారాగారనివాసము నేర్పాటు చేసినారు. ఈతని కారాగారప్రాప్తికి రచయిత జూపిన యీా హేతువు చక్కని సమన్వయము సాధించి నవలకొక ప్రమాణమును సిద్ధింప జేజెను. ఇదియు చరిత్రకు గల్పింప బడిన సాహిత్యత్వమేయగును. ఇట్లే ప్రభువైన మహాపద్మనందుని, సుమాల్యాదుల మరణమునకును ప్రత్యేక సన్నివేశములను కల్పించెను ఇదియు చరిత్రకు సాహిత్య స్వరూపమును కల్పించుటయే.

సారాంశమేమన—

1) ఈ నవల సర్వము చాణక్యప్రజ్ఞగా నిర్వహింపబడినది. 2) చంద్రగుప్తుడు తానుగా నిర్వహించిన రాజనీతిగాని, యుద్ధముగాని లేదు. 3) పాలనకాలసమన్వయము, మైత్రీ, రాజ్యపాలన హేతు. బంధ హేతు, స్వప్నవృత్తాంతకల్పనము లిందు ప్రాధాన్యము వహించును.

4) ఈ నవలయందు చాణక్యుని ప్రతీకారనిర్వహణమే లక్ష్యమగును. చంద్రగుప్తునకు రాజ్యప్రసాద మానుషంగిక ప్రయోజనము. ఇది చాణక్య ప్రాముఖ్యముగల నవల యయ్యును, చంద్రగుప్తునివివాదప్రాధాన్యమును వ్యక్తీకరించెడి నవలయగుటకునొక స్వప్న వృత్తాంతమును నిర్వహించెను. ఆ స్వప్నమునందు చంద్రగుప్తుడు తాను సర్వ భారతదేశమునకు చక్రవర్తిగా నగుటను గాంచెను. దాని యర్థమును గుఱించి సిద్ధాంతిని జక్రవర్తి యడిగెను. ఆయన 'నీ పేరు గలవాడు కొన్నివందలయేండ్లు గడచిన తరువాత నా యలక్షుంధరుని దండయాత్రను నాశము చేయును...ఆ మ్లేచ్ఛ దండయాత్రను వెనుకకు మరలించినది నీవని మూడు వేలయేండ్లు గడచిన తరువాత ననుకొందురు.ఇదిఆంగ్లేయులు పురాణములను జదివి చరిత్ర వ్రాయుట ప్రారంభించిన కాలము.)అట్లు కొందరు పురాణవైరమును సాగింతురు' ఈనవలకు జంద్రగుప్తుని స్వప్నమని పేరిడినదియు నీ హేతువు ననే యని వేఱుగా నుడువనక్కరలేదు. ఇట గార్యము నందవంశ వినాశము. సాధనము చాణక్యుడు. ఫలము రాజ్యప్రాప్తి. అనుభోక్త చంద్రగుప్తుడు.

---

1. (1) The Greek Writers say that Sandracottus had become apressive. Bnt no Indian Account calls Chandragupta Mourya to have been appressive.

ii) According to Justin, Sandracottus was prompted to aspire to royalty by an omen etc. Chandragupta According to Indian Accounts, had met with from the last Nanda King. Not the lion and omen etc.

పాత్రచిత్రణము:- ఈ నవలయందు ప్రధానపాత్ర చాణక్యుడు. ఆతని విభవమెట్టిదియో, భేదమేమి చూపెనో గమనింతము.

చాణక్య-రాక్షసులు :-'నందోరాజాభవిష్యతి' యను నవలయందు రాక్షసుని, 'చంద్రగుప్తుని స్వప్నము' నందు జాణక్యుని ప్రాధాన్యము ప్రముఖమగును. వీరిరువురకు గల సామ్యవైషమ్యములను గమనింతము. సామ్యములు :-

1)ఇరువురును శూద్రాపత్యమునే ప్రభువుగానొనర్చిరి. 2) ఇరువుర నీతి వైభవమే రాజ్యసంప్రాప్తికి నిమిత్తమయ్యెను. 3) ఇరువురు రాజులకు కీర్తిప్రతిష్ఠలు వీరి వలననే లభించెను.

భేదములు 1)బుద్ధిబలముతో శరీరబలము కూడ రాజ్యసంపాదనమునకు నావశ్యకమని ఋజువు పఱచినవాడు రాక్షసుడు, కేవలము నీతివిభవమే రాజ్యసంపాదనకు సాధనమని విశ్వసించి ప్రయత్నించి ఫలయుతుడైనవాడు చాణక్యుడు. 2) రాక్షసుని నీతియందు ప్రధానమయిన లక్ష్యము సర్వక్షత్రవినాశము. 3) చాణక్యుని యందు నందవంశోన్మూలము ప్రాధాన్యము వహించును. 4) నందవంశపాలనమునకు నందునకు జరిగిన యవమానమే ప్రాతిపదిక యయ్యెను. ఇచట రాక్షసుని జోక్యము పరోక్షము. మౌర్యవంశపాలనమునకు బీజము చాణక్యుడే. ఆతనికి జరిగిన యవమానమే యంకురమయ్యెను. ఇచట

---

iii) But the most important point to bear in mind is this. That all Indian accounts are unanimous in saying that Chandragupta Mourya had come to the throne by Chanakya's help But the Greek accounts one and all are entirely silent about the most outstanding point. They don't even mention the name of. Chanakya.

These are very important points in the life of Chandragupta Mourya. The answer can be one only that the greek accounts of Sandracottus donot refer to Chandragupta Mourya. Puranic Chronology, D. R. Mankad P. 256.

చాణక్యుని జోక్యము ప్రత్యక్షము. 5) రాక్షసనీతియందు కౌటిల్యము భాసించదు. చాణక్యుడు కౌటిల్యుడే. 6) వీరిరువుర మధ్యను నడిచిన రాజనీతి సంగ్రామములో ముందుగా నెదురుదెబ్బ తీయువాడు చాణక్యుడు. దానినుండి రక్షించుకొను యత్నమొనర్చు వాడు రాక్షసుడు. 7) ఇరువుర ప్రభువులయొద్ద ప్రధానామాత్యపదవిని కోరబడి చేపట్టిన వాడు రాక్షసుడు. పదవీ కాంక్షలేనివాడు చాణక్యుడు.

ఈ వివేచన మనకు చాణక్యుని వైశిష్ట్యమును వ్యక్తమొనర్చును. ఇట్టి పాత్రను రచయిత మలచిన తీరును బరిశీలింతము.

ఒక సామ్రాజ్య సంపాదనమునకు గావలసిన లక్షణము లన్నింటికి లక్ష్యభూతుడు చాణక్యుడు. చణక గ్రామమందున్నవాడు గనుక చాణక్యుడయ్యెను. తల్లక్షణములు- 1) రహస్యవేత్తృత్వము, 2) శాస్త్రపాండిత్యము, 3) నీతివైశారద్యము, 4) రాజకీయపరిజ్ఞానము.వీని సమన్వయమిట్లు గావించెను.

1) చాణక్యునకు శిష్యులే గూఢచారులు. దాని కుద్దీపనముగా వారు వేషములు వేయుటయందును, వేదములు, వివిధభాషల యందు పాండిత్యము సంపాదించుట యందును, వేగులుగా ననేక ప్రదేశము లందనేక విషయములను జాడతీయుట యందును లబ్ధప్రతిష్ఠులుగా నుందురు. ఈ పరిజ్ఞానముచే జాణక్యుడు వసుమిత్ర చంద్రగుప్తులు వచ్చుటతోడనే యిరువుర గోత్రనామములను చదివెను. వారి సర్వ విషయములను ప్రత్యక్షముగ, నిత్యప్రస్తుతముగా నేకరువుపెట్టెను.

"ఇంతసర్వంకషముగా రాజ్యమునందలి ప్రతివ్యక్తియొక్కయు చరిత్రమును, దెలిసికొని జ్ఞాపకముంచుకొని వ్యవహరించువానికి సాధ్యము కాని రాజకార్య ముండదు."

ఈ వాక్యము చాణక్యుని గురించి చంద్రగుప్తుని ప్రశంస.

2) చాణక్యుని నీతిశాస్త్రము సర్వమును లౌకికముగనే సమన్వయింపబడినది. ఈయన చదివిన శాస్త్రములను వసుమిత్రుడు చంద్ర

గుప్తునితో నేకరువుబెట్టును. పాణిని వ్యాకరణము, భారత భాగవతములు, రామాయణము, జైమినీయసూత్రములు, వ్యాసకృత బ్రహ్మసూత్రములు, శుక్రనీతియు, భారతమందున్న సర్వరాజనీతియు నీతని సొమ్ము. ఎంత పండితుడో యంత యుద్ధతుడు. ఏతత్కారణముననే నీతడు రాజసభాభవనమున సంక్రాంతి పర్వదినమందు సుమాల్యాదులచే నఖిలబ్రాహ్మణపండిత సమక్షమున నవమానింపబడెను. ఆ యవమానమే నందవంశనిర్మూలనమునకు బీజమయ్యెను.

చంద్రగుప్తునకు చతుర్వేదములతో నభిషేక మొనర్చుట, నదియు సర్వనదీజలాభిషేకమగుట, మహావిద్వాంసుడైన చక్రవర్తి సిద్ధాంతిచే సుముహూర్తనిర్ణయము గావింపబడుట, నాటికి నలుబదిరెండు దినముల యనంతరము మగధసామ్రాజ్యముపై చంద్రగుప్తుని నధిరోహింప జేయుదుననిపలుకుట-నీయంశము లాతనిలక్ష్యమును తెలియఁబఱచుటలోని తీవ్రతను భావించుట కవకాశమున్నను నాతని యపారశాస్త్రవిజ్ఞాన వైభవవిలసనమైన యొక నిశ్చయభావము పారదర్శనమని నిర్ణయించుటలో దొసగేముండును ! లేనిచో చాణక్యుడు - ఏమోయి! నందల యేండ్లనుచున్నావు ? వీనికి విరోధము నందులతోడనా ! యని వసుమిత్రి చంద్రుల యొద్ద ప్రస్తావింప గలుగునా ?

3) నిరుపమానమైన రాజనీతిని యీగ్రంథమంతట చాణక్యోపజ్ఞముగా వెలయించెను. దాని సంగ్రహము—

1) నందుని కుమాళ్ల పాలనమునకు విసివి గిరివ్రజపు పొలిమేరలో స్వగ్రామములో నున్న రాక్షసుని చాణక్యనీతిచే గిరివ్రజపురమును జేరనీకుండుట. 2) చంద్రగుప్తుడు నిగడశేషముగా నుంచుకొన్న కంకణముచేత రెండు రాజకీయ ప్రయోజనములు సాధించుట. (తాను మహారాజునని యభిజ్ఞ చేయుట, సుగంధ్యుని సంహారమునకీ నిగడశేషమే గుఱుతగుట). 3) సుమాల్యాదుల పాలనమును

తననీతికతమకూలముగా మలచుకొనుట. 4) సర్వజనులయొక్క చరిత్రను వ్రాసిపెట్టుకొని కాలానుసారముగా నానినుపయోగించుట గొప్ప రాజనీతి యని వసుమిత్రుడు చాణక్యుని రాజనీతిని ప్రశంసించును. 5) చాణక్యుడనగా రాజసేవకులలో, రాజులలో నొక భయము, బెఱకు కల్గుటకు కొన్నివిచిత్ర సన్నివేశములను వెలయింపజేసి సామాన్యుడు సయితము తనను గుఱించి యాలోచించుటకు భీతిల్లునట్లు చేయుట, ఆ సన్నివేశములు-

1) ఒక ఏనుగు కోటగవను కడకు వచ్చి తలుపులు భేదింప యత్నించి వెడలుట. అది చాణక్యరూపమే యని ప్రజలలో నొక వదంతి వ్యాప్తికి హేతువయ్యెను. 2) చాణక్యుని గుఱించి యవహేళనగా మాటలాడెడునొకరాజసేవకుని నొకభల్లూకము మ్రింగినది. ఈ సన్నివేశములు ప్రజలను భయవిహ్వలులుగా నొనర్చెను, 'గిరివ్రజపురమున బసిపిల్లలేడ్చుచున్నచో, నడుగో! చాణక్యుడు వచ్చుచున్నాడని భయపెట్టుచున్నారను ఫలము కల్గించినది.

6) రాక్షసుడు చంద్రగుప్త వసుమిత్రులుండెడి భవనము దగ్ధముచేయవలెనని యానతిచ్చెను. చాణక్యునిచే నంతకు మున్నే ప్రబోధితులై నొక భూవివరమార్గమున శకరాజప్రణిధి యిల్లు చేరిరి. భవనము దగ్ధమైనది. నీకు తప్పించుకొనిరి. సుగంధ్యుడు మరణించెను. ఈ విషయము తెలియజేయగా రాక్షసుడన్న మాటలు-

“ఓయి చాణక్యా! నీవు నన్నుమించినవాడవు.”

ఇది రాక్షసుని మించిన రాజనీతిని తెలియజేయును.

7) నందరాజసంహారము, మురయందు చంద్రగుప్తునకు ప్రీతి గౌరవములు సంపాదించిపెట్టుట. మాయాపహరణమునను, బృహద్రథ, శతానిక, సహదేవ, భూమిమిత్ర, దండపాణుల సంహారము నందును చాణక్యుని మాయావాగురకలదు.

8) నందునిచే నిర్మూలింపబడిన సకలక్షత్ర వంశములు నందు నకు ప్రతికూలములని చాణక్యుడెఱుంగును. వారందఱును చాణక్యుడు చేరదీసి ధనాదులనిచ్చి తనవైపునకు త్రిప్పుకొనెను. తమకు విరోధులై యంతకంటె గత్యంతరము లేక తమ పంచనుబడియున్న రాజవంశము లను చాణక్యుడు తననీతిచే తాను గ్రహించి రాజ్యమందు సహజ విరోధమును భావింపజేసెను.

రాజకీయ పరిజ్ఞానము :- చాణక్యుడు నందుని యసందర్భపు పరిపాలనమంతయును కూలంకషముగా నెఱింగిన మహామేధావి. అత నెఱింగిన యంశములు—

1) లోభియైన మహాపద్మనందుడు గంగానదిలో పాతిపెట్టిన ధనము పద్మములగుచున్నవా? మహాపద్మము లగుచున్నవా? యని యాలోచించునేగాని ప్రజావసరములకయి యొక్కపైసయైనను వ్యయ పఱుపలేదు. ప్రజలకేగాదు. తుదకు తన భార్యలకు, బుత్రులకైన నొసంగలేదు 2) ధనము ననేకవికృత మార్గముల సమకూర్చెను. సర్వరాజ్యములనుండి కప్పములను మితిమీఱి కొనుటలో

కొన్నిరాజ్యములలోని రాజులచేయి పతివ్రతల మంగళసూత్రముల వఱకు బోయినది" (58)

ప్రభువుపఱు యసంతృప్తిని రేకెత్తించిన యంశమిది

3) నందుని కుమారుల క్రమానుగత పాలనము రాజనీతి కాదని గర్హించి రాక్షసుడు గిరివ్రజపురమును వదలిపోయెను. ఇది పాలకులకు పాలితులకు ముప్పు కలిగించునని గ్రహించిన యపారమేధానిధి చాణక్యుడు. 4) సుగంధ్యుడు మరణింపగా చంద్రగుప్తుడు మరణించె నట్లు వెలయింపుమని రాక్షసాజ్ఞ. ఆ మరునాడే చంద్రగుప్త వేషధారి యొకడు రాచరికపు బటాటోపముతో నూరేగింపునందుండుట. సంధి ప్రయోగము జరుపుట - ఇవి చాణక్యుని రాజకీయ పరిజ్ఞానమునకు, పరిణతికిని నికషోపలములని చెప్పవచ్చును.

రాక్షసుని మేధాశక్తినిగాని, రాజకీయ పరిజ్ఞానమునుగాని శంకింపవీలులేదు. కాని యాతని పదకములు నిష్ఫలములై నిర్వీర్యము లగుటకు ప్రధానమైన హేతువు లివి.

1) తాను గిరివ్రజపురమున నుండుటకు పిలుకాకుండుట. రాక్షసుడు "నేను మహానగరమున నున్నచో నతని కధిక క్లేశము కలుగునని యతని నీతి నన్ను రాజధానికి రానిచ్చుటలేదు" (183) అని పలుకును.

2) రాజులు మంత్రులు నిర్వీర్యులయి, యధికార మదాంధులే గాక, వ్యర్థులుగా నిరూపింపబడుట, ఏ కార్యము నందును వారు తమ ప్రతిభను జూపలేకపోవుట, మంత్రులును గురించి రాక్షసుడు "ఆ యవివేకులు శకరాజ ప్రతినిధి యొక్క కూతురెచ్చట నున్నదో కూడా నింతవరకు దెలిసికొనలేక పోయినారు" అని తన తీవ్ర సంతాపమును వ్యక్తము చేసినాడు. (201) 3) తన నీతిని వెలయించుటకు ముందే చాణక్యుడు తన కుటిల నీతిని వెలయించి కార్యసాధన చేసికొనుటయు నీతని వైఫల్యమునకు హేతువుగా జెప్పవచ్చును. 4) ఇరువురును సమానులే. కాని దైవమాతని కనుకూలించు చున్నాడని రాక్షసు డనుట, నీతండ్రి వలెనే నీకు మహామాత్యుడైన రాక్షసుడు నీకుమంత్రి కాగలడని చాణక్యుడనుట' పై సమానత్వమును సమర్థించును, ఈ రాక్షసుని మంత్రిత్వము నాలుగవ నవలలోని కాలాశోక రాక్షస సంభాషణములో నున్నది.

"నా చివరి దినములలో ననగా నెనుబది యెన్మిది సంవత్సరములు దాటిన తరువాత నాకొక ప్రత్యర్థి బయలుదేఱును, అతడును బ్రాహ్మణుడే అతడు నాకంటె నీతిమంతుడై యుండునట. అతనికి నాకును పండ్రెండేళ్లు నీతియుద్ధము జరుగునట. చివరికతడే గెలుచునట. అతడు గెలిచినను నేనోడిపోయినట్లుకాదట, అని చెప్పెను. (282) రాక్షసుడే మహామంత్రిత్వమును స్వీకరించుననను చాణక్య వాక్యములోని మహార్థమిట్లు సమన్వయింపబడెను.

2) చంద్రగుప్తుడు :- రచయిత యీ పాత్రయొక్క ప్రతిభయంత యును జాణక్యోపజ్ఞముగ నిర్వర్తించుటచే నిది ప్రాధాన పాత్ర గాక పోయెను. కాని ఫలాశ్రయ మీ పాత్రసంటి పెట్టుకొన్నది గనుక నిది తద్వ్యవహారమున ప్రముఖునియే చెప్పవలెను. అయ్యును నీ పాత్రను మలచుటలో రచయిత కొన్ని మెఱుగులు చూపెనాడు. అవి-

బంధితుడైన తాను తప్పించుకొని రాగలైను, తన బంధనము లన్నియు భేదించుకొన గల్గెను. కాని ఒక్క చేతికి ఇనుప కడియము మాత్రము రాలేదు. దానిని తన చేతికొక యలంకారముగా భావించును. "మహారాజు చేతికి చిరుగంటల హేమకంకణ ముండును." ఈ భావనచే జంద్రగుప్తుడొక తృప్తిని బొందును. భవిష్యత్తులో తానొక మహారాజు కాగలనని విశ్వాసముతో ననిన మాటయా? యది. కాదు. ఒక కష్టమును సుఖముగా భావన చేసికొను తత్త్వమది. ఈ సన్ని వేశము పాఠకుని సానుభూతిని పరిపూర్ణముగా సంపాదించును. చంద్ర గుప్తుని పయి నొక యార్ద్రతను పెంపొందించును.

బంధ ముక్తుడయిన చంద్రగుప్తుడు నెచ్చెలి యయిన వసు మిత్రునింటికేగును. వారి పరస్పర సంభాషణములు, వారి మైత్రీ బంధములోని యార్ద్రత పాఠకుని హృదయమును స్పందింపజేయును, ఈ సన్ని వేశము పాఠకుని కొక తృప్తిని గల్గించి అమ్మయ్య! వీని కొక యండ దొఱకినది, వీనికి వచ్చెడి సేగిలేదు. అని యన్పింప జేయును ఇది చంద్రగుప్త పాత్రపయి పాఠకుని యౌత్సుక్యమును పెంచును.

వసుమిత్రుడు, చంద్రగుప్తుడును కలిసి చణక గ్రామ నివాసియగు చాణక్యునికడకు బోవుదురు, ఆయన చంద్రగుప్తుని గుఱించి యత్యాశ్చర్యకరముగా విశ్లేషించును. తన శత్రువులను సాధించి పెట్టుటలో నాయన కార్యసాధనము గూడ మిళితమై యుండుట విచిత్రోదంతము. ఇచట రచయత దీనిని పరమ సుకుమారముగా సమన్వయించును. 'తన

బాహుబలమెట్టిదో యాయన నీతిగూడ నట్టిదియే' యని భావించు చంద్రగుప్తునకు వసుమిత్రునిచే నొనర్పబడిన చాణక్యోదంత ప్రసంగము ధైర్యము కల్గించెను. తన వైరము నాతడు తప్పక తీర్పగల నేర్పరి యను దృఢభావము కల్గెను. ఈ సన్నివేశమే చంద్రగుప్తునకు చాణక్యుని గురువుగా నొనర్చెను. తానాతనికి శిష్యుడగుటయు నిప్పటి నుండియే.

చాణక్యుని యుటజాంగణమున చంద్రగుప్తుని రాజ్యాభిషేకమును వేదవిదుడు కౌశికుడు నిర్వర్తించెను. ప్రమిదల, వర్తుల యంతరార్థమును గౌశికవరునుండి గ్రహించిన చంద్రగుప్తునకు గురువుపై మఱింత గౌరవాదరములు కలిగెను.

చాణక్యుని యాజ్ఞానుసారము సర్వకార్యములు నిర్వర్తించి తాను ప్రభువగుట యాయన ప్రజ్ఞగా తాను విశ్వసించునట్లుగా నితివృత్తము నిర్వహించబడినది. ఇది పురాణములలోని కథనమునకు సమన్వయము. సముద్రగుప్తుని లేక యాతని తండ్రియైన చంద్రగుప్తుని రాజ్య స్వీకారమునకు, నీ మౌర్య చంద్రగుప్తుని రాజ్య గ్రహణమునకును భేదము చూపుట. కనుకనే చంద్రగుప్తుడు తాను రాజ్యము నెంతో ప్రయాసతో మాత్రమే సంపాదించ గలనను కొనుచు తన బంధనముల నతిప్రయత్నము మీద ఛేదింపబడగా నన్న మాటలు–"నాకు మంచి దినములు వచ్చిన మాట నిజమే! ఆ మంచి దినములు బహు ప్రయత్నము మీదగాని రావు. ఎంతో ప్రయత్నము చేసి నిరాశ చేసికొన్న తర్వాత నప్పుడు భగవంతు డనుగ్రహించును."

ఇది 'ఇండియన్ నెపోలియన్' బిరుదము గలిగిన సముద్రగుప్తునకు గాని లేక యాతని తండ్రియైన గుప్తచంద్రగుప్తునకుగాని సమన్వయింప గలదా ?

రచయిత ప్రతిభ యీ పాత్ర చిత్రీకరణమున లేదు. ఈ పాత్ర

కొక స్వప్నమును కల్పించుటలో నున్నది. కొందరు ఆంగ్లేయ చరిత్ర కారు లనంతర కాలమున గుప్తచంద్రగుప్తుని స్థానములో మౌర్యచంద్ర గుప్తుని ప్రతిష్ఠించి యాతని నే యలెగ్జాండరు ప్రభువునకు సమకాలీనునిగా చిత్రించి చరిత్ర వ్రాసిన యుదంతమును మౌర్యచంద్రగుప్తుడు స్వప్నమున గాంచును. ఈ వాదమును వ్యంగ్యముగా చంద్రగుప్తుని స్వప్న వృత్తాంతమున నిక్షేపించి నవలయందును కావ్య మార్గమును రూపొం దించెను. కనుక నే నవల 'చంద్రగుప్తుని స్వప్న' మయ్యెను.

వసుమిత్రుడు :- మిత్రలక్షణ మెట్టిదియో తెలియ వలెనన్నచో వసుమిత్రుని పాత్రను బరిశీలింపవలె ననునట్లుగా రచయిత దీనిని రూపొందించినాడు. ఆర్ద్రిత మైత్రీ లక్షణములోని ప్రధాన విషయము, వాత్సల్యౌదార్యము లుపలక్షణములు. ఈ పాత్రను పరిశీలించు నపుడు వీనిని స్మృతి యందుంచుకొనుట ముఖ్యము.

చంద్రగుప్తుడు, వసుమిత్రుడు బాల్యాది నెయ్యమును వృద్ధి పఱచు కొన్నవారు. చంద్రగుప్తుడు చెఱసాల యందుంచబడెను. అతడు బైట పడునన్న యాశ లేదు. కాని చాణక్యుడు నందులచే నవమానింప బడెను. చాణక్యుడు క్రుద్ధుడై తన్నవమానించినవారిని నాశ మొనర్తు నని శపథ మొనర్చెను. ఏ మాత్రము సంబంధము లేని ఈ సన్ని వేశము వసుమిత్రునకు చంద్రగుప్తుడు రాజగునన్నట్లు తలంపు తెచ్చెను. మైత్రీ లక్షణములలోని యార్ద్రిత కిది యొక యుదాహృతి.

బంధితుడైన వాడు తప్పించుకొని యొక యున్నత రాజోద్యోగి కడకు రాగా నెవడాదరించును ? మీదు మిక్కిలి వానిని జూచి యదరిపడి తనకు మున్ముందు కలిగెడు సిలుగుల నూహించుకొని తిరిగి రాజభటుల కే యప్పగించును, కాని వసుమిత్రుని జీవలక్షణ మట్టిది కాదు, అర్ధరాత్రమున వచ్చిన చంద్రగుప్తుని మైత్రీభావములో, సరస భాషణతో సమాశ్వాసించి యాతని రహస్యమును కాపాడెను.

తానింతకుమున్ను విన్న చాణక్య ప్రతినను చంద్రగుప్తునకు పరిచయము చేయును-"మన మాశపడ వచ్చునో పడరాదో నాకు దెలియదు. కాని యీ పరిస్థితి మనకు చాల యనుకూలమైనది. అనగా మనమనుకొన్నట్లు జరిగినచో మనకు మిక్కిలి యనుకూల పరిణామము కలదిగా నగును."

ఈ యనుకూల పరిణామమునకయి మిత్రుని చాణక్యుని కడకు గొంపోయి యాతని పగను దీర్చి పెట్టుమని యాతని ప్రార్థించును. ఇంతకంటె వాత్సల్యమునకు వివరణమేల్ల చేయగలము? చంద్రగుప్తుని చాణక్యుడు స్వీకరించును. అప్పుడు వసుమిత్రు డెట్లుండెను? ప్రమోద భరితుడై యుండెను. ఇది వసుమిత్రుని యార్ద్రితకు, చిహ్నము.

ప్రథమమున చాణక్యుని శక్తిని చంద్రగుప్తుడు విశ్వసింపలేదు. ఆతని శక్తిని, నీతి విభవమును, ప్రజ్ఞను పరిచయముచేసి చంద్రగుప్తునకు విశ్వాసము పుట్టించెను. సుహృన్మిత్రుడనగా నట్టివాని నిరూపించుటయే యీ యితి వృత్తమున నీపాత్ర ప్రయోజనము. చాణక్య చంద్రగుప్తులకు వసుమిత్రుడు సంధాత.

వసుమిత్రుని యుదారతకు నుదాహరణములు

1) తనకడ తనకు దెలియని పెన్నిధానమును చంద్రగుప్తుని రాజకీయ ప్రగతికై వ్యయపెట్ట చాణక్యు ననుమతి కోరును. ఆ పెన్నిధానమును మఱుమాట లేక వినియోగించుటకై యంగీకరించిన యుదారుడు వసుమిత్రుడు. 2) మిత్ర ఋణమును దీర్చలేక పోవుచున్నానని చంద్రగుప్తుడు వాపోవును. అప్పుడా వసుమిత్రుని మాటలెట్టివో గమనింపుడు- "బంధవిముక్తుడై ప్రప్రథమముగా జూచుటకు దన యింటికి వచ్చుటతోడనే ఋణపరిహారమయ్యె"నని సమాధానించును. ఇందుగల యుదారత, సౌహార్దత, వాత్సల్యత, సౌశీల్యతాగుణములను మనము గమనింపగలము. వసుమిత్రుడనగా నెవరో మనకు దెలియుటట్టికి సన్నివేశ మవశ్యసంభావ్యము.

## నవల యందలి విశేషాంశములు

1. మహావాక్యము : బహుభావ ప్రాకట్య ప్రాధాన్యముతో, సుదీర్ఘమైన వాక్యముతో నీనవల యారంభింపబడినది. మురి చంద్రగుప్తుని కారాగారము నుండి విడిపించుటకు యత్నించిన విధమిందు వివరించెను. ఐదు పుటలుగల వాక్యమిది. ఇందు మురి తన చేష్టాదులచే వ్యక్తపఱచిన భావములెన్నియో గలవు. భయము, సంశయము, ఆశ్చర్యము, ధైర్యము, ఉత్సాహము, గ్లాని, నిర్వేదము, పట్టుదల మొదలయిన భావపరంపరకు కాణాచిగా నీవాక్యమును మనము నిర్ణయింపవచ్చును. ఉదాహరణమునకు గొన్ని భావములను జూతము.

"ఈ దయ నీయమైన స్థితిని తన ప్రాణమున్నదున్నట్లు పోవునేమో యున్న భయము కలదాని వలె''(5)'భయము'నకుదాహరణ.

"అతని యాదేశములోని వేళయైనదో కాలేదో యనుకొంచునిది తాను తన దైన్యము కొలది వేళకు ముందే యధికారికి సమర్పించినచో నతడు సంపూర్ణముగా నిరాకరించునేమో యనుకొంచు నొకవంక యాశతో, నొకవంక నిరాశతో వెటకటంబడుచు..."నిర్వేదము. గ్లాని, శంకలు) "తల్లిఖితమైన యాజ్ఞను నిస్సంశయముగా బాలించుచున్న కారాగారాధిపతిని జూచి ధైర్యమును బూని (81 ధైర్యము, ఉత్సాహము) ఇట్టి భావములు పోషింపబడినవి. ఇంక వాక్య నిర్మాణమును కొంత పరికింతము. "ఒక వృద్ధురాలు, దీనాకృతి, వయసులో మహాసౌందర్యవతియై యుండినట్లు కన్పించు నామె మాసిపోయి యేనాటివో వెలగల దుస్తులు ధరించినది." ఇది యామె స్వరూపము. ఇక్కడనుండి యంతయు నామె యంతర భావసంఘర్షణమే పాఠకుడు దర్శించును. "తలనిండ ముసుగు వేసికొని గిరివ్రజ దుర్గము యొక్క కారాగారాభిముఖముగా త్రోటుపాటైన నడకతో నెవరైన చూచి పోవుదురన్న భయముతో నేదో వస్తువును దాచికొనుచున్నదాని వలె

నటించుచు.......తన పనిక త్తె యున్న చోటికి జేరెను.''(5–9) అలతి యలతి పదములతో గూర్చబడిన యనేకభావముల కాలవాలమైన వాక్యమని చెప్పవచ్చును.

2. వర్ణనలు : చాణక్యుని కడ ననేక శిష్యులుండిరి. వారందఱు బహు వేషధారణ సమర్థులు, అందొకడు శివ వేషమును ధరించెను. "వారు తలమీద నింత జడ నమర్చి దానిపైన నొక తెల్లనియాకు చందురుని రేకగా పొదివి, జడలలో కనిపించకుండ నొక జలకలశము పెట్టి ఆ జలకలశమునుండి యొక్క సన్నని కొమ్మ పెట్టి, ఆ కొమ్మన రెండు సన్నని జడల నమర్తురు. వారు నృత్యము చేయుచుండగా నా నీరము క్రింద పడుచుండెను. ఇది రచయిత సూక్ష్మ పరిశీలనాశక్తిని (Minute obrervation) శివపారమ్యమును వ్యక్త మొనర్చెడి వర్ణన.

బుద్ధవేషవర్ణనలో గాన వచ్చెడు నపహాస్యము.చమత్కారము-

1. "వారు సర్వముండులు. ఒక గేదెకొమ్మును చేతితో బూని వత్తురు. ఒక జోలెయుండును. బుద్ధం శరణం గచ్ఛామి. సంఘంశరణం గచ్ఛామి. ధర్మం శరణం గచ్ఛామి. యనుచుందురు. వినయ సుత్తములోని, ధర్మసుత్తము లోని శ్లోకములను పాళీ భాషలో చదువు చుందురు.'' (47) 2. ఒక రాజోద్యోగి చాణక్యుని గుఱించి యథేచ్ఛముగా మాటాడు చుండెను. అతడు బౌద్ధుడు, ''ఇట్టివానికి గిరివ్రజము సమీపమున సంచరించుచుండగా నొక భల్లూక మెదుఱు వచ్చి వానిమెడ కొఱికి చంపెను. చాణక్యుడే భల్లూకమై వచ్చి వానిని చంపెనని వదంతి బయలుదేరెను." కోటలోనికి వచ్చిన యొక మత్త గజమును చాణక్యునిగనే భావించి ప్రజలు, సేనయు భయ విహ్వలమయ్యెను. వేయేల ! "మన గిరివ్రజమున పసిపిల్ల లేడ్చుచున్నచో తల్లులు అదుగో! చాణక్యుడు వచ్చుచున్నాడని భయపెట్టుచున్నారు''79

3. బౌద్ధధర్మ మపహాస్యము చేయబడిన రీతి : నందుని కుమారులలో నేడవవాడయిన రాహులుడు, వాని భార్య మాయ

తీవ్రమయిన బౌద్ధమతాభిమానము గలవారు. కాని సుమాల్యుడు వీరిని పరిహసించును. సర్వందుఃఖమను వారికియా? బౌద్ధమని వాదించును. దండపాణి సతి నీల, దండపాణి దండధరుని పాలయ్యెను. అప్పుడు మాయ నీల నోదార్చును- "రాముడు దేవుడు, కృష్ణుడు దేవుడు ఆపదలలో వారడ్డు దగులుదురా! యని ప్రశ్నించును. అనగా నంత దుఃఖములోనున్న నీల- "మానవులు కర్మాధీనులై బ్రదుకుదురు. సుఖపడుదురు, మరణింతురు, బుద్ధదేవుడుకూడ వచ్చి బ్రదికింపలేడు" అని సమాధానమిచ్చినది. ఇందు బౌద్ధము నపహసించిన తీరును, వేదమత ప్రమాణమైన కర్మసిద్ధాంతమును సమర్థించినతీరును గనునింపవచ్చును, విమర్శ కిది యుత్తమ ప్రత్యుత్తరము.

4. కర్మ సిద్ధాంతములో సామాన్య మానవుల పోలికగాదు. రచయిత గ్రహించినది. ఈశాన కుబేరులను స్వీకరించి ప్రమాణమును స్థాపించెను. "కుబేరుడు నవనిధులు గలవాడు. శివుడు బిచ్చమెత్తువాడు. వారిద్దరికి జెలిమి, నేనిబ్బంది పడుచున్నానని శివుడు కుబేరుని యాచింపడు. మన మిత్రుడు బిచ్చమెత్తుకొనుచున్నాడను కొని కుబేరుడు కొంత ధనమును శివునకు బంపించడు," రాచఱికమునకు స్నేహమునకును గూడ నిక్లే సంబంధములేదు, సామాన్యమైన యంశమును జెప్పవలసి వచ్చినను ప్రసిద్ధమైన యుపమానములనే చెప్పివాని ప్రామాణ్యమును స్థిరీకరింప జేయుట మహాకవుల లక్షణము. ఎవ నెడ ధార్మికమైన చర్చ. చాత్రకాంశ పరిశీలనము చేయబడి నవలకు ప్రామాణికత గూర్చబడినది.

# 6. అశ్వమేధము

మౌర్యుల పతనము, శుంగవంశపాలనారంభ మీ నవల యందలి వృత్తము. మౌర్యులందు చివరి ప్రభువు బృహద్రథుడు. ఈతని సేనాని పుష్యమిత్రుడు. ఈతడు శుంగవంశజుడు. బృహద్రథుడు వ్యసనములచే జిక్కి పాలనమును నిర్లక్ష్య మొనర్చి పాలితుల కనిష్టుడయ్యెను ఆతని సేనాని లోకులు మెచ్చునట్లు ప్రభుసంహార మొనర్చి మగధకు చక్రవర్తి యయ్యెను. ఈతడు వైదిక మతానుసారముగ నశ్వమేధ మొనర్చెను. ఈ వంశములో నీతడుగాక నగ్నిమిత్రుడు,వసుమిత్రుడు, సుజ్యేష్ఠుడు, భద్రకుడు, పులిందకుడు, గోషావసువు, వజ్రమిత్రుడు, భాగవతుడు,దేవభూతి యను వారు రాజ్యమును పాలించిరి. వీరిపాలన కాలము. 300 సంవత్సరములు. అనగా, క్రీ. పూ. 1218–918 వరకు పాలించిన యనంతరమ్ము సామ్రాజ్యము కాణ్వుల వశమగును. మత్స్య పురాణములోని వంశవివరణమిది, [1] కలియుగరాజ వృత్తాంతమునందు బృహద్రథుడు జరాసంధుని వలె నఖిల క్షత్రాంతకుడై, పాలకులను సామంతులుగ నొనర్చుకొని, రాజ్యము వలక్ష్యము చేయుచున్న బృహద్రథుని, పుష్యమిత్రుడు సంహరించి తాను ప్రజానురంజకముగ నపర యుధిష్ఠిరునివలె మగధ నరువదేడులు పాలించెనని గలదు. [2] వీరి

1) పుష్పమిత్రస్తు సేనానీ సముద్ధృత్య బృహద్రథాత్ ।
కారయిష్యతి వై రాజ్యం సమాః షష్టింమహా బలః ॥ 270_31
దశైతే శుంగరాజానో భోక్ష్యన్తీమాం వసుంధరాం ।
శతంపూర్ణం శతే ద్వేచ తేభ్యః కాణ్వాన్ గమిష్యతి॥ 37

2) బృహద్రథస్తు తత్పుత్రో జరాసంధ ఇవాऽపరః॥
క్షత్రియాన్ అఖిలాన్ జిత్వా మహారాజో భవిష్యతి ।
అష్టాశీతింతు వర్షాణి స రాష్ట్రం పాలయిష్యతి ॥

కాలమందు జరిగిన యభివృద్ధిని గురించి 'Pre Musalman Period Indian History' అను గ్రంథమునందు ప్రొథెరో ఇట్లు పేర్కొని యున్నాడు.

బృహద్రధుడు స్త్రీ వ్యసని. వృద్ధుడు, కామతత్పరుడై రాజ్యమును నిర్లక్ష్యమొనర్చెను. వైదికమతదూరులై . దేశమును వదలి తమ సంప్రదాయమును విస్మరించి శకయవనులుగా నున్న మ్లేచ్ఛులు సింధును దాటి దేశీయులకు పీడ గల్గింప వారి నెదుర్కొని విజయుడై, బృహద్రధుని వధించి ప్రజలమన్ననకు పాత్రుడైన సేనాని పుష్యమిత్రుడు, అశ్వమేధమొనర్చి దేవతలకును నిష్టుడయ్యెను. మగధరాజ్యమునకు ప్రభువయి, శుంగవంశమునకు మూల పురుషు డయ్యెను. వీరి కాలముననే చరిత్రయందు గణుతికెక్కిన బార్హుత్ స్థూపము నిర్మితమయ్యెను. ఇది మధ్య భారతములో జబ్బల్‌పూరు, అల్హాబాదు నడుమ నున్న చారిత్రకప్రదేశము.[3]

పుష్యమిత్రుని కాలమునందలి ప్రత్యేకత :- శిశునాగ, నంద, మౌర్యుల కాలమునకంటె పుష్యమిత్రుని కాలమునకు దేశమున కొంత మార్పు కల్గెను. బౌద్ధజైనము లొకప్రక్క విజృంభించుచున్నను, వాని నెదుర్కొనుటకు దగినస్థితిలో ప్రభుత్వ ముండుటయే యీ మార్పు. 'రాజానుమతో ధర్మః' యనునట్లు ప్రభువులు బ్రాహ్మణులైరి. వారు వేదధర్మము నభిమానించిరి. సహజముగనే పాలితులు దానికి సన్నిహితులైరి. ఇంతదనుక ప్రచ్ఛన్నముగా జీవించిన యార్షధర్మము మేఘ వినిర్ముక్తభాస్కరునివలె ప్రకాశింపజొచ్చెను. అది మగధ యందే కాదు. కాశ్మీరమున నయితము వేదమత మభివృద్ధి నొందిన కాలముగా

---

పుష్పమిత్ర స్తు సేనానీ ర్మహాబల పరాక్రమః ।
అతివవృద్ధం రాజానం సముద్ధృత్య బృహద్రథాత్ ॥
సవై ప్రణతసామంతో యుధిష్ఠిర ఇవాఽపరః ।
పాలయిష్యతి ధర్మేణ సమాష్టిం మహీ మిమాం ॥ 3 భా. 2. అ.

3. Prothero and Maha Mahopadhyaya Sathish Chandra Vidyabhushan-Pre-Musalman Period. P. 96.

కల్హణుడు చెప్పుచున్నాడు. అభిమన్యుని కాలమునకు పతంజలి మహాభాష్యము కాశ్మీరమునందు పఠనపాఠనములలో నుండుట యొక్క శుభ సూచన. అభిమన్యుని యనంతరము పాలించిన మూడవ గోనందుడు గుణములయందు రఘుమహారాజుతో బోల్పబడెను.ఇది హైందవ ధర్మమునకు నిదర్శనము [4] పతంజలి "మహాభాష్యమునందున్న ఇహాపుష్పమిత్రం యాజయామః అనువాక్యమును దృష్టియందుంచుకొనియే స్మిత్ చరిత్రకారుడు తన గ్రంథమున బుష్యమిత్రునకు సమకాలికుడే పతంజలి యని యూహించినాడు.[5] కాని పురాణములను, నితరోపపత్తుల ననుసంధించుకొని చరిత్ర గ్రంథములను వెలయించిన పండిత కోట వెంకటచలముగారీ యభిప్రాయమును సమర్థింపరైరి. యాగమునందు పాల్గొనకొన్నను నట్టివాక్య ముదహరింప వచ్చుననియు, బుష్యమిత్రుని యాగసమయమునకు బతంజలి జీవించియుండక పోవుటయు సంభవమే యని వీరి యభిప్రాయము. విచారించి చూచినచో నీ యభిప్రాయము సయితము కొట్టివేయుటకు వీలులేనట్టిదిగనే యున్నది. మహాభాష్యము నాడు కాశ్మీరము నేలిన అభిమన్యుని కాలమునకే యచట పఠనమున నున్నట్లు కల్హణుని రాజతరంగిణి సాక్ష్యమిచ్చుచున్నది. [6] ఈ యభిమన్యుడు మగధనేలుచున్న పుష్యమిత్రునకు సమకాలీనునిగా నెన్న వచ్చును. భారతయుద్ధ మనంతరము మగధనేలిన రాజులలో పుష్యమిత్రుడు 51వ రాజు, అట్లే అదే కాలమునుండి కాశ్మీరము నేలిన ప్రభువు లందభిమన్యుడు 51వ రాజు. ఈవిధముగా నీసమకాలీనతను ఋజువు పఱుపవచ్చును. కనుక పతంజలి కాల మభిమన్యునకును పుష్పమిత్రునకును పూర్వమై యుండుట కవకాశము హెచ్చుగా నున్నది.

---

4. గోనందాన్వయినా మాద్యః సః రఘూణాం రఘుర్యథా ।
నృపతిః కశ్యపీం వర్షాన్పంచా త్రింశతి మన్వశాత్ ॥ RaJ. 1-191

5. Early History India V. A. Smith P. 228

6. Rajatharangini – Kalhana Sloka 176 in 1st Tharanga.

మగధను పుష్యమిత్రుడేలుచున్న కాలముననే కాశ్మీరము నభిమన్యుడు, నేపాలమును పశుప్రేక్షదేవ మహారాజు లేలుచుండిరి. ఈ మూడురాజ్యములు భారత యుద్ధానంతర కాలమునుండి సుస్థిర మయిన రాజ్యకేంద్రములుగ విలసిల్లుచున్నట్లు తత్తద్రాజవంశ చరిత్రలనుబట్టి యవగతమగుచున్నది. వీరికాలము నుండియే బౌద్ధమత మున కన్నిచోటుల ప్రాబల్యము సన్నగిల్లి వేదమతసముద్ధరణము జరిగి నట్లు డి. ఆర్. మన్కడ్ మహాశయులు [7] తెలుపుచున్నారు. ఇట్లొకే కాలమునుండి యీ విధమయిన మార్పు భిన్నరాజ్యములందు సంభ వించుట విశేషము.

అశ్వమేధము - ఇతివృత్త సంగ్రహము :- మౌర్యవంశమునందలి చివరిరాజయిన బృహద్రథుని సేనాని పుష్యమిత్రుడు. ఈతని మేనల్లుడు సోమశర్మ. సోమశర్మ తనమామచే ననుజ్ఞ నీయబడిన యొక రాజకార్య నిర్వహణనిమిత్తమై యాయనకు దెలియనీయక యాయునయశ్వము నధి రోహించియవనదేశపు సరిహద్దు లందు యవనకిరాతులచే హింసింపబడి తాను శల్యావశిష్టు డయ్యెను. ఆ తురంగము కూర్రమరణ మందెను. తానొనర్చిన యీ యకృత్యమునకు విచారించి మగధకు తిరిగి బోవ నుంకింపక యవనదేశమందే యుండి పగదీర్చుకొను కాల మాసన్న మగు నంతదనుక నిరీక్షింప మనమున నిశ్చయించుకొని యా యవన కిరాతసేనానాయకుడైన శింతాకరాళునకు తనజ్యోతిషవిద్యచే, వాని

---

7. "Now this period of first quarter of 12th Century B. C. had witnesed a general revival of Brahmanical Religion and a general down fall of Buddhistic Religion through out India. Pushpamitra Sunga is known to have a staunch Brahmana. Raj Tarangani tells us clearly that Gonanda had revived Brahmanic Religion in Kashmir and we are told here that Pasupreskha Deva had brought Nepal Settlers from India which also suggests general revival of culture."History of Nepalese chronology D.R.MankadP.218.

జీవరహస్య మెఱింగించి వానియింటనే చేరెను. పుష్యమిత్రుడు తన మేనల్లుని కొఱకు, నాయశ్వమునకొఱకు వెదకించి విఫలుడయ్యెను. బౌద్ధుల యుపద్రవములు, వేదమతమునకు గాలమెట్లున్నదో యను నాందోళనలకు తోడు నీరియదృశ్యము సేనానికి మిక్కిలి వ్యథకల్గించెను. నాడు ప్రతిసంవత్సరము వలెనే జరిగెడి శాస్త్రపండిత సమావేశము నందు సీమూడు అంశములు చర్చనీయము లయ్యెను.

ఆ పండితసభకు వచ్చినవారిలో జ్యోతిషమునందు ప్రముఖుడు నారాయణభట్టు కలడు. తన గుఱ్ఱమును గుఱించి మున్ను సభలకు వచ్చినపుడది సంవత్సరములోపు క్రూరముగా మరణించుననియు, దీని కవలమైన గుఱ్ఱమునందు స్వర్లోకవాసియైన జీవుడుండె ననియు, నా జీవుడు తిరిగి యత్యుత్తమ లోకమునకే చేరుననియు వచించెను. ఆతనిని బిలిచి యీ విషయ మెఱింగింపగా సోమశర్మ మఱల యీ ప్రదేశమునకు వచ్చుట యసంభవ మనియు, నాగుఱ్ఱము వధింపబడిన దనియు, కవల మేధ్యాశ్వ మగుననియు, శాస్త్రప్రమాణములతో నిరూపించి పలికెను.

సింహపురకటకోరనోత్తరజ్యోతిషాభిసారదేశములు నాటి పంచయవన దేశములు. ఇవి ఎత్తైన కొండల నడుమ నుండెను. అచటి నీటిపడియలు మాత్రమే యాజీవుల జలాధారము. అప్పుడప్పుడు జలసంగ్రహణ నిమిత్తమై జలకుండయుద్ధములు సంభవించును. రాజాజ్ఞ మీరి జలగ్రహణముచేయుచో వారికి మరణశిక్ష విధింప బడుట యచటి క్రూరతకు నిదర్శనము. ఈ జలకుండ సమీపము నందొక గుహాయందు నిత్యజీవిగా మృషాసిద్ధాంతముచే జేయబడిన యొక జటమీసల వాడు వసించును. వాని పేరు వెలియయోనసుడు. పంచయవనులకు భారతదేశముపై దండెత్తుట కనుకూలమైన కాలమును వాని జ్యోతిష విజ్ఞానముచే గుణించి చెప్పుట వానివృత్తి. రాజప్రతినిధులకును వీనికి మధ్యవర్తిత్వము నెఱపువాడు తింతాకరాళుడు. ఈతడు వాని

నిత్యజీవనరహస్యమును బరిరక్షించుట, పరంపరాప్రాప్త సంతానము
నకు సతిని గూర్చుట వీని యుద్యోగధర్మములు. ఇంతు డొక పర్యా
యము యవనరాజులను పెలియోనను కడకు గొంపోవవలసి వచ్చెను.
వీరి రాకను ముందుగా వానికి తెలియబఱచి తద్రహస్యమును రక్షించు
కొనుట తన జీవనమార్గహేతు వగుటచేత తాను గదలెడు స్థితిలేక,
తన యింటనున్న సోమశర్మను వార్తాహరునిగా బంపెను. సోమ
శర్మయు నాగుహకుజేరి తన యుపాస్య దైవమయిన వృద్ధభార్గవి కరుణా
విలసనమున సర్వము నవగతము గావించుకొని ఇంతుని సందేశ
మందించెను.

మగధయందు ప్రభువయిన బృహద్రథుడు వృద్ధుడు. కాము
కుడు. కుముద్వతిని వృద్ధాప్యమందు బెండ్లి యాడెను. ఆమె వింశతి
వర్షప్రాయము గలది. పుష్యమిత్రుని యందాయిర్వురకు విశ్వాసమధిక
ముగా గలదు, ఆ కారణముననే శ్వేతాశ్వ శతానీకులను దుష్టరాజ
బంధువుల యాగడము లాసేనాని పయి రాజునకున్న విశ్వాస వాత్సల్య
ములను సడలింప జాలకుండెను.

గిరివ్రజమున బండిత సభలు ముగిసెను. వేదమతానుకూల
కాలమాసన్న మయ్యెననియు. దానికి బుష్యమిత్రుడే ప్రారంభకు
డనియు, నాతడు ప్రభువైన బృహద్రథుని యాపన్నివారణనిమిత్తమై
యొనర్చు యత్నములో సంహరించుననియు, తద్వధజనిత పాపప్రశమ
నార్థము బుష్యమిత్రు డశ్వమేధ మొనర్చుననియు, వారి చర్చయందు
సారాంశముగా నుండెను. యవనదేశ మందున్న సోమశర్మయు నిదే
విధమయిన లేఖ బంపెను. కార్తీకపున్నమినాడు రాజవధజరుగుననియు.
పుష్యమిత్రు లాత్మరక్షార్థము చర్యలు గైకొన వలసి యుండుననియు
పుష్యమిత్రు డనుకొనకనే యావధ నిర్వహించుననియు నందలి సారాం
శము. ఈయన రెండవలేఖ మేధీయాశ్వమునకు జేయనగు యేర్పాటుల
గుఱించి ప్రసంగింపబడెను. కుమారాగ్నిమిత్రుని, యుపవర్షుని మేధీ

యాశ్వము వెంటబంపుట, యజమాని దీక్ష యందున్న కాలమున నారాయణభట్టును రాజ్యనిర్వహణ మొనర్పవలసినదిగా గోరవలసి యుండుట యందలి విశేషములు.

పున్నమినాడు పుష్యమిత్రుడు బృహద్రధునికడకు సర్వతో భద్రముగా నేగెను. సర్వసురాపాశవిశేషములు బృహద్రధుడు పుష్యమిత్రుని కెఱింగించుచుండెను. కుముద్వతీ శతానీకాదులు వెన్నంటి యుండిరి. ఒక గది సమీపమున కేగునంత శతానీకుని కుట్ర ప్రత్యక్షము కానున్న సమయమున సంభవించిన కలహములో పుష్యమిత్రుడు శతానీకుని సంహరించెను. కుముద్వతిని రాజు సంహరింపబోగా, తనకు తాను రక్షించుకొనుటలో పుష్యమిత్రుని కత్తి ప్రభువు గుండియలో జొరెను. ప్రభువు మరణించెను. ఆ విషాదమునుండి తెప్పరిలిన పుష్యమిత్రుడు సర్వాధికారానధికార వర్గములను రక్షించెను. కుముద్వతి పుష్యమిత్రుని నిర్దోషిత్వమును ప్రకటించెను. ఆమెయే 'మహారాజా' యని పుష్యమిత్రుని సంబోధించెను. ఆయనకు రాజ్యాధికారమును దత్తమొనర్చి తాను బౌద్ధసన్యాసిని యయ్యెను.

కాశ్మీరమునుండు మేధావిభట్టు అనునొక శ్రౌతి యవనదేశమున కేగి యచట పుష్యమిత్రుని యశ్వమేధయాగకార్యమెఱింగి తిరిగి మగధకు జేరెను. పుష్యమిత్రుని గాంచి తద్యాగరహస్యములను, తత్క్రమము నెఱింగించి, యయ్యాగమెట్లు హింసకాదో సోపపత్తికముగా విపులీకరించెను. అతని శాస్త్రవైదుష్యమునకు, ప్రత్యయమునకు నాశ్చర్యపడిన పుష్యమిత్రు డయ్యాగమును తాను నిర్వర్తింతుననియు, దానికి మేధావిభట్టు ప్రధానఋత్విక్కుగా నుండుననియు, వినయముతో బలికెను. నారాయణభట్టు రాజుదీక్షాకాలమున రాజ్యమును నిర్వహించెడి మంత్రి.

సోమశర్మ యవనదేశమునందు మిరధ్యాఖోజు, మిత్రఘాయను నామాంతరములను బొందెను. యవనరాజ్యపరిషత్సభ్యులు కింపనితో

వెలియోనసు గుహను దర్శించిరి. ఎవ్విధినో వారి వెలియోనసు మృషా జీవన రహస్యము నెఱింగి నాజటాధారిని, దీనికి హేతువయిన తింతుని సంహరించిరి. నాటినుండి తింతునిభార్య ఆయేషా సోమశర్మకు భార్య యయ్యెను. తింతుని పదవి తనకు లభించెను. ఏవంవిధ విషయసమాహారమే నారాయణభట్టునకు వ్రాసిన మూడవలేఖ. నాల్గవలేఖ యుపవర్షునకు వ్రాసెను. ఉపవర్షు డిప్పుడు మహాసేనాని. అశ్వమును వదలిన యనంతరము సంవత్సర కాల మదిస్వేచ్ఛగా సంచరించుననియు, నాకాలమున నయ్యశ్వము యవనదేశమునకు కూడ వచ్చుననియు, దానిని రక్షించి గురుల యజ్ఞార్థము బంపబడుననియు వ్రాసెను. ఆయేషా కుటిలనీతి వలన పంచయవన ప్రభువులు సంహరింపబడి తాను యవన ప్రభువయిన యంశమును గూడ తెలిపెను.

పుష్యమిత్రుడు యజ్ఞమారంభించెను. అశ్వము యవన దేశముల సంచరించుచుండెను. సేనాని, యుపవర్షుడు, కుమారాగ్ని మిత్రులు వెంట నడచుచుండిరి. ఇంతకు మున్నే యవన ముష్కరులపై ప్రతీకార చర్యకు మిత్రథా సర్వము సిద్ధమొనర్చెను. ఆయేషా తన మంత్ర తంత్రములను సమీకరించి మ్లేచ్ఛరాగముతో నొకపాట నెత్తుకొనెను. ఆ గానము జంతువులచే గుర్రాలు తాటింపజేయు శక్తిగలది. నాడు మొదటి గుఱ్ఱము నెక్కుడు, నెవరు దుష్టముగా హింసించిరో, అచ్చోటనే యా క్రూరుల నయ్యశ్వపాద తాడనము సంహరించుచుండెను. అందఱు మఱియు వఱకు నాయేషా పాట నాపలేదు. అశ్వమును ప్రీతిపురస్సరముగా నుపవర్షునకునందించిరి. యవన ప్రభుదర్శనము వారికి లభింపలేదు.

ఇతివృత్త నిర్వహణము - నవలా ప్రణాళిక : చరిత్ర యందు ప్రధానమయిన విషయము నవలయందొకప్పుడు ప్రధాన విషయముగా వివరింపబడవచ్చును. అట్లే ప్రధానమయినది యంతగా ప్రాముఖ్యము వహించక పోవుటయు గానవచ్చును. సహృదయ ప్రరోచన కనుకూలమని రచయిత భావించినరీతిలో నవలా రచన సాగిపోవును. ఈ నవల

యందు చరిత్రలో నప్రధానమయిన పుష్యమిత్రుని యశ్వమేధయాగము ప్రముఖ స్థానమును పొందియుండుట గమనింపవచ్చును. నవలకు శీర్షిక అశ్వమేధమగుట, తద్విషయ విజ్ఞాన విస్తారముతో పాత్రలన్నియు నేకోన్ముఖముగ నాయాగ సాఫల్యమునకే యత్నించినట్లు చిత్రించుట, దీనికి దారకాణ. ఆర్ష వాఙ్మయమునకు దలమానికమై సకలయజ్ఞములకు శిరోభూషణముగా నుండి, భ్రూణహత్యాది పాపనిష్కృతిని కలిగించునది యశ్వమేధమగుటచే నిదినవలామాలికకు నాయకమణి. మహత్తరమయిన ఈ యాగనిర్వహణను గురించి వైవదుర్విపాకమున నేటి ప్రజలయందు కొన్ని యపప్రథలు చోటుచేసికొన్నవి. సంప్రదాయ ధీరధిషణుడుగా గీర్తినొందిన రచయిత వానిని తొలగించు ప్రయత్నమీ నవలయందు సాధించెను.

యజ్ఞము హింస యనెడు భావము నేటిసమాజమున నెలకొని యున్న పరమాంధ విశ్వాసము. ఇట్టి విశ్వాసమునకు బౌద్ధజైనములోపినంతవఱకు జేయూత నిచ్చినవి. అలౌకిక ప్రయోజన పారమ్యసిద్ధికయి యిట్టియాగములు నిర్వర్తింప బడుటచేత ప్రత్యక్షప్రమాణబుద్ధులగు నేటిసామాజికుల కిట్టివి రుచింపవు. శ్రీనాథుడు కలివిడంబమును విస్తరించుచు శృంగార నైషధమునందొక పద్యమునువ్రాసెను.[8] సకలవేదశాస్త్ర పారమ్యుడు, బ్రాహ్మీదత్తవర ప్రసాదుడు నయిన నాయన ఈ యశ్వమేధమును నిర్వర్తించుచున్న ప్రదేశమునందలి ప్రధానమయిన దృశ్యమునుగాంచి కలిపురుషు డుపహాస్య మొనర్చె.

---

8. యజమాన ప్రమదా వికస్వర భగన్యస్తాశ్వ దీర్ఘస్మర
ధ్వజదండంబగు నశ్వమేధ మఖ తంత్రంబు న్నిరీక్షించి. యి
క్కుజనుండొత్తిలి నవ్వె వేదవిదులం గుత్సించి దృష్టాస్త్రిచే
విజహస్తంబున వ్రేసి యక్షికణముల్ నించార నేత్రంబులన్.

శృంగార నైషధం 7–132

సన్నివేశమును వర్ణించెను, దాని పారమ్యమును, ప్రామాణ్యమును దెలియని సామాజికుల కిట్టి వ్రాతలు మఱింత బలము కూర్చును. వీని నెదుర్కొనుటకు తగిన శాస్త్ర చర్చగావించి వేద సిద్ధాంతమును స్థాపించెను.

రచయిత నవలయందు గావించిన మార్పులు : 1, కాళిదాస మహాకవి మాళవికాగ్నిమిత్ర నాటకమునందు కుమారవసుమిత్రుడు తాతగారయిన పుష్యమిత్ర మహారాజుచే నిర్వర్తింపబడిన యశ్వమేధ క్రతువునందు మేధీయాశ్వము వెంటజని, శకయవనులను బారద్రోలి, యజ్ఞము నిర్విఘ్నముగా బరిసమాప్తి గావించుటలో దోడుపడి నట్లున్నది. కాని శ్రీ విశ్వనాథ అగ్నిమిత్రునిచేతనే యవనులను బాఱ ద్రోలించి మేధీయాశ్వమును సురక్షితముగా యజ్ఞవాటికకు జేర్చి తండ్రిగారిచే నీసవనపరిసమాప్తి చేయించినట్లు మలచెను. ప్రసిద్ధమయిన చరిత్రాంశమును మార్పుచేయుట యీ నవలలో విశేషము. కాళిదాసుని అగ్నిమిత్రుడు శృంగారనాయకుడు. దక్షిణుడు. రాజ కార్యముల నమాత్యుల భుజస్కంధములపైనుంచి తాను యువతీ వినోద లాలసుడై కాలము పుచ్చును. దీనిని మార్పుగావించి విశ్వనాథ అగ్నిమిత్రు నొక యుదాత్త భంగిమలో చిత్రించినారు. కాళిదాసు అగ్నిమిత్రుని పాత్ర కన్యాయము జరిగినదని తనకనిపించుటచే నీవిధ మయిన మార్పు స్వతంత్రించి యొనర్చినట్లు తజ్జ్ఞ లెఱుంగక పోరు.

2. చారిత్రక పుష్యమిత్రుడు నవలయందు నాయకుడు గావలెను. చరిత్రకారుని పుష్యమిత్రునిలో దోషము ప్రథమము, గుణము ద్వితీయాంశము. రాజవధ దోష మాతని యందున్నది. తానురాజ్యమేల వలయుననెడి దుర్బుద్ధియు నందు స్వల్పముగనైన నుండకపోదు. 'అశ్వమేధము' నందలి పుష్యమిత్రు డుదాత్త చరిత్రుడు. వేద ధర్మానుష్ఠానశీలుడు. పరమధార్మికుడయిన ప్రభువు, సర్వపాపప్రశమన స్వరూపమయిన యశ్వమేధయాగాంతావభృథస్నాతపూత

శరీరుడు. ఈవిధముగా చారిత్రక పుష్యమిత్రునకును, నవలా పుష్యమిత్రునకును బోలికలేదు. ఇట్లు విరోధముగా మలచవచ్చునా, యనునది ప్రశ్న. స్థూలదృష్టి కిది విరోధమేగాని, సూక్ష్మదృష్టికి విరోధాభాసమగుచున్నది. వృద్ధరాజయిన బృహద్రథుడు విప్రవ్యామోహకుడు, సురాపానమత్తుడు, నిత్య సన్నిహిత రాజకార్య నిర్వహణాసామర్థ్యవిహీనుడు. దుష్టప్రకృతులకు సులభుడు. ప్రజల కనిష్టుడు. తత్కారణమున రాజ్యము నిర్వహించుచున్నది, పుష్యమిత్రుడే గాని బృహద్రథుడు కాడనునట్లుగా రాజ్యమునందు ప్రజలు వ్యవహరించుకొనుచుండిరి. పుష్యమిత్రుడు రాజవధగావించి స్వార్థబుద్ధియై రాజ్యమును చేజిక్కించుకొని సింహాసనస్థుడయినను సంతోషించి నివాళులర్పించి సమర్థించు వారేగాని యంతర్యుద్ధమును లేవదీయు వారుగారు. ఒక చారిత్రకనవలారచయితకు బుష్యమిత్రుని పాత్ర నత్యంతోదాత్తముగా జిత్రించుటకు దగిన సందర్భము లభించినది. ఒకపరి రచయిత సత్యాత్యమునకు గట్టువడి పుష్యమిత్రుని హంతకునిగ జిత్రించినను, తదనంతరమాతడు నిర్వర్తించిన ధర్మపాలనమును గుఱించి యతివేలముగ జెప్పి తీరవలయును గదా! అప్పుడది చరిత్రపాఠమే యగుచున్నది గాని సాహిత్యత్వమును బ్రదర్శించు నవల గానేరదు. ఇట్టిస్థితిలో రచయిత తన ప్రతిభను బ్రదర్శించి చారిత్రకవిరోధములేని యుదాత్తప్రకృతిగల పుష్యమిత్రపాత్రను సృజింప గలిగెనేని యది యుభయత్ర ప్రశంసనీయమగును. ఇచట రచయిత బుష్యమిత్రునిచే రాజవధ చేయించును. అది రాజవధగా నుండదు. మఱియు నారాయణభట్టు జ్యోతిర్విద్యావికాసము, యవనదేశములందు స్థిరనివాస మేర్పఱచుకొనిన పుష్యమిత్రుని మేనల్లుడు భవిష్యత్సంఘటనను గుఱించి హెచ్చరించుచు వ్రాసిన లేఖ-పుష్యమిత్రుడొనర్చు దారుణ కృత్యము విధిలేక జరిగిన యనూహ్య సంఘటనముగా బాఠకు నూరడిల్ల జేసి నాయకుని పయి సానుభూతిని బెంచును.

ఈ నవలకు నాయకుడయిన పుష్యమిత్రుని ప్రత్యేకత లివి.

1) మౌర్యులలో చివరివాడయిన బృహద్రథుని పుష్యమిత్రుడు సంహరించి తాను మగధరాజ్య సింహాసన మధిష్ఠించుట, 2) రాజ్య మధిష్ఠించిన పుష్యమిత్రుడు అశ్వమేధయాగ మొనర్చి ధర్మమార్గమున ధర్మరాజువోలె పాలన చేయుట, 3) నాస్తికమైన బౌద్ధమును నిరసించి ప్రజలయందు వైదిక మతాభిమానము గల్గించుటకు కృషి సలుపుట వీని నూతగాగొని రచయిత శ్రీవిశ్వనాథ నవలా ప్రణాళిక రూపొందించు కొని యితివృత్తమును నిర్వహించెను తత్క్రమ విస్తారమిది

1. పుష్యమిత్రుని రాజ్యస్వీకారము:- పుష్యమిత్రుడు మౌర్య చక్రవర్తులలో చివరివాడయిన బృహద్రథునకు సేనాని. ఆ రాజు వృద్ధుడు. కాముకుడు. రాజకార్యముల నలక్ష్యము చేసినవాడు. సహజముగనే యిట్టి పాలకునిపయి పాలితులకెట్టి యనురయ ముండదు ఇట్టి పాలకుని దుష్టబుద్ధులు,అవినీతిపరులు, శాఠ్యమున, క్రౌర్యమున, జండప్రచండులయినవారు పరివేష్టించి యుండుట విశేషాంశము. ఇట్టి పాలకుని పుష్యమిత్రుడు సంహరించెను. పుష్యమిత్రుడు ధర్మమార్గాను సరణమున ప్రజలను పాలించినట్లు పురాణముల వచనము, అట్టిడు వ్యర్థమైన, వృద్ధుడయిన యా బృహద్రథుని సంహరించుటచేత దుష్టుల కాలవాలమయి, రాజధానికి, రాజ్యమునకు బట్టిన దుర్యోగము దూర మగును. ప్రజలును, సంతసింతురు. ప్రజలకు దమ ప్రభువు నందను రాగము గలుగవలెనన్నచో నాతని శౌర్యప్రతాపాదులు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, న్యాయనిర్వాహణ, ధర్మపాలనము, ప్రజాసంక్షేమమునందు వాత్సల్యము. అధర్మప్రవృత్తియందు తీవ్రవైఖరి ప్రధానవిషయము లుగా నుండును. రాజ్యమును మంత్రులపయి విడచి, అధర్మపరులు, కుటిలస్వభావుల మాటలకు జెవినిచ్చి వ్యసనములందు దగుల్కొనిన పాలకుని ప్రజలు నిరసించుటలో దోసగు లేదు. ప్రజల యనురాగము నకు దగిన గుణసంపద పుష్యమిత్రుని యందును, నిరాసమునకు దగిన

యవగుణములు ప్రభువయిన బృహద్రథునియందును బుష్కలముగా నున్నవి. అట్టితఱి పుష్యమిత్రుడు తానాత్మ రక్షణకయి యెవరినో సంహరింప వలయుంటెగా, నాకస్మి మప్రయత్నముగా, నవాలోచిత ముగా, నతివేగముగా, వెనుకకు తీసికొనుటకు సాధ్యము కాని రీతిలో రాజవధ సంభవించును. ఇట మరియొక విశేషము. వారకుడిట్టి సంఘటన యొకటి జరుగునని యూహించుటకు వీన ప్రణాళికను రచ యిత సిద్ధము చేయును. అదియే రాజునకు కుముద్వతితో ప్రణయము.

రాజున కుంపుడుగత్తె కుముద్వతి. ఈమె ముగ్ధ. వింశతివర్ష ప్రాయి. పరమసుకుమారమైన, మనోజ్ఞమైన పాత్ర ఈమె రాజునకు భోగినిగా నుండదగిన పాత్ర కాదనునట్లుగా నీపాత్రను సృజియించి రచయిత పాఠకుల ప్రశంసనుబొందెను. 'గంజాయి వనములోని తులసి మొక్క' గనే పాఠకు లీమెను దర్శింతురు. ఈ ప్రభువునకు సమీపవర్తులు శతానీకాదులు వీరిదుష్టతకు వీరేసాటి యనునట్లుగా వీరిని మలచెను. ఇంత దౌష్ట్యము నితరపాత్రలయందు పంచబడిననేగాని పుష్యమిత్రుని రాజవధజనితదోషము నందలి తీవ్రత తగ్గింపబడదు.

రాజుపయి నిర్లిప్తతను సాధించుటకయి యాయన కాముకత్వ మునకు దోడుగా సురాపాన వివశత్వమును వర్ణించినాడు. రచయిత కామమున కుద్దీపనముగా నీసురాపానమును జోడించినాడు.సురాభాండి కల నెక్కడనుండియో క్రయము చేయించి యంతఃపురమునకు దెచ్చుటగాక సమీపమందే యొకభవనమున మైరేయనిర్మాణ కుశలు రయిన తనయుత్తమామల నియమించి వివిధ మధుప్రక్రియలను నిర్వ ర్తింప జేయును. ఎంతవివశుడైయున్నను, బుష్యమిత్రునిపయి యాతని కున్న వాత్సల్యము, విశ్వాసము పాఠకుని మనస్సునుండి చెరిగిపోని విషయము.

2) అశ్వమేధయాగ నిర్వహణమును గురించియు రచ యిత వివరించినాడు. ఒకరాజు అశ్వమేధయాగ మొనర్చినాడు.

దానివలన ప్రజల కొఱకూడిన దేమిగలదు ? దీనికి నవలయం దేమి ప్రాధాన్యముండును ? అనునవి ప్రశ్నలగుచున్నవి. వీనికి సాహిత్య పరముగ పాఠకునకు తగు నుత్తరము లీయవలసియున్నది, హింసాత్మక మయిన క్రియ యజ్ఞమనెడు దుర్వాద మొకటిలోకమున చెలరేగు చున్నది. అట్టివారిని తదభిప్రాయము నుండి మరల్చుటకు దగు యత్నము రచయిత చేయవలసి యున్నది. ఇచ్చోటులందు ధార్మికచర్చ యవసర మగుచున్నది. సాహిత్యపరమయిన సమన్వయము వీనికి గుదిరిననేగాని నవల పరిపుష్టముగాదు. నవలాప్రయోజనము సిద్ధింపదు. అందులకై పుష్యమిత్రుని చేతనే సామాజికుల ప్రశ్నలను బహిర్గత మొనర్చెను. పుష్యమిత్రుని వేదమతాభిమానమును, బౌద్ధమత విజృంభణమును, దానివలన కలుగుచున్న ధర్మచ్యుతిని వెల్లడించెను. నారాయణభట్టు, మేధావిభట్టుల పాత్రలే ధార్మికచర్చయందు విశిష్టమయిన స్థానమును బొంది తర్కయుక్తిసహముగా బుష్యమిత్రుని యాగవిషయమై ప్రోత్స హించిరి. ఇది రచయిత శాస్త్రవిజ్ఞానమునకు నుత్తమనిర్వాహము.

౩) రాజ్యమునందు మతపరముగా నాడు జరుగుచున్న దురా గతములను కన్నులకు గట్టినట్లుగా వర్ణించెను. రాజుబౌద్ధుడు. 'రాజాను మతోధర్మః' యను న్యాయము ననుసరించి ప్రజలును బౌద్ధులే యగు దురు. లేదా చేయబడుదురు. బౌద్ధులగుటలోగాని, చేయబడుటలో గాని దోష్యము లేదు. ఉన్నదంతయును ఎవని ధర్మమును వాడిని పాలించుకొనని స్థితిలోనున్నది. వానిని పాలించుకొననీయరు. పాలించుకొను వానిబాలిక నెత్తుకొని పోదురు. ఏ బౌద్ధునికో ఇచ్చి ముడి పెట్టుదురు. వీడు నెత్తినోరుకొట్టుకొనును. ఇట్టివి రాజు వరకు రావు. ఒకచో వచ్చినను శతానీకుని వంటివారు శతాధికులు రాజు చెవిలో జోరీగ లగుదురు. రాజమత మను ముసుగులో నివియెల్లనుదాత్త ధర్మములుగనే వ్యవహరింపబడును. ప్రజలలో నైరాశ్యము తొంగి చూచును. పుష్యమిత్రు డొక్కడేమి చేయును ? అదను కొఱకు

సూచుచుండును. ఈ విధముగా రాజ్యమండలి యల్లకల్లోలములను, మతమను పేరిట సంభవించెడి దురాగతములను పుష్యమిత్రుని రాజ్య స్వీకారమునకు తొందరించెడి పరిస్థితులను చేకూర్చిపెట్టి కథాగమనము సపలీలగా కొనసాగించెను.

ఈ నవలయందు రచయిత ఇతివృత్తమును ద్విధా విభజించెను. ఒకటి దేశీయమైనదిగను రెండవది విదేశీయమైనదిగను నున్నది. ఇవి రెండును నోతప్రోతములవలె కలిసిపోయిననేగాని స్థూలదృష్టికి వాని గోచరింపదు. అందు దేశీయమును ద్విధావిభజింప వచ్చును. పుష్యమిత్రుని రాజ్యస్వీకారమునకు ముందుజరిగిన కథను ప్రథమ భాగముగను, రాజ్యమును స్వీకరించి, మిత్రవధ జనితదోషపాపప్రశమన నిమిత్తము పుష్యమిత్రుడొనర్చిన హయమేధక్రతు నిర్వాహణమును ద్వితీయభాగముగను పేర్కొనవచ్చును.

ఇక వైదేశికేతివృత్తమున బుష్యమిత్రుని మేనయల్లుడు యవన దేశమును కారణాంతరములచే జేరి యచట నామరూపములను గూడ మార్చుకొని వారిలోనివాడై తద్దేశములకు ప్రభువయి యచటి కథకు నాయకుడయి ప్రభుత్వము నెఱపి పరోక్షముగా బుష్యమిత్రు డొనర్చుయాగమునకు సహకరించిన ఘట్టము ప్రాధాన్యము వహించును.

సింహపుర, కటక, ఉత్తర, అభిసార, ఉరగదేశములు పంచ యవనదేశములు. వీనిని పుష్యమిత్రుని మనుమడయిన వసుమిత్రుడు జయించినట్లు చరిత్ర చెప్పుచున్నది. మేధీయాశ్వమును వసుమిత్రు డనుగమించినట్లు, యవనకిరాతులను దునుమి యశ్వమును మరల్చి యాగము తాతగారు నిర్వహించుటలో సగరున కంశుమంతుడు తోడు పడినట్లు తోడ్పడెనని చెప్పుటలో కాళిదాస రచనము ప్రమాణముగా నున్నది. ఈకారణముచే రచయిత భారతమునకు యవనదేశముతో సంబంధమును కల్పించెను. ఆ సంబంధమును పుష్యమిత్రుని మేనల్లు డయిన సోమశర్మ గుఱ్ఱమునెక్కి యవనదేశపు సరిహద్దులకు వెళ్లుట

నుండియే యారంభింపబడెను. ఇది ప్రధానకథతో సమాంతరముగా నడచిన కథయే. ప్రధానకథకు దోహదకారియై యీకథయందు లయించుటంజేసి యిది యుపకథగనే చెప్పవలసి వచ్చెను. కింతాకరాళుడు, ఆయేషా, యవనప్రభువులు, హెలియోనసులు వైదేశికమైన పాత్రలయ్యెను. రసప్రదీప్త మొనర్చుటకు సహకరించి నవల యొక్క సమగ్రత్వమునకు దోహద మొనర్చెను.

ఈ విధముగా రచయిత యితివృత్తమును మలచుకొని నవలా ప్రణాళికను రూపొందించుకొనెను. సంగ్రహముగా నివి యిట్లున్నవి.

1) ఉదాత్తభంగిమతో పుష్యమిత్రుని పాత్రను చిత్రించి యాతడొనర్చిన రాజవధయందలి దౌష్ట్యతీవ్రతను పాఠకుల మనోదృశ్యపథము నుండి తొలగింప యత్నించెను. 2) రాజ్యమున జరుగుచున్న మత కల్లోలములను, యవన దురాగతములను, రాజుయొక్క నిర్లక్ష్య వైఖరిని యతివేలముగా జిత్రించి ప్రభువుపయి పాఠకుల కొక విధమయిన యసహ్యతను పెంపు చేసెను. 3) ప్రాణివధ హింసయే యయ్యును నది బ్రహ్మభావనతో నొనర్చిన యహింసయే యగుచున్నదను సిద్ధాంతమును వేదచోదితముగ, నుపనిషన్మార్గముగ ధార్మిక చర్చద్వారమున వివరించి అశ్వమేధయాగ నిర్వహణ రహస్యమును బోధించుచు దాని యావశ్యకతను బెంపుచేసి లోకమున తన్నిర్వహణముపయి జరుగుచున్న దుర్వ్యాఖ్యలను పాఠకుల మనోఫలకము నుండి చెఱిపివేయ యత్నించెను. 4) శకయవన కిరాతులను రూపుమాపుటకు శుంగులు యత్నించిన విధమును దెలుపుటకు యాగాశ్వమును యవనదేశమునందు ప్రవేశపెట్టి పుష్యమిత్రుని మేనయల్లుని పాత్రను సృజించి వానిని కృతయవనునిగా నొనర్చి యవన వాతావరణమును పాఠకుల మనోదృష్టికి గోచరింపజేసెను. 5) అపూర్వమయిన కుముద్వతిపాత్రను సృజించి పుష్యమిత్రునిపయిగల సంశయములను విచ్ఛిన్న మొనర్చెను. ప్రణాళికలోని ప్రధానాంశము లివి.

# పా త్ర చి త్ర ణ ము

1) పుష్యమిత్రుడు :- ఈ నవలకు నాయకుడు పుష్యమిత్రుడు, ఇందులకు హేతువులు : 2) రాజ్యభోగఫల మీాతని నాశ్రయించెను, 3) అధర్మమయమయిన మత దౌష్ట్యముల నడగించి వేదమత ప్రతిష్ఠాపన మొనర్చి ప్రజలను ధర్మబద్ధులుగా దీర్చుటకు కృషి యొనర్చెను, 4) దోషమును దోషముగా గుర్తెఱింగి దానిని బాపుకొనుటయే పరమావధిగా నెంచి ప్రాయశ్చిత్తాది రూపమయిన యశ్వమేధ మహాక్రతు నిర్వహణమొనర్చి పరులకు మార్గదర్శకత్వము వహించెను.

పుష్యమిత్రునకు బృహద్రథునకు సాన్నిహిత్యమునకు చక్కని సమన్వయమును నిర్వహించినాడు. ఈ నవలయందు పుష్యమిత్రుడు సాధువర్తనుడు. బ్రాహ్మణధర్మమును నిర్వర్తింపవలసిన యీతడు సేనాపతిత్వము నిర్వహించును. తాను బ్రాహ్మణుడగుటచే గాక సేనాపతిత్వపదవీ సమాశ్లేషముచే దనకు గౌరవము. నాడు రాజమతము బౌద్ధము, మంత్రులందరు బౌద్ధులు రాజుబౌద్ధుడేకాని ఆయనకు నేమతమయినను సమ్మతమే. స్త్రీవ్యసన సురాపానములు మతమునడ్డగింపవు. పుష్యమిత్రుడన్నచో రాజునకభిమానము, గౌరవము, అమితవాత్సల్యము.

అట్టి పరమవిశ్వాసమును తనయందు కుదిరించుకొనిన రాజును సంహరింపవలెను. రచయిత దానిని నిర్వహించిన తీరు పుష్యమిత్రుని పాత్రకును దార్ఢ్యతను దెచ్చిపెట్టెను. నారాయణభట్టు, పుష్యమిత్రుల సంభాషణములోని సారాంశము రాజవధజరిగితీరునని ఆక్రియను పుష్యమిత్రుడే నిర్వహింపవలసి యుండుననియు, నది ప్రత్యక్షముగ ప్రభువును సంహరించినట్లుండదనియు, నెవనినో సంహరింపబోయి ఆత్మరక్షార్థము మరియొకని మీాదకు విసరినకత్తి ప్రభువు ప్రాణమును హరించునట్లుగా జరుగుననియు తన జ్యోతిష విజ్ఞానముతో వెలువరించెను. (103)

రచయిత పుష్యమిత్రుని మానసిక సంక్షోభస్థితిని పాఠకులముందు ప్రదర్శించెను. రాజవధజనితదోషము సంభవించినను సైరించుకొనవచ్చునుగాని, పరమనిష్ప్రయోజకుడైన, దుర్మార్గపథప్రవర్తక జన పరివృతుడైన ప్రభువు మరణమే యుత్తమ పరిష్కారముగ పాఠకులు భావించునట్లు తత్సన్నివేశమును ప్రదర్శించెను. ఇట్లా పాత్రయంతః సంఘర్షణమునుండి యొకనిర్ణయమునకు వచ్చినవానివలె 'యథార్థమునకు నేను సాధనమను. నన్ను భగవంతు డుపయోగించుకొనును. కానిమ్ము, నేనేమి చేయగలను." (104) అని భగవదాదేశముగ కర్తవ్యోన్ముఖుడయ్యెను. ఇది భగవద్గీత యందలి 'నిమిత్తమాత్రంభవసవ్యసాచిన్' అనున్యాయము నుద్దీపింపజేయుచున్నది.

యాగనిర్వహణః- అశ్వమేధ యాగము చేయవలెనని సంకల్పము తనకులేదు. తనకు రెండు గుఱ్ఱములున్నవి. అందొకటి యవనదేశ ప్రాంగణమున పరమక్రూరముగా హింసింపబడి మృతి నొందినది. దాని నధిరోహించిన తనమేనయల్లుని జాడ తెలియలేదు. వైదికమతమునకు మంచి కాలమాసన్నమయ్యెనో లేదో తెలిసికొనవలె ననెడు తపన వృద్ధియగుచున్నది. తనకడ మిగిలియున్న కవలాశ్వజాతక పరిశీలనము చేయవలెను. దీనిని నారాయణభట్టు అను జ్యోతిర్విద్యాంసుడు సమన్వయ పఱచెను. యజ్ఞమందు పశువిశసన మెట్లుహింస కాదో నిరూపించెను. తనచే నశ్వమేధయాగ మాచరింపజేయు ప్రయత్న మారంభమయ్యెను. దానికి యవనదేశమందున్న సోమశర్మ శాస్త్రప్రమాణములచే ప్రోత్సహించెను. మేధావిభట్టు అను శ్రౌతి అశ్వమేధమును నిర్వర్తించు క్రియలో ప్రధాన ఋత్విక్కుగా నుండుట కంగీకరించెను. ఇవి యన్నియు పుష్యమిత్రునిలో నంతర్లీనముగ నధివసించిన వైదిక తత్త్వము విజృంభించుటకు వీలయ్యెను. మేధావిభట్టుచేసిన వేదోపనిషన్మూలక మయిన చర్చ పుష్యమిత్రుని యాగోన్ముఖునిగా నొనర్చెను.

కృతజ్ఞత:- కుముద్వతి రాజున కనుంగు రాణి. ఆమె యాంతర్యమును రాజు గ్రహించెనో లేదో గాని పుష్యమిత్రుడామె సమితముగా సమ్మానించెను. ఆమెను గంజాయివనములోని తులసిమొక్కగా పెం కట్టగలిగిన నిపుణుడు, ఆమె బృహద్రథుని మరణాంతమున తన్ను మహారాజా! యనిసంబోధించినది' తనను తాను మహారాజని పిలుచు కొనవలెనా! అది అభిమానవిషయము. ఆ యాపదబాపి తనపయి నత్యంత గౌరవము నెఱపిన యయ్యువిదకు దాను ప్రతికృతిగా నశ్వమేధాధ్వరమందు సమున్నత పీఠాసమారోహణమున నవకాశము కల్గించి కృతజ్ఞత వెల్లడించుకొనిన యుదాత్తశీలిగా పుష్యమిత్రు నీనవలయందు దర్శింతుము.

వాత్సల్యము :- సోమశర్మ వంటివాడు తనకు మేనయల్లుడగుట తన యపూర్వాదృష్టముగా భావించును. కాని విధి వక్రించినది. అంతటి జ్యోతిషవిజ్ఞానఖని యత్యల్పదోష మొనర్చి నందులకు తన్ను తాను శిక్షించుకొని యవనదేశవాసి యయ్యెను. మేనయల్లుని కొఱకై నారాయణభట్టు నడిరే యాతడీ దేశమింక రాడని తెలిసికొని కుతిలపడిన వాత్సల్యగుణ ప్రభావితుడు. పరదేశము నందుండియు సాయమొనర్చెడి వాని యభిమానమున కచ్చెరువొందిన పరమ ప్రేమానువర్తి.

ఇట్లు నవలానాయకుడయిన పుష్యమిత్రు డన్నింట మేల్తరముగ ప్రకాశించునట్లు రూపొందించెను.

2) "నారాయణభట్టు :- మీరు మాకంటె లౌకికులవలె గన్పించుచున్నారు."

"స్వామీ! శాస్త్రమనగా విశేష పరిజ్ఞానముతో గూడిన లౌకికమే. లౌకికమన్నచో నేమియో తెలియని మూఢులు శాస్త్రజ్ఞానమును నిందింతురు...అలౌకిక జ్ఞానము లౌకిక జ్ఞానముతో సంబంధింప జేయుటయే శాస్త్రము." ఇట్లు పల్కి పుష్యమిత్రుని కశ్వమేధయాగము నందొక సాధికారమయిన ప్రత్యయబుద్ధిని కల్గించిన మేధానిధి నారా

ణభట్టు. ఈతడు సోమశర్మ పాండిత్యము నందు విశేషమయిన యాదరము గలవాడు, తన మేనయల్లుని పాండిత్య ప్రకర్షను నారాయణ భట్టు ద్వారముననే వినదలచిన పుష్యమిత్రు డాయనతో నాయన నీ కంటె పండితుడా !" అని ప్రశ్నింపగా.

నా :- "మహానుభావుడా! నాకంటె పండితుడా! యనగా నర్థమేమి? ఆయన చదివినవియు మేము చదినవినవియు నైన శాస్త్ర గ్రంథములవే. ఒక గ్రంథము నేనెక్కువ చదివియుండవచ్చును, ఒక గ్రంథము ఆయన యెక్కువ చదివియుండవచ్చును. అదికాదు ప్రశ్న. ఈ శాస్త్రము నందాయన మేధావిలసనమట్టిది. ఆయన ఈశాస్త్రము కోసము పుట్టినాడనిపించు'నని వాని సామర్థ్యమును బ్రశంసించును.

తాను మహాపండితుడైనను తనదే పాండిత్యమనియు నితరు లెవ్వరు తనకు సరిపోలరను వితండవాదము చేయు వాడు కాడని యెఱింగిన సోమశర్మ పుష్యమిత్రునకు లేఖ వ్రాయుచు దీక్షాకాలమున నారాయణభట్టును మాత్రమే రాజ్యమందు మంత్రిగా ప్రతిష్ఠించు టుచితమగునని సూచించును.

"ఆ నారాయణభట్టు గొప్ప రాజకీయవేత్త. తమరి కవగతమయి యుండ వచ్చును. ఆయనను మహామంత్రిగా జేసినచో దీక్షాకాలమందు రాజ్యాంగవ్యవహారము సుష్టుగానుండునని నాయుద్దేశము" (128) అని యాతని మనస్సును జదివినట్లు పల్కును.

ఇట్లు, రచయిత చిత్రించిన నారాయణభట్టు కేవలమొక శాస్త్ర కోవిదుడు మాత్రమే కాదు. శాస్త్రవిషయ సమన్వయ ప్రవీణుడు

౩. మేధావిభట్టు:- ఈతడు కాశ్మీర బ్రాహ్మణుడు. శ్రౌతమందు దిట్ట. అశ్వమేధాంతము నిర్వహింపగలనేర్పరి. యజ్ఞము హింసాత్మక మయినదని సామాన్యజనులనుకొనెడి మాటను గుఱించిన సంభాషణలో మేధావి, "యజ్ఞమనగా కసాయి దుకాణమనుకొనుచున్నారు, సూపణమనుకొనుచున్నారు." అనియనగా—

పృష్య :- "యజ్ఞమందు పశువిశసనము జరుగును కదా ! అశ్వమును వధింపరు కదా ! కాదనుటయెట్లు ?

మేధావి. :- "వైదికమతము పరిహరింపరాని హింసను యజ్ఞముగా మార్చినది. వైదికులు పరిహరింపరాని ప్రాణిహింస యందు యజ్ఞభావనచేసి హింసామూర్తులగుచుండగా యజ్ఞభావనలేని వైదికేతరులు హింసామూర్తులగుచున్నారు." "అశ్వమును హింసించినచో హింసింపబడెడిది యశ్వము కాదు. అశ్వగత భావన విచారింపవలయును." "అశ్వమునందు హిరణ్యగర్భభావనచేసినచో అయ్యశ్వము కర్తకు మృత్యుజయమును ప్రసాదించును. హయమునకు పుణ్యలోకములు ప్రాప్తించును." అని అశ్వమేధపరమార్థమును బోధించెను.

ఏది హింసయో. ఏది హింసకాదో స్పష్టమొనర్చుటయే పయి సంభాషణమునకు లక్ష్యము. ఇట్లే బృహదారణ్యకమునందలి బ్రహ్మభావనమును, శ్రుతియందలి యశ్వమేధప్రక్రియా విధానమును ఋష్యమిత్రుని కెఱింగించి ఆయనచే నీ క్రతునిర్వహణమున కామోదము పొందెను.x ఇది పాఠకుని కయ్యాగము నందున్న దురూహాలను దొలగించు ననుటలో సందేహము లేదు.

4. వెలియోనను :- రచయిత సృష్టించిన 'వెలియోనస్' పాత్ర కడు విచిత్రమయిన పాత్ర. ఇది జయద్రధపాత్ర వంటి ప్రత్యక్ష ప్రతీకార దృక్పథము కలిగినది కాదు. భారతీయుడు జయద్రథుడు. ఈ వెలియోనను యవన సంబంధి. వైదేశికపాత్ర. అఖండమయిన కాల సంవేదిగా తనను భావించును. అనేక వేల సంవత్సరములనుండి తానున్నట్లు మృషాసిద్ధాంతము నొకదానిని నిర్మించెను.

ఈ దేశచరిత్రకు మిక్కిలి ద్రోహమొనర్చిన సర్ విలియం జోన్సు' అను నాంగ్లేయ చరిత్రకారుని ప్రతిరూపముగ నీ పాత్రను

---

x అశ్వమేధ ప్రకరణమును ప్రత్యేకానుబంధమున జూడనగును.

నిర్మించెను. తానే సంస్కృతిని విచ్ఛిన్న మొనర్చుకొనుటకు మృషా సిద్ధాంతముకు ప్రచార మొనర్ప సంకల్పించెనో దానికి తాత్కాలికమైన గుర్తింపుకల్గినను. సంతతియమున సమూలముగా తనతో నశించిపోవుటను కవి నిర్దేశించినట్లు స్పష్టమగుచున్నది, రచయిత ఈ వెలియోనను పద మున కొసంగిన యుత్పత్తిని గమనించినచో మనచరిత్ర యెడల యీ పాత్ర చేసిన ద్రోహము మనకు స్పష్టమగును.

• "విలయమనగా ప్రళయకాలము. ఏనస్సనగా పాపము. విలయ కాలమందెట్టి పాపముండునో అట్టిపాపము వాని యందున్నదని యీ కౌరవరాజు వానికానామమును పెట్టెను. ఆ కురురాజు నిచక్షుడు. ఈతడు యుధిష్ఠిరుని కేవలవాడు-అనగా నీ విలియోనసుడు పాపచింత, ద్రోహబుద్ధి కలవాడని తాత్పర్యము." ప్రాచీన సంస్కృత నామము లన్నియు నన్వర్థములే

౫) సోమశర్మ :- శాస్త్రపాండిత్యముతో నీతని రాజకీయ చాతుర్యము, లౌకికప్రతిభావికాసము సువ్యక్తమగును. ఆయోపాతో తన జీవితమత్యంత ప్రమాదకరమని గ్రహించియు ధైర్యముగా నామెను చేపట్టి యీమె ప్రశంసకు పాత్రుడైన ధీరుడు. విదేశ మందుండియు వేదమతమున కనుకూలమయిన కాలమును గ్రహించి పుష్యమిత్రుని యశ్వమేధక్రతు నిర్వాహణమునకై ప్రోత్సహించి యీ కార్యమును పరిపూర్తిగావించు వరకు నహరహము కృషియొనర్చిన కార్యశీలి. చిఱుతవాడై నను మహోద్దండవిజ్ఞాన తేజోవిరాజితుడై, మహా శాస్త్రమనీషులగు నారాయణభట్టు, మేధావిభట్టులకే సంభ్రమాశ్చ ర్యములు కల్గింపజేసినవాడు. మేనమామయందు మొదట కృతఘ్నతగా వర్తించినను దానిని గ్రహించి, యాతనికుపకృతి చేయనిశ్చయించి నెరవేర్చెను. తాను బ్రదికియుండియు యవనుల దుర్మార్గమును దుర్మార్గముననే యెదుర్కొని పగసాధించెను. అతని జీవప్రకృతి యెట్టిదియో చెప్పుకొనుచు-

"నిన్నింతటితో భగవంతుడు వదలిపెట్టునన్నట్లు తోచుటలేదు. వెలియోనసుల జీవులు వచ్చి సన్నాహపహించినట్లున్నది. నేను మఱల వారు చేసెడి పనిని జేయవలసిన యట్లుభగవంతుని యభిప్రాయమేమో! ఆ పనియేమనగా దెలిసిచేసెడి వైదికద్వేషము. తెలిసి సాధింప బూనెడు పురాణవైరము." ఒక్క చరిత్ర యందేకాదు. జీవితము నందును తెలిసి వైరములసాధించెడు జీవు లందఱకు నీవాక్యము కనువిప్పుగా నగుటకు రచయిత సోమశర్మ పాత్రతో దీని ననుసంధించెను.

3) కుముద్వతి :- ఇది విశ్వనాథ యపూర్వసృష్టి. బృహద్రథుని వెంటనుండి ప్రభువును దుష్టప్రకృతుల నుండి రక్షింప శతథా యత్నించిన శీలవతి. బృహద్రథుని మరణముతో భీరువైన యామె మేతువయ్యెను. పుష్యమిత్రుని మహారాజా! యని సంబోధించి పుష్యమిత్రునకే యమితసంభ్రమము గలుగునట్లుగా వర్తించెను. అపుడు వీరిరువురకును జరిగిన సంభాషణను రచయిత "ఈమె గంజాయి వనములో తులసి మొక్క"గనే నిర్వహించెను. ఈమె బృహద్రథుని కుంపుడు గత్తెకాదు. ఆమెయందు శృంగారమును గవి పోషింపదలచు లేదు. పుష్యమిత్రుని గుఱించి—

"పుష్యమిత్రుని మహారాజును చేయుడు. నాకీ వేయి గ్రామము లక్కఱలేదు. ఈ సర్వభూషణము లక్కఱలేదు....... నేనుపోయి యే బౌద్ధవిహారము నందో భిక్షుకురాలనై జీవింతును......నావంటి వారు కూడ సృష్టిలో నుండవలయును. లేనిచో మీవంటి వారికి కష్టము... భగవంతుడు నావంటివారిని సృష్టించి లోకమునందితరుల దుఃఖములను తగ్గించి పెట్టును." అని పలుకుట దుస్సాధ్యము. పుష్యమిత్రుడు రాజగుటకు, గవి కల్పించిన పరమ సుకుమారమైన సన్నివేశమునకు నభినేత్రి కుముద్వతి.

## విశేషాంశములు

ఈ నవల యందు కవి ధార్మిక చర్చ ననంతముగా జేసెను.

శ్రౌత విజ్ఞాన మంతయు నిందు గుంఫించెను. అందుకొన్ని-

1. సృష్టిరహస్యము (79,113,145) 2. దీక్షిత వాదము (64)
3. జ్యోతిష వికాసము (103,161) 4. అశ్వమేధ రహస్యము*

1. "సర్వసృష్టియు కర్మాధీనమై సాగుచున్నది. పూర్వకర్మ నియతమై జంతువులు జనించుచున్నారు." (113) పురుషునియొక్క రేతస్సు స్త్రీ గర్భమందు నిహితమయి యెందుకు బిండము కావలయును ? (185)

ఇట్టివి కొన్ని సృష్టిరహస్యములను శ్రుతి పరముగా సమన్వయించుచు కొన్ని ప్రశ్నలువైచి సమాధానించెను, శ్రుతియందు దీనికి సమాధానము లెట్లున్నవో గమనింపవచ్చును. ఇది 'స్వభావ'మని సామాన్యముగా సమాధానము చెప్పవచ్చును. కాని స్వభావమనగా స్వగతమైన సంస్కారమని శ్రుత్యర్థము. జన్మించిన శిశువు స్తన్య పాన శక్తి గల్గియుండుట, పక్షియెగుర యత్నించుట, జన్మాంతర సంస్కారములు. 'స్వోభావః సంస్కారఃయః వర్తతే స సంస్కారః' అని సంస్కార శబ్దమునకు వ్యుత్పత్తి. దీనినే బృహదారణ్యకము 'పూర్వప్రజ్ఞ'యన్నది. బహుజన్మగత కర్మయే లేనిచో జనించిన ప్రతిజంతువు (జననాత్ జంతుః) సుఖము ననుభవింపవలసి యున్నది. కాని యట్లుండుట లేదు భగవంతుడొక్కడే సృష్టిచేసె నందమా ! సర్వజీవులందు విభిన్న స్థితుల నమర్చవలసిన యావశ్యకత యాతని కేమిగలదు? కనుక వ్యాసమహర్షి యన్నట్లు అచేతనమైన ప్రాణుల కర్మపాకము చేతను, జగన్నియంతయైన పరమేశ్వరుని చేతను నీ సృష్టి జరుగుచున్నదని సమాధానము.[1] ఇది గ్రహింప సాధ్యముకాదనియే రచయిత ఈ

* ఇది ప్రత్యేకానుబంధమందు గలదు.

1. స్వభావ జగజ్జన్మ స్థితిధ్వంసా మునీశ్వరాః। నచయా కేవలేనాపి, నచ కేవల-

సృష్టి యెంత గిజిగాని గూడుగానున్న'దని శ్లేష్మ చెను. ఇక బింబ మెందుల కగునటకు శ్రుతియందు లోకమున గర్భము లస్థియు నిర్మాణ సమయమున ద్రవమిళితమే. కాని జనన సమయమున నస్థియుక్తములు, శరీర సహితములు. ఈ విచిత్రమును గుఱించి బ్రహ్మవాదులు విచారణ చేసి యజ్ఞమునందు ద్వితీయ దినమున 'కారీరేష్టి'యందు యజ్ఞాధ్వర్యుడు సోమలత క్రియనిమిత్తమై ధ్రువాసీక భృత్తిలో హిరణ్యమును నేతియందుంచి యాజ్యమును హోమము చేసి బంగారమును విడచుటచే కఠిన ద్రవ్యమైన హిరణ్య సంయోగముచేత ద్రవసమ్మిశ్రితమైన గర్భము లస్థియుక్త ప్రజాప్రజననమునకు హేతువగుచున్నదని సిద్ధాంతము మొనర్చిరి. [2] ఇట్లీ శ్రుతియుక్తమైన విషయముల నిందు పాఠకులకు రచయిత పరిచయము గావించెను.

2. "పరమేశ్వరుడు తొలుత బ్రాహ్మణ జాతిని సృజించెను. ఆయన దీక్షిత వాదమును నిర్మించెను." అని రచయిత శ్రుతిపదమును పేర్కొని సృష్టిక్రమము నెఱింగించెను. పరమేశ్వరుడు ప్రజను సృజింప గోరి తపము చేయగా మొదట సర్పములు సృజింపబడెను. అనంతరము తిరిగి తపము చేయ పక్షులు జనించెను. మూడవ పర్యాయము యజ్ఞమందు జ్ఞాతాజ్ఞాతదోష నివృత్తి కొఱకు నధ్వర్యుడు పఠించు దీక్షిత వాదమును జదివి తపస్సు చేయ ప్రజలు పుట్టిరి. ఈ విషయము శ్రుతియందున్నదని తెలుపుటయే యీ వాక్యములోని వైశిష్ట్యము. ఈ దీక్షిత వాదమును నిర్వర్తించిన యజమాని ప్రజను సృజించినవాడే యగు

---

కర్మణా జగతః సంభవస్థితిశ్చనాశశ్చ భవతి ద్విజాః । ప్రాణినాం కర్మపాకేన మయాచ మునిసత్తమాః, ఏషస్వభావో విప్రేంద్రాః

2. "బ్రహ్మవాదినోవదన్తి కస్మాత్సత్యాదనస్థికేన ప్రజాః ప్రమీయన్తే స్థన్వతీర్జాయంత యద్ధిరణ్యం ఘృతేవధాయజుహోతి।
తస్మాదనస్థికేన ప్రజాః ప్రమీయన్తే ఽస్థన్వతీర్జాయంతే।"

చున్నాడని. 3 శ్రుతినిర్దేశము.

3. జ్యోతిషవికాసము :- "గురువు నేడు జ్యోతిర్మండలమందు భిన్నగ్రహసంచారము నందు పరమోచ్చంగతుడై స్వచ్ఛమైన స్థితి యందున్నాడు. ఇట్టి స్థితి సృష్ట్యాది బృహస్పతికిలేదు. ఈ స్థితి బ్రాహ్మణుని రాజ్యాధికారిగా జేయును." (105)

"శని నిన్ను రాజును చేయును. గురువు నీ బ్రాహ్మణకర్మను పాలించును."2) "మానవులెట్లుపుట్టినారు? గ్రహగతుల వలనబుట్టినారు. గ్రహగతులే భూమండలమున పంచభూత వికారములయిన మానవులుగా బరిణమించుచున్నవి." ఈ వాక్యములు రచయిత జ్యోతిష శాస్త్ర విజ్ఞానమును దెలుపును.

జ్యోతిషము వేదాంగములలో నొకటి. వేదములందు పేర్కొనబడిన కర్మలను యే యే మాసములలో నే యే నక్షత్రములందు నిర్వహింపవలయునో వానిని జ్యోతిశ్శాస్త్రము నిర్దేశించును, ప్రకాశింపచేయునట్టిది కనుక నీ శాస్త్రము నా పేరుతో నన్వయింపబడెను. జ్యోతిష్టోమ యాగమును చిత్రియందును, నశ్వమేధమును 4 చిత్రా

3. "ప్రజాపతి రకామయత ప్రజాస్సృజేయేతి, సతపోతప్యత
ససర్పానసృజత, సోఽకామయత ప్రజాస్సృజేయేతి,
సద్వితీయ మతప్యత, సవయాగ్ంసి స్యసృజత, సోఽకామయత
ప్రజాస్సృజేయేతి, సతృతీయ మతప్యత సఏతద్దీక్షితవాద
మపశ్య త్తవద త్తతోవై స ప్రజాఽసృజత"
తపమనగా నగ్నిషోమాదిరూప యాగమని శ్రుతి
"అగ్నిష్టోమేనవై ప్రజాపతిః ప్రజాఽసృజత
దీక్షితేన వక్తవ్యో మన్త్రి సంఘం దీక్షతవాదః
యత్తప స్తప్త్వా దీక్షితవాదం సృజతి ప్రజా ఏవ తద్యజమాన సృజతే
4. 'చిత్రానక్షత్రం భవతి। చిత్రంవా ఏతత్కర్మ।" చిత్రానక్షత్రే జ్యోతిషా యజేత,
"మాఘప్రోష్టపదయో రపరపక్షేఽష్టమ్యా మష్టకాం కుర్యాత్।"

నక్షత్రమునందును అష్టకాయోగమును మాఘభాద్రపదములందు బహుళాష్టమినాడు నిర్వర్తింపవలసి యుండును. [5] ఈ జ్యోతిషము గణితము, ఫలితము, సంహిత యను మూడు శాఖలు కలిగియున్నది. ముఖ్యముగా యజ్ఞనిర్వహణ విషయముల నెఱుంగుటకు జ్యోతిషమును దెలియవలసిన యావశ్యకత కలదు. [6] కర్కాటకము లగ్నమై యందు గురుశనులుండినచో మహదాధిపత్యము, యజ్ఞాది సత్కర్మానుష్ఠానము లభింపగలదని కృష్ణమిశ్రీయము పేర్కొనుచున్నది. [7] మానవులకు గ్రహములకు గల సంబంధమును గుఱించి వైఖానసకల్ప సూత్రము పేర్కొన్నది.లోకయాత్ర యంతయు గ్రహాయత్తమనియు గ్రహప్రాతికూల్యమునకు గ్రహశాంతి యొనర్చుకొనవలయుననియు నది నిర్దేశించుచున్నది. ఈ విధముగా రచయిత తన జ్యోతిషవిజ్ఞానమును ప్రదర్శించెను.

సురావిశేషములు :- విషయవిస్తృతియందు శ్రీ విశ్వనాథకెనలేని మక్కువ. ఈ నవలయందు వినోదము కొఱకు, పాఠకుని మనస్సునకు గొంత యుల్లాసము గల్గించుటకు, తీవ్రమయిన యాలోచనుండి మనస్సునకు గొంత విశ్రాంతికల్పించుటకు యత్నించి మైరేయమునువిస్తృతముగా వర్ణించెను.పాఠకున కిన్ని యాసవ విశేషములున్న విషయమే తెలియక పోవచ్చును.వాని నన్నింటి నొకచో నేర్చికూర్చి

---

5. వేదాహి యజ్ఞార్థ మభిప్రవృత్తాః। కాలానుపూర్వ్యా వహితాశ్చ యజ్ఞాః॥
యస్మాదిదం కాలవిధాన శాస్త్రం। యోజ్యోతిషం వేద సవేద యజ్ఞాన్॥
కృ. మి. శ్లో. 32

6. ఉచ్చస్థితస్యాపి గురోర్దశాయాం। కరోతి సౌఖ్యం సుతబంధువృద్ధిం।
యజ్ఞాది సత్కర్మ సుకర్మ సిద్ధిం। మనోవిలాసం మహదాధిపత్యం॥
Ibid-P. 128-30

7. గ్రహాయత్తా లోకయాత్రా। "తస్మా దాత్మ విరుద్ధే ప్రాప్తే గ్రహాన్ సమ్యక్పూజయతిః"

క్రమాను సంధానము చేసి వాని పేళ్లు,వానిని ద్రావినచో వచ్చెడి ఫలితములను ప్రధానకథ కనుసంధానము చేసి వివరించెను. ఇది పాఠకున కొకవైపు వినోదమును, మరియొకవైపు మదిరాపాన విషయికమైన విజ్ఞానము కల్గించును. ఆ పేళ్లుకూడ విచిత్రమయినవి.

సుర : త్రావిన కొలది త్రావవలెననిపించెడి మద్యవిశేషము. హరిప్రియ : బలరామున కిష్టమయినది. హాల : ప్రతివేళ ద్రావవలసిన మద్యము. త్రావినవారికి సిగ్గుండదట. పరిస్రుత్తు : దీనిని ద్రావినవారు కూర్చొనలేరు. తిరుగుచుందురు. (ఇదియే శతపథ బ్రాహ్మణమందు పేర్కొనబడిన పరిస్రుతము.) వరుణాత్మజ : స్త్రీలు త్రావెడి కల్లు. పురుషులకొఱకు కాదు. కారణము రమించుటకు బదులు రమింపబడుదురని భయముతో త్రావరు. గంధోత్తమ : లోకమునందుద్భవమయిన యన్నిసుగంధ ద్రవ్యములతో తయారు చేయబడిన మదిర. ప్రసన్న : దీనిని ద్రావినచో త్రావినవాని మనసు స్వాస్థ్యములో నుండును. కాదంబరి : గోమంతపర్వతమునందుగల కదంబ వృక్షముల నుండి తీసిన రసముతో తయారొనర్చబడిన మద్యము. వృద్ధుడయినను దీనిని సేవించినచో యువకుడగును. కడిమిచెట్టునందాశక్తి గలదని చెప్పుదురు. నవదంశములు : కల్లుత్రావినవాని ప్రేవులు తగులపడకుండ వీనిని తినుచుండినచో నా మదిర వీనినే తగులబెట్టును. మాధ్వీకము : మధుక్రమమునందు త్రావెడి మద్యములు. ఇందు మొదటిది ద్రాక్షపండ్ల నుండియు, రెండవది యిప్పపూవులనుండియు తీయుదురు ఇవి పానపాత్ర పూర్తియయిన వెంటనే రెండవ పానపాత్ర నోటికడ సిద్ధముగా నుండవలెను. నగ్నహువు : దీనిని ద్రావినవారు తమయొడళ్లమీద వస్త్రము లుండుట సహింపరు.

ఇవికాక అల్పమైన కశ్య, హాల, యక్షకర్దమము, చంద్రసంజ్ఞము, కిణ్వము మొదలయిన వానిని పేర్కొనెను. మహత్తరమయిన సృష్టిక్రమము, ఉపనిషద్విజ్ఞానము, శ్రౌత, జ్యోతిష,విషయ నిరతిగలిగి వాని

యంతర్గతమయిన భావనతో ననేక సూక్ష్మాంశములను వ్యక్త మొనర్చిన యీ రచయితయే దానికి బూర్తి వ్యతిరిక్తమయిన మధు పాన శాస్త్ర విషయమును బరిశీలించి పరిశోధనాసక్తితో పాఠకునకు జెప్ప యత్నించును.

వర్ణనలు :- కథాగమన వేగము నడ్డుకొనినను వర్ణన లుచిత మైన స్థలములందుచితమైన ప్రాధాన్యము వహించును.

నవలాప్రారంభమున నశ్వబాధావర్ణనము :- 'అది మహా బలిష్ఠ మైన అశ్వరాజము. దాని నాలుగుకాళ్లు కట్టివేయబడినవి. ముట్టె కూడ బిగించి కట్టబడినది. దానిమొహలి నిండ గశాఘాతములు కత్తి దెబ్బలు తేలియున్నవి. దానిముట్టె వెంట దేఱిన నురుసులు గడ్డకట్టి యున్నవి. దానియొహలి మీద ఖడ్గపు బోట్లున్నవి. కొన్ని గాయము లలో నుండి క్రొత్త నెత్తురు, కొన్ని గాయములలో బిగిసిన నెత్తురు' (1)

సాక్షాద్వస్తుదర్శనము వర్ణనలో ప్రాధాన్యము వహించి కవి సూక్ష్మపరిశీలనా నైశిత్యమును ప్రత్యవయవ సౌందర్య సముద్దీపనకు చిత్రకారుడు గైకొనెడు నిత్యప్రత్యగ్ర శ్రద్ధను దలపించును. పై వర్ణన ములోని అశ్వము, బాధాతప్తమైన దాని యవస్థ, పాఠకుని మనోనేత్ర మునకు సాక్షాత్కరించును. ఇట్టిదే అశ్వము నఱుకబడి యదికాల్చ బడి యారగింప బడునపుడును క్రమవర్ణన మొనర్చెను. 'వారందఱు గుఱ్ఱపుచర్మ మొలువనారంభించిరి. ఒలుచుట యైనతర్వాత మాంస మును ఖండఖండములుగా గోసిరి. నరమునుదీసి యాతల నుంచిరి, శరీరమునందు బరిహరించదగిన భాగములన్నియు బరిహరించిరి. ఆహారింపదగిన మాంసమును ముద్దముద్దలుగా జేసి తమ డాళ్లను భోగించి వానిపై నుంచిరి. అటునిటుపోయి కట్టెల నేరుకొనివచ్చిరి. నిప్పు ముట్టించిరి. అదిమండ నారంభించెను. బల్లెములకు గ్రుచ్చి యా మాంసఖండములను గాల్చిరి.' (16)

ఇట్లు గుఱ్ఱము మెడనరకుట మొదలు మాంసఖండములు కాల్చుటవరకు నడిమి నెన్ని ప్రక్రియలుండునో అన్నింటిని క్రమముగా కాష్ఠాహారణమును సైతము వదలక వర్ణించినాడు. ఇట్లే అభిసార దేశవర్ణనము (౩౮) జలకుండయుద్ధవర్ణనలు (202) యథావద్వస్తువర్ణనల కుదాహృతులని నుడువవచ్చును.

# 7. అమృతవల్లి

## చారిత్రక పూర్వరంగము

ఏ వంశపు రాజు లేలినను, మొదటగా ధర్మమభివృద్ధి గాంచుటకై దీక్ష బూనిన వారు ప్రభువులగుట, క్రమమున నట్టివారు మృగ్యమయి యా వంశమునుండి వేఱొక వంశమునకు రాజ్యము సంక్రమించుట సృష్టిరహస్యము, శుంగవంశజులు రాజ్యమునకు వచ్చి అశ్వమేధ యాజులై ధర్మవృషభమును నాల్గుపాదముల నడపిరి. వారిలో చివరి ప్రభువు దేవభూమి. అమృతవల్లి నవలయందీ దేవభూమి సంహారము, కాణ్వవంశపాలన సమారంభము పేర్కొనబడినది. దేవభూమికి క్షేమభూమి యనియు నామాంతరము. విష్ణుపురాణ, భాగవతములందు కాణ్వాయనుడైన వాసుదేవునిచే దేవభూమిని హతుడైనట్లు, వాసుదేవుడు రాజ్యస్వీకార మొనర్చినట్లున్నది[1]. ఇతర పురాణములందును విశ్లేషించుడు. కలియుగ రాజవృత్తాంతమందున్న దేవభూమి మనోద్దంత మత్కంఠను గల్గించును. శుంగవంశములోని చివటి రాజు దేవభూతి. బాల్యమునుండి కాముకుడు. రాజ్యవ్యవహారమను పూర్తిగా మంత్రుల పరము గావించి తాను రాచనగరును వీడి విదిశానగరమునందు విడిది చేసి వేశ్యాంగనలతోను పురస్త్రీలతోను యథేచ్ఛగా విహరించుచు ప్రజలకు కంటక ప్రాయుడయ్యెను. ఈ వ్యసన పరిపూర్తికయి సహాక

---

1. దేవభూతింతు శుంగరాజానం వ్యసననం తస్యైవామాత్యః
కణ్వో వసుదేవనామా తం నిహత్య స్వయ మవనీం భోక్ష్యతి। వి.పు(37)
తతః కణ్వాయనం భూమిర్యాస్యత్యల్ప గుణాన్నృప।
సంగం హత్వా దేవభూతిం కణ్వోమాత్యస్తు కామినమ్.। 19
స్వయం కరిష్యతే రాజ్యం వసుదేవో మహామతిః। భాగ. 20

రిం చెడి దుష్టులగు నధికారులాతనికి చేరువయై తమ స్వామికార్యమును దీర్చుటతోబాటు స్వకార్యములను సయితము నెఱవేర్చుకొని ప్రజలచే మఱింతగా ద్వణీకరింపబడుచుండిరి. ఇట్లుండగా తన మంత్రియయిన వాసుదేవుని కుమార్తె యంగచందములను చారులవలన విని యెట్లైన నామెను పొందవలెనని తలంచి మాయోపాయముచే భర్తతోగూడిన వాసుదేవుని కూతును తనపీటికి రప్పించెను. గూఢముగా వాసుదేవుని యల్లుని జంపించి ఆసుకుమారిని పొందుటకు నల్లుని రూపమునే ధరించి రాజు వాసుదేవుని కూతురున్న యింటి పడకటింటికి బోవగా నామె గ్రహించి యీ దురాగతమును నిరసించి తనకుతానై ప్రాణములు తత్క్షణమే వదలెను. ఈ వృత్తాంతమును వాసుదేవుడు చారుల వలన వినినవాడై, తన కూతు జంపిన యీదుష్టుని నొకానొక వారాంగనయు, విషకన్యయు నయిన యామెచే సంపర్కము చేయించి మడియింప చేసెను. దుర్మార్గుడు. కాముకుడు నయిన ప్రభువు మరణించినందులకు ప్రజలు సంతసించిరి. 2

---

2. "యోఽయం రాజా దేవహూతి రాబాల్యాత్ కామతత్పరః।
నివేశ్య రాజ్యభారం స్వామాత్య వర్యైః ద్విజోత్తమే॥
విహాయ పాటలీపుత్రం విదిశాయాం సునంస్థిత॥
అన్యాయేన పురస్త్రీభి ర్విహర్తు ముపచక్రమే॥
కామినీ మానినీయోభూత్ వ్యాఘవ ద్వ్యగ్ర కర్మకృత్॥
తం ప్రజా నాన్వమోదన్త శుంగ భూభృ ద్యశోహరమ్॥
అత్యైర్ధ్యూతైశ్చ కితవై ర్వృత్తో నర్తక గాయినైః।
సురా మాంసాశనో మత్తో వారస్త్రీ సంగలాలసః॥
సచైతదాపిత్రైః శ్రుత్వా వాసుదేవస్య మంత్రిణః।
సుతాం మహారూపవతీం పద్మినీ లక్షణాన్వితామ్॥
తయాగన్తుం మనశ్చక్రే బ్రాహ్మణ్యా కాలచోదిత.।
వ్యాజేన తాం సమానీయ పత్యా సార్ధం స్వసన్నిధౌ।

కాణ్వవంశములోని వాడయిన వాసుదేవుడు మగధ సింహాసన మధిష్ఠించెను. ఇది పురాణములందలి గణనప్రకారము కలియనంతరము 2220 సంవత్సరములనాటి గాథ. అనగా క్రీ. పూ. 938వ సంవత్సరము నకు సమానము. ఈ కాణ్వవంశము 85 సంవత్సరములు పాలించినది. అనంతర మాంధ్రసామ్రాజ్యపాలనము జరిగెను. ఈ కాణ్వులు వాసుదేవ, భూమిమిత్ర,నారాయణ, సుశర్మలు. వీరు నలుబది సంవత్సరము లు పాలించిరని విష్ణుపురాణము.[3] ఎనుబదియైదేండ్లని, వాయుపురాణ, కలిరాజవృత్తాంతములు పేర్కొన్నవి.

---

గూఢం హత్వా నిజైశ్చారైః సాధ్వ్యాస్తస్యాః ప్రియంపతిం।
తద్రూపధృత్ నిశిప్రాప్య తస్యావాస గృహం నృపః॥
హతా త్తాం దర్శయామాస బ్రాహ్మణీం వరవర్ణినీం।
సాపి జ్ఞాత్వాఽస్య దుర్వృత్తం ప్రాణాన్ తత్యాజ తత్క్షణాత్॥
తచ్ఛ్రుత్వా వసుదేవస్తు శోకసంతప్త మానసః।
విషదిగ్ధా మలంకృత్య కాంచిద్వారాంగనాం ద్విజః॥
సంప్రేష్య సర్వాలంకార భూషితాం తత్సమీపతః।
తయైవ ఘాతయామాస దేవహూతిం నృపాధమమ్।
ననందుశ్చ ప్రజాః సర్వాః శ్రుత్వా తస్య వధం తయా।
వవ్రిదె వసుదేవంచ రాజానం పరయా ముదా॥ ఇంకను కొనసాగించుచు -
ఏవం సలోక విద్విష్టం దేవహూతిం రహోనిశి।
విష కన్యకయా హత్వా వసుదేవో ద్విజోత్తమః॥
భవిష్యతి సమాస్త్రింశన్నవ కాణ్వాయనో నృపః

3) ఏతే కాణ్వాయనా శ్చత్వారః పంచచత్వారింశ ద్వర్షాణి భూపతయో భవిష్యన్తి'.

"ఏతే చత్వారింశత్ కాణ్వాయనా శ్చత్వారః
పంచచత్వారింశద్వర్షాణి భూపతయో భవిష్యన్తి॥"
వి పు. వేఙ్కటేశ్వర ప్రతి

సారాంశమేమన, శుంగులలో చివరి ప్రభువు దేవభూతి. ఈతడు కాముకుడు. తుదకు మంత్రికుమార్తెనే కామించెను. మంత్రి యల్లుని చంపించెను. తాను సుశీలయయిన మంత్రికూతు ననుభవింప యత్నింప నామె భీతిలి మరణించెను. అనంతరము వాసుదేవుడు వారాంగన యగు విషకన్యద్వారమున దేవభూతిని చంపించెను. ప్రజలు సంతుష్టి నందిరి. ఈ చరిత్రాంశమును పురస్కరించుకొని "అమృతవల్లి"యను నవల వ్రాయబడినది.

## అమృతవల్లి - ఇతివృత్తసంగ్రహము

జయద్రథుడు, విదురుడను వారిర్వురు సోదరులు. వీరి నామము లన్వర్థములు. వీరిరువురు వృద్ధులగుటచే వీరికడకు బిల్లలాడుకొను టకు వత్తురు. వీరి స్వభావములు బాలల కవగతమగుటచే విదురుని కడకు బోయినంతగా నా జయద్రథుని కడకు బోరు. అమృతవల్లి, శ్రీమాలి యిరువురు చెలికత్తెలు. శ్రీమాలి నాటి మగధసామ్రాజ్య మహా సేనాని వాసుదేవుని తనూజ. అమృతవల్లి యొక యున్నతరాజోద్యోగి కుమార్తె. నాడు మగధకు ప్రభువు దేవభూతి. శుంగవంశమున బుట్టిన వాడు. కార్తాంతికులు నాడు శుంగవంశ మంతరించి వేఱొక వంశము వారి రాజ్యమొనర్తురని చెప్పుచుండిరి.

విదురుని దగ్గఱ చేయబడెడి యా బాలికల ప్రసంగముల వలన వారి ప్రకృతిని సులభముగా విదురుడు గ్రహించెను. శ్రీమాలి లేడి వంటిది అమృతవల్లి చిఱుతపులి. ఒకనాడీ నెచ్చెలులు జయద్రథో

చత్వారింశద్ద్విజాహ్యేతే నృపాః కాణ్వాయనా మహీం ।
భావ్యాప్రణత సామన్తా చత్వారింశచ్చపంచచ ॥
తేషాం పర్యాయకాలేతు భూమిరన్ధ్రాన్ గమిష్యతి । (349)
చత్వారఏతే భూపాలాః కాణ్వగోత్రసముద్భవాః ।
ధర్మేణభోక్ష్యన్తి మహీం పంచాశీతింతు వత్సరాన్ ॥ క. రా. వృ.

పజ్ఞముగా నొక కాలజ్ఞాని యింటికేగిరి. ఆమె పేరు కాలంజరి. ఆమె గృహమందున్న లేడిచర్మము మీద శ్రీమాలి, చిఱుతపులి చర్మము మీద యమృతవల్లి యుపస్థితులైరి. తనకు బూనకము రాకపోవుటచే వారు కూర్చుండిన చర్మములు వచ్చినవృత్తాంత మాధారముగా వారి భవితవ్యమును నిర్దేశించెను.

ఒక వేటకాడు పిల్లతోనున్న లేడిని పొంచి బాణము సంధింప నది పిల్లకే తగిలెను. తల్లి ప్రక్కనున్న ప్రవాహమునబడ, దానిని రక్షింప యత్నించిన యా వేటకానికి నది సాధ్యము కాలేదు. మరణించిన యా లేడి చర్మమిదియని చెప్పెను. చిఱుతపులి రెండునక్కలు ఋతుకాలమున నాడుచుండగా నొకసివంగి నక్కను గొఱుకగా నానక్క సివంగిని మెడకొఱికి చంపెను. చిఱుతపులిని చంపిన వేటకాడు దాని చర్మమును కాలంజరి కిచ్చెను.

ఇట్లు శ్రీమాలి దివినుండి భువికి దిగిన యమృత శలాకయనియు, నామె పాతివ్రత్య భంగము కలుగుసమయమున నసువులువీడుననియు జెప్పెను. శ్రీమాలి దీనిని విశ్వసింపలేదు. అమృతవల్లికి మాత్రమిదిపరమ విశ్వాసమయ్యెను. కాలంజరి అమృతవల్లికి భవితవ్యమును గుఱించి చెప్పుచు నెవరికో జరిగెడి యన్యాయమును సహింపలేక నిరోధించి యసువులు గోల్పోవునని తెల్పెను. ఈ రెండు విషయములు నమృతవల్లి మనస్సునందు గాఢముగా నాటుకొనెను.

అమృతవల్లి మఱియొక పర్యాయము కాలంజరిని జూడ యత్నించెను గాని శ్రీమాలి వివాహము నిశ్చయమగుటలో నది సఫల మంద లేదు. తనతల్లి దండ్రుల యనుమతితో తాను శ్రీమాలి యింటిలో తనకు దెలియకయే యొక ప్రధానస్థానము వహించెడి స్థితి వచ్చెను.

శ్రీమాలి వరుడు శ్రీవత్సలాంఛనుడు. ఈయన పురాణజ్ఞుడు రాజనీతివేత్త. సుశిక్షిత ప్రజ్ఞకలవాడు ప్రముఖ రాజోద్యోగి. కాలం

జరి చెప్పిన కాలజ్ఞానము స్ఫురణకురాగా శ్రీమాలి రోదించెను.
తాను సర్వవిధముల శ్రీమాలి యాపదను దొలగింతుననియు, నందులకై
జన్మాంతము కన్యగా నుందుననియు ఆమెకు కష్టము కల్గించిన శత్రువు
ప్రాణములు తీసి మరణింతుననియు శపథము గావించెను.

వివాహానంతరము తీరిక కాగా కాలంజరి యింటికి రాజశకటము
నధిరోహించి యమృతవల్లి యేగెను. కాలంజరి గాని, ఆ కుటీరము
గాని యచట లేదు. సర్వము ధూళిధూసరిత మయ్యై యుండెను. ఆమె
భర్త రాముడుగు జాడయైనను దెలియకుండెను తనకా జయద్రథునిపై
యనుమానము మొదలయ్యెను. రథమును విదురు నింటికి పయనింప
జేసెను. ఆ వృద్ధుడు, పరిసర ప్రదేశములవారు జయద్రథుని దుష్టత్వ
మును వెలువరించిరి. ఆతని దుర్మార్గము గ్రామములోని మురారి
యను ఖడ్గవిద్యావేత్త కూతు విషయమై జరిగిన యన్యాయము వలన
ప్రకటితమయ్యెనని దెలియ వచ్చెను. ఈ జయద్రథుడు విదిశానగరమున
విడిది చేసిన ప్రభువు దేవభూతి కామదాహమును దీర్చుచుండెననియు,
నట్లుగొనిపోబడిన వారిలో నీ మురారి కూతురుండెననియు నమృత
వల్లి గ్రహించెను. ఇది రాజవ్యవహారముగా భావించిన మురారి తన
ముల్లుకచే వాని జంపించెను. వాడును తనకు వేరుప్రయోజనము గల
దనుచు జచ్చెను ఈ పలుకులు వినిన యమృతవల్లి భవిష్యద్వ్యవహార
మునకు బీజమయ్యెనేమో యని కుతిలపడెను.

జయద్రథుని యాత్మశక్తిని గుఱించి మున్ను తాను కాలంజరి
నుండి వినిన దగుటచే విదురుని తద్విషయమై ప్రశ్నించెను. విదురుడీ
ప్రశ్నకాశ్చర్యపడి తనతమ్మునకు నెన్మిదేండ్లప్రాయమున జేసిన జబ్బుచే
నాతడు మరణించినట్లుగా భావించిన యనంతర మాతడు జీవించుట
మున్ను జయద్రథునకు నానంతర జయద్రథునకు భేదమును దాను
గమనించుటయు నామెకు జెప్పెను. జయద్రథుని శరీరమున నింకెవడో
ప్రవేశించిన యనుమానము తనకున్నను దానిని గుప్తపఱచెను. విదు

రుని కడనుండి వచ్చి కాలజ్ఞానవిషయమై బరిశీలింప నాటి సాయంతనము కోటకేగెను. భవిష్యత్పురాణ విషయమై యడుగ నది త్వరలో వాసుదేవ మందిరమునకు జేర్పబడునని యచటి వందులు సమాధానించిరి. తనకు లభించిన యధికారమును సద్వినియోగపఱుప నెంచి కాలంజరిని, కాలజ్ఞానపు బాటలు పాడెడు నామె భర్త రామడుగును వెదుక సైనికులకు నియమించెను. వందులు పురాణగ్రంథములను దెచ్చిరి. వానిని వాసుదేవునిచే జదువగోరెను. దేవభూతి నుండి జరిగిన విషయములను వారెఱుంగవలెననియే యామె యుద్దేశము. దేవభూతి కుటుంబినుల చెఱచుటతో నారంభమయిన పురాణకథనము వాసుదేవుడు రాజగువఱకు నుండెను, దేవభూతి యెట్లుల మరణించెనో, వాసుదేవుడెట్లు రాజయ్యెనో తెలిపెడు భాగము గ్రంథమున లుప్తమయ్యెను. ఇది యామెయుత్కంఠకు హేతువ యయ్యెను.

రామడుగును రాజ భవనమునకు సైనికులు దెచ్చిరి. కాలంజరిని జయద్రథ పిశాచ మావరించెనని, యామె గుణశీలములు సమున్నతమని యెఱింగి తానాతనితో ప్రచ్ఛన్నముగా బ్రసంగించెను. తాను కాలంజరిని వెదకుటకై యొనర్చిన, యొనర్చుచున్న ప్రయత్నములను నమృతవల్లి రామడుగునకు దెలిపెను. భవిష్యత్పురాణములో లుప్త భాగమును గానము చేయవలసినదిగా రామడుగును గోరును. కాని కాలంజరీ దర్శనాపేక్షగల యాతడమృతవల్లికోర్కెను మన్నింపలేదు.

కాలంజరి విదిశయందే యుండునని యమృతవల్లి విశ్వాసము. రాజు కామదాహమును దీర్చుటలో జయద్రథాత్మ యామెయందు బ్రవేశించి, యా కిరాతకృత్యమును నిర్వర్తించుచుండునని భావించెను. నాడు విదిశయంతయు భూమిదేవుని శృంగారవిహార క్రీడాస్థలులకు సంకేతమయ్యెను. తానింత యొనర్చుచున్నను వాసుదేవునకు దాను మానసిక పత్ని. ఒకవేళ తాను పత్ని యగుట కచటివారెల్ల నంగీక

రించినను తన ప్రకృతిరహస్యము వివాహామునకు వ్యతిరిక్తముగా నొనర్పబడినది. తాను శత్రుమారకమునకై నిర్దేశింపబడిన కన్య. ఇది జమ్మద్రధుడొనర్చిన క్రూరకార్యము. తాను విదిశకు బోవులోపున వాసుదేవ. భూమి మిత్రులకు తన ప్రజ్ఞచే గిరివ్రజ పురమంతయు, సామ్రాజ్యములోని దుర్గాధిపతులతో సర్వమనుకూలమొనర్చెను.

రామదుగుచే తదితివృత్తమును వినగోరి వాసుదేవాదుల నాహ్వానించెను. కాలంజరి మగడు పాటపాడును. అందు శ్రీమాలి పద్మినీ లక్షణాన్వితభర్తృసహితముగా నామె విదిశకు బిలిపింపబడును. రాజు భర్తృవేషధారియై యామెను సంగమింప నుద్యమించును. భర్తను సంహరించును. ఆమె తనకు గలిగిన ఘోర విపత్తునకు హఠాన్మరణము నొందును ఆ వార్త వాసుదేవునకు దెలిసి విషకన్య వలన నా రాజును సంహరింప జేయుచనియున్న పాటలో గల సారాంశము నందరు గ్రహించిరి. విదిశయందల్లే జరిగిన విషయము ననంతర మెల్లరెఱింగిరి. రామదుగు, నమృతవల్లులు విదిశ జేరిరి. మూడు నెలల యనంతరము కాలంజరీ రామదుగులు గిరివ్రజమును ప్రవేశించిరి. అమృతవల్లి వ్రాసిన లేఖలను రామదుగు తెచ్చెను. చాముండి యల్లుడయిన కాలకంఠుని వలన విదిశలోని యంతర్యుద్ధ ప్రమాదము మొదటి లేఖలోని సారాంశము, కాలంజరిలోని పిశాచమును వదలగొట్టుటకు రామదుగు గావించిన యాంజనేయోపాసన రెండవ లేఖలో గలదు. కాలంజరిచే నమృతవల్లిని రాజు పొందగోరుటకు నిర్దేశించుట మూడవ లేఖలోని విషయము, కాలంజరికి పిశాచపు బీడ దొలగించుటలో నిమగ్నమయిన రామదుగు వృత్తాంతమనంతర లేఖలోని సారాంశము.

తాను దేవభూతి యందు ప్రవేశించి రాజ్యము చేయుట సాధ్యము కాని విషయమెఱింగించుటతో తనకనుకూలమయిన యాంధ్ర

సామ్రాజ్య పాలనారంభమున తిరిగి విజృంభింతునని చెప్పి కాలంజరి నుండి నిష్క్రమించె ననయ దంతము గల లేఖ యైదవది.

అమృతవల్లి వాసుదేవుని వాడికత్తె యై దేవభూతి కడకేగెను. విషదిగ్ధమయిన యమృతవల్లితో రాజు మరణించెను. రాజైన వాసుదేవుడు పదిదినములు సంతాప దినములుగా గిరివ్రజమున ప్రకటించెను. హేతువు తెలియనిది గాదు.

## అమృతవల్లి - ఇతివృత్త నిర్వహణము

ఈ యితివృత్తమంతయు విదిశ, గిరివ్రజములను రెండు నగరములందు నడచెను. గిరివ్రజము రాజధాని. ప్రభు వయిన దేవభూతికి క్రీడానగరము విదిశ. పురాణములందు వాసుదేవుని కూతు నామము గాని, విషకన్య పేరుగాని పేర్కొనబడి యుండలేదు. నవల యందు శ్రీమాలి, అమృతవల్లి యను పేళ్లు వీరికి వ్యవహరింప బడెను. అనుస్యూతమయిన జయద్రథ పాత్ర యిందును గలదు. జయద్రథుడీ నవలయందు విదురుని సోదరుని శరీరముతో పరకాయ ప్రవేశ మొనర్చెను. విదురుడు ధర్మ ప్రవృత్తికి ప్రతీక. భారత మండలి విదురుని వంటివాడు. దుష్టస్వభావము గలిగిన జయద్రథుడు విదురుని సోదరుని మరణము బాల్యమందే సంప్రాప్తించుటం జేసి యాజీవుని స్వభావ మభివ్యాప్తముగాక జయద్రథుని స్వభావమే ప్రకటితమయ్యెను. రచయిత నవలయందు పురాణేతివృత్తము ననుసరించి విషకన్యచే ప్రభు సంహారము, వాసుదేవుని రాజ్యస్వీకార మను ప్రయోజనములు సాధింప వలసియున్నది. "అశ్వమేధ"మను నవల యందును పరిస్థితి యిట్టిదే కాని ప్రయోజన భేద మందున్నది. ఆ నవల యందున్న మౌర్యులలోని చివరి రాజు బృహద్రథుడు కాముకుడు, వృద్ధుడు. ఆతని పుష్యమిత్రుడు సంహరించెను అది ప్రత్యక్షవధ.

ఇచట వాసుదేవుడు విషకన్యచే రాజ మరణము సంఘటింప

జేసెను. ఈ వధ పరోక్షము. రాజుతన మంత్రియైయున వాసుదేవుని కూతునే వాంఛించెను. వాసుదేవుని కూతును గురించి తెలియ జేయు టకు గావలసిన పాత్రనారంభము నుండి కవి సోదేశ కత్తె 'కాలంజరి'లో రూపొందించెను. కాలంజరి భూత భవిష్యద్వర్తమానములు దేవతాను గ్రహముచే పలికెడిది. ఆమె యాత్మనధఃకరించి జయద్రధు డామె నావేశించును. జయద్రధుడా కాలంజరి వలన తనకు గావలసిన కార్య మును సాధించుకొనెను. ప్రకృత నవల యందు జయద్రధుకు సాధించిన ప్రయోజన మేమియులేదు. తన మతమునకో, తన విశ్వాస మునకో, తన మార్గమునకో అనుకూలమైన రాజ్య వ్యవహార నిర్మాణ దక్ష డెవ్వడును రాజ్యమును స్వీకరింపబోవుటయులేదు. రాజ్యము నిర్వ హింప బోవువాడు వాసుదేవుడు. బ్రాహ్మణ వర్ణమునకు జెందినవాడు. ఉత్తమ సంప్రదాయానుసారి.తన కేవిధముగను నాత డుపయోగపడడు. కాని రాజ్యము మాస్వ కానగుట యందే యాతనికి పరమోత్సాహ మున్నట్లుగా పలికినవాడు జయద్రధుడు. కనుకనే కాలంజరిపై తనయాధి పత్యమును కొనసాగించుకొని, యామె నటనుండి లేవదీసికొని విదిశా నగరియందు నివసింప జేసినాడు నగరిలో నితర చోటులందుగల యంద గత్తెల పేళ్లను కాలంజరిచే బలికించి రాజుయొక్క కాముకత్వమును బరాకాష్ఠ కెక్కించి పురాణములందు ప్రవచించిన 'ఆబాల్యాత్ కామ త్పరః' యను వాక్యమునకు సామర్థ్యమును గల్పించినాడు. శ్రీమాలి, అమృతవల్లి వీరి భవితవ్యమును గురించి కాలంజరి జెప్ప దలంచియు నది సాధ్యము కాకపోవుట వారియాత్మల యౌన్నత్యమును కవి చెప్పకయే చెప్పినట్లయ్యెను. వారు కూర్చుండిన లేడి,పులి చర్మ ముల ననుసంధింపబడిన జీవుల మరణ విధాన మాధారముగా వీరిజీవిత ములు జరుగ వచ్చునని యూహచేసి కాలంజరిచే చెప్పించుట, రచ యిత యారంభమునుండి వారి మనః ప్రవృత్తులను పాఠకుల హృదయ మున హత్తింప జేయుటకే యను నంశము విస్మరింపరాదు. శ్రీమాలి

తన పాతివ్రత్య భంగ భయముచే తుది శ్వాస పీల్చుననియు, తానొక కక్షతీర్చుకొను నిమిత్తమీ జీవితము సాగించి దానిని నెరవేర్చి మరణించుమనని యమృతవల్లికి కాలంజరి చెప్పినమాటలు, కాలంజరి కడకు వెళ్లుటకు మున్నే విదురుడే వీరిస్వరూప నిర్ణయముచేస శ్రీమాలి లేడి వంటిదని, అమృతవల్లి చిఱుతపులి వంటిదని చెప్పగల్గెను.

రామదుగు పాత్ర కవి కల్పితమే. కాలంజరికి భర్త ఈతడు. పురాణములలోని రాజవంశముల ననుస్యూతముగా సాగెడి సన్నివేశములున్న పాటలు పాడి జీవించును. శ్రీమాలి వాసుదేవుని కూతురన్న విషయము వినిన వెంటనే కాలంజరి నిర్వెర పోయెను.అట్లెందుకు జరిగెనో యమృతవల్లి కంతుబట్టలేదు. పురాణములను వెదకించినది కాని అందు దనకు కావలసిన యుదంతము లభింపలేదు.దేవభూమిమరణ మెట్లు సంభవించెను ? శ్రీమాలి తండ్రి వాసుదేవు డనగనే కాలంజరి నిశ్చేష్ట యగుటకు గారణమేమి ? వాసుదేవుడు మగధకు ప్రభు వెట్లయ్యెను.? ఇవి యామెకు ప్రధాన సమస్యలు. పురాణములలో నా భాగము ఛిద్రమయ్యెను. కాలంజరి కానరాలేదు, రామదుగు దేశద్రిమ్మరి యయ్యెను తుదకు రామదుగు వల్లనే తత్సన్నివేశము వినవలసివచ్చెను. కవి ఈ పాత్ర నెంతయో సునిశితముగ జిత్రించినాడు తుదకీ పాత్రలేనిదే యమృతవల్లి పాత్ర ప్రయోజనము నిర్వహింప లేని స్థితికి వచ్చునంత దనుక రచయిత దీసికొని వచ్చి పాఠకుని యుత్కంఠను బెంచినాడు.

శ్రీమాలి భర్త శ్రీవత్సలాంఛనుడు. లక్ష్మీనారాయణ దాంపత్య సదృశము. శ్రీమాలి యెట్లు విదిశకు బోవగల్గెను ? దీని కొక చక్కని ప్రాతిపదికను కవి నిర్మాణము చేసెను. ఆ పాత్ర కొక వైశిష్ట్యమును కవి కల్పించెను. అతడొక వాస్తు శాస్త్రవేత్త. నగరగ్రామ గృహ నిర్మాణ దీక్షాదక్షుడు. విదిశానగరమును నాటియవసరమున కనుగుణ

మున దీర్చిదిద్దు నావశ్యకత రాజునకు గల్గెను. ఆతనిని సతీసమేతముగా విదిశకు పిలిపించెను. శ్రీవత్సుని జంపించెను. రాజామెను శ్రీవత్సుని వేషముననే సంగమింప నిచ్ఛగించెను. శ్రీవత్సుని వేషమున నున్న తుచ్ఛుడైన ప్రభువును శ్రీమాలి గుర్తించి తనకు దానాత్మార్పణము గావించుకొనెను. దీనిని పాఠకులు విశ్వసించుటకై యిట్టి సన్నివేశములు పెక్కువరకు జరిగినట్లు రచయిత వరుసగా పేర్కొనుచుండెను. రాజు కోరిన యువతి పతిసమేతయై విదిశకు వచ్చును. ఏదియో నెపమున నాతడు సంహరింపబడును. అతని ఆస్తులను ప్రభుత్వము స్వాధీన మొనర్చుకొనును, ఆమె ప్రభువుచే స్వీకరింపబడును. ఈ సంప్రదాయమే శ్రీమాలి యందును నన్వయింపబడినది. పురాణములో పేర్కొనబడిన యంశమున శోకసాధక విధానమును రచయిత కల్పించి దానికొక పూర్ణత్వమును సాధించినాడు.

పురాణములలో నమృతవల్లియే లేదు. ఆమె వారాంగన విషకన్య పూర్వము రాజుల కడ నిట్టి విషకన్యలు ప్రత్యేక ప్రయోజనమున కయి సిద్ధపఱుప బడెడివారు. శత్రువధ కొఱకై యిది యొక సాధనముగా నుండెడిది చంద్రగుప్తుని సంహారార్థమయి రాక్షస మంత్రిచే విషకన్య ప్రయోగింపబడుట సుప్రసిద్ధ విషయము.

విషకన్యను గుఱించి, విషము మానవ శరీరమందు నల్పాల్పముగా సిద్ధము చేసి విషపూరితమయిన మనుష్యునిగా నొనర్చుటగుఱించి అగద తన్త్రమందు—

> ఆరభ్య జన్మతో యస్యాః ఆహారో విషమిశ్రితః।
> దీయతే విషకన్యా సా తయా యోగాన్ మృతిర్భవేత్॥ 46

ఏ కన్యకు నారంభమునుండి అనగా జన్మించి నప్పటినుండి విషమిశ్రమయిన యాహార మీయబడునో ఆ కన్య విషకన్యయయి ఆమె యోగముచేతనే పురుషుడు మృతి చెందునని కలదు. ఇంకను—

హన్తి స్పృశన్తి స్వేదేన గమ్యమానాచ మైథునే।
పక్వం వృన్తా దివఫలం ప్రశానయతి మేహనమ్। 47

తాకినను, స్వేదమునను, మైథున క్రియ చేతను విషకన్య పరముగా పండినపండు డుల్లినట్లుగా మేహనము శరీరమును వీడును. అనగా మరణించును. కనుక లోకములో నిట్టి సంప్రదాయములు ప్రాచీనమునుండి యున్నవి. ప్రత్యేకముగా నీ విద్యలు ప్రభువుల కత్యంత సమీచీనముగా నుండెడివి. శత్రునిబర్హణము కొఱకు నిట్టివి ప్రయోగ సాధ్యములుగా నుండెడివి, కామినికి లొంగని పురుష పుంగవు డెవడుండును ? కాని మన నవలలో నీ యమృతవల్లి వీతప్రియోజనార్థమై వ్యవహరింపబడి ప్రభువుల పాలనలోనున్న విష కన్య కాదు. తాను జయద్రథోపజ్ఞముగా నిట్టి క్రూరమయిన యభ్యాసము గావించినది. అట్లాబాల్య ప్రభృతి నీ ప్రయోగము నా జయద్రథుని యొద్ద నభ్యసించినట్లు సయితము పాఠకులు ముందుగా నెఱుంగరు. వాసుదేవుని ప్రజ్ఞయంతయు విషకన్యోపజ్ఞముగనే నడిపించి, వాసుదేవుని మహోత్తాల పాత్రగ, ధర్మరాజ్య స్థాపన కనువయిన మనీషిగ నవలయందు చిత్రించినాడు, వీతన్నిర్వాణమానకు కలియుగ రాజ వృత్తాంత మందలి విషకన్యా గాథను సద్వినియోగ మొనర్చుకొని రచయిత యీ నవలను కావ్యముగ నొనర్చినాడు, కావ్య ప్రయోజనములో దుష్టశిక్షణకు ప్రధానస్థానము కదా !

## పా త్ర చి త్ర ణ ము

### అ మృ త వ ల్లి

"ఏమే ! శ్రీమాలీ నీకెప్పుడు నట్టి యూహలు వచ్చుచున్నమాట. నీకు విరోధు లెవరు ? ఎవరెవరికి నీ వపకారము చేయనెంచుచున్నావు ? వారిపేరులు నాతో చెప్పుము. నేను వారికపకారముచేసి పెట్టెదను." 16

"నీవు నాకు విషభోజనము నేర్పినదిందులకా !"

(జయద్రథామృతవల్లుల సంభాషణము.)

ఈ నవల యందలి యమృతవల్లి విషవల్లి కాదు. స్నేహప్రియ: శ్రీమాలికి, శ్రీమాలి తండ్రియైన వాసుదేవునకు, వాసుదేవుని భార్యకు: బిడ్డకు పరమాప్తురాలు. ఈమె లేనిచో వారి మనుగడయే సాగవను నట్లుగా వారింట ప్రవర్తించినది. శ్రీమాలికి మొదటగా విపత్తు శంకించి నదీమెయే. శ్రీమాలికి విపత్తు వచ్చినచో, నది శత్రు సంబంధ మయిన దయినచో,నది కాలంజరి చెప్పిన దాని వంటిదయినచో, దానిని నిస్సంకోచముగా దీర్చి పెట్టెద ననుచు తానాజన్మాంతము శ్రీమాలి కొఱకై బ్రహ్మచర్య వ్రతమును బాటింతునని ప్రతినచేసిన త్యాగశీలి. ఇది బహిరాంశము. అయినను తానెవ్వరిని వివాహమాడును ? తనస్థి తనకు దెలియును, తాను విషకన్య. పెండ్లియాడిన దాంపత్యమెట్లు కుదురును? వాసుదేవుని వాంఛించినది. వాసుదేవుడేక పత్నీవ్రతుడు. వాసుదేవునకు మనసాతాను సతి అట్లే జీవితాంతము తన యధికారము వాసుదేవు నింట. బయట సాగించినది. అట్టి పాత్ర యొక విచిత్రమైన వినూత్నమైన, మనో విశ్లేషణాత్మకమయిన పాత్ర. భూమిమిత్రునకు రాజకార్య నిర్వహణమునందు ప్రోత్సాహము నిచ్చి సర్వ శత్రు నిర్భేద్యముగా గిరివ్రజము నొనర్చి భవిష్యద్రాజ్య సుస్థిరతకు, పటిష్ట తకు, కుశలతకు వాసుదేవమహారాజునకు సర్వానుకూల సామర్థ్యమును పాదుకొలిపిన రాజకీయ చతురమతి. కాలంజరీ రామదుగుల జీవితమును సుసంఘటితముగా నొనర్చుటకయి జయద్రథుని పథకమును ఛేదించి వానిని కాలంజరినుండి వెడలనడిపి రామదుగునకు ధైర్యమిచ్చి వానిని దుష్టుడయిన జయద్రథుని బారినుండి రక్షించిన దయాహృదయ. తాను విషదిగ్ధ శరీరి యయ్యును ప్రేమకు కొదువ లేని మనసు గలది. వాసుదేవుని ప్రేమించినది, ఆ ప్రేమకు ప్రాకట్యస్థితిలేదు. వాసుదేవుడేక పత్నీవ్రతుడగుటచే,తాను తన శరీరముచే నాతనికి బనికిరాదు, ఈ విధ మయిన మానసిక సంక్షోభము ననుభవించి యీ కుటుంబపు పగ దీర్చుటకై కంకణము గట్టికొని ప్రభువయిన దేవభూతిని తన యాలింగ

నమున బంధించి వానిని యమసదనమున కనిపి,తాను గూడనదే క్రోధం జనిత కారణ జన్మురాలు. వేయేల! ఈ నవలయందు అమృతవల్లి లేనిచో నే సన్నివేశము లేదు నవలకు రక్తిలేదు. నవలకు నాయకు రాలన నమృతవల్లియే. అమృతమనగా విషమని నర్థము గలదు. విషమను నర్థము శత్రువులకు గావచ్చును. శత్రుసంహార మొనర్చిన యీమెకు మృతత్వమెక్కడిది? ఆప్తుల కామె యమృతత్వమే దర్శన మిచ్చును. కనుక నే నవలకు నాయిక యయ్యెను.ఆ నామము తోడనే నవల రచింప బడెను. ప్రసిద్ధమయిన పురాణములందు ప్రాధాన్యము లేని యొక పాత్రకు నవలయందు ప్రాధాన్యము కల్గించి, ఆ పాత్ర లేనిచో కథాగమనమే మృగ్య మగు నను నట్లుగా నాపాత్రను దీరిచి, కేవలమొక యాదృచ్ఛిక పాత్రగా నుండవలసిన విషకన్య నవలలోని యన్ని పాత్రలకు తలలోని నాల్కవలె మెలగి శత్రు నిరాస మొనర్చి రొక నూత్న వంశమును మగధ రాజ్య సింహాసనమున నధిష్ఠింప జేసి తానుమాత్ర మమరజీవియై యమృతత్వమును ప్రోదిజేసికొనిన జీవిగా పాఠకుల మనసున చెరగని ముద్రవేయు విధమున మలచిన రచయిత శ్రీ విశ్వనాథ ప్రతిభను గురించి చెప్పవలసిన దేముండును?

సారాంశమేమన :- 1) అమృతవల్లి పాత్ర ప్రకల్పనముచే చరిత్ర యందు రచయిత సాహిత్యత్వమును సంప్రాప్తింప జేసినాడు. 2) దేవభూమి, వాసుదేవుడు,భూమిమిత్రుడు మాత్రమే చారిత్రక పాత్రలు. 3) పేరు లేకున్నను శ్రీమాలి, అమృతవల్లుల పాత్రలు వినూత్నముగా దీర్చి దిద్దబడి వారికొక ప్రత్యేక వైశిష్ట్యము సమకూర్చిపెట్టబడినది. 4) కల్పిత పాత్రలయిన కాలంజరి రామదుగులతో పాటు విదురుడు, జయద్రథుడు, నిశితమతి, చాముండి కాలకంఠుడు మొదలయిన వారు యథాశక్తిగ నవలకు పరిపుష్టిని చేకూర్చుటలో రచయిత తన ప్రతిభను ప్రదర్శించినవాడయ్యెను. ఇవి కేవలము ప్రయోజన సాధనాపేక్షయే గాక సహృదయ ప్రరోచనాపేక్షగూడ కల్గినట్టివి.

జయద్రధుడు :- అనుస్యూతమయిన పాత్ర యయ్యెను, నిందు విశేషప్రాభవము లేనివాడు. తనకుగా తాను సాధించినదెద్దియును లేదు. సాధించినను దానివలన ప్రయోజనమేమియు సమకూరలేదు. ఆ విషయ మాత డెఱుగును. విదురుని సోదరుడు బాల్యముననే మరణమును చవి జూచెను. మృతకళేబరమున నీ జయద్రధ జీవుడు ప్రవేశించెను. నాటి నుండి యీ శరీరమున నున్న విదురుని సోదరుడు వేరు. వాని వర్తనము వేరు వాని జీవనము వేరు. ఆ రహోవర్తన మెవ్వ రెరుంగరు. కొంత గాకున్నను కొంతయైన నెరింగినది యమృతవల్లి. వీనికడనే యీమె విషౌషధీసేవ యొనర్చి విషకన్యగా రూపొందినది.

మురారి కూతు విషయము బాహిరముగానిచో నీ జయద్రధుని దుర్వృత్తిగాని, యాతని మరణముగాని సంభవించెడిది గాదేమో, అప్పుడు మాత్రమే యమృతవల్లికి వీనినైజము తెలియదగిన యవకాశము సమకూడినది. మరణించినను నా జీవుడు స్వస్వరూప జ్ఞానము గలిగిన వానివోలె నున్నాడు. పోయి కాలంజరి శరీరము నాశ్రయించెను, ఆమె యాత్మ యందధికృతుడయ్యెను. తానే కాలంజరి యయ్యెను. ఇట్లు 'ధూమరేఖ' యను నవల యందును కాశీరాజు యొక్క యాత్మ యందధికృతుడయి, రాజు తానేయై యాతని కుమారుడయిన శిశునాగుని మగధ సింహాసనాధిష్ఠితుని జేసెను. ఇదియు నా నవల యందు వలె వైరము సాధించి పెట్టుట వంటిదే. జయద్రధుని యొక్క స్వరూపము, లక్ష్యము ప్రకటించెడు సంభాషణమును రచయిత విదిశలో నమృతవల్లితో నేర్పాటు చేసెను. తన లక్ష్యమును గురించి చెప్పెడి మాటలు, "కాలమునే దొంగిలించును. భగవంతుడు కాలస్వరూపుడందురు గదా! కాలమును వంచించుట భగవంతుని వంచించుటయే. మాది భగవంతుని మీది పగ. మాది పురాణవైరము. నేను వెసలిపోవుచున్నాను." అని పల్కెను. దీనికై యాతడు కొన్ని జన్మములనుండి యత్నము చేయుచున్నాడు. రాముడుగు వీని వృత్తాంత

మును జెప్పుచు- 'బార్హ్వద్రధులలో చివరివాడైన రిపుంజయుని భార్యను బట్టకొనెను. ప్రద్యోతవంశము వచ్చెను, శిశునాగ వంశము నావహించెను. ఆ వంశము వచ్చెను.' నందరాజ్యమునకు, మౌర్యరాజ్యమునకు వాని ప్రసక్తి యక్కఱ లేకపోయెను. పుష్యమిత్రుడు రాజ్యమునకు రాబోగా వాడుత్తర జ్యోతిష సింహపురాది యవన రాజ్యముల యందు విచిత్రతాండవము చేసెను. నందమౌర్య రాజ్యములయందు వాని యవసరము లేకనే నాస్తికమయిన బౌద్ధము విజృంభించినదని తాత్పర్యము. ఇట్లు జయద్రధుని పాత్రను ప్రత్యేక లక్ష్యముతో నను స్యూతముగా కొనసాగించుచు రచయిత ప్రకృత కాలమున చెలరేగుచున్న నాస్తిక వాదమును నిరోధింప యత్నించినాడు.

## విశేషాంశములు

1) సన్నివేశానుగుణమైన వర్ణనలు :- వర్ణనలు కథానుగతికి దోడుపడవలయును. వాని కవిగానుండినచో నవి రసభంజకము లనుట సత్య సమ్మతము. కాని వర్ణనలు లేని నవల రసము తీసిన ఇక్షు ఖండమువలె పాఠకులకు చవి నీయదు. ఈ దృష్టితో గాంచినచో శ్రీవిశ్వనాథ యీ నవల యందుచితమైన రీతియందే వ్యవహరించినట్లు మనము నిర్ణయమునకు రాగలము. ఒకపాత్రనుగాని సన్నివేశమును గాని వివరించు పట్టుని నీవర్ణనలు శోభనొసంగును.

కాలంజరి ఒక సోదెకత్తె. ఆమె రూపు పాఠకుల హృదయమునలరింప వలయును. మొదటగా నామెను గాంచగనే నెవరి రూపు గాన్పించునో దానిని జెప్పెను. "ఆటవికురాలి వలె గన్పించుచుండెను" అని యారంభించి ఆమె ధరించిన యుడుపులు, హస్త, పాద, శిరో, హృదయ భూషణములు, వేణీ వర్ణనము, వానికి సంబంధించిన సౌందర్య వర్ణనమును వరుసగా వర్ణించెను. ఇది స్వభావోక్తికి ప్రతీకము. సూక్ష్మ పరిశీలనమునకు సయితమిట్టివాని నుదహరింప నగును. ఇది నవల పురోగతికి రసప్రపోషకమే యగును గాని రసభంజకము గాజాలదు.

"ఆమె ధరించిన దుస్తులు ముదుక ఎఱ్ఱని గుడ్డలు, ఆమె పాదము లందు, హస్తములందు రాగితో వేయబడిన భూషణములు కలవు . ." అభరణములను గురించి "వానిలో నొక్కటియు వెండితోగాని బంగారముతోగాని చేయబడినవి లేవు" (ఉన్నచో నామె యాటవికురాలని వర్ణించినదానికి విరుద్ధ మగును గదా) ఆమె సౌందర్య సౌష్టవమును గుఱించి యొక్క మాటలో ప్రదర్శించెను. ఆమె మొగమున గల కుంకుమ బొట్టెంత కొట్టవచ్చుచున్నదో యామె శరీర సౌష్టవ మంత కొట్టవచ్చుచున్నది."(10)

అక్కడనుండి వరుసగా వర్ణించిన యా ప్రదేశము, గుడిసె అందలి లోపలి భాగము, అందేమూల యే వస్తువున్నదో లోనికి బోయి చూచి పరిశీలించిన వానివలె నుండవలసిన యొక్కవస్తువయినను వదలక వర్ణించిన యా పరిశీలనాశక్తి మనోహరము.

పాత్రను రూపు కట్టించుటలో శ్రీవత్సుని పాత్ర (సౌందర్య వర్ణనము) "పెండ్లి కుమార్తె భర్తపేరు శ్రీవత్సలాంఛనుడు. సులభముగా శ్రీవత్సుడందురు. లేనిచో లాంఛను డందురు. లాంఛనుడన్న మాటయే విరివిగా నున్నది. అతడు సర్వ పురాణజ్ఞుడు రాజనీతివేత్త, లౌకికమైన చదువు చదివినవాడు. అనుచు నాతని రూపము నిట్లు వర్ణించెను. అతడు మిక్కిలి యందగాడు. వాక్చమత్కృతి గలవాడు. చక్కని పలువరుస గలవాడు. అతని కనుబొమలు పలుచని యాతని చెక్కిళ్ల మీద కొనలు తీరి సొంపుగా వంపుతిరిగిన మీసపు మెలికలు వాని కనురెప్పల యందున్న సన్నని కండచేత వచ్చిన యొక విధమైన యరవాలిన చూపులు వెలయించిన లక్షణము.

శ్రీ విశ్వనాథ ఏదైన నొక అపరిచిత విషయమును కథా సందర్భమున చెప్పవలసి వచ్చుచో దాని మూలమును వెకలించి విస్తరించును. దీనిపయి నింక నెవరు చెప్పినను తక్కువయే యనునట్లుగా

నుండును. ఇందులకు ప్రధానమయిన యుదాహరణములు శ్రీవత్సుని వాస్తు శాస్త్ర విజ్ఞానమునుగురించి,శాస్త్రముయొక్క స్థూలపరిశీలనము-(197) వ్యాకరణకర్త, మహాభాష్యకర్తలయిన పాణిని పతంజలుల వృత్తాంతములు ( 147 )

దీర్ఘ సమాసములు శ్రీ విశ్వనాథ కెంతయో యిష్టమని వేరుగా నుడువ నక్కరలేదు. కాని నవలయందు వాని యావశ్యకత తక్కువ. మహాకవియైన రచయిత యగుటచే వానివాని యుచితజ్ఞత ననుసరించి సంఘటిత పఱచును. అమృతవల్లికి నాసు దేవుని పయిగల రాగవిషయము-(108) "ఆమె మనస్సు నెదుట నొక విలక్షణమైన, వినూత్నమైన, విచిత్రమైన, స్వచ్ఛమైన, రేయిక తెల్లని తెర పరమ మనోజ్ఞముగా, హృదయాభిరామముగా, మృదువాయు తరంగ పరామృష్టముగా పశ్చాత్సిత బహ్వాప్సరో నృత్యవేళా సమున్మీలిత భ్రూభంగవిలాస దీర్ఘకృత నేత్రాంత రమణీయతా ప్రతిఫలనము జరుగుచున్నట్లు భాసించుచుండెను."

ఇందు మొదటి భాగము తెరపటము యొక్క స్వచ్ఛత, అందు ప్రతిఫలించిన దృశ్య ముత్తర భాగముగా రచయిత విభేదించిన తీరు గానవచ్చును.

## 2. పదబంధము

అమృతవల్లిని గురించి జయద్రథుని వాక్యములు - అమృతవల్లి ఆత్మలో గ్రహకల్ప, కాని మనస్సులో నమృత కల్ప. శరీరముచేత పారిజాత సుమకల్ప.ఆమె జీవ లక్షణముచే నీయందు దాసకల్ప (252)

ఈ పదబంధము, శబ్ద సౌకుమార్యము, చిక్కని భావము, అర్థగాంభీర్యము యెంతహృదయంగమముగా పాఠకుల నలరించునో చదువరు లెరుంగనిది కాదు.

"శ్రీమాలి నడచుచుండగా లేడి నడచి నట్లుండును' (17)
అమృతవల్లి నడచుచుండగా చిఱుతపులి నడచి నట్లుండును."

ఇరువుర నడకలోని భేదమును చెప్పవలయును. అది జంతు పరముగాజెప్పియుచట యిరువుర స్వభావ వైయర్థ్యము నుసాధించి యొక మెఱపు జూపినాడు. జయద్రథుని స్వరూప స్వభావములను సయిత మిట్లు జంతు పరముగనే జెప్పెను. "ఆతని కన్నులు జూచినచో నడిరేయి నట్టడివిలో చంపిన మృగ మాంసమును తినుచున్న పులికన్నులలో జూచి నట్లుండును. (83)

మఱియొక విధముగా నాకన్నులను వర్ణింపలేము. అందు తీవ్రత, ఆతురత, లక్ష్య భావము. జుగుప్సావహమయిన స్థితి, యొరులను గాంచి తాను భయపడుట, తన్నుగాంచి యితరులు భయపడుట, రాత్రి యనుట చేత నాతని తామసిక ప్రాభవావేశము, మృగమును జంపి దినుననుటలో జ్ఞాన, ధర్మముల పయి నాతనికి గల తీవ్ర వైరము లిందు స్పష్టమగును. ఇట్టి యర్థగాంభీర్యముగల వాక్య వైశారద్యముతో నీ రచయిత నవల యందు తాండవించును.

పాత్రల వైవిధ్యమును ప్రసంగించుచు గూడ నేవం విధమయిన యలంకార సత్కారమునే వ్యక్తపఱచును. "విదురుని మొగము జూచినచో బూర్ణిమ చంద్రుని జూచి నట్లుండును" "వాని(జయద్రథుని) మొగము జూచినచో నమావాస్య చీకటిలో దీపము వంక జూచి నట్లుండును. దీనిని అమావాస్య, పౌర్ణమీ నిశాకాలముతో బోల్చి చమత్కారమును సాధించెను. ఇందు మొదటి వాక్యము నైర్మల్యము నకును, రెండవవాక్యము మాలిన్యమునకును సంకేతముగా రచయిత స్పష్టము చేసినట్లు విదితము. కనుకనే విదురుని జూడ బాలికలకు నాహ్లాదము. జయద్రథుని దర్శింప భీతి.

పాత్రల పేళ్లలోని వైచిత్ర్యము :- రామడుగు, కాలంజరి, నిశితమతి, చాముండి, కాలకంఠుడు. ఇందులో రామడుగు- అనగా రామపాద మనియే గావచ్చును అది ఆంజనేయునిదే యగును, కనుకనే బ్రహ్మరక్షస్సును తన భార్యనుండి వదలించుటకు ఆంజనేయోపాసన మొనర్చినాడు రామడుగు, అయన పిశాచగ్రహఘాతుకుడు గదా !

# 8. పులి ప్రముగ్గం

## 1. చారిత్రక పూర్వరంగము

ఆంధ్రుల చరిత్ర యతిప్రాక్తనమని భాగవత ప్రమాణముతో మొదటి నవలయందు బ్రదర్శితమయ్యెను. ఈ నవలయందు మగధ నాంధ్రులేలిన యంశమును గుఱించి ప్రసంగింప బడెను. కాణ్వవంశము లోని చివఱి ప్రభువు సుశర్మకు భృత్యుడు, సేనానియగు శ్రీముఖుడు[1] 'రాజైన సుశర్మను జంపి తాను మగధనేలును. ఈతడాంధ్రుడు. ఈత నితో మగధయందుఆంధ్రవంశ పాలన మారంభమయ్యెను. శాతమును వాహనముగా గల్గిన చిహ్నముతో రాజ్యవ్యవహారములు నిర్వహింప బడుటచే వీరి వంశము శాతవాహన వంశమయ్యెను. వీరు 32 రాజులు. 506 సంవత్సరములు వీరిపాలన కాలము. అనగా క్రీ. పూ. 833 నుండి క్రీ పూ. 327 వరకు నని యర్థము. వీరి తరువాత రాజ్యమును గుప్తులు పాలింతురని పురాణములు పేర్కొన్నవి.[2] శాతవాహనులుగా వీరు మగ ధను బాలించిన కాలమున బ్రసిద్ధినొంది, యనంతరము ప్రాంతీయ పాలన మును జేపట్టినట్లు ఆర్. జి. భండార్కరుగా రూహించుచున్నారు.[3] శాతవాహన పాలనమును గుఱించి సుక్తాంకరు గారు రెండు మార్గము లను నిర్దేశించిరి. శాతహావాను లాంధ్రదేశమునకు జెందిన వారుగా

---

1. హత్వాకాణ్వం సుశర్మాణం తద్భృత్యవృషలో బలీ।
గాంభోఙ్యన్ధ్రి జాతీయః కాంచిత్కాలం నృసత్తమ (భాగ. 12-1-22
(శ్రీముఖుని, శిశుకుడని (మత్స్య), సింధుకుడని (బ్రహ్మాండ)
బలిపుచ్ఛకుడని (విష్ణు) పురాణములలో వ్యవహారము కలదు.

2. ఏతే ద్వాత్రింశ దాంధ్రాస్తు భోక్ష్యన్తి వసుధా మిమామ్।
శతాని పంచపూర్ణాని తేషాం రాజ్యం భవిష్యతి।
తేషాంతు సంస్థితే రాజ్యేభూమిర్గుప్తాన్ గమిష్యతి క రా. వృ.

3. Early History of Duccan. R. G. Bhandarkar P. P. 29-31

రనుచు,నొకచో నట్లే చెప్పవలసి వచ్చుచో,వీరు సిముకుని కాలము నకు ముందే గోదావరీ ప్రాంతమునుండి విడివడి పశ్చిమ భారతమున స్థిరపడి యుండురనియు, ననంతర మీ సిముకుని వలన రాజ్యస్థాపనము జరిగి యుండునని చెప్పుటయొక మార్గము. మొదటగా నొకమహాసామ్రాజ్య ప్రభువునకు భృత్యులుగా నుండి యనంతరము స్వతంత్ర రాజ్యమును స్థాపించి యుండిరని చెప్పుట రెండవమార్గము.[4]

పశ్చిమ భాంతమని పేర్కొనుటంగో మహారాష్ట్రములోని పైఠను వీరి రాజధాని యని నిర్దేశించు భావమే యైయుండును. కాని కాణ్వులు మగధనేలుట,వారిని జయించి యా సామ్రాజ్యస్థానమును వీడి పైఠనును చేపట్టిరనుట సమంజసము కాదు. అనంతర శాతవాహనులకు (Later Sathavahanas) నీ పాలనమును చెప్పవచ్చును.

ప్రాచీన శాతవాహనుల కాంధ్రదేశముతో సంబంధము లేదనుటకీ క్రింది యంశము లుపకరించును.

1. ప్రాచీన పాలకులైన శాతవాహనుల శాసనములు, నాణెములు. నానాఘాట్, నాసిక్‌లలో లభించుట.
2. శాతకర్ణికి సమకాలికుడయిన ఖారవేలుని హాతిగుంఫ శాసనము కళింగలోనిది కాని యాంధ్రదేశ మందలిది కాకపోవుట.
3. గౌతమీ పుత్ర శాతకర్ణియనంతరము పాలించిన వాసిష్ఠీ పుత్ర పులుమావి కాలమునకు సంబంధించి యాంధ్రదేశమున దొఱకిన మొట్టమొదటి చారిత్ర కాధారము.

పై కారణములచే ప్రాచీన శాతవాహనులు ప్రాభవమును గోల్పడి, శ్రీకాకుళము, ధాన్యకటకములను రాజధానులుగ నొనర్చు కొని యాంధ్రమున ప్రాంతీయ పాలకులైరని చెప్పుటకు వీలగుచున్నది. ప్రకృత చరిత్రలో నిట్లుగాక మగధ పాలకులనే 1వ శతాబ్దికి దింపి, వారును వీరును నొకటియే యనుచు నొక యస్వ్యస్త విధాన

4. House of the so Called Andhra Kings V.S.Suktankar PP 21-24

మును నిర్ణయించుట ప్రామాదికమని చెప్పవలెను. కనుకనే ఈ యాంధ్రుల చరిత్రను బరిశోధించిన వారిలో D. S. Naidu గారు Andhra Satavahanas' అను గ్రంథమున నిట్లువ్రాసిరి.

The problem of the Origin and home land of the Satavahanas has suggested the attention of several Scholars for the Past eight decades as yet no final Conclusion has been reached on the subj ect.

## పులిమ్రుగ్గ - ఇతివృత్తసంగ్రహము

నాడు మగధను కాణ్వవంశములో జివఱ ప్రభువు సుశర్మ పాలించుచుండెను. ఈతనికి శ్రీముఖుడు మహాసేనాధిపతి. ఈత డాంధ్రుడు, ఒకనాడు తోహారు అను వనాటుడు తానొక వింతయైన వనేచరమునకు గల పాదచిహ్నములను దర్శించితిననియు, నాజంతువు నకు ముందు పాదములు పులిపాదముల వలెను, వెనుక పాదములు మానిసి వలె నున్నవని సేనానితో ప్రసంగించెను. శ్రీముఖుడును నా జంతు సందర్శనా కుతూహలుడై నవ్వనాటునితో రాజధానీ నగర సమీపారణ్యమున కేగెను. సూర్యోదయాస్తమయములు నమ్మహార ణ్యమందే సంభవించెను, ఏతద్విచిత్ర జంతుసందర్శనము మాత్రము సంభవింప లేదు.

చీకటి పడుచుండ నటగల నొకతటాక సమీప నిర్వృక్ష ప్రదేశ మందాగుఱుతుల నిర్వురు మొదటగా గాంచిరి. తటాకపు టొడ్డున నొక తేప యుండుట నాసేనాధిపతి కనుమానము కల్గించెను. ఆ జంతు సందర్శనాపేక్ష మిక్కుటము కాగా తోహారుతో నొకవృక్ష మధిరోహించి నా నిశాకాలమంతయు పొంచి తజ్జంతు సందర్శన మభి లషించిరి. ఎట్టకేలకు గొంతప్రొద్దు గడచిన వెనుక నా విచిత్ర జంతువు తటాకమును సమీపించి తెప్పనెక్కి పోవుచుండెను. ఈవింత కార్యమున కబ్బుర మంది సేనాపతి శ్రీముఖుడు తటాకమున దిగియాది

కొంచు నా తెప్పను వెన్నంటెను. ఒక పెద్ద ప్రవాహము నుండి యా తటాక ముత్పన్న మయ్యెను. తత్ప్రవాహమున కొక గిరిగహ్వర సమీపము మొదలు. పులిమానిసి తెప్పదిగి యాగుహాలోనికి బోయెను. శ్రీముఖుడు నాగుహకు బోయి జూడగా నొక ధూళి ధూసరిత శరీరి గానవచ్చెను. తత్పురుషుని పులి సమాచార మడిగెను, తనకు దెలియ దని వాని సమాధానము. కాని పరిస్థితి యాతడే పులి యను శంకను గల్గించుచుండెను. తోహరు తాను తటాక సమీపమున గాంచిన దృశ్య మసత్యము గాదని నిశ్చయము. స్నానార్థమా యోగి బయల్వెడల, నగ్గుహను బరిశీలింప నట వర్ణ చూర్ణములు, కౌపీనములు, కొన్ని ఖడ్గ ములు దప్ప నందేమియు గానరాలేదు. ఈ పొడులందేదియో మర్మ ముండునని వానిని బరీక్షింపగా, నాతడొక విచిత్రానుభూతికిలోనయ్యెను. బహువర్ణ సంయుతమైన రంగవల్లి కా నిర్మాణమున కీ చూర్ణము లుప యోగింపబడి తద్విధానమున నాగుహలోని మానిసి పులియగునేమో యను నొక యూహ కల్గెను. ఆ యోగి యత్ప్రయోజనాభిలాషియో తత్సిద్ధి సాఫల్యమున కేమి యడ్డంకు గలిగెనో యూహింప జాలకుండెను. అంతలో గిరికంధర సమీపాగతుడైన యోగి శ్రీముఖుని భవితవ్యమును జెప్పుచు, నాతడు మగధ యందాంధ్ర సామ్రాజ్యమును స్థాపించి, ప్రభువగునని పల్కెను. శ్రీముఖు డాతని నిశితముగా బరిశీలించు చుండగా తానీతని కడనే ఖడ్గవిద్యాభ్యాస మొనర్చినట్లు స్ఫురించెను. అయినచో నీతడే జయద్రథు డగును. శ్రీముఖున కాంధ్ర రాజ్యప్రాప్తి. తనపృష్ఠ భాగ శార్దూలత్వ మేకకాలమందు జరుగునని, రాజ్యమును తానే సంపాదించి యిత్తునని చెప్పి యా యోగి శ్రీముఖుని వీడి పుచ్చెను. శ్రీముఖుడు తిరిగి ప్రవాహము నీదికొని తోహరును గలిసి గిరివ్రజము చేరెను.

మగధచక్రవర్తి సుశర్మ విచిత్ర ప్రకృతి గలవాడు. ఆతనికి రాజ్యపాలన మందాసక్తి లేదు. ఆతడు తనకు గల స్త్రీ వాంఛను బహు

పూర్వజన్మాంతర దుష్ట సంస్కార జనితముగా భావించును. ఈతని కా మరణాంతము స్త్రీ సంగమము కావలయును. వాంఛ యన్నది మానవునిలో కంటె జంతువునందు దానికదిగా భాసించును. క్రౌర్య ద్వేషములు గల సుదతి పులియగుచో, తాను తానుగనే యుండి దానిని రమించుచో నది యచ్ఛృమగును. ఇట్టి విచిత్రమయిన యూహ చేయుచు నిది సాఫల్యమగుట కెద్ది యుపాయమని భావించును. తనకు మోక్షము కావలయును. కాని దానిని స్త్రీ వాంఛ యడ్డుకొనుచుండెను. శ్రుతి స్మృతీతిహాసాదులందు దనకుగల ప్రత్యయము దొడ్డది. కాని తన దుష్టసంస్కారము వాని దరి చేర నీయకుండెను. ఈతని రాణి పద్మ రాణి, ఈమె యాంధ్రరాజ దుహిత. శ్రీముఖునకు రాజ్య మిప్పింతు నన్న నా జయద్రథుకు ప్రభుదర్శనము చేసెను. తనకు గల విజ్ఞానము నంతయు నాతనికి దెలిపెను. పులి కన్నుల నుపమించు ప్రభువు కన్నుల లోనికి గాంచి తన తైక్ష్ణ్యమును వ్యక్త మొనర్చెను. ప్రభువు తాను మున్నూహించిన మానవజంతుసంయోగము వీనివలన సాధ్యమగునని యెంచెను. స్త్రీ యందు బరమేశ్వరీ బుద్ధిలేని తన కుపనిషన్మార్గాను సంధేయమగు మరణ రహస్య మరయుట యసాధ్యమని తా నెఱుంగును. పద్మరాణి పులియగుచో, నామెకు పూర్వ స్మృతి యుండి తానాపులితో తాను గానే రమింపవలెను. ఒకపరి పూర్వ స్మృతి విస్మృతి గలిగి యా పులి తనను గబళింప నెంచుచో నామృత్యువు తన్నెల్లెదుర్కొన నున్నదో తెలియుట యొక లక్ష్యమయి తన యాశయసిద్ధికి తోడ్పడవచ్చును. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు ప్రాణ నిర్గమనమును గుఱించి చెప్పినవి, పతంజలి ప్రాణములను నియ మించి తన్నిర్గమన మెఱుంగవచ్చునని చెప్పెను. కపిలాసురి, పంచ శిఖాదులు, జైమినీయ సూత్రములో నీప్రక్రియ యుపదేశింపబడినది. కాని తానొక నూత్న సిద్ధాంతమును వినిర్మించును. ఈ యోగి తత్సిద్ధాంతమునకు సహకరించునేమో యను నాశ పొడమెను.

శ్రీముఖు డాంధ్రుడు, చంద్ర శేఖర శాతకర్ణి కొడుకు. నాటి కార్తాంతికు లీతనిని మగధ చక్రవర్తిగా భావించుచుండిరి. ఈతనికి జయద్రథుడు గురువు. ఈతడా ప్రాంతమునకు విచిత్రముగా జేరెను. బలిమర పర్వతమున కొకపరి వచ్చిన యాంధ్రప్రభువుతో దలపడి యాతనితో నొక సమయము చేసికొని ప్రాణభిక్ష పెట్టెను. ఆంధ్ర రాజ కుమారులకు ఖడ్గ విద్యాభ్యాసము చేయించుట, తానెట్టి స్వేచ్ఛామార్గ మవలంబించినను, దానిని నిరోధింపకుండుట- ఈ సమయాంశములు. ఆంధ్రరాజకుమారులలో నొకరిని మగధ సామ్రాజ్య మందధిష్ఠింప జేయవలెనని తన తీవ్ర సంకల్పము. తత్సంకల్ప సిద్ధ్యర్థము ఖడ్గ విద్యనభ్యసింప జేయుచుండెను. ఆదేశమున తానొనర్చిన యకృత్యమున కొకయువతి గర్భమును ధరించెను. తత్కారణమున దనకు దేశనిష్కాసన దండన విధింపబడెను. శ్రీముఖునకు సింధు సంబంధమున్నటుల భావించి యాతనికిని దేశశిక్ష విధింపబడగానాతడెట్టిటో మగధ చేరి, తనకు గల యపార ఖడ్గవిద్యాచాలనముచే నా దేశపు ప్రభువును మెప్పించి మొదట సేనానియై, కొంత కొంత ప్రజ్ఞను తెలుపుచు సేనాపతి యయ్యెను.

జయద్రథుడును తనకుగల క్షుద్రవిద్యాసక్తిచే నాయా యటవీ ప్రదేశములందు దీర్ఘోపాసనలొనర్చి మానిసి పులి యగుట యను విద్యలో గొంత కొంత ఫలోన్ముఖుడగు చుండెను.ఇట్లుండగా తనవలన గర్భము ధరించిన యువతి యొక పుత్రుని గాంచెను. అతడు వింశతి వర్షప్రాయుడు, ఇన్నేండ్లు తండ్రి తద్విద్యోపాసన యందే నిమగ్నుడయ్యెను.యోద్ధ యయిన కుమారుడు తండ్రి గుణములు రానివాడు. తాతగారివలన నుపనయనాది సంస్కారములను బొంది మహామంత్ర దీక్షనొందిన సజ్జనుడు. ఒకమాటలో నీతడు కంపటిలో తామర మొలచినట్లు.తండ్రిని గాంచ వలెనని నెడి తీవ్రతపనతో నటవీ సంచారము చేయుచు నొకయాటవికునితో దీర్ఘమగు శపథములుచేసి యాతనిచే

ప్రబోధితుడై మగధ సమీపగత బలిమత పర్వతమున, దత్సమీపమున దోహరుని గలిసి వానితో నన్వేషించుచుండెను.

ఆంధ్రులలో గంగాధర శాతకర్ణి రాజవంశీయుడు. అతని కుమార్తె పద్మరాణి. ఈమె సకలశాస్త్ర మంజూషిక. మగధ యందలి సేనాపతి శ్రీముఖుడు బౌద్ధుడు, ఈ బౌద్ధమున కెదిరినిల్చి శ్రీముఖుని ప్రాబల్యమును మగధ యందు తగ్గింపనెంచి పద్మరాణిని సుశర్మ మహారాజు కడకు గంగాధర శాతకర్ణి పంపెను. సుశర్మకు బౌద్ధ, వైదికములు లక్ష్యములు గావు. పద్మరాణి సౌందర్యము ప్రధానము. ఈవిధముగా బద్మరాణి రాజునకు భార్యకాని భార్య యయ్యెను. శ్రీముఖుని సాధించుట యన్న, గంగాధరుని లక్ష్యము నెరవేరు టెట్లు ? రసైక జీవన మార్గగామియైన రాజునకు బద్మరాణి ఏమి బోధించును ? నాటి రాజులు తమ కామసాఫల్యమునకు రాచఱికపు బనులనుండి తప్పించు కొనుటకు మగధకు సమీప నగరమగు విదిశయందు నివసించుచుండిరి. సుశర్మయు విదిశయందే పద్మరాణితో నివసించును. పద్మరాణి చెలిమికత్తె పేరు చంద్రరేఖ. జయద్రథుడు సుశర్మను బరోక్షముగనైనను జంపి శ్రీముఖుని రాజును చేయ నిశ్చయించెను. అతడు రాజయినచో వైదికమతము నీఱు గారును. తన లక్ష్యము నెఱవేరును. రాజుయొక్క గాఢమయిన కోర్కెను దీర్చిపెట్టి తత్సంహార కార్యమును నిర్వర్తింప దలచెను. రాజు తన కోర్కెను పద్మరాణికి దెలిపి. యోగివలన దీనిని ఫలింప జేసికొను యత్నమును జేయ నామె వ్యతిరేకించి జయద్రథుని కుటిల నీతిని, వ్యూహమును, నెఱింగించెను. ప్రభువుమాటలను బెడచెవిని బెట్టెను. చంద్రరేఖ తానును బలిమతమునకు వచ్చుటకు రాజపరిరక్షణమునకు దాను చేతనైనంత గానొనర్చుటకు బద్మరాణియనుమతిబడసెను.

జయద్రథుడు తన కార్యక్రమమునకు రంగస్థలమును బలిమతముగా నిర్దేశించెను. తత్కారణమున నా ప్రదేశమంతయు రాజనివాసయోగ్యముగా దయారొనర్పబడుచుండెను, జయద్రథుడు రాజ

మందిరమునకు వచ్చెను. బలిమత పర్వత సమీపమున పిత్రన్వేషణ బుద్ధియైన కుమార జయద్రధుడు తండ్రిని గురుతించెను. రాజు బలిమత మున కేమి మిషతో బిలిపింప బడెనో జయద్రధుని కుటిల నీతి యత్ప్రకారము నిర్వర్తింపబడునో తెలియుటకు గుమార జయద్రధ, తోహారు లాతుర మందు చుండిరి, పద్మరాణి దర్శనమునకై వేచిన వీరికి చంద్రరేఖ గానవచ్చెను. కుమార జయద్రధుడు, చంద్రరేఖ బాల్య స్నేహితులు. వీరిరువురు సౌదర్య భావమును బరస్పరము ప్రకటించు కొందురు. ఈమె సహాయమును సంపూర్ణముగా స్వీకరించుటకు నిశ్చయించి రాజభవనములో జరిగెడి సర్వకార్యములను దోహారు వలన జెప్పిపంపవలసినదిగా నిర్దేశించి యామెను కుమారుడు వీడుకొనెను.

రాజువలన గలిగిన విపత్తును, దానికి హేతువయిన యాతని విడ్డూరపు గోర్కెను, దానికి జయద్రధుని పన్నాగమును, బద్మరాణి యవివేకమును, దోహారు వలన కుమారుడు గ్రహించెను.

పద్మరాణిని బలిగానొసర్చి యామెకు రాజుతో సమాగమము సంభవింప జేయునని యెరింగిన కుమారునకు తండ్రి కుటిల చర్యలోని యాంతర్యము రాజవధయే యని స్పష్ట మయ్యెను. జయద్రధుడు తన గదిలో నొక పులిముగ్గును, రాణి గదిలో నొక పులిముగ్గును రచించెను. రాణి పులి యయినంతనే నాముగ్గును చెరిపెను. తాను పులియై రాజును చంపెను. దీనిని గమనించుచున్న కుమారుడు తండ్రి గదిలోని ముగ్గును చెరిపివైచెను. తండ్రి గదిలో ముగ్గు లేకపోవుటను జూచి పరమదుఃఖసూచకమైన గర్జా మహాధ్వానము చేసెను. రాణి పులితో దలపడుచు నీ జయద్రధ పులి పూర్వమున్న గిరి గహ్వరమునకు బోయెను, దీనిని ముందుగనే యూహించిన కుమారుడు గుహలోనున్న ముగ్గును కూడ చెరిపెను. ఆ రెండు శార్దూలములు గుహలోనికి వచ్చెను. తండ్రి యచట గూడ ముగ్గు చెరుప బడుట గాంచి

మహాఘోరముగా, భయంకరముగా గర్జారావములొనర్చుచు నాడు పులితో బోరుచు ఒకదానితో నొకటి తలపడి యిరువురు మరణించిరి.

చంద్రరేఖ సంగతి పరమేశ్వరునికే పట్టలేదని కవి ముగింపు.

## పులిముగ్గు - ఇతివృత్తనిర్వహణము

విశ్వనాథ యూహా మేరువు అని చెప్పుటకు నీ నవల నుదాహరింప వచ్చును. మానవుని పట్టి పల్లార్చెడి వానిలో ప్రాధాన్యముగల శత్రువు కామము. మహర్షులయినవారే దీనిని లొంగదీయజాలక పోయిరి. ఇందొక రాజు దుష్టమయిన కామమునకు జిక్కి, తానుపనిషద్వేది యయ్యు, దానిని చేరజాలక, కడు విచిత్రమైన యూహ జేసి, దానికి బలి యయ్యెను.

సుశర్మయను కాణ్వరాజును జంపి యాంధ్రుడయిన శ్రీముఖుడు మగధను బాలించుట చారిత్రకాంశము. ఈ యంశమును సాహిత్య పరముగా నవల యందెట్లు నిర్వహించెనో గమనింతము. కాణ్వులలో చివరి రాజు సుశర్మ. వీరు వేదమతాభిమానులు. శ్రీముఖుడు బౌద్ధము నభిమానించును. ఇదియు చరిత్రాంశమే.

ఈ నవలను రచయిత యిట్లు రూపొందించెను.

1) కవిచే గావించబడిన యనల్పమయిన యూహ "పులి ముగ్గు" 2) కుమార, పిత్రు జయద్రథుల పాత్ర కల్పనము 3) ఆంధ్ర దేశముతో మగధరాజ్యమునకు సమన్వయ సాధనము 4) శార్దూలోన్ముఖమయిన యితివృత్త నిర్వహణము 5) సుశర్మకు మరణము సంప్రాప్తించిన విధమునకు కవి కల్పనము.

1. ప్రాచీనమునుండి యీ దేశమున ద్వివిధ విద్యలు ఉపాసింపబడు చున్నవి. సురాసుర ప్రకృతులు రెండును సృష్ట్యాది నుండి యున్నవి. సుర లనుసరించెడివి సాత్త్వికవిద్యలు కాగా నసురు లుపాసించెడివి తామసికములు, లేక తాంత్రికవిద్యలు. ఈ విద్యోపాసనచే కలుగు ఫలము

తాత్కాలికము. విపత్కరము, సద్విద్యోపాసనల ఫలము శాశ్వతము. క్షేమకరము. ఒకటి పునర్మృత్యు కారకము. మఱియొకటి యమృతత్వ హేతువు. ఈ నవల యందొక తాంత్రిక విద్యను రచయిత ప్రవేశపెట్టెను. ఆంధ్రదేశములో క్షుద్ర విద్యల నుపాసించెడి తెగ యొకటి యున్నది. "భేరీకోమట్లు, మాచాబత్తుల" వంశములోని వారి తాంత్రికవిద్యలందు సిద్ధహస్తులైనట్లు కొన్నిగాథలు ప్రచారములో నున్నవి. అట్టివానిలో నీ 'పులిముగ్గు' విద్యయొకటి. బహు ప్రతిభావంతుడైన రచయిత యగుటచే నీ యాపత్కరమగు విద్యను నవల యందు కీలకమయినదిగా సంధానించెను. ఈ పులిముగ్గునకును నా రాజునకును సంబంధము.అదియే యాతని మరణ హేతువు. ఇట్లు రచయిత కథా సంవిధాన మొనర్చెను.

వైదిక తాంత్రికవిధానములందు నీ రంగవల్లికల యలంకరణములను తత్తచ్ఛాస్త్రములు నిర్దేశించినవి. నవగ్రహార్చన చేయవలసి వచ్చుచో నాయా పీఠములందాయా గ్రహాధిపతుల నుపాసించవలెను. "తచ్చుస్మార్ద్ధే దేశే గోమయేనోపలిప్య, స్వేస్వేస్థానే శాలి వ్రీహిభిస్సికతాభిర్వా చతురస్రం, వృత్తం, తుట్యాకారం, త్రికోణ మష్టాశ్రం అర్థచంద్రాకారం వజ్రాకారం దండాకృతి ధ్వజాకృతీతి క్రమేణ పీఠాన్యుపకల్ప్య......అర్చయేత్."

శ్రీచక్రార్చనకు యంత్రమున నయ్యాకృతిని లిఖించుట విస్పష్టము.[1] ఇట్లే తాంత్రిక విద్యలందును నాయా జంతువుల చిత్రములను ముగ్గులతో జిత్రించి తత్తద్దేవతల ద్వారమున శత్రుమారకమును నిర్వర్తించుట సంప్రదాయముగా నున్నదని మంత్ర శాస్త్ర

1. బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ।
మన్వస్రనాగ షోడశదళ పద్మయుక్తమ్।
వృత్త త్రయంచ ధరణీ సదనత్రయంచ।
శ్రీచక్రరాజ ఉదితఃపరదేవతా యాః॥

ప్రవీణుఁడగు శ్రీ త్రిపురారిభొట్లవారి యనుభవము. శ్రీమద్రామాయణమునందు మారీచుడు లేడి యగుట సుప్రసిద్ధమయిన విషయము. సంకల్ప మాత్రముననే రూపధారణము జరిగినది. అష్టసిద్ధులందు సంకల్ప మాత్ర రూపధారణమొకటి. ఒక మనుష్యుఁడొక ప్రత్యేక ప్రయోజన మాశించి తద్విద్యయందు ప్రకృష్ట కౌశల్యమును పొంది యుండుట గాంతుము, ఇట్టి పులి ప్రక్రియ సాధ్యమా! యనుచో నీవిషయమై 'పెదారకట్ట' గ్రామమున జరిగిన యుదంత మిందు ప్రత్యేకముగా పేర్కొనబడుచున్నది.

"ఒంగోలునుండి కనిగిరికి పోవు మార్గములో 'పెదారకట్ట' అను గ్రామ మున్నది. ఆగ్రామమునందు గల అగసాలి వంశమున శేషయ్యగారి కుటుంబములో నీవిద్యయున్నదని వారి తమ్ముఁడైన కోటయ్యగారు చెప్పిరి. దీని విషయమయి వారింట జరిగిన విషాదోదంతమును సయితము విన్పించిరి.

కోటయ్యగారి కుమార్తె పురిటికై పుట్టినింటికి వచ్చిన కొలది దినములకు ప్రసవించినది. అనంతరము కూతును నల్లుని బిడ్డతో పయనము చేయించి యత్తింటికి బంపిరట. త్రోవలో నీయల్లుఁడు తన సతిని వారింట గల విద్యను అనగా పులి యగుటకు నుద్యుక్తురాలవు గమ్మని వేధించెనట, ఆమె ఎంత వలదనినను వినక యొత్తిడిచేసిన భర్తను దృప్తి నందించుటకును, దన కర్మ పరిపాకము సమీపించినదని భావించి కొంత యిసుక మంత్రించి బిడ్డతో భర్తకొసంగి సమీప వృక్షాధిరోహణ మొనర్ప వలయుననియు, నావృక్షము చెంతకు వచ్చిన పులి రూపములోనున్న తన పయి నా యిసుకను బోసినచో దన నిజ రూపము తనకు రాఁగలదనియు జెప్పి యటనుండి వెడలి కొంత తడవునకు శార్దూలాకృతితో నావృక్షసమీపమున గాండ్రించెనట, వృక్షము పయినున్న భర్త బెదరి యిసుకను పోయుటకు బదులు బిడ్డను వదలి వైచెనట. అనంతరమా శార్దూలము బిడ్డను దిని క్రోధముతో వేచివేచి

సమీపారణ్యమునకు బోయెను. వీడును బెగడొంది యెట్టెటో వ్యాఘ్రా వతరణ మొనర్చి తాను నిర్వర్తించిన ఘనకార్యమును సంతప్త హృదయుడై మామకు నివేదించెనట. మామయు వీని పయి గినిసి, వీని చర్యకు రోసి, ఆహారము భుజించిన యనంతర మామెను మానవిగా నొనర్ప నసాధ్యమని వాపోవుచు, దుఃఖముతో నల్లునిగూడ పులినిచేసి పంపెనట. ఆ వంశములో నావిద్య వానితోనే యంతరించెనని. కోటయ్యగారు చెప్పిరి. వారిశిష్యులు 'తెనాలి' చుట్టుప్రక్కల విస్తరించియుండిరి గాని యీ విద్యను వీరెవ్వరికిని యుపదేశింపరాదని కాళియాజ్ఞ యగుటచే నది కథలయందే నిక్షిప్త మయ్యెనని భావింపవచ్చును. పదిపదేను వత్సరముల క్రిత మాయన మరణించిరి, 'భేరీ కోమట్లు' అను తెగ యొకటి యీ ప్రాంతమందే ఇరువది యైదు ముప్పది సంవత్సరముల క్రింద యుండెడిదనియు, నయ్యెను నీ విద్య యందువారు ప్రవేశము కల్గి యుండలేదు. కాని చిన్న చిన్న జంతువులుగా రూపొందు విద్యను ప్రదర్శించుటను గలిగియుండెడివారనియు, నాదరము లేకపోవుట చేతను, గ్రామములందు వీరివలన భయోత్పాతము గలిగి నిత్య సంశయగ్రస్తులుగా భావింప బడుట చేతను లుప్తమయినట్లుగా తెనాలి లోని వారి శిష్యులు శ్రీ నర్లగొర్ల కోటయ్యగారు చెప్పుచున్నారు.

కనుక నీ పులిముగ్గు విద్య యాంధ్ర దేశములోనిదిగా (174) రచయిత పేర్కొనుట యసంగతము కాబోదు. వారు పులియగుటకు ముగ్గుల నుపయోగింతురో మంత్రోపాసనమే చేయుదురో చెప్పలేదు. తద్విద్యారహస్యము తెఱుగరేమో ! ఎఱుంగనీయరేమో కూడను. కనుక రచయిత యిట్టి విద్య నొకదానిని పరమాశ్చర్యకరముగా సంధించి తన సంవిధానపై చిత్రిని జూపెను. దీనికి నామకరణముగూడ 'పులిముగ్గు' యే.

1. కవియూహ :- చారిత్రక సుశర్మ యెట్టివాడోగాని నవలా సుశర్మ కాముకుడు. సహజముగా నేరాజవంశమయినను నారంభమున నుత్తమ ప్రమాణములు నెలకొల్పి యంతమున నికృష్టమైన క్రియలతో విచ్ఛినమగుట యనుభవ దూరముకాదు. ఈ దృష్టితో నీసుశర్మ పాత్ర చిత్రింపబడినది. ఆ కాముకుడు విచిత్రమయిన ప్రకృతిగలవాడు. అతనికి నుపనిషద్రహస్యములు తెలియును. మిగిలిన యనేక వేదాంత మర్మము లెఱుంగును. కాని యాతనికి ప్రాణము లెట్లుపోవునో తెలియవలెను పయిని బేర్కొనిన గ్రంథము లందావిషయము వివరింపబడినను నవి తన కాముకత్వముచే జేరరాని వి. తద్విషయ వేద్యుడయినచో దాను మృత్యువును గెలువగలడు. తన కామ మార్గముననే దానిని తెలియ వలెను. మానవుని కామము స్వచ్ఛమైనది కాదు. ఆ కామము వెనుకనేదియో యొక లౌకిక ప్రేరణ యుండును. కామము దానికది యచ్ఛముగా నుండవలెను. ఇది జంతువులలో సాధ్యము గానగునని యెంచును. కనుక తన ప్రియురాలయిన పద్మరాణి పులికావలెను. దానికి పూర్వజన్మస్మృతి యుండవలెను. దానితో తాను తానుగా రమింపవలెను. ఒకచో నాయోడు పులి స్మృతి గోల్పోయి తనను జంప రావచ్చును. అట్లు చంపుట తానెఱుంగును. ఆ యెఱుంగుటలో బ్రాణము లెట్లు పోవునో తెలిసికొనును. ప్రాణము లెట్లు పోవునో తెలిసికొనుటయే మోక్షము. ఇది యారాజు సిద్ధాంతముగా గవి యూహించెను అది యట్లే-కాని ఈతని రాణిని పులి చేయుగలవాడెవ్వడు ? ఇది సాధ్యమా ?

ఇందు కొక్కని తయారుచేసెను, వాడే జయద్రధుడు. ఈ జయద్రధుడు సుశర్మను జంపి రాజ్యము నాంధ్రుడైన శ్రీముఖునకు గట్టబెట్టెదనని చెప్పినాడు. జయద్రధుడు ప్రత్యక్షముగా జంపవచ్చును గదా ! తాను పులియై వానిని జంపనేల ? చంపుటకు పులియైన నేమి? పామైన నేమి ? అట్లు కాదు.

"ప్రత్యక్షముగా సుశర్మను జయద్రధుడు చంపరాదు. చంపినచో శ్రీముఖుని విరోధిని జేసుకొన్నట్లే. తానుచంపినట్లు కాదు. సుశర్మ తన యంతట తాను చచ్చినట్లు చూపింపవలయును. పరమకుత్సితుడైన వానికి వంద పన్నాగములు తెలియును. పైగా నటువంటివాడు తాను చేసెడి పన్నాగములను విచిత్రముగా సంతరించును. దాని నొక తెన్ను వెంట మలయించును. వాడొక శిల్పి. జయద్రధు డీవిద్యలో శిల్పి." జయద్రధు డీవిధమయిన శిల్పమును విలక్షణతను ప్రదర్శించు టకు సుమారిరువదియేండ్లు శ్రమించెను. పులిమ్రుగ్గు విద్యను నిత్య ప్రత్యగ్రముగా సంతరించుకొనెను. ఈ విద్య ప్రయోగింపబడుటకు సిద్ధమయిన పాశుపతము వోలె తన యధీన మందుంచుకొనెను.

ప్రభువునకు నీ జయద్రధునకు సమావేశము జరిగెను. అతని యూహ తన విద్యా ప్రయోగమున కనుకూలముగా నుండెను. ప్రభువు మ ణించెను. శ్రీముఖుడు రాజయ్యెను. ఇది విశ్వనాథ వంటి ప్రతిభా శాలి మాత్రమే యూహింపగలడు. అతడే యిట్టి సంవిధానమును నిర్వర్తింపగలడు.

2. కుమార పితృ జయద్రధులు :- ఒక్కొక్క నవలలో నొక్కొక్క వైచిత్రిని దర్శింపజేసెడి రచయిత యీ నవలయందు తండ్రి కొడుకుల నిద్దర జయద్రధులను ప్రవేశపెట్టెను. ఒక్క జయద్రధునకే "ధరణీ చక్రము సంచలింపగ' యన్నట్లుండగా నిద్దరు లోకమును హిరణాక్ష, హిరణ్యకశిపుల వలె పట్టి పల్లార్చరా ! యను భయము పాఠకునకు గల్గును. అట్లు కాదని రచయిత పరిష్కారము. ఆ తండ్రి హిరణ్యకశిపు డయినచో నీతడు ప్రహ్లాదుడు. ఆతడు కుంపటి యయి నచో నీతడు తామర. ఆతడు కుమ్మరావ మయిన నీతడు రాగిముంత. అతడాసుర ప్రకృతి. ఈతడు దైవీ ప్రకృతి. ఇవి యన్నియు సృష్టి వైచిత్ర్యములు. యాదవ కులమున ముసలము పుట్టుట,రావణ కులమున

విభీషణుని జననము సృష్టి వైచిత్ర్యములు కాక మఱి యేమనవలయును? వీనిని దృష్టిలో నుంచుకొని రచయిత ఈ పాత్రలను సృజించెను. తండ్రి జయద్రథుని కార్యములను ప్రతిఘటించుటకే సర్వదా యత్నించిన సౌశీల్యము గలవాడు కుమార జయద్రథుడు రాజును సంరక్షింప లేక పోయెనుగాని తండ్రిని, వాని తుచ్ఛ విద్యను మాత్రము వినాశము చేసి లోక క్షేమంకరు డయ్యెను. ఏమైననేమి? తండ్రి తన కృత్యమును సాధించెను. శ్రీముఖుని కాంధ్రసామ్రాజ్య ప్రదానము జరిగెను, 'కాలోహి దురతిక్రమః' అను న్యాయ మిట అనుసంధేయము.

రచయిత అధర్మమయిన యూహకు సంకేతముగ పితృ జయద్రథ పాత్రను నిరూపించి సుశర్మ యూహకు జోడించి వాని మరణమునకు హేతువుగ నొనర్చెను. ధర్మమయిన యూహకు కుమార జయద్రథుడు ప్రతీకయయ్యెను,

౮. ఆంధ్ర దేశముతో మగధ రాజ్యమునకు సమన్వయ సాధనము: ఆంధ్రులే మాగధ చక్రవర్తు లగుటకు కవికల్పించిన హేతువులివి-మగధ రాజ్యము నిప్పటికి నౌత్తరాహులే యేలుచుండిరి. మఱి దాక్షిణాత్యుల మాటయేమి ? ఈ యాలోచనతో బాలకుని దృష్టి యాంధ్రుల మీదకు మళ్లించును, మగధకు నాంధ్రులకు నొక సమన్వయము కుదిరించెను.

"ఎల్లప్పుడు నౌత్తరాహులే భారతదేశ చక్రవర్తు లగుచుండిరి. దాక్షిణాత్యులకు నట్టి యోగ్యత పూర్వమెప్పుడును పట్టలేదు." (13)
ఇది తెలుగునవల. చదువునది తెలుగు పాఠకుడు ప్రజాహృదయమే కవి హృదయము. ఈ విషయమున రచయిత దాక్షిణాత్య హృదయ చోరుడే యగుచున్నాడు. ఆంధ్రుని మగధ రాజును చేయుటకు కేవలమా యొక్క హేతువే యగునా మఱియితర కారణములున్నవా యనుచో నా జయద్రథు నాంధ్రజాతి గుణములు మిక్కిలి యాకర్షించినవట. ఆంధ్రరాజు వీనినే ప్రశ్నింప జయద్రథుడు,

"భారతదేశమున నితర జాతులలో లేని యొక లక్షణము మీ యందున్నది. దేని వెంట బడినదాని వెంట బోయెడు జాతి. సృష్టిలో సర్వమైన యవివేకము మీ జాతియందే యున్నది. మీ జాతిలో వివేకము నవివేకము రెండును సరిసమానముగా నుండును. మీ జాతిలో నింకొక లక్షణమున్నది. ఇంతటి వివేకము గలిగి మీ యవివేకము వివేకమును భాసింప నీయదు. అందుచేత మీ జాతి యందు నా కభిమానము" (183)

ఇది స్వతః ప్రమాణ నిశ్చయ బుద్ధి కలిగియు పరుల యుపదేశముల పయి నాధారపడెడి వారిని రచయిత యెదుర్కొనిన తీరు. కనుకనే వారి వివేకము దొడ్డదయ్యు నది భాసింప కుండెననియు. నీ యవివేకమునే సర్వ భారతదేశము నందు నభివ్యాప్తము చేయవలెనన్నచో వీరినిమగధ సామ్రాజ్యాధిపతులుగా జేయవలె ననట్లుగా నీ కల్పన చేసెను.

మొదటి హేతువు ప్రశంస. రెండవ హేతువు విమర్శ. జయద్రధు డాంధ్రదేశమున కేగు కతమేమి ? ఆయన యచట స్థాన మెట్లు సంపాదించుకొనె ననుటకు జక్కని కల్పనము చేసి కథాసంవిధానమును నెఱపెను. అందు 1) ఆంధ్ర దేశమునందు నాడు ప్రచారములో నున్న 'పులిముగ్గు' విద్యనభ్యసించుటకు నాంధ్రదేశమున గల యటవీ ప్రాంతములందు దిరిగినట్లు కల్పింపబడినది.

2) ఆంధ్రరాజయిన చంద్రశేఖర శాతకర్ణి యొకనాడు వేటకయి వెడలి జయద్రధునిచే నెదుర్కొనబడి యాతనివలన నిహతుడుగా నున్న సమయమున జయద్రధుడే రాజు నొక కోర్కెగోరెను. తానాంధ్ర దేశమున రాజధానిలో గల రాజపుత్రులకు ఖడ్గ విద్యాగురువుగ నియమింపబడుచో తన నైపుణ్యము శిష్యుల యందు సంక్రమింప జేసి వారిలో నొకరిచే మగధ సామ్రాజ్యమును బాలింప జేయును. ఈ

కోర్కె మన్నించినచో నాతడు రాజును విడచును. లేనిచో సంహ రించును, రెండవ కోర్కె యిది. తానా దేశమున నున్న సమయమున బ్రవర్తించిన యథేచ్ఛా వర్తనమునకు రాజు పరులచే బ్రోత్సహింప బడియు శిక్షింపరాదు, ఏవం విధమయిన హేతువులతోనే జయద్రధు డాంధ్ర రాజ్యమున బ్రవేశించెను.

4. శార్దూలోన్ముఖమయిన యితివృత్త నిర్వహణము :- రచయిత యవకాశానుగుణముగ, తత్తత్ప్రదేశములందు బాలకుని తద్భావాభి ముఖునిగా నొనర్చును. అట్టి సందర్భములను కవి యొక క్రమమున ప్రవేశపెట్టి కథకు రక్తిని గూర్చును. "మీ ఆంధ్రులు సింహధ్వజులు. సింహము పులియు రెండు నించుమించుగా నొకజాతి కదా, అందు చేత నీవు పులిని వెదకుచువచ్చితివి" (75) "మీ పూర్వులకు సింహము కనిపించి కొడుకు నిచ్చి మాయమయ్యెను" "నీకు పులికన్పించి రాజ్య మిచ్చి మాయమగును. ఇదివృత్తము నందిది పరమార్థ సూచనము.

పై వాక్యములందు చారిత్రకేతివృత్తాంతములను సమన్వయించిన వైఖరి గమనార్హము. "నీకు రాజ్యము రావలయును. నాకీ పృష్ఠ భాగము, పిక్కలు కూడ పులికాళ్లు కావలయును." లేదా నేను సంపూర్ణముగా నెప్పుడు పులి యగుదునో నీవప్పుడు రాజవగుదువు." (35) "ఇపుడు నాకన్నులలో దయ్యములు కన్పించుటలేదు. పులులు కన్పించుచున్నవి. నిజమేనా ! (82)

సుశర్మ జయద్రధునితో అర్ధరాత్రమున జయద్రధుని గాంచిన వాని మొగమంతయు గన్పింపక కన్నులు పెద్దపులివలె గన్పించునట, యనుచు దానిని నెమ్మదిగా సుశర్మ భార్యయైన పద్మరాణి పెద్దపులి యగు విషయమున బ్రవేశింప జేసెను. ఇచట కవి పాఠకునకు సుశర్మ యూహా మాత్రముగా బొడగట్టచేసి కథాగమనమునకు వీలు కల్పించెను. దానితో నా. సుశర్మ యుద్దేశము నెదుర్కొనుటకు సిద్ధపడును' సిద్ధ పడుట యేల యనగా నిది విచిత్రమైన యూహ. ఈ యూహచే బాల

కుని నాశ్చర్యములో ముంచుట గాక ప్రత్యక్ష దర్శనమునకు సయి తము సన్నద్ధ మొనర్పవలయును. కనుకనే సుశర్మ ప్రభువు యోగితో "నీవు కాదయ్యా! మా పద్మరాణి యాడుపులి కావలెను. ఆమె యందప్పుడు నేను రమింపవలయును. అప్పుడు పాఠకున కేవగింపు కల్గునను విషయమును రచయిత కనుపెట్టక పోలేదు. దానికి రచయిత సమాధానము. ఇట్టి రమణమున 'తృప్తి కంటె వైరాగ్యము భాసింప వచ్చును. వైపరీత్యము జగుప్సను కలిగించును. ఆ జుగుప్స వైరాగ్య ము నుదయింప జేయు"నని చెప్పును. (106) జుగుప్స వైరాగ్యమునకు హేతువు కావలయుననియే రచయిత, నిశ్చయము. "ఆమెను పెద్దపులిని చేయగలవా!" సుశర్మ ప్రశ్న (111) ఆంధ్ర రాజయిన చంద్రశేఖర శాతకర్ణి వేటకు వెంల పులిమానిసి కన్పించెను. వాడు జయద్రధు డని యాయనకు దెలియదు. (125) శ్రీముఖుని గుఱించి గంగాధర శాతకర్ణి యాలోచనమున నాతడు పొంచి రాజ్యమును గ్రహించుటకు సిద్ధముగానున్న పులివంటివాడు. (150) జయద్రధుడు పద్మరాణితో 'నీ ష్టమయినచో' నీకు నాయందు విశ్వాసమున్నచో నేను నిన్నాడు పులిగా చేయగల్గుదును"(174) ఈ విధముగా నితివృత్తమునందు ప్రతి సన్నివేశము శార్దూలోన్ముఖమున కవి నడపి యీ నవలా నామము సుసంఘటిత మొనర్చెను.

౫. సుశర్మ మరణము :- సుశర్మ మహారాజు, చరిత్రలో నాతని మరణము క్రూరముగా జరిగినదనియే తెలియును. శ్రీముఖుడు సుశర్మను చంపి రాజయ్యెను. శ్రీముఖుడు సేనాపతి, రాజున కత్యంత విశ్వాస పాత్రునిగ నీతడు చిత్రింపబడెను. కనుక నీతనిచే రాజును జంపింప దలంపలేదు. అతని కామమునకు దగిన మరణమే యాతడు పొందెనను నిర్ణయము పాఠకునకు గలుగునట్లుగా రచయిత యీ సన్ని వేశమును నిర్వహించెను. ఇచట ప్రధానముగా రచయిత జయద్రధ పాత్రనుపయోగించుకొనెను. అతడే సుశర్మను బరోక్షముగ జంపుటకు

తాను పులియై యారాజునకు దుష్టకామగతమైన దుష్టపు టూహను గమనించి తన తాంత్రికవిద్యకు ప్రయోజనమును సిద్ధింపజేసికొనుటకు దగిన ప్రదేశము నెన్నుకొని రాజధానికి దూరముగా సేనాపతికిని దెలియ నీయక పులిగా నారాజును సంహరించెను.

ఈ కల్పనచే రచయిత సాధించిన ప్రయోజనములు.

1. జయద్రథుడు శ్రీముఖుని యభీష్టానుసారము తానాతని రాజ్యసంపాదనమునకు బరోక్షకారకుడగునట్లు కథ సృజింపబడినది. 2. తాంత్రిక విద్యకు ప్రయోజనము చేకూరినది. 3. దుష్టమయిన కామమునకు దుష్టమయిన మరణము. ఇదిరాజునకు, జయద్రథునకును సమన్వయించును. పద్మరాణికే సమన్వయింపదు. దానికి సమాధానము దుష్ట సాంగత్యముకూడ క్రూర మరణమునకు హేతువగునను సత్య మిచ్చట ప్రవచింపబడినది.

6. రచయిత లక్ష్యము :- ప్రధానముగా రచయిత వ్యక్తము చేయదలచిన యంశములు. ఈనవలయందు రెండు కలవు. 1 కాలము యొక్క ప్రభావమునకు రాజాధిరాజులైనను తలవంచి తీరవలెను. దాని నెదిరించుటకు సత్పురుషులైనను సన్మార్గవర్తనులైనను సమర్థులు కారు. ఒకప్పుడు ధర్మమునకు విజయము వేరొకప్పుడధర్మమునకు విజయము కలుగును. ఇది తాత్కాలికము. అదిశాశ్వతము. అధర్మము వలననే రాజ్యములు నశించును, అట్లే సుశర్మ రాజ్యము గోల్పడి నాడు. అధర్మ ప్రభావమభివృద్ధి గాంచుటచే నాస్తికుడైన బౌద్ధుడు రాజ్యమును చేపట్టినాడు. ఇచ్చట చారిత్రకమునకు, ధర్మాధర్మములకు సమన్వయము, మహాకవియైన రచయిత సమన్వయమును వేయి విధములుగా జేయును. సత్యవిషయమును రససిద్ధితో మేళవింపు గావించును. అది నిత్యనూతనముగా భాసించును. ఇచట పాఠకునకు దాను జెప్పవలసినది సుశర్మను జంపి శ్రీముఖుడు రాజ్య స్వీకారము ప్రధానమయినది గాదు. చారిత్రకముగా గాల సమన్వయము చేయుట

అది ఈనవలయందు యథావకాశముగ చర్చింప బడియే యున్నది.(41) ఆంధ్ర సామ్రాజ్యము యొక్క ప్రాచీనత, (861) జనమేజయుని కాలమునాటి జయద్రధ పాత్రను భావించుట. 169, 70, 71 యుధిష్ఠిర చక్రవర్తి నుండి నాటివరకుగల రాజకీయములు స్పష్టపఱుపబడినవి.

ఈ యంశములచే గథా సంవిధానమును సమకూర్చి యీ యద్భుతావహమయిన 'పులిమ్రుగ్గు' నవలను శ్రీవిశ్వనాథ రచించెను.

## పాత్ర చిత్రణము

ఇందు ప్రధాన పాత్రలైదు. సుశర్మ శ్రీముఖుడు, కుమార పితృ జయద్రధులు, పద్మరాణి అనువారు. వీరందరు విలక్షణమైన పాత్రలే. పరస్పర వైరుధ్య భావములు గల వారు. మానసికమైన విశ్లేషణ కలిగిన పాత్రలు. రాజు వేదాంత విద్యాధురీణుడు. మోక్ష మార్గాన్వేషి. కాని యాతనిని పట్టి పల్లార్చునది తీవ్రమైన కామము. ఈ రెండింటికిని విరోధము. కాని యతనికి మోక్షము కావలెను. అందులకై కామము నడ్డుకొనకయే మోక్షమార్గ మన్వేషించును.

మంత్రి, సేనాపతి యైన శ్రీముఖుడు రాజ్యాశ కలవాడు. ఆ యాశ యాశగానుండదు. అది వచ్చినచో దానినికాదనెడి మన స్తత్త్వము కలవాడు కాడు. అనగా నా మనస్సుయొక్క అంతరాంతరములందు తాను రాజు కావలెననెడు వాంఛ బీజరూపముగా నుండి యున్నది. కాని రాజు పయి పరమ విశ్వాసమును బ్రకటించును. తానుగా రాజును సంహరింపడు. ఇతరులెవరైనను నట్టి దౌష్ట్యము నొనర్చినచో వానికి శత్రువయి వాని వధ చేయును.

పితృజయద్రధుడు తీవ్రమయిన ప్రకృతి గలవాడు. తాను కాలము కొఱకై ప్రతీక్షించువాడు. ఈయన రాజ్యమును భగవద్విరోధుల కందించును. కుమార జయద్రధుడు బాల్యాది సుగుణముల ప్రోవు. మాతామహుని పెంపకమున నుత్తమ విద్యా వికసితుడయ్యెను.

పరోపకారి తండ్రిడినన్వేషింపగా నేగి యాయన గుణములనెఱింగి వాని వనహ్యించుకొని యట్టి దుష్టమైన వ్యవహారమునకు రోసెను. కనుక నే హిరణ్యకశిపునికి బ్రహ్లాదుడు, రావణు కులమునవిభీషణుడు బుట్టినట్లుగా నీ కుమారజయద్రధుడు జన్మించినట్లు మనమంగీకరింప వచ్చును. ఇది రచయిత పాత్ర ప్రకల్పనమందలి ప్రత్యేకత.

పద్మరాణి :- కాణ్వప్రభువయిన సుశర్మను మెప్పించి యాత నిచే శ్రీముఖుని యధికారమును దొలగింపగా తండ్రిపనుపునవచ్చిన యువతి. మగధ చేరినంతనే పథకము మారెను. అతని కామవాగుర జిక్కిన పక్కియై, యాతనివేదాంత ప్రవచన మొకవంక, తాను శాస్త్రాభిజ్ఞత నింకొకవైపు ననుభవించు చుండెను. ఇకెక్కడి బౌద్ధమత నిరాసము?

ఈ 'పులిముగ్గు' నవలయందు శ్రీ విశ్వనాథ కవి తాను సంచరించిన మహాటవీ ప్రదేశ సంచారిత వన్యమృగ విషయములను పాఠకునకు సువ్యక్తమొనర్చెను. 'నేనూ-నాపాతికేళ్ల రచనలూ' అను వ్యాసమున నీ రచయిత వ్రాయుచు 'వేటకాండ్రు వ్రాసిన చాలా గ్రంథములు చదివిన వాణ్ణి. నేనే స్వయంగా ఎన్ని అడవులు తిరిగానో ఎన్నికొండలు ఎక్కానో చెప్పలేను. ఆ నాస్వంత యనుభవాలివి.ఆయా గ్రంథాలలో ఉన్న విషయాలు నా నవలల్లో తెగ వ్రాస్తాను.' అని పేర్కొనినది సత్యసమన్వితము. ప్రారంభమున చేయబడిన యరణ్య వర్ణన రచయిత మనల నరణ్యములో త్రిప్పుచున్నట్లే మనము భావింతుము. ముప్పదిరెండు పుటల విషయము నంతయు నాతో పాటు, శ్రీ ముఖుడు గావించిన యరణ్య సంచారము, భిన్నజంతువుల యలికిడులు వన్య మృగ విషయిక పరిజ్ఞానము, జంతువులు పసికట్టుటెట్లు? అను విషయము (19) కాంతారమున గానుపించెడి యొంటి పూస తేళ్లు, నవి కుట్టినచో కలిగెడు మరణ సదృశ బాధ వానిని దప్పించుకొనెడి యుపాయమును బేర్కొనును. మగధ సమీపమున గల బలిమత పర్వత

పరివృత మహారణ్య సంచారము మనము గూడ నాతోపాటు శ్రీ ముఖులతో జేస వచ్చినట్లుండుట, చదివిన వానికనుభవమునకు వచ్చును. సూక్ష్మ పరిశీలనము మనచే. జేయించును. మహా నిశ్శబ్ద నిశీథియందు, తత్రాపి గహన కాంతారతటాక తీరమందు, సవ్వడి యొకటి గుర్పాటు. ఇచట సూక్ష్మవివేచనము గమనార్హము. 'తానీదుచు నడుమ నడుమ నెంత సవ్వడి లేకుండ నీదుచున్నను చేతితో నీటిని గొట్టవలసి వచ్చుచునే యున్నది. ఆధ్వని పులికి దెలియకుండ నితడు జలము నుండుండి యెగిరిపడుచున్న చేపలయొక్క ధ్వనిలో కలిసిపోవు నట్లు చేయుచుండెను.'

పాఠకుని మనస్సు చిక్కబట్టుకొనియుండు సన్నివేశమిది. ఆ పులి వెనుకకు దిరిగి తన వెంటబడువాని చీల్చునేమో! ఏమి జరుగునో, ఈతని సాహసము ఫలించునా! ఈతని యన్వేషణ ఫలప్రదమగునా ) పాఠకుని మనస్సాందోళితమై యుండెడి సన్నివేశమిది. ఇట్టి సన్నివేశ సృజనముతో తన యటవీ పరిజ్ఞానమును గూడ పాఠకునకు నందించెను.

2. పంచాగ్ని విద్య :- ఇది ఛాందోగ్యమునందు గలదు! శ్వేతకేతువను బ్రాహ్మణునకు పాంచాల రాజుచే (ప్రవాహణుడు బోధింపబడిన ఐదగ్నులకు సంబంధించిన యుపాసనము, కనుక దీనికి బంచాగ్ని విద్యయను పేరువచ్చెను ద్యులోకము, మేఘము, భూమి, పురుషుడు, స్త్రీ యనునవి యైదగ్నులు ఒక్కొక్క యగ్నిని సావయముగ నుపాసింప వలయును (సమిధలు, ధూమము, జ్వాల, బంగారము, మిడుగురులు) ఇట్లు సావయముగ నుపాసించిన జీవుడు శాశ్వత బ్రహ్మ లోక ప్రాప్తి కలుగుట కుపాయమును సంపాదించిన వాడగును. ఇది యమృతత్వప్రాప్తికి మార్గము ఇందు మృతినొందిన పిదప ప్రాణుల గమనాగమనములు వివరింపబడి యున్నవి.

స్వస్వరూపముతో ద్యులోకమునందును. నచ్చటినుండి చంద్ర

రూపము నొంది తద్రూపముతో మేఘునియందును. అచ్చట వర్ష రూపమునొంది యారూపముతో భూమియందును, అచ్చట నాహార రూపమునొంది యారూపముతో బురుషుని యందును, అచ్చట రేతో రూపము నొంది స్త్రీ గర్భమునను జీవుడు ప్రవేశించును. ఇదియే గమనాగమన స్వరూపము. దీని నధిగమించుటయే నీయుగ్నుల నుపాసించుట వలన గలుగు ఫలము. ప్రాచీన విద్య లోని పరమార్థమును పరిచయ మొనర్చుటయే యిచట రచయిత లక్ష్యముగా నున్నది.

౩. నాచికేతాగ్ని :- ఈ నాచికేతాగ్నిని గురించి తైత్తిరీయ బ్రాహ్మణమునందు విపులముగా జర్చింప బడియున్నది. కఠోపనిషత్తు నందుగల యితివృత్తమునకు వివరణమిది, 'నాచికేతాగ్నిచయన విధి' యను శీర్షికతో నేకాదశ ప్రపాఠకమంతయు నిది వివరింపబడి యున్నది. ఇందు పది యనువాకములు గలవు. ప్రథమానువాక మందిష్టకోపధాన మంత్రములుగలవు, ఇరువది యొక్క యిష్టకలను జేర్చుట ఇందు పేర్కొనబడినది. రెండునుండి యైదనువాకముల వరకు హోమ మంత్రములు చెప్పబడినవి. ద్వితీయమందు శతరుద్రీయము తృతీయ మందు 'అగ్నావిష్ణు' మంత్రముచే వసోర్ధారాహోమము, చతుర్థ మందన్నహోమ మంత్రములు, (అన్నపతే అన్నస్య) పంచమానువాక మందు 'విశ్వప్రీనామక హోమమంత్రము ("సప్త తే అగ్నే") షష్ట మందు ఉపస్పర్శన మంత్రములు('యత్తేచితం యదుచిత్తం' ఇత్యాది) సప్తమమందు నాచికేతాగ్ని దేవతోపాసనము (అయంవా వయః పవతే సోఽగ్నిర్నాచికేతః ఇత్యాదులున్నవి. ఇది పశ్చాత్కారమైన వాయు దేవతాకవిషయోపాసనము. అష్టమమందు బ్రహ్మలోక ప్రాప్తిలక్షణముః తత్ఫలము చెప్పబడెను. మృత్యురాహిత్యక విషయము నాచికేతోపాఖ్యానమున బ్రతిపాదింపబడినది. నవమమందు చయనప్రయోగవిధి పేర్కొనబడినది. దశమమందు నాచికేతాగ్ని చయన ప్రశంసావిధి పేర్కొనబడుట యందలి విశేషము.

ఈ అగ్ని నుపాసించుటచే బ్రహ్మలోకాది ప్రాప్తి అనగా నాదిత్యాది లోకముల కూర్ధ్వమందున్న బ్రహ్మాదిలోక ప్రాప్తిని గల్గించునని చెప్పబడినది.

వ్యంగ్యమర్యాద :- 1. సులభ నిర్వాణ ప్రాప్తి హేతువు. 'నిర్వాణము' బౌద్ధులుపయోగింతురు, శిధిలమయిన బలిమఠము నావాసముగా జేసికొను నుద్దేశముతో వచ్చిన బౌద్ధ శ్రమణకుల కది సులభ నిర్వాణప్రాప్తిహేతువుగా గానవచ్చుటచే నచట నుండి వెడలి పోయిరట.

రాజపురుషుడు జయద్రధునితో నొనర్చు సంభాషమున రాజ్యము రాజ పురుషునకు సంభవించి నట్లే యని చెప్పెను. అపుడు రాజ పురుషుడు "నాకర్ధము కాలేదు, అని పలుక, నాజయద్రధుడు-

"అర్ధము పనికిరాదు. సంపూర్ణముగనే కావలయును" అని వ్యంగ్యము. రాజపురుషుని విషయమున నవబోధార్ధముగ ప్రయోగింప బడగా నదేపదము భాగార్ధమున ప్రయోగింపబడి యొక వ్యంగ్యము సృజింపబడినది. (76)

సుశర్మకు నలుగురు భార్యలట :- "ఆ నలుగురు నాల్గు ప్రాణ ములు తీసివేయుచున్నారు. మిగిలిన ప్రాణము నీవు తీసివేయవలయునా? శ్రీముఖునకు జయద్రధుని ప్రశ్న"వారు తీసివేసిన ప్రాణములు లేకున్నను నాతడు బ్రదుకును. అనగా వారి విషయమున వాచ్యార్ధముగాదు. నీతని విషయమున వ్యంగ్యము. నీవల నతడు మృతి నొందునని చెప్పుట.

వేటకు బోయిన యాంధ్ర రాజుపేరు గోముఖుడు, రాజు తన పేరు చెప్పక "నీవు గోముఖు నెఱుగుదువా! యని జయద్రధుని బ్రశ్నిం చును. దానికి ప్రతివచనము వ్యంగ్యము, 'నేను సింహముఖుడను, గోముఖులతో నాకు బనిలేదు. జంతుపరమయిన సమాధానము.(138)

వర్ణనలు:- ఈ నవలయందు 'పద్మరాణి' వర్ణనము పేర్కొన దగినది. తన వేదాంత విద్యకడ్డు తగిలెడి పద్మరాణి సౌందర్య మెట్టిదియో వర్ణించుచున్నాడు.

"ఆమె యచట సన్నని వలిసెంపు చీరకట్టుకొని కూర్చున్నది. ఆ చీర అంచలంచెల వలెనున్నది, ఆ చీరకు బెత్తెడు వెడల్పున బంగరు టంచు కలదు......ఇంతటి రమణీయమైన చేలము నామె శరీర సౌందర్యమునకు లొంగిపోవుచున్నది." ( 118 ) చీర యేలొంగగా దానేలలొంగడు?

శ్రీ విశ్వనాథ దృష్టియందు కవితా విద్య :- "సూక్ష్మ శబ్ద పరిజ్ఞానము కల్గి, శబ్దశక్తి వేత్తయై, సర్వశాస్త్రాభిజ్ఞత కలిగి ధ్వన్యాది వివేకముతో గవి వ్రాయవలెను," (157) ఇది మహాకవి లక్షణము కాగా విని యానందించు వాని లక్షణమును జెప్పెను. "ఆ కవిత నానందించెడి వాడుకూడ నేతాదృశగుణ సహితుడైననే యానందించ గలడు.

రసవివేకము .- పద్మరాణి వర్ణనము - శృంగారము. జయద్రధునితో సుశర్మ ప్రసంగము. వేదాంతవిషయము కనుక నది శాంత రసము. జయద్రధుని యందు వానిచర్యల యందు కానవచ్చెడిది - భీభత్సరసము. చంద్రరేఖ-కరుణారసమునకు ప్రతీక. ఆమెకు దుఃఖమే మిగిలినది.

# 9. నాగసేనుడు

## చారిత్రక పూర్వరంగము

ఆంధ్ర రాజులలో నిరువదియేడవ వాడైన శివశ్రీశాతకర్ణి పాలించు కాలమునకు సప్తర్షి మండలమొక పరిభ్రమణము గావించి నట్లు పురాణకథనము. కలియుగ రాజ వృత్తాంతమున నీమండల మిర్వది నాల్గవ నక్షత్రమును జేరునాటికి మగధయందాంధ్ర పాలన మారంభమగునని చెప్పబడెను. మఘ నుండి సవ్య గమనమయినచో నీ యిరువది నాల్గవ రిక్క యార్ద్రయగును. ఇందు సప్తర్షి మండల మేరాజు కాలమున పునర్భ్రమణ మారంభించునో తెలుపుటవిశేషము. ఈ సురర్షులిర్వదినాల్గవ నక్షత్రమగు "నార్ద్ర"ను బ్రవేశించునాటి కాంధ్ర రాజులపాలన మారంభ మగుననియు, నాంధ్రరాజులలో నిర్వదేడవ వాడయిన శివశ్రీశాతకర్ణి కాలమున నిర్వదియేడవ నక్షత్రమైన యాశ్లేషను పరిభ్రమించుట పూర్తిగావించుకొని మఘ యందు జేరునని కలిరాజ వృత్తాంత మభిభాషించును. ఇది క్రీ. పూ. 377 వ సంవత్సరమగును, ఎట్లనగా కల్యారంభము క్రీ. పూ. 3102 కాగా నిక్కడనుండి యిరువదియైదు సంవత్సరములకు గాని మఘ యందు భ్రమణము పూర్తికాలేదు. 3077వ సంవత్సరమున పుబ్బయందు బ్రవేశించును. తిరిగి మఘలోనికి రావలెనన్న 2700 సంవత్సరములు తీసివేసినచో క్రీ. పూ. 377వ యేడు వచ్చును. ఈ సమయమునకు బాలించెడి రాజు శివశ్రీశాతకర్ణి.[1] వీరి తరువాత నింకను 50 యేండ్లు

---

1) "చతుర్వింశేథ నక్షత్రే భవిష్యంతి శతం సమాః ।
ఆంధ్రరాజ్యారంభ కాలాదారభ్యైతే సురర్షయః ।।
సప్తవింశాంధ్ర నృపతే కాలే భావ్యస్యతే పునః ।
ఆశ్లేషా సంప్రయాస్యన్తి యుగస్యాన్తే సురర్షయః॥

ఆంధ్రరాజ్యము ప్రకాశించినది. శ్రీవిశ్వనాథ ఆంధ్ర రాజులలో నిరు వది నాల్గవరాజు కాలమునాటికే సప్తర్షి మండలము భ్రమణము పూర్తికావించినట్లు పీఠిక యందుదహరించుట ప్రామాదికము. ఈ ప్రమాదము నవల యందంతటను నున్నది. ప్రమాదో ధీమతా మపి సారాంశ మేమన,

1. పరీక్షిజనన కాలమున మఘ యందున్న సప్తర్షులు తిరిగి వచ్చునరికి నాంధ్రరాజులలో నిర్వది యేడవ వాడైన శివశ్రీశాతకర్ణి రాజ్య మేలుచుండును, 2. సప్తర్షి మండల మిర్వది నాల్గవ నక్షత్రమైన యార్ద్ర౹ ప్రవేశించునప్పటికి ఆంధ్రరాజుల పాలన మారంభమయ్యెను. 3. 27వ ఆంధ్ర రాజయిన శివశ్రీపాలన కాలము క్రీ. పూ. 37 4. మొత్తమాంధ్రులు పాలించినది 506సంవత్సరములు. రాజులు 32 ²

ఆంధ్రులు పాలించిన కాలము క్రీ. పూ. 1వ శతాబ్దియని పాశ్చాత్య చరిత్రకారులు వారి ననుసరించి పరిశోధనలు సలిపిన దేశీయ చరిత్రకారులు విశ్వసించుచున్నారు. సంప్రదాయజ్ఞులు మాత్రమీ కాలనిర్ణయమును వ్యతిరేకించుచున్నారు, పూర్వశాతవాహనులు మగధ రాజ్యమును పాలించి యనంతర మారాజ్య ముత్సన్న మగుటతో నట నుండి బయలుదేరి యాంధ్ర దేశమున పలు తావులందు సామ్రాజ్య ములను స్థాపించుకొని పాలించిరని వీరి విశ్వాసము.ఏది యేమైనను మన

---

2. 1. సిముక 2. శ్రీకృష్ణ శాతకర్ణి 3. శ్రీమల్లిశాతకర్ణి 4. పూర్ణోత్సంగ 5. శ్రీశాతకర్ణి 6. స్కంధస్తంభి 7. లంబోదర 8. అపీతక 9. మేఘస్వాతి 10 శాతస్వాతి 11. స్కందశాతకర్ణి 12. మృగేంద్రశాతకర్ణి 13. కుండల శాతకర్ణి 14. హన్యశాతకర్ణి 15. శతశాతకర్ణి 16. పులోమ శాతకర్ణి 17. మేఘ శాతకర్ణి 18. అరిష్ట శాతకర్ణి 19. హలశాతవాహన 0. మండలక 21. పురీంద్ర సేన 22. సుందర 23. చకోర 24. శివశాతకర్ణి 25. గౌతమీపుత్ర శాతకర్ణి 26. రెండవ పులోముడు 27. శివశ్రీశాతకర్ణి 28. శివస్కంద శాతకర్ణి 29. జయశ్రీ శాతకర్ణి 30. విజయశ్రీశాతకర్ణి 31. చంద్రశ్రీ శాతకర్ణి 32. మూడవపులోముడు.

చరిత్ర యందు, ప్రధానముగా ప్రాచీన కాలమునకు సంబంధించినంత వరకు పక్షపాతరహితముగ విస్తృతమయిన పరిశోధన జరుగ వలసిన యావశ్యకత యెంతేని గలదు. ఆ విధముగా జరిగిననాడు మనచరిత్రయం దాశ్చర్య కరమైన మార్పులు సంభవింపగలవు, సంభవించిన నేమి ? నిర్దుష్టమైన చరిత్ర మనకు లభించును. మనచరిత్రకారుల సత్యదృష్టిని లోకము సర్వథా ప్రశంసింపగలదు. తత్సత్యాన్వేషణమున కయి చరిత్రకారులు కృషి సలుపవలసియున్నది.

## నాగసేనుడు (NAGASENA)

"ఈ గ్రంథము పేరు నాగసేనుడు. 'మిలిందపన్హా' యను గ్రంథ మీయన రచించెను. 'మిలిందపన్హా' యనునది గొప్ప బౌద్ధమత వేదాంత గ్రంథము. ఆయన శోణోత్తరుడను బ్రాహ్మణుని కుమారుడు. హిమ వత్పర్వతము నందలి 'కజంగాల' ఆయన గ్రామము. ఇది చరిత్ర విషయము."

"మిలిందపన్హా" అన్న గ్రంథము మిలిందుడన్న రాజునకు నాగ సేనునకుజరిగిన బౌద్ధవేదాంగత విషయిక ప్రశ్నోత్తరములతో నుండును. మిళిందుడు గ్రీకురాజయిన 'మీనాండర్' అని నేటి చరిత్రకారు లందురు." ఇవి నవల యందలి పీఠికలోని వాక్యములు.

ఇక నాగసేనుని గురించి తెలియ యత్నింతము. శ్రీవిశ్వనాథ యీ నవల యందంతటను 'నాగశయనుడని' వ్రాసెను. పీఠికలో నొక్కచోట మాత్రము 'నాగసేనుడ'ని వ్రాయబడెను. శీర్షిక 'నాగ సేను డని'యే యుండుట గమనార్హము.

ఈ నాగసేనుని జన్మక్రమమును గురించిన విచిత్రోదంతము పేర్కొనబడియున్న విధము నరయుదము. నాగసేనుడు పూర్వజన్మము నందు మహాసేనుడను దివ్యుడు, భూమియందు మిళిందుడను రాజు ప్రముఖ తత్త్వవేత్త. ఈతడు వివిధ మతతత్త్వ వేత్తలను తన సమ్ముఖ

మునకు రావించి వారిని వేదాంత విషయమున ప్రశ్నించు, వారవ్వరుంచు రును నీతనికి ప్రత్యుత్తరము లీయలేరైరి ఇట్లుండగా కాలముగడచిన కొలది యీ మిళిందుని ప్రశ్నల కెవ్వరును సమాధాన మొసంగ లేని దుఃస్థితి యేర్పడెను, అతని యహంకృతికిని మేర లేకుండెను. వీరిలో భారతీయ వేదాంతులు సయితము కలరు. అసుగట్టుడను (Asugutta) దివ్యశక్తి సంపన్నుడు మిళిందుని ప్రశ్నలను విననేగాని ప్రత్యుత్తర మీయజాల డయ్యెను. ఆయన మిళిందు నెట్లుదుర్కొనవలెనా యని చింతించి యుగంధర పర్వతము మీద తన శిష్య సంతతితో సభ చేసి స్వర్గమునందు 'వేగయంత' (వైజయంతీ ప్రాసాదమున కిది రూపాంతరమో?) ప్రాసాదమునందు 'కేతుమతి' యను భవనమున మహాసేనుడను దివ్యుడుండె ననియు, నాతడు మాత్రమే మిళిందుని ప్రశ్నలకు నుత్తరము లీయగల వాడని నిర్ణయించి దేవాధి నాథుడయిన శక్కు (Sakka) నకు నివేదించెను. (శక్రపదమునకు బర్యాయముగా నున్నదీ పదము) ఈ మహాసేనునికి హిమాలయ పర్వత సమీపమునగల కజంగాల గ్రామవాసు శోణోత్తరుడను బ్రాహ్మణునకు 'నాగసేనుని'గా జనింప జేయుటకును, హిమవన్నగమునసే యోగ నిష్ఠాగరిష్ఠుడై యున్న రోహణుడను దేవత నీతనికి గురువుగా నియమించుటకును నిర్ణయమయ్యెను. మహాసేనుని బిలిచి యాయన నంగీకరింప జేసిరి, శక్కుడు రోహణుని బిలిచి నాగసేనుని ఇతివృత్తము నెఱింగించి యాతనికి నేడేండ్లు పదినెలలు వచ్చుట తోడనే గురుత్వము నెఱపగా నానతిచ్చెను.

మహాసేనుడు కజంగాలలో శోణోత్తరునకు కుమారుడై నాగసేనుడయ్యెను. ఈతని జన్మము బహు శుభపరంపరా సమన్వితమై యుండెను. శోణోత్తరుడు తన కుమారునకు వేదవేదాంగముల నధ్యాపన మొనర్చెను వివిధ శాస్త్రముల నధ్యయనము చేయించెను. నాగసేనుడు తన విద్యాభ్యాసము పూర్తియయినంతనే 'ఇంక నేర్వ [illegible] దేమేని గలదా!' యని [illegible] ప్రశ్నించెను. చదువ వలసిన

వెల్లను జదివితివని తండ్రి ప్రత్యుత్తరమ్ము, తనయునకు దృష్టి కలుగ దయ్యెను. తాను నేర్చిన విద్యలు సారరహితములైనవిగా భావించు చుండెను. తన దివ్యదృష్టిచే నీతని మనోగత భావ మెరింగి రోహణకు డీతని గృహాంగణమున బ్రత్యక్షమయ్యెను. నాగసేనుడు రోహణకుని ముండిత శిరస్సును గురించి ప్రశ్నించెను. తాను సన్యసించితిననియునట్లు సన్యసించిన వాడు కొన్ని నియమములు పాటింపవలసియుండుననియు నుపన్యసించెను అష్టే దుస్తులను గుఱించి ప్రశ్నించెను. వాని మర్మ మును బోధించెను. నిజమైన జ్ఞానమేది ? యని మూడవ ప్రశ్న. అది తన కుపదేశింపవలసినదిగా నాగసేనుడు కోరెను రోహణకుడు తన యుప దేశమున నాగసేనుని బౌద్ధమతస్వీకారాంతమున మాత్రమే నిర్వహింప బడుననియు నాతడు తన్మత స్వీకృతు డగుటకు దల్లిదండ్రుల యనుమతి గొని రావలయుననియు విస్పష్టముగా విశదీకరించెను. నాగసేనుడును పిత్రాజ్ఞాన్వితుడై రోహణుకుని ప్రమోల మోకరిల్లెను. రోహణకుడును, నాగసేనుని స్వీకరించి సన్యాస మిప్పించెను. అనంతరము జ్ఞాన బోధలో నభిధమ్మ పిటకమును బోధించెను. తదధ్యయన పరి పూర్తికాలమున దేవతలు చెలువముగ బుష్పవృష్టి కురియించిరి. వింశో ద్వర్ష ప్రాయుడైన నాగసేనుడు బౌద్ధజ్ఞానమును విడిచి కేవలమభిధమ్మ పిటకమును చెప్పిన గురువును వెఱ్ఱివానిగా భావించెను. రోహ ణుకు డీవిషయమును గ్రహించి గురునింద నిషేధమని హితవు పలికెను. తనయూహా గురువునకు దెలియుట కాశ్చర్యపడి మన్నింప వేడెను. రోహణకుడు మిళిందుని వృత్తాంత మెఱింగించి యాతని ప్రశ్నలకు సదుత్తరములొసంగి వాని యహంకారమును శమింపజేయవలసిన

---

X1) శారీరాలంకరణ, 2) ఆభరణములు, 3) శిరస్సునకు దైలమర్దనము 4 పరిమళ ద్రవ్య 5) పుష్పాలంకరణము 6) వక్కలు, పాచికలాట 7) రమణీయమై ఆకర్షకమయిన వస్త్రఖండముల నుపయోగించుట 8) శిరముపై కేశములను పెంచుట నిషేధింపవలసిన యంశములు.

యావశ్యకతను గ్రహింపజేసెను. నాగసేనుడు ధైర్యముతో మిళిందుడే గాక వేరెవ్వరు వేసెడి ప్రశ్నలకైనను సమాధానించి వారిని తృప్తిపరచ జేయగలనని కంఠోక్తిగా గురువునకు విన్నవించెను.

అనంతరము వర్షాగమన కాల మాసన్నమయ్యెను. గురువైన రోహణకుడు నాగసేనుని బిలిచి తనగురువైన అశ్వగుప్తుని కడ వర్షపు దినముల గడుప ననుమతించెను. నాగసేనుడు వర్తనియని యాశ్వగుప్తుని జేరి యాయన కడ శుశ్రూష నారంభించెను. ప్రతిదినము నాశ్వగుప్తునకు బరిచర్యయొనర్చు నొక యువతి వర్షాకాలాంతమున నాశ్వగుప్తునితో నాగసేనుని గూడ తన యింటికి విందున కాహ్వానించెను. భోజనానంతరము గురువైన యాశ్వగుప్తుని యానతిపయి నాగసేనుడు కృతజ్ఞతలు చెప్పెను. ఆమె చూపులు నాగసేనుని చూపులలో కలిసినవి గురువు దేవతలు గూడ దీనిని సంతోషముతో నామోదించిరి, అంత గురువు నాగసేనునితో నిట్లు పలికెను.

'నీవు పాటలీపుత్రమునకు బోయి యచట యశోక వృక్షము చెంత బౌద్ధధర్మములు 'ధర్మరక్షిత' యను నామెకడ గ్రహింపవలెను.' ఈ యాదేశమును నాగసేనుడు నిర్వర్తించెను.

మిళిందు డప్పటికే 'ఆయుపాలుడను' బౌద్ధశ్రమణకునితో వాదించుచుండెను. ఆయుపాలుడు నెగ్గలేకుండెను. నాగసేను డచ్చటికి విచ్చేసెను. నాగసేనుని పేరు వినగనే మిళిందుడు కొంత తత్తరపడెను. ప్రశ్నోత్తరములు కొనసాగెను. మొత్తము మూడు సమావేశములు జరిగినవి. ప్రశ్నావళి 374 వఱకు నుండినవి. వీని యన్నింటిని నేడు మిళిందుని ప్రశ్న పరంపరగనే గుర్తించుచున్నారు. సంతృప్తుడై మినాండరు బౌద్ధమతమును స్వీకరించినట్లు మనకీ గ్రంథము[5] వలననే తెలియవచ్చును.

---

5. Sacred Books of the East. Max Mullar Introductory chapter 35 .h Volume.

చరిత్ర ననుసరించి మిళిందుడు, మీనాండరు వేర్వేరనియు నొకరు క్రీ.పూ. 14వ శతాబ్దికి జెందినవాడుకాగా మరియొకరు క్రీ. పూ. 2వ శతాబ్దికి జెందినట్లు తెలియును.[6] 'మీనాండరు క్రీ. పూ. రెండవ శతాబ్దికి జెందగా మిళిందుడు క్రీ. పూ. పదునాల్గవ శతాబ్దికి జెందిన వాడు. బుద్ధనిర్యాణ మనంతరము 570 ఏండ్లకు మిళిందుడను యవన ప్రభువు భారతమును బాలించినట్లును, పుష్యమిత్రుని రాజ్యస్వీకారము నకు బూర్వము, మౌర్యవంశములోని శాలిశుకుని పాలన మనంతరము యీ మిళిందుని ప్రవేశము భారతదేశమున సంభవించియుండునని డా॥ సర్కారు గారూహించుచున్నారు.[7]

చరిత్రకారుల దృష్టిలో నలెగ్జాండరునకు సమకాలికుడు మౌర్య చంద్రగుప్తుడగును. కనుక బుద్ధనిర్యాణము క్రీ. పూ. 439 యేడనియు, నీ విధముగా జూచినచో బింబిసారుని రాజ్యపాలనారంభము క్రీ.పూ. 543వ సంవత్సరము కాగా నాతని పాలనకాలము 54 సంవత్సరములు పోగా నాతని కుమారుని 8వ పాలన సంవత్సరమున బుద్ధ నిర్యాణము జరిగియుండినట్లు డా॥ సర్కారు గారు వ్రాసియుండిరి.[8] ఈ విధ మయినచో మిళిందుని కాలమిది-

మౌర్యుల పాలనకాలమారంభమయినది క్రీ. పూ. 324, శాలి శుకుని కాలము క్రీ. పూ. 204, పుష్యమిత్రుని కాలము క్రీ పూ.187. బుద్ధ నిర్యాణము క్రీ. పూ. 486వ సంవత్సరము.

దీనికైదువందల సంవత్సరములకు మిళిందుని కాలమనుచో నది క్రీ శ. 14వ యేడగును. అపుడు చరిత్రకారుల ఏకాభిప్రాయములో మిళిందుని కాలము క్రీ. పూ. 155 అనునది దోషమగును.[9]

---

6. Age of Milinda K, Venkata Chalam
7. Bhavans History Vol. II Dr. Circar P. 113
8 Ibid. P. 37
9. Ibid 113

పురాణముల కాలగణము ననుసరించి దీనినిట్లు నిర్ణయింపవచ్చును.

పురాణముల ప్రకారము :- మౌర్యచంద్రగుప్తుని నిర్యాణము క్రీ. పూ. 1534 మౌర్యుని నుండి శాలిశుకునివరకు క్రీ. పూ. 214 పురాణములనుబట్టి బుద్ధనిర్యాణము క్రీ. పూ. 1807 మిళిందుని కాలము బుద్ధునికై దునందు యేదుల యనంతరము క్రీ. పూ. 1307 శాలిశుకుని కాలము 1544_214=1320 నాటికి పూర్తియగును. ఈ మిళిందుని కాలము క్రీ. పూ. 1320_1307 లో నుండును. ఈ కాలమునే విశ్వనాథ తాను స్వీకరించలేదని యాయన పీఠికలోని వాక్యము స్పష్టమొనర్చును.

"ఈ నాగశయనుని మిళిందుడు మీనాండరు కాలముతో సరిపోక పోవచ్చును. సరిపోదు. వారికాలము ప్రధాన విషయములందే సరిపోవనపుడు ఒక నవలలోని మిళిందుడు మీనాండరు కాకపోవుటలో, సరిపోక పోవుటలో తప్పులేదు."

ఇట్లీ నవలా రచనమున తనస్వేచ్ఛావృత్తి నవలంబించినాడు. చారిత్రకముగా నవల శాతవాహనుల కాలమునకు సంబంధించినదేకాని మిళింద నాగసేనులకు, శాతవాహనులకు చారిత్రకముగా నెట్టి సంబంధము లేదు.

సారాంశము :- 1) మిళిందుడు, 14వ శతాబ్దికి, మీనాండరు క్రీ. పూ. 2వ శతాబ్దికి చెందిన వేర్వేరు రాజులు. 2) మీనాండరు అలెగ్జాండరు తరువాత వాడని పాశ్చాత్య చరిత్రకారులు నయితము చెప్పుటచే నీతడు భారతదేశపు రాజు కాడు. 3) పాశ్చాత్యులీమీనాండరు, మిళిందుడు నొకడే యను నభిప్రాయము కలిగియున్నట్లు వారి గ్రంథముల వలన తెలియుచున్నది. 4) మిళిందునకు (భారతీయ రాజు) నాగసేనునకు జరిగిన సంవాదగ్రంథము మిళిందపన్హా. ఇది పాశ్చాత్యులు మీనాండరు నాగసేనునకు జరిగినట్లుగా వ్రాసిరి.

# నాగసేనుడు - ఇతివృత్తసంగ్రహము

గిరివ్రజమును నాడు పాలించెడి వారాంధ్రులు. వీరి వంశము నందు ఇరువది నాల్గవ రాజైన శివశాతకర్ణి నాటి మగధ చక్రవర్తి. ఈ రాచనగరుకు సుంత దవ్వైన గ్రామము కజంగాల. అది పూర్వము శివక్షేత్రమయ్యు నీకథా కాలము నాటికి బౌద్ధముచే ప్రభావితమయ్యెను. అందు వసించుచున్న దొక్క విప్రకుటుంబము. శోణోత్తరుడా యింటి యజమాని. అతడు వేద వేదాంగ వేత్త. తర్క వ్యాకరణ శాస్త్రములందు పండితుడు. ఈయనకు మువ్వురు పుత్రులు. పెద్దవాడు ధూర్జటి. మధ్యముడు నాగసేనుడు. కనిష్ఠుడు శౌరి. వీరు మువ్వురును విద్య సమముగనే తండ్రి యొద్ద నేర్చిరి, కాని నాగసేనుని ప్రతిభ భాసమానమగుచున్నది. బౌద్ధులతో వివదించుట కీయన బౌద్ధ గ్రంథముల నామూలచూడముగ జదివినవాడు. పండిత సభలకు బోయి వాదములొనర్చి హిరణ్య, రజత శలాకలు, సేలువలును దెచ్చును. అన్నగారికి ధనమొసంగి కుటుంబ పోషణకు దోడ్పడును. శౌరి కీతడన్నచో నీర్ష్య. తన చదువు నీతని చదువు నొక్కటియే యనియు నాత డూహూర దిరుగుననియు నాచత్రములోని వారితో చెప్పును. నాగసేనుని వంటిపండితులకు నైశ్వర్యవంతులతో గల పరిచయయిచే నొక సుప్రసిద్ధమైన, పరిమళ భరితమైన 'జగళము'ను మాదక పదార్థమును ప్రాప్తింపజేసికొని దాని ననుభవించును. శౌరి తన హస్తలాఘవముచే దీనిని సంగ్రహించి యా చత్రములోని వారికొసంగి వారి దయకు బాత్రుడగుచుండెను.

ఆచత్రములో నలుగురు ధనవంతులు గలరు. అందులో నొక డంబష్టుడు. అతడు బౌద్ధుడు. అతని పేరు నాగ గౌతముడు, ఈతడు కొన్ని విహారములందు తన వృత్తిపయి యాధిపత్యము వహించును, నాడు విహారములో గౌతమీపురి విహారము వాసికెక్కినది. దానికి శిలాభద్రు డధికారి, శిలాభద్రునకు నాగగౌతమునకు జెలిమి. శౌరి పెద్దలతో స్నేహనిమిత్తమై శివనాగాదులకు నా యుత్తమ జగళమును రుచి

చూపెను. దానిని సంగ్రహించుటకై తన యింట తానే చౌర్యమును నిర్వహింపజేయు దుఃస్థితిని బొందెను. జగళము నిచ్చితన గౌరవమును పెంచుకొనుటయు, శివనాగునకు, నగరాధిపతియైన యాజీవకునకు గల చెలిమిని తన యుద్యోగ సాధనకు ప్రాతిపదికగా జేసికొనవలెనని యెంచెను.

నాగసేనుని పెట్టె దొంగలింపబడిన యుదంతమును పర్యటనానంతరము తిరిగి వచ్చిన యాతడెఱింగెను. ఈ చౌర్యము శోణోత్తర కుటుంబ విచ్ఛిన్నమునకు దారితీయగలదని యాశించిన శివనాగున కాశాభంగమయ్యెను నాగసేనుని యద్భుతనీతి దొంగలింపబడిన పెట్టె మరల యింటికి జేరుటకు గారణమయ్యెను తండ్రి పనుపున జ్యోతిష ఖగోళ శాస్త్రముల నధ్యయనమొనర్చుటకు నాగసేను డిల్లు వెడలెను. పెట్టె యింటికి వచ్చుట శౌరికి భయముతో గూడిన యాశ్చర్యమయ్యెను. శిసునాగు కడకు వచ్చిన యాజీవకుడు శౌరిని గాంచి యాతని కుద్యోగమిచ్చెను. శౌరిని తిప్పలు పెట్టుదమనుకొన్న శివనాగునకు నీ సంఘటన మరింత బాధాకరమయ్యెను. కజంగాల గ్రామము లెక్కలు చూచుట యాతని యుద్యోగము. చత్రపు రాజధానియైన నీలాంగద ముద్యోగస్థానము. ఈతడు పెండ్లి కానివాడగుటచే దనకూతు గౌతమి నీతని కీయనెంచిన యుదంతమును గౌతమీపుర విహారాధిపతియైన శిలాభద్రుని యాంతరంగికుడైన పరావర్తకు డెఱింగి నిరసించెను. బౌద్ధమతము బ్రాహ్మణునిచే నాశమగునని యాయన యుద్దేశ్యము. కాని వివాహము జరిగెను. శివనాగుపై శౌరి పగ సాధించుట నారంభించెను. శివనాగు నీలాంగదమునకు బిలిపింపబడి యభియోగములు మోపబడెను. శివనాగు కొంత గడువడిగి తన గ్రామము చేరి యచటి ధనవంతులను కూడగట్టుకొని విహారమునందలి శ్రమణకుని నాయకత్వమున నీలాంగద విషయముపై రహస్యవిప్లవము కొనసాగింప నిశ్చయించెను.

శౌరి తద్రహస్య విప్లవ సూచనలను తన యసమాన ప్రతిభచే గ్రహించి యధికారమును మామ నుండి సంగ్రహించి సర్వాధికార వర్గ సహకారముతో నా విప్లవమును రూపఱజేసి రాష్ట్రాధిపతుల మన్నన బొందెను. శౌరి విషయాధిపతిగా నొనర్చబడెను. ఆజీవకుడు పదవీ విరమణ మొనర్చెను. శివనాగు ప్రత్యేకముగా శిక్షింపబడెను. శౌరి తన యసమాన రాజకీయ చాతుర్యముచే దక్షిణరాష్ట్రముల కధిపతియయ్యెను. రాజధాని పేరు కాళిందీ నగరము. ఇప్పుడు తాను గిరివ్రజమునందలి నలువుర మహాసేనానులలో నొకడు కావలెను. శౌరి యాకాంక్ష యట్టిది. శౌరి తాను మహాసేనాధిపతులలో నొకడు గాకుండుటకు నడ్డుచున్నది, తన బ్రాహ్మణ ధర్మమని తెలిసికొనెను. తాను బౌద్ధుడగుటతో నిది పరిష్కరింపబడుననియు తోచలేదు. తన తల్లిదండ్రులు, పెద్ద యన్న ధూర్జటి, బౌద్ధులు గావలెనని యెంచెను సమీప బంధువులలో మానవుల వివేకము బనిచేయనట్లే తాను చేయవలెనని యీ కార్యమును నిర్వర్తించుటకు తన గ్రామము నందలి శివనాగు సహకార మర్థింపక దప్పలేదు. శివనాగును బిలిపించి తద్యత్న సాఫల్యమొనర్ప నర్థించెను. శివనాగు తన పూర్వవైరమును శౌరి తల్లిదండ్రుల కడ సాధింప నెంచెను. వాడు ధూర్జటిని బిలిచి బౌద్ధమత స్వీకారము చేయగా గోరెను. ఇది రాష్ట్రాధిపతియైన శౌరి యాజ్ఞగా హెచ్చరించెను. ధూర్జటి దానిని సరకు గొనలేదు. క్రుద్ధుడైన శివనాగు శోణోత్తరుని యిల్లు ఆ గ్రామములోని 'మల్లయ్య' యను రజకునిదిగా సాక్ష్యము పుట్టించి విషయాధికారిచే శోణోత్తరుని కుటుంబమును వెడల నడిపెడి యాజ్ఞయందు జిక్కి శౌరితల్లి మరణించెను. శివనాగుడు తాను చేసిన తప్పిదమును గ్రహించి కాళిందీనగరమును చేరి శౌరికి సర్వము నివేదించెను, నాగసేనుని యునికి దెలిసి యాతనికి గబురంపి శౌరి కజంగాలకు తల్లి యపరకర్మల నిర్వహణ నిమిత్తమై బయలుదేరెను.

కజంగాలయందు శౌరి తల్లి కపర కర్మలు వైభవోపేతముగా నిర్వర్తింపబడెను. నాగసేనుడు నచటకు వచ్చెను. విధి నిర్వహణానంతరము శౌరి వెడలుచుండగా నాగసేనుడు బిలిచి గిరివ్రజమున మహాసేనాధిపతులలో నొకడగుటకు తమ తల్లిదండ్రులుగాని, యన్నగాని బౌద్ధమును స్వీకరింప నక్కరలేదనియు, దాను వారి గ్రంథములందైనను, తర్క వ్యాకరణాది శాస్త్రములందైనను రాణి గౌతమీ దేవిచే నియమింపబడిన బౌద్ధ శ్రమణకు పండితులతో వాదింతుననియు' నోడినచో దాను బౌద్ధమును స్వీకరింతుననియు. గెలిచినచో మహారాణి శౌరికి సేనాపతి పదవి ననుగ్రహించవలెననియు, జెప్పవలసినదిగా గోరెను. శౌరి తనయన్న ధూర్జటిని కాళిందీపురమున కాహ్వానించి యా యూరు నుండి వెడలెను,

కతిపయ దినములకు భార్యయొత్తిడి పయి ధూర్జటి కాళిందీపురమునకు తమ్ముని జూడనేగెను. తనకుగల రాజకీయ వ్యవహారములతో నన్నతో మాటాడుటకు దీరిక చిక్కక శౌరి యాతని వినోద నిమిత్తమై యాయూర తిరిగెడి బిచ్చగానిని బిలువ సేవకుని గోరెను. అతడు వెలియోనను. అతడు మ్లేచ్ఛ గీతములను పాడును, ఈతని కీర్తనలందు గల మ్లేచ్ఛత్వమును, రహోదంతమును సేవకుడు శౌరికి తెల్పెను వాని పాటలను విని మొదట నసహ్యించుకొనువాడు. దినములు గడచిన కొలది శ్రవణ పేయముగా ననుభవించుటయే లక్ష్యముగా నుండెను. శౌరితో మాటాడిన యనంతరమా ప్రదేశమును వీడి కజంగాలచేరెను. ధూర్జటి యా ప్రదేశమును వీడుట కచటకు జేరిన కబంధుడు హేతువు.

ఈ కబంధుడు మహాసహ్యమును గొలుపురూపము కలిగి యుండును. ఈతని నిస్వనము మ్లేచ్ఛనాదసదృశము. గౌతమి కాతని రూపము వినోదము కల్గింప శౌరి కసహ్యమయ్యెను. కొన్ని సంఘటనల వలన కబంధుడు శౌరికి విజయ కారకుని వోలె పొడగట్టెను. తన

సైన్యాధికార పదవీ కాంక్ష తిరిగి తలయెత్తెను. నాగసేనుని ప్రణాళి కయే యప్పటి కవశ్యాచరణీయముగా దోచెను. దీనికి గౌతమీపుర విహారాధి పతియైన శిలాభద్రుని సహకార మత్యంత దోహద ప్రద మని యెంచి యాతని బిలువ బంపెను.

శిలాభద్రుడు కొందఱు శిష్యులతో, నిద్దఱు శకస్త్రీలతో కాకిందీ పురమున కేతెంచెను. శౌరి యింట విడిసినవారు నగరమందెల్లెడల పర్యాటము చేసి యంతకుముందున్న శైవమతాభిమానులను బౌద్ధ మతస్థులుగా నొనర్చి యత్యంత గౌరవమునకు బాత్రులైరి. గౌతమీ దేవి కీమార్పు సంతోషదాయక మయ్యెను.

తన యన్న నాగసేనుని నియమమును శౌరి శిలాభద్రుని కెఱిం గించెను. ఈలోపున శౌరి తనయింట నున్న కబంధుని వలన ఖడ్గ విద్యా చాలనములోని యనేక మయిన మెలకువల నొడిసిపట్టెను. శిలాభద్రుని కార్య వైశిష్ట్యమున కుద్దీపనముగా నాతడు రజతాచల విహారాధిపతి యయ్యెను. ఈ యుపకృతి తనకు శౌరివలననే లభించియుండునని నిశ్చయించి యాతనికి సేనాపతి పదవి ననుగ్రహింప వలసినదిగా రాణిని ప్రార్థించెను. శౌరిని గిరివ్రజము రావలసినదిగా నామె శిలాభద్రునితో జెప్పిపంపెను. గిరివ్రజమున పదవిని సంపాదించుటలో మహాసేనాధిపతి మేఘస్వాతి కరుణ ప్రాముఖ్యము వహించునని శిలాభద్రుడు శౌరికి సూచించెను.

తనకు గావలసిన ధనమును కబంధుని కరుణచే నొక వైశ్యుని వలన పొందెను. శౌరి సకుటుంబముగా, కబంధ సమేతముగా గిరివ్రజము చేరెను. అచట తానూహింపకనే నాగసేనుడు ప్రత్యక్షమగుట శౌరి కచ్చెరువు గొలిపెను. నాగసేనుడు తాను గిరివ్రజమునకు రాగల్గిన యుదంతము తనగురువు ఉపదేశించిన మంత్రోపాసనతో మిళిత మయిన దనియు,నిచటనే తన లక్ష్యము నెరవేరనున్నదని యామంత్రాధి

దేవత నిర్దేశించిన విధము నెరింగించెను. శౌరి మేఘ స్వాతిని జూచెను సంభాషణ పెరిగి వారిరువుర క్షత్రియుద్ధము, యువరాజయిన గౌతమీ పుత్రశాతకర్ణి యెదుట ప్రదర్శితమగుటకు ప్రోవ యయ్యెను. క్షత్రియుద్ధ మున శౌరిదే పై చేయి యయ్యెను, నిరువురు సములుగా నిర్ణయింప బడిరి. మహారాణి యనుగ్రహము లభ్యము కాలేదు.

మహారాణితో ప్రత్యక్షముగా శౌరి తన పదవీ కాంక్షను, నాగ సేనుని నియమమ్మును విన్నవించెను. నాగసేనుని యారాణి చూడ గోరెను. నాగసేనుడు రాణిని దర్శించెను. పరస్పరము వీక్షించుకొనిరి. ఆమె శృంగార రసాధిదేవత యయ్యెను. నాగసేనుడు సన్యసించెను. బౌద్ధుడై మిళింద సంవాదమును రచించెను. అదియే మిళింద పన్హాయను బౌద్ధ వేదాంతగ్రంథము. పాళీభాషలో నిది రచింపబడెను.

## నాగసేనుడు-ఇతివృత్త నిర్వహణము

ఈ క్రింది యంశములతో రచయిత యీ నవలను నిర్వహించెను.

1) మూల కథ యందు నాగసేనునకు, నవలయందలి నాగ సేనునకు గవి కల్పించిన భేదము - తత్ప్రయోజనము 2) శౌరి పాత్ర వలన నాగసేనునకు గల్గిన ప్రాధాన్యము, 3) రసోద్దీపనమునకయి నవల యందు కల్పింప బడిన సన్ని వేశములలో:-

1) శౌరి ప్రతిభ బయల్పడిన తీరు 2) కబంధుని యనుబంధము. 3) మహారాణి గౌతమి పాత్ర 4) నాగసేనుని యుపాసనా రహస్యము 5) సైరను శక పరిచయము. వీనిని పరిశీలనము గావింతము.

1) మూల కథయందు నాగసేనుడు బౌద్ధుడై యనంతరము బౌద్ధమత ప్రచారమొనర్చెను. మిళిందుని రొాదించి యాయనను బౌద్ధము స్వీకరింపజేసెను. కాని నవల యందట్లుకాదు.

నాగసేనుడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడు బౌద్ధు డెట్లయ్యెను? మూలమునందది స్పష్టముగా నిర్వచింపబడెనా ? ఈతడు కారణ

జన్మమడు, మిళిందుని యోడించుటకయి జన్మించినవాడు, ఈ విషయ మంతయు జారిత్రక పూర్వరంగమందు ప్రస్తావన చేయబడినది. వేదాధ్యయ నానంతరము వేదమతము నందేమియు లేదని నిరసించి గుర్వనుజ్ఞచే బౌద్ధమును స్వీకరించినట్లు మూలకథ. దీనిని యథాతథముగ స్వీకరించినచో గవికి కొంత కష్టము గలదు. ధర్మాభిరతుడుగ, సంప్రదాయ ప్రచారకునిగ, నొకనిర్దిష్ట లక్ష్యమును జేరుటకు యత్నించెడు రచయిత నాగసేనుని మత స్వీకారము నెట్లు సమర్థించును? సహృదయ ప్రరోచన కిది మార్గమును కాదు. ఎట్లును నాగసేనుడు బౌద్ధుడై మిళింద పన్హా' వ్రాసెనను విషయము చెప్పవలసియే యున్నది కాని దీని నదే విధమున నవల యందు జిత్రింపలేదు. తన యనుజుడైన శౌరికి సేనాధిపతి పదవి నొసంగుటకు దన వైదిక మతమును పణముగా బెట్టినట్లు కవి కల్పించెను. ఇదియొక చిత్రమైన కల్పనము. ఈ కల్పనచే సాధించిన ప్రయోజనములు,

1) రచయిత ప్రధాన లక్షమైన ధర్మాభిరతి-దానికి మూలభూతమయిన వేదాదులను దీనిచే నిరసించినట్లు కాలేదు. 2. బౌద్ధుడై బౌద్ధమతమును ప్రచార మొనర్చి యితరులను తన్మతమార్గులుగ నొనర్చుట యను లక్ష్యము నెట్లు సిద్ధింపజేయును ? కనుక నిట్టి కథ కిందు స్థానములేదు. 3. ఉపనిషన్మత మార్గముననే నీ ప్రశ్నోత్తరములను గునిరింతునని మహారాణి గౌతమికి మాట ఇచ్చెను. (285) నాగసేనుని యీ ప్రణాళి క తనలక్ష్య సాధన కేయడ్డంకును తెచ్చి పెట్టదు. 4. చారిత్రకముగా నీపాత్రకు కవియొనర్చిన ద్రోహమొద్దియును లేదు.

ఈ విధముగా నాగసేను డిందు విలక్షణమైన స్థితిగల్గిన వాడు.

2) నాగసేనుడు తనకు దాను వ్యక్తిత్వము గల్గినవాడయ్యెను, ధూర్జటి, శౌరి పాత్రలచే నీతని కధిక ప్రాధాన్యము గల్గునట్లు రచన మొనర్చెను, పరత్వము నందు భగవత్తత్త్వము యొక్క పరాకాష్ఠ

తెలియదు. అట్లే నాగసేనుని పాత్రచేత నేతత్కాతౌన్నత్యము తెలియ సాధ్యము కాదు. తత్కారణమున ధూర్జటి యను నగ్రజుని, శౌరియను ననుజుని పాత్రలను సృజించి వీరికంటె నాత డెట్లెక్కువయో నిరూపణ చేయుటకు వీలుగా నితివృత్తమును నిర్వహించెను. ఇది యొక విశిష్ట మైన నిర్వాహము.

మూలమునందు నాగసేనునకు నన్నయు, దమ్ముడు నున్నట్లు మనకు దెలియదు. వీరు శ్రీవిశ్వనాథ ప్రణాళికలోని వారు. అందు ధూర్జటి అన్వర్థనాముడు. శౌరి బౌద్ధము గాక మఱియే మతమయినను నతని పదవీ ప్రగతికి దోడు పడుచో సమ్మతమనునట్లు చిత్రించెను.

ఇక నాగసేనుని చిత్రించిన విధమును గుఱించి యాతనికి వైదికమత మందభిమానము లేదా ? యనుచో నాతడే యిట్లనును.

"నాకు భగవంతుని మీద విశ్వాసము గలదు. ఈ బౌద్ధులకు లేదు. వారికి భగవంతుడే లేడు. వారిది శూన్యవాదము." (28) అని యని బౌద్ధమత నిరాసమొనర్చెను. తండ్రియైన శోణోత్తరునకు నాగ సేనుని కుశాగ్ర బుద్ధి తెలియును. 'కత్తికిగల యిరువాడి వంటె దీతని ప్రతిభ, యని తెలియును.ఆ విషయమును మనకు రచయిత యొక సంభా షణలో వ్యక్తము చేయును. మనవిద్యల రహస్యమెట్లు తెలియునను నాగసేనుని ప్రశ్నకు తండ్రి గణిత ఖగోళ శాస్త్రాధ్యయనమును సూచించును. అపుడు నాగసేనుడు-

నాయనగారు ! నాకు సరియైన మార్గము చూపించితిరి." యని కర్తవ్యోన్ముఖు డగును.

భారతీయ ధర్మ ప్రతిపాదకములైన వేదవిద్యలేగాక బౌద్ధమత మందలి యనేక గ్రంథములను జదివి వారిని తార్కికముగా నెదిరింప గలిగిన దిట్ట నాగసేనుడు. ఈ విధమయిన ప్రజ్ఞ చేతనే మిగిలిన యిరు పురకంటె నీతని విశిష్టత ప్రత్యగ్రముగా భాసించుటకు వీలగును. శౌరి

పాత్రవలనను నాగసేనునకు ప్రాధాన్యము వచ్చునట్లుగా నిర్వహించుట యితివృత్త నిర్మాణములోని విశిష్టత. శౌరి పదవి కొఱకు నాగసేనుడు తన మతమును పణముగా నొడ్డుటకు నిశ్చయించుకొనుట ఇదియే యితి వృత్తము లోని కీలకమనదగి యున్నది. కాని ఇట్లది కొనసాగలేదు. మహారాణి గౌతమీ ప్రణయ దృక్ప్రసారముతో నాగసేనుడు సన్న్యసించినట్లు, 'మిళిందపన్హా' యను గ్రంథము వ్రాసినట్లు చెప్పబడెను. శౌరికి పదవీ కాంక్ష లేనిచో నీ పణము యొక్క ప్రస్తావనయే యుండె డిదికాదు. అట్లే మహారాణి గౌతమీ దర్శనము నాగసేనునకు సంభవించి యుండెడిది కాదు. నాగసేనుని బౌద్ధమున కివి యావశ్యకమయిన సన్నివేశము లనునట్లు కవి సంకల్పించెను.

3) రసోద్దీపనమునకయి నవల యందు కల్పింపబడిన సన్నివేశములు-

1) శౌరి పాత్రమీద పాఠకునకు నారంభము నుండియు వైరస్యమే. రచయిత వాని నొక లక్ష్యము మీద నిర్మించెను. వాని ద్వారముననే నాగసేనుని ప్రతిభ ప్రకాశింప వలసియున్నది. కనుక వానికి బౌద్ధము మీద నభిమానము కల్గించెననుట కంటె బదవిమీద వ్యామోహము గల్గినవానిగా జేసెను. నాటిమతము బౌద్ధము గనుక దానిని శౌరి తన కనుకూలముగా నుంచుకొనెడి వ్యవహార దక్షుడయ్యెను. చక్రములోబడి శివనాగుతో చెలిమిచేసి యింటి గుట్టును బయట బెట్టి శివనాగుని విడిచి యాజీవకుని కరుణచే రాజోద్యోగమును సంపాదించెను. ఆజీవకుని కుమార్తెను బెండ్లి యాడెను. అతడు పై పై యుద్యోగములు జేరుటకు దగిన సన్నివేశములను గల్పించి మహాసేనాధిపతి పదవి వరకు బంపెను. అక్కడ నాగసేనుని యావశ్యకత గలుగునట్లుగా నిర్వహించెను.

2) శివనాగు దుష్కృత్యములు నవలలో సముచిత ప్రాధాన్యము వహించి యధికారుల ప్రాపకమును సంపాదించుటకు గ్రిందివారెట్టి

నీచములకు పాల్పడుదురో తెలియజేయును. శారసీలాంగద రాష్ట్రాధికారి యగుటకు దోడ్పడిన సన్నివేశమును దీని కుదాహరణ మగును.

3) కబంధునితో ననుబంధము :- ప్రారంభమున తనయన్నగారైన ధూర్జటి వినోదము కొఱకు గొని రాబడినను నాతని వికృత రూపము, రాక్షస భోజనము, వికట నృత్యములు శౌరికి దర్శనీయములయ్యెను. అతడొక దేవతవోలె వానికి సర్వకార్యసిద్ధికయి యవతరించిన వానివలె నయ్యెను, ఈతడు జయద్రథుడేగాని యన్యుడు,గాడని నాగసేనుడు తనకు వచ్చిన యనుభవముచే నిర్ణయించును. వైదికేతర మత ప్రోత్సాహకర్తగాన శౌరిని వరించెను, ఆధిపత్య మిప్పించెను. ధూర్జటి సంప్రదాయజ్ఞుడుగాన వీని బారినుండి తప్పించుకొనెను, నాగసేనుడు తన మార్గమేదియో వీనినుండియే యెరింగెను. ఇట్లీ మూడు పాత్రల కనుబంధ మీ కబంధునితో గలుగునట్లు యితివృత్తమున సన్నివేశములు కల్పించెను, ఇది హాస్యరసజనకమై పాఠకులకు రచయిత భావనలోని వైదిక, వైదికేతర ధర్మములను సుస్పష్ట మొనర్చుటకు గల్పింపబడినట్లు తెలియును.

4) మహారాణి గౌతమి :- మూలమున మహారాణి గౌతమి పాత్రకును నాగసేనునకు నెట్టి సమన్వయము లేదు. ఈ పాత్రకు నాగసేనుని బౌద్ధమత స్వీకరణమునకును రచయిత సంబంధమును గల్పించెను. శాతవాహనులు బౌద్ధులు. వీరిలో 17వ రాజు పాలనము సప్తర్షి మండలము భారతయుద్ధ కాలమునుండి ఒక యావర్తి చేసినదని చెప్పుట యొక చరిత్రాంతము. దీనికయి శాతవాహనులలో నాకాలములోని రాజును నవలలో నిబద్ధింప వలసివచ్చెను, ఇందు కల్పన లోని విశేష మేమన, మహారాణి గౌతమి విహారభూమికి వెడలినపుడు తమ్ముని ప్రేరణతో నాగసేను డామెను దర్శించును. ఆమెను జూచుటతో పరస్పర శృంగారోద్దీపన భావములు పొటమరించును. "అప్పుడు

రాణి నవ్వెను. ఆనవ్వులో దిరస్కారములేదు. అహంకారములేదు. ఒక పరిచయమున్నది. అందులో శృంగారరసము లేదనుటకులేదు."284

ఇది నాగసేనుడు 'మిళిందపన్హా' యను గ్రంథము వ్రాయుటకు గల్పింపబడిన రసప్లావితమైన సన్నివేశము. ఈవిధముగా నీగౌతమీదేవి పాత్రకు సముచిత ప్రాధాన్యములభించి నాగసేనుని గ్రంథ రచనకు సమర్థమైన హేతువును స్థాపించెను.

5) నాగసేనుని యుపాసనము :- నాగసేనుడు చంద్రశేఖర మిత్రుడను మహామహుని యొద్ద సప్తర్షి గ్రామమున విద్యనభ్యసింప నేగెను. అభ్యాసము వీని భాగధేయముచే గుదురలేదు. అతడు వీనివి. గుఱించి "నీజాతకము చాల చిత్రమైనది. నీవు మహా తార్కికుడవు సభలలో నీముందెవ్వడును నిలువలేడు, నీకేయుపాసనయు సిద్ధింపదు. నీకు గొప్పవైరాగ్యము కలుగును. వైరాగ్యము కలుగుటకు చాల నీచమైన హేతువుండును. (267) అని పలుకును. ఇంకను-

నీకొక్క మంత్రము నుపదేశింతును. దానిని జపించు చుండుము. నీవొక గొప్ప వేదాంతి వగుదువు. ఆ వేదాంత ముపనిషన్మార్గమున నుండదు. ఇవి జరుగనున్నకార్యములకు సముచితమైనహేతు కల్పనము నీచమైన హేతు వనగా 'గౌతమీ చేలాంచల స్పర్శయే యగును. ఆ మంత్రోపాసనలో భిన్న రూపములలో నొకవ్యక్తి కన్పించుచున్న వానితో సంభాషణ మొనర్చుచు-

"వ్యక్తి : నేను నీకొక లోకోత్తర సౌందర్యవతిని జూపింతును.

నా ; నాకా మహా సౌందర్యవతి యక్కరలేదు.

వ్యక్తి : అనుకొనుచున్నావు, ఆమెకు దాసాను దాసుడ వగుదవు ఆమె చెప్పినట్లు చేయుదువు.

నా : నేను సన్యసింతును

వ్యక్తి : ఓరీ ! నీవు నావలె నాస్తికుడవు." పే. (270)

ఆ మహాత్ముడు 'నీవు వేదమతము నింత సముద్ధరించుటకు ప్రయత్నము చేయుచున్నను నీకు భగవంతు డొకడున్న విశ్వాసము లేదు.' ఇది జయద్రథుని 'నాస్తికుడ' వను వాక్యముతో సమన్వయమును. ఈ విధముగా నాగసేనునకు మహారాణితో సమాగమమున కొక బలీయమైన హేతువును గల్పించి యితివృత్తమును నిర్మించుట యసామాన్య విషయము. ఇంకను నితి వృత్తమున బౌద్ధ మతములోని యనేక విషయములందలి యవకతవకలు, శిలా భద్రుని మత ప్రచారము మొదలగునవి నాటి కాలపు స్థితిని తెలియజేయును.

5) క్రీ. పూ. 550 వ సంవత్సరము "సైరనుశకము"గా వ్యవహారములో నున్నది. ఈ కథాకాలము క్రీ. పూ. 377 కనుక నప్పటికి 'సైరస్ శకము' వ్యవహారమునకు వచ్చి 173 సంవత్సరము లయ్యెను

"బాబిలోను సామ్రాజ్యమును నాశనముచేసి మీడియా సామ్రాజ్య మధికారములోనికి రా.గా సైరను మీడియా సామ్రాజ్యమును నాశము చేసి తానధికారములోనికి వచ్చి శక సామ్రాజ్యమును స్థాపించెను.వీరు కురువంశ రాజులకు దూరపుజ్ఞాతులగుటచే నాడు భారతదేశములోని రాజులు శకాధిపతియైన సైరసునకు సాయము చేసి పర్షియా సామ్రాజ్యమును నిలబెట్టిరి. ఇది కీ పూ 550 వయేడు. నాటి నుండి యీ శకమును గూడ భారతీయులు వాడుచుండిరి. తత్కారణమున నీ శకమును సయితము పరిచయము చేసి పురాణవైర గ్రంథ మాలా గౌరవము నినుమడింప జేసెను.

## పాత్ర చిత్రణము

నాగసేనుడు :- ఇందు నాగసేనుడు ప్రధానపాత్ర. చారిత్రక పాత్ర, బ్రాహ్మణుడై వేదవేదాంగ తత్త్వజ్ఞుడై, తర్క, వేదాంతాది శాస్త్రాభిజ్ఞుడై, బౌద్ధగ్రంథముల నామూలచూడముగ నాపోశనము పట్టిన పండితుడై తుదకు బౌద్ధమును స్వీకరించి శ్రమణకుడై 'మిలింద

---

పన్నా' యను బౌద్ధ వేదాంత గ్రంథమును రచించి ప్రథిత యశస్కుడయ్యెను.

"నాకు భగవంతుని యందు విశ్వాసము కలదు. ఈ బౌద్ధులకు లేదు. వారిది శూన్యవాదము." ఇది నాగసేనుని వ్యక్తిత్వము.

బౌద్ధముతో దన చదువునకు మఱింత మెఱుగు కల్గింపవలెననియు, వారిని వాదములో నోడింపవలెనని యత్నము. తండ్రి పనుపున మన విద్యల కాధారభూతమయిన ఖగోళ శాస్త్రాది విద్యలను జదివి శేఖరీభూతమయిన పాండిత్యము నార్జించి 'బుద్ధి యెరువాడి కత్తిగా' నొనర్చుకొనిన ప్రతిభాశాలి, కాని యిట్టి వైదిక మతాభిమాని, యన్యమత ఖండన యందనురక్తుడైన నాగసేనుడ్నుత బౌద్ధుడయ్యెను, అతని మతముపై నాతని కెంత ప్రత్యయము గలదో తెలుపుటకీ సన్నివేశము నుదహరింపనగును. శౌరి యుద్యోగ ప్రగతి కొఱకై తన కుటుంబసభ్యులను బౌద్ధులుగ నొనర్ప యత్నించుటతో శివనాగు దౌష్ట్యముచే నాతని తల్లి యసువులు వేడెను. శౌరితల్లి కపర క్రియలు నిర్వర్తించి రాజధానికి బోవుచుండగా నాగసేనుడు శౌరితో నిట్లనును.

ఓ రేయ్? శౌరీ! మీ మహారాణి నిన్ను మహాసేనాధిపతిని జేయుటకు తండ్రియు, నన్నయు బౌద్ధులగుట యెందులకు? నేను వత్తును తర్కమో, వ్యాకరణమో, తుదకు వారి పిటకములు, సుత్తములైనను సరే! మహారాణి కిష్టమైన పండితులను బిలిపించు మనుము. నేను వాదింతును. నన్ను వారోడించిరచో నేను బౌద్ధమును స్వీకరింతును. నన్నోడింపలేనిచో మన కుటుంబ ప్రసక్తి లేకుండ మహారాణిగారు నిన్ను మహాసేనాధిపతిని చేయవలెను. ఈ నియమముతో వాదింతును. (16)

మతముపై నెంతటి ప్రత్యయము లేకున్నచో తమ్ముని పదవికి నత మతమును బణముగా బెట్టును ? ఇట్టి వ్యక్తియొక్క మతముపై

గల పరమవిశ్వాసమును బహిర్గతమైనదిగా దేల్చివైచినాడు. అంతర్గతముగా నీతనికెట్టి ప్రత్యయము లేదనుచున్నాడు రచయిత. ఇట్లు చెప్పనిచో నాతడు బౌద్ధమును స్వీకరించుట చెల్లదు కదా !

మూలమునందిట్లు లేదు తండ్రిచే వేదాది సమస్త వాఙ్మయ ప్రబోధితుడై యిందు సారములేదని నిశ్చయించినవాడు. ఇక్కడ యట్లు కాదు. లోకమున ననేకులు వేదమతము నభిమానించు చున్నట్లే యుందురు. పరమ విశ్వాసమును బ్రదర్శించుచునే యుందురు, కాని యా విద్యల తత్త్వమెఱుగ యత్నింపరు. ఉపాసనామార్గము జోలికి పోరు. ఇట్టివారు దేశమున కొనర్చు మేలు కంటె కీడు మిగులు. కనుక రచయిత నాగస్వనుని యీపై కృతికి ప్రధాన హేతువును అంతర్గతమయిన విశ్వాసపరముగ సమన్వయించెను. చూడుడు-

సప్తర్షి గ్రామములోని చంద్రశేఖర మిత్రుడను వేదవేత్తకడ నీయన మంత్రోపాసన నిమిత్తమై యభ్యర్థింప నాతడు వీని జాతకము చూచి- 'నీకే యుపాసనయు సిద్ధింపదు. నీకు గొప్పవైరాగ్యము కలుగును. ఆవైరాగ్యము కలుగుటకు చాల నీచమైన హేతువుండును." (పే. 267) "నీవు వేదమతము నింత సముద్ధరించుటకు బ్రయత్నము చేయుచున్నను నీకు భగవంతు డొకడున్నాడన్న విశ్వాసములేదు" అని పల్కెను, (పే, 267) ఇది యెంత ప్రమాద అలౌకిక విషయములందు విశ్వాసము పరమ ప్రమాణమగును. (శ్రుతియందొకచో నాముష్మికమున్నదా! లేదా! యని ప్రశ్నింప బడెను. "కోహి తద్వేద యద్యముష్మిన్‌లోకే స్తివా నవేతి। దిక్ష్వతీకాశాన్ కరోతి। ఉభయోర్లోక యోరభిజిత్యై" x ఐహికాముష్మిక విజయము కొఱకు యాగశాలయందు గవాక్ష నిర్మాణ సందర్భమున యజమానికి స్వర్గప్రాప్తిని గుఱించి ప్రస్తావింపబడిన సందర్భమిది.

---

x అముష్మిక లోక మున్నదో లేదో ఎవడెఱుగును ? (ఎవడు చూచినాడనిశంక)

కాని యా గురువొక మంత్ర ముపదేశించును. ఆమంత్రాధి దేవతయో, యద్దేవతయో నీ నాగసేనునకు గానవచ్చును అందాతడు చెప్పినది నాగసేను డొక మహా సౌందర్యవతికి దాసానుదాసుడగుటను గుఱించి. ఇదియే గురువు చెప్పిన నీచమైన హేతువు. అంత నాగ సేనుడు - "నేను సన్యసింతును.

వ్యక్తి - ఓరీ నీవును నావలె నాస్తికుడవు" పే. (170)

ఆ నీచమైన హేతువు సంప్రాప్తించెను. మహారాణి గౌతమి నాగసేనుల పరస్పర దృక్ప్రసారములు మన్మథోద్దీపకములయ్యెను. ఆమె చేలాంచల మీయనను స్పృశించెను. పరవశత్వము నుండి తేరు కొనెను. ఆమె ఉపనిషన్మార్గ సమాంతరముగ బౌద్ధ వేదాంతమును నిరూపింపుమని యాదేశమయ్యెను. 'మిలింద పన్హా' యను గ్రంథ మీయన రచించెను. త్రికరణ శుద్ధిగా సన్యాసము స్వీకరించిన తర్వాత కబంధుడు నాగసేనునితో సన్యాసము స్వీకరించిన యుదంతము ప్రసక్తము జేయును.

నా - "నా సన్యాసము సంగతి నీకెందుకు ?

క - నేను ఆ జయద్రథుడను." (286) నాగసేనుడు భ్రష్టయోగి.

రచయిత ఈ పాత్రనిట్లు నిర్వహించవలయుననియే నిర్ణయించెను. ఎట్లు ? నాగసేనుని సన్యాసము జయద్రథాత్మకమైనది. తన్నీచమైన హేతువునకును జయద్రథుడే యాలంబనము.

2) శౌరి :-

శౌరి నాగసేనుని సోదరుడు. అన్నలిద్దఱివలెనే యీతడు పండితుడు. తిండికి యింటిలోనివాడు. ఊహాలకు చత్రములోనివాడు. కాని యదృష్టము తఱుము కొనివచ్చినది. పదవి వరించినది. పదవి కొఱకు చత్రముఖులోని శివనాగు నాశ్రయించెను.

విషయాధిపతి యా జీవకుని శరణుజొచ్చెను. తన యింటనే

యన్న బోనపుపెట్టెను వొంగిలించెను. ఆ జీవకుని కూతు పెండ్లియాడి సర్వాత్మనా బౌద్ధుని వలెనే సంచరించెను. శివనాగును బందీగా వించి వారి ద్రోహమును బహిర్గతము గావించి తాను నీలాంగదమున కధిపతి యయ్యెను. తల్లి దండ్రులను, నన్నను సిలుగుల బడవేసెను. తల్లి మరణమునకు గారకుడయ్యెను. తన మహాసేనాధిపతి పదవి కయి నాగ సేనుని వైదిక మతమును పణముగా వాడుటకు నభ్యంతరము పలుక లేదు. అసహ్య పురుషుతయినను కబంధుని యాశ్రయించి ఖడ్గచాల నము నభ్యసించి యాతని యనుగ్రహమును వాంఛించెను. శిలాభద్రు నకు మెక్కబెట్టెను. (గంగాపురి సంఘారామ విహారాధిపతి)

ఇన్ని యొనర్చినను తన పదవియే తనకులక్ష్యము, కాని వైశిష్ట్య మేమన ఈతని కొసంగిన పదవులేవియు నపాత్రన్యస్తముగా లేదు. ఈ పాత్ర వలన నాగసేనుని పాత్ర కొక ముగింపు లభించినది. ఈతడు నిర్దేశించనిదే నాగసేనుడు మహారాణి గౌతముని గలియు సన్నివేశము గుదిర్చబడిది కాదు,ఆవిధముగా నిది యవసరమయిన పాత్రయగుచున్నది. ఒక్క మాటలో శౌరి లక్ష్యము "నా కభిమానము దేనిమీదను లేదు. నాయభిమాన మంతయు నేనుమహాసేనాధిపతి నగుటమీద నున్నది." పే (282) శౌరి లక్షణము లవియైనచో లక్ష్యమిది.

3) కబంధుడు :- ఇందు జయద్రధుడు కబంధుడయ్యెడు. రచయిత భావనలో వైదికమతేతరమయిన భావము కాలూనినకాలము భగవద్విరోధమును పెంపొందించెడి కాలమనియే. శాతవాహనులు బౌద్ధము నాదరించిరి. అట్లాదరించుట ప్రభువుల వలన సంభవించెను. కనుక గ్రంథమాల యందనున్యూత మయిన జయద్రధ పాత్ర యీ నవలయందు పాలకుని మార్పు చేయవలసిన యావశ్యకత తొలగెను. ఈత డొనర్చినది యేమన నొకమహామహులైన వేదవాఙ్మయ బ్రహ్మ, నాగసేనుని, తన యనల్ప ప్రభావముచేత నాస్తికుని, బౌద్ధ వాఙ్మయ స్రష్టగానొనర్చెను. ధర్మకర్మాభిరతున కిట్టి దుర్యోగము సంభవించుట

కెట్టి కారణమై యుండును ? కలికాలమే దానికి సమాధానము. అరణ్య పర్వమున. (4_297)

1) హేతుప్రత్యయవాదవి, చేతసులై, దైవనింద సేయుచును మఖ వ్రాతంబులు వ్రతములు బెడ, బాతురు దుర్మార్గకర్మపరులై విప్రుల్.

ఈ జయద్రథుడు కల్యంశగా నీ నవలయందు ప్రవేశించెను. ఈ నవలయందు వేదమార్గావలంబియైన బ్రాహ్మణుని పాషండమతమున కు మరలించి తన లక్ష్యమును సాధించెను.

ధూర్జటి :- ఎట్టి వ్యతిరేక పరిస్థితులున్నను ధర్మమునుండి వైదొలగని ధర్మ వీరులు కొందఱుందురు. అట్టివారిలో ధూర్జటి యొకడు. ప్రవరుడెట్టి సంకటమైనస్థితి నెదుర్కొనెను? దానికి లోబడక ధర్మవిజయ మందెను. ధర్మేతరమయిన వాసనకల్గించుటకు కబంధుడు ధూర్జటికి శౌరిగృహమున సంధింపబడెను. బహువిధములుగా దాని కాకర్షితుడయ్యెను.

"మొదటి దినమున ధూర్జటి వెలియోనను కీర్తనలువిని బావిలో స్నానము చేసివచ్చెను." "రెండవదినమున స్నానము చేయుద మను కొని చేయలేదు" "మూడవదినమున నా యూహయే రాలేదు (191)

ఇది ధూర్జటిపాత్రను రచయిత మలచినతీరును స్పష్ట పరచును. ఒక ధర్మకర్మాభిలాషియే అధర్మ భావమునకు లొంగుట యన్నచో నాతని ద్రఢిమను గూడ లాగివేయునంతటి యాకర్షణ ధర్మేతరమైన స్థితికిగలదు, అదితత్కాలసుఖ సంబంధియగు చున్నది. కదా!గీతయందు

యదగ్రేచానుబన్ధేచ సుఖమోహనమాత్మనః।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥18_39

నిద్రవేళను, ఇంద్రియవ్యాపారమాంద్యముచేతను, దీనివలన కల్గెడి జ్ఞానమాంద్యము, అనవధానరూపఫలమయిన జ్ఞానమాంద్యము లివి తామసమున కుదాహరణములై, యాత్మ కనుభవ వేళారంభమున

మోహహేతువులగుచున్నవి వీనిని దప్పించుకొన్నవాడు ధూర్జటి. తప్పించుకొనలేనివాడు శౌరి. నాగసేనుని పాత్ర-అదియొక ప్రత్యేకము.

## విశేషాంశములు

1) తర్కములోని పంచావయవి -త్రయవయవి (పే 30) ఊహాపోహాలను గుఱించిన శాస్త్రమును దర్కమని చెప్పుదురు ఇది స్వార్థానుమానము, పరార్థానుమాన మని రెండు విధములు తనంతతాను తెలిసికొనునది స్వార్థ మనియు నితరులకు తెలిపెడి మార్గమును పరార్థమనియు బేర్కొందురు. ఇందు ప్రతిజ్ఞ, హేతు, ఉదాహరణ, ఉపనయ, నిగమనములు పంచావయవములనియు, నుదాహరణోపనయవినా త్రయవయవి యనియు శాస్త్రము నిర్ణయించినది. ప్రస్తుతము మనదేశమందు గదాధరుని తర్కమే పఠన పాఠనములందు గలదు. శ్రీ విశ్వనాథ తన నవలయందు నాగసేనుని తార్కిక ప్రజ్ఞను వివరించుచు నీ ప్రశంసయొనర్చెను గాన దీనిని వివరింపవలసి వచ్చినది.

| | | |
|---|---|---|
| 'ప్రతిజ్ఞ' యనగా | సిద్ధాంతప్రతిపాదనము | 'పర్వతో వహ్నిమాన్' |
| 'హేతువు' | కారణాభిసంధి | 'ధూమవత్వాత్' |
| 'ఉదాహరణము' | సహచర్యత్వాత్ | 'యథామహానసః' |
| 'ఉపనయ' | పరిచయజ్ఞానత్వాత్ | తథాఅయంపర్వతః ధూమవాన్ |
| 'నిగమనము' | సిద్ధాంత నిర్ణయః | తస్మాత్ కారణాత్ అయం పర్వతః వహ్నిమాన్ భవతి। |

ఇందుగల యుదాహరణోపనయములు నిగమనమందే చేరి ప్రతిజ్ఞాహేతువులచే నిగమన ప్రాప్తియగుట జరుగును, గనుక దానిని 'త్రయవయవి' యని చెప్పుదురు.

2) బ్రాహ్మణులలో పెద్దవాడుండగా చిన్నవాడు పెండ్లియాడడు. అది వేద ధర్మము. సూర్యోదయము తరువాత నిద్రించు

వానికంటె నుండి పాపము సూర్యాస్తమయము మగుచున్నప్పుడు నిద్రించు వాని కంటకు పోవును. వాని దగ్గఱనుండి అగ్రేదిధిషువును జేరును. వాని నుండి పరివిత్తు, వానినుండి వీరహాని, వానినుండి బ్రహ్మహత్యా పాతకుని కడకు చేరును. X

"అన్నకు పెళ్లి కాక తమ్ముడు పెండ్లి యాడినచో వాడు పరివిత్తు. అప్పకు బెండ్లి కాని చెల్లెలిని బెండ్లి చేసికొనినచో వాడు అగ్రదిధిషువు.

వర్ణనలు :- నవలయందు రచయిత ఈ వర్ణనల నొనర్చెను.

1) శిలాభద్రుని భోజన వర్ణనము (2౩౦); 2) కబంధుని యాహార గ్రహణ వర్ణనము (24౦) చంద్రోదయ వర్ణనము(231) ౩) మహారాణి గౌతమి నాగసేనుల శృంగారోద్దీపన వర్ణనము.

1) "పంక్రెండు సార్లతడు విలక్షణమైన యాహారములు దీసికొనును. మొదటిసారి యావు వెన్న, రెండవసారి శేరు పచ్చి ద్రాక్ష పళ్లరసము. మూడవసారి యంజూర ఫలములు, నాల్గవసారి పాలతో నానవేసిన ప్రాసంగు నటుకులు. ఐదవసారి రొట్టె, - ఇట్లు నిద్రపోవు వరకు తినుచునే యుండును. (ఈరొట్టె యారాడును సున్నవి కాబోలు.) వాడు వట్టి శిలాభద్రుడు కాడు. వృకోదరుడు.

2) "వానిది నోరుగాదు! అదియొక యంత్రము. అంతటి గంగాళము వాడాకులుచ మోచేతులలో సదిమి యెత్తికొని నోటిలో బోసికొనుచుండెను. ఒక్కొక్కసారి యర్ధశేరు నోట బోసికొని నములు చుండెను. ఆ నములుట రెండురాళ్లు పెట్టి విసరుట." ఇది కబంధుని వికృతపు తిండి.

---

X సూర్యాభ్యుదితః సూర్యాభినిమ్రుక్తే, సూర్యాభినిమ్రుక్తః కునఖినీ, కునఖీ శ్యావదతి, శ్యావదన్ నగ్రదిధిషౌ। అగ్రదిధిషుః పరివిత్తే, పరివిత్తో వీరహనిః వీరహా బ్రహ్మహని। తద్భ్రుహన్ననాత్యవత।

అనూఢాయా జ్యేష్ఠాయాం సత్యాం కనిష్ఠాయాం యః ఊఢవాన్ స. అగ్రదిధిషుః

3) చంద్రోదయముచే భవిష్యత్సన్న్యాస సూచనము "క్రొత్తగా బౌద్ధమతము స్వీకరించిన యొక బౌద్ధ సన్న్యాసియొక్క యతుకులమీద జారిపోయెడు కావి వస్త్రగాక క్రొత్తగా జేవురులోముంచి తీసిన కాషాయవస్త్ర ధారియైన వాని వలె చంద్రుడు ప్రాగ్దిశ యందుదయించెను." చంద్రోదయముతో నాగసేనుని నూత్న సన్న్యాస గ్రహణ మిందు సూచింపబడినది.

4) శృంగారరస సముద్దీపనము :- నాగసేనుడు మహారాణి గౌతమిని వీక్షించెను, అప్పుడామె యున్న తీరు - "తానొక్క నిముసములో నిండుజవ్వనములో నున్న స్త్రీ యయ్యెను. అప్పటి యామె హేలా విశేషము, అప్పటియామెస్ప్రహణీయాకృతి, ఆమె యరమోడ్పు కన్నులు, నంతలో బలహీనములైన యంగకములు, రాచఠీవి బెడబాసి వంగిన యప్పటి యామె మూపు, రెండు పాదములు సరిగా ధాత్రిమీద మోపక యొక పాదముమీద నిలిచిన నిలుకడ......" ఇవి యన్నియు శృంగారోద్దీపన హేతువులే.

—o—

# 10. హెలీనా

## చారిత్రక పూర్వరంగము

బార్హద్రథులు, ప్రద్యోతులు, శిశునాగులు, నందులు, మౌర్యులు, శుంగులు. కాణ్వులు, ఆంధ్రులు మగధను కేంద్రముగా జేసికొని భారతమును, కల్యాది 2775 సంవత్సరము లవిచ్ఛిన్నముగా నేలిరి. ఆంధ్ర భృత్యులను నామాంతరము గల్గిన గుప్తులు క్రీ. పూ. 327 నాటికి మగధను వీడి పాటలీపుత్రము కేంద్రముగా భారతము నేలిరి. కల్యాది 2775 క్రీ పూ. 327 నకు సమానము,

ఈ గుప్త లేడుగురు. శ్రీ గుప్తుని, మనుమడు, ఘటోత్కచుని కుమారుడు నగు చంద్రగుప్తుడు మొదటగా నాంధ్రరాజుల కడ సేనాపతిగానుండి యనంతరము రాజ్యమును గైకొని పాలకులయిరి. ఆంధ్ర రాజులలో చివరి రాజైన చంద్రశ్రీని సంహరించి చంద్రగుప్తుడు రాజయ్యెను. చంద్రగుప్తున కిద్దరు సతులు. నేపాల రాకుమారి కుమారదేవి వలన సముద్రగుప్తుడను కుమారుడు,లిచ్ఛవీయుల కన్యను పెండ్లియాడి కచుడను కుమారుని పొందెను. చంద్రశ్రీ శాతకర్ణి కుమారుడగు మూడవ పులోమని సంహరించి చంద్రగుప్తుడు రాజు కాగా, నవ్యకపరాక్రమమున తేజరిల్లు సముద్రగుప్తుడు, తండ్రియైన చంద్రగుప్తుని, అన్నయగు కచుని సంహరించి పాటలీపుత్రమును రాజధానిగ నొనర్చుకొని తనకు దానే ప్రభు వయ్యెను. ఈతడు తీవ్ర యుద్ధోన్మాది. రాజ్య విస్తరణకాంక్షమెండు. వి. ఏ. స్మిత్[1] ఈతని ఇండియన్ నెపోలియన్‌గా కీర్తించెను. పరిసర పాలకుల ధనముతో నీతని రాజ్యము తూర్పున హుగ్లీ, పశ్చిమమున జమున. చంబల్ నదులు. దక్షిణమున నర్మద,ఉత్తరమున హిమాలయముల వరకు వ్యాపించెను.[1]

---

1. The dominion under the direct Government of Samudragupta, in the middle of the 4th century, thus compri-

ఇట్లు సామంతరాజులచే, తన యఖండాధిపత్యము నంగీకరింప జేసికొని, స్వదేశీ, విదేశీ ప్రభు సేవితుడై, సార్వభౌముడై, ధర్మరాజు వలె పాలించుచు, యథాశాస్త్రముగా నశ్వమేధమాచరించి తచ్చిహ్నముగా స్వర్ణ ప్రతిమలను ముద్రింపించి బ్రాహ్మణులకు దానమొనర్చెను ఈతడు శాస్త్ర సాహిత్య సంగీత రసికుడు. కవి నుతుడు. ఈతని యాస్థానమున నున్న హరిసేనుడను కవియే అలహాబాదు శాసన రచయిత. చతుర్వేలావలయితమైన భూమిని పాలించినట్లు శాసనమున గలదు.

నవలా రచయిత గ్రీకు చరిత్రకారులు వ్రాసిన సముద్రగుప్తుని యుదంతమును గూడ తన నవల యందు నిక్షేపించెను.[2] సెల్యూకసు సముద్రగుప్తునితో నొనర్చుకొనిన వైవాహికపు టొడంబడికను, మెగస్థనీసు, సముద్రగుప్తునితో నొనర్చిన రాయబారము లిందు ప్రాధాన్యము వహించును. సెల్యూకస్ గావించిన యుద్ధములు గూడ రచ

---

sed all the most p' pulour and fertile countries of Northern India. It extended from the Hoogly on the east, to the Jumna and the Chambal on the west, and from the foot of the Hymalayas on the north to the Narmada on the south. 'V. A. Smith'

2. Selucus Nicator waged many wars in the east, after the partition of Alexanders' empire among his generals. He first took Bobylon, and then with his forces augumented by Victory subjugated the Bactrians. He then passed over to India, which after Alexander's death, as if the yoke of servitude had been shaken off from its neck, had put his prefect to death: Sandrocottos was the leader who achieved this freedom......'

యిత తన నవల యందు నిక్షేపించెను.[3] మెగస్థనీసు భారతదేశమును విస్తృతముగా దర్శించియుండునని, సముద్రగుప్తునితో నితనికి సమావేశపు యేర్పాట్లు జరిగి యుండెనని పేర్కొనిన యుదంతములో 'పోరస్' అను రాజును గూడ మనము దర్శింతుము.[4] కలియుగ

---

3. Sandrocottos having thus won the throne, was reigning over India, when selucus was laying foundations of his future greatness. Selucus havin g made a treaty with him and otherwise settled his affairs in the east, returned home to prosecute the war with Antiogonus.

'Strabo'

4. Megasthanesa, who was in the camp of Sandrocottos, which consisted of 400,000 men, did not witness on any day, thefts reported which exceeded the sum of 200 drachmas and this among the people who have no written laws, who are ignorant even of writing and regulate everything by memory. 'Appian'

'Beyond these wide limits the forntier kingdoms of Assam and the Gangetic delta, as well as those on the southern slopes, of Hymalayas, and the free tribes of Rajaputana and Malvva, were attached to the empire by bonds of subordinate allianee, while almost all the kings of the south had been over run by the emperor's armies and compileed to acknowledge his irresistable might'.

'But even Megasthanese, as far as appears, did not travel over much of India, though,no doubt, he saw more of it than those who came with Alexander, the son of philip, far as he says, he had interviews with Sandrocottos, the greatest king of Indians, and 'Porus' who was still greater than he'

రాజవృత్తాంతమున నీతని ధార్మికము ప్రశంసింపబడెను.5

**సారాంశము :-** ఈ చరిత్రాంశములను ప్రోదిచేసికొని రచయిత ఈ నవలను సంతరించెను.

1) అలెగ్జాండరు మరణించినంత సముద్రగుప్తుడు రాజయ్యెను. 2) ఈతని కాలమున సెల్యూకసు భారతదేశమునకు వచ్చెను. ఈతనితో యుద్ధమొనర్చి యోడి తన కూతునిచ్చి వివాహయుతమైన సంధియొనర్చుకొనెను. 3) మెగస్థనీసు అను గ్రీకురాయబారి సముద్రగుప్తుని కొలువునకు వచ్చెను. 4) సముద్రగుప్తునకు మారుగా మౌర్యులలోని రాజుల నెవ్వరిని తాత్కాలమునకు సమన్వయింపలేము. (ఇది చారిత్రకోపపత్తులందు నిర్ణయింపబడినది) 5) గుప్తులకాలము క్రీ పూ. 327వ సంవత్సరము.

## హెలీనా - ఇతివృత్తసంగ్రహము

అసమాన సౌందర్య సముపేతయైన హెలీనా సెల్యూకసు కుమార్తె. భారత స్త్రీ లక్షణము లన్నియు హెలీనాయందు

---

5) నేపాలాధీశ దౌహిత్రో మ్లేచ్ఛ సైన్యైః సమావృతః ॥
వంచకం పితరం హత్వా సహ పుత్రం సబాంధవం ॥
అశోకాదిత్యనామ్నాతు ప్రఖ్యాతో జగతీతలే ।
స్వయం విగత శోకశ్చ మాతరంచాఽభినందయన్ ।
సముద్రగుప్తో భవితా సార్వ భౌమ స్స్వతః పరం॥
విజిత్యసకలామూర్వీం ధర్మపుత్ర ఇవాఽపరః ।
సమాహర న్నశ్వమేధం యథా శాస్త్రం ద్విజోత్తమైః ।
స్వదేశీయై ర్విదేశీయైః నృపై స్సమభిపూజితః॥
శాస్త్రసాహిత్య సంగీతరసికః కవిభిస్తుతః ।
సముద్రగుప్తః పృథివీం చతుస్సాగర వేష్టితమ్ ॥
పంచాశతం తథాచైతాం భోక్ష్యంత్యే వైకరాట్సమాః ॥

గలవని యాదేశ వాసులు వాకొందురు. సెల్యూకను మధ్య ఆసియాలో కొన్ని భూభాగములకు నేడు ప్రభువు. నాడు భారత దేశమునుండి వచ్చెడి వ్యాపారులతో బండితులును నాయాదేశము లకు బోయెడువారు. ఇట్టి పండితకుటుంబ మొకటి సెల్యూకస్ రాజ ధానిలో వసించి యుండెను, ఆయన పేరుపినాకి. పినాకి సతి రోహిణి. పినాకి తర్క వేదాంతములను, సుంత ఖగోళ, జ్యోతిషములను నేర్చెను. భారత దేశమున నానాడు సంస్కృతమే వాండిత్యమున కొరపడిరాయి. ఈ దేశమున చక్రవర్తి సముద్రగుప్తుడు. ఈతని తండ్రి చంద్రగుప్తుడు. ఈతడు శాతవాహన రాజులలో చివరివాడయిన చంద్రశ్రీని సంహరించి మగధకు బ్రభువయ్యెను. అనంతరము గిరి వ్రజమునుండి రాజధాని పాటలీపుత్రమునకు మార్పు చేయబడెను. ఇది నాటి భారతదేశ రాజకీయపుస్థితి.

హెలీనాకు భారతీయత యందభిమానము, తాను భారతీయ భాష యయిన సంస్కృతమును నేర్వ,తండ్రియనుమతి బడసెను.పినాకి రోహిణు లిరువురు నీమెకు గురుస్థానీయులే యైరి.వీరు హెలీనా యొక్క వివేకమునకు, సూక్ష్మవిషయగ్రహణ సామర్థ్యమున కచ్చెరు వొందు దురు. రామాయణములోని 'లంకాదహనము' రామాయణమునందు ఆంజనేయుడు సముద్రమును లంఘించుట హెలీనాకు నచ్చెరువు గొలిపిన యుదంతములు.

రాజసౌధమున ఫిలిప్ యోనస్ అని యొక యుద్యోగియుండెను. సర్వరాజభృత్యవిధి నిర్వహణ పరిశీలనమాతని విధి. ఆతడు భారతదేశ మందభిమానము లేనివాడు, తానలెగ్జాండరుతో భారతమును దర్శిం చితినని మోసపుమాటలు పలుకును. పినాకి చెప్పిన లంకాదహనమున కొక పరమాసహ్యమగు కథనల్లెను, వీలైనచో తాను పినాకితో వివాద పడియాకథలందలి యసామంజస్యమును బ్రకటించియాతనిని హెలీనాతో బ్రసంగింప కుండునటుల చేయ నెంచును. భారతీయ సంస్కారము

కుసంస్కారమనియు దానిని హెలీనాకు బోధించి యూకెను గాఢము చేయుచుండెననియు, యోనను విశ్వాసము. సెల్యూకసుతో జెప్పకయైనను రాజదుహితృమనోభావ రక్షణార్థము పనాకిని దూరము చేయ నిశ్చయించెను. సమయమునకై నిరీక్షించుచుండెను. ఒకనాడు యోనను పినాకిని బిలిచి లంకాదహనము నందలి యసందర్భమును జూపెను. పినాకియు హెర్క్యులస్ కథలోని యవకతవక నెత్తిపొడిచెను. ఇట్లు విందింపబడుట హెలీనాకు వారి వాద నైపుణ్యము తెలియనట్లయ్యెను. రోహిణి హెలీనాకు భారతీయ స్త్రీ జీవనవిధానమంతయు పూసగ్రుచ్చినట్లు తెలిపెను.

ఇట్లుండగా నొకనాడు పినాకి రోహిణుల దీసికొని వచ్చిన చనువ వచ్చెను. దానికి నాయకుడు నీలాంబరధర్మ. అతడొక స్త్రీని వెంట నిడుకొని వచ్చెను. ఆమె నీపాలి. రోహిణి నీపాలిని గురించి హెలీనాతో ప్రసంగించెను. ఆమెను హెలీనా చూడగోరెను. ఈమె పూర్వము బాబిలానుకు జెందినది. ఇప్పుడు భారతదేశమున సముద్రగుప్తునకు చామర గ్రాహిణి, తన ప్రణయము ఫలింపకుండుటచే నీమె చనువ నాశ్రయించి యిచటకు జేరెను. హెలీనా కోరిక ననుసరించి తాను పురుష వేషధారిణియై రోహిణిని దోడుకొని నీపాలి హెలీనాను దర్శించెను. ఈమె పూర్వాశ్రమమున 'నెమ్ఫిస్' అను నామము గలిగి యుండెను. సముద్రగుప్తుని సర్వవృత్తాంతమును నీపాలి హెలీనాకు దెలిపెను. అచటి రాజభాష యయిన మాగధిని నీపాలినుండి గ్రహించుటకు, నామెను తన సఖిగా నియమించుకొనుటకును హెలీనా నిర్ణయించుకొనెను. సెల్యూకస్ విజయ పరంపరలు దేశమును సముత్సాహపఱచెను. ఆయన త్రేస్ నగరమును జయించెను. కూతును జూడ బాబిలాను వచ్చెను. హెలీనా నీపాలి వృత్తాంతమును, తానామెకడ మాగధీభాష నధ్యయన మొనర్చు నుద్దేశమును దండ్రికెఱుకపఱచెను. సెల్యూకసు నీపాలిని జూడగోరెను. నీపాలికి రాజదుహిత యాహ్వాన

మును రోహిణి యందించెను, పినాకికి తామిరువురు రాజ ప్రాసాదము నకు బోయివచ్చిన యుదంత మెఱిగింప నాశ్చర్యపడుట పినాకి వంతు.

నీలాంబర ధర్మి వర్తకమును ముగించుకొని నీపాలిని వెంట రమ్మని పిలిచెను. నీపాలి నిరాకరించెను. ప్రయత్నించి విఫలుడై నీపాలి ఖడ్గవిద్య నెరింగి భీతుడై యచటినుండి వెడలెను. నీపాలి కోటలోనికి నుద్యోగ నిర్వహణార్థమై రాజశకట మధిరోహించి పయనమయ్యెను. హెలీనాకు మాగధీప్రాకృతమును జెప్పుట మొదలయ్యెను. చక్రవర్తి కి తానెరింగిన భారతీయ భౌగోళిక వృత్తాంతమును దెలిపెను. హెలీనాకు నీపాలి కత్తి విద్యను నేర్పుటకునుత్సాహించెను, ఈవిషయమును యోనస్ మాయోపాయమున గ్రహించెను.

కొన్నినాళ్లకు నీపాలి హెలీనాల కత్తియుద్ధము సెల్యూకసు సమక్షమున ప్రదర్శితమయ్యెను. యోనసునకు బినాకునకు వాగ్వాదము చక్రవర్తి సమక్షమున నిర్వర్తితమయ్యెను. గెలుపోటములు సమ మయ్యెను. గెలుపు వాగ్విలాసమున సాధ్యపడదని యెంచిన యోనసు, రాజకీయముగా బినాకిని లొంగదీయవలెనని నిశ్చయించెను. చక్రవర్తి నీపాలికి యోనసులకు గల ఖడ్గవిద్యా వివేకమును దర్శింపనెంచి దాని నేర్పాటు చేసెను. నీపాలి తనకు గల లాఘవముచే యోనసు మెడ పయి గొట్టి లొంగదీసెను, దీనికి మధ్యవర్తి పినాకి. పినాకికి యోనసునకు తిరిగి జరిగిన వివాదమున నాడుభారతదేశము నేలుచున్న ప్రభువుగురించిపినాకి ప్రసంగించెను, అలెగ్జాండరుభారతదేశమునందడుగిడ లేదని సప్రమాణముగా పినాకి నిరూపణ మొనర్చెను. దీనితో యోనసు నకు వైరము నీపాలితోగాక పినాకితో నయ్యెను. సెల్యూకసు భారత దేశము పైకి దండయాత్రా సన్నాహమొనర్చుచుండెను. పినాకి రాజ కీయ పరిజ్ఞాన మాతనిని సర్వసమాచారకోద్యోగమునందు నియమింప జేసెను. సైనిక రహస్య సమావేశములో పినాకి ప్రధానుడు. అతనికి

మహా సైన్య చారణ పటము వ్రాయు పనిని చక్రవర్తి యప్పగించెను. మహా సేనాని యూబులస్. యోనసు యూబులస్ వ్రాసినట్లొక ప్రణయలేఖను పినాకి ద్వారమున నీపాలికి బంపెను. దానిని గాంచి యోనసుతో వైరము బెట్టుకొనక యుపాయమున మడియింపవలయు నని నీపాలి పినాకులు నిర్ణయించుకొనిరి.

యుద్ధసన్నాహ మొకవంక నిర్వర్తింప బడుచుండగా మరియొక వైపు రాయబారమునకు యత్నములు జరుగుచుండెను. రాయబారి మెగస్థనీసు. సైన్యచారణపటము ననుసరించి సైన్యము గమించు చుండెను. మెగస్థనీసుతో యోనసు భారతదేశమునకు జక్రవర్తితో రాయబారము నిర్వహింప చక్రవర్తి యనుమతి యయ్యెను. యోనసు సేనాపతి పదవి నలంకరించెను.

యోనసు రాయబారిగా జను విషయము పినాకికి దెలిపెను. నీపాలి భారతదేశమునకు బోవుటకు దలపడెను. యోనసు దుశ్చర్యలను రూపు మాపుటయే యామె వెళ్లుటలోని యాంతర్యము. యోనసు విషభావమంతయు హెలీనాకు నీపాలి చెప్పెను. నీపాలికి సముద్ర గుప్తుని పయి తన కంకురించిన యనురాగోదయమును పేర్కొనెను. నీపాలి తన ప్రణయ వృత్తాంత విఘటనమునుపి నాకికి, హెలీనాకు దెలి పెను. ఇప్పుడు పినాకి, హెలీనా, నీపాలులు సముద్రగుప్తుని యోనసు నుండి రక్షించుటలో నేకార్థచికీర్షువులైరి. సెల్యూకసు సేన భారత మున బ్రవేశించెను. చక్రవర్తి సైన్య మెదుర్కొనెను. వారి సేనా పాటవమునకు వీరు జాలకుండిరి. నాటి సాయంతనమునకు సెల్యూకను సైన్యము సగము నష్టమయ్యెను. సేనానాయకు లాలోచనచేసి సంధి సూత్రమును బఠించిరి. సముద్రగుప్తుడు వారిని సాదరముగ నాహ్వా నించెను.

అంతః పుర మంతయు సముద్రగుప్తుని సేన యధీనమున నుండెను.

ఒకనాడు నీపాలి పినాకిని దీసికొని చక్రవర్తి సమక్షమున కేగెను. హెలీనా సౌందర్యమును నామెసంస్కృతాభిమానమును నీపాలి ప్రశం సించెను. నీపాలి కచ్చట తన ప్రియుడైన దుష్యంతుని దర్శనమయ్యెను. చక్రవర్తికి హెలీనా వ్రాసిన సంస్కృత శ్లోకముల నొసంగెను. యోనను కానవచ్చెను. సముద్రగుప్తునకు చంద్రగుప్తుడనియు, నాతడు మౌర్యచంద్రగుప్తుడనియు పేరొకొని మెగస్తనీసుచే నాతని గ్రంథమున నట్లే వ్రాయించెను. ఈ మృషాచరిత్ర విషయ మెఱింగిన పినాకి యోనను విషయముచక్రవర్తితో జెప్పెను. నీపాలి యోనసులకు యుద్ధ మయ్యెను. తన ప్రియుడైన దుష్యంతు డాతనితో యుద్ధము చేయు చుండెను. చక్రవర్తి హెలీనాలు వచ్చిరి చక్రవర్తి యోనను తలను ఖండించెను. సెల్యూకను తనకూతును సముద్రగుప్తునకు సమర్పించెను.

## హెలీనా - ఇతివృత్తనిర్వహణము

ఈ నవలా ప్రణాళిక భారతీయ వివాహ వైలక్షణ్య లక్ష్య పరమార్థముగా గలది. ఒక మహారాజనీతి వేత్తయైన వైదేశిక ప్రభు తనూజ, తండ్రియొక్క యోటమి నిమిత్త ముగా సంధింపబడిన సమయమునకు గట్టువడి, భారతీయ ప్రభువును బెండ్లియాడెను. ఇది చరిత్రాంశము. సంధికై పెండ్లియాడుట చరిత్ర సత్యమే కావచ్చును. దీనిచే సహృదయ ప్రరోచన మెట్లు సాధింప గలము ? రచయిత ఈ దౌర్జన్యమును దొలగించి పరమ సుకుమార ముగ, లలితమధురముగ, శృంగారరస రంజకముగ, భారతీయ ధర్మ బద్ధముగ దీనిని సమన్వయించెను.

మనో వాక్కాయములు త్రికరణములు. సత్పురుషునకు స్వమాడను నొక్కటే. ధర్మ బద్ధమయిన భారతీయ వివాహ మందివి యత్యంత ప్రాధాన్యము వహించును.'ధర్మ ప్రజాసంప త్యర్థం స్త్రియముద్వహే' యనునది సూత్రకారుని ప్రవచనము. త్రికరణములందలి నైర్మల్యము

వివాహమునకు ప్రాతిపదిక. ఈ దృష్టితో నావిదేశీ వనితను అపరాధర్మ జానిగా బోల్చబడిన సముద్రగుప్తునకు సంధించుట జరిగెను. మొదట రచయిత హెలీనా సౌందర్యమును వర్ణించెను. సౌందర్యము వర్ణించుటలో నేమికలదు ? ఇదికాదు విశ్వనాథ ప్రతిభ, ఆ సౌందర్యము నంతటిని భారతీయతా సన్నిహిత మొనర్చెను- "హెలీనా యొక్క శరీరము యొక్క లక్షణములన్నియు చక్కని భారతీయ స్త్రీ లక్షణములే, ఆర్యజాతి స్త్రీలక్షణము లన్నియు నామెయందు మూర్తీభవించి యున్నవని చెప్పవచ్చు' (40) ననుచు, నామెను భారతీయమూర్తిగ నొనర్చెను. సరే. కాని ఆమె నచటి పురుషులెవ్వరు గోరకుండిరా ? అచట సౌందర్యారాధకులే కరవయిరా ? యని యన్నచో - "గ్రీసు దేశము నందున్నను, లోకోత్తర సౌందర్యవతి యయినను, హెలీనాను గుఱించి తద్దేశవాసు లామె సౌందర్యము కంటె తమ దేశములోనున్న స్త్రీల సౌందర్య మధికమనుకొందురు." ఇట్లామెను స్వదేశీయులకు నచ్చని యూధగ నొనర్చి తద్దేశగతమయిన యాలోచన లేకుండ జేసెను. కనుకనే (41) 'హెలీనా యొక్క సౌందర్యము తద్దేశగత పురుషులకు హృదయ గ్రాహకముగా లేదనవలయును," (25) ఇది కాయిక నైర్మల్యము.

ఆమెచే రచయిత సంతరింప జేసిన శబ్దజాల మేది? ఆమె దేశ భాషల పయి నామెకు మోజుండవచ్చును. దానికంటె సంస్కృతము పయి నామె కభిమానమ మెండు. పినాకి రోహిణులను దంపతులా దేశమునకు బోయిరి, పినాకి సంస్కృత విద్వాంసుడు అతనికడ నా విద్యను తండ్రిపనుపున నేర్వ నుంకించినది, ఆమె తండ్రితో- "భారత దేశమును గూర్చి మనకెవ్వరకును సరిగా తెలియదు. అచట మహా గ్రంథములు కలవట. గణిత శాస్త్రము, శిల్పము, ఖగోళము మొద లయిన విద్యలలోని జ్ఞానము భారతదేశమున పరాకాష్ఠను నొందినదట వారిజ్ఞానము గొప్పది. ఆజ్ఞానమెట్టిదో మనము తెలిసికొనవలయును

గదా ! సంస్కృతము నేర్చినందు వలన దప్పేమి ? అనును 'తప్పు' అని తండ్రి యనవలయునని యామె యుద్దేశ్యమా ? కానే కాదు. తాను సంస్కృతము నేర్చుకొనుట తద్దేశ భావన కొఱకు. తండ్రి కేల ? దీని నిచట నర్మముగా నుంచెను. తరువాత చెప్పుదును.

నాటి భారతదేశమున రాజభాష మాగధీప్రాకృతము. సముద్రగుప్తుడు శాస్త్రసాహిత్య సంగీత రసికాభిరాముడు, కవిపండిత సంపూజ్యుడయ్యెను. రాజ భాషయయిన మాగధీప్రాకృతమున కున్న ప్రాచుర్యము వేఱు. కనుక నీమెయు దానిని నేర్వవలయును. దానిని రచయిత యిట్లు సంధించెను. నీపాలి పాత్ర యొకటి సృజింపబడెను.

సెల్యూకసు కొన్ని పట్టణ రాజ్యములు గెలిచిన యుత్సాహముతో నుండగా హెలీనా తన నాయనను సమీపించెను. తనకడకు నూత్నాగతురాలైన నీపాలిః గుఱించి, యామెకు వచ్చిన భారతదేశ రాజభాష యయిన మాగధీ ప్రాకృతమును గుఱించి, యది తానధ్యయనము చేయవలయునన్న యాసక్తిని గుఱించి యడిగెను. ఆమె-(11) "నాలుగైదు నెలలలో నామె యెవ్వరికైనను మాగధీభాషను నేర్పునట. సె. ఆమెవద్ద నాభాషను గూడ నేర్చుకొనుము" (128) సెల్యూకసు ఎందుల కంగీకరించెను? ఇందు ఎవరి భావములు వారివి. ఆమెకు సముద్రగుప్తునిపై వ్యక్తము కాని యారాధనము, ఈతని కాదేశమును గెలువవలె నన్న యుబలాటము. భావము లంతగా బరిపుష్టముగ నున్నను నర్మమైన యర్థమదియే. ఇది వాచిక నైర్మల్యము.

సెల్యూకసు భారతదేశమునకు దండు నడపెను. ఇంతదనుక పరిపుష్టముగాని భావమునకు బలము కూర్చినాడు. ఆమె డోలాయమాన స్థితి. ఇది హె. నాకొక్కటియే కావలయును. నాతండ్రి సుఖముగా నుండవలయును. సముద్రగుప్త చక్రవర్తికి నపాయము రారాదు."202

ఇచట భావము పరిపక్వమైనది. రేఖామాత్రముగా నున్నదానిని

రోహిణీ పినాకులు ప్రోడిచేసిరి. నీపాలి ప్రాణముపోసెను. హెలీనా నవోఢ మయ్యెను. ఒకనాడు సెల్యూకసు హెలీనాను జూచుటకు వచ్చెను. అచ్చట-

"హెలీనా యున్న ప్రదేశము మారిపోయెను. అచటి రత్న కంబళములు భారదేశమునందలివి, ఒక మహారత్నములో మలచబడిన సముద్రగుప్తుని జానెడెత్తు విగ్రహము హెలీనా ముఖాలంకారములు చేసికొను బల్లమీద నుండెను, ఇదియే సముద్రగుప్తుని యిల్లాలను నట్లు నామె నివసన మంతయు భాసించు చుండెను."(318) ఇది మనో నైర్మల్యము, ఇట్లామె మనోవాక్కాయ కర్మలచే భర్తకు భార్య యయ్యెను. ఇది యుత్తమ నిర్వాహము. ఈనవల యందలి 'కొలికి పూస' హెలీనా.

2) భారతీయ ధర్మస్రవంతి యేమియో యా విదేశీవనిత కెట్లర్థ మయ్యెను ? దానిని సహృదయులు, స్నేహభావులు, సదాలోచనా తత్పరులు వధ్వన్వేషణ నిమిత్తమై ప్రేష్యులయిరా! యని యన్పించును. హెలీనాకు రోహిణితోడి సమావేశము సంప్రదాయ ప్రబోధకము' పినాకితోడి సమావేశము ధర్మస్రోతస్స్వావగాహము, ఈ యవగాహ మామె నుక్కిరి బిక్కిరి చేసెను. ఆమె యందు జీర్ణించిన సంస్కృతి కిది వ్యతిరేకము.తన యంతఃపురమందుగలఫిలిప్ యోనసు నాశ్రయించి వానిచే నీభిన్న సాహిత్యములలోని ధర్మరహస్యమును తులనాత్మక పరిశీలనము చేయించెను. ఈ సన్నివేశముచే రచయిత ద్వివిధమయిన ప్రయోజనము నేకకాలముననే సాధించెను. 1) తనదయిన సంస్కృత మయిన మోహము తొలగుట 2) తన సంస్కృతి యేదో దాని పయి బుద్ధి నిశ్చయ మగుట. ఇది 'నష్టోమోహః స్మృతిర్లబ్ధ్వా' యను చందము.

3) ఆమె భారతీయ వీరవనితయు గావలెనని రచయిత యుద్దేశ

ముగా బోలును. ఈ నీపాలిని మఱియొక విధముగను బరిచయ మొనర్చెను. ఆమె తన రాజకీయ పరిజ్ఞానముతో హెలీనాకు సంభ్రమము గల్గ జేయును. ఆమె సంస్కృతము నే ప్రయోజన మాశించి నేర్చుకొనుచుండెనో, తత్సన్నిహిత ప్రయోజనార్థమే కత్తియుద్ధము నేర్వవలెనని హెలీనాకు చెప్పును. ఇట్లు హెలీనా కత్తి యుద్ధము నేర్చుకొనుట. పినాకి యుద్ధమునందు సైన్యచారణ పర్యవేక్షకత్వము, యోనసు, మెగాస్థనీసుల రాయబారములు కథా నిర్వహణలోని సముచిత సన్నివేశములు.

ఈ నవల యందు ఫిలిప్ యోనసు వైదేశికుడై భారతీయ ధర్మ వినాశమునకు యత్నించెడి పాత్ర. ఈతడు సర్వాత్మనా హెలీనా ధర్మబుద్ధిని విఘటితమొనర్ప యత్నించును. పినాకితో భారతీయ సంస్కృతి పయి వ్యర్థ వాగ్వ్యవహారము నడపును. అది సాధింపలేక నీపాలితో కత్తి యుద్ధము జేసి జయ మందగోరి భంగపడును. తుదకు సేనా శిబిరములో ప్రధాన సేనానికి నీపాలికి ప్రణయ లేఖను గల్పించి కలహములు పెంచును. తీవ్రమయిన స్థితిలో సముద్రగుప్తుడు వానిని సంహరించును.

ఈ సంవిధానమును తెలిసినాగించెడు పురాణవైరముగా మలచెను. సముద్రగుప్తునకు యోనసునకు సంభాషణ జరిగినది. అందు యోనసు సముద్రగుప్తుని కాలముతో మౌర్యులకాలము సమసింపదనియు, గ్రీకుల కాలము సముద్రగుప్తుని కాలముతో సమన్వయమగునని యంగీకరించును.

యోనసు :- మహాప్రభూ - ఆయన సముద్రగుప్త చక్రవర్తి. తమరే. నన్నువధింపుడు. నన్ను వదలిపెట్టవు. కాని నేను చని పోను. నీకు విరోధినే.

ఆంగ్లేయ చరిత్రకారులు బుద్ధిపూర్వకముగా మన చరిత్రలోని

యుంశములను తారుమారొనర్చిరని చెప్పెడి రచయిత వాక్యమున కిది నిర్వాహము. వారు తెలిసియు బురాణ వైరమును సాధించిరి. చంద్రగుప్తుడు స్వప్నములో గాంచినదీ ప్రతిష్ఠనే. ఇది వానిది గాదనుచు నిచట యోనను ఒప్పుకొనును. అయినను తద్విరోధమునే కొన సాగించుట కుద్యుక్తుడగును. అట్టి భారతీయ ధర్మ విచ్ఛేదకుని శిర మును సముద్రగుప్తుడు ఛేదించెను.

సముద్రగుప్తుడు :- పురాణ వైర నవలలన్నింటికి నిది కావ్య త్వము నంతరించుకొన్న నవల యని చెప్పవచ్చును. ఇందు నాయకుడు సముద్రగుప్తుడు- ధీరోదాత్తుడు. నాయక హెలీనా. కులీన కాంత. పట్టమహిషీత్వమునకు గావలసిన యోగ్యతను సంతరించుకొన్న కులకాంత. రసము శృంగారము. ధార్మిక చర్చ, యుద్ధవర్ణనలు గలవు. వేదధర్మ దూషకుడయిన పిలిప్ యోనను సంహారము తద్వారమున ధర్మరక్షణము హెలీనా పాణిగ్రహణము-ఇవి యన్నియు నుత్తమ కావ్యలక్షణములని చెప్పవలెను. ధర్మ రక్షకత్వమను ఫలముతో నాయికా పాణిగ్రహ ణము గూడ లభించి సముద్రగుప్తుడు ధీరోదాత్తనాయకుడగుచున్నాడు. అశ్వమేధమను నవల శాస్త్ర దృష్టి చేతను, ధార్మిక విజ్ఞాన తేజోనిధి త్వము చేత నుత్కృష్ట స్థానము సంతరించుకొనగా నిది కావ్య గౌరవ ముచే నాస్థానమును బొందియున్నది.

ఇక సముద్రగుప్తుడు చరిత్రలో చెప్పబడిన క్రూరత గలిగిన వాడు కాడు. కలియుగ రాజవృత్తాంతము నందు నుడివినట్లుగ ధర్మ జుని వలె సర్వోర్విని జయించెను. స్వదేశీ విదేశీ జన సంపూజితుడు. శాస్త్ర సాహిత్య సంగీత రసికుడు. కవినుతుడు.

నవల చివఱ వరకు నీపాత్ర పరోక్షమేగాని ప్రత్యక్షముగాదు. పినాకి చేతను, నీపాలి చేతను, రోహిణి చేతను ప్రసంగములలో నీ పాత్రగుణ ప్రశంస చేయబడి హెలీనా కాయన యందొక సుకుమార

భావమేర్పడుటకు ద్రోహ్వానమిచ్చినది. కవియొక్క యుత్తమ నిర్వాహ్య మున కిది మచ్చుతునక.

"హెలీనా సముద్రగుప్తుని గూర్చి విని విని యాతని యందొక యభిమానము గలిగి - ఆ యభిమానము పౌనఃపున్యముగ బినాకి నీపాలుల చేత బోషించబడి దాని యొక్క స్వరూప మిదమిత్థ మని నిర్ణయించుకొన వలసినంత ప్రోత్సాహము పొంది భావించగా నామెకు దన మనస్సులో సముద్రగుప్త చక్రవర్తి యొక్క ఆకారము భాసించెను."

ఈ రమ్యమైన భావమునకు విపర్యయ భావము సెల్యూకసు నకు గలిగినది. యుద్ధమునందు సెల్యూకసు సైన్యము సగానికి సగము నశించెను. సెల్యూకసునకు సంధికంటె గత్యంతరము లేకుండెను. సేనాని వేళమునకు వచ్చిన సెల్యూకసునకు అతని సేనానులకు లభించినది రాజ పురస్కారము. ఇది యార్ద్రతా భావము.

హెలీనా శ్లోకసమర్పణము నీపాలి ద్వారమున జరిగెను. వాని యందు బద్ధాదరుడై "సముద్రగుప్తుని హృదయము క్షీరసాగర (మథన) మయ్యెను. అయినంతనే మథనము ప్రారంభమయ్యెను." (పే. ౩౪౩) ఇది శృంగార భావము, అనంతరము పరస్పర వీక్షణము జరిగినది.

'ఆమె మోకాళ్లు నిలువలేదు. రెండు నిముషములు గడచెను. ఆ పురుషుడు నవ్వుచు నిలుచుండెను. అతని చేతిలో నేదియో వ్రాసిన జాబువంటిదుండెను. హెలీనాకు వెంటనే తెలిసెను. అది తాను వ్రాసిన శ్లోకములు. అపుడు-

హెలీనా యొక్క విచిత్రమైన హేలాభావయోధియయ్యెను. సముద్ర గుప్తుని వదనారవిందము ప్రథమమార్తాండ కిరణస్పృష్టమయ్యెను. పే. (349) ఇట్టి భావములన్నింటిని క్రోడిచేసి సముద్రగుప్తుని శృంగార నాయకునిగ నొనర్చెను. దుష్టుడైన యోనసును వధించి యధర్మము

నప్పటికి నశింపజేసి యుత్తమ నాయకత్వమును బొందెను.

హెలీనా ;- నవలకు రమణీయమైన పేరు హెలీనా. సౌందర్యము చే నీమె భారతీయ వనిత.పుట్టుకచే దేశీయతను సంతరించుకొనిన స్త్రీ. రచయిత ఈ మెను మనోవాక్కాయములచే నీదేశపు మహిళగ జేయవలెనని యెంచెను.

ఇక హెలీనా యందలి విశిష్టగుణములను గమనింతము. ఆమె పినాకి కడ రామాయణములోని విషయములను వినెను తనకు బరిచయమై కథను దనకు బరిచయములేని యితివృత్తముతో సమన్వయించు కొనక లేక పరిష్కారమునకై యన్వేషించెడి సహృదయ హేలీనా.

రాముని కొఱకు సీత యేడాది యశోకవనములో నిద్రాహార ములు లేక యుండెను. ఇదియామెకు వైదేశికేతివృత్తము. అట్టికథయే తమ దేశములోనుండి యా నాయిక పేరు తనపేరే యయి యామె రావణునితో లేచిపోయినట్లుండగా బాతివ్రత్యము భగవత్సన్నిధానమున బెన్నిధానము వంటిదని తెలియజెప్పబడిన సంస్కృతి యందనురక్తురాలయ్యెను.

'హనుమంతుడు లంకాదహనము చేసిన కథ రామాయణము లోనిది. దీనిని హెలీనా కల్పిత మనును. కాని పినాకి చెప్పగా వినును. అచట నామె ధర్మాభిమానము చిత్తమిగురొత్తంపజేసినది. కాని తార్కికముగా దీనిని యోచనుచే వాగ్వివాదమును పినాకితో జేయించి యాకథకు జిక్కుందనము తెప్పించవలెనని భావించిన యుత్తమ విమర్శకు ప్రోత్సహించినట్లుగా రచయిత నీమెను మలచెను.

అంతమాత్రముచే నీమె భారతదేశమందున్న యధర్మమును ? తెగడు లేదని యర్థము కాదు. చూడుడు.

'ఈ సముద్రగుప్తుడు తండ్రిమీద దండెత్తిపోయి, తండ్రిని, తన యన్నను జంపి తాను సింహాసన మాక్రమించెను.' అని పినాకి (53)

చెప్పగా తన మనస్సున గల ధర్మాసక్తి పెల్లుబికినది, వెంటనే-

'అచ్ఛముగా రాముడు చేసిన ధర్మమునకు వ్యతిరేకముగా చేసినాడు' దీనికి బరిష్కారమును సూచించి సముద్రగుప్తుపై గల యధర్మమును కొట్టినాడు. పినాకి, 'శ్రీరామచంద్రుడు నిరూపించిన ధర్మమునకు వ్యతిరేకముగా నున్నదన్న మాట నిజమే. కాని రామచంద్రుడు ధాత్రినెట్లు పాలించెనో సముద్రగుప్తుడట్లు పాలించుచున్నాడు.' కాని దెబ్బకొట్టనే కొట్టినది. ఆమె పినాకితో "మీకు చరిత్రయున్నదా? యని యడుగ, పిచ్చి బ్రాహ్మణుడు "మాకున్నంత చరిత్ర మరియెవ్వరికి నుండదు. సీత యొక్క చరిత్ర యెక్కడనుండును? రాముని చరిత్ర యెక్కడనుండును? చరిత్ర యనగా శీలము.' అని సమాధానించెను. వెంటనే హెలీనా అన్నది. మీ చంద్రగుప్తుని యొద్దనే లేదు. (౬౬) సముద్రగుప్తుని అంగీకరించినట్లా! తిరస్కరించినట్లా! ఇచట రచయిత ప్రతిభ సముద్భాసించెను. యోనసుతో బినాకిని సంభాషింపజేయ, యాంజనేయుడు లంకను దాటుటను సమన్వయించెను. ఇది యోనసునకు నోటమి, కాని హెలీనాకు భారతీయతపై నొక గౌరవ హేతువు. రోహిణి తోడి విజ్ఞానము హెలీనాకు బరమ ప్రమోదము. ఈ దేశపు టాచారములు, సంప్రదాయములు, స్త్రీల యలంకార వైఖరి, మొదలయిన వానిలోని మర్మములు హెలీనా కామోద యోగ్యములు. ఇట్లే నీపాలి రాజకీయములు నేర్చెను. కత్తియుద్ధము నేర్చెను. యోనసు యొక్క పరమ నీచ స్వభావములను వీనిచే దెలిసికొనగల్గెను. ఆమె యిప్పుడు పరిపూర్ణమయిన స్త్రీ సముద్రగుప్తునిపై ఆమె ప్రేమ గుదురుకొన్నది. రచయిత ఈ పాత్ర నెంతచక్కగా దీరిచి నాటకనిపించును. ఈ యభినివేశమును గాంచి తండ్రి యీామె కుచిత శిక్ష విధింపవలయు ననుకొనెనట! అతని దృష్టిలో నిది శిక్షయే. ఒక్కగానొక్క కూతును విదేశములందు, నదియు తనపై విజయము నొందిన వాని

కప్పగించి వెడలుట కేతండ్రి యంగీకరించును: కాని యామెకు సముద్రగుప్తునిపై గల ప్రత్యయము దెలిసి శిక్ష విధింపవలసినదేయని యనుకొనినాడు.

'సెల్యూకస్సు మనసులో హెలీనా మీద మిక్కిలి కోపము వచ్చెను. అత డాలోచించి తన కూతునకిది యొక శిక్షయని నిర్ణయించెను.' ఈమెయు వైదేశిక యువతియే యగుచో నిది శిక్షయే యయ్యెడిది, కాని అట్లు కాకపోయెను గదా! 'చక్రవర్తి తన కూతురైన హెలీనాను సముద్రగుప్తునకు భార్యగా నిచ్చెను." (349) ఇదియా యాశిక్ష యిది! హెలీనా కుచిత శిక్షయే. ఇట్లు రచయిత కొన్ని పాత్రలన్నే, నామెను సర్వాత్మనా భారతీయ స్త్రీగా జేసెను. భారతీయ స్త్రీ ధర్మమేమిట్టో పాఠకులకు ప్రవచనము చేసెను. హెలీనా పాత్ర నిర్మాత కొక లక్ష్యమున్నది. 'ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే' యను వాక్యమునకు వ్యాఖ్యానముగా నా స్త్రీని మలచెను.

పినాకి - రోహిణి - నీపాలి :- సహృదయులు, సదాచారులు, సద్వాలోచనాతత్పరులు నయిన దంపతులు రోహిణీ పినాకులు, ధనాభావముననో, యత్కారణముననో నీ సెల్యూకసుచే నిర్మింపబడిన 'యాంటియోపియో' అను నగరమునకు జేరి. వీరి పూర్వపుణ్య విశేషమువలన నాచక్రవర్తి తనూజాతతో సాన్నిహిత్యము గలిగెను. పినాకి సంస్కృతమును, రోహిణి సంస్కృతిని యామెకు బోధించుచుండిరి. కొంత తడవునకు వీరితో నీపాలియు వచ్చిచేరెను. ఈమె రాజభాషను, దేశరాజకీయములను, కత్తిసాముమ, నేర్పెను. వీని యన్నింటి వెనుకనున్న యాంతర్యము సముద్రగుప్తుని పరోక్ష పరిచయము. ఈ నీపాలి చంద్రగుప్తుని కడనున్న చామరగ్రాహిణి. ఈ మూవురకును యోనసుతోడి వైరము, వాగ్వ్యవహారములలో పినాకి, ఖడ్గవ్యవహారములలో నీపాలి యాతని నోడించిరి. వీరిపై వైరముతో

నాతడు పెరిగి వీరిని మట్టు పెట్ట యత్నించెను. కాని సముద్రగుప్తుని చేతబడి చచ్చెను.

ఈమూడు పాత్రలు ధర్మ ప్రవర్ధకపాత్రలు. కవితుదివరకు వీనినట్లే పోషించెను. నీపాలిని తన ప్రియుడైన దుష్యంతునితో గలిపెను. వీరి చేతనే 'హెలీనా' సంస్కృతురాలైనది. ప్రధానేతివృత్తమునకు దోహదము గావించిన పాత్రలివి. హెలీనా ఈ పాత్రలనెంత సునిశితముగా బరిశీలించెనో చూడుడు.

"రోహిణీ పినాకులకు భారతదేశ గ్రంథములు మతముల దెలియును గాని వారికి రాజకీయ వ్యవహారములు దెలియవు. పినాకుకు దెలియునేమో? రోహిణికి దెలియవు. నీపాలి సర్వజ్ఞురాలివలెనున్నది." (113) ఆమె అంచనా తప్పుకాలేదు. పినాకి యుద్ధతంత్ర నిశారదుడు. 'తిక్కన్న' వంటివాడు.

యోనసు :- భారతీయ ధర్మమును విచ్ఛిన్న మొనర్చుటకు కవి ప్రారంభమునుండి కొన్ని దేశము నందున్ను, మఱికొన్ని విదేశము నందున్ను ధర్మేతర మార్గముల కుపదేష్టయై యున్న నాటి జయద్రథుడీ జన్మయందు ఫిలిప్ యోనస్‌గా యాంటియోషియో నగరమ్మున సెల్యూకసు ప్రభువుకడ రాజోద్యోగము నిర్వర్తించుచు, నంతఃపుర పర్యవేక్షకోద్యోగి హెలీనాకు మిక్కిలి సన్నిహితుడయ్యెను. హెలీనా భారతీయతకు పినాకి వలన సన్నిహితురాలగుచున్నదని యెరింగి దాని నెట్లయిన విచ్ఛిన్నమొనర్పవలెనని పినాకి అధ్యాపనను ముగింపు తేవలెనని రామాయణములో నాంజనేయుని లంకాదహనము విషయమై వానితో వివదించెను. కాని పినాకి హెర్క్యులస్ ఆకాశము మోసిన యంశమును విమర్శించి తద్ద్వారమున సాహిత్యము విశ్వాసమునకు సంబంధించిన లక్షణము కల్గియున్నదనియు, నది లేనిచో పెక్కు పాశ్చాత్య గ్రంథములకు సాహిత్యములో స్థానముండదనియు

తర్కసహాముగా ప్రభువు సెల్యూకసు సమక్షమున నిరూపించి యోన సును నిరుత్తరుని గావించెను. యోనసునకు నిది వాదములో నోటమి.

నీపాలి యను భారతీయ వనిత హెలీనాకు గత్తియుద్ధము నేర్పు చున్నదను విషయము నెల్లో యెఱింగి తనతో గత్తియుద్ధము చేయుటకు నీపాలిని సెల్యూకస్ ద్వారమున ప్రేరేపించెను. కాని నీపాలి ఖడ్గ చాలనము ముందు నిలువలేక యోటమి నంగీకరించెను. ఇప్పుడు శత్రువు లిద్దరైరి. పినాకి, నీపాలి. పినాకి యుద్ధమును నిర్వర్తించుటకు సైన్య చారణ ప్రతినిధిగా స్వీకరించిన యుద్యోగమున తానును ప్రవేశించి నీపాలికి 'యూబులస్' అను మహా సేనానికి ప్రణయమును గల్పించి లేఖలను మార్చి తుదకు కుతంత్రము బయటపడగా జక్రవర్తిచే నిహ తుడయ్యె భారతీయతకు తాను విరోధి నముచు జచ్చెను.

ఈ పాత్రయందు ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యములలోని తుల నాత్మక బరిశీలన ప్రాధాన్యమువహించును రామాయణమును గుఱించి పినాకి "ప్రాపంచిక పదార్థ విషయకమైన లోకప్రవర్తనాను సంధితమైన విజ్ఞానము తొడిది. రెండవది జాతియొక్క విశ్వాసములమీద నాధార పడి చేయునది. మూడవది యాధ్యాత్మికమైనది. ఈమూడింటి సమాహారభూతమైన కథ రామాయణము." (191)

పాశ్చాత్య సాహిత్యములో నాధ్యాత్మికత లేకున్నను,విశ్వాస మపరిహార్యము. అదిలేనిచో 'యొడెస్సీ' ఇల్లియడ్' కావ్యములు సాహిత్యమున నిలువవు. ఈతులనాత్మక పరిశీలనముచేసి భారతీయ ప్రాచీన గ్రంథముల ప్రశస్తిని. రచయిత యోనసు దౌష్ట్యమును,మూడు ప్రదేశములందు బెంచి పోషించెను. పినాకి హెలీనా సంస్కృతాధ్యయన విషయమున,సంస్కృతి విరోధము,నీపాలి కడ ఖడ్గయుద్ధము నిర్వర్తించు నపుడు భారతీయ శౌర్య విరోధము, యూబులస్ అను సేనానితో యోనసుచే గల్పింపబడిన నీపాలి ప్రణయమున ధర్మవిరోధమును సంఘ

టించెను, ఈ మూడు విరోధములందు నోటమియే కల్గెను. ధర్మ విరోధమున మృతువు యోనసును సమాశ్లేషించెను. ఈ విధముగా నీపాత్రను నవలయందు నిబద్ధించెను.

సెల్యూకసు :- అలెగ్జాండరు తరువాత నంతటి మహావీరుడు సెల్యూకసు. పినాకిని, నీపాలీ, హెలీనా చూచిన దృష్టివేరు. సెల్యూకసు చూచిన దృష్టివేరు. అంతరాంతరములలో భారతదేశమును గెలువవలెనన్న నొక కోర్కెను వదిలపఱచుకొని దానిని భారతీయులచేతనే నిర్వర్తింపజేసి, విధివశమున నోటమిని బొందియు గౌరవింపబడినవానిగ నీపాత్ర చిత్రీకరింపబడెను.

## నవల యందలి ధార్మిక చర్చ

ఈ నవలయందు లోకమున విమర్శకు గుఱియగుచున్న రామాయణములోని యంశములను రచయిత నిర్వహించెను. కేవలము మన సాహిత్యములోని యంశముచే గాక గ్రీకు సాహిత్యములోని యంశములను గ్రహించి తులనాత్మక పరిశీలనమొనర్చి రచయిత సాహిత్య గౌరవము నినుమడింపజేసెను.

1) రామాయణమందు ప్రమాణ వాదులు ఆంజనేయుని సముద్రలంఘనము, లంకాదహనముపై కువిమర్శలు గావించుచుండుట వానిని యథాతథముగ నాదర్శవాదులనెడి యొక వర్గము పరమ ప్రమాణముగ గ్రహించి ప్రచారము చేయుట సర్వజనవిదితము ఇందలి యాంతర్యమును శాస్త్ర ప్రమాణముగ పలువురు వేత్తలు ప్రచారమొనర్చి నప్పటికి జనసామాన్యమున నావిషయములు స్పష్టమొనర్చుటకీ ధార్మిక చర్చను యోనసు - పినాకుల నడుమ నిర్వహించెను.

2) భారతదేశమునందలి స్త్రీలు, వారి సంప్రదాయములు, సౌందర్య రహస్యములు రోహిణిహెలీనాలనడుమ సంభాషణలతో నిర్వ

ర్శించెను. ఇక్కడి ప్రాశయము హెలీనా భారతీయ సంస్కృతి తమ దౌహిత్రుల్గాకుటు యితివృత్తమున ప్రయోజనముగా, తమ సంస్కృతి విశేషములను తెలియుట పాఠకుని ప్రధాన ప్రయోజనముగా రచయిత నిర్దేశించెను.

3) సెల్యూకస్, యోనసులచేత అలెగ్జాండరు విషయక మైన చారిత్రిక చర్చను నిర్వహింపజేసి అలెగ్జాండరు భారతదేశమునకు వచ్చినట్లు అభూతకల్పన గావింపబడినట్లు చెప్పబడెడి వాదమును బరిపుష్టము చేసెను.

4) చంద్రగుప్తుడు పులోముని సంహరించి గుప్త సామ్రాజ్యమును స్థాపించుట, ఈతనిని జంపి సముద్రగుప్తుడు రాజగుట మొదలయిన చారిత్రకాంతములను వీపాటి హెలీనాల నడుమ నిర్వహించెను.

వీనిని క్రమమున బరిశీలింతము .. 1) రామునకు కోతులు సహాయపడుట యేమి ? కోతులు యుద్ధము చేయుట యేమి ? ఇది హెలీనాకు నమ్మశక్యముగా లేదు. 2) ఆంజనేయుడు లంకాదహనము చేసిన కథ ఇది ఫిలిప్ యోనసునకు హేళనగానుండెను. 3) "మీ హనుమంతుడు సముద్రమును దూకెనా ? యోనసు పినాకికిసూటిప్రశ్న." 4) "మన సీత రాముని భావింపుచు రావణునివంక చూడక యేడాది యశోకవనములో నిద్రాహారములు లేకుండ నున్నదనుట" ఒక అవిశ్వసనీయమైనదిగా హెలీనా సందేహము.

ఇవి యన్నియు నార్ష గ్రంథమును జదివియు, జదువకయు, నుప్పతిల్లిన దుర్విమర్శలు, ఇట్టివానిని లోకమున చెలరేగనీక యుండుటకు దగిన చర్చ జన సామాన్య పఠన యోగ్యమయిన నవలయందు జర్చింపబడినచో వాని రహస్యములు తెలిపినట్లగునని యిట్లు నిర్వహించెను. వీనినాయన యెదుర్కొన్నవిధము.

1) రామాయణములోని యవిశ్వసనీయ మగుచున్న విషయ ములు గ్రీకు సాహిత్యములోని కొన్ని గ్రంథములందలి విషయములు విశ్వసనీయ మగుటెట్లని తర్కింపబడినది.

"హెర్క్యులస్ గగనమును మోయుట 'ఎట్లాస్' అనువాడు ఆకాశమును మోయుచుండగా తన పనియేదో చేసిపెట్టుమని మీా హెర్క్యులస్ ఆబరువును దలనెత్తిన బెట్టించుకొని వానిని బంపినారట" ఆకాశము వస్తువా మోయుటకు. దీని నా సాహిత్య నిర్ణేతలు విశ్వసించి నచో అంజనేయుని విషయమును నీసాహిత్య వేత్తలు విశ్వసింతురు. అని తార్కికమైన వివాద మొనర్చెను. 'ఒడెస్సీ' 'ఇలియడు' కథలలోని యవాస్తవికతలను విశ్వసింపనిచో నాసాహిత్యము యొక్క విలువలే మాయమగును. కోతులు మానవులే యను వాపమును నిట్లే పరాస్త మొనర్చెను.

నవల యందు తర్కసహమైన వాదము రసికరంజనమగును గాని శాస్త్రవాదము కాష్ఠవాద సమమగును. ఇట్లుకాక "పదార్థ విషయక మైన లోక ప్రవర్తనాను సంబధితమైన విజ్ఞానముతోడిది. రెండవ పని ఒక జాతియొక్క విశ్వాసముల మీాద నాధారపడి చేయునది. మూడవది యాధ్యాత్మికమైనది.

రామాయణ మీా మూడింటి సమాహార భూతమైన కథ. 'ఇలియడ్' 'ఒడెస్సీ' ఇట్టి కావ్యములు మొదటి రెండింటి సమా హారభూతమైన కథలు. అనగా లోక ప్రవర్తనకు సంబంధించిన విజ్ఞా నము, జాతియొక్క విశ్వాసములు కలిసి సాహిత్యమున మేళవింప బడినవి.

ఇట్లు తులనాత్మక పరిశీలనముగావించి అధ్యాత్మికతలోని వైశిష్ట్యమును విశదీకరించుచు, 'లోక ప్రవర్తనాను బంధితమైన విజ్ఞాన ములోనిదే' సీతాదేవి లంకయందు యేడాది రాముని స్మరించుట.

యని నిరూపించును. ఇతర సాహిత్యములందున్న పరిజ్ఞానము పరిమితము. భారతీయ సాహిత్యమందున్న విజ్ఞాన మపరిమితము, ధర్మాభిరతము. కనుక నే చిత్తము నార్ద్రీకృతము చేయును.

'సీత మహా పతివ్రత. సీతను రావణుడెత్తుకొని పోవుట తప్పు. ఆమెను వెదకుటకు హనుమంతుడు వెళ్లెననగా కథను వినుచున్నవారి కొక శాంతి కలుగును. రావణుడు తప్పు చేసెను. ఆ తప్పు చేసిన వానికి శిక్ష జరుగుచున్నదనగా వినెడివారి మనస్సున కొకతృప్తి కలుగుచున్నది' అధర్మము శిక్షింపబడుట ధర్మబుద్ధి గలవారి కిష్టముగా నుండును.

సాహిత్యము యొక్క పరమ ధర్మము విశ్వశ్రేయము. అది అధర్మము శిక్షింపబడుట వలన కలుగును. దీని వలననే చిత్తమార్ద్రీభూతమగును. అనగా జీవుడు తన్ను తానెఱుంగు స్థితికి జేరుట. ఇది యీ దేశపు సాహిత్యపరమార్థము. రామాయణ మహాకావ్య మట్టిద.

ఈ విధముగా బినాకి యీ ధార్మిక చర్చను గావించెను. రోహిణి యుపదేశించిన భారతీయ సంస్కృతి. "ఏక పురుషలగ్న చిత్తవృత్తియైన స్త్రీ భగవంతుని సన్నిధానమున నుండును." (43) తిలకము కాటుక, గంధము లివియు, పాదములకు పారాణి, తాంబూలము స్త్రీలకు వన్నె తెచ్చును. ఇది భారతీయ స్త్రీ సంప్రదాయమునకు ప్రకటించును ఇది లేని స్త్రీలు అభర్తృకలనియు కామమును వర్జించుటకై వారు సాత్వికాహారమును భుజింతురనియు బేర్కొనును. ఇక చరిత్రాంశము-

3) తక్షశిల కాశ్మీర రాజ్యములోనిది. రాజు పేరు గ్రీకు గ్రంథములందు పేర్కొనబడలేదు. పోరస్ ఏ రాజ్యమున నధిపతియో చెప్పలేదు. పేరులేని రాజ్యమునకు రాజును చెప్పి, రాజ్యమునకు పేరు గల రాజు చెప్పకుండుట గ్రీకు వ్రాతలలోని యవకతవకలు, వీనిని యోనసు పినాకుల నడుమ ప్రసంగింపజేసి తచ్చరిత్రలోని లోపమును వెల్లడించెను. (229)

తక్షశిలాపతి ఎవరు? ఆ తక్షశిల కాశ్మీరము లోనిది. ఆ కాశ్మీర మునకు నేటి రాజు గోపాదిత్యుడు. అతడు సైరసుశకము నూటముప్పది మూడవయేట రాజ్యమునకు వచ్చెను. ఇపుడు నతడే రాజ్యము చేయు చుండెను. వారిది గోనంద వంశము. ఆ వంశములో నితడు పదునెన్మి దవ వాడు." కాశ్మీరమునకు రాజధాని శ్రీనగరము. ఇంతకు బూర్వ మెప్పుడో కొన్ని వేల యేండ్ల క్రిందట గోనందుస్న పేరు గలరాజు శ్రీనగరమున నిర్మించెను." 'యూమినస్' అను గ్రీకురచయిత అలెగ్జాం డరు యుద్ధదినచర్య వ్రాసెను. అందు సెల్యూకసు అలెగ్జాండరు ననుసరించినట్లు వ్రాసెను. అది యధార్థము కాదనుచు నతను దైనందిన చర్య వ్రాయలేదు. కనీసము భారతదేశములో జరిగిన ప్రత్యక్షచర్య వ్రాయలేదు. ఏదో కలిపించి వ్రాసికొనెను." అని రచ యిత నిర్కొనును. 'ఆ దేశములో అలెగ్జాండరు బాబిలోనుకు బోయి పరాభవ దూషితహృదయుడయి గుండె పగిలి చపోయినాడని చెప్పి కొందురు, (౹౩౪) ఈ యంశములకు జారిత్రకాధారము లిట్లు కాన వచ్చును,

"Alexander was told, "King Agrammes or Xendrames kept in the field an army of 20,000 Cavalry 20,000 Insurely 2,000 Chariats and and 3,000 or 4,000 elephants' Anceient India E J. Raps on. P. 469

" Alexander had learned from phegeus that beyond the Indus was a vast desert of twelve days journey, and at the farthest border there of ran the Ganges. Beyond this river dwell the teberians and the Gangaridae whose king's name was Chandramas' who had an army of 20,000 horses two lakhs (2,000,00) foot 2,000 chariats and 4,000 elephants.

'The glories of Magadha T. N Samaddar P. 23

'Themistius' అను చరిత్రకారుడు అలెగ్జాండరుతో వచ్చినవాడే

ఆతడు అలెగ్జాండరు సైన్యమును చిందరవందర గావించినట్లు వ్రాసెను. దానికి బ్రాహ్మణుల శక్తి కారణమని చెప్పబడినది.

**'The terrific flashes of flame which he beheld Showered on his army in India.'** ఇది అలెగ్జాండరు అరిస్టోటిల్‌కు వ్రాసిన యుత్తరములోని యంశము.

**(See Dantes, inferno, XIV 31 – 7)**

ఈ విధముగా నా యలెగ్జాండరు భారతదేశపు రాజులను గెలువలేక వెనుదిరిగి పోయినట్లు రచయిత నిరూపించెను.

4) ఈ దేశ చరిత్రలో సముద్రగుప్తుడు చంద్రగుప్తుని చంపి తాను రాజ్యస్వీకారమొనర్చిన చరిత్రకాంశము పినాకిచే ప్రసంగింపజేసెను. ఇట్లు ధార్మిక, చారిత్రకమైన యంశములీ నవలయందు పాఠకుల విజ్ఞానము కొఱకు ప్రసంగింపబడినవి.



# 11. వేదవతి

## చారిత్రక పూర్వరంగము

1) ఇందు శ్రీ విక్రమార్కుడు శకారి యగుటలో ప్రధాన పాత్ర వహించిన బాహ్లీక దేశ విజయము. 2) వరాహమిహిరుని సమ కాలీనత. 3) మాతృగుప్తునకు కాశ్మీర రాజ్య ప్రదానములు చరిత్రాంశములు. వీనిలో తుది రెండును చారిత్ర కోపపత్తునందు పేర్కొన బడినవి. బాహ్లీక దేశ విజయము మాత్ర మిందు ప్రస్తావింపబడుచున్నది.

1) విక్రమార్కుడు బాహ్లీకమును జయించి శకారి యయ్యెననుటకు కాళిదాసు జ్యోతిర్విదాభరణ గ్రంథము ప్రమాణ మగుచున్నది. కల్హణుని రాజతరంగిణి, సోమదేవుని కథాసరిత్సాగర ములో నీయన శకనిర్మూలనము చిత్రింప బడెను. [1] ఈ బాహ్లీకమును నేడు 'బాక్ట్రియా' యను నామముతో వ్యవహరింతురు. ఈ బాహ్లికులకు, గిల్కిలయవనులకును సంబంధము ప్రాచీనముగా నుండెడిది మ్లేచ్ఛులనగా ధర్మభ్రష్టులు, ధర్మకర్మలనుండి చ్యుతిగల్గిన హేతువున భారతదేశమునుండి వెడలగొట్టబడిన క్షత్రియులు యవనక్షత్రియులై రాజ్యములను నిర్మించుకొని పాలించిన వంశములను విష్ణుధర్మోత్తర పురాణము వివరించినది. [2] అందు దేశములుగూడ పేర్కొనబడి

---

1. "యో రోమకేశాధిపతిం శకేశ్వరం। జిత్వా గ్రహీతోజ్జయినీం మహాహవే"
"మ్లేచ్ఛోచ్ఛేదాయ వసుధాం హరే రవతరిష్యథ।
శకా న్వినాశ్య యేనాదౌ కార్యభారో నివేశితః ।' 13-125.
"శకారీన్విక్రమాదిత్యః—" 18-1.

I ప్రాచీన భారతమునకు పశ్చిమముననున్న రాజ్యములు.

2. "స్త్రీరాజ్యం సైంధవం మ్లేచ్ఛా నాస్తికాః యవనా స్తథా।
పశ్చిమేనచ విజ్ఞేయా మాథురా నైషధైస్సహ॥ 1-9-7.

యుండుట విశేషము. ఈ దేశముల నన్నింటిని విక్రమార్కుడు తన యదుపులోనికి తెచ్చుకొని శకపురుషు డయ్యెననునది చరిత్రాంశము. రచయిత యీ నవల యందు పేర్కొనిన దేశములన్నియు ప్రాచీన భారతదేశ పటమున వివరముగా జూపబడినవి

---

1) స్త్రీరాజ్యము:- (తూర్పు బెలూచి స్థానము.) 2) సైంధవము: (సింధుకు పశ్చిమమున, స్త్రీరాజ్యమునకు నుత్తరమునను, నేటి ఆఫ్ఘన్ స్థానమునకు దక్షిణపు సరిహద్దుగా నున్నది.)

3) యవనదేశము :- (నేటి యాఫ్ఘన్ స్థానములో ప్రాచీన గాంధార దేశమును దొలగించినచో యవనదేశము వచ్చును) 4) మాధురము (అఫ్ఘన్ స్థానమునకు నుత్తరప్రదేశము) 5) నైషధము (హిందూకూష్ పర్వతములలోని రాజ్యము. దీనివి మన ప్రాచీనులు నిషధదేశమని పిలిచిరి)

II) భారతదేశమునకు వాయవ్యముననున్న రాజ్యములు.

'మాండవ్యాశ్చ తుషారాశ్చ మూలికాశ్చ మురవాఃఖశాః ః
మహాకేశా మహానాసా దేశాస్తూత్తర పశ్చిమే ॥ 1-9-8.

1) మాండవ్యము (పర్షియా దేశమున కీశాన్య ప్రదేశము) 2) తుషారము (టర్కీ దేశము, పురాణములు "తురుష్క" దేశమని దీనిని వ్యవహరించినవి) 3) మూలిక (కాస్పియన్ సముద్రమునకు తూర్పునను, టర్కీ దేశమునకు నుత్తరదేశము. పూర్వ మీ ప్రదేశమున నాత్రేయి భరద్వాజ మహర్షు లాయుర్వేదమునకు సంబంధించిన యోషధులను పెంచిన కారణమున నిది 'మూలికా' దేశమున బరగెను) మహాభారతమున భీష్మ పర్వమునందు-

కాశ్మీరాశ్చాంత చారశ్చ పహ్లవా గిరి గహ్వరాః ।
ఆత్రేయా సభరద్వాజాః స్తన పోషికాః ॥ 9-68. కలదు.

4) మరువ (ఆఫ్ఘన్ స్థానమునకు వాయవ్యభూమి. "మెరువ"

కిల్కి-లయవనులకు బాహ్లీకులకునుగల సంబంధమును బురాణా ధారముతో బరామర్శించి విక్రమార్కుడు ఆకాక్రయగుటలో నీదేశ ప్రాధాన్యమును గమనింతము

---

యనియు నామము.) 5) ఖాస (ఇది మేరువకు నుత్తర భూభాగము) 6) మహాకేశ, మహానాసము లు (ఖాసదేశమునకు నుత్తర భూములు)

III) ఉత్తరదిశనున్న రాజ్యములు.

"లంపాకా స్తాలనాగాశ్చ మరుగాంధార బాహ్లికాః।
హిమాచలాలయా మ్లేచ్ఛా ఉదీచీం దిశమాశ్రితాః॥ 1-9-9

(లంపాక, తాలనాగ, మరు. ఉత్తరగాంధార, బాహ్లిక, హిమాలయ పర్వత ప్రాంతములందు ధర్మకర్మభ్రష్టులైన భారతీయులుమ్లేచ్ఛత నొంది యాక్రమించిన భూభాగములు నేటి బాక్ట్రియా దేశమునకు బశ్చిమమున లంపాక, తాలనాగ దేశములున్నవి. క్షత్రియ యవను డైన బాదలుడే లంపాక, తాలనాగ సహితముగ బాహ్లీకమును బాలించి నట్లు భవిష్యపురాణవచనము. ఇదిమఱింత వివరముగా ముందు ప్రసగింపబడును.

IV) ఈశాన్య దిశనుగల రాజ్యములు.

త్రిగర్తా మీన కౌలూతాః బ్రహ్మపుత్రా సటంకణాః॥
అభిసారాశ్చ సకాశ్మీరా శ్చోదమ్పూర్వేణ కీర్తితాః॥ 1-9-10

1) త్రిగర్త (కాశ్మీరమున కాగ్నేయ భూభాగము.) 2) మీన (కాశ్మీరమునకు దూర్పునగలదు. ఇది నేడు టిబెట్టులో గలిసెను.) 3) కులూత (సింకియాంగ్‌లో నొకభాగము.) 4) బ్రహ్మపుత్ర (మానస సరోవరమునకు బరిసరభూభాగము.) 4) టంకణ (సింకియాంగ్‌లోని భాగమే.) 6) అభిసార (కాశ్మీరమునకు వాయవ్యభాగము.) 7) కాశ్మీరము (ప్రాచీన కాశ్మీర దేశము.)

మగధ యందాంధ్రుల పాలన మస్తంగతము కాగా నచట గుప్త పాలన మారంభమయ్యెనని పురాణములు చెప్పుచున్నవి. వీరాంధ్ర భృత్యులనియు, శ్రీ పార్వతీయాంధ్రులనియు నందు వ్యవహరింప బడిరి.[3] ఈ గుప్తుల పాలన మారంభింపబడినది క్రీ. పూ. 327వ సంవత్సరము. ఈ గుప్త లేడుగురు. ఆభీరులు పదుగురు గర్దభిలురు ఏడుగురు, శకులు పదునెమ్మిదిమంది పాలించినట్లు పురాణములు పేర్కొనుచున్నవి[4] వీరందరు సమకాలీనులే. అనగా నొకే పర్యాయము పాలించిరి. వీరితో సమకాలీనముగా బాలించినవారే కిల్కిల యవనులు. వీరికి వారికి భేదమేమన.వారెక్కడి వారక్కడనే పాలింపగా నీ కిల్కిలులు దేశమునందే కాక విదేశమయిన బాహ్లికమందును పాలన జరుపుటయే యని చెప్పవచ్చును. ఈ కిల్కిలయవనుల చరిత్ర సంగ్రహముగా నిట పేర్కొనబడుచున్నది.

---

3) "తేషాంతు సంస్థితే రాజ్యే భూమి ర్గుప్తాన్ గమిష్యతి ।
శ్రీ పార్వతీయాంధ్రభృత్యా ఇత్యాఖ్యాం యాంతి తేనృపాః॥"
క. రా. వృ. భా. 8-అ. 3

4) ఆంధ్రభృత్యా స్సప్తాభీర ప్రభృతయర్దశః 1 గర్దభిలాశ్చాపి సప్తభూభుజోభవిష్యతి 1 4-24-51 విష్ణుపురాణము.

2) ఆంధ్రాణాం సంస్థితా రాజ్యే తేషాం భృత్యాన్వయే నృపాః 1
సప్తైవాన్ధ్రా భవిష్యన్తి దశాభీర స్తథానృపాః 1 17
సప్త గర్దభిలాశ్చాపి శకాశ్చాష్టాదశైవతు ॥ 18 మ. పు. అ. 273

3) సప్తాభీరా ఆవభృత్యా (?) దశగర్దభినో నృపాః 1 (ఆంధ్రభృత్యలా ?)
కంకాష్షోడశ భూపాలా భవిష్యన్త్యతిలోలుపాః ॥ 29
తతోఽష్టౌ యవనా భావ్యా శ్చతుర్దశ తురుష్కకాః 1
భూయో దశగురుండాశ్చ మౌనా ఏకాదశైవతు॥30 భాగవతం స్కం. 12
(16) కంకులు, (8) యవనులు, (14) తురుష్కులు, (10) గురుండులు (11) మౌనులు పేర్కొనబడుట ఇందలి ప్రత్యేకత.

మహాభారతమునందీ కిల్కిలయవనుల ప్రస్తావనము చేయబడినది. 'కిల్కిల' యవన స్థావరముగా భీష్మపర్వమున జెప్పబడెను. [5] ఆంధ్ర భృత్యులకు సమకాలీనులుగా నీకిల్కిలయవనులు పేర్కొనబడి యందు 'వింధ్యశక్తి' మొదటివానిగా జెప్పి విష్ణుపురాణము [6] వీరిని అమూర్ధాభిషిక్తులనినది. వీరు పదుమూఁడుగురు రాజులనియు, బాహ్లికరాజ్యమును బాలించినది వీరేననియు నీపురాణము విస్పష్టము గావించినది. మత్స్యపురాణములో కిల్కిలారాజ్యమును కిల్కిలయవనులు బాలింతురనియు, వీరిపాలనమున నార్యమ్లేచ్ఛసంకరము సంభవించి మ్లేచ్ఛమయమగునని తెలుపబడెను [7] శ్రీమద్భాగవతమునందు కిల్కిలులను భూతనందితో నారంభించి ఐదుగురను మాత్రము పేర్కొని వీరందఱును నూటయారేండ్లు పాలింతురని పేర్కొనినది. [8] కిల్కిల. రాజపుత్రులైన

5) "తత్రైవ వింధ్యచులికాః పులిందాః కల్కలైస్సహ।
మాలవా మల్లవాశ్చైవ తథైవా పరవల్లభాః॥ అ. 9, శ్లో. 62

6) "తేష్వూత్సన్నేషు కాలేషు పునఃకైంకిల యవనా।
భూపతయో భవిష్యన్త్యమూర్ధా భిషిక్తాః॥ 4-24-55
తేషామపత్యం "వింధ్యశక్తిః" 56
తతః స్తత్పుత్రా స్త్రియోదశైతే బాహ్లికాశ్చ త్రయః॥ 57
అన్వయము " ఏతేదశచ - తతః తత్పుత్రాః త్రియశ్చ-ఏతేత్రయోదశ బాహ్లికాః భూపతయో భవిష్యన్తి"

7) తేష్వూత్సన్నేనకాలేన తతః కిలకిలా నృపాః। 24
భవిష్యన్తీహ యవనాధర్మతః కర్మతోద్ధతః।
తైర్విశ్వా జనపదా అర్యామ్లేచ్ఛ ప్రాయాచ్చ సర్వతః। 25
మత్స్య. పు. 273 అ.

8) కిల్కిలాయాం నృపతయో భూతనందోఽథవంగిరిః॥ 32
శిశునందిశ్చ తద్భ్రాతా యశోనందిః ప్రవీరకః।
ఇత్యేతేవై వర్షశతం భవిష్యన్త్యధికాని షట్॥
33 భాగవతం 12 స్కంధము

'వింధ్యశక్తి' తొంబదియాఱేండ్లు పాలించుననియు,నీతని సంతతినుండి, అనగా నీతని కుమారుడైన పురంజయునినుండి విదేశమయిన బాహ్లికమును బాలింతురనియు, నీతడు బాహ్లిక రాజునకు జామాతృడై సర్వభోగము ననుభవించుననియు, 'నాగకులోద్ధారకు' డగుననియు బ్రహ్మాండపురాణము పేర్కొనుచున్నది. [9]

భవిష్యత్పురాణములో వీరిచరిత్ర బహుహృదయంగమముగా సమగ్రముగా సాగినట్లు ప్రకరణమును బరికింపగా ననుభవమునకు వచ్చును. భూతనందితో నారంభమయిన యితివృత్త మిది.[10]

పూర్వము భూతనంది యను నొక రాజుండెను. అతడు యవన క్షత్రియుడు. కుబేర యక్ష మానవులతో యుద్ధము లొనరించి సార్ధ లక్ష సైన్యమును నుఱుమాడెను. పుండరీకనాగుడను వాడు వింధ్య పర్వతములకు నాగ్నేయదిశను కిల్కిల నగరమును నిర్మాణము

---

9) తేషు భిన్నేషు కాలేన తతః కిలకిలో నృపః ।
తతః కిలకిలేభ్యశ్చ వింధ్యశక్తి ర్భవిష్యతిII 178
స్వనూష్ణవతిం చైవ పృథివీంతు సమేష్యతి।
నృపా న్వైదిశకాంశ్చాథ భవిష్యాంస్తు నిబోధతII179
శేషస్య నాగరాజస్య పుత్రః పురంజయః।
భోగి భవిష్యతే (రాజా) తతో నాగకులోద్వహఃII 180-74 అధ్యాయం.

10) "................భూతనంది స్తదానృపః। 4-23-1
కుబేరయక్షాన్ మానాన్ ధనధాన్య సమన్వితాన్।
సార్ధలక్షాన్ కల్లైర్ఘోరైర్జిత్వా తాన్ యుద్ధకారిణః I 2
కిల్కిలాయాం స్వయంరాజ్యం నాగవంశై శ్చకారఃI
ఆగ్నేయాం దిశి విఖ్యాతా పుండరీకేన నిర్మితా। 3
పురీ కిల్కిలానామ తత్రరాజా బభూవహా।
పుండరీకాదయో నాగా స్తస్మిన్ రాజ్యం ప్రశాసతి। 4
గేహేగేహే జనైః స్సర్వైఃపూజనీయా బభూవిరేI

చేయగా నీభూతనంది దానిని తన రాజ్యమునకు రాజధానిగ చేసికొని పాలింప దొడగెను. ఈ నాగుడు దేవతాంశసంభవుడు. వీరు నాగారాధకులు. నిరీశ్వరవాదులైన యవనజాతికిని వీరికిని సంబంధములేదు. పుండరీకునితో నితర నాగదేవతలు గూడ నాభూతనంది రాజ్యమున ప్రతియింట పూజింపబడుచుండిరి. ఈ హేతువుచే వైదికదేవత లెవ్వరును స్వాహాస్వధావషట్కారాదులచే బూజనీయులు గాకుండిరి.

---

స్వాహా స్వధా వషట్కారో దేవపూజా మహీతలే। 5
త్యక్త్వా దేవా నృపాగమ్య సంస్థితా మేరుమూర్ధని।
శక్రాజ్ఞయా కుబేరస్తు శాక ధాన్యం సమంతతః॥ 6
యక్షైః షడంశా నాదాయ దేవేభ్యః ప్రదదౌ విభుః।
మణి స్వర్ణాది వస్తూని మానిరాజ్యేషు యానివై॥7
దత్తాని తాని కోశేషు పునర్దేవ శ్చకారః।
మండలీకం పదంతేన సత్కృతం భూతనందినా॥ 8
శతార్ధంతు తతోరాజా శిశునంది ర్బభూవహ।
నాగపూజాం పురస్కృత్య తిరస్కృత్య సురాన్ భువి॥ 9
చకార రాజ్యం వింశాబ్దం యశోనంది స్తతోనుజః।
భ్రాత్రానను స్వయం ప్రాప్తో నాగపూజా పరాయణః ॥ 10
పంచవింశతి వర్షాణి సరాజ్య మచీకరత్ ।
తత స్తత్తనయో రాజా సబభూవ ప్రవీరకః ॥
ఏకాదశాబ్దం తద్రాజ్యం కర్మభూమ్యాం ప్రకీర్తితమ్ ।
కదాచిత్సచ బాహ్లీకే సేనయా సార్థ మాగతః ॥ 12
తత్రత్యై రభవ ద్యుద్ధం పైశాచై ర్మ్లేచ్ఛ దారుణైః ।
మాసమాత్రాంతరే మ్లేచ్ఛా లక్షసంఖ్యా మృతింగతాః ॥ 13
బాదలోనామ తద్రాజా రోమజస్థో మహాబలః ।
యశోనందిన మాహూయ దదౌ జాలవతీ సుతాం ॥ 14
గృహీత్వా మ్లేచ్ఛ రాజస్య సుతాం గేహ ముపాగతః ।
గర్భోజాత స్తత స్తస్యాం బభూవ తనయో బలీ ॥ 15

పుండరీకుడు భూతనందికి బంటుగానుండి యతి భూములనుండి సస్యముల పయి నాలువపాలు పన్నువసూలు చేసి ప్రభువయిన భూతనందికి జెల్లించెను. మానరాజ్యములందు దొఅకు స్వర్ణము, రత్నములను కానుకలుగా స్వీకరించి ప్రభుత్వధనాగారమునకు బంపుచు నీభూతనంది సర్ధ శత సంవత్సరములు పాలించెను, అనంతరము శిశునంది వింశతి వత్సరములు, తరువాత నీతని భ్రాత యశోనంది పంచవింశత్యబ్దములు పాలించిరి. వైదికదేవతలను తిరస్కరించి నాగదేవతలకు పురస్కారమొసంగిన యీరాజులలో యశోనంది పుత్రుడు ప్రవీరకుడు ముఖ్యుడు. ఈతడు పదునొకండేడులు పాలించెను, బాహ్లిక దేశముపై దండు వెడలి యక్కడ బాహ్లికరాజులతో ఘోరయుద్ధము నడపెను. వారు పైశాచులు. అనగా నిరీశ్వర యవనులు. యుద్ధములో వారు లక్ష సంఖ్యలో, వీరిరువదివేల సంఖ్యలో మరణించిరి. రోమకవంశములోని బాదలు డీతని శక్తికి నివ్వెరపడి తనకూతు జాలావతిని ప్రవీరకున కొసంగి సంధి చేసకొనెను. బాహ్లికరాజయిన బాదలునకు పుత్రులు లేకపోవుటచే నీయనయే రాజయ్యెను. వీరిద్దఱికి గలిగిన కుమారుడు బాహ్లికుడు. ఈతడు నాగారాధకుడు. ఇక్కడనుండి వీరి వంశము బాహ్లికవంశమని పిలువబడజొచ్చెను. ఈ వంశములో త్రయోదశ సంఖ్యాక ప్రభువులుందురనియు, మొత్తము వీరిపాలనకాలము చతుశ్శతాబ్దులనియు నిందు పేర్కొనబడినది.

భవిష్యత్ పురాణములో నితరపురాణములకంటె విషయము విస్పష్టముగా నుండుటవలన కిల్కిల యవనులకు బాహ్లికరాజులకు గల సంబంధమునకు హేతువు తెలియబడినది.

---

బాహ్లీకోనామ విఖ్యాతో నాగపూజన తత్పరః ।
తదన్వయే నృపాజాతా బాహ్లీకాశ్చ త్రయోదశ ॥ 16
చతుశ్శతాని వర్షాణి కృత్వా రాజ్యం మృతింగతాః ॥ 17
అయోముఖేచ బాహ్లీకే రాజ్యమత్ర ప్రశా సతి ॥ 18

2) భాగవతములో చెప్పబడినట్లు పూర్వ కిల్కిలయవను లైదు గురే యగుచున్నారు. (వంగు డిందు పేర్కొన బడలేదు.) 3) బాహ్లిక దేశమునకు బోయిన యనంతరము పదుమూవురతో బాహ్లికాన్వయ మొకటి యేర్పడినట్లు స్పష్టము. 4) ఈ వంశమే యితర పురాణము లందు ద్విమిత్ర, దిమిత్ర, త్రిమిత్ర (Demtrius Dynasty) వంశ ములుగా బేర్కొనబడినది.

బాహ్లికులు 400 సంవత్సరములు పాలించిన తరువాత నయో ముఖునిచే నీబాహ్లికము పాలింప బడునని చెప్పి యీ చరిత్ర ముగింప బడినది. నాలుగువందల సంవత్సరములనగా గుప్తులకాలముతో నారంభ మయిన యీ వంశము క్రీ పూ. 327 నుండి క్రీ. పూ. 73 వరకు బాలించి యుండవలెను. క్రీ. పూ. 57న గల విక్రమార్కునకు నీ దిమిత్రీయ వంశములో బాలించిన వానిలో రోమకుడు సమకాలికుడు. ఈ రాజ్యము క్రమముగా నాస్తికముకాగా సర్వయవన రాజ్యములకు గేంద్రమై భారతీయులను బాధింప విక్రమార్కుడు వారిని నిర్జించెను.

బ్రహ్మాండ పురాణమున భవిష్యత్పురాణమునలేని మఱియొక యితివృత్తము ద్విమిత్ర వంశమునకు సంబంధించినది చెప్పబడినది. ప్రవీరకుడు గొప్పయుద్ధ విశారదుడై, ప్రఖ్యాతివహించి బాహ్లిక (బాక్ట్రియా) దేశపరిసరములను జయించి 'కాంచనక' పట్టణమును అరువదేడులు పాలించి, అశ్వమేధయాగము నొనర్చెనని పేర్కొన బడెను ఇందు సమన్వయపడని యంశములు కొన్ని గలవు అవి 1) ప్రవీరకుని పాలనము పదునొకండేడులని పేర్కొనగా నీ పురాణము అరువదియేడులని చెప్పెను 2) కాంచనక పట్టణ ప్రస్తావన భవిష్య పురాణమునలేదు. 3) బాహ్లికవంశమను పేరుతో వ్యవహరింప బడి నట్లు భవిష్యపురాణము చెప్పుచున్నది. బ్రహ్మాండ పురాణమున నా విస్పష్టతలేదు. 4) అశ్వమేధయాగ ప్రస్తావన బ్రహ్మాండ పురాణములో నుండుట విశేషము.

## వేదవతి - ఇతివృత్త సంగ్రహము

విక్రమార్కుడెట్లు శకకర్త యయ్యెనో నిరూపించుటకు నిర్వహించిన యితివృత్త మీనవల. విక్రమార్కుని యాస్థానమున మహా విద్యానిధి, ఖగోళశాస్త్ర వేదియగు వరాహమిహిరుని ప్రవేశముతో మొదలయి, ఖగోళ పరిజ్ఞాన సంయుతమైన నక్షత్రవేధశాలా నిర్మాణ ముతో నితివృత్తము ముగియును.

వరాహమిహిరుడు సింహపురవాసి. ఆయన కుమార్తె వేదవతి. ఆమెను యవనులెత్తుకొని పోయిరి. తన ఖగోళ, జ్యోతిర్విజ్ఞానము లాయమ భద్రతకు భంగములేదని నిర్ణయించినను నామెయునికి నెఱుంగ లేని వరాహమిహిరుడు ఉజ్జయినీ పురాధీశ్వరుడయిన విక్రమార్కుని యాశ్రయించెను. ఆయన తపోవిభవమును, జన్మ వృత్తాంతమును, భవిష్యచ్చక కర్తృత్వము నెఱింగిన వరాహమిహిరుడే కార్యసాధకు డగునని యెంచి యవన దురాగతములను జక్రవర్తికి సమగ్రముగ నివేదించెను. తాను సంభాషించుచున్నది ప్రసిద్ధ ఖగోళవేత్త వరాహమిహిరునితోనన్న విషయము విస్పష్టమయి కాళిదాసాదు లతో నొక రత్న మబ్బెనని సంతోషించి, యుజ్జయినిని జ్యోతిర్వేదాలయ ముగ నీమహనీయునిచే నొనర్ప నూహించి వేదవతీ విషయ పరిశోధన నిమిత్తము సమర్థులయిన చారులను నియోగించెను.

దరద కిరాతోరగ సింహపుర కటక గాంధారాదులు నాటి ప్రముఖ యవన దేశములు. మహాభారతమున కిల్కిలయవనుల ప్రసక్తి గలదు. వీరు వింధ్యపర్వత వాసులు, పూర్వము భారతమునుండి కర్మ భ్రష్టులై, వేదబాహ్యులైన వారిని మ్లేచ్ఛులుగా నిర్ణయించి దేశ నిష్కాసనశిక్ష నిచటి రాజులు విధించెడివారు. అట్టివారు హెచ్చు సంఖ్యలో నొకొకపాదు పెట్టికొని యటనట గ్రామములను, నగరము లను నిర్మించుకొని వ్యవసాయాదులచే జీవనమార్గ నిర్మాతలయి, రాజ్య

ములను నిర్మించుకొని యుండిరి. వారు వీలైనపుడెల్ల, భారతదేశము పైకి దండు వెడలుచు ననేక దురాగతము లొనర్చుచుండిరి. సమర్థుడైన రాజగుచో వారిని పారద్రోలెడివాడు, లేనిచో వారి పీడ వీరికి తప్పదయ్యెను ఇట్లుండగా, నీకిల్కులు యవనులకు నాగారాధనము కలదు, అనగా వీరు సేశ్వరవాదులు. వీరికిని నుత్తర బాహ్లికమునకును మొదట సంబంధము లుండెను. కాశ్మీరముగూడ మొదట నాగారాధకుల చేతియందే యున్నది. క్రమముగా నుత్తర బాహ్లిక దేశము సేశ్వరులనుండి నిరీశ్వరవాదుల చేత జిక్కినది. వీరు రోమకులు. రుమ్మకులనియు బిలువబడిరి. కథాకాలమునాటి యీదేశపు రాజు రూమ్యకుడు. ఈయవన దేశములన్నింటిని జయించిన (తూర్పు బాహ్లికముతో) విక్రమార్కుడు తిరిగి యుజ్జయిని చేరినంతనే ఈయవన శక్తులు విజృంభించిన విషయమును దెలిసిన చక్రవర్తి దీని నెట్లెదుర్కొనవలయునని చింతించు సమయమున వరాహమిహిరుడు చక్రవర్తిని సమీపించెను.

చక్రవర్తిచే నియమింపబడిన గూఢచారులు వేదవతీ పరిజ్ఞానముతో సర్వయవన దేశరహస్యములను తమ చక్రవర్తి కెఱింగించి యాదేశములలో యవనుల దురాగతములను దలయెత్తనీయకుండుటలో నసామాన్యమయిన ప్రతిభ జూపిరి. ఉరగదేశపురాజు సౌమ్యుడు. ఈయన క్షత్రియ మార్గమునే యవలంబించు చుండెను. కుమారుడైన కామలహారి వ్యాధిపీడితుడు. ఆ వ్యాధిని కటకటయోగి యనువాడు తన తంత్రముచే గుదిరించి సౌమ్యుని యవనునిగా నొనర్చెను. దరద దేశ పాలకులును వీరే, మంత్రివీరదత్తుడు. ఈయన పూర్వులు వేదమత మందు బద్ధాదరులు. కాని యీయన యవన మతాభిమాని. తన తండ్రి వేదమతాభిమానముచే తాను ప్రేమించిన యవనస్త్రీ యగు 'కలాపిని' నీయన వివాహమాడలేక పోయెను. ఆమెను పెండ్లియాడిన 'ప్రస్తరఖని' కెన్నియో మేళులు గూర్చిన వీరదత్తుడు తన కుమార్తెయైన 'మధుగుంజ'ను జక్రవర్తి కామమునుండి తప్పించుటకై కటకట

యోగితో బంపివేసెను. ఈ రెండు దేశముల నానియున్న ఉత్తర జ్యోతిష కటకదేశపు ఎల్లలతో నొక మారణాయుధ నిర్మాతగ చక్రవర్తి గూఢచారియయిన మృగేంద్రసింహుడు సన్యాసిగ ప్రవేశించి సేనాపతి నీలాంజనుని గురించి తదాయుధ నిర్మాణ రహస్యమును కటకదేశములోని సహదేవ భరతసుమంతులను సేనానులకు నీలాంజనుని యానతిని దెలిపెను. ఈవిధమున నీదేశముల రహస్యముల నెఱింగినవాడయ్యెను.

సుమంతుని పినతండ్రి కుమారుడైన సవ్యసాచికి వెఱ్ఱివలె దిరుగు నొక స్నేహితుడు కుదిరెను. ఆత డేకతాం బూని యేవియో మ్లేచ్ఛగీతముల నాలపించును. సంఘమర్యాదా పరిజ్ఞాన హీనుడయిన వీనితో దిరుగుట సవ్యసాచికి బాధయయ్యెను నన్నగారు 'మధుగుంజ' యునికిని దెలియ నాదేశించుటతో వీనివలన నేమైన సాధ్యమగునేమో యని వెంబడించుచుండెను. తుదకా ప్రదేశమును దెలిసిన వాడును నయ్యెను.

మొదటగా విక్రమార్క చక్రవర్తి యవనులను జయించిన హేతువును బురస్కరించుకొని విజయోత్సవములను సింహపురరాజు జరుపుచు నీ వరాహమిహిరుని యాహ్వానించెను. ఈయన కుమార్తె వేదవతి బాల్యమునుండి రుజగ్రస్త. ఒకానొక దినమున వరాహమిహిరుని గ్రామమున కొక సంగీతవిద్వాంసుడువచ్చి సభ చేసెను. అనారోగ్యముగానున్నను వేదవతిని దీసికొని యా సభకు వరాహమిహిరుడు బోయెను. మలహరి రాగాలాపనముచే నామె రుగ్మత కొంత బోయినట్లు భావించిన తండ్రి యాయనను కొంతకాలము తనయింటి యొద్దనే యుంచి, రాగమునకు, రోగమునకు గల సంబంధమును పరిశోధన మొనర్చుచుండెను. తనకంటె తన గురువు ఇందు నిష్ణాతుడని చెప్పినంత నాయనను దెమ్మని వరాహమిహిరుడు శేష, నయ్యానతిగైకొని

వెడలిన విద్వాంసుడామె రుగ్మతములు నుపాయములను గుహవు నుండి తెచ్చెను. త్రయీపాఠము క్రమము దప్పక విన్పింపవలయు ననునదియెన్ని తవారణోపాయము. ఇట్లు జరుగుచున్న తరుణములో నీ యాహ్వాన పురస్కృతులై సింహపురి జేరి తిరిగి వచ్చుసరికి వేదవతి యొక ముచ్చుచే ప్రముచ్చిలింపబడెను.

వృద్ధశ్రవస్సదృశుడైన మిత్రగుప్తుడను చారుడు ఉత్తర జ్యోతిషమునకు వేదవత్యన్వేషణ నిమిత్తమై వెడలెను. తనకెట్టి విషయము తెలియ నవకాశము లేమి వినినవాడై తమ గూఢచార దళము గలిసికొనుట కేర్పాటుకాబడిన 'వీణావతి' గ్రామమునకు బోవుచు ద్రోవలో నొక మహారణ్యమున నొక సంగీతమున కాకర్షితుడై యట టికటికను గాంచి. తన చుట్టరికమును దిరుగవేసెను.

వీనిని దీసికొని మిత్రగుప్తుడు వీణావతికి బోయెను. అట నెల్లరు సమావేశమయిరి, మృగేంద్రసింహుడు తానురగదేశమున నిర్వహించిన కార్యము నెఱింగించెను, మధుగుంజ విషయమును తాను. టికటిక, సవ్యసాచిసాయమున నెఱింగినయు దంతమును మిత్రగుప్తుడు వివరించెను. టికటిక సంగీతము, సవ్యసాచికి సుమంతునితోడి బాంధవ్యము వ్యక్తమయ్యెను. మురారిభట్టు అను గూఢచారి సుమంతునితో నిట్టి కార్యమును నిర్వహింపజేసినది తానైన వైనము నెఱింగించెను. వీణావతి గ్రామ ద్వారపాలకుని గృహమునందు వీరు సమావేశమైరి. అతని పేరు శర్యాతి. ఈతని తల్లి ప్రభాతవేళ భగవన్నుతి చేయుచుండ నా శ్లోకములను విచిత్రముగా, నత్యాశ్చర్యకరముగా టికటిక తన యేకతారపై నాలపింపజేయ మొదలిడెను. అతడట్లు పదిరెండుదినము లధ్యయనము గావించి యా గీతములలోని పవిత్రభావమునకు దన యజ్ఞానముపశమించి జ్ఞానోదయమైనట్లు భావించెను. ఈ మార్పు సవ్యసాచి మిత్రగుప్తులు సైతమెఱింగిరి అనంతరము వీరు మువ్వురు మధుగుంజాన్వేషణ నిమిత్తమై పయనమైరి.

మాసము దనుక వీరి ప్రయత్నము సఫలము కాలేదు. వీరి యలసటలో టికటిక యొక్కడే మధుగుంజకై వెడలెను. ఒక గానము ననుసరించి వెడలిన టికటిక మహారణ్యాంతర్గత తటాకానంతర పర్వత దరీ ప్రదేశమున వేదవతిని గాంచెను. కార్శ్యమునొందినట్టి యామెను తన గానముచే స్వస్థురాలిగ నొనరించి గ్రామములలో తిరిగి తిరిగి 'దృశాద్రాఘీయస్యా' యను సౌందర్యలహరీ శ్లోకము నాలపించుచు నొకరాత్రి యరణ్యగత వృక్షమును జేరెను. టికటికకు మిత్రగుప్త సవ్యసాచుల దర్శనమయ్యెను. వీరిరువురు, టికటిక యగ్రగామికాగా వేదవతి మధుగుంజా స్థావరముల నెఱింగిరి. వేదవతి కార్శ్యమునకొక యోగి నిర్వహించెడి మ్లేచ్ఛగీతాలాపనమే హేతువని తెలిసికొనిరి. కటకట యోగి మధుగుంజనుదెచ్చి యామె సంస్కృతశ్లోక పఠనమున వేదవతి బ్రతుకును వృద్ధినొందించుచుండెననియు, వేదవతిని దెచ్చిన నిమేష ధారి యోగి కాలస్వరూపుడనియు. వాడు కాలమును సంపాదించుకొని బ్రతుకువాడనియు, ఒక్కమారొక యహస్సుకంటె సంపాదింపలేని వానికాలమును రూపుమాపుట సాధ్యమని వేదవతి మిత్రగుప్త సవ్యసాచులతో జెప్పెను. సవ్యసాచిని సుమంతుని ద్వారమున సేనను దెమ్మని పంపి తామిద్దరు నానిమేషుని కాలము నడ్డగించు మార్గము నన్వేషించుచుండిరి. కటకటయోగికి, వీనికి గల భావవైరుధ్యమును దెలిసికొనిరి. కటకటయోగి మధుగుంజను దీసికొని యురగదేశమునకు బోయెను

సౌమ్యునకు కామలహారికిగూడ మధుగుంజమీద మనసయ్యెను. ఇది తండ్రికుమారుల విరోధమునకు హేతువయ్యెను. తనకల్లెని మధుగుంజను బెండ్లిచేయవలయునని కటకటయోగిని కామలహారి యర్థించెను.

ప్రవరసేనుని యనంతరము కాశ్మీరమునకు బ్రభువయిన మాత్రు

గుప్తుడు విక్రమార్కునిచే బాలింపబడిన కవిపుంగవుడు. తన తేనికి గృతజ్ఞత దెలుపుకొను సమయ మాసన్నమయినదని యెంచి కాంభోజ త్రిగర్తముల నడుమునకు దెచ్చి చక్రవర్తి యవనదేశ దండయాత్రను సుగమ మొనర్చెను. తన కత్యంత విశ్వసనీయులయిన జలౌకస, తుంజిన; సంధిమంత్రులను యుద్ధ నీతి విశారదులను జక్రవర్తికి నండ యగునట్లు పంపెను తుంజినుడు దరదదేశమునకు బోయెను. అట జక్రవర్తి గూఢచారి నాభాగు నెరింగి సౌమ్యుని సంహరించి కామల హారికి రాజ్యముతో మధుగుంజయు సమకూర్పబడునని యాసపెట్టి కటకటయోగి యత్నమును భగ్నమొనర్చెను. టికటిక ద్వారమున మధుగుంజను పీందత్తుని గృహము నుండి తెప్పించి ప్రస్తరఖని యిల్లా లయిన కలాపిని యింట నుంచబడెను,

నాభాగ మురారి భట్టులు వేదవతి గుహకు బోయిరి. చక్ర వర్తి వరుసగా యవన దేశములను నిర్జించుట మొదలయ్యెను. మేఘ స్వాతి, పూర్ణోత్సంగుడు, నరిష్టుడు, పులోముడు, శకదేశము నడుపు లోనికి దెచ్చిరి. మిగిలిన దేశములన్నియు జక్రవర్తికి లొంగెను. ఉత్తర బాహ్లికాధిపతి తన బలముతో గటకటయోగి ప్రాబల్యమున చక్రవర్తి నెదిర్చెను. విక్రమార్క డతివేలముగా బోరి కటకట యోగిని రూమ్యకుని బంధించి, వరాహమిహిరుని దోడ్కొని ససైన్య ముగా వేదవతి నిర్బంధింపబడిన గుహను జేరెను. వేదవతి బంధవిముక్త యయ్యెను. నిమేషధారి కాలగతుడయ్యెను. కామలహారి భీతితో నాత్మహత్య గావించుకొనెను. చారులందఱు నుచితరీతిని జక్రవర్తిచే సమ్మానితులైరి. కటకటయోగిని తుంజినుడు సంహరించెను. రూమ్య కుని విక్రమ డౌదార్యముతో విడిచి పుచ్చెను. విక్రమార్కుడు శక స్థాపకుడయ్యెను. విక్రముని యభ్యర్థనచే వరాహమిహిరుడు వేదవతీ పురస్సరముగ నుజ్జయినియందు ఖగోళ విజ్ఞానమయమగు నక్షత్ర వేధశాలను నిర్మించెను.

# వేదవతి-ఇతివృత్త నిర్వహణము

శ్రీ విశ్వనాథ యీ నవలయందలి ఇతి వృత్తము నీక్రింది విధమున సంవిధాన పఱచెను. 1) విక్రముడు యవనులను, రూమ్యకు నెదు ర్కొనుటకు గావించిన సముచిత హేతు కల్పనము 2) యవన దౌష్ట్య ప్రవృద్ధ్యర్థము రచయిత సృజించిన పాత్ర సముచ్చయము. 3) బాహ్లీక దేశమునకు భారతదేశమునకుగల సంబంధ సమన్వయము. 4) మాతృ గుప్తుని పాత్రకు ప్రధానేతి వృత్తముతో గల్పించిన సన్నిహిత సంబం ధము. 5) వరాహమిహిరుని పాత్ర ప్రయోజన నిర్దేశము. 6) నవలా నామౌచిత్యము.

1) విక్రముని శకస్థాపకునిగా నంగీకరించిన ప్రమాణ గ్రంథ ములు శకులను వినాశ మొనర్చినట్లు రూమ్యకుని గెలిచినట్లు బేర్కొని నవి. సాహిత్య ప్రక్రియలో సద్ధహస్తుడైన శ్రీ విశ్వనాథ యీ శకు లను జయింపవలసిన యావశ్యకతకు దగు హేతువులను కల్పించినవలను సహృదయ ప్రరోచన కాస్పదముగా దీర్చెను.

రచయిత భారతమునకు వాయవ్య, ఉత్తరదిశలందు గల యవన దేశములీ దేశమున సాగించుచున్న యాగడములను వర్ణించి పాఠకుని హృదయము నార్ద్రీభూతముగ నొనర్చిన వాడయ్యెను. తద్దురాగత ఫలమయిన భారతీయ ధర్మగ్లాని పాఠకుని మనోఫలకమున హత్తుకొను నట్లుగా జేసి యొక మహామహుడుగాని ఈ కార్యభారవహుడు గావలె నంచు దలపింపజేయును. వరాహమిహిరుడు చక్రవర్తితో-

"ఆ యవనులు వేదమతానుసారుల యొక్క యిండ్లకు నిప్పు పెట్టుదురు "ఆస్తుల నపహరింతురు స్త్రీలను చెఱపట్టుదురు. పురుషు లను వధింతురు. అవివాహితల నెత్తుకొని పోదురు. వారిని పెండ్లి యాడుమరనును." (15)

వారి క్రూరతకు వారే సాటి. యనునట్లు-"ఆ యవనులు దుర్జ

నులు. ధూర్తులు, నవిద్యావంతులు. పశుబలము మీద నాధారపడిన వారు" (18) ఇది యిట్లుండ వీరి యాగడములు ధర్మగ్లాని యెట్లు కల్గించె ననుటకు వరాహమిహిరుని మాటలలో-

"ఒక స్త్రీ జీవితములో పదిసారులిట్లు బలవంతముగా బలవంతులైన భిన్న భిన్న పురుషులచేత గొనిపోబడి యప్పటప్పటికి వానివాని భార్యగానుండుట యే స్త్రీ యభిలషించును ?-మనస్సు, హృదయము, ధర్మము-వీనిచేత భావింపబడుచున్న ప్రకృతిగల స్త్రీ ఏమికావలయును? ఆమె కర్మ యందుమా? పాలించెడి రాజుయొక్క యప్రయోజకత్వమందుమా ? (19) ఇది రాజు ధర్మపాలనపయి నిశితమైన విమర్శ. విక్రమార్కుని కర్తవ్య ప్రబోధమున కుచితమయిన హేతువు. ఆ హేతువు వేదవతిగా (శ్రీ) విశ్వనాథ నిర్ణయించెను. ఆ వేదవతి "వేదాత్మ"యే. వరాహమిహిరుని కూతురు వేదవతి.

ఇచట విచిత్రమైన కల్పన యేమన వేదవత్యన్వేషణము, యవన దేశ విజయము మిశ్రితమై యితివృత్తము నిర్వహింపబడినది. చక్రవర్తి చెప్పినది వేదవత్యన్వేషణము. చాదు లొనర్చినది తత్సహితమైన యవన దేశ రహస్య జ్ఞాన గ్రహణము. ఫలితము వేదవతీ సంపాదనము, యవన దేశ విజయము, విక్రముని శకకర్తృత్వము. ఇట్లు సామాన్యమయిన హేతువులకు ప్రధానమయిన హేతువుగా"వేదవతీ" చౌర్యము సమన్వయింప బడినది.

ఈ హేతువులు ప్రవృద్ధమగుటకు రచయిత కొన్ని పాత్రలను సృజించెను. వానిలో 1) సర్వయవన దేశములు విక్రమార్కునకు, భారత ధర్మమున కనుకూలముగా నుండునట్లు కథను బోషించెను.

"రూమ్యకునకు సర్వదేశములయందు గూఢచారులు కలరు. రూమ్యకుడు వారిచేత నెన్నియో దుష్కార్యములు చేయించును. ఈ మహాకార్యమునకు కటకటయోగి మహామంత్రి." (250) 'హార రామత

శక కిరాతోత్తర జ్యోతిష దేశములు రూమ్యకుని యొక్కయు, కట కట యోగి యొక్కయు యథేచ్ఛా విహార భూములని చెప్పవచ్చును." (252) "ఈ మహా సైన్యమంతయు నేర్పఱచి చక్రవర్తి యొక్క దండయాత్రను ప్రతీక్షించు చుండెను." (252)

ఏవంవిధమయిన దుష్కార్యోద్ధతిని నెఱపుటకు వీలైనన్ని మార్గములను సంఘటితపఱచి విక్రమార్కుని ధర్మ సంస్థాపనమునకు సన్నివేశమును రచయిత కల్పించెను. ప్రధానమయిన పాత్రలు కటకట యోగి, నిమేషధారి, రుమ్యకుడు. కటకటయోగి యురగ దరద దేశము లలో తన స్వల్పశక్తిచే నాదేశపు రాజైన సౌమ్యుని కుమారుడగు కాములహారికి గల దీర్ఘరోగమును పోగొట్టి యవనమత వ్యాప్తి నొన ర్చెను. (76) 'నిమేషధారి' వేదవతిని దొంగిలించెను. (132-1-4) రూమ్యకుడుసర్వదేశములనునిక్షత్రముగావించియవనమయమొనర్చెను.

3) ఇట్టి యాగడమునకు మూలహేతువయిన రూమ్యకు డెవ్వడు? వాని పూర్వవత్తాంతమేమి? యను సంశయమును పాఠకునకు దొల గింప భవిష్యత్పురాణ బ్రహ్మాండపురాణోక్త కిల్కిల యవన చరిత్రను కిల్కిలులకు బాహ్లికముతోడి సమన్వయము. బాహ్లిక వంశావిర్భావము, చక్రవర్తికాలము నాటికి బాహ్లికమును రూమ్యకుడు పాలించిన యంశ మును, సేశ్వరవాదులు క్రమముగా నాస్తికులై, యవనులై, మ్లేచ్ఛ భావధురంధరులయిన విధానము నితివృత్తమునందు నిబంధించి కథా సౌందర్యమును పెంచినాడు. కాళిదాసమహాకవి 'యో రోమకాధిపతిం శకేశ్వరం' అని నుడివిన శ్లోకమునకు వివరణము గావింపకున్నచో ధర్మభ్రష్టతయన్న వ్యవహారము నిష్ప్రయోజనముగా నుండెడిది.

ఈ దేశవాసులే ధర్మచ్యుతినిబొంది పర భూములందు నివాస మేర్పఱచుకొని రాజ్యములు నిర్మాణము గావించుకొని పురాణవైర మును పెంచుకొని మాతృదేశమునకు ద్రోహబుద్ధితో దురాక్రమణ చేతను, దురాగతముల చేతను విచ్ఛిత్తి కల్పించి రన్నవాదము

పోషింపబడకుండెడిది, కనుక రచయిత వీనిని వివరింప వలసిన బాధ్య తను సయితము గైకొని యితివృత్తమును నిర్వహించినట్లు స్పష్ట పూర్వము. రోమకాధిపతుల ప్రాచీన వృత్తాంతము రచయిత పోషించెడి సిద్ధాంతమున కుపోద్బలకాంశము. ఇట్లు వివరించుటలో నా యా దేశ ములన్నియు పూర్వము భారతదేశపు రాజుల ఏలుబడిలో నున్నవి యను భావమును పాఠకుడు గ్రహింపవలెనను కాంక్షయు నంతర్లీనముగా రచయిత కున్నట్లు స్పష్టము.

4) మాతృగుప్తునకు విక్రమార్కుడు కాశ్మీరరాజ్య ప్రదా నము చేసెను. ఇది చరిత్ర విషయము. ఇది విక్రముని యౌదార్య మును ప్రకటించును గాని యితివృత్తము నందిట్టిది ప్రాధాన్యము వహింప నవకాశము మృగ్యము. కాని సంవిధాన చక్రవర్తియగు విశ్వనాథ యీ పాత్రకు నితివృత్తముతో విడదీయరాని సమన్వయ మును సాధించెను. మాతృగుప్తుడు కాశ్మీర ప్రభువగు వఱకు కల్హ ణుని రాజతరంగిణియే ప్రమాణము. అనంతర కథకు శ్రీ విశ్వనాథ కల్పన ప్రమాణము. విక్రముని బాహ్లీక విజయమునకు, కాశ్మీర పరిసర ప్రదేశములు తన ప్రభువున కనుకూలమగుటకు మాతృగుప్తుడు యత్న మొనరించినట్లు కల్పించినాడు. "తోరమానుని (నాటి కాశ్మీ రపు రాజు, మాతృగుప్తునకు బూర్వుడు.) కుమారుడైన ప్రవర సేనుడు కన్పించినచో తన్ను రాజుగా నుండనీయరు. ఈ లోపుగానే తాను చక్రవర్తికి సాయము చేయవలయును." (283)

ఇది కృతజ్ఞతా సూచకమైన కార్యనిర్వహణయందు నిశ్చయమును సూచించి చక్రవర్తికి భవిష్యత్కార్యమునందు సహకరించును. తుంజిన, జలౌకస, సంధిమంతులను విశ్వాస్యులచే జక్రవర్తికి బరిపూర్ణ మయిన దోహదము కల్పించినట్లు, రచయిత ప్రధానేతివృత్తముతో సంధించెను. రూమ్యకుని, కటకటయోగిని, మాతృగుప్తుని విశ్వాస్యుల లోని తుంజినుడే బంధించుట సంవిధానములోని మెఱపు.

ఈ కల్పనము లేనిచో మాతృగుప్తుని కథకిందు స్థానముండె డిదికాదు. కొండొకచో నున్నను, నది విక్రముని యౌదార్య ప్రాకట్య సంబంధియై మాతృగుప్తుని ప్రాధాన్యము తెరమఱుగున చరిత్రయందు బడి యుండినట్లుండెడిది. నవలలో విక్రముడెంతయో మాతృగుప్తుడు నంతయే యన్నట్లు నిర్వహించెను.

6) విక్రమున కత్యంత సన్నిహితుడైన కాళిదాసపాత్రను స్వీకరింపక రచయిత వరాహమిహిరుని పాత్ర నిర్మాణము నొనర్చి వైచిత్ర్యమును సాధించెను. వరాహమిహిరుని కుమార్తెగా వేదవతిని సృజించి యామె యపహరింపబడుటతో ధర్మగ్లాని సంభవించెనని చక్రవర్తికి వినతిచేసి యవనదండయాత్ర సఱపుటకు ప్రోత్సహించిన సన్నివేశముతో వరాహమిహిరుని ఖగోళ విజ్ఞానమును మిళితమైనట్లు పాఠకుడు గ్రహించుట యావశ్యకమని రచయిత స్పష్టపఱచుచు - నేను ఖగోళమందెంత పరిశ్రమ చేసితినో జాతకభాగమందంత చేసినట్లు కనుపించదు. నాకుమార్తె గూర్చి ఖగోళ విషయ మధికమై జాతకవిషయ మల్పమై యున్నది." (21) "కాలముమీద నొక యధర్మము తుపానువలె చెలరేగినచో నన్నింటితోపాటు ధర్మము కూడ దుడిచికొనిపోవును." (19)

ధర్మస్థాపన విషయమై నవలయందు ప్రబోధనగల్గించి విక్రమునకు గర్తవ్య నిర్దేశకునిగ వరాహమిహిరుని జిత్రించి యితివృత్తమునారంభించి ధర్మస్థాపనచేసి శకకర్తయైన విక్రమార్కుని సమక్షమున జక్రవర్తి యభ్యర్థనానుసారము వరాహమిహిరుడు "హస్తినయందున్న యహస్కరకిరణ పరిమాణ ప్రపాతచ్ఛాయ సర్వసంపుటియయిన యాకాశమధ్యబిందుగత భూగోళనిష్ఠ కాలముయొక్క లక్షణము శిలారూపమున బరిణమింప జేయబడిన కట్టడములు." ఉజ్జయినియందు నిర్మించుటతో రచయిత నవలను పూర్తిచేయుటచూడ చారిత్రక విషయమున కిచ్చిన ప్రాధాన్యము విస్పష్టముగా నవగతమగును.

6) ఇతివృత్తమంతయు వేదవతీ పాత్రానుసరణమై నడచెను.

వరాహమిహిరుడు చక్రవర్తితో ప్రసంగించుటకువచ్చి యంగరక్షకునితో నిట్లనెను. "చక్రవర్తికి ప్రధానశత్రువు రూమ్యకదేశాధిపతి. దానినే బాహ్లీకదేశమందురు. అతని గెలుచుట సాధ్యముకాదు. దానికి ప్రధానమైన హేతువు నా కడుపున బుట్టిన బిడ్డ." (13) ఆమె వేదవతి. రుమ్మకుని దురాగతములలో బరాకాష్ఠవహించిన వేదవతి చౌర్యమిందు చెప్పుటతో గటకటయోగి, వాని మాయోపాయములు, నిమేషధారి కాపట్యము. మ్లేచ్ఛ విధానములు నంతర్గతముగా ప్రధాన హేతువు నందిమిడియే యున్నవి.

కటకటయోగి పదుమూడేండ్లు తన ప్రయత్నమును నిర్విఘ్నముగా కొనసాగుటకు దనయోగశక్తిని, తన బహుపూర్వజన్మ పరిజ్ఞానమును వినియోగపఱచెను. తనయోగశక్తిచేత 'వేదాత్మ' వరాహమిహిరునింట వేదవతిగా జన్మించెనని యెఱింగెను." వేదాత్మయే వేదవతి యని వ్యక్తమొనర్చుటయే రచయిత యుద్దేశ్యము. వేదాత్మయే దొంగిలింపబడుట, వేదములను దొంగిలించుటవంటిదే యగును.మున్ను వేదములను సోమకాసురుడు దొంగిలింప ధర్మలోపము కలుగగా మహావిష్ణువు మత్స్యరూపధరుడై వానినుద్ధరించి లోకమునందు ధర్మస్థాపన మొనర్చెననుట ప్రసిద్ధాంశము. ఇచట వేదాత్మయైన వేదవతి కటుకటయోగి ప్రేరణచే నిమేషధారియను మ్లేచ్ఛభావ దోష దూషితుడైన ఖండకాలస్వరూపుడు దొంగిలించెను. యవన దురాగతములచే దేశమున ధర్మగ్లాని సంభవించెను. 'నా విష్ణుః పృథివీ పతిః యను' న్యాయమున మహాతపస్వియై, పరమేశ్వర ప్రేరితుడై జనించిన కారణ జన్ముడైన విక్రమార్కుడామె నుద్ధరించి శకవినాశ మొనర్చి వేదధర్మమును ప్రతిష్ఠించినాడు. శ్రీ విశ్వనాథ వేదవతీపాత్ర సృజన మిట్టిదియే.

బాహ్లీకాధిపతిని జయించు నుద్దేశము చక్రవర్తికి నున్నట్లు (పే. 16) మనము గమనింతుము, అది వరాహమిహిరుని ప్రేరణమున మున చక్రవర్తిలో ధర్మమిశ్రితమైన యవన వినాశమును మనము దర్శింతుము. "ఈ వరాహమిహిరున కొక కుమార్తె గలదు. ఆమె పేరు వేదవతి ... ఆమె ఎందుకు బంధింపబడినది ? ఎట్లు బంధింపబడినది? ఎచట బంధింపబడినది? ... యనుచు 'నాల్గు దినము లుగడచిన తరువాత మా దర్శనమునకు వచ్చినచో నామె గూర్చి కొన్ని సంగతులు చెప్పగలమని చక్రవర్తి గూఢచారులతో జెప్పను. వరాహమిహిరుని హేతువును తపోదృష్టితో వీక్షించుటయే దీని కర్థమని చెప్పవలయును.

తపోమందిర దేహళీస్థితుడైన చక్రవర్తికొక కేంకారమును, శుకకంఠ నిర్గత బాధాధ్వని మిశ్రితమై శ్రవణపథమును తాడించినది. యంతర్గతముగా నొక దుష్టునిచే నిలువరింపబడుచున్న వేదవతిని మనము భావన చేయుటకు వీలైన సన్నివేశమిది. కాళపాది యను శుకోపదేష్టి శుకమునకు బాధ కల్గించెను. ఆ బాధ మారక బాధ కాదు. ఇది కటకటయోగి మధుగుంజకు కల్గించు బాధవంటిది. ఒక సర్పము పొంచి నెమలిని బాధించుచుండెను. ఇది కొన్నాళ్లుగా విరోధముండి పొంచి పట్టి యా కేకిని బాధింపగా వెల్వడిన బాధాసూచిక. కటకట యోగిచే ప్రేరేపింపబడిన నిమేషధారి వేదవతిని పెట్టెడి బాధ. ఇది నర్మగర్భముగా వ్యక్తము కాబడి "చక్రవర్తిచే వేదవతి స్వరూపావగతి ప్రథమ విజ్ఞాన సోపానమూ ! (69) యని యన్పించెను.

వేదవతి విముక్తయైనంత నామె చూచిన చూపులు సూర్యకిరణ ప్రసార విశేషములను స్ఫురింప జేయు వర్ణనమొనర్చి వేదస్వరూపుడు సవితృడను భావమును స్ఫురింపజేసి కవి యచట 'వేదాత్మ'ను దర్శించెనా యను భావమును కల్గించినాడు. (295) అట్లే వరాహమిహిరుడు వేధశాలా నిర్మాణమును జేయ దలంచి యామెను సర్వ ఖగోళ విజ్ఞానమయిగా దర్శించిన సన్నివేశము, సర్వవిజ్ఞానము "భగణాకృతి"లో

నిమిడినట్లు భావన కల్పింపజేసి వేదవతి నామ సార్థక్యమును ఘటించెను.

సత్కవికి సుకవికి, సత్కావ్యమునకు ససత్కార్యమునకు, ధర్మబద్ధమై, వేదచోదితమైన గీతమునకును, వైకృతమైన మ్లేచ్ఛ సంగీతమునకును గల మాధుర్య వైధుర్యములను సంగ్రహించి వేదవతి పాత్ర మూలకముగ వానిని వ్యక్తీకరించి, వేదవతి పాత్ర వైశిష్ట్య, వైచిత్ర్యములను సహృదయ హృదయంగమముగ నిర్వహించి రచయిత యర్థానామమును స్థాపించుటలో కృతకృత్యుడయ్యెను.

1) విక్రమార్క చక్రవర్తి :- ఈతడు కల్పిత ప్రభువు కాడనుటకు దగిన యాధారములు గలిగి నిర్వహింపబడిన నవలలో నీతనియుదాత్తత యొకవైపు, సద్ధతి మఱియొకవైపు సమర్థముగా నిర్వహింపబడినది, యవనుల పరాక్రమము నిర్జించుట యీయన ధీరోద్ధతికి సుదాహరణము కాగా, నీయన తపోవిభవము, కవితాహృదయము, ఔదార్యములు ధీరోదాత్తత కుదాహరణము లగుచున్నవి. తన సమ్ముఖమున సంభాషించుచున్నది వరాహమిహిరునిగా నెఱింగినంతనే, సహజముగనే నయశీలియైన ప్రభువు మఱింత వినమ్రుడై యుండుట "సత్పురుషుల వినయము బ్రహ్మపదార్థ చూడా కుసుమమువంటిదిగా వరామిహిరుడు కొనియాడుటకు హేతువయ్యెను. ఇంత వినయశీలియు తపోభవన దేహాశీస్థితుడైనపుడు వినిన బాధాత ప్తస్వరము తన కపశ్రుతియో యుపశ్రుతియో నిర్ధరించలేక "వేదవతి స్వరూపాభిజ్ఞతకు ప్రథమ సోపానమా ! యని యాగతానాగతవేదిగా దర్శింప మొసంగును. నిర్ధరించలేకపోవుటకు హేతువామె యట్టిదైన్యస్థితి యందుండునా ? యను సంశయమేగాని నిర్దేశింపలేక కాదు. ఇదే పరమార్థమయినచో 'నుపశ్రుతి' పదము నిరర్థకమగుట స్పష్టము కదా !

గూఢచారులతో సంభాషించెడి విక్రముడు వే ... స్వాం,

కష పరిజ్ఞానముతో వారిని నిలదీసినట్లుండెను. చక్రవర్తిత్వము ప్రతి భాసించినట్లు, భయోత్పాతము సంభవించినట్లుండి యాయన గాంభీర్య మునకు పదను పెట్టినట్లుండినది. 'గుర్తుపట్టబడు నవివేకి గూఢ చారియా! పే. (63) అను వాక్యమా పదుగురు గూఢచారుల గుండెలు తల్లడిల్లిపోవునట్లు చేసెను.

మాతృగుప్తుని యెడ చూపిన యౌదార్యము విక్రమార్కుని శీలమునకు నికషోపలము. ఇది 'దృశౌ ద్రాఘీయస్యా' అను శ్లోకమునకు భాష్యమేమో యనునట్లుగా శ్రీ విశ్వనాథ చిత్రించెనా? యని యన్పించును. పరమేశ్వరి దయా స్వరూపిణి. దయాదేవితో నున్నవిష్ణువే కరుణాప్రసార సామర్థ్యము గలవాడని వేదాంత దేశికులవారి సిద్ధాంతము. మహావిష్ణుస్వరూపుడైన విక్రమార్కుడా దయాదేవీ స్వరూపిణి యగు పరమేశ్వరీ ప్రేరణచే మాతృగుప్తుని కనంత సామ్రాజ్య వైభవము ప్రసాదించెనను భావము శ్రీ విశ్వనాథ మనోపీఠిక నలముకొని యుండెను. లేనిచో సౌందర్యలహరిలో శత సంఖ్యాక శ్లోకము లుండ నీశ్లోకమునే టికటికచే బాడింపనేల? టికటికకును నామె యను కంపము లభించినది. లేనిచో నా సంఘమర్యాదా పరిజ్ఞాన హీనుడైన వాడు పరమశివారాధకుడై వేదవతీ ముక్తమార్గ నిర్మాతయై, మధు గుంజా హృదయచౌర్యము నెట్లు చేయగలడు!

ఇట్లే రుమ్యకుని విడిచిపుచ్చుటయు తుంజినుని, కాంభోజాధి పతిగ నొనర్చుటయు, టికటికనురగ దేశాధీశ్వరునిగ నియమించుటయు విక్రముని యౌదార్యములోని భాగములే యగును. యవన సామ్రాజ్య పట్టభద్రులుచేయు యుద్ధములందు చక్రవర్తి ఎదుర్కొనెడి తీరంతయు నాయన యుద్ధతిని ప్రకటించును. యుద్ధానంతరము వేదవతిని యుజ్జ యినికి గెచ్చుటయు నచట ఖగోళ వేధశాల నిర్మించుటయు విక్ర మార్కునకు గల విజ్ఞాన తృష్ణను, యశోవిభవ కాంక్షను వ్యక్తీక రించును. జనసామాన్యము నందు విక్రమార్కుని సాహసౌదార్య

ములు ప్రాచుర్యము వహించియే యున్నవి. వానిని మరింత హృద యంగమముగా జరిత్ర బద్ధముగా, రసమయముగా నిర్వహించి విక్ర ముని పాత్ర కెంతయు విశిష్టతను సమార్జించెను.

2) వరాహమిహిరుడు :- ప్రముఖ జ్యోతిర్విద్యాసుడు సాహిత్యగ్రంథము నందొక పాత్రగా జిత్రీకరింపబడుట కిదియే నాంది కావచ్చును. అట్లయినచో నీకీర్తి విశ్వనాథకు దక్కును. నవలయం దీయన కొక కుమార్తె. పేరు వేదవతి. ఆమెను భగణాకృతిగా దర్శించి తన భవిష్యజ్జీవనమున కీమె మేరువగునని యెంచిన మేధావి. యవను లచే నెత్తుకొని పోబడినను ధైర్యము సడలక ధీరచిత్తముతో చక్రవర్తిని సమీపించి యవన దురాగతములందు శేఖరీభూతమయిన తన కుమార్తె యపహరణమును జెప్పుచు నామె మహత్త్వమును జెప్పి ధర్మగ్లానికి జికిత్స యొనర్పవలసినదిగా హెచ్చరించి, ప్రోత్సహించిన ధర్మమార్గా సక్తునిగా మనమాయన నీ నవలయందు దర్శింతుము.

కుమార్తె యందనురాగము కంటె నారాధన గాన్పించుట యిందలి విశేషము. ఆమె జీవనము నిత్యసంశయ గ్రస్తమగుటతో నొక సంగీతగాయకుని, వానిద్వారమున యోగిని దెలిసికొని యామె జీవన రహస్యము నెఱింగి, దానిని తన విజ్ఞానముతో సమన్వయించు కొని యామె మహాత్మ్యమును నిశ్చయించుకొనిన విజ్ఞానిగా రచయిత మనచే దర్శింపజేయును.

చక్రవర్తి యడిగిన వెంటనే యాతని యాస్థానమున నుండుట కంగీకరించిన సుగుణశీలి. తనకంటె తనశిష్యులెవరైన తనను మించి రనినచో వారిని సాదరముగా నభినందింపగల యుదాత్తప్రకృతి. తుదకు చక్రవర్తి యభ్యర్థన మేరకు వేధశాలానిర్మాణ మొనర్చి నాటినుండి ఖగోళ విజ్ఞానమునకు మేరువువలె భాసించుచున్న యశఃకాయుడుగా వరాహమిహిరుడు మన హృదయమును స్పందింపజేయును.

ఇట్లొక ప్రత్యేకలక్షణముతో రచయిత యీపాత్రను సృజించెను.

3) మాతృగుప్తుడు :- చరిత్రయందలి మాతృగుప్తునకును, నవలయందలి ఈ పాత్రకును రచయిత భేదమును ప్రదర్శించెను. చరిత్రలో విక్రముని యౌదార్యముచే మాతృగుప్తుడు కాశ్మీర రాజ్యమును పొందినట్లున్నది. అనంతరము సామాన్యముగా జూపెడు కృతజ్ఞతను వెలయించినట్లు కల్హణుడు వ్రాసెను. ఆ కృతజ్ఞతను జూపుట వేఱొక విధముగా నిర్వహించి విశ్వనాథ తన నవలా ప్రయోజనమును సాధించికొనినాడు. బాహ్లీకదేశపు రాజయిన రూమ్యకుని నిర్జింపనెంచిన విక్రమునకు సహాయమొనర్చుటయే తన కృతజ్ఞతా సమర్పణముగా భావించి సమీప రాజ్యములను చక్రవర్తి వశమొనర్చుటకు శీఘ్రప్రయత్నము లొనర్చినట్లును, రూమ్యకాధిపతికి మంత్రియైన కటకట యోగిని, మాతృగుప్తుని విశ్వాస్యుడైన తుంజినుడు సంహరించినట్లును రచయిత కల్పించి యితివృత్తమునకొక పుష్టినిగూర్చెను. ఈ విధముగా విక్రమార్కుని శకకర్తృత్వము మాతృగుప్తుని చేతను సహకరింపబడి సాధింపబడినట్లయ్యెను. మాతృగుప్తుని కృతజ్ఞతను దొడ్డదిగను, సమయానుగుణ్యమైనదిగను భావించుటకు వీలైనవిధముగా చిత్రించి తత్పాత్రయందు వైశిష్ట్యము నాపాదించెను.

4) రూమ్యకుడు :- బాహ్లీకదేశాధిపతియయిన యీ రూమ్యకుని గురించియే కాళిదాసు తన జ్యోతిర్విదాభరణ గ్రంథమునందు శకేశ్వరుడనియు, నీతనిని జయించియే విక్రముడు శకకర్త యయ్యెనని వ్రాసెను. ఈ శకేశ్వరుని నిర్జించుట చేతనే విక్రముడు శకకర్త, శకారియయ్యెనని పురాణములు, చరిత్రలు చెప్పుచున్నవి. రూమ్యకుడు విక్రమార్కునిచేత జయింప బడుటకు తగినదురాగతమును వానియందు నిరూపించుట సాహితీవేత్త కర్తవ్యము. తత్కర్తవ్యమును శ్రీ విశ్వనాథ బహు సమర్థముగా నిర్వహించెను.

"రూమ్యకుడు తన గూఢచారులచే నెన్నియో దుష్కార్యములు చేయించును. వేదమతము వారిని సంహరించును. ఈ మహాకార్యమున కంతయు కటకటయోగి మహామంత్రి (250) 'ఈ సర్వ దేశములందలి వీరులు రుమ్యకాధిపతి పతాకము క్రింద నిలిచి యుండిరి.' (57)

ఇట్టి దురాగతములను గావించుచు బలముకలిగి, కటకటయోగి వంటి వారి యల్పసిద్ధులను తన ప్రయోజనమునకై వినియోగించుకొనుచు సర్వదేశముకు మ్లేచ్ఛధర్మ సమాక్రాంతము జేయునుంకించు రూమ్యకుని వశ మొనర్చుకొనుటను ధర్మవివృద్ధము గావించినట్లగునని వరాహమిహిరుడు చక్రవర్తికి విన్నవించి తనకుమార్తె యపహరింపబడుటకు వీరే హేతువు లగుదురనియు విస్పష్టముగా విశదీకరించెను.

కటకటయోగియు సర్వయవన శక్తులను సమీకరించుకొని రూమ్యకునితో చక్రవర్తి కొఱకెదురు చూచుచుండెను. ఇట్లు రచయిత తన యనల్ప ప్రజ్ఞచే రుమ్యకపాత్రను భారతీయ ధర్మవిరోధిగ సృజించి చక్రవర్తి యాగ్రహమునకు గురియైన వానిగ జిత్రించెను. రుమ్యకుడు విక్రముని యౌదార్యమునకును హేతువే యయ్యెను. కటకటయోగిని తుంజినుడు సంహరించిన యనంతరము ధర్మగ్లాని యుపశమించినట్లుగనే భావించి ఈతనిని బంధవిముక్తుని గావించెను. ఇట్లు రూమ్యకుని పాత్ర దుష్కార్యోద్ధతికి ప్రతీకయయ్యెను. తుదకాతడు విక్రముని చే రక్షింపబడెను. ఇది రచయిత చూపిన మెఱపు.

5) కటకటయోగి - నిమేషధారి :- తను అఖండమని భావించెడి యోగవిద్యచే భారత యుద్ధ కాలమునుండి ప్రతిజన్మయు స్మృతిపథమున మెదలునట్లు చేసికొనిన బహుజన్మలవృద్ధు జయద్రథనామక కటకటయోగి. ఈ నవలయందీతడు యవనయోగి. తన జ్ఞానముచే వరాహమిహిరునింట వేదాత్మయే వేదవతిగా జన్మించినదను రహస్యమెరిగినవాడు. విక్రమార్కుడు శకకర్త యగుననియు తనయోగ

శక్తిచే తెలిసికొొని యట్లు కాకుండుటకు వేదాత్మను సిమేషధారి యను ఖండిత కాలస్వరూపునిచే బంధింపజేసి తన సర్వశక్తులను బాహ్లీక దేశాధిపతియైన రుమ్యకుని కడ సమీకరించి భారతదేశపు పరిసర ప్రాంతములైన హార రామఠ శక కిరాతోత్తర జ్యోతిషములను యథేచ్ఛా విహార భూములుగా నొనర్చుకొని మిగిలిన దేశములు సయితము స్వాధీనమొనర్చుకొనుటకు యత్నించుచు, చక్రవర్తితో యుద్ధమును తలపెట్టెను.

కాలస్వరూపుడు పరమేశ్వరుడు. అతడే వేదము, 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యమ్' అనునది గీతావాక్యము. అది శాశ్వతము. కాలమును నియమించునది యాయనయే. ఆయన భయముచేతనే వాయువు వీచును. సూర్యుడుదయించును. ఇంద్రాగ్నులు తమ తమ విధులను నిర్వర్తింతురు. మృత్యువుకూడ పరువెత్తును! తత్పరమేశ్వర నిర్మితమైన ధర్మమును భారతీయులు విశ్వసింతురు. మ్లేచ్ఛధర్మము నారాధించు వారికీ యఖండమునందు విశ్వాసములేక, ఖండకాలము నందు విశ్వాసము కలిగి దానియందేవారు ప్రమాణభూతులనియు రచయిత యుద్దేశించెను వర్తమాన వశులనియే యిచట తాత్పర్యము. అట్టిపాత్రను ప్రవేశపెట్టి శాశ్వతమైన వేదాత్మను తాత్కాలికముగా బంధింపజేసి తన యవివేకమును ప్రకటించుకొనునట్లు చిత్రించెను. వానికంటె కటకటయోగి బహుసమర్థుడు కనుకనే నా ఖండిత కాల స్వరూపుని సంహరింప గలనని విస్పష్టముగా చెప్పగలిగెను. (239-241)

ఈ కటకటయోగి యుగగదేశాధీశుని కుమారుడైన కామల హారికి తనశక్తిచే రోగమును బోగొట్టి యారాజును యవనునిగ నొన ర్చెను, మంత్రియైన వీరదత్తుని కుమార్తెయైన మధుగుంజ నాతని

'భీషాస్మా ద్వాతః పవతే, భీషోఽదేతి సూర్యః, భీషాస్మా దగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి ?1- తైత్తిరీయము.

యనుమతితో దీసికొనిపోయిన వేదవతి బాధాపనోదన ప్రక్రియగా విని యోగించెను. తన ప్రణాళిక సిద్ధింపనున్నదను నాశతో నిమేషధారిని తూలనాడి మధుగుంజనుదెచ్చి వీరదత్తున కప్పగించి సౌమ్యకామల హారులకు మధుగుంజ విషయమై స్పర్థకల్గించెను. కాని చక్రవర్తి గూఢచారియైన నాభాగునిచే నీ ప్రయత్నము విఘటితమై మధుగుంజ టికటికచే గొంపోవబడెను.

వేదవతి విముక్తురాలైనది. కటకటయోగి రుమ్యకునితో బందీయయ్యెను. తుంజిసుడు కటకటయోగిని సంహారమొనర్చెను. ఈరీతిగా యవనశక్తి భారతీయవేద ధర్మశక్తిచే నిష్క్రియయయ్యెనని యీ నవలయందు నిరూపింప బడినది.

6) టికటిక:- పాత్ర పరిచయమందే యొక వాద్యవిశేషానుభూతి యుండుట విశేషము. చక్రవర్తి గూఢచారులలో నొకడైన మిత్రగుప్తున కీతడు బంధువు, చక్రవర్తి యభిమాన కుటుంబమను భావనతో టికటిక దప్ప యెల్లరును యవన దురాగతమునకు గురియై యసువులను వీడిరి. టికటిక యొక యేకతార బూని యేవియో గీతములు పాడుకొనుచు నవ్వులబడి నడచువాడని వానిని బట్టించుకొనకపోవుటచే నీతడు బ్రతికెను. ఒకనాడీపాట, యాపాట యనక పాడుచు పోవు చుండగా నొకా నొక సంగీతముచే సమాకృష్టుడై పోవగా నా ప్రదేశమున నొక స్త్రీ కాన్పించెను, ఆమె పేరు మధుగుంజ,

సుమంత్రుడు దరద దేశములో నీలాంజనుడను సేనాపతికి సమీప వర్తనుడు,చిన్న సేనాని.ఈతని పినతండ్రి కుమారుడు సవ్యసాచి సుమంత్రునిచే వేదవత్యన్వేషణమునకై నియోగింపబడిన సవ్యసాచి కీతడు తోడయ్యెను. వీని సంగీతము త్రోవజూపుచున్న వెఱ్ఱి విశ్వాసముతో మర్యాదా పరిజ్ఞాన హీనుడైనను ,వాని వెంటబడి తిరుగుచుండ నాతనికి మిత్రగుప్తుడు తోడయ్యెను.వీరుముగ్గురును గలిసి గూఢచారు

దశాధిపతుల సమావేశము జరుగు వీణానతి గ్రామమునకు పోయిరి. అచటవారువసించిన గృహయజమాని శర్వాతిలకనితల్లి ఉదయమున నే యాలపించెడి శంకరాచార్య కృతస్తోత్రములనికలరి తానును వాసినేక తారపయి పదిరెండు దినములు సాధన చేసి స్వాధీనమొనర్చుకొని యొక చైతన్యస్ఫూర్తిని పొందెను, అది టికటిక జీవితములో మెఱపుతో గూడిన మలుపు. దీనితో తానొక విజ్ఞానిగ భాసించెను. మ్లేచ్ఛవైదిక గీతములలోని భేదము గ్రహించెను. వేదవతీ దర్శనము చేసెను. అతడు గానము చేసిన శ్లోకము—

"దృశా ద్రాఘీయస్యా దరదళిత నీలోత్పలరుచా।
దవీయాంసం దీనం స్నపయ కృపయా మామపి శివే॥
అనేనాయం ధన్యోభవతి నచతేహాని రియతా।
వనేవా హర్మ్యేవా సమకర నిపాతో హిమకరః॥ 2 "

(జగన్మాతను ప్రార్థించినందుల కీనవలయందు ఫలమొందిన దిర్వురు, మాతృగుప్తుడు, టికటిక.) వీరు మువ్వురు వేదవతీ గుహను దర్శించిరి. టికటిక తన గానమాధుర్యముచే వేదవతీ కార్శ్యమును బోగొట్టెను. వేదవతి తన కాలప్రభావమున నిమేషధారిని మడియింపజేయగలిగెను, టికటిక మధుగుంజా హృదయుడయ్యెను. వీరిరువురకును వివాహము జరిపించి చక్రవర్తి టికటికను నురగదేశాధిపతిగ నొనర్చెను.

---

2. ఇది సౌందర్య లహరిలోని 57వ శ్లోకము. దీనికి కర్త శంకరుడు. దీని భావము—ఓ జగన్మాతా! దీనుడనయిన నన్ను నీయొక్క దరవికసితములై, నీలోత్పల సదృశములైన కడగంటి చూపులతో నన్ను తడుపుము. అంత మాత్రము చేతనే నేను ధన్యుడ నగుదును. నీకేమాత్రమును హాని కలుగబోదు, వనమునందుగాని, హర్మ్యమునందుగాని హిమకరుడు సమముగనే తన కిరణపాత మొనర్చును గదా

ఈ పాత్రను మలచుటలో కవి సాధించిన ప్రయోజన మిది. 'మూకంకరోతి వాచాలం' అను శ్లోకమునకు టికటికను ప్రతినిధి నొనర్చెను. వేదత్వాన్వేషణమున, నామె కార్శ్య నిర్మూలనము చేయు విధానము నెఱింగి 'మధుగుంజ' లేనపుడు విముక్తి చేయగలిగిన వానిగ నొనర్చి యీ పాత్రకు నవలయందు సమప్రాధాన్యమును కల్గించెను. జగన్మాత కృపాలాహరిలో మధుగుంజా ప్రణయము లభించినది.

వేదవతి :- బాల్యముననే సర్వశక్తి సమన్వితగ రూపొందిన వేదవతిని నామెయనుమతి లేకుండ స్పృశించుచో మూర్ఛనొందెడి యవస్థ ప్రాప్తించెడిది. ఈమెను వేదాత్మగా దర్శించినవారు వరాహమిహిర, కటకటయోగులు, ఈమె బాధను సన్నివేశాత్మకముగా, తన తపోవిభవముచే దర్శించినది విక్రమాదిత్యుడు. తండ్రియగు వరాహమిహిరుడు ఈమెకుగల కార్శ్యమునకు వేదములు, భారతీయమైన సంగీతము, పరమౌషధములని గుర్తించి, తన యూరికి వచ్చిన గాయకు నభ్యర్థించి కొంతకాలము వరకు నాయకను నిరోధించి యామె రుగ్మతను దొలగింపజేయ గల్గెను. కాని యా గాయకుడు తన గురువు యొద్దకు బోయి త్రయీపాఠశ్రవణమే రుగ్మతకు నివారణమని తెలిసికొని తత్ప్రయత్నమొనర్చుటకు వరాహమిహిరుని కోరెను. ఇట్లు కొనసాగు చుండగా నొకడామెను మ్లేచ్ఛగీతముచే నాకర్షింపజేసి తీసికొనిపోయి బంధించెను. విక్రమ ప్రేషితులైన వారిలో మిత్రగుప్తను చారుడు టికటిక సాయమున నామె యునికి తెలిసి యామె బాధను పొగొట్టుటలో దోహ్నడి జక్రవర్తిచే నామె బంధవిముక్తికి దోహదమొనర్తురు. జక్రవర్తి ఆమె పేర నుజ్జయినిలో వరాహమిహిరునిచే వేధశాలను నిర్మింపజేయును.

ఈ పాత్ర దేహళీదత్తదీపన్యాయము ననుసరించును. అన్ని పాత్రలీమె ననుసరించియే వర్తించినవి. చక్రవర్తి, వరాహమిహిరుడు, గూఢచారులు, టికటిక, కటకటయోగి, రూమ్యకుడు, మధుగుంజ నట్టి

వారిలో గలరు, కనుకనే 'వేదవతి' యను పేరు పెట్టబడి పాత్ర ప్రాధాన్య మంగీకరించి ట్లయ్యెను. ఈమె విముక్తయై వరాహమిహిరుని గాంచిన చూపులో స్వర్గకాల ఖండికలు స్పృశింపబడుటయే నామహాచిత్యమును సార్థక మొనర్చెను. పే. (295)

మధుగుంజ :- ఈమె ఉరగదేశ మంత్రియైన వీరదత్తుని కుమార్తె, ప్రభువయిన సౌమ్యుని నుండి రప్పించు నుద్దేశ్యముతో కటకటయోగి వెంట నీమెను బంపును. కటకటయోగి వేదవతిని బంధించిన గుహాలో నుంచి నిమేషధారి నిర్వర్తించిన క్రియకు వేదవతి మరణింపకుండుట కీమెను ప్రతిక్రియగా నియోగించెను, ఈమె హేతువు వనే సౌమ్య, కామలహాసులు మరణించిరి. సంప్రదాయక సంగీతమునకు ప్రతిరూప మీమె.

నవలయందు ప్రదర్శించిన విజ్ఞానము :- 1) సంగీతశాస్త్ర పరామర్శ. శ్రీ విశ్వనాథ యీ నవలయందు 'వేదవతి' పాత్రను సృజించి యీ పాత్ర కొక ప్రాధాన్యము గూర్చెను. సంగీతమునకు జీవునకు సమన్వయమును గుదిరించెను, వేదమునకు జీవునకును లంకె వేద పఠనకాలములు, తత్తత్కాలమందు త్రయీపాఠమును జదువుటలోని ప్రామాణ్యమును వాకొనెను,అట్లేసంగీతమునకు వ్యాధినిరోధమునకును గల సంబంధమును వేదవతి పాత్ర ద్వారమున వివరించెను. ఇట-

"ఒక్కొక్క ఋతువు నందొక్కొక్క రాగము పాడవలయును. ఒక్కొక్క వేళయం దొక్కొక్క రాగము పాడవలయును." పే.(123)

"ఈ బాలికకు త్రిసంధ్యలందు వేదము విన్పించుచుండవలయును. ప్రాతఃకాలమున యజుర్వేదము, మధ్యాహ్నమందు ఋగ్వేదము, రాత్రులందు సామవేదము ప్రతిదినము, ప్రతివేళ రెండు గడియలపాటు విన్పించినచో, బదియేండ్లు నిర్విఘ్నముగ విన్పించినచో నామెకు భయములేదు, ఏ వ్యాధియురాదు." పే. (129)

ఈ విషయమై శాస్త్ర ప్రమాణమును కొంత బరిశీలింతము. సంగీతమునకు రోగనివారణమునకు సంబంధమున్నదని ప్రాచీనమునుండి మన పూర్వులు విశ్వసించుచుండిరి. ఆధునికులు సయితము సంగీతమునకును వ్యవసాయమునకును సమన్వయము చేయ పరిశోధనలు జరుపుచున్నారు. చిత్తముల,వాఙ్మల,శరీరముల నివారణమునకు యోగశాస్త్ర, ఓషధీశాస్త్రములను మహర్షి పతంజలి రచించినట్లు మనకు దెలియును. సంగీతము నాదమయము. నాదము పరబ్రహ్మ నిశ్వాసోద్గతము. దీని పయి ప్రాచీనమునుండి పరిశోధనలు జరిగినవి. ఆంజనేయుడు గుండక్రియ రాగాలాపనమున కొండకరగించుట, అక్బరుకాలములో తాన్ సేన్ మహామహుడు దీపకరాగ మాలపించి మరణించుట, ముత్తుస్వామి దీక్షితులు 'అమృతవర్షిణి రాగము' చే వర్షము కురియజేయుట లిట్టివి. ఇక సంగీతమునకు రోగనిరోధకశక్తియున్నదని శ్రీ ఎస్. ఎమ్ అన్వనాధయ్యగారు నిర్వచించి యున్నారు. యులిసిస్ పాత్రకు రక్తస్రావము సంగీతముచే నిరోధింపబడెనని హోమరు రచించెను. జహాంగీరు ప్రభు 'Insomnia' అను వ్యాధిచే బాధపడి నాలుగు తంబురలు మీటిన ధ్వనితో నివారించుకొనెనట. రామపూరు ప్రభువైన ఆలీఖాన్ వీణియపై జాజవంతి రాగమును పాడగా, విని తనకు సంభవించిన పక్షవాతమును బోగొట్టుకొనెను. ఇట్టి క్రియను మూడు సంవత్సరములు కొనసాగించెను. Max. Cohen అను అమెరికన్ శాస్త్రజ్ఞుడు వాద్యసంగీతము కంటె గాయకుని సంగీతము వ్యాధినిరోధ మందధిక ప్రాధాన్యము వహించునని చెప్పెనని రచయిత వ్రాసెను.

ఋతు సంబంధము, వేళా సంబంధముగా గానము చేయుటకు "Tha velocity of slowness of sounds" observed by Sir willian Jones as followes. "their motion must be quicker in summer or Autumn and much quicker than in-winter. Hence the primary ragas of the Hindus were arranged according to the number of Indian seasons."

History of sanskrit literature. P. 889. By M. Krishnamacharyulu.

వేదమునకు వేళలను గురించి 'ఋగ్భి పూర్వాహ్ణేదివి దేవ ఈయతే' అనియు, యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః, 'సామవేదే నాస్తమయే' అని ప్రాతఃకాలము ఋక్కును, మధ్యాహ్నమందు యజుస్సును, సాయం కాలమందు సామను గూడి యాదిత్యుడేగు నని 'వేదైరసూన్య స్త్రిభిరేతి సూర్యః' (మూడు వేదములతో గూడు కొన్నవాడై యాదిత్యుడు గమించును.) అను మంత్రమునందు చెప్ప బడినది. ఈ ఋగాద్యభిమాన దిశలను సైతము శ్రుతి పేర్కొనినది. ఋక్కునకు ప్రాచీదిశ, యజుస్సునకు దక్షిణ దిశ, సామకు నుదీచీ దిశ, అధర్వమునకు ప్రతీచీదిశ యని చెప్పబడినది.

---

1. Music Acadamy Journal. Vol. 17. 1946. "The the rapatic qualities of Music." M. M. Adyanadhaiah.

# 12. నివేదిత

## చారిత్రక పూర్వరంగము

నేడు మనదేశమున దొరతనము వారిచే సయితము గుఱుతింప బడిన శక సంవత్సరము విక్రమార్కునికి మునుమనుమడైన శాలి వాహనునిదే యనియు,నాత డుజ్జయినిని ప్రధాన కేంద్రముగా నొనర్చు కొని శకులను జయించి, తాత యనంతరము విచ్ఛిన్నమయిన మహా సామ్రాజ్యమును తిరిగి తానేకాతపత్రముగా నేలెనని తెలుపు చరి త్రాంశమును నిబంధించి యీ 'నివేదిత' తుది పురాణవైర గ్రంథ ముగా రచయిత నిర్ణయించెను.

భవిష్యత్పురాణమునందు శాలివాహనుని చరిత్ర యీవిధముగా నున్నది. విక్రమాదిత్యుడు స్వర్గతుడైన వెంటనే రాజ్యము పూర్వపు స్థితికి వచ్చెను, చక్రవర్తి లేని కతమున ప్రభువులు స్వతంత్రులైరి. రాజ్యము పదునెన్మిది విభాగములయ్యెను. పశ్చిమమున సింధు కావలి భాగమును, దక్షిణమున సేతువును, ఉత్తరమున బదరీ స్థానమును, తూర్పున కపిల దేశము సామ్రాజ్యమున కెల్లలు, ఈ సామ్రాజ్యము భగ్నమై యేర్పడిన విభాగములు 18. 1) ఇంద్రప్రస్థము 2) పాంచా లము 3) కురుక్షేత్రము 4) కపిలము 5) అంతర్వేది 6) వ్రజ 7) అజ మేరి 8) మరు 9) ఘూర్జరము 10) మహారాష్ట్రము 11) ద్రవిడము 12) కళింగము 13) అవంతి 14) ఉడుపము 15) వంగ 16) గౌడ 17) మగధ 18) కోసల రాజ్యములు,

రాజ్యములో నార్యధర్మము క్షీణించుచున్నదని యెఱింగి శకులు సింధును దాటి దాడులు చేయమొదలిడిరి. స్త్రీల నపహరించుట, దోచు కొనుట మొదలగు దుష్కార్యములు కొనసాగించుట మొదలయెను. ఈ సమయమున విక్రమాదిత్యుని మునుమనుమడయిన శాలివాహనుడు

రాజ్యమునకు వచ్చెను. అందువలన హిమాలయములలో నివాస మేర్పఱచుకొని చిన్నచిన్న రాజ్యములను సాగించుకొనుచున్న భారతీయ మ్లేచ్ఛులయిన చీనులను, పరమచీనులను జయించెను. బాహ్లిక. కామ రూప, రూమకులను జయించెను. క్రూరులయిన ఖురాసాను దేశీయు లను మట్టుపెట్టెను. దోచబడిన ధనమంతయు తెప్పించెను. వీరిని దేశమునుండి వెడలనడిపి సురక్షితముగా దేశప్రజలను, వారిధర్మమును సంరక్షించి మ్లేచ్ఛ దేశములకు నార్య భూమికి హద్దుల నేర్పఱచెను. దీనిని క్రీ. శ. 78 లేక కలి 3179 వ సంవత్సరమునాటికి సాధింప గలిగెను. నాడీ ప్రభువు పేర శాలివాహన శకము స్థాపింపబడెను.

నేటికిని మనదేశమున నీశకమే వ్యవహారమున నున్నది. ఈయన అరువది యేడులు రాజ్య పాలన మొనర్చెను. అశ్వమేధయాగ మొనర్చెను. ఇది భవిష్యత్పురాణ కథనము. ఇదియే ఈనవలకు మూల మయిన చరిత్రాంశము.

## నివేదిత-ఇతివృత్త సంగ్రహము

ఇది గ్రంథమాలలోని తుది నవల. శాలివాహనుని శక కర్తృత్వ మిందలి యితివృత్తము. శక కర్తయగు విక్రమార్కుని మున్మనుమ డీయన. ప్రమర వంశీయుడయిన విక్రమార్కుని యనంతరము విజృం భించిన శకుల నడుపులో బెట్టి శాలివాహనుడు శకకర్త యయ్యెను.

ఉజ్జయినీ ప్రభువు శాలివాహనుడు. యవన విజృంభణ మధి కముగానున్న గ్రామములలో నొకటి 'విశాల' యను గ్రామము, అందు 'ఛాయ యను బ్రాహ్మణ బాలికను నిరాకులుడను యవనుడు దొంగి లించి పెండ్లియాడు చుండ నామెను హిందువులు తీసికొని వచ్చిరి. దీనినొక యభియోగముగా జేసి యవన దేశములలో నొకటి యగు ఖురాసాను దేశపు ప్రతినిధి చక్రవర్తితో విన్నవించెను. ఉజ్జయిని సేనాని బంధువు 'ఛాయ', సేనాని యవనుల దురాగతముల నక్కడనే

చక్రవర్తికి మనవిచేసెను. ప్రతినిధి బంధింపబడెను. రాజు యవన దౌష్ట్యము నరికట్టుటకు ద్విగుణీకృతముగా సైన్యసమీకరణ మొనర్ప సేనాని కానతిచ్చెను. దేశము యవన భావ దోష దూషితమగుటకు చింతించి ప్రభువు మంత్రితో నివారణోపాయములను గురించి మంత్ర నము లాడెను.

మంత్రి కుమారుడు చంద్రకళాధరుడు రాజునకు చెలిమికాడు. వీరిరువురు సర్వవిద్యలను కలిసియే యధ్యయన మొనర్చిరి. ఆతని బిలి పించి ఆయుధ సేకరణము, అశ్వ, గజరథాది సమీకరణము, లను నిర్వహించు భార మాతనిపై నుంచెను. సర్వము యవన దృష్టికి రాని విధమున చేయ వలయునని రాజాజ్ఞ, సేనాని సైన్యము, మంత్రికుమారుని సైన్యములు పరస్పరమెఱుంగని రీతిలో శిక్షింప బడుచుండెను. చక్రవర్తి సేనానికి మంత్రికుమారుని నైపుణ్యము నెఱింగించెను. తన్నిర్వహణమునకు ధనము ప్రభుత్వముచే సమకూర్ప బడుచుండెను.

యవన ప్రతినిధి భార్యయు, శాలివాహనుని సతియు కొంత స్నేహము నెఱపు చుండిరి. తత్ఫలితము పట్టమహిషి దీపశిఖాదేవి యొద్దకు ఛాయ చేరెను. రాణి ఛాయను రాజునకు జూపి నిరాకులునితో ఛాయ పెండ్లి కంగీకరించుటకు రాజానుమతి కోరెను. రాజు రాణికి దాని వైరస్యము నెఱుక పఱచెను.

శాలావతీ నగర సమీపాటవీ ప్రాంతమున జంద్రకళాధరుడు సైన్య సమీకరణము చేయుచుండెను. సేనకు సర్వసౌకర్యములు సమకూర్పబడుచుండెను. యవనదురాగతముల నెట్లెదుర్కొనవలయునను సంశయము పయి అవంతి, ఇంద్రప్రస్థ, ఉజ్జయిని కురుదేశాధిపతులు పాంచాల దేశమందు సమావిష్టులయిరి. శాలావతి సైన్యము యవన మయముగా నున్నదని భయ సందేహాదులు వ్యక్తము కాబడెను. శాలి

వాహనుడా సైన్యము తమచే నిర్మితమగు చున్నదను విషయము పొక్క నీయలేదు. శాలివాహనుడు తమకు నాయకుడై సేనను నడిపించి యవన దౌష్ట్యము నరికట్టుటకు హేతు భూతుడు కావలెనని యేకగ్రీవముగా నిర్ణయించిరి. తను పాలు సైన్యమును పంపుటకును తీర్మానించి కొనిరి.

దేశములోని చిన్నచిన్న రాజ్యములను గెలుచుటకు మంత్రి పుత్రుడు ప్రణాళిక రచించెను. శాలావతీ సేనను, ఇతర సేనలో కొంత భాగము కలిసి సరస్వతీ దృషద్వతుల చెంత విడియుటకును, శతద్రూ విపాశా సుదామ నదులను దాటి మద్ర, త్రిగర్త, కాంభోజములను, సింధు, సౌవీర, గ్రామణీయ, గాంధార, కేకయ దేశములను మిగిలిన సైన్యముతో నిర్జించుటకును ప్రభువుతో చర్చించెను. సింధునది కడ నున్న బాహ్లీక రాజులను శిక్షించి వంగవిదేహ దశార్ణ కామరూపములను గెలిచి, కళింగోడుపదేశములను జయించి నంత ప్రభువు భారతదేశ చక్రవర్తి యగును. గంగాశంతనుడన్న ధానుష్కుడు ఈ మహత్తర కార్యములో తనతో గల వేయిమంది వీరులతో వచ్చి సాహాయ్య మొనర్తునని చెప్పెను. ధానుష్కుల శిక్షణ ప్రదేశము వీణావతి.

అంతః పురములో ఛాయ చక్రవర్తి ఎదుట పడెను. ఆమె యవనుని వివాహమాడుటలోని యసామంజస్యమును దుష్ఫలితములను వివరించెను. ఛాయ అంతఃపుర సమీప తటాకమునబడి యాత్మార్పణము గావించుకొనెను. ఈ వార్త విశాలగ్రామములో నున్న తండ్రికి దెలిసెను. సమస్య తీరెనను సుఖముతో బిడ్డ మరణించెనను దుఃఖము నావృద్ధుడు మోయవలసివచ్చెను.

నిరాకులునకు ఛాయ యాత్మహత్యా విషయము తెలిపెను. కష్టార్జితమైన స్వప్నము నశింపగా దుర్జనున కధికమైన కోపము వచ్చు చందమున నిరాకులునకు క్రోధమధికమయ్యెను. ఉజ్జయినికేగి విషయ

మెఱుగ నిర్ణయించెను. ఖురాసాను దేశ ప్రతినిధి భార్యను సందర్శించెను. ఛాయ ఆత్మహత్యా విషయము నామె ధ్రువీకరించెను. ఛాయ విషాద మరణమునకు శాలివాహనుడు హేతు భూతుడుగా నిర్ణయించి యాతని నిర్జించుమార్గమన్వేషించుట కుద్యుక్తుడై నిరాకులుడు ముందుగా శాలివాహనుని ఖురాసాను రాజ ప్రతినిధి దూతవోలె దర్శించెను. యవన దురాగతము నడఁప దేశము కృత నిశ్చయమై యుండెననియు, ప్రతినిధి త్వరలో యిల్లు చేరుననియు చక్రవర్తి జవాబొసంగెను.

నిరాకులుడు సన్యాసియయ్యెను. దశార్ణ, త్రిగర్త కోసల విదేహ, సుమ్న, ప్రసుమ్న దేశములు సంచరించెను. చక్రవర్తి యుద్ధ సన్నాహముల నెఱింగెను. ఇంద్రప్రస్థ కురుక్షేత్రము లందిది మఱింత స్పష్టమయ్యెను. భల్లాట దేశమున పారగీతుని యింటికిబోయి తన జన్మారంభమును, తన లక్ష్యము నెఱింగించెను. భారత యుద్ధకాలమున తాను జన్మించెను. తాను సైంధవుని మేనల్లుడు. తన పేరును జయద్రధుడే. తాను కాలస్వరూపుడు. భారత యుద్ధము జరుగలేదు. అలెగ్జాండరు భారతదేశమునకు వచ్చినపుడు పాలించినది మౌర్యచంద్రగుప్తుడు. విక్రమార్క శాలివాహనులు జన్మించనేలేదు. ఇట్టి వృత్తాంతములతో నీదేశ చరిత్ర వ్రాయుట తన లక్ష్యము. పారగీకుని శిష్యులయిన త్రివటుడు. ప్రొఫెరో, త్రయ్యరు, స్మితుడు, రాబసూనుడు రూకులచే నీసిద్ధాంతమును ప్రచారమొనర్చి శాలివాహను నోడింపవలెనని నిరాకులుడు వివరించెను. కుంతి భోజదేశమున గలమఱిమల్లు డంగీకరించినచో తాను తప్పక ప్రచార యత్నము చేయుదునని నిరాకులునకు పారగీతుడు మాట యిచ్చెను.

తాను ఖురాసాను దేశమునకు బోయి సైన్యసమీకరణము చేయు కార్యమాసన్నమయ్యెను. మఱిమల్లుని గని తనకు శాలి

వాహానునితో గలిగిన వైరమెఱింగించి తన సిద్ధాంతములను పారగీతుడు వ్యాప్తినొందించుననియు వానినామోదింప వలయుననియు మక్షీమల్లునకు వివరించెను.

అనార్త ఘూర్జర దేశములకు పడమట నున్న సముద్రతీరము యవనుల కెంత యనుకూలముగ నున్నదో నిరాకులుడు పరిశీలించెను. అటుగా ప్రయాణమునకు వీలుగాక తిరిగి వచ్చుచు దృషద్వతీ సరస్వతీ తీరమున విడిసిన చక్రవర్తి సేనలను బరికించెను. ఈ సైన్యమునకు ప్రతిగా సైన్యమును సమీకరింప నెంచి ద్వారకకు బోయి అటనుండి బర్బరము, రామతము ఖురాసాను దేశములకు బోయెను. ఖురాసాను దేశములోని కోట, సైన్యమును బరిశీలించి భారతీయ సుశిక్షిత వ్యవస్థకు దీనికి తారతమ్యమును గమనించి యవనుల యనైక్యతకు బరితపించెను. తన పగ ఇన్నివేల యేండ్ల నుండియు, ఫలితమునకు రాకపోవుటకు విచారించి ఖురాసాను రాజ దర్శనము చేసి శాలివాహానునిపై దండు వెడలవలసిన యావశ్యకతను, లేనిచో యవన రాజ్య వినాశము తథ్యమను నిర్ణయమును ప్రకటించి తాను సేనకు నాయకత్వము వహింతునని తన ఖడ్గ విద్యా వైదుష్యమును ప్రభువు యొద్ద ప్రకటించి వాని మెప్పుబడసెను. వారిని ఉత్తర జ్యోతిష గాంధార దేశపు పల్లెలలో సమీకరింప ననుమతి నొసంగి తాను సైన్య సమీకరణ కార్యనిర్వహణమునకై బయలు దేరెను.

చక్రవర్తి సైన్యమునకు నాయకు డెవడో తెలియని రీతిని సుశిక్షితమగు చుండెను. విరోధులు మడియింప బడుచుండిరి. చంద్రశేఖరుడు తనకు లక్ష సైన్యముకావలెననియు వారితో చక్రవర్తి శకకర్తృత్వము ముడిపడియున్నదని మనవి చేసెను. నిరాకులుని ప్రతిబంధకమును చక్రవర్తికి వినతి యొనర్చెను. చంద్రశేఖరుడు ఘూర్జర దేశముపైకి దండు వెడలెను. గంగాశంతనుడు చక్రవర్తి

మగధ కోసలులను జయించిరి. మగధ దేశము నుండి చక్రవర్తి కంగ రక్షకుడుగా నియమింపబడిన ప్రాస్పెరోను గంగాశంతనుడు సంహరించెను. రాణి చేసిన యీ నియామకమునకు జక్రవర్తి కినుక వహించి హెచ్చరించెను. రాణి దీప శిఖాదేవి తన యవివేకమునకు సిగ్గిలెను. చక్రవర్తి, గంగాశంతనుడు, చంద్రకళాధరుడు నొక్క సారియే యుజ్జయిని విజయము చేసిరి.

కపిలము, శంతర్వేది, వ్రజ, నజమీరు రాజ్యములు జయించుటకు మంత్రి కుమారుడును, గౌడకళింగోడుప ద్రావిడములను నిర్జించుటకు గంగాశంతనుడు, నాతని మిత్రుడు భేతాళభట్టు వెడలుటకు జక్రవర్తి యాజ్ఞ యయ్యెను. నాటి సాయంతనము జరిగిన రాజసభయందు మంత్రి పుత్రుడు చంద్రకళాధరునకు, గంగా శంతనునకు మహా సేనాధిపతి పదవులీయ బడెను.

లక్షసైన్యమును ఖురాసాను దేశ ప్రతినిధి సమకూర్చుచుండుటచే దనుకట్టి యవసరము కలుగకుండెను, మంత్రి కొడుకు చక్రవర్తికి విన్నవించెను. నిరాకులుని నాయకత్వములోని సేన సుశిక్షితమైనది కాకుండుట చేతను, ఆహార విహార సమన్వయము లేకుండుట చేతను, అన్నపానీయాదుల సౌకర్యము లేకుండు హేతువునను, వ్యర్థవివాదకు లరగుట చేతను వేనకువేలు చచ్చిరి. సేనాపతులు పట్టి బంధింపబడిరి. వారు రాజు సమక్షమునకు దేబడిరి. వారు లోమహామిస్తేనుడు, త్రివటుడు, ప్రొఘరో, కోణంగిసామి, విలియోనసులు. వీరందఱు మక్షిమల్లు ననుసరించి నడతుమని చెప్పిరి. నిరాకులుని లక్ష్యము ననుసరింతుమని యేకగ్రీవముగా సభలో పలికిరి. చక్రవర్తి వారందఱను సంహారింపించెను.

చంద్రకళాధరుడు తన సతియైన నివేదిక కడకు జక్రవర్తిని గొంపోయెను, ఆమె యవన యువతి. భావన చేత మ్లేచ్ఛకాదు. ఆమె

చక్రవర్తి బాల్యవృత్తాంత మెఱిగించెను. బాల్యమున శాలివాహను డొక కుమ్మరివాని యింటికడ పెరిగెననియు, నాతడు చేసిన లక్ష మృణ్మూర్తి ప్రతిమలు శత్రుసేనా పరాజయము నభిలషించి చేసెననియు, నీ రూపముగా నక్కార్యము నిర్వర్తింప బడెననియు తెలిపెను. నికృత్త శిరులయిన యవన సేనాపతు లనంతరకాలమున జనియించి తమ సిద్ధాంతములను భారతీయులలో నిరాటంకముగా ప్రచార మొనర్తు రనియు జక్రవర్తికి వ్యక్త మొనర్చెను. నిరాకులుని చక్రవర్తి సంహ రించెను. శాలివాహనుడు శకకర్త యయ్యెను.

## నివేదిత-ఇతివృత్త నిర్వహణము

ఈ నవలా నిర్మాణమును రచయిత నిర్వర్తించిన విధానము-

1) నిర్వాహములో ననుసరింపబడిన నూత్నపద్ధతి 2) యవనుల ఖండగములలోని పరాకాష్ఠను, కథా సంవిధానము రచయిత యుప యోగించు కొన్నతీరు 3) సైన్య సమీకరణమునకు హేతుకల్పనము. 4) నివేదిత పాత్ర కల్పనలోని యౌచిత్యము తత్ప్రాధాన్యము. 5) పాశ్చాత్య చరిత్ర కారులను పాత్రలుగా ప్రవేశపెట్టిన సన్నివేశము 6) నవలా లక్ష్యసిద్ధి.

1) 'వేదవతి' యందనుసరింపబడిన నిర్వహణమునకు దీనికిని పూర్తి విరోధము గలదు. ఆ నవలయందు'వరాహమిహిరు'డను పాత్ర తన కూతును యవనను డపహరింపగా నయ్యవనుల దౌష్ట్యములను వివరించి విక్రమార్కుని తన్నిర్మూలమున కయి యర్థించును. ఇది సాధారణాన్వయము. ప్రత్యక్షమయిన ప్రణాళిక. ఈ నవలయందు తద్వి పరీత మయిన ప్రణాళికను నిర్వహించి తన ప్రతిభను ప్రదర్శించెను. ఇందు ఖురాసాను దేశీయుఁడయిన యవన ప్రతినిధి శాలివాహనుని సమీపించి యవనులకు భారతీయులొనర్చెడి క్లేశములను వెళ్లబెట్టును. వారొక క్లేశ మొనర్తురు. దాని నీదేశీయు లెదిరింతురు. అదివారికి గోప

హేతువగును. వీరొనర్చిన దౌష్ట్యముగా వారికి శాసించును. అట్టివి చక్రవర్తి కా ప్రతినిధి నివేదించును. ఇది వ్యతిరేకాన్వయము, 'భగవంతుని మీాది పగ' యెట్టిదో యిది యట్టిది. మగనికొట్టి మొగసాల కెక్కి యేడ్చిన యిల్లాలు చందము, పురాణ వైరమున కిది సమర్థ మయిన నిర్వాహము.

ఉజ్జయినీ పరిసరములందు యవన దౌష్ట్యములను మిక్కిలిగా జిత్రించి యీ దుండగము లెన్నడు నమసి పోవునను భావమునకు పాలకులు, పాలితులు నయితము నాతురపడెడి సన్నివేశకల్పనతో శాలివాహనుని భవిష్యత్కార్యమునకు బలమయిన హేతువును నిర్మించెను. ఆ దౌష్ట్యములలో కొన్ని.

1) భారతీయ స్త్రీలను యవను లెత్తుకొని పోదురు. ఎదిరించిన వారిని బాధింతురు. వారిండ్లను దోచుకొందురు. తగులబెట్టుదురు, ఆ స్త్రీలను పెండ్లి యాడుదురు. కొండొకచో విడచి పుత్తురు. ఆ స్త్రీల యందు పత్నీత్వము నాశింపరు, కామభావమును మాత్రము నెఱపుదురు.

"విశాల" యను గ్రామములో ఛాయ యను బ్రాహ్మణస్త్రీని నిరాకులు డెత్తుకొనిపోయిన దౌష్ట్యము నవలయందు ప్రధానమయిన సంఘటనగా రూపొందినది.

2) హైందవ ధర్మ ప్రతిపాదకములయిన పురాణములను కాల క్షేపము చేయుచుండగా వానికి విఘ్నము కల్గించుట.

3) ధనవంతుల యిండ్లను దోచుకొనుట వారిని చిత్రహింసలకు గురిచేయుట, వీనినిక రాజ్యములోని ప్రజలు భరింపలేమను స్థితికివచ్చిరి.

2) ప్రధాన సన్నివేశమును కథయందు ప్రయోజనకరముగా దీర్చినవిధము

'ఛాయ' యను విప్రకన్య నిరాకులునిచే దొంగిలింపబడినది. ఆమెను నిరాకులుడు పెండ్లి యాడెను. వారి బంధువు లెట్లో యామెను

దెచ్చిరి. ఆమె రాణి 'దీప శిఖాదేవి' శరణు గోరెను. శాలివాహనునితో జెప్పి తన భర్త కడకు బంపెదనని రాణి మాట యిచ్చెను. రాజు విని ఛాయతో "నీవా నిరాకులునితో సంసారము చేయుము, ఈమహాగ్నిలో నీకడుపున నెన్ని సమిధలు పుట్టునో యన్నిటిని సమకూర్చుము, ఈ మహాకాలయానమున కర్త ఎవడు ? 'పాము' పే. (122)

ఈ 'పాము' యను మాట 'ఛాయ' గుండియలో బాకయ్యెను. ఆమె ఆత్మహత్య గావించుకొనెను. ఈ సన్ని వేశమే నిరాకులున కుద్రిక్తత. శాలివాహనునకు యుద్ధోత్సాహము కల్పించినది. మంత్రియు, "అందఱును యవనులు యవన భాషదూషితులైనచో వారి చావులను వారిని చావనీయవచ్చును, అట్లుకాక భారతదేశమున నాలుగు వర్ణముల యందును సాధువులు కలరు. శాంతికాములు కలరు. ధర్మాభిరతులు కలరు. వ్యాఘ్రాదులు లేళ్లను చంపి తినుచున్నవి." అని తత్సవేశమునకు మంత్రి తనపరిష్కారమును సూచించి నట్లయ్యెను.

3) ఇందు నిరాకులు డను యవనునిచే నొక్క లక్ష సైన్యము ప్రోవు చేయబడెను' అది యంతయు యవనసైన్యమే. అంతయు శాలివాహనుని చేతిలో నిహతమయ్యెను, అట్లంత సైన్యసమీకరణమునకు రచయిత యొక చక్కని హేతుకల్పనము చేసెను. ఇది రసప్రకల్పనమునకు జక్కని భూమిక యయ్యెను. శాలివాహనుడు బాల్యమున నొక కుంభకారుని గృహమున బెంపబడెనని, ఆతడా సమయమున మృత్తికతో సైన్యమును తయారుచేసి వానిని నశింప జేయుచుండెనని, అట్లు నశింపజేసిన సంఖ్యయొక లక్ష యుండెనని, నాలక్ష సైన్యము నిహతమైననేగాని శాలివాహనునకు విజయము కల్గి శకకర్త కాడనియు మంత్రికొడుకు చంద్ర కళాధరుని ప్రేమించిన 'నివేదిత' చే జెప్పించెను. ఇది నివేదిత పాత్రకు రచయిత కల్పించిన ప్రాధాన్యము. సైన్యసమీకరణమునకు కల్పనము గూడనగును. ఈ కల్పనకొక యజ్ఞాతరచయితచే రచింపబడిన 'శాలివాహన చరిత్ర' మాధారము.

'Salivabana charita is a poem on king Salivahana. The authors own name is unknown, Salivahana was the Grandson of a Kshatriya, Latasimha by name, whose Residence was Prathisthana nagara on the banks of the River Narmada, Salivahana was born to his daughter. Sasikala, by taskhaka, one of the eight Nagas, who assumed the form or her husband, during his absence. Sasikala fearing a social scandal, threw her son into the Narmada River in a covered earthen Pot. Apotter got the pot. while floating in the River and took the babe to his house. The child grew up in the pot make house and afterwards became the great emperor Salivahana' History of Sanskrit Literature, M. Krishnamacharya. P. 276

గంగా శంతనుడను పేరుగల ధనుర్విద్యావిశారదుడు వేయి మంది ధానుష్కులను శాలివాహనుని సైన్యమున జేర్పించి యాతనిని శకకర్త యొనర్చుటలో ప్రముఖ పాత్ర వహించెను. సేనాపతి, చంద్ర కళాధరుడు ఎవరికి వారుగా సేనను నిర్మించిరి. ఈ నిర్మాణ వైచిత్ర్యమేమన, భారతీయ సేనను సేనాపతి నిర్మింపగా యవన సేనను చంద్ర కళాధరుడు నిర్మించెను. యవన సేన భారతీయ పక్షము వహించునట్లుగా నిర్మాణమగుట, ఇందు భారతీయ ధర్మాభిమాని యయిన మంత్రిశేఖరుడు ప్రాతినిధ్యము వహించుట, ఏ యవనుల భారతీయులపై కినుకవహించిరో వారినే యితర దేశపు యవనులపై పోరాటమునకు సిద్ధపఱచుట యిందలి వైచిత్రము. ఈ నిర్వాహ మత్యంత ప్రశంసనీయమని చెప్పవచ్చును.

4) ఇతివృత్త నిర్వాహములో నీ పాత్రకు ప్రాధాన్యము మిక్కుటముగా గలదు. ఈమె జన్మచే విదేశీయము. ఆత్మచే భారతీయము. ఇట్టి పాత్ర నొక్కదానిని 'హెలీనా'గా సృజించి యీ నవలకు రస

పుష్టిని గూర్చెను. అందు భారతీయ ధర్మప్రణయమేమో రుచి చూపించెను. ఈ నవలయందు తులనాత్మక పరిశీలనము చేసెను.

"స్వజాతి యందున్న స్వమత ద్రోహిని శంకింపవలసినంత యవసరము, మన ధర్మమందభిమానము కలిగి యున్న పెరజాతివారిని గుఱించి యక్కఱలేదు. (1)తులనాత్మక పరిశీలన మనగా భారతీయ స్త్రీప్రణయమున స్వధర్మమును మఱచినచో వచ్చెడి నేగి, విదేశీయు లయ్యును నుత్కృష్ట మయిన భారతీయ ధర్మమందభిమానము కలిగి కొనసాగించిన ప్రణయమునకు వచ్చెడి బాగు - ఇతివృత్తమున నిబంధించుట. ఇందు మొదటి దానికి 'ఛాయ' రెండవదానికి 'నివేదిత' ప్రతీకలు. "చెడిపోయిన బ్రాహ్మణుడు కాని, బ్రాహ్మణ స్త్రీ కాని లోకమునకు జేసినంత యపకారము చెడిపోయిన యితరవర్ణస్థులు చేయలేరు." (118) ఇది తెలుపుటయే ఛాయ పాత్ర నిర్మాణములోని ప్రధాన లక్ష్యము. నివేదిత పాత్రచేతనే శాలివాహనుడు 'శకకర్త' యగుటకు దోడ్పడిన యంశములను చేర్చెను- 1) శాలివాహనుని బాల్యవృత్తాంతమామె వలన తెలియపఱచవలసి వచ్చెను. 2) మంత్రి కొడుకు నిర్మాణము చేసిన యవన సైన్యమంతయును బరోక్షముగా 'నివేదిత' బుద్ధివైశారద్యమే. వేయేల? 'నివేదిత' లేనిచో శాలివాహనుని శకకర్తృత్వ మీనవలయందు సాధింపవలనుపడదన్నట్లు నిర్వర్తించెను. తత్కారణమున నీనవల కానామము సర్వవిధముల సమన్వయ పడును.

6) మనదేశ చరిత్రను ప్రప్రథమముగా నాంగ్లేయ చరిత్రకారులు లిఖించిరి. వారు మన పురాణములనే ప్రమాణముగా గ్రహించి చరిత్ర వ్రాసి, యందున్నది కాదనివారు,వారి లెక్క ప్రకారము,యూహా ప్రకారము వ్రాసిరి. అవి మనదేశీయ బుద్ధులకు సయితము శిరోధార్య మయ్యెను. ఈ వేదనకు ఫలితమే పురాణవైర గ్రంథమాలా నివేదనము.

ఈ, నివేదిత'తో నివేదన పూర్తి యగును. ఆరంభింపబడిన "భగ వంతునిమీాది పగ ఈ నవల "నివేదిత"లో నివేదింప బడినది.రచయిత తన యూహా ప్రాబల్యమున నీ చరిత్రకారులను పాత్రలుగా మలచెను. ఆ పాత్రలకు మహానాయకుడు జయద్రథుడు. ఈ నవల యందు 'నిరా కులుడు' సర్వాధ్యక్షుడు మక్షీమల్లుడు. ఈ పాత్రలన్నియు శాలివాహ నుని సమక్షమున ద్రోహులుగ విచారింప బడును. వారందఱు నురి తీయబడుదుర్లు. ఆ పాత్రలు - నవలలో వారి పేర్లు-

1) Max-Muller- మక్షీమల్లుడు 2) Stanes-స్తైనుడు 3) Rapson- రాబసూనుడు William Jones - విలియయోనసు 5) Pargiter-పారగీతుడు 6) Deber-ధీబరు 7) V. A. Smith -స్మితుడు 8) Trayyar - త్రయ్యరుడు Cunningham - కోణంగిసామి.

వీరందఱు శాలివానునిచే నురితీయింపబడిరి.

"ఇక వేయి యేండ్లవఱకు యవనులు భారతదేశము మీాదికి రాలేరు. వచ్చియు సాధింపలేరు, తరువాత వత్తురు, అప్పుడీ యురి తీయబడిన యవన పండితులు చెలరేగెదరు. ఆది వేఱు శకము వేఱు భాష' (285) ఇది నివేదిత చక్రవర్తితో జేసిన ప్రసంగము శాలివాహ మని కాలముననే వీరి దౌష్ట్యము వారి పూర్వజన్మలలో నారంభింప బడినట్లు కల్పింపబడి ఆ పాత్రలలో విలయోనసు శాలివాహనునితో "నీవు మాకు లేవు. మేము నీకు లేము. నేను నీవు లేవని వ్రాయు దును. నా మాటలయందు విశ్వాసము కల ప్రజ లుదయింతురు'(278)

"భారతదేశము వేయి యేండ్లు భద్రముగా నుండునని, తరు వాత నైదాఱు వందల యేండ్లకుగాని యీా దుష్టపండితుల సిద్ధాంత ములు సాగవనియు నేననుకొను చున్నాను. (296)

ఈ విధముగా నాంగ్లేయులీ దేశము వచ్చిన కాలము నాటికి పదునారువందల యేండ్లకుముందే యీా దౌష్ట్యమునకు శాలివాహనుః

సమక్షమున సంకురార్పణము జరిగినట్లు కల్పించి తన ప్రణాళికకు నొక బలమయిన యధిష్ఠానమును నిర్మించినాడు. ఇట్టి పాత్రల కల్పనము. గాని, ప్రకృత చరిత్రకు సంభవించిన ద్వేష్యమునకు మన సంస్కృతి, ప్రాచీనతల పై గల యొకానొక వైరమే ప్రధానకారణమని తెలుపుట కుచితమైన సన్నివేశమును నిర్మించుకొనుటగాని అనిదంపూర్వము.

6) శాలివాహనుడు చారిత్రక పురుషుడనుటకు భవిష్యత్పురాణములోని ఆధారములు నవలలో ననుసంధింపబడి వానికి జరిత్ర ప్రమాణము సమకూర్పబడినది. చారిత్రక పాత్ర లొనర్చిన ద్వేష్యము లా చక్రవర్తి ముందే విచారింపబడి వారికి నురి శిక్ష విధింపబడినట్లుగా నవలలో గల్పింపబడినది. చరిత్ర ద్రోహము దేశ ద్రోహము, జాతి ద్రోహము గనుక రచయిత దృష్టిలో వానికి తగిన దండన మరణమే యని భావించి యది విధింపబడినది సాహిత్య పరముగా శాలివాహనుడు స్వజాతి యందుండి స్వజాతి విరోధమును బూనువారలకు, విజాతీయులై, స్వజాతి యందు పరమాభిమానమును ప్రసరింపజేయు వారి యందు, విజాతీయులై, వారి జాతి, దేశములందభిమానము గలిగి పర ధర్మముపై నలిగి వారిపై ద్వేష్యము నెఱపు వారికేయే దండనలు విధించి భారతీయ ధర్మాభిరతి నెట్లు పరిరక్షించెనో స్పష్టపఱచుటతో నీ నవలాలక్ష్యము సిద్ధించినది.

శాలివాహనుడు :- ఈ నవలయందు కథా నాయకుడు. చారిత్రక పాత్ర. విక్రమార్క చక్రవర్తి స్వర్గతుడైన యనంతరము సామ్రాజ్యమంతయు పదునెన్మిది చిన్న రాజ్యములు కాగా, వాని నేకీకృతముగావించి శకయవన ద్వేష్యమును నశింపజేసి యార్యధర్మమును వివృద్ధమొనర్చెను. తాను చక్రవర్తియై శకకర్త యయ్యెను. రససమృద్ధిగ నీపాత్ర నెవ్విధమున తీర్చి దిద్దెననునది గమనింతము.

ఈ నవలయందు శాలివాహనుడు భారతీయ ధర్మరక్షణయందు

దీక్షగలవాడు. రణకోవిదుడు. వాత్సల్య హృదయుడు, దయాగుణము గలిగిన వాడు. ఈగుణ ప్రదర్శన జరిగిన సన్నివేశములను నవలయందు చిత్రించిన విధము నరయుదము.

భారతీయ ధర్మమునకు విఘాతము కల్గించెడు యవనుల శిక్షించెడు పద్ధతులను చర్చించుటతో నీ నవల యారంభింప బడుచున్నది. అచటకు బిలిపింపబడిన మంత్రి ప్రభువుతో-

"మహాకాంతారమున సింహములు, వ్యాఘ్రములు, భల్లూకములు, చిఱుతపులులు, తోడేళ్లు గలవు. అవి యొకదాని నొకటి చంపుకొన్నచో నెవరికి నభ్యంతరము లేదు. లేళ్లను గూడ గలవు," పే.(46)

మ్లేచ్ఛుల బాధ యెంత తీవ్రతరముగ నున్నదో పై వాక్యము స్పష్టమొనర్చును. సేనాపతికి సేనను నిర్మింప నానతి యొసంగును.

విశాల యను గ్రామమునందలి ఛాయ యను బ్రాహ్మణ బాలిక నిరాకులు డను యవనుని పెండ్లి యాడెను, అనగా నీమె బలవంతముగా నెత్తికొని పోబడి పెండ్లి చేసికొన బడిన స్త్రీ విశాల. ఆమె యన్న లామెను వానికడ నుండి బలవంతముగా దెచ్చిరి. యవన ప్రతినిధి భార్యకు రాణిదీపదేవికిగల చెలిమి ఛాయ శిఖారాణికడకు జేర్చెను.రాజు రాణికడనున్న ఛాయతో నావివాహము లోని వైరస్యమును గుఱించి సుదీర్ఘ ప్రసంగమొనర్చెను, ఇది శాలివాహనుని ధర్మ దీక్షకు పచ్చ పట్టు, చివరకు తన నిర్ణయమును దెలుపుచు-

"నీవా నిరాకులునితో సంసారము చేయుము, ఈ మహాగ్నిలో నీకడుపున నెన్ని సమిధలు పుట్టునో యన్నిటిని సమకూర్చుము. హోమ్ము లోకక్షేమమునకు గాని సంతానమని యిందలి ధ్వని, ఈ 'హోమ్ము' ఛాయకు విషద్ధ బాణము. ఫలితము ఛాయ ఆత్మ హత్య. ధర్మరక్షణ మెంత కఠినమో, రాజెట్టి పౌరుష్యము కలిగి యుండవలెనో యీ పాత్రలో సూచితమయ్యెను, మంత్రి కుమారుని యపూర్వ మేధ యవన

సైన్యమంతయు భారతీయ సైన్యముగా నొనర్చెను. దానికి జక్రవర్తి రణనీతియు హేతువయ్యెను. వివిధ దేశాధిపతులు యవనుల నెదుర్కొనుటకు నాయక నిర్ణయము జరుగవలసివచ్చెను.

'అచటి సైన్యములు, ఏనుగులు, గుఱ్ఱములు, నెవరివశమందుండును ? అచట సేనానాయకుఁడెవరు? ఆమహా సేనాగ్రయాయి యెవరు ? ఆ మహావీరు డెవరు ? ఇది యా దేశాధిపతులను వేధించెడి ప్రశ్న. దీనికి శాలివాహనుడు 'నేను' అని సమాధానము,

ఇది శాలివాహనునకు గల ఆత్మ ప్రత్యయము. ఇక సైన్యము శాలివాహనుని ప్రశంసించిన తీరు-

"ఈ రాజు మహా సేనాధిపతియే యా ! ఇంత జాగ్రతగల ప్రభువు నధీనమున నడిచిన సైన్యము నదృష్టమేమనవలయును?

వివిధ సేనాపతులను గూడిన సైన్యమొనర్చిన ప్రశంసకంటె మఱెవ్వరాతని శౌర్యమునకు విలువ కట్టగలవారు?

మన చరిత్రను రచించిన పాశ్చాత్య చరిత్రకారులు నాటి కాలమున జనించిరేం. వారందరిదొకే మాట. శాలివాహనుడు నారినెట్లెదుర్కొనెనో గమనింపుడు - విలియ యోనసుతో

రాజు :- నీ విచట బంధితుడవు, నేను రాజును. నీ ప్రాణములు నా చేతిలో నున్నవి.

విలయ :- నీ ప్రాణములు నా చేతిలో నున్నవి. నీవు లేవని నేను వ్రాయుదును భవిష్యత్కాలమున నీవేమగుదువు ?

రాజు :- మీ విశ్వాసమునకు బరమ నీచములైన మీ యూహలున్నవి. మీరు నా కాలమునందు బ్రతుకరాదు. మిమ్మాందఱ నురి తీయించుచున్నాను (278)

ఇది ధర్మ రక్షణకయి నిర్వహింపబడిన దుష్ట శిక్షణ.

రాణిదీప శిఖాదేవి యందు రాజు దయను నెఱపరాదు. ఆమె

చక్రవర్తి రక్షణకయి యవన ప్రతినిధి భార్య ప్రభోధితమై యమాయ కముగా నాతని ప్రాణమునకే ముప్పు తెచ్చినది, గంగాశంతనుడు వధించిన మాగధుడైన ప్రాస్పెరోను గురించి రాణి శాలివాహనుని ప్రశ్నించును. దానికి యవన ప్రతినిధి భార్యతో నిర్బంధించు చున్నానని పలుకును. ఆమె దగ్గుత్తికపడును. శాలివాహనుని దయతో గూడిన ప్రసంగమిది.

"నీవు పెండ్లాడినది శాలివాహనుని, ఎవనినో సామాన్యునికాదు. నీభర్త ఎట్టివాడో నీకు తెలియదు నీ మక్కువయే నీకు తెలియును" ఇందు రాణిపై తనకున్న ప్రేమతో నామె తన్ను రక్షించుటలోని యనౌచిత్యము స్పష్టపడును, మంత్రి కుమారుడైన చంద్రకళాధరుని, గంగా శంతనుని వారొనర్చిన సేవకు నుచితమయినరీతిని సమ్మానించుట రాజు నకు గల కృతజ్ఞతాగుణముగా బేర్కొనవచ్చును. చంద్రకళాధరుడు వలచిన కన్నె పేరు నివేదిత. రాజునకామె పేరు తెలియదు. ఆమెతో నామె సంస్కారమును గురించి-

"మీ పేరు నాకు తెలియదు. మీరు భారతజాతియందు పుట్ట లేదని క్షత్రియ స్త్రీ కాదని చాల దుఃఖించుచున్నాను." అని వ్యక్త మొనర్చి యామె యౌన్నత్యమును ప్రశంసించును. ధర్మ విఘాతకుడైన నిరాకులుడు శాలివాహనునిచే నిహతుడయ్యెను. ప్రతినాయకుడన్నట్లు-"భారతదేశమునకొక సామ్రాజ్యాధిపతి పుట్టినన్నచో వాడష్ట దిక్పాలకుల యంశలకో బుట్టును. విష్ణ్వంశతో సంభవించును."'నావిష్ణుః పృథివీ పతిః' యను దాని కిదియే యర్థము, తత్కారణముననే నిరాకులుని తెగటార్చినంత చక్రవర్తి బిగ్గరగా ననిన వదము- ఇది భగవ

"యదాయదాహి ధర్మస్యగ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్,

ద్వాక్యము. భగవంతుడు శ్రీకృష్ణుడే భగవదంశ రాజు నందున్నది.

రాజు ధర్మమభివృద్ధి చేయు లక్ష్యము కలిగి యుండవలెను. శాలివాహను డట్టివాడు.

2) చంద్ర కళాధరుడు :- ప్రకాశవంతమయిన పాత్ర చంద్ర కళాధరుడు 'చిఱుత వానికింత తఱుసంటి పలుకు' అనున్యాయమున కెనయైనవాడు. ఈతడు మంత్రి కుమారుడు. ప్రభువునకు బాల్యాది నెచ్చెలి.

ప్రభువునకు భారతీయ ధర్మావలంబులైనయవనులపై గలశంకనుదుడిచి ధర్మవ్యతిరేకులనందఱను సేనలో చేర్చి వారిని తనసేనచేతనే మడి యింపజేసి యవన దుండగుల నెదుర్కొని వారిని సంహరింపించి యాయన శకకర్త యగుటలో ప్రధాన పాత్ర వహించెను. ఈతడు సేనావ్యవహర్త. ధర్మాధర్మ వివేచనమందు కుశలుడు. జ్యోతిర్వి ద్వాంసుడు. మైత్రీ భావపోషకుడు.

శాలివాహనుడెంత ధర్మావలంబియో చంద్రకళాధరుడును ధర్మ రక్షకుడే. చంద్రకళాధరునితో ప్రసంగమున యవన దాష్ట్యమునురూపు మాపుటకు దగిన ప్రణాళిక, వ్యూహము చక్రవర్తికి నివేదించును. ఇందీతని సైన్య నిర్మాణ ప్రజ్ఞ ప్రస్ఫుటమగును. లేనిచో చక్రవర్తి యాతని నిట్లనుమతించెడి వాడుకాదు.

"అట్లే కానిమ్ము, మేము ఫలితము నపేక్షించువారమే కాని కార్యాచరణ మార్గమున నడుగడుగున బాధించువారకాము. ఇది చక్రవర్తికి మంత్రికొడుకు పయిగల విశ్వాసమునకు గుఱుతు.

ధానుష్కుడైన గంగాశంతనునితో గలిసి చక్రవర్తి కొఱకై సాధించిన విజయము లీతని శౌర్య ప్రతాపములకు శాణోపలము.

ఈతని వ్యూహరచనము పరమసిశితమైనది. దేశమునందలి సర్వయవనులను సైన్యమున జేర్పుట, నా సేనకు శిక్షణ నిప్పించుట,

ఆ సేన శాలివాహనునిదిగా నెవ్వరికి దెలియనీయకుండ రహస్యమును గాపాడుట. పరస్పరవైమనస్యమును బ్రకటించెడి అవంతీ ఇంద్రప్రస్థ పాంచాల, కురు దేశరాజులను సమావేశపఱచి వారి సేనలను శాలివాహనుని సేనతో గలిపి యాయన చక్రవర్తిత్వమునకు వారిచే నామోదముద్ర వేయించుట - ఇవియన్నియు చంద్రకళాధరుని వ్యూహ నిర్మాణ వైశిష్ట్యమును వ్యక్తీకరించును.

ధర్మవివేచనమందు కుశలుడనుట కీతని ప్రణయమే ప్రమాణము. ఒక యవన యువతితో నీతని ప్రణయము సంభవించెను. ఆమె నివేదిత ఇది పొసగుటకు, ధర్మబద్ధమగుననుటకు, చంద్రకళాధరుడు చక్రవర్తితో తన సేనా స్వరూపమును గురించి చర్చించుచు-

"మనలోనుండి మన సంప్రదాయమునకు వ్యతిరేకులై మన ధర్మమును నాశనము చేయు వారిని మన మేమి చేయగలము ? అట్లే పరులయందు గూడ మన ధర్మము నందనుకూలురుందురు. వారు పేరునకు యవనులు. వారు యవన ధర్మమును ద్వేషింతురు. అది కసాయి ధర్మమందురు...అట్టివారిని మనసైన్యములో జేర్చుకొన్నచో దప్పేమి ?"

ఈ సమాధానము చక్రవర్తికి తృప్తి కల్గింపలేదు. వెంటనే

''స్వజాతియందున్న స్వమత ద్రోహిని శంకింపవలసినంత యవసరము మన దేశమునందు నివసించుచు మనధర్మము నందభిమానము కల్గియున్న పెరజాతి వారిని గురించి యక్కఱ లేదు. (16)

ఇది 'నివేదిత' యొక్క యాంతర ప్రవృత్తి ప్రాకట్యమునకు కీలొసంగెడి సన్నివేశమని పాఠకు డూహింపవచ్చును.ధర్మాధర్మ వివేచన చేయగలిగిన మేధావి కనుకనే దుష్టయవనులను రూపుమాపెను. సత్త్వగుణ ప్రకాశముచే శోభిల్లెడి నివేదితకు హృదయ మిచ్చెను.

ఈకథకు జ్యోతిరింద్రాంసుడుకూడ. శాలివాహనునితో

ప్రసంగించుచు-

"మీకు బాల్యస్నేహితుని యందు, జ్యోతిర్విజ్ఞానము ననుసరించి తమరు శకకర్తలగుదురనియు, సామ్రాజ్య నిర్మాతలగుదురని విక్రమార్క చక్రవర్తి వంటివాడు మరల జన్మించెనని గణితము మీద లెక్కగట్టి యీ మహా ప్రయత్నము చేయుచున్న నాయందు, మీకు విశ్వాసమున్నచో నట్లె చేయుడు" (5)

శాలివాహనుడు మొదటగా శకకర్త యగునని చెప్పినవాడు చంద్రకళాధరుడు. రెండవ వాడు గంగాశంతనుడు. మూడవది నివేదిత.

ఈతని పయి చక్రవర్తికి గల వాత్సల్యమును సమముగా బరిశీలించిన వాడు గంగాశంతనుడు.

"మహారాజా! తమరికీకుఱ్ఱవాని మీద మిక్కిలి మమకారము. ఆతడేమైపోవునోయని మీ భయము. తమకు రాజ్యము మీదకంటె యుద్ధము మీదకంటె, చక్రవర్తిత్వము మీదకంటె నీతని మీద ఎక్కువ యభిమానము." (251)

శాలివాహనుడట్టి యభిమానమునే ప్రదర్శించెను. కనుకనే చంద్రకళాధరుడు-

"తమరు నన్ను మైత్రి చేత నుపలాలించుటచేత నిట్లడుగుచున్నారు." (49) గంగాశంతనుడే యీతని శౌర్యమునకు విలువ కట్టెను.

'ఓయి బాలకుడా! నాకెనుబది యేండ్లు వచ్చి నేను ధనుర్విద్యలో నెంతవాడనో నీకు ముప్పది యేండ్లు రాక యీ విద్యలో నీ వంత వాడవు.' ప్రభువు మాత్రము విలువకట్టలేదాయన్నచో నీసన్ని వేశమును గాంచుడు. నివేదిత కడకు రాజు చంద్రకళాధరునితో బోవును. అంగరక్షకులు వెంబడింతురు. అపుడు రాజు

మీరు చంద్రకళాధరుని కంటె నధిక ఖడ్గవిద్యానిష్ణాతులా!'

ఇది రాజ ప్రశంస. ఇట్టి ప్రశంస రాజసేవకులలో నేరికి లభించును? ఇదియే యీతని విలువ.

ఈ పాత్ర త్రిధర్మ సంయుక్తము. ప్రభువు పయి మిత్రధర్మము. శత్రువుల పయి శౌర్యధర్మము, ప్రియురాలిపయి ప్రణయ ధర్మము నెఱపిన ధర్మావలంబి. వేయేల ? ఈ పాత్ర లేనిదే శాలివాహనునకు శకకర్తృత్వము లేదు ఇదియే ఈ పాత్ర చిత్రణలోని వైశిష్ట్యము.

3) నిరాకులుడు :- 'వేదవతి' యందు 'శటకటయోగి' గా మునిగి నిరాకులునిగా నిచట తేలెను. జయద్రధాంశ. ఈనవలయందును నీతని లక్ష్యము నెరవేరలేదు. నిరాకులు డీనవల యందు యవనుడు.

విశాల యను గ్రామనుందలి యొక బ్రాహ్మణుని కూతురు 'ఛాయ'. ఆమెను బలవంతముగా నెత్తుకొనిపోయి పెండ్లి చేసికొనబోవు చుండ నామె యన్నలామెను దీసికొనివచ్చిరి. చక్రవర్తి యా వివాహ మందలి వైరస్యమును దెలుపగా నామెయాత్మహత్య గావించుకొనెను. నిరాకులునకు కోపము వచ్చెను. అదియెట్టిదనగా "కష్టార్జితమైన స్వప్నము నశింపగా దుర్జనునకు కోపము వచ్చెను." (132) అట్టిది.

ఈ కోపమాతని పూర్వ స్మృతులను రేపెను, పూర్వ పూర్వ జన్మలను గుఱుతుచేసెను, తానెవ్వడో తెలియవచ్చెను. తనలక్ష్య మేమియో యవగతమయ్యెను.

"తాను నిరాకులుడో, జయద్రధుడో, శింతాకరాళుడో, విలియ యోనసో, తానెవ్వడో గుర్తులేదు." పే, (204) ఇవియన్నియు నాతడే గదా. "తన భార్యయొక్క మృత్యువునకు హేతువైన వాడు రాజు. తన వివాహమును భంగపఱచినవాడు సేనాని, వీరిద్దఱు తనకు విరోధులు,' ఆ పగ సాధింపవలెను. ఇది యాతని లక్ష్యము, తాను ఖురాసాను ప్రతినిధియయ్యెను, పాంగీతుని, యవన పండితులను గలిసెను. తనసిద్ధాంతమును విస్పష్టమొనర్చెను. ఆ సిద్ధాంతమేది ? "భల్లాట

దేశమందలి పారగీతుడును వాని శిష్యులను నాచెప్పినట్లు నడతురు. విలియ యోనను సృష్టి జరిగి రెండు వేల యేండ్లయినదని, భారతము వేయియేండ్లక్రితము వ్రాయబడినదని. విక్రమార్క శాలివాహనులు జన్మింపలేదని నిరూపింపుము, నీవంగీకరింపుము." ఇది భోజదేశము నందలి మక్కిమల్లునితో నిరాకులుని ప్రసంగము. కనుక నీతని లక్ష్యము లలో ప్రధానమైనది విక్రమార్క శాలివాహనులు జన్మింపలేదని చెప్పవలయుని స్పష్టమయినది. సర్వయవన దేశములందలి సైన్య సమీకరణ ప్రయత్నము చేసెను. తన యపూర్వ ఖడ్గవిద్యా నైపుణ్యముతో ఖురాసాను దేశమందు సైన్యాధిపతి యయ్యెను. అచటి సైన్యమునుగాంచి యవన సైన్యమునుశిక్షితము గాకుండుటకు నిర్వేద పడుచు-నీసీ! మూడు వేల రెండువందల యేండ్లు గడచినది నామనస్సులో నెచ్చట నోపాతుకొని యున్న యీర్ష్యము పుండువలె సెలవేయుచునే యున్నది. ఇన్నివేల యేండ్లు పేరిమీద బట్టిన నాపగ ధృథ తరముగాలేదు.

వీరు 'ఎక్కడ రాజదుర్బలు డో అచట నా దేశములోనికిదండ్లు దండ్లుగా బోవుటయు, స్త్రీల నపహరించుటయు, నిండ్లు తగుల బెట్టుటయు మొదలయిన దుష్కృత్యములు చేయుటయే గాని యొక సేనగా నేర్పడి యొక రాజును స్థాపించుకొని భారతీయుల రాజ్యముల నాక్రమించుకొని వారి ధర్మమును నిర్మూలనము చేసి కృష్ణ శబ్దము జగత్తులో లేకుండ జేయుగల మహాశక్తి యీయల్ప యవనులకు బట్టునా!'

ఇది యా నిరాకులుని నిర్వేదము. ఒక లక్షమంది సైన్యమును సమీకరించినను వారెల్లరు వారిలో వారు గుడుసుల్లు బడిమరణించిరి. ఇదియు నిరాకులునకు నిరాశయే యయ్యెను. తనకు తన సిద్ధాంతములను ప్రచారమొనర్తుమని మాట యిచ్చినవారందరును చక్రవర్తికి జిక్కి మరణశిక్ష విధింపబడెను. తన కేది దారి. చక్రవర్తితో ద్వంద్వ యుద్ధము చేసెను. నిరాకులుడు శాలివాహనుని ఖడ్గముచే నిహతు డయ్యెను

కవి యీ పాత్రను కడు మెలకువతో మలచెను. తన యాలోచన లన్నియు, ననగా ప్రస్తుతము చరిత్ర యందున్న యవకతవక లన్నింటికి మూల పురుషులయిన వెలియోనసాదులను పాత్రలుగ నిర్మించి నిరాకులువిచే వారికి తద్దుష్ట సిద్ధాంతములకు ప్రచారనిమిత్తమై యొసక పఱచినట్లు కల్పించి నేటి చారిత్రక వ్యవస్థకు బీజమచ్చటనే జరిగినట్లు కల్పించెను. విక్రమార్క - శాలివాహనులు లేరనుట చరిత్ర కారుల ద్రోహబుద్ధియే యనుట కాచారిత్రక పాత్రల చేతనే చక్రవర్తి సమక్షమున ప్రసంగింపజేసెను. దీని కంతటికిని ప్రథమ రాక్షసుడై వాడు హేతు భూతుడనియు, నీతని పగ కల్పాంతము నుండుననియు, నాతనికిది సమయముగాదనియు నెరింగి వానిని సంహరించెను.

"వీని పేరు జయద్రధుడు. వీడు ప్రథమ రాక్షసులలో నొకడు. మూలరాక్షసుడు. వీనికి ప్రళయాంతము చావు లేదు. వేదధర్మ నిత్య విరోధి. ఈ కాలము వీని కనుకూలముగా లేదు."

ఇట్టివానిని పదునారువందల సంవత్సరముల వరకు వేదధర్మ విరోధము కలుగు నవకాశము లేకుండ సంహరించెను. ఇచట ధర్మ విఘాతకునకు నుచితమయిన మరణము సంభవించినది.

6) నివేదిత ;- ఈ గ్రంథములలో పదియవ నవల హెలీనా. హెలీనా యవనయువతి. ఆమె త్రికరణ శుద్ధిగా భారతీయ ధర్మమును పాటించి సముద్రగుప్తుని పెండ్లి యాడినట్లు పూర్వ విదితము, హెలీనాకును,నివేదితకును కొన్ని సామ్య భేదములున్నవి, ఇరువురును విదేశీ వనితలే. భారతీయ ధర్మ ప్రవర్తకులే. భారతీయ ధర్మ నిష్ఠులను బెండ్లి యాడినవారే. 'నివేదితలోగల వైశిష్ట్యమేమన ఆమె యొక యోగి, ఆగతానాగత విషయవేది. తనకు తెలిసియే చంద్రకళాధరుని వివాహ మాడినది. పూర్వాపూర్వ జన్మలందామె తన భర్త యను విషయ మెఱిగిన జ్ఞాని నివేదిత. ఈ పాత్ర ప్రయోజనమును రచయిత రెండుగా

తీర్చెను. (1) భారతీయధర్మమును త్రికరణశుద్ధిగా పాటించుచు నీ విశాల విశ్వమందెట్టి ప్రదేశమున నున్నను నాతడు, లేక ఆమె పూజ్యుడేయని తెలియ చెప్పుట, (2) శాలివాహనుని చక్రవర్తి నేగాక శకకర్తను జేయుటలో నీ పాత్ర కత్యంత ప్రాధాన్యము కల్పించుట.

ప్రభువు తన నెచ్చెలియైన చంద్రకళాధరునితో యవన సైన్యమును దునుమాడెదనని చెప్పినదానికి రాజు - 'నీవు యవనద్రోహివి. యనును. మం. కో, నేను రాజ భక్తుడను. రాజునకు మిత్రుడను.

రాజు - నీభార్య యవనస్త్రీ. పే. (100) ఇక్కడ మాత్రము తెలియును. చంద్రకళాధరుని సతి యవనస్త్రీయని. అది యొక్కటియే కాదు, "ఆమె నా పూర్వజన్మలలోని భార్య" ఇది యా నివేదితయే చెప్పుచు. నివేదితను దర్శించుటలోని యౌచిత్యమును ప్రభువు చంద్రకళాధరున కెఱుకపఱచుచు-

'ఓయీ ! పూర్వజన్మజ్ఞానము కలిగిన జీవులు లేనివారి కంటె నుత్తమ జీవులు, ఉత్తమ జీవుల నధమ జీవులు దర్శించుటలో నౌచిత్యము గలదు." ఇది నివేదిత పయి రాజునకుగల గాఢ ప్రత్యయము.

ఈమె రాజునకు యుద్ధ ప్రగతిని గూర్చి నివేదించినది. రాజు యొక్క బాల్యమునందు కుంభకారుని గృహజీవితము నీశకకర్తయగుట కెట్లు సమన్వయమగునో తెలిపినది. ఉరితీయింపబడిన దుర్మార్గుల కందఱును తమ భవిష్యజ్జన్మలలో దేశద్రోహకారు లెట్లగుదురో విన్నవించినది. తన పూర్వ జీవితమును గురించి చెప్పుచు-

"నేను పూర్వపు రెండు జన్మలలో నీ మంత్రి కుమారునకు భార్యను, ప్రతివ్రతను. వెనుకటి జన్మలో నేనుమనసా వ్యభిచరించితిని. దానితో నా తపస్సు భంగమయినది. యవన స్త్రీగా జన్మించితిని. నా తపఃఫలముగా నాకు బూర్వ జన్మ జ్ఞానము కల్గినది." (286)

"ఈ జన్మలో నేను యోగిని నగు గీతలేదు. ఈయన మరల జన్మింపవలయును. నేనపుడు మరల భార్యను గావలయును."

ఇది యామె యోగము. దీనిని పరిచయ మొనర్చుటయే యీ పాత్ర రచనలోని లక్ష్యము. ఇతరము లానుషంగిక ప్రయోజనములు.

ఒక తులనాత్మక పరిశీలనకయి యీ పాత్రను ప్రవేశపెట్టెను. "ఛాయ", యవన ప్రతినిధి భార్య- ఈ యిరువురును పరిశీలన చేయబడిరి. ఇరువురును బ్రాహ్మణ బాలికలే. ఇరువురును యవనులనే పెండ్లి యాడిరి. ఛాయ నిరాకులుని పెండ్లియాడుచుండగా నామె యన్నలు లాగికొనివచ్చిరి. ఆమె యవనుని పెండ్లియాడెను. రాణి దీపశిఖా దేవికి యవనప్రతినిధి భార్య నేస్తము. ఛాయ తత్సంబంధముచే రాణి కడ చేరెను. రాజుతో నామె విషయమును చెప్పెను. తాన దారిద్ర్య ముచే నాతని పెండ్లియాడితినని ఛాయ రాజుతో ననెను. రాజు ఆ పెండ్లియందలి వైరస్యమును బోధించును. ఛాయ నిరాకులుని దౌష్ట్య మును చెప్పుచు-

"ఇతడు పెండ్లియాడుటకు దీసికొనిరాలేదు. వారి యెడల కోప ముతో దీసికొని వచ్చెను." తన స్థితి తనకు తెలియును. నేను నెట్లును చెడిపోయితిని. అతనికి వివాహము చేసి కొందును. ఆ చేసికొనుటలో ననుభవింపబోవు దుర్భర క్లేశమును రాజు బోధించెను.

నీభర్త యవనుడు, వారు దోపిళ్లు చేయుదురు. జంతు హింస చేయుటకు, జీవహింస చేయుటకు వారు వెనుదీయరు, క్రమక్రమముగా నా క్రౌర్యము నీజీవునకు బట్టును. ఏతాదృక్ దుర్గుణ దుష్కార్య నిత్యశ్రవణ, నిత్యదర్శనాదులచేత నీజీవునిలో నున్న సౌకుమార్యము, పారిశుద్ధ్యము నశించును, నీ సంతానము నీయొక్కయు, నీయొక్క భర్తయొక్కయు గుణసంక్రాంతి కలదియైయుండును. భిన్నలక్షణములు గల రక్తముయొక్క సంయోగముచేత జన్మించినవాడు పరమదుర్జను డగును." (121)

అదియే యందలి వైరస్యము. ఈ వైరస్యమామెకు నిష్కృతిని గల్గించినది. అట్టి సమిథలను సృజింపకుండుటయే యామె చేయవలసినది. అందుకామె యునికి మృగ్యము కావలెను.

'ఛాయ రాణి వంక జూడకుండ సెలవు తీసికొనకుండ వెడలిపోయెను. అనగా నామె శరీరమును నశింపజేసికొనదలచుకొన్నదని తాత్పర్యము. ఇది యివ్విధమున కాగా యవన ప్రతినిధి భార్య వానిని పెండ్లి చేసికొని పడిన క్లేశముల నేకరువు పెట్టినది.

"వీనిని జేసికొన్నప్పటినుండి నాపడిన యిబ్బందుల చెప్పలేను ... ... ఉల్లిపాయజూచినచో నాకు డోకు. అట్టి నేను వానికి మాంసమును వండి పెట్టుచున్నాను. . . . . వాని యలవాట్లు మనము పొందవలయును."

ఇది యనుభవము. అది సిద్ధాంతము, ఈ రెండింటిని జూపి పాఠకునకు నుత్తమాధమ నిర్ణయము నాతని వివేకమునకు వదలినాడు. ఇట్లీ పాత్ర తత్త్వ యోజనమునకయి నిర్మించెను.

## నివేదిత-రచయిత ప్రదర్శించిన ప్రజ్ఞ

1) ఖగోళ విజ్ఞానము (78) పురోహితుడు శాలివాహన చక్రవర్తితో బ్రసంగించుటకు బోగా దౌవారికుల సంభాషణము ఖగోళ శాస్త్ర విషయ సంబంధిగా నుండెను. అందొకడు. 'మొట్టమొదట యెచట తెల్లవారును ? రెండవ-లంకలో దెల్లవారును.'

లంకలో దెల్లవారుట యేమి ? ఇది ఖగోళశాస్త్ర విషయము. సూర్యసిద్ధాంతము ఖగోళాధ్యాయము నందు చెప్పబడిన యంశమిట ననుసంధించుకొనవలసి యున్నది.

విషువన్మండల రేఖ నంటి దిగువ సముద్రమున తూర్పున యవకోటి, దక్షిణమున లంక, పశ్చిమమున రోమకము, నుత్తరమున సిద్ధ

పురి యను నాలుగు లంకలు గలవు. ఇవి దేవ నిర్మితములైన పట్టణములు. దీనికి ప్రమాణమిట్లున్నది.

"సమంతాదండ మధ్యాత్తు తుల్యభాగేషు తోయధేః ।
ద్వీపేషు దిక్షు పూర్వాద్యా నగరో దేవనిర్మితాః ॥ 37
భూవృత్తపాదే పూర్వస్యాయవకోటి స్తు విశ్రుతాః ।
భద్రాశ్వ వర్షే నగరీ స్వర్ణప్రాకారతోరణా ॥ 38
యామ్యాయాం భారతే వర్షే లంకాతద్వన్మహాపురీ ।
పశ్చిమేతు కేతుమాలాఖ్యే రోమకాఖ్యా ప్రకీర్తితాః ।
ఉదక్ సిద్ధపురీనామ కురువర్షే ప్రతిష్ఠితా ।
తస్యాం సిద్ధా మహాత్మానో నివసంతి గతవ్యథాః ॥ 40
భూవృత్త పాదవివర్షాఽన్యోన్యం ప్రతిష్ఠితాః ।
తాభ్యశ్చోత్తరతో మేరుః తావాదేవాసురాశ్రయాః ॥ 41

పూర్వము నుండియే దేవనిర్మితములైన యీ నగరములు మేరువునకు దూర్పున భద్రాశ్వవర్షమందు యవకోటి, దక్షిణమునగల భారతవర్షమునందు లంక, పశ్చిమమున కేతుమాల వర్షమున రోమకము ఉత్తరమున కురువర్షమున సిద్ధపురియు గలవు, ఈనాలుగు పట్టణములకు నుత్తరమున మేరువున్నది. ఈ పట్టణములందు సూర్యోదయాది విభేదము లిట్లు చెప్పబడెను.

భద్రాశ్వోపరిగః కుర్యాత్ భారతే తూదయంరవిః ।
రాత్ర్యర్థం కేతుమాలాఖ్యే కుర్యావస్తమయం తథా। 42
భారతాదిషు వర్షేషు తద్వదేవ పరిభ్రమన్ ॥
మధ్యోదయార్థ రాత్రా స్తకాలాత్కుర్యాత్ప్రదక్షిణం॥ 43 సూ. సి.

లంకా పట్టణమున సూర్యుడుదయించినప్పుడు సిద్ధపురి యందస్తమయమును, రోమకమునందర్థ రాత్రమును నగును. యవకోటి యందు సూర్యోదయమైనప్పుడు సిద్ధపురి యందు మధ్యాహ్నమును, రోమక

మున సూర్యాస్తమయమును, లంకయందు నిశిరాత్రియు నగును.

మన ఖగోళ విజ్ఞానమును పాఠకులకు బరిచయము చేయుటయే రచయిత ప్రధానలక్ష్యముగానున్నదీ యంశము.

2) వేద విజ్ఞానము : (ప్రాణాగ్నిహోత్ర విధానము) "స్నానము చేసి శుభ్ర వస్త్రము దాల్చి. దైవకటాక్ష సంజనితమైన యాయన్నమును దైవ ప్రీతిగా నారగింపజేసి, అనగా తద్విరచిత భావనా భావితమైన మనోవృత్తియై యా యన్నము ప్రాణదాయి గనుక ప్రాణాపాన వ్యానోదాన సమానములని పంచధా వృత్తివి కలవి గనుక వాని కాహుతులిచ్చి భోజనము చేసెడి వాడు సృష్టి రహస్యము తెలిసినవాడు." వైదిక ధర్మము భోజనమందును మనపూర్వులెట్లు నిక్షిప్తపఱచిరో పై వాక్యము వలన తెలియును.

ప్రాణాగ్ని హోత్రవిధానమందు :- స్వయంప్రకాశమైన జ్యోతిరాత్మ యజమాని. బుద్ధిపత్ని, హృదయ పుణ్డరీకము వేది. రోమములు దర్భలు, ప్రాణము గార్హపత్యము, అపానము ఆహవనీయము, వ్యానమన్వాహార్యము, ఉదానము సభ్యము, సమానము ఆవసథ్యము. వీనిని పంచాగ్నులందురు, జిహ్వాదీంద్రియములు యజ్ఞపాత్రలు, రసాది విషయములు హవిస్సులు. సర్వవ్యాప్త్యర్థ మోంకారోచ్చారణము, పరమాత్మకు సమారాధన మొనర్చుటకై ఆత్మ యజ్ఞమును సంకల్పించి 'అమృతోపస్తరణ మసి' అను మంత్రముతో నన్నమును ప్రోక్షించి, అన్నసూక్తముతో నభిమృశింపవలెను. 'ఊర్జస్కర' మను మంత్రముతో నుదకపాన మొనర్చి అంగుష్ఠానామికలతో నన్నమును ప్రాణాపాన వ్యానోదానసమాన మంత్రములతో ప్రాణాగ్ని హోత్రము చేయవలెను. తిరిగి 'ఊర్జస్కర' మను మంత్రముతో నుదకపాన మొనర్చి యన్నమును భుజింపవలెను.x

ఇట్లు ఉక్త ప్రకారమును భోజనవిధి నొనర్చిన వాడు ఋణత్రయ విముక్తుడై బ్రహ్మపదము బొందుచున్నాడు.

---

X"స్వయం జ్యోతిరాత్మా యజమానో బుద్ధిఃపత్నీ హృదయ పుణ్డరీకం వేది రోమాణి దర్భాః ప్రాణోగార్హపత్యోఽపానఽఆహవనీయోవ్యానోఽన్వాహార్య ఉదాన స్సభ్య స్సమాన ఆవసథ్య ఇతి పంచాఽగ్నయో భవన్తి జిహ్వాదీంద్రియాణి యజ్ఞపాత్రాణి రసాదయో విషయా హవీంష్యస్య ఫలమో మర్థావాప్తిఃత దేవమేకాధ్వర్యురాత్మయజ్ఞం సంకల్ప్య 'అమృతోప స్తరణమసి' ఇత్యన్నం ప్రోక్ష్య, అన్నసూక్తేనాభిమృశ్య 'ఊర్జస్కరం ఇత్యాధాపం పీత్వాఽఙ్గుష్ఠాఽనామికా మధ్యమైరాదాయాఽన్నం ప్రాణాయస్వాహా, అపానాయస్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయస్వాహా, సమానాయస్వాహా ఇతి పంచాఽహుతీః పాత్రం స్పృశన్నేవ హుత్వా, ఊర్జస్కరం ఇతి పునశ్చాఽధాపం పీత్వాఽశ్నీయాత్। 'తదేవ భుక్త్వా గచ్ఛన్తం' అనృణో బ్రహ్మపదమభ్యేతి' ఇతి సామ పూర్వం మాతా పితా గురుర్వా పైతృకాదిక మృణత్రయం జాయమానస్య బ్రాహ్మణస్య సహజాత మిత్యుక్త్వే వారయేతి విజ్ఞాయతే।

# 7. పురాణవైర నవలలు - సాహిత్యములో వాని స్థానము

'లేత బుజ్జాలు కొక్కిరిస్తే
అతగాళ్లతో ఏమిగాని
తాత తాతల నాటి కతలూ
తవ్వి పోస్తానోయీ' "కోకిలమ్మ పెండ్లి" (40)

"ఎవ్వరేమన్న నంద్రు నా కేమి" యని యానాడు భాషను గుఱించి నిర్భయముగా నిర్భరవయః పరిపాకమందు పలుహాధ్వాన మొనర్చిన శ్రీనాథు కైవడి నడివయసుననే శ్రీ విశ్వనాథ తాను ద్విదశాబ్దుల యనంతరము వ్రాయనెంచెడి పురాణవైరమునకు బీజావాప మొనర్చినట్లు పై గీతము వలన వ్యక్తమగుచున్నది. తన మనసున 1940 నాటికే రేఖామాత్రముగానున్న ఈ పురాణవైర చారిత్రక నవలా భావము 1958న రూపొంది 19[illegible]న సంపూర్ణాకృతి బొందినది. ఇదియొక పంచవర్ష ప్రణాళిక, రేఖామాత్రోహాజనిత కాలముతో గలిపి యిది పంచవింశతి వర్ష ప్రణాళిక. ఈ గ్రంథమాల యందలి తొమ్మిదియవ నవలయైన 'నాగసేనుని' పీఠికయందు "ఇంత వాఙ్మితా మహేశ్వర లక్షణము వేఱయుండని ప్రదేశమునకు నెలవయిన వానికి, నల త్రివిక్రమునివలె ధాత్రినావరించినప్పటికి దొట్టతొలుతగా నాంధ్రుడయిన వానికి, నాంధ్రకవియైన వాడు తన కృతినొసంగుట ప్రధాన ధర్మ"మని భావించి, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులకు నీ గ్రంథమాలిక నలంకరించి నట్లాయన వెలయించిన కవితచే స్పష్టమగును. వివేకానందుని యనంతరము మూర్తీభవించిన తాత్త్విక చింతనగలిగి భారతీయ తత్త్వమును మఱియొకసారి ప్రపంచమున ప్రక్షేపమొనర్చిన విజ్ఞాన శేఖరునకు దీనినంకిత మొసంగుటలో కడు నుచితజ్ఞత నేచూపెను.

ముందుగా పురాణవైర గ్రంథమాలా రచనకు ప్రచోదకమైన తత్కర్తృనిష్ఠమైన సంస్కార పూర్వరంగము పరిశీలింప బడుచున్నది.

భారతము-తత్ప్రాచీనత :- ఇది భరతదేశము. ఇది యత్యంత ప్రాచీనమనుటకు శ్రుతీతిహాస పురాణములందీ దేశము బహుధా ప్రశంసింపబడి యున్నది.

'హవిర్భర్త' యను నర్థమున నగ్నికి భరతుడను పేరున్నట్లు శ్రుతి వచనము.[1] బ్రాహ్మణములు నీ భరతపదము నిట్లే వివరించినవి.[2] కాన కర్మానుష్ఠాన సమయమున నగ్ని హవ్యములను భరించుచుండుటచే నాతడు భరతుడను పేర వ్యవహరింపబడుచున్నాడు. బ్రహ్మవిద్యయందు రతుడైనవాడు భారతుడనియు, బ్రహ్మ విద్యయే శ్రీవిద్యయనియు, నీవిద్య నుపాసించువారు భారతులనియు మహామంత్ర శాస్త్ర ప్రసిద్ధి.[3] యజ్ఞాదికర్మలందు కుశలురై యధ్వర్యవము నిర్వర్తించెడి వారికి, యజమానులకును భరతులనియు పేరుగలదు.[4]

---

1) 'అగ్నే మహాగ్ం అసీత్యాహ । మహాన్హ్యేష యదగ్ని ర్బ్రాహ్మణేత్యాహ । బ్రాహ్మణో హ్యేవభారతే త్యాహైషహి దేవేభ్యో హవ్యంభరతి।'
తై. సం. 2-5-9.

2) ఏవహి దేవేభ్యో హవ్యం భరతి ।
తస్మాద్భరతోఽగ్నిరిత్యాహుః । శ. బ్రా. 1-4-2-2.
అగ్నిర్వై భరతః సవై దేవేభ్యో హవ్యం భరతి । కౌ. బ్రా. 3-2

3) 'సాహి శ్రీరమృతాసతామ్'
భాయాం శ్రీవిద్యాయాం రతాః భారతాః ।
భారత్యా సపాదుకాః భారతాః । సౌందర్య లహరి. లక్ష్మీధరవ్యాఖ్య.

4) 'వయం భరతేషుశస్సమానా మభివ్యజానీమ ఇతివదన్తః ।
ఐ. బ్రా. 12-7.
బిభర్తి ఫలమితి భరో యజ్ఞస్తం భరం తన్వన్తీతి భరతా ఋత్విజః ।
'భరత ముద్ధరే మనుషించ ।' తై. బ్రా. 3-7-5-5.
'అశస్తం భరత మిమం యజమాన ముద్ధరః దేవేభ్యో హవిర్భరణాద్యజమానో భరతః' శాయన భాష్యము

మహాభారతము నందలి వనపర్వమునందు పరమేశ్వరుడాదిగా గల యీ యగ్నివంశము నందలి వివిధాగ్నుల క్రమము, తదగ్నుల యుత్పత్తిని వర్ణించి తుదకు నగ్నులెందరై యున్నను, తదాత్మకమగు తేజమొక్కటియే యనియు, భరణ ధర్మము గలిగి భరతుడైన ప్రజాపతికి పావకుడను నగ్ని మహామహిమాన్వితుడై జనించెనని చెప్పబడినది.[5] ఇది ప్రజాపతియే భరతుడని చెప్పుటకు వీలయిన సన్నివేశము.

శతపథ బ్రాహ్మణము సయితము నీ యంశమును సమర్థించుచున్నది. ప్రజాపతియగు మనువు యజ్ఞాది కర్మమార్గమును లోకమున మొదట ప్రవర్తింప జేసిన యధికారపురుషుడు, దీనిచే భరతుడగు మనువు యొక్క ధర్మ మార్గమున బ్రవర్తిల్లెడి ప్రజ భారతి యగునని యందలి వచనము.[6]

భాగవతమునందు స్వాయంభువునకు, ప్రియవ్రతుడు, నాతనికి నగ్నీధ్రుడు, నాతనికి నాభి, వానికి ఋషభుడు, వాని జ్యేష్ఠ పుత్రుడు భరతుడుగా చెప్పబడినది. ఈతని పేర నీ దేశమునకు భరతవర్షమని పేరు గల్గినట్లు వచింపబడెను.[7] ఇతర పురాణములందు నీ భరత శబ్దము శకుంతల పుత్రార్థమునను, సమరశీలమున సీలోకమే భారత మను నర్థమునను గలదు.[8]

ఏవం విధమయిన విచారణవలన నీ భరత శబ్దము పరమ

---

5) 'భరతో భరతస్యాగ్నేః పావకస్తు ప్రజాపతేః ।
మహి సత్యర్థ మహిత స్తథా భరత సత్తమ ॥' 219_8

6) ప్రజాపతిర్వై భరతః । సహీదం సర్వం బిభర్తి । ప్రజాపతిర్వై మనుః సహీదం మమనుతా । ప్రజాపతిర్వా ఏతదగ్రే కర్మ అకరోత్ ।
శతపథ బ్రాహ్మణము6_6_1_19

7) ప్రియవ్రతో నామసుతో మనోః స్వాయంభువస్య యః ।

పవిత్రతను సంతరించుకొని శ్రుతులందును, వివిధ పురాణములందును, నితిహాసము లందును పేర్కొనబడియుండుట స్పష్టమగును.

ప్రాచీనమయిన యీ దేశము చిక్కటి సంస్కృతిని సయితము తనతో బరిరక్షించుకొనుచు గమినించుచున్నది. వేద పురాణేతిహాస సముచ్చయమును తన గర్భమున నిండించుకొన్న విజ్ఞానఖనిగా బేరొందినది. చాతుర్వర్ణ్య వ్యవస్థ, అహింసా తత్త్వము, వివాహము, దాంపత్య వైశిష్ట్యము లీదేశ సంస్కృతిలోని భాగములే యగును. చాతుర్వర్ణ్యము ఒక పీడన శక్తిగా నుద్దేశింపబడక,పోషక శక్తిగ నుప దేశింపబడినది. ఈ ప్రాచీనతను మనము గణించినచో దీనిని వీరు భద్రపఱచిన విధమునకు మన మాశ్చర్యపడక మానము. కాలగణనము నకు పంచాంగములు ప్రాధాన్యము వహించును. సృష్టి గడిచి నేటి కెన్నియేండ్లు ? ఎన్ని కల్పములు ? ఎన్ని మన్వంతరములు ? ఎన్ని యుగములు ? వర్తమానమును లెక్కపెట్టుటయెట్లు ? ఈ ప్రశ్నము లన్నింటికిని మన సంస్కృతియే సమాధానమొసంగును. కాలము భగ

---

తస్యాగ్నీధ్రస్తతో నాభిః ఋషభ స్తత్సుతః స్మృతః ॥

8) లోకోఽయం భారతంవర్షం ।
అవతీర్ణ సుతశతం తస్యాసీ ద్బ్రహ్మ పారగమ్ ।
తేషాంవై భరతో జ్యేష్ఠో నారాయణ్ంనరాయణః ॥
విఖ్యాతవర్ష మేత ద్యన్నామ్నా భారత మద్భుతమ్ । 11-2
'చక్రవర్తితతో జజ్ఞే దుష్యంతా త్సమితిం జయః ।
శకుంతలాయాం భరతో యస్య నామ్నాతు భారతాః ॥ మ.పు. 49-11
"దుష్యంతాద్భరత వంశస్య విప్రత స్తే మహద్యశః ॥ భారతము 1-94-19
"హిమాహ్వాం దక్షిణం వర్షం భరతాయ న్యవేదయత్ ।
తస్మాత్తద్భారతం వర్షం తస్యనామ్నా విదుర్బుధాః ।
వా. పు. 31-51-52.

వత్స్వరూపమని భావించిన వారీ దేశస్థులు. దేశమే భగవత్స్వరూపమను నది ఎట్లో యింతకు బూర్వమే విచారింపబడినది. ఇట్టి తత్త్వమును జీర్ణించుకొనిన వాడు విశ్వనాథ.

చాతుర్వర్ణ్య వ్యవ :- ఈ దేశ సంస్కృతిలో చాతుర్వర్ణ్య వ్యవస్థ యొక భాగము. సృష్ట్యాది యందు సప్తవిప్రులు మాత్రము జాతికి మూలపురుషులై యుండిరనునది జాతియొక్క ప్రాచీనతను వ్యక్తమొనర్చును. [9] లోకక్షేమమునకే వ్యవస్థ గాని సంకుచిత ప్రమాణ పోషణమునకు గాదని యీ క్రింది శ్రుతి వాక్యములచే నిర్ణయింప వచ్చును. అహితాగ్ని 'దర్శ' యాగమునందు ఆజ్య గ్రహణము కొఱకు మూడు మంత్రముల నుచ్చరించును. అవి-

'బ్రాహ్మణస్త్వా తేజసే యంత్రాయ ధర్త్వాయ గృహ్ణామి.
క్షత్రస్య త్వౌజసే యంత్రాయ ధర్త్వాయ గృహ్ణామి।
విశేత్వా యంత్రాయ ధర్త్వాయ గృహ్ణామి॥'

ఇందు మొదటి గ్రహణము బ్రాహ్మణుని తేజము పతనముగా గాకుండుటకును. క్షత్రియుని యోజో సామర్థ్యము కొఱకును, వైశ్య జాతికి కృషి వాణిజ్యాదులందు నైపుణ్యము కొఱకునుపీనిని గ్రహింతు నని వీని భావము, బ్రాహ్మణుని కొఱకే వేదమని భావింప జనదు. 'నిషాదస్థపతి ర్యాజయేత్, "వర్షాద్రథ కారః అగ్నినాదధీత' యిత్యాది వాక్యములు వేదము సంకుచితమయినది కాదని స్పష్టపరచును. 'శన్నో అస్తు ద్విపదే శంచతుష్పదే' 'ద్విపదే చతుష్పదేచ శాన్తింకరోమి' అనెడు శ్రుతి వాక్యములు, 'లోకాః సమస్తాః సుఖినో భవన్తు" అను ఫలశ్రుతి వాక్యము వేదమునకు గల విశాల దృష్టిని స్పష్టమొనర్చును. సర్వభూతహితమిని బ్రకటించును. తత్కారణముననే మాక్స్ ముల్లర్ తన 'ఇండియా' అను గ్రంథములో నీదేశ సంస్కృతి నిట్లు కీర్తించెను

---

[9] 'సప్తవిప్రా జాయే మహీ ప్రథమా వేదసౌష్మన్' ఋ 4-1-2-15.

"If I were to look over the whole world to find out the country, most richly endowed with all the wealth, power and beauty that nature can bestow, in some parts a very paradise on earth - I should pointout to India. If I were asked under what sky the human mind has most deeply pondered on the greatest problems of life, and has found solutions of some of them which well deserve the attention even of those who have studied plato an kant - I should point out to India. And If I were asked to my self from what literature we hear in Europe, we, who have been nurtured almost exclusively on thoughts of Greaks and Romans, and of one Semetic Race, the Jeuish may drawn that Corrective, which is most wanted in order to make our inner life more perfect, more comprehensive, more universal, infact, more truely human, a life not for this life, but transfigured eternal life, again I should point out to India. P. 6

ఇది భారత వర్షమున కామహనీయుడు సమర్పించిన నివాళి ఇది భూలోక స్వర్గమనియు, పాశ్చాత్య తత్త్వవేత్తలకు సయితముదగు పరిష్కారములు నిర్ణయింపగల దేశమనియు, శశ్వజ్జీవన హేతుకమయిన సారస్వతము మనకు లభించునది చటనేననియు దెలిపియుండెను.

అహింసా తత్త్వము :- అహింసా తత్త్వము వేదధర్మ పరమార్థము. ఈ యహింస బౌద్ధ జైనములు చెప్పెడి వంటిదికాదు. ఇవి యెన్ని చెప్పినను సహింప పరిహరింప బడుట యన్నది మిధ్యయే యగును, యజ్ఞార్థము కుశగ్రహణము, ధాన్య మవఘాతము చేయుట వలన సంభవించెడిది హింసయే యని శ్రుతి వాక్యము.[10] అనఘాత

10. ప్రజాపతిర్వా ఓషధీః పర్వశో వేద । న ఏనాహి నస్తి1 'దేవాహై హవి ధ్ఛకృత్వాఽబ్రువన్1 కస్మిన్నిదం రక్ష్యామః1 ఇతి సోఽగ్ని రబ్రవీత్,

జన్య దోష శమనార్థమాప్య దేవతలు సూర్యోదయమయి కూడ నిద్రించు వానికి నా పాపమును సంక్రమింప జేసినట్లును, అశ్వపరశువు చేత బర్హిచ్ఛేదనము చేయునట్లును శ్రుతి నిర్దేశించును. 'పంచసూనా వనుత్తయే' యను సూత్రకారుని వాక్యముచే బరిహరింపరాని హింసను పంచమహా యజ్ఞములచే నివర్తించ జేసికొన వలయునని నిర్దేశింపబడు చున్నది[11] నిత్యము వేదాధ్యయనముచే బ్రహ్మ యజ్ఞము, దేవతా రాధనముచే దేవయజ్ఞము' పితృదేవతారాధనముచే బితృ యజ్ఞము, అతిథ్యభ్యాగతుల యారాధనముచే మనుష్య యజ్ఞము, భూత బలిచే భూత యజ్ఞమును నొనర్చుట వేద ధర్మము. వైశ్య దేవకాలములో వచ్చిన యెట్టివానికైనను భిక్ష యావశ్యకముగా సమర్పింపవలెననెడు విశాల భావము గోచరించును. [12] ఇట్టి యహింసను బోధించిన శ్రుతియే అశ్వాలంభ, గవాలంభములను నిర్దేశించినది, ఏయజ్ఞమయి నను నుపాసనాత్మకమయిన బ్రహ్మ భావనతో నొనర్చిన నది హింస కాక, యజ్ఞపశువునకును యజమానికిని నుత్తమలోక ప్రాప్తిని కలుగ జేయుచున్నది. భగవన్నివేదితుడైన జీవునకు నుత్తమ సంస్కార

---

మయితన్నిదధ్వమ్। అహం వక్తుం జనయిష్యామి। యస్మిన్ రక్షధ్వ ఇతి। తే దేవా అగ్నౌ తనూ స్తన్యదధత। తస్మాదాహుః అగ్నిస్సర్వా దేవతా ఇతి। సోఽగారేణాపః అభ్యపాతయత్। తత ఏకతోఽజాయత, తద్వితీయ మభ్యపాతయత్। తతో ద్వితోఽజాయత। సతృతీయ మభ్యపాతయత్। తతో త్రితోఽజాయత। తే దేవా అవ్యే 'ష్వప్వమృజత। అప్యామృజత సూర్యాభ్యుదితే'।

11. సమ్మార్ధనము, ఇంధన జ్వాల, పాకరచనము, చలనము, శాకచ్ఛేదనము ఇవి పంచసూనములు.

12. ఇష్టోవా యదివా ద్వేష్యః మూర్ఖః పండిత ఏవవా। వైశ్వదేవేతు సంప్రాప్తే సోఽతిథి స్వర్గ సంగ్రహః॥ పరాశర స్మృతి,

మాపాదింపజేసి యుత్తమ స్థితిని గల్గించుట కూడ వేదధర్మ తాత్పర్య మని వ్యక్తమగును. బౌద్ధ జైనాది దర్మములందిట్టి హింస పరిహరింప బడుట దుర్లభము. గీతయందు తనకర్పణము గావించి యేది యొసర్చినను దానివలన ప్రత్యపాయము కలుగదని ప్రమాణము.[13] వేదోప బృంహితమయిన యహింసకును, నితర మతములలోని యహింసకును నెంత వ్యత్యాసమున్నదో దీనివలన గమనింప వచ్చును.

వివాహము :- ఈ దేశమునందు 'వివాహము' ఒక సంస్కారము. 'విశేషేణ వహతీతి' వివాహః యనియీ శబ్దమునకు వ్యుత్పత్తి విశేష వహనార్థము చేత నాధి భౌతిక, నాధి దైవిక, నాధ్యాత్మిక సంస్కారములను వహించి సహ ధర్మ చారిణియగు నామెకు నుత్తమ స్థితి ప్రాపక హేతువగుటచేత భర్తృ భార్యార్థములన్వర్థములగు చున్నవి. 'పత్న్యుర్నో యజ్ఞ సంయోగే' యనునది పాణిని సూత్రము. వివాహ సంస్కారమెంత పవిత్రమో, యజ్ఞ పరమో యీ సూత్రము నిర్దేశించును. యజ్ఞ సంయోగార్థమునందే పతి శబ్దమునకు 'నకార మాదేశముగా వచ్చి 'పత్నీ' శబ్ద మేర్పడుచున్నది. దీనిచే నీ సంస్కారము తృప్తికై గాక ధర్మాచరణమునకై నిర్దేశింపబడెననుట స్పష్టము.

ధర్మప్రజా సంపత్యర్థం యనునది వివాహపరమార్థము. బహు దేవతాంగీకృతముగా, సాక్షీ భూతముగా నీసంస్కారము నిర్వర్తింప బడుట శ్రుతి సమ్మతము. అగ్ని, చంద్రుడి. ఆదిత్యుడు, ఆశ్యదేవత సాక్షులు.[14] ఆసమయమునసే "భర్తవైన నాతోనీకును వార్ధక్యము

13. 'యత్కరోషి యదశ్నాసి యజ్జుహాసి దదాసియత్ I
యత్త పస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ గీత

14. "దదామీత్యగ్ని ర్వదతి, దదేతి వాయు రాహతత్ హన్తేతి సత్యం చంద్రమాః ఆదిత్య స్సత్య మోమితి। (ఓ మిత్యంగీకార సూచకమ్) ఆప తత్సత్య మాభరన్ I

సంప్రాప్తించు గాక ! నిన్ను భగుడు, అర్యముడు, సవితాది దేవతలు నాకు గృహస్థాశ్రమమందుండి నీతో గృహపతి కర్మ నిర్వహణార్థము నిన్ను నాకొసంగి యున్నారని వరునిచే జెప్పింతురు.[15] ఇది యీ సంస్కారమెట్టి సాహిత్యమును, పాతివ్రత్యమును సంతరించుకొననో, వివాహధర్మమెట్లు వేదసమ్మతమో స్పష్టపరచును. ఇది యీ దేశ సంస్కృతిలోని రత్నమంజూషిక.

ఈ దేశము నందు స్త్రీ బహు ముఖ్యమయినది. ఇక్కడ స్త్రీలు మహాలక్ష్మి స్వరూపులు. "స్త్రియశ్శ్రియశ్చ గేహే నవిశేషోస్తి కశ్చన" యనునట్లు, హిరణ్యమును తన్నిర్మిత వస్తువులను నెంతగా రక్షణ చేయనగునో యట్టి రక్షణ యామె కావశ్యకమగును. ఈమె గృహస్వామిని. అతిథ్యభ్యాగతసేవ ఈమె ప్రభుత్వములోనిది యజ్ఞ మనదాతిథ్యేష్టి' యను నొక కర్మలో సోమలతను దెచ్చిన శకటమును తన గృహాంగణమున నిలిపినో మునకాతిథ్యమును పత్న్యనుమతితో గృహ స్వామి యిచ్చునట.[16] తన యింటి కామె యధిపత్నిగానుండుట శ్రుతి సమ్మతము.[17] ఇట్టి స్త్రీ యిల్లాలయి 'ప్రజాయై గృహమేధినాం' అను వాక్యమునకు దనపతి నిష్పనిగా నొనర్చును సంతానము లేనిచో మనుష్యునకు బూర్ణత్వము లేదు కదా ![18]

---

15. 'గృభ్ణామితే సుప్రజాస్త్వాయ హస్తం మయాపత్యాజరదష్టి ర్యథాసః ।
భగో అర్యమా సవితా పురంధి ర్మహ్యం త్వా దుర్గార్హపత్యాయ దేవాః ।
16. పత్నీగ్ం శకట మన్వారంభయిత్వాతిథ్యం నిర్వపతి । పత్నీః పారీణహ్యా స్యైతే । పత్న్య ఇవ అనుమతం నిర్వపతి ।
17. 'బహ్వీ త్వం విదథ మావదాసి।' (వేదశాస్త్ర విహిత కర్మానుష్టాన ప్రోత్సాహ కర్త్రివై, స్వామివై యని తాత్పర్యము) గృహాన్గచ్ఛ గృహ పత్నీ యథాసః।
18. 'ప్రజయాహి మనుష్యః పూర్ణః।

ఇట్టి మహత్తరమైన దాంపత్యమునందు స్త్రీ పాతివ్రత్యము రక్షింపబడుటలో విచిత్రమావంతయును లేదు. నాటినుండి బహు ముఖీనముగా నిట్టి చరితలు మన ప్రాచీన గ్రంథము లందు ద హరింప బడినవి. శ్రుతి యీ కారణముననే గావచ్చును. స్త్రీకి బహునియమములను విధించినది. స్త్రీకి రజస్సు బ్రహ్మహత్యా దోషసం క్రమితము. త్వష్టృని హత్య చేసిన యింద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యాదోషములోని మూడవ భాగమును - స్త్రీలయందు రజో రూపమున సంక్రమింప జేసెను. ఆసమయమందామె మగనితో గూర్చుండరాదు. భుజింపరాదు, అభ్యంజనము, కాటుక, దంత ధావనము, నఖ నికృంతనము. కుట్టు, త్రాళ్లు పేనుట, ఆకులతో నీరు త్రాపుట, పొట్టి పాత్రతో నీరుగ్రోనుటలు నిషేధింపబడినవి. వీనిలో నొక్కొక్క క్రియ కొక్కొక్క దుష్ట ఫలితము చెప్పబడినది. ఆమెతో సంయోగము నేర జన్మకు, పరాఙ్ముఖురాలైన యామెతో ప్రసంగము సిగ్గు కలిగిన వాని జన్మకు స్నానము అప్పుమారుక జన్మకు, అభ్యం జనము దుశ్చగుని జన్మకు, వ్రాత ఖర్వాటుని, అపమృత్యువు గలవాని జన్మకు, కాటుక యంధుని, దంతధావనము, నఖనికృంతనము, పిప్పిదంత ములు, గోళ్లు గలవాని జన్మకు, కుట్టు నపుంసకుని జన్మకు, త్రాళ్ల పేనుట, ఉరివేసికొని మృతి చెందవలసిన సంతానమునకు, ఆకులతో నీరు త్రాపుట పొట్టివాని జన్మకు హేతువగునని చెప్పుచు, నఖర్వ పాత్రతో సత్సంతానము కొఱకు నుదకపాన మొనర్పవలసినదిగా శ్రుతి హెచ్చరించినది.[19]

---

19. 'న శహాసీత నాస్యాన్న మద్యా ద్బ్రహ్మ హత్యాయై హ్యేషావర్ణం ప్రతి ముచ్యా స్తేఽథోఖల్వాహు రభ్యంజనం వావస్త్రియా అన్నమభ్యంజన మేవ న ప్రతిగృహ్యాం కామమన్యదితి యాం మలవద్వాససగ్ం సంభవన్తి యస్తతో జాయత సోఽభిశస్తో యామరణ్యే తస్యై స్తేనో యాంపరాచీం

ఇట్టి నియమములను బాటించుటయే సత్సంతాన ప్రాప్తికి హేతువయి లోకక్షేమమును గల్గించుటకు దోహదమొనర్చునుగదా. ఇది యే యొక వర్ణమునకో, వర్గమునకో జెప్పబడినట్లుగా భావింప వీలగునా ?

భారతీయ వాఙ్మయ ప్రశంస :- ఈ దేశమునందు వెలసిన వేదాది సమస్త వాఙ్మయము పరమేశ్వరోద్దిష్టమే యగుచున్నది. 'పూర్వ జన్మ కృతం వ్యాధి రూపేణ బాధతే' యనునది చికిత్సా శాస్త్రములో మొదటి మెట్టు. 'వైద్యో నారాయణోహరిః' యనియు పేర్కొనుట ప్రసిద్ధముగా నున్నది. 'భేషజం భిషక్' యని విష్ణు సహస్రనామ కీర్తనములోని భాగము, [20] సామవేదము నేనే యని భగవద్గీతా వాక్యము. [21] వీణ మ్రోయించుట యందు యథార్థ జ్ఞానము గలిగిన జీవునకప్రయత్న మోక్ష సిద్ధియని యాజ్ఞవల్క్యస్మృతి వచనము. ఈ సామవేదము నుండియే బ్రహ్మ సంగీతమును సృజించెనట' అట్లే శబ్ద శాస్త్రము, నాట్య శాస్త్రములు గూడ పరమేశ్వరోన్ముఖములైనవియే

---

తస్యై హ్రీత ముఖ్యప్రగల్భో యాస్నాతి తస్యాఽప్సుమారుకో యా అభ్యం క్తే తస్యై దుశ్చర్మా యాప్రలిఖితే తస్యై ఖలతిరపమారీ యాంక్తే తస్యై కాణో యాదతో ధావతీ తస్యై శ్యావదన్ యా నఖాని నికృంతతే తస్యై కునఖీ యా కృణత్తి తస్యై క్లీబో యారజుగ్ం సృజతి తస్యా ఉద్బంధుకో యాపర్ణేన పిబతి తస్యా ఉన్మాదుకో యాఖర్వేణ పిబతి తస్యై ఖర్వ స్త్రిస్రోరాత్రీ ర్వ్రతం చరే దంజలినా వా పిబే దఖర్వేణ పాత్రేణ ప్రజాయై గోపీథాయ।

20. సంసార రోగస్య ఔషధం భేషజం। సంసార రోగ నిర్మోక్ష కారిణీం పరాం విద్యా ముపదిదేశ గీతాస్వితి భిషక్। శం. భా.

21. వేదానాం సామావేదోఽస్మి। గీత 'ఏశత్సామగాయన్నాస్తే శ్రుతి।

యగును. పరమశివుడు నటరాజు. ఇట్లు వాఙ్మయ సర్వస్వము భగవత్తత్త్వ ప్రతిపాదకము లేయగుచున్నవి.[22] జ్యోతి శ్శాస్త్రము యజ్ఞయాగాది క్రతునిర్వహణ కుచితమయిన కాలమును నిర్దేశించును. జ్యోతిషము మానవుని యాయుః ప్రమాణములు, అతని జీవనమార్గములు కర్మసంబంధియైన సుఖదుఃఖాద్యనుభవములు నిర్ధేశించును.

శాస్త్రములు దురవగాహములు, దురవబోధములు నయిన హేతువుచే బురాణవాఙ్మయము మనుష్య ధర్మవర్తనకు గరదీపక యయ్యెను. ఇతిహాస పురాణములు వేదములను పబ్బ్రంహిత మొనర్చుటకు నిర్దేశించ బడినవేగాని వానికవిగా బ్రత్యేకతను సాధించుకొను లక్ష్యముగా నిర్మింపబడినవిగావు, వీని యనంతరము వెలసిన కావ్య వాఙ్మయము సయితము నదే లక్ష్యమను నిర్దేశించుట స్పష్టము. 'విశ్వశ్రేయః కావ్యమ్' అనునది కావ్యలక్ష్యము, 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనునది దుష్టకావ్య పఠన నిరోధనమున కేర్పడిన నియమము, 'జగద్ధితంబునకయి నన్నయ, జన్మాంతర దుఃఖముల్ దొలగగ జేయుగాదిక్కన,'శ్రీకైవల్య పదంబు జేరుటకు'పోతన తమ కృతులను వెలయించి తమతమ జీవుల యేకైక లక్ష్యమయిన మోక్షలక్ష్మీకరగ్రహణ మొనర్చు యత్నము సలిపిరి.

మానవుని సమస్యలు తాత్కాలికమయినవి. జీవుని ప్రయాణమనాది దీనికంతము కూర్పవలెను. అడ్డుపడెడి మూలమును ఛేదింపవలయును. ఎవ్విధముననైనను నీశ్వరుయుపాయమును బ్రజలకు బ్రసాదింప

---

22. సంగీతలక్ష్యం పాప విధ్వంసం మోక్షాధిరోహణమ్ వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతి జాతి విశారదః తాళజ్ఞశ్చా ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి। 'సామవేదాదిదం గీతం సంజగ్రాహ పితామహః।' 'ఇతి మాహేశ్వరాణి సూత్రాణి' । పాణిని।

వలెను. తాత్కాలిక సమస్యలు శాశ్వతమార్గమునకు భంజకము కారాదు. ఆహార భయ ప్రమాదాదులు లక్ష్యములు కాజనదు. అవి జీవుని యొక్క యనల్ప శ్రమాపనోదనమును గాదు. ఈ శరీరమును విడచి వేరొక శరీరమును దాల్చునట్టి జీవుని యాతాయాతమును దొలగించు వివేకమును గల్గించు సాధనముగా నీదేశమునందు సాహిత్యము నిర్మించబడినది. కనుకనే యీదేశమున సాహిత్యమును బట్టి ప్రజలు, విదేశములందు ప్రజలనుబట్టి సాహిత్యము, అను వ్యవహారము సంభవించినది. శాస్త్ర, పురాణ, కావ్య, వాఙ్మయ సర్వస్వము మిహాపరమును గైవసము గావించుకొనుటకే యగును. బ్రహ్మాండ సృష్టి విజ్ఞానము, పంచభూతాత్మకమైన ప్రపంచకము, ప్రకృతి పురుషుల సమ్యక్సంగమద్యపనములు, గరచరణాయన సంయుతమైనయుపాధిగత జీవుని నటనము, జీవుని యాక్రందన, వేదన లివియన్నియు నీసాహిత్యమున గర్భితములైనవి, ఇట్టి మహత్తరమైన సారస్వతమునకు గల ప్రధాన ప్రయోజనముతో నానుషంగిక ప్రయోజనములైన రస, శయ్యా, పాక విశేషాదులు కలుగవచ్చును, మోక్షమార్గమును జేరుటకు యత్నించువాని కణిమాదు లత్సన్నమయినట్లుగా వీనివి చెప్పవచ్చును. కనుకనే యీ సాహిత్యము ప్రపంచములోని పెక్కు తత్వవేత్తలు సారస్వత వేత్తలకు బ్రశంసనీయమై వారికిని శిరోధార్యమయ్యెను. పాశ్చాత్యులీ సారస్వత వైభవమెంతగా గొనియాడిరో దిఙ్మాత్రముగా బరిశీలింతము.

1) వేదము :- 'వేద సంబంధమయిన వాఙ్మయమునకు బ్రపంచములో దులతూగెడిది మరి యెచ్చటను లేదని మాక్స ముల్లర్ చెప్పెను.

"The Vedic literature opens to a chapter in what has

been called the education of human race to which we can find no parrllel any where el<e." [23]

వేదసాహిత్యము లేని యెడల ప్రపంచమున వట్టి కొఱత దీర్పగల గ్రంథము వేనియందును గాన్పింపదని విల్సను పండితుడు నుడువును.

2) 'In the History of the world, the Vedas fill a gap which no literary work in any other language could fill.' [24]

వేదమునకు గాలనిర్ణయ మసాధ్యమని సర్ విలియం హాంటరు పండితుడు - పేర్కొనును.

'The age of this venerable Hyme is unknown.' [25]

2) సంస్కృత సారస్వతము :- గ్రీకు సారస్వతము సయితము మనకొసంగజాలని యుపదేశములు సంస్కృత భాషలో లభించుననుచు మాక్స్ముల్లర్ -

'Sanskrit literature, if studied in a right spirit, is full of human interests, full of lessons even Greek could never teach us.' [26]

ఆంగ్లేయుల బుద్ధి వికాసమునకు సంస్కృత సారస్వతము గావించిన మేలింతింత యనరాదని మేగ్లోనల్ పండితుడు-

2) The intellectual debt of Europe to Sanskrit Literature has been undeniably great. If may perhaps greater still ih the years to come' [27]

---

23. 'India what can teaches us.' P. 89.

24. Wilsons' essays Vol III P. 339

25. History of the Indian people P. 45

26. India what can teaches us P. 5

27. History of sanskrit literature P. 42

భారతీయ సారస్వతాంశమైన పురాణములు తమపై జూపిన ప్రభావ మసదృశమనుచు మాక్సు ముల్లగ-

'Although there is hardly any department of learning which has not received new light, and new light from the ancient literature of India, yet no where is the light that comes to us from India, so important Novel and so rich as in the study of religion and mythology.'[28]

సర్ విలియం జోన్సు పండితుడు సంస్కృత భాషా నిర్మాణమున కచ్చెరువొంది యిది గ్రీకు భాషకంటె పరిపూర్ణమని, లోపరహితమని లాటినుకంటె విస్తృతమని, నీ రెండింటికంటె స్వచ్ఛమైనదనియు, శ్లాఘించెను.

3) ఖగోళశాస్త్రము :- ఖగోళ శాస్త్రమును గురించి హంటరు పండితుడు ఇట్లు చెప్పెను.

'The Indians and advanced far in Astronomy, before the Greeks arrived in In India. In 327 B. C [29]

ప్రొ. బ్రెయిలీ యీజిప్టు, గ్రీకు, రోమనుల ఖగోళ విజ్ఞానము కంటె భారతీయులు తద్విజ్ఞానమునందత్యంత ప్రాచీనతను సంపాదించి రనుచు-

'The Hindu systems of Astronomy are by far the oldest and that from them, the Egyptians, Greeks Romans and even the Jews derived their knowledge.'[30]

4) అయుర్వేదము :-

In medicines the Brahmins learned Nothing from Greeks, dut taught them much. Arab Medicine was foun-

28. India weat can teaches us P. 140.

29. A Brief History of the Indian people P. 55

30. 'Hindu superiority' P. 286

ded on tran·latton from Sanskrit works about 800 AD. European medlclne down to the 17th Century, was based on Arabic.'[31]

5) సంగీతశాస్త్రము :-

The Brahmins had also an art of music of their own. The seven notes which they invented at least 4th centuries B. C. passed thr ough persian to Arabia and were thence introduced into European music in the 11th century AD. Hindu music is hl3ily original and interesting form a sceintific p)int of view'[32]

6) ధనుర్వేదము :-

అలెగ్జాండరుతో వచ్చిన "తెసిస్టన్" అను చరిత్రకారుడు - ఈ దేశమందలి ధనుర్వేద విశారదుల శక్తిని గుఱించి యాశ్చర్య పడుచు నిట్లు వ్రాసెను.

'The Brahmins were fighting at a distance with lightening and thonder.,

"ఫిలోస్ట్రాటను" అను చరిత్రకారుడు

'Should an enemy make war upon them, they derive him off by means of tempests and thunders as if sent do)n from heaven.The sages remalned unconcerned spetators untill the assault was made, when it was repulsed by fiery whlralwinds and thunder which being hurled from above dealt distinction on invaders.[33]

31. 'A brief history of Indian people PP. 55, 56
32. కలి శక విజ్ఞానము. తృ. భా. పే. 4

ఇట్లివ్విధమున వాఙ్మయమంతయు భగవన్ముఖమై x భారతీయ మయమై, యత్యాశ్చర్యకర శక్తి సమన్వితమై వైదేశికులచే సయితము ప్రశంసకు హేతువయ్యెను.

కాలముచే గలిగిన మార్పు :- కాలము గడచినది, చిన్నచిన్న రాజ్యముల కలహములు బ్రిటీషువారి దొరతనమునకు త్రోవయయ్యెను వారి భాష, వేషము, అలవాటులు క్రమమున మనకు సంక్రమించినవి. మనము చదివెడి చదువుల స్థానములో వారి చదువులు చదివింపబడుట మొదలయ్యెను. మనవిజ్ఞానముకంటెవారిదేశస్థులైన జ్ఞానముభ్రాంతి యీ దేశీయులకు గలిగించుటలో తారు కృతకృత్యులైరి. రాజోద్యోగములకు విలువ యయ్యెను. స్వస్థానవేషభాషాభిమానులు కఱవైరి. ఏ కొద్దిమందియో యున్నను వారిది యరణ్యరోదన మయ్యెను, వారి దేశములోని పెద్దచదువులు చదివిన వారినిదేశమున ప్రభుత్వోద్యోగములలో నున్నత పదవులలో నియమించుట వారి పాలనకనుకూలము. అట్టి వారిలో కొందఱు సంస్కృత భాషకు ముగ్ధులై, యీదేశ ప్రాచీనత కలరి, దానిని శ్రమించి యభ్యసించి, విజ్ఞానులై, ఈ దేశసంస్కృతి సంప్రదాయముల నెఱుంగకయే విమర్శింపసాగిరి. ఒక ప్రక్క వాఙ్మయ ప్రశంస యొనర్చుట వేఱొకవైపున మన ప్రాచీనతను శంకిలచుట, మన చరిత్రకు ప్రాచీనత సంగీకరింపని గ్రంథములు వ్రాయుట మొదలయ్యెను. విచిత్రమేమన, మనదేశీయ పండితులు సయితము వారి యామోదమునకు లోబడి వారివలె ప్రవర్తించును వారి గ్రంథముల ప్రమాణముగా గ్రహించి, వానినే యనుసరించుట, గ్రంథములు వ్రాయుట, క్రమమున వారి సంస్కారము, వారి జాత్యహంకారము, పరిశీలనపద్ధతులు మనకును సంక్రమించెను. ప్రాచీనము సమీచీనము కాదుగాన నవీనముపాదేయమను నినాదముత్పన్న మయ్యెను. తాత్ప

x యోగ జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాదికర్మచ। వేదాః శాస్త్రాణి విజ్ఞానం ఏతత్సర్వం జనార్దనాత్.। విష్ణు సహస్రనామ ఉత్తర పీఠికా. 19

లిక మగు సమస్యలు, వానికి పరిష్కారములు సాహిత్యములో ప్రముఖ స్థానము వహించుట మొదలయి, శాశ్వత పరిష్కారమునకు నాధ్యాత్మిక చింతనమునకు స్థానము పలుచన యయ్యెను. ఇది యవిచ్ఛిన్నముగా గొనసాగిన యాంగ్లేయుల పాలనవలన గలిగిన దోసగుగా దేశమదుంన్న యేోద్ధిమంది స్వస్థాన వేషభాషాభిమానులో భావింప దొడగిరి.

వేదములనాదియను భావము లుప్తము కాజొచ్చెను సంప్రదాయా వగాహన లేమిచే వానికి గాల నిర్ణయము జరుగజొచ్చెను. పురాణములలోని బహ్వంశములు కువిమర్శకు తావులగుచుండెను. భారతాదులలోని యనేక సన్నివేశములు, పాత్రలు, కుహనా విమర్శకుల ధాటికి నీరుగారి పోవుచుండెను. చాతుర్వర్ణ వ్యవస్థ ప్రాచీనుల చేతగాని చర్యగా, నొకవర్ణమువారు మరియొకవర్ణము వారిని జప్పుచేతలలో బెట్టుకొనుటకాడిన కపటనాటకముగా బ్రవచింపబడుచుండెను. వేదములందలి యజ్ఞయాగాది క్రతువులు, పరమేశ్వర తత్త్వము, ఆధ్యాత్మిక జీవనములు పరిహాస పాత్రము లగుచుండెను. శాస్త్రములు, ప్రాచీనాచారి పద్ధతులు నవహేళనకు గురికాజొచ్చెను. అణిమాద్యష్ట సిద్ధులు, తాంత్రిక విద్యలు, శస్త్రాస్త్ర సంచయవిద్యలు, యుద్ధ తంత్రములు, ఆకాశగమనాదులు ఇతరానేకానేక స్ఫూర్తిమద్విద్యలు నేడు మనకు బరిచయముగాని విద్యలయి, యవి మనకు లేని విద్యలుగా, నభూతకల్పనలుగా భావింప జొచ్చుట జరిగెను. విమాన తంత్రము, లాకాశగమనాదులు మనమెఱుంగని విద్యలుగా ప్రచారమగుచుండెను వీనిలో పాశ్చాత్యులకంటె ప్రవీణులెవ్వరను దృఢబుద్ధితో విజాత్యభిమానము గలిగి, స్వజాతి. దేశ, సంస్కృతి సంప్రదాయములను విస్మరించి మనవారును పాశ్చాత్యులతో గలిసి విమర్శించుట. కొనసాగెను ఈదేశములోని బ్రాహ్మణ వర్ణము సయితము వేదశాస్త్ర భాషాపాండిత్యములచే నాధ్యాత్మిక సంపదచే బూర్వమెంతటి గౌరవ ప్రతిష్ఠలందిరో, నేడు

వానిని త్యజించి యీజాతియు నితరుల వలెనే. నొకచో వారికంటె నెక్కుడుగా విమర్శించుట సామాన్యమయ్యెను.

ఇట్టి సమయమున దేశ స్వాతంత్ర్య యోధుల యవిశ్రాంత కృషివలన, బహుధార్మికుల ప్రాణత్యాగము వలన, విశేషించి యాధ్యాత్మిక శక్తిని తన శారీరక బలముగా నెంచిన గాంధీమహాత్ముని యగ్రసరత్వమున నీదేశము దాస్యమునుండి విముక్తమయ్యెను. నాడు ప్రతి రాష్ట్రమందును వెలసిన దేశాభిమానులయిన కొలది మంది మహాకవులలో నీరాష్ట్రమందు వెలసిన కవితా కళాప్రపూర్ణుడు శ్రీవిశ్వనాథ సత్యనారాయణ.

శ్రీవిశ్వనాథ విశ్వజనీనమయిన సృజనాత్మక శక్తిగల రచయిత బహు ప్రాచీనతగలిగి, తనదైన యొక ప్రత్యేకత గల్గిన సంస్కృతి ప్రవాహమును తనయందిమిడ్చుకొని, బహుదేవతాత్మకమైన నెలవులు కలిగిన దేశమున జనించిన యదృష్టవంతుడు.

ఈ దేశ సంస్కృతి వేద శాస్త్ర పురాణేతిహాస వాఙ్మయ సంబంధమయిన జీవనముతో ముడివడియున్నది. బహు శత సహస్రాబ్దులనుండి యవిచ్ఛిన్నముగా గొనసాగెడి సంస్కృతీ స్రవంతి విదేశీయులకు సయితము ముగ్ధ మోహనముగా దర్శనమిచ్చెను. నిత్య జాగృతమైన యిట్టి జాతి కాలహేతువున నిద్రాగ్రస్త మయ్యెను. ప్రాచీనమునుండియు నేత దవస్థ సంప్రాప్తించినపుడు, తత్త్వవేత్తలు, ఆధ్యాత్మికతయందు పండిన విజ్ఞానులు, సారస్వత వైతాళికులు జాతిని జాగృతము చేయుచునేయుండిరి. కాల ప్రవాహములో ననేక మూఢపు సంప్రదాయములు చోటు చేసికొన్నవి. సతీసహగమనాదులు వేదవిరుద్ధమైనను వేదధర్మముగనే ప్రచారమొనర్చి ప్రజలకు పిఱుగులు తెచ్చెడి కుహనా ధర్మశాస్త్ర కర్తలు రాజొచ్చిరి. సతీసహగమనముతో గన్యాశుల్కము గూడ తోడయ్యెను. వీనిని రూపుమాపుటకు సాహిత్య

సమన్వితముగా సంఘ సంస్కరణోద్యమములు వెల్లి విరిసినవి. అట్లే చరిత్ర విషయమునను నీదుస్థితి సంభవించినది. మనకు జరిత్ర యనశే లేదనెడి భ్రాంతి కల్పింపబడినది, పరిధీకృతమైన మానవుని యవగాహన యందు మేర యేర్పడిన విజ్ఞానమే చరిత్ర దాని నతిశయించినది పురాణము. సత్యమైనదనియు దానికి మూలమై, తత్పూర్వార్థమందున్న పురాణశబ్దము, తద్గత మహావేక రహస్యవిషయములు కల్పితము, మిధ్య, ఊహాగమ్యమనుట నిశ్చయమయ్యెను.

ఇట్టి స్థితిలో సాహితీ వేత్త కర్తవ్యము :- ఒక మహా ప్రతిభావంతుడైన సారస్వత స్రష్టకీ కాల చంక్రమణములోని వైపరీత్యము విపరీత క్లేశమునకు నెలవు మన ధర్మము తెలియ జెప్పవలెను. అనుస్యూతమయి మన సంస్కృతి స్రవంతిని దర్శింప జేయవలయును. నేఁపహాస్యమునకు గుఱియగుచున్న యనేకానేక విషయములలోని పరమరహాస్యమును దెలిపి యితరులు మనకు సంక్రమింప జేయుచున్న భ్రాంతిని దొలగింపవలెను. విశేషించి మన చరిత్ర యందు జరిగిన యన్యాయమును విస్పష్టము గావింపవలెనూ ఇందు నయ్యాంగ్లేయులొనర్చిన ద్రోహమును బ్రకటింపవలెను. అధోవిజ్ఞాన గతులైన జాతికి నూర్ధ్వదశ నందింపవలెను, ఇట్టి జాతిద్రోహ. దేశద్రోహుల యాంతర్యమును బట్టబయలు చేసి, మనదైన, మనదానిని, మనదిగా భావించుటకు తన పాఠకులను సన్నద్ధమొనర్పవలెను. అట్లయినచో-

1) నీయన చరిత్రజ్ఞుడా ? ఒకచో జరిత్రజ్ఞుడే యగుచో 2) వ్యాసముల చేతనో, యుపన్యాసముల చేతనో మఱింత శక్తివంతముగా నిర్వహింపవచ్చును గదా ! 3) ఇంతకుమున్ను వేద ధర్మ ప్రతిపాదకములైన గ్రంథములుండగా తిరిగి యీ ప్రయత్నమేల ? యనునవి ప్రశ్నలు. వీనికి దగు పరిష్కారములు సూచింపవలసియున్నది.

1) శ్రీ విశ్వనాథ చరిత్రజ్ఞుడుగాని; చారిత్రకుడుగాని కాడు. ఒక సారస్వత మహాస్రష్ట. అనంతమైన ప్రతిభతో నిత్య ప్రస్తుతమైన

యూహతో జాతిని తన వశమునందుంచుకొన గరిగెడి ప్రజ్ఞాశాలి. ఈయనంత సృష్టియందు తనదైన యాత్మ పరార్థమొక బిందు మాత్రమనెడు యభిజ్ఞతతో నుపశమింపని జ్ఞానతీవ్రత గలవాడు, ఈ జాతియందొకడైన తాను, తనదేశము భగవన్నిర్మితమైన దేశమని, తద్దేశగత సంస్కృతి సంప్రదాయ సర్వస్వము నెఱింగి తన జాతికి దెలియ జెప్పవలెననెడు గాఢ ప్రతిభుడు. ఇది కలిగి సారస్వతాధినేతృత్వము గలిగిన ప్రాజ్ఞులరుదుగా దేశము నవతరింతురు.

రాష్ట్రాంతరములందు సయితమిట్టివారు సకృత్తుగా నవతరింపక పోలేరు. ఈ దేశములోనీయన యట్టెడు విశ్వజనీన భావనగలిగిన విశ్వ విశాల సృష్టియందు ప్రగల్భమయి, వ్యాప్తిగల యాత్మ పదార్థము నందు దానొకడై జగత్కుటుంబియైన మహాకవియగుటచే, 'దేశభాషల నెత్తెలుంగ' స్వస్థాన వేష భాషాభిమానముతో నగర్వముగా జీవితాంతము విశ్వవిశాల దర్శనముగల సంస్కృతిని సార్వకాలిక, సార్వదేశికము నయి విచ్ఛిన్నము నయిన భారతదేశ పౌరాణిక ప్రాచీనతను, దాని సర్వోత్కృష్టమును దసవగహన యొనర్చుకొని దానిని తన ప్రగాఢ ప్రతిభచే దర్శించి దృష్టయై, తన ప్రజల కద్దాని నందింపవలెననెడు పరమ సవ్యమైన, పరమ లోకోత్తరమైన యూహ చేసె వాగ్రూపమున సాహిత్య రసిక జనామోదముగ వెలయించి స్రష్టయైన ఈయన చరిత్రజ్ఞుడు కాకపోయినను దొసగులేదు.

2. ఉపన్యాస, వ్యాసములుగూడ నీలక్ష్యమును సాధించ వచ్చునుగాని నీప్రక్రియయందును గొన్ని దొసగులు లేకపోలేదు. అవి-

1) వీనియందు విషయము ప్రధానమగుటచే నిది సర్వజనాంగీకృతమైన మార్గముగా భావింపవీలులేదు. 2) సృజనక్షమమైన ప్రతిభ ప్రదర్శింపబడుటకిది వీలైన రంగముగా దీనిని భావింప వీలుగాదు. 3) ఒకచో ప్రతిభ ప్రదర్శింపబడినను వది వాసనలేని పూవు చందమున నాకర్షకమయ్యును నామోదము కాదు.

3) 'ఏకో వేదస్యచా జ్ఞానాత్ వేదాస్తే బహవో భవన్' అను సనాతన జాతీయ వాక్యానుసారము ఏకము, నద్వితీయము నైన పరమాత్మ తత్త్వము తెలిసికొనుట దుర్గమముగా నున్నపుడు, వేదము లనేక విధములుగా నావిర్భవించినవి పరమ సూక్ష్మములైన వేదధర్మ ప్రతిపాదనములు గహనము లగుటచే బురాణేతిహాసము లవతరించినట్లే నేడందఱకు నాదరణీయమైన 'నవల' నాధారముగా జేసికొని వానిని మనకందించుటకు రచయిత యత్నించెననుటలో విప్రతిపత్తి లేదు అనంత కాలములో నట్టి యత్నము లింకెన్ని జరుగనున్నవో !

శ్రీవిశ్వనాథకు గల యర్హతలు :- సాహిత్య సంసర్గ జీవాతువు లైనట్టి వానిలో ప్రతిభ గరీయసి యయినను నవ వ్యుత్పన్నతా సహకృతమైననే రాణించును పుష్పము ప్రతిభ వంటిది యైనచో దానికి రక్షక పత్రములు వ్యుత్పత్తి వంటివి. అనగా పత్రరేఖా సహితమైన పుష్పము శోభనిచ్చినంతగా తద్రహితమైన కుసుమము తృప్తినీయదనుట సమ్మతము. వ్యుత్పత్తి లేని యభ్యాసము నిర్గంధ కుసుమము. అభ్యాస వ్యుత్పత్తులకు శిరశ్శేఖరముగా ప్రతిభ నిలచిన వాడు తద్రచయిత వెలయించిన కవిత, కావ్యము, వాక్యము సరస్వతీ సమ్మోహనము, స్రష్టనుమోదము, రసిక జన ప్రభాసము, సహృదయైక వేద్యము. జగన్మోహనములై విలసిల్లును. ఈ వ్యుత్పత్తి పలు తెఱంగులు. అవి 1) జన్మాంతర వ్యుత్పత్తి 2) పితృపైతామహ ప్రాప్త వ్యుత్పత్తి 3) సాహచర్యము 4) పూర్ణపురుషాయుష జీవనము 5) బహు భాషాభిజ్ఞత 6) దేశసంచారము.

1) పూర్వ ప్రజ్ఞతో గూడిన విద్యాకర్మలు బహుజన్మల నుండి శ్రీ విశ్వనాథ జీవుని వెన్నంటియే యున్నవి, కనుకనే ఆయన తన ప్రథమ కవితా సంకలనమునకు "భ్రష్టయోగి" యని పేరుంచగలిగెను, తత్సంస్కార విశేషముచే దాను ప్రత్యేకించి కొన్ని క్షేత్రము లందు గృతశ్రముడైనను ప్రపూర్ణ శాస్త్రధిషణత్వము గలిగినవారి

కంటె విస్పష్టముగా విస్తృతముగా నర్థవంతముగా దెలియజెప్పగలిగిన వారెవ్వరు. కానిచో 'నశ్వమేధము' లోని నారాయణ భట్టు చేతను, నాగసేనునవలలో నాగసేనునితోడను, నట్టి వాక్యములను బలికింపరు. నారాయణభట్టు పుష్యమిత్రునితో (పుష్యమిత్రుని మేనల్లుడైన సోమశర్మ నుద్దేశించి"

"మహానుభావుడా ! నాకంటె పండితుడా ! యనగా నర్థమేమి? ఆయన చదివినవియు మేము చదివినవియు నైన శాస్త్ర గ్రంథములవియే. ఒక గ్రంథము నే నెక్కువ చదివి యుండవచ్చును. ఒక గ్రంథమాయన యెక్కువ చదివి యుండవచ్చును. అదికాదు ప్రశ్న. ఆ శాస్త్రము కోసము పుట్టినవాడని పించును. ఆయన యొక్కొక్కప్పుడు మాట్లాడు చుండగా నేనతడు మాట్లాడుచుండెనని యనుకొనలేదు. వెనుకనున్న యేదో దేవత పల్కుచున్నది. ఆయూహా వేఱు." ఆ తర్కము వేఱు వే. (116)

ఇది విశ్వనాథ పాండిత్యమున కెంతయు నన్వయించును. నాగసేనుని పాండిత్యమును శౌరి యపహాస్యము చేసిన సన్నివేశమున నాగసేనుడు, "ఓరి శౌరీ ! నీకీ హాస్యము తెలియదు. విద్య ప్రతిభాదుల చేత ప్రకాశించును. ఒకని యొక్క యధిక వివేకము వాడు నేర్చిన విద్య నుపయోగపఱచుటలో నున్నది. బుద్ధి యెఱువాడిగల కత్తివలె నుండుటలో నున్నది" వే. (85)

ప్రతిభాదులనగా వ్యుత్పత్త్యభ్యాస సహితమైనదియే.

2) శ్రీ విశ్వనాథ తండ్రియైన శోభనాద్రిగారు ప్రాచీన సంప్రదాయమునకు జెందినవారు. భగవద్భక్తి, పురాణేతిహాసములందు రక్తి గన్నట్టివారు. తనయుని జీవితమునకు నాధ్యాత్మికముగా నొక లక్ష్యమును గూర్చి సాహిత్య పరమార్థమును దర్శింపజేసినవారు. పరమ

శివారాధకులు. ఇవియన్నియు శ్రీవిశ్వనాథకు పితృప్రాప్త వ్యుత్పత్తియే యగును.

3) బాల్యాది శ్రీ విశ్వనాథకు విద్యనభ్యసింపజేసిన గురువులు మహోన్నతవ్యక్తులు. వీరి సాహచర్యముచే నీయన వృద్ధశ్రవస్సదృశుడయ్యెను. అనంతరము ఉద్యోగికముగను, ఇతరానేకానేక పరిధులందు పరిశ్రమలయిన వారి సాహచర్యము సహజముగనే యీయన నొక విజ్ఞాన సర్వస్వముగ మలచినది. కలిసిన ప్రతివ్యక్తి యందలి యేదో యొక ప్రత్యేకతను తన రచనయందు నిబద్ధించుటయే పరమ లక్ష్యముగా భావించును. అదియునుంగాక ఈయన పూర్ణపురుషాయుష జీవి. ఒక దీర్ఘకాల జీవితములో నీయన కనినవి, వినినవి, చదివినవి యనంతమయి యుండును. ఆయిన నీనివలన సాధించిన యనుభవము దొడ్డది. సంసార జంబాల పటల మగ్నుడయ్యెను. ఉద్యోగ నిర్వహణ నిమిత్తమై దేశాటనము చేసి తన వ్యక్తిత్వమును ప్రకాశింప జేసికొనుచు, తాను పండించకొన్న సాహిత్యామృత బీజములను వివిధ ప్రదేశములందు నిక్షేపించి అచటి జనులదైనందిన జీవనమును గమనించి వా యందలి యౌచిత్యానౌచిత్యములను సాహిత్యమందు చిత్రించుటకు తన వ్యుత్పత్తిని మలచుకొనినవాడయ్యెను. బహు భాషాభిజ్ఞత, బహు గ్రంథ పరిచయము, బహు మార్గములందు కృతశ్రములై, అనేకానేక అనుభవ పరిక్రములైన మహామహుల సంసర్గము, ప్రత్యేకించి సహస్ర చంద్రదర్శన భాగ్యముచే పరిగతములైన జీవితానుభవములాయన వ్యుత్పత్తిని చక్కగా వృద్ధి నొందించినవి. తత్కారణముననే జీవితబద్ధమయిన ప్రతిసామాన్యానుభవ రేఖను సయితము తన యవగాహనచే విజ్ఞాన రేఖగా భాసింపజేసికొనిన వ్యుత్పన్నత జ్ఞాని శ్రీ విశ్వనాథ.

కవితార్థి హృదయుడైన వానికీ వ్యుత్పన్నత పాఠకుడు లోనికి చొచ్చుకొని పోవుటకుపకరించును. తాను పండించిన విజ్ఞాన సస్యమును

పెక్కు సాహితీక్షుధార్తులకు పంచుటకు వీలగును ఇట్టి యవకాశము పరతంత్రమయిన సాహిత్యమార్గములందు నిక్షేపించుచో నది బహుళ జనామోదము కాక బహుళజనుల కగమ్యమగునను శంకించిన వాడు గనుక నవలామార్గము నెన్నుకొని తన లక్ష్యసిద్ధిని సాధించుకొనుటకు యత్నము సలిపిన వాడయ్యెను. ఈ వ్యుత్పన్నతా హేతువుననే తన నవలలందు బహుముఖీన మైన విజ్ఞానమును ప్రదర్శింపగలైను. వేదమునందలి సృష్టి క్రమము, దీక్షిత వాదము, అశ్వమేధ విభాగము, నాచికేతాగ్ని విద్యలు, శాస్త్రములందలి బహు విషయములు - అనగా జ్యోతిషము, ఖగోళ శాస్త్రము, సంగీత శాస్త్రము, శ్రౌతవిషయము, మ్లేచ్ఛవైదిక విద్యలందున్న ఉపాసనలు, జంతు సంబంధమయిన విద్యలు, మైత్రేయవాన విద్యలు - నివియన్నియు నీయన గడించిన విజ్ఞానాంశములే యగును. పురాణవైర నవలలందా యూతావుల నివి వివరింపబడియే యున్నవి.

రచనా ప్రణాళిక :- 'యదా యదా హి ధర్మస్య గ్లాని' అను శ్లోకమున చెప్పబడిన కాలమిది. దీనిని రచనద్వారమున ధర్మాభ్యుత్థానమును జేయుట కవతరించిన శ్రీమూర్త్యాత్మకుడు. అనేకపాత్రలను సృజించుటచే జతురాననుడై, తత్పాత్రలను భరించి పోషించి వారి వారి గుణములను దీటించి కర్మబద్ధతను నిరూపించి మహా విష్ణువై, అధర్మలంపటులైన మ్లేచ్ఛ వైదికేతరాద్యధర్మ పాత్రలను నిర్మూలించి (పాఠక) లోకమునకు క్షేమమును గలిగించెడి పరమశివుడై త్రిమూర్త్యాత్మకుడయ్యెను. ఇది నిరూపించుటయే యీనవలా ప్రణాళికలోని మర్మము. ఇది మఱికొంత వివరింపబడుచున్నది.

కృత, త్రేత, ద్వాపరాంతములందు ధర్మాధర్మ సంగ్రామమున నధర్మము నశించి ధర్మము ప్రతిష్ఠింపబడినది. ఇది కలియుగము. దేశము నందు సంభవించెడి దుర్భర దారిద్ర్యాదులకు విధ్వంసము లన్నింటికి నీయధర్మవిజృంభణమే హేతువగును.

సాధారణ సామాన్యములైన వాయువు, ఉదకములు, దేశము, కాలము వాని యందు బుట్టిన వికృతిచే మనుష్యుల కేకకాలమందొకే విధమయిన వ్యాధులేర్పడి గ్రామములను విధ్వంసమొనర్చును. దేశ,నగర, గ్రామ పాలకులు తమ ప్రజల సధర్మమున నడిపించుచో ధర్మమే తదధర్మమును నశింపజేయుట కిట్టి వైకృత గుణములను బుట్టించుననియు 'చరకసంహిత' యందున్నది." 34

ఈ పురాణవైర నవలా రచనాకీలకమంతయు నిచ్చట నున్నది భారతయుద్ధమాది శాలివాహనుని వరకు 10 వంశములను దీసి కొనెను. (బార్హద్రథ, ప్రద్యోత, శైశునాగ, నంద, మౌర్య, శుంగ, కాణ్వ, ఆంధ్ర, గుప్త, ప్రముఖ వంశములు) ప్రతి రాజవంశములోను నొక సామాన్య పరిణామమును గ్రహించెను. పూర్వ రాజవంశము లోని చివరి రాజును వాని సేనాపతి సంహరించి యా సేనాపతివంశము రాజ్యమును స్వీకరించుట యే తత్పరిణామము. కొన్నిటియందట్టిది సంభవించనప్పటికిని x పెక్కు వంశములలో సంభవించి నదియే. ఇది

---

34. వాయ్వాదీనాం యద్వైగుణ్య ముత్పద్యతే తస్యమూలమధర్మః। తన్మూలంవాఽసత్కర్మ పూర్వ కృతం। తయో ర్యోనిః ప్రజ్ఞాపరాధ యేవ। తద్యథా। యదావై దేశనగర నిగమజనపద ప్రధానాః ధర్మముత్క్రమ్య ధర్మేణ ప్రజాం వర్తయన్తి। తదాశ్రితోపాశ్రితాః। పౌరజానపదాః వ్యవహారోప జీవినశ్చ తదధర్మ మభివర్ధయన్తి। తేననాపోయథాకాలం దేవోవర్షతి నవావర్షతి। వికృతం నవర్షతి। వాతానమ్యగభివాన్తి। క్షితిర్వ్యాపద్యతే, సలిలాన్యుపశుష్యన్తి। ఓషధయః స్వభావం పరిహాయాఽపద్యన్తే। వికృతిం తత ఉద్ధ్వంస్యన్తే జనపదాః స్పృశ్యాభ్యవహార్యదోషాత్। చరక సంహిత।

x 'నందోరాజా భవిష్యతి, మౌర్యచంద్రగుప్తుని స్వప్నము, నాగసేనుడు, నివేదిత)

పురాణ కథనము. దీని రచయిత సాహిత్యాత్మకముగా తానొక యూహచేసి కల్పన చేసెను ప్రతిరాజ వంశాంతమున నధర్మ విజృంభణమును గాన్నాశమునకై నూత్నవంశపు సేనాపతియో, మరి యొకరో యుద్భవించుటయు, దానియందు విజయుడై తాను రాజ్యమును పాలించుట, ధర్మ ప్రతిష్ఠాపన మొనర్చుట, ఇను దానిని తన ప్రణాళిక యందు నిబద్ధించెను. యుగాంతములందధర్మ విజృంభణము ధర్మ సంస్థాపనము ప్రపంచ సృష్టి యందయినచో సాహిత్య సృష్టియందు ప్రతివంశాంతమునను సంభవించినట్లుగా భావించెను. ఈ యధర్మమునకు ప్రతీకగా నొకానొక యధర్మ హేతువును, తన పరిధిలోనికి దెచ్చెను. అదియే సైంధవుని పాత్ర ఆ పాత్ర భ్రాంతి యుద్ధములో నిహతమైన పాత్ర తన పురాణవైర నవలలలో నా పాత్రనే తదధర్మమును గొనసాగించుటకు కొన్ని వేల యేండ్లు బ్రదికించెను.

జయ విజయులను ద్వారపాలకులు వైకుంఠద్వార పరిరక్షకులు వారు సనకసనందనాదులచే శప్తులై మూడు జన్మములు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా కృతయుగమున, రావణకుంభకర్ణులుగ త్రేతాయుగమున, శిశుపాలదంతవక్త్రులుగ ద్వాపరయుగమున జన్మించి పురాణవైరులై లోకముల నల్లకల్లోలమొనర్చి ధర్మముపై వైరమును కొనసాగించి, తుది జన్మాంతమున శాపమోక్షమును బడసి పురాణుని జేరినట్లు పురాణ ప్రసిద్ధమయిన యొక పురాణవైరమును మనమిది వరకే వినియున్నాము. విదేశీయులైన చరిత్రకారులు మన ప్రాచీనతను శంకించి మన చరిత్రను దుష్టముగా చిత్రించి వారు సాగించిన పురాణవైరము ద్వితీయ పురాణవైరము. ఇది విశ్వనాథ సృష్టి

ఈ ప్రణాళిక మీద జయద్రథ పాత్రనిర్మాణము జరిగెను ఈ నవలలన్నింటికి ప్రతినాయకపాత్ర జయద్రథుడే ప్రతినాయకుని ప్రకృతి

ధర్మగ్లాని కల్గించుటయే మ్లేచ్ఛ ధర్మమును ప్రవేశపెట్టుటయే. తద్ధర్మ క్షీణత నొక్కొక్క నవల యందొక్కొక్క విధమున ప్రదర్శించెను.

జయద్రథుడు భారత పాత్ర. సింధు దేశాధీశుడు. ఆయనకు సైంధవుడను పేరు తత్కారణముననే గలిగెను. తన యత్నము కామ వైఫల్యముచే దుర్జనునకు కోపముగల్గినది భగవంతుని మీద ఆతని ధర్మమార్గము మీద పగగా కొనసాగి దేశీయ పాత్రమయినచో జయద్రథుని గను, విదేశీయ పాత్రయయినచో పెలియోనసుగను రూపొందింపబడి యీ గ్రంథమాల యందలి తుది నవలయైన "నివేదిత" వరకు కొనసాగును. శాలివాహనునిచే నాతడు సంహరింపబడెను. ఇట్లే నవలలనందు వీరి పేళ్లు మాత్రము వేరు. లక్ష్యము మాత్రమొకటే, ధర్మ స్రవంతి కడ్డు వేయుట.

మఱియొక సాధర్మ్య సీమన, జయద్రథుడెట్లు నాడు తన యత్నమైన కామమును బయల్పఱచి ధర్మ బద్ధులైన పాండవులందు నర్జునునిచే ఘోరముగా నిహతుడై భారతమందు నిష్క్రమించెనో, అట్లే ఈ పురాణ వైర నవలలయందును, జయద్రథ పాత్ర భారతీయ యువనుడై నిరాకులనాముడై, యత్నకామ వైఫల్యము చేతనే తీవ్ర కోపాభిభూతుడై విప్లవమును గల్పించి ధర్మ బద్ధుడైన శాలివాహను నెదిర్చి యాతనిచే ఘోరముగా వధింపబడి నిష్క్రమించెను.

జయద్రథుని పాత్రకు మ్లేచ్ఛత్వమును గల్పించుటకు జారిత్రకముగా జిక్కిన యవకాశమును సద్వినియోగపఱచుకొనుటయు నిర్మాణ

*నాగసేనుడు :- కబంధుడు (ధర్మమూర్తులైన రామలక్ష్మణులను మ్రింగనెంచిన రాక్షసుడు) హెలీనా :- (ఫిలిప్ యోనస్) వేదవతి :- (కటక యోగి) నివేదిత (నిరాకులుడు) (ఇవి యన్నియు జయద్రథునకు ప్రతిరూపములే)

కౌశల్యమే యని చెప్పవచ్చును ప్రాచీనము నుండియు నీదేశమునకు వైదేశికులు సింధునదిని దాటివచ్చుట యొకటియే మార్గము. ఇచ్చట నుండి వెడలగొట్టబడిన ధర్మబాహ్యులు నిష్కాసన మొందిపోయిన పదియే గ్రోవ. తత్కారణమున సంస్కృతికి రాకపోకలు గల్గిన తావుగా దీనిని పేర్కొననగును. జయద్రధుని కాపపక్షమున బోరుటకును దీనికిని సంబంధము లేకున్నను, రచయిత తన నవలలలోని సర్వాసంస్కృతి ప్రవేశమునకు సింధునదిని ప్రధాన కేంద్రముగా గొని, యితివృత్తములను నిర్వహించి భారతములోని జయద్రధుని యసంస్కృతి తదనంతరము దేశమున కొనసాగినట్లుగా నూహింపబడిన అసంస్కృత భావముతో సమన్వయించెను.

పాశ్చాత్యులలో మనచరిత్రను తొలుమారు చేయుటకు యత్నించిన ప్రథముడు విలియం జోన్సు మహాశయుడు. ఆయన గుప్తచంద్రగుప్తు మౌర్యులలోని చక్రవర్తిగా నిర్ణయించును. 'ఆసియా చరిత్ర' అను వ్యాసమునందు ఆయన దీనిని నిబద్ధించెను.[35]

దేశీయ చరిత్రకారులు కూడ నీవాదముననే మొగ్గుజూపిరి. ఈ దురాగతముచే దేశమునకు సుమారు పదిరెండువందల యేండ్ల చరిత్ర వ్యర్థమయ్యెను. ఈ చరిత్రకారుని పేరే వైదేశికేతి వృత్తమును నడుపువచ్చినపుడు విలియోనసు, ఫిలిప్‌యోనస్, బిలియోనస్ అను పేర్లతో వ్యవహరింపబడెను. ఇది ప్రతినాయక పాత్రగా, విలయకాల మందు వ్యక్తమయిన పాపమునకు ప్రతీకగా నీపాత్రను ప్రదర్శించి కావ్యప మార్గమయిన ధ్వని మార్గమును నవలయందు ప్రవేశ పెట్టిన

---

35. In 10th Annual conferenec Calcutta. The founder and president of the Society instituted in Bengal for the enquiry into the History and antiquities, the Arts, Science and literature of Asia.

నాశమయ్యెను, ఈ ప్రణాళికతో నీనవలలన్నియు రూపొందింప బడినవి.

రచనా శిల్పము :- ఇందు ప్రాధాన్యము వహించెడి యంశములివి.

1) ఇతివృత్త బంధము, 2) పాత్రచిత్రణము, ఇవి క్రమముగా పరిశీలింపబడుచున్నవి. ఇతివృత్త బంధమునందు ప్రధానమైనవి-

1) అనుస్యూతమైన ధర్మాధర్మ సంఘర్షణము 2) అనుస్యూతమైన పాత్రచిత్రణము 3) అనుస్యూతమైన చారిత్రకాంశప్రతిపాదనము.

1. ఈ పండ్రెండు నవలలయందు ధర్మాధర్మ సంఘర్షణమున్నదనుట క్రింది హేతువులను జూపవచ్చును. ప్రతినవలయందును ధర్మవిరోధమునుండెచ్చి విప్లవమును కొనసాగినంత మను పాత్రలు, ధర్మస్థాపన కంకితమైన పాత్రలు, వైదిక మ్లేచ్ఛ విద్యల సంఘర్షణము, కానవచ్చును.

2. 'భగవంతుని మీఁది పగ'లో జయద్రథుడు హరహా ప్రయత్నముతో శ్రీముఖుని సంహారము జరుపనెంచును. అది విఘటితముకాగా నాగార్జునుని రాజుగానొనర్ప యత్నించును. అతని మనస్సులో నధర్మ బీజములు నాటును, స్త్రీలలో దుస్సల, కేలంగి యట్టి కృషి యొనర్తురు. అదియు విఘటితమయ్యెను. దానికి బలియైనది నీల. ధర్మము జయించెను. ఉపనిషన్మతస్థాపకుడైన శ్రీముఖుడు రాజయ్యెను. ఇది భారతయుద్ధము జరిగినయనంతరము తొంబది యేండ్ల యనంతరము నాటి యితివృత్తము,

2) 'నాస్తిక ధూమము'లో విలియోనను. వింధ్యగిరిస్వామి చాతుర్వర్ణ్యమునకు నీఱు కారించి, వ్యాసుని ధర్మప్రణాళికను విఘటితమొనర్ప నహాగహా యత్నము సలుపుదురు. మునీశుడు దోహదపడెను, దీనికి బలియైనది రాణి మహేశ్వరి, సేనాని గంధవాహుడు. రాజు రిపుంజయుడు వీని పథకము ఘటితమయ్యెను, ఇచట ప్రద్యోతనుడు రాజు. ధర్మమార్గమే ప్రతిష్ఠింపబడెను.

3) 'ధూమ రేఖ'లో జయద్రథుని పిశాచాకృతియే సర్వము నడపించెను. శిశునాగునిచే నధర్మవర్తనమును నడపించి, యెట్లైనను వాని ప్రయత్నము వమ్ము చేయవలెనను ప్రయత్నమున ప్రముఖ మంత్ర వేత్త పరాశర శాస్త్రి యత్నింపగా నది విఘటితమై శిశునాగుడు రాడ య్యెను. ఇది అధర్మ విజయము. ఇందు బలియైనది వేదమరీచి, అజాత శత్రులు, ధర్మగ్లాని సంభవించినది.

4) 'నందో రాజా భవిష్యతి'లో రాక్షసుడైన బ్రాహ్మణుడు నందునకు రాజ్యము సంపాదించి యిచ్చెను. జరిగినది సర్వక్షత్ర సంహారము. ధర్మహ్రాసము.

5) 'చంద్రగుప్తుని స్వప్నము'లో చాణక్యుడు చంద్రగుప్తునకు రాజ్యమును సంపాదించి యిచ్చెను. చంద్రగుప్తుడు చాణక్యుని గురువు గనే గౌరవించెను. చాణక్యుడు చంద్రగుప్తుని మతమును నిర్దేశింపలేదు చారిత్రకమైన ద్రోహము జరిగిన యిప్పట్టున చంద్రగుప్తునకు స్వప్నమును దెప్పించి యందు పాశ్చాత్యులొనర్చిన ద్రోహమును భవిష్యద్విషయము నాపాత్రచే నూహింపజేసెను.

6) 'అశ్వమేధ'మను నవలలో నవైదికమైన బౌద్ధమునకు పట్టము కలిగిన కాలము కాగా బృహద్రథుని సంహరించి పుష్యమిత్రుడు రాజై అశ్వమేధమాచరించి ధర్మ ప్రతిష్ఠాపన మొనర్చెను, ఇందు అధర్మ నాశము, ధర్మ సంస్థాపనము సంభవమయ్యెను. వెలియోనను పాత్ర సంహారము జరిగెను.

7) 'అమృతవల్లి' యందు 'దేవభూతి' రాజు. అతని వ్యసనము లతి వేలముగా వర్ణింపబడి యధర్మ విజృంభణము జరిగింపబడెను. దోహదకారులు జయద్రథుడు, కాలంజరి, వీనిని విఘటిత మొనర్చి వాసుదేవునిచే బంపబడిన విషకన్య (అమృతవల్లి) రాజును సంహరించును. వాసుదేవుడు ధర్మసంరక్షణ మొనర్చును.

8) "పులిగ్రముగ్ధ, నందు సుశర్మ వేదాంతి. కామమార్గము నభిలషించును. సేనాని శ్రీముఖుడు. జయద్రథుడే ఈతనికి సుశర్మను సంహరించి రాజ్య మిప్పించును. ఇది యధర్మ విజయము. ఆంధ్ర రాజులు బౌద్ధము నాదరించుటచేత నీ యధర్మము పునఃస్థాపిత మయ్యెను.

9) 'నాగసేనుడు' అను నవలలో నొక మహా విద్వద్వంశ సంజాతుడు. వేదవేదాంగ విదుడు, నయిన నాగసేనుడను బ్రాహ్మణుడు దురోగ్యగముచే బౌద్ధమతమును స్వీకరించి నాస్తికుడయ్యెను. దీనికికారణముగా జయద్రథుడయ్యెను. ఇదియు 'నాంధ్రరాజు' కాలముననే సంభవించెను. అధర్మమే కొననాశింపబడినది.

10) 'హేలీనా'లో ఫిలిప్ యోనసు అను నంతఃపుర పర్య వేక్షకునకు, భారతదేశము నుండి వచ్చి హేలీనాకు సంస్కృతమును బోధించెడి పినాకి, రోహిణులకును స్పర్థ. సముద్రగుప్తుడు సంప్రదాయ సంబద్ధయైన హేలీనాను పరిణయమాడును. ఫిలిప్ యోనసు సంహరింపబడును. ధర్మ విజయమే యిందును సంభవించినది.

11) 'వేదవతి' నవలలో శకులను సంహరించిన విక్రమార్కుడు వరాహమిహిరుని కూతు వేదవతిని కటకట యోగినుండి విడిపించెను. కటకట యోగి, జయద్రథులు రామ్యకుని వశమొనర్చుకొని విక్ర మార్కునిపై యుద్ధమును బ్రకటింపజేయును. ఫలితము కటకటయోగి మరణము. ఇచటను ధర్మవిజయము. అధర్మనాశము కలిగెను.

12) 'నివేదిత' యందు నిరాకులుడు జయద్రథ పాత్ర యయ్యెను. శాలివాహనుడు శకులను జయించును. నిరాకులుడు యవనుల నందఱను సమాకరించి ధర్మమూర్తి యగు శాలివాహనునితో యుద్ధము చేయుంచును నిరాకులుడు, యవనసేన సంహరింపబడును. ధర్మ విజయము. అధర్మమున కపజయము.

ఇట్లీ నవలలన్నింటి యందు ధర్మాధర్మ సంఘర్షణము ప్రదర్శింపబడినది. కాలచక్రము పరివర్తిల్లుచునే యుండును. ఒకప్పు డధర్మము పెచ్చు పెరిగినచో ధర్మము హ్రాసమగును, అధర్మము తగ్గియుండినచో ధర్మము స్పష్టముగా ప్రకాశించును. వీనికి సంఘర్షణము నిత్య ప్రస్తుతము, దీని నీయనుస్యూతి సంఘర్షణముచే వ్యక్తము చేసెను.

2) అనుస్యూతమయిన పాత్రచిత్రణము 1) జయద్రధుడు- ఈ నవలలందు అనుస్యూతమైన పాత్ర జయద్రధుడు. ప్రతినవల యందును నీతని స్థానము ప్రధానమైనదియే ఒకొక్కచో స్వదేశీయునిగను, మఱియొకచో విదేశీయునిగను, నొకచో పిశాచునిగను, నొకచో నశరీరిగను చిత్రింపబడెను. ఈ పాత్ర యేవ్యూహముతో చిత్రింపబడెనో గమనింతము.

నత్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః।
నచైవ నభవిష్యామ స్సర్వే వయమతః పరమ్। గీత-2-12

ఇది శ్రీకృష్ణునకు నాత్మస్వభావమును గుఱించి చెప్పు సన్నివేశములోనది నిత్యమని, జీవాత్మ పరమాత్మలకది సాధర్మ్యమని నుడివియుండెను. 'నేను (పరమాత్మ) గాని నీవు (జీవాత్మ) గాని ఈ రాజులు గాని యింతకు మున్ను లేకపోలేదు. ఇకను మన మందఱమును లేకపోము నిన్న యుండి నేడు లేకున్నను, నేడుండి రేపు లేకున్ననది యనిత్యమని చెప్పబడును గదా! జీవాత్మ పరమాత్మలకు నీ నిత్యము సమన్వయింపబడినచో భేదమెక్కడ? అని ప్రశ్న. 'ఆత్మ పరమాత్మలనుభవింపబడి జ్ఞానానందాదులయందీ భేదము గలదు. ఆత్మ తాను దుఃఖింపబని లేకున్నను శరీరమునకు దుఃఖాద్యనుభవములు సంభవమే యగుచున్నవిగదా!

రచయిత ఇచట యొక మహారహస్యమును నిక్షిప్తమొనర్చెను. జయద్రధుడను వాని శరీరములు భిన్నములు, 'వాసాంసి

జీర్ణాని యథావిహాయ' యనునట్లు వానికనేక శరీరములు వివిధ కాలములలో వచ్చినవి. 'పునర్మృత్యుమాపద్యంతే' యను విధాన మున నాతని జీవుని యాత్ర కొనసాగుచున్నది. అట్లాతడీ మూడు వేల సంవత్సరములలో ననేక శరీరములను పొందెను. అందులో కొన్ని జలప్రధనాములు, కొన్ని పలియోనసునాములు, వింధ్యగిరిస్వాములు. కబంధులు, నాగాసందులు (నాగసేవకులు) నిరాకులులు-కొన్ని యో శరీరములు నా జీవుని పరివర్తించినవి. ఒకొక్కప్పుడు దుష్ట సంస్కారవైపరీత్యముచే శరీరములు గూఢలేని స్థితిలో నుండవలసి వచ్చెను. (ధూమరేఖ)

ఒకానొక జీవుడు యోగప్రభావమును బట్టి యేక కాలమునందనేక శరీరములను ధరింపగలడు. అట్లే శరీరములు లేకను వాయు మార్గ సంచారుడు కాగలడు. భూతప్రేత పిశాచాదులు శరీర రహితమయివి. ఇవిమానుష చక్షుర్గోచరములు కావు ఇంద్రియాతీత విషయమగునట్టి పాత్రను సృజించి తచ్ఛాస్త్ర ప్రామాణ్యమును సమర్థముగా నిర్వహించి పోషించినాడు x

భగవంతుడైన శ్రీ కృష్ణునకును నరుడైన యర్జునునకును జరిగిన సంభాషణములో బహు జన్మల వృత్తము జీవునకున్నట్లు స్పష్టమగుచున్నది.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థపరంతప ॥

మనయిరువురచేతను బహు జన్మములు పరిగ్రహింపబడియే

---

x జీవోహి పరమాత్మనోత్యన్త భిన్న ఏవసతు దేహేంద్రియ మనోబుద్ధ్యాది సంపర్కాత్సర్వానా కలుషః తస్యజ్ఞాన ధ్యానాది సాధన సంపన్నస్య దేహేంద్రియాది సంఘాతా దుష్క్రమిష్యతః పరమాత్మనైక్యోపపత్తిః।'
బ్రహ్మసూత్రార్థ చంద్రిక పే. 708

యున్నవి. నేను వాని నెఱుంగుదును. నీవు వాని నెఱుంగ లేవు, కారణము నీ జన్మలు కర్మబద్ధములు, అదివ్యములు. నావి కర్మబద్ధములు కానివి. దివ్యములు. "జన్మ కర్మ చమే దివ్యం" ఇది పరమాత్మకును జీవునకును గల జన్మ రహస్య విషయము. ఈ పరమాత్మకు గల జన్మ పరంపరా రహస్యమును జ్ఞానికిని నన్వయింపనగును. బ్రహ్మసూత్రము లందు (4-4-15) 'ప్రదీప దావేశ స్తథాహి దర్శయతి' యను సూత్ర మునందు కాయ వ్యూహ పద్ధతి వివరింప బడినది. శ్రుతి యందు జ్ఞానికిని యోగికిని, బహుదేహ ధారణము x చెప్పబడినది. లింగ శరీర ముతో గూడి యున్న ఆత్మయే జ్ఞానికి నిర్వచనమగును. ఈ లింగ శరీరమునకే స్పష్టములైన యనేక దేహములందు ప్రవేశము. ఆ దేహ భేదమును బట్టియే లింగ శరీరమునకు భేదవ్యవహారము. కాని స్వతః భేదములేదని చెప్పవలయును. స్వతః భేదమును జెప్పినచో జీవభేద మేర్పడును. దేహాంతరగత విషయమునకు ననుసంధానమును లేక పోవును, కనుక ననేక వర్తికలయందొక్క దీపము ప్రవేశించునట్లు విద్యా యోగ బలమున జ్ఞాని యొక్క లింగ శరీర మొక్కటే అనేక దేహ వ్యాపకత్వమును నేక కాలమందు పొందును x

ఈవిధముగా నీజయద్రథ జీవుని పురాణ వైర నవలలందు నిక్షేపించెను. ఓకే కాలమునందు వెలియోననుగను, జయద్రథుఁగను (నాస్తిక ధూమము) పిశాచసదృశునిగను, నశరీరిగను. పంగలకట్టి, బిల్లలత్రాడుగను(ధూమ రేఖ)అనేక వెలియోననులుగను (అశ్వమేధము) కుమార పిత్ర జయద్రథుఁగను (పులిముగ్గు) వెలియోనను, కబంధుడు

---

x యథా ప్రదీపస్యైకస్యైకస్మిన్ దేశే వర్తమానస్య స్వప్రభయా దేశాన్తరావేశః తథా ఆత్మనో ప్యేక దేహ స్థిత స్యైవ స్వప్రభా రూపేణ చైతన్యేన సర్వశరీరావేశో నానుపపన్నః.' రామానుజ భాష్యం. 'సఏకధా త్రిధా పంచధా' (శ్రుతి)

జయద్రథుఁడుగను (నాగసేనుడు) యా జీవుని లింగశరీరము బహు శరీరవ్యాపకమయ్యెను. ఈ పాత్ర సృజనములోని రహస్యమిది,

అనేక కాలములందీ జీవుడు భిన్న శరీరములందు జొచ్చుట, దుష్ట సిద్ధాంత లక్ష్యమును చేపట్టుట మొదలయినవన్నియు జయవిజయుల యితి వృత్తమునుండి స్వీకరించినట్టివే యగును భగవద్విరోధమనః బూనువాడెట్టివాడై యుండవలెను ? సామాన్యుడయినచో కొండను తగరు తాకి నట్లుండదా ! కనుకనే జయద్రథుని మహాయోగిగను, జ్ఞానిగను, బహుశరీరములందు వ్యాపింపగల శక్తి గలవానిగను, తనకు ప్రజలతో వైరము గాక. కాలముతోను కాలస్వరూపునితోడను వైరముగా నిరూపించుకొనువానిగను సృజించెను, విద్యమునకును శయ్యమునకును సమత్వము ప్రధానముగదా ! ఇది శ్రీ విశ్వనాథ ప్రతిభ. ఇది సృష్టికి ప్రతి సృష్టి. నానన్యతో దర్శనీయము. నభూతో నభవిష్యతి.

జయద్రథ పాత్ర రచనలోని పరమ వివేకమిది,

---

x రత్నప్రభా 'వ్యాఖ్య' నఏకథా త్రిధా పంచధా ఇత్యాది శ్రుత్యా విదుష ఏవా నేకథా భావ ఉక్తః। విద్వాంస్తు నదేహః। నాపి చిన్మాత్రః కిన్తు లింగోపహితాత్మా। నచతస్వలింగభేదంవినా నేత్వం సంభవతి। అతః శ్రుతిబలాత్ ఏకస్యైవా నాదిలింగస్యానేత దేహేషు ప్రవేశేన భేద ఇష్టవ్యః యద్యపి మూలప్రదీపస్య వర్త్యన్త రేషూత్పన్న దీపానాం చాఽత్యన్త భేదోఽస్తి।

లింగస్యతు దేహ భేద కృతోభేదో న స్వతః స్వతో లింగభేదే తదువహిత జీవ భేదాత్ అను సంధానాఽనుపపత్తేః। ఆగన్తుకాఽనేక లింగ సృష్టౌ అసత్కార్యవాదాపాతాచ్చ। తథాపి ప్రదీపత్వజాత్యైక్యేన వ్యక్తి ష్వైక్యాలోపాత్ దృష్టాన్త దార్ష్టాన్తికయో స్సామ్యం ద్రష్టవ్యమ్।

3) కలియుగాది నుండి శాలివాహనుని శకస్థాపనము వఱకు నీ నవలల యందనుస్యూతమైన చరిత్ర కథితమయ్యెను. బహుపురాణ ములందు, విశేషముగా భవిష్యత్పురాణము నందీ చరిత్ర విస్పష్ట ముగా లిఖింపబడెను. కాలమునకును దత్సంబంధమయిన చరిత్రకును ప్రతి నవలయందును సమన్వయమొనర్చెను. ఇట్లనుస్యూతమయిన ధర్మాధర్మ సంఘర్షణము ననుస్యూతమయిన పాత్రతో మిళితమొనర్చి వీని కాయా కాలములందనుస్యూతముగా వచ్చెడు వంశముల పాలన ములను పెనవైచెను. ఇది ముప్పేట త్రాడు. కానిచో త్రివేణి.

బ్రహ్మాండములో నిది పిండాండము. దానికి సృష్టికర్త హరించి దీనికి నిర్మాత కవి వరించి.ఆయన సృష్టిలోని ధర్మాధర్మములు అద్యంత రహితములు, ఈయనవి వానిలోని సూక్ష్మాంశములు. ఆయన ధార్మి కేతరపాత్రలు జగద్విలయ కారకములు ఈయనచే సృజింప బడిన పాత్రల భారతీయ సచ్చరిత్ర విలయ హేతుకములు. ఆయన జగత్తు అపరిచ్ఛిన్నమయిన కాలాధీనము. ఈయన జగత్తు తదపరిచ్ఛిన్నమయిన కాలములో నొకకొంతమేర మానవుడు తాను సమగ్ర కాలస్వరూపు నిగా నెంచుకొనుచు నాడెడి యన్నాటకము కలదో తన్నాటన మెట్లు ముగియునో తెలియని వాడనుకొనెడి కాలముచే నియతము. అట్లు పరిశీలించుచో ఈ సృష్టి కిది ప్రతిసృష్టియే. ప్రతిసృష్టి సృష్టి ననుగ మించుచునే గదా జరుగుచుండును ?

2) ఇతర పాత్ర ప్రకల్పనము :- ఈ గ్రంథమాలలోని పాత్ర లన్నియు శ్రీ విశ్వనాథ ప్రతిభాకద్దము పట్టుట తథ్యము. పాత్రకుంచిన పేళ్లను బట్టి యిది ప్రస్ఫుటమయి తీఱును. వీని నీ క్రింది విధముగా వర్గీకరింపవచ్చును. 1) ఉత్తమ భావమును పాఠకునకు గల్గించుటకై పేరునందే సాహిత్యత్త్వ ప్రకల్పనము చేయుట.2) పాత్ర స్వభావమును బట్టి యిచ్చెడి పేళ్లను నిర్ణయించుకొనుట, 3) గ్రంథ నామములు.

1) గ్రంథములందలి ఇతివృత్తము బహుప్రాచీనము. రచయిత పాఠకులు వాధునికులు, అనగా వర్తమాన ప్రపంచమునకు జెందినవారు. గ్రంథ గౌరవము వర్తమాన సామాజికుని యందు స్థిరత్వము నొందుటకు రచయిత శతథాయత్నము సలిపెను. చారిత్రక పాత్రల విషయమటుంచి, కల్పిత పాత్రలలో వినయ శర్మ (భగవంతుని మీద పగ) గంగాధర శర్మ, (నాస్తిక ధూమము) పరాశర శాస్త్రి, (ధూమ రేఖ) మేధావి భట్టు, నారాయణ భట్టు, (అశ్వమేధము) పినాకి, (హెలీనా) చంద్రశేఖరుడు - (నివేదిత) ఈ పాత్రలు కేవల బ్రాహ్మణపాత్రలు కావని నిరూపింపబడినవి. రాజ్యమునకు సిలుగులు వాటిల్లినప్పుడు తమ తపోవైభవమును, తమ మంత్ర దార్ఢ్యమును, తమ శాస్త్ర విజ్ఞానము వలన గలిగిన వివేకమును రాజ్యమువకు వినియోగింపవలె ననెడి యొక యాశయమును ప్రబోధించును. పరమ పవిత్రుడు, మంగళకరుడు నయిన శంకరుని ఈపాత్రలన్నింటి యందును పాఠకుడు దర్శించి తీరును. అట్లే పురాణకర్తయయిన పారాశర్యుని గన్న వానిని గూడ దర్శింప వీలొసంగినాడు రచయిత.

రాక్షసుడు, (నందోరాజా భవిష్యతి) చాణక్యుడు, చంద్రగుప్తుని స్వప్నము) వరాహమిహిరుడు, (వేదవతి) చారిత్రక పాత్రలే యయ్యును చరిత్రలోని లక్ష్యమునకు విరోధము లేక తన లక్ష్యమయిన బ్రాహ్మణమేధను సర్వసమముగా రాజ్యమునకు బంచి యీవలెననుటను సమర్థించుట యా యా నవలలయందు దర్శింపవచ్చును.

క్షత్రియపాత్రలైన చంద్రశేఖర వర్మ (భగవంతునిమీది పగ) గంధవాహుడు (నాస్తిక ధూమము) గంగాశంతనుడు - (నివేదిత) ఈ పేళ్లలో నెంతటి పావిత్ర్యమునో గమనింతుము, చంద్రశేఖర వర్మ పేరునకు దగినట్లు రక్షకుడు, అనగా శంకరుడు. అతని రక్షణలేకున్నచో శ్రీముఖుడు జలపాతమున భృగుపాతము పొందెడివాడు. గంధవాహుడు

తనకు తగిన వివేకములేకున్నను వాయువువలె నందఱియందు జొచ్చు వాడు. అందఱ యాలోచనను తానే **చేయువాడు.** 'యథావృక్షస్య, సంపుష్పితస్య దూరాద్గంధోవాతి' యను న్యాయమునకు దగినట్టివాడు చిత్ర శిఖండిదివిచిత్ర వ్యక్తిత్వము తాను తెలియకనే యొక పద్మ వ్యూహమున దగుల్కొన్నవాడు. ఆవ్యూహమును భేదించెడి పరాశర శాస్త్రికి సహకార మిచ్చుచునే తన పాత్రకు ప్రాధాన్యము లేకుండ జేసికొనినవాడు. భారతములోని శిఖండి వలెనే యొక మహాకార్య మున కీనవలయందు చిత్రశిఖండి యొక యుపకరణము. అది పాఠకు డూహింపక పోవడు.

అపర భీష్ముడనిపించెడి పాత్ర గంగాశంతనుడు దివ్యధానుష్కుడు. ఆతని ధనుర్బలము, ప్రభువుకడ మాటాడెడి తీరు, సర్వము భీష్ముని తలపింపజేయును.

ఇట్లు ప్రతిపాత్రయు నాకృతియందును, చర్యయందును స్వభావమునందును పావిత్ర్యము, సంప్రదాయము స్ఫుటము చేయ బడును. ఇక స్త్రీ పాత్రలలో చంద్రమతీదేవి, వంకజాబిల్లి, కుముద్వతి అమృతవల్లి, వేదవతి, నివేదిత లట్టి పరమ పవిత్రమూర్తులే.

ఇంకను చంద్రమతీదేవి కాలకౌశికుని యింట చంద్రమతిని దల పించును. వంకజాబిల్లి శివ శిరచ్చంద్రరేఖయే. లేకున్న పరాశరుడు 'నీవు శివుని యందు భద్రాకృతివి గమ్ము' (ధూమరేఖ) అని సందేశ మీయడు, 'కుముద్వతి' (అశ్వమేధము) 'గంజాయివనములోని తులసి మొక్కయే'. ఈమెయే లేకున్నచో బుస్యమిత్రునకు రాజ్యమే లేదు. అమృతవల్లి' విషవల్లి. కనుకనే తన నెచ్చెలి కిచ్చిన మాట నిలబెట్టు కొనినదిని వేదవతి. సోమకాసురుడు ముచ్చిలిన వేదవతియా ? కృత యుగమునందు రావణునిచే నపహరింప యత్నింపబడిన వేదవతియా ? యనితలంతుము. నిజమునకు విశ్వనాథ యామెను వేదాత్మగనే దర్శింప

జేసినాడు. 'నివేదిత' పేరుననే యీ నివేదనార్థమైన విషయ మున్నట్లు మనము భావింతుము. ఒక మహాచార్యుకు సంకేతమైన వివేకానందుని శిష్యురాలు సోదరి 'నివేదిత' నామముగా గూడ నిందు పాఠకునకు స్ఫురింపకపోదు. అది (శ్రీ) విశ్వనాథకు స్ఫురణలో యుండును.

2) పాత్ర స్వభావమును చెప్పుటకు వీలైనట్లుగా నుండెడి పేర్లు. ధూమరేఖలోని ప్రధాన పాత్ర శిశునాగుడు, నాగశబ్దమునుండే యొక 'పగ' కోపము, మనకు దర్శనమిచ్చును. అందులకే కవి శిశునాగుని గుఱించి చెప్పుచు "శిశునాగుడు పెకతలగలవాడు. ఈ మాటకు వాచ్యార్థముగాదు." అని నిర్ణయించెను.

'టిక టిక యను పేరు ఒక నాద్య సంకేతము, దానికి దగినట్లుగనే యీ పాత్ర 'యేకతార'ను బూని సంగీత మాలపించును. (వేదవతి)

"వేదవతి" యను పేరును అట్టిదే. ఆమె వేదారావము విని నంతనే తన శరీర కార్శ్యమును పోగొట్టుకొనగలదు. మ్లేచ్ఛ సంగీతము విన్నంతనే యీమె శరీరము డస్సిపోవును.

వెలియోనను పేర గూడ నట్లు పెట్టబడినదే. అది యొక యాంగ్ల నామమునకు వికృతి యయ్యును, నా యర్థమున గాక యితి వృత్తమునకు అనుకూలమైన యర్థమున ప్రయోగింపబడినది. ఇవి చారిత్రక పాత్రలు. ఆ నామము నట్లే యుంచవలెను. తన ప్రణాళిక కనుకూలముగా నర్థమును గల్పించుట, ఆ పేరునకుగల యర్థముతో తన యితివృత్తమున నిబద్ధించుట యిందలి విశేషాంశములు, చారిత్రక పాత్రలే కానక్కరలేదు. ఇతర పాత్రలనైనను నట్టి దృష్టి తోడనే మలచును. "రామడుగు" ఈతడు-కాలంజర యను సోదెకత్తెకు పెని మిటి. ఈతడు లక్ష ఆంజనేయమంత్రమును జపించి తన భార్యకు బట్టిన జయద్రథ పిశాచమును వదలించెను. "రామడుగు" అనగా నేమి ? రాముని యడుగు లేక పాదము. ఆ పాదము నాశ్రయించునది ఆంజనేయుడు గాక మఱియెవ్వరు ?

8) ఇక గ్రంథ నామమును గుఱించి విచారణము :- ఈ గ్రంథమునకు మఱియొక పేరుంచినచో బాగుండెడిది యని గాని, లేక యీ నామము పేలవముగా నున్నదనిగాని యను విమర్శకు దావున్న చోటు పురాణవైర గ్రంథనామములలో గానము. మొదటి నవల భగవంతుని మీది పగ. ఆ నవలలో నేమి కలదు ? ఏమియును లేదు. ఎంతయో యున్నది. తన ప్రణాళికకు గల బీజమంతయు జయద్రథుని పాత్రద్వారమున ప్రోవు చేసి యాతనికి అర్జునిపై, శ్రీ కృష్ణునిపై గల వైరమును, వ్యక్తివైరముగా గాక పురాణవైరము, భగవద్వైరముగా రూపొందించెను. దానికా పేరుకంటె మరింత సన్నిహితమైన, ఉచితమైన పేరు సూచించుట యన్నది యసాధ్యమను నట్లుగా నా పేరు రూపొందించెను.

నాస్తికము భగవద్వైరమునకు ప్రధానమైన సాధనము. అది వ్యాప్తము గావలెను. సర్వదిశలవ్యాప్తము కాగలది ధూమము. జయద్రథుని చితి ద్వారమున నాధూమమును వ్యాప్తిచేసెను. ఆ నవలకా పేరుంచెను. ధూమమైనది. అది మనుజులయందు ప్రవేశపెట్ట బడవలెను. అప్పుడు గదా దానికి చారితార్థ్యము. ధూమ జ్యోతిస్సలిల మారుతముల సన్నికర్ష స్వరూపమే మేఘము. ఆకసమునుండి అది వర్ష రూపమున వర్షించి సస్యాదుల నుత్పన్నము చేయుటకు హేతువై, తత్పదార్థ స్వీకారము చేసిన దంపతుల కలయిక వలన నేర్పడిన గర్భస్థ శిశువునందు రేఖా మాత్ర ప్రవేశమునకు వీలైన రేఖ అది. కనుక నే యీ నవలకు 'ధూమ రేఖ' యను పేరుంచెను. నందుడు రాజయినచో దుఃఖములు తొలగి యాశా రేఖ భాసించుటను సూచించుటకు 'నందో రాజా భవిష్యతి' యను పేరుంచెను.

పాశ్చాత్యుల దౌష్ట్యము మౌర్యచంద్రగుప్తుని స్వప్నసన్నివేశముచే వ్యక్త మొనర్ప బడుటచే నా నవల యందది ప్రధాన సన్నివేశముగాన 'చంద్రగుప్తుని స్వప్నమను, పేరు నవలకు నుంచెను.

పుష్యమిత్రుని 'అశ్వమేధమునకు ప్రాధాన్యమిచ్చి . వేదమత విహితమైన హింసాకర్మ హింసకాదని నిరూపింపబడిన నవలయందు ప్రధానమైన విషయ మశ్వమేధమగుటచే నానవలకు 'నశ్వమేధ'మనియు వాసుదేవునకు రాజ్యము వచ్చుటకు ప్రధానమైన సన్నివేశము. విష కన్యక చే తత్పూర్వ రాజ సంహారము గాన, తత్సన్నివేశమునకు నితోధిక ప్రాధాన్యము గల్పించి అమృతవల్లి కొక విశిష్టమైన స్థానము కల్పించి యా త్యాగశీలి పేరు నానవల కుంచెను.
తుచ్ఛ ప్రక్రియ లెట్లుండునో, ఆ ప్రక్రియల పర్యవసాన మేమియో తెలియుటకు వీలైన నవల 'పులిముగ్గు'. నవలయంతయును దీని మీదనే నడచి యీ నవల యా పేరనే వెలయుటకు హేతువయ్యెను. వేద వేదాంగవేత్త బౌద్ధమునకు లొంగిన విషయము ప్రాధాన్యము కలిగి యుండుటచే దానికి 'నాగసేనుడు.' భారతీయ ధర్మరక్షణయ ప్రధానక ముగా నొనర్చిన నవలయయి దానికి నెలవైన 'హెలీనా' పేరనే యా నవలను రూపొందించెను. విక్రమార్కుడు శకకర్త యయి 'ఖగోళ వేధశాల' నిర్మాణమును చేసిన యితివృత్తమునకు మూలము. సర్వ గ్రహాధిపతియైన పరమేశ్వరుని గొలిచిన వేదాత్మ, ఆమె పేరనే యీ నవల రూపొందింపబడినది. వైదేశికులైనను, భారతీయ ధర్మమందు గాఢరతి గల్గి యా ధర్మమును మిక్కిలిగా నభివృద్ధి గావించుట, తామీ దేశమునే కొలుచుచు, నిటవారినే పెండ్లియాడి వారి నేతద్ధర్మమునే కొనసాగింప జేయువారు నిశ్చయముగా యోగులే. అట్టి యోగిని చరితమే 'నివేదిత' ఇట్లు ప్రతిపేరు నందును నొక వైశిష్ట్యము, లోకోత్తరమైన ప్రణాళిక, తత్ప్రణాళికా నిర్వహణములోని నేర్పు మనకు గానవచ్చును. ఇది రచయిత ప్రతిభ ప్రకాశించెడి తీరు. ఇది కావ్యాత్మ సిద్ధికి దోహదమొనర్చిన ప్రణాళిక.

ఇట్లు తన ప్రణాళిక చేతను, నూహాశాలిత చేతను చారిత్రకేతి వృత్తమున కొక రససిద్ధిని గల్పించి కావ్యమార్గమున సిద్ధాంతిని ప్రసూ

ణింప జేసి లోకోత్తరమైన సాహిత్య సృష్టిని గావించెను. కనుకనే తిక్కనవలె నీయన యమహోదాత్తమనీషి. ఆయన వలె తను గావించిన సృష్టి తక్కొరుల చేత గాదను నట్లు ప్రకాశించినవాడు. నన్నయవలె రమ్యకథా కథనాభిరాముడు. ఎఱ్ఱన వలె 'శంభుదాసు డయ్యును గోవిందగుణాదర సంభృత సౌమనస్యధన్యుడు. ఈ దృష్టిచే నాంధ్ర సాహిత్యమున నీ పురాణ వైర గ్రంథమాల స్థాన మసదృశము.

ఇతివృత్త స్వీకరణమునందును, ప్రక్రియా మార్గమునందును, ఊహాపోహాల యందును, పాత్రచిత్రణాద్యనేక విషయాభివ్యాప్తి యందును, సహృదయ ప్రరోచనాప్రకల్పన యందును, నిర్మాణ వైఖరి యందును, ఉత్తమ సంప్రదాయ పరిపోషకత యందును, నీ సాహిత్యమున కిదియే సాటి యనునట్లుగా నీ గ్రంథమాలను నిర్వహించి నద్యతనాంధ్ర సాహిత్యమున నీ గ్రంథమాల కొక వైశిష్ట్యమును గూర్చి పెట్టి దిగంతయశో విశ్రాంతు డయ్యెను. ఈ కారణమున శ్రీ విశ్వనాథ నన్నయాది కవులవలె ప్రాతః స్మరణీయు డగుచున్నాడు.

# 8. శ్రీ విశ్వనాథ వ్యక్తిత్వము - సందేశము

మహాకవు లయిన వారి వ్యక్తిత్వము సర్వజన స్పృహణీయముగా నుండవలయును. సందేశము చిరస్మరణీయముగా నుండవలెను.

కవియై, మహాకవియై, ద్రష్టయైనవాని రచనము మిగిలిన కవి శబ్దవాచ్యుల రచనల స్వరూప స్వభావ పరిధిలో సమసించుట యసాధ్యము. సమసించుటకు, నట్లుగాకుండుటకు వారి వారి వ్యక్తిత్వముల లోని వైవిధ్యము కొంతవఱకు హేతువగును. మహాకవియైన వాని కావ్యమున నుపదేశముగూడ నొక విశిష్టలక్షణమై యుండుట తథ్యము. లోకము మహనీయుని నుండి యత్కించిత్ప్రయోజనాకాంక్ష కల్గి యుండును. ఆతని వ్యక్తిత్వమున కంజలించుట, ఆతని సందేశమును గ్రహించుట ప్రజకభిమతమైన విషయము. కనుకనే ఎంత కవితా కళాసురభిళమైన కావ్యమైనను, సందేశరహితమైనచో దానికి శాశ్వత ప్రతిప్రత్తి యుండదు. కేవల సందేశాత్మకమై కావ్య ప్రమాణమును నొందకున్నచో దానికి కావ్య గౌరవము లేదు.

భామహుడు చతుర్వర్గ వ్యుత్పత్తియే కావ్య ప్రయోజనముగా పేర్కొనెను.[1] ఆనందముతో ధర్మోపదేశమును నయితము భరతాదులు కావ్య ప్రయోజనముగా నంగీకరించిరి.[2] సారస్వత విమర్శలో ప్రమాణవాదులయిన ఆంగ్లేయులు నయితము కావ్యమున

---

1. ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కళాసుచ।
   కరోతి కీర్తిం ప్రీతించ సాధు కావ్య నిషేవణం॥
2. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతర క్షతయే।
   సద్యః పర నిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశ యుజే।

కుపదేశము సముచితమయిన స్థానముగా నంగీకరింపవలయునని కంఠోక్తిగా జెప్పిరి.[3] ఉత్తమ పురుష చరిత్ర నిబద్ధముగాని కావ్యము పఠనమునకు నిషేధమని ప్రతాపరుద్రీయమున చెప్పబడుటచే నుపదేశప్రాధాన్యమెట్టిదియో మనము గ్రహింపవచ్చును.[4] కావ్యమునకు ప్రధాన ప్రయోజనము రసానందజనకత్వముగా పలువురాలంకారికులంగీకరించినను నది యుపదేశసహితమైననే దానికి పెద్దపీట. అది బంగరువునకు దావి యబ్బుట వంటిది. ఈ దృష్టితో శ్రీవిశ్వనాథ పురాణేతర గ్రంథములను గొంతపరిశీలింతము.

'నానృషిః కురుతే కావ్యమ్' అను నాభాణకము భారతీయ సాహిత్య ప్రథనమునకు మూలము. ఈ సాహిత్యములోని యాదిమ గ్రంథములు రామాయణ, మహాభారతములు. ఏతద్గ్రంథకర్తల వ్యక్తిత్వము మనకువలె నేకోన్ముఖముకాదు. పరమేశ్వరతత్త్వ ప్రతిపాదనముతో గూడిన లౌకిక విషయవివరణమే వారి వ్యక్తిత్వము. వసుధైక కుటుంబ సంక్షేమమే వారు లోకమున కొసంగెడి సందేశము. వారు త్రికాలావచ్ఛిన్న జ్యోతిస్స్వరూపులు. అగతానాగతవేదులు. 'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోను ధావతి' యను వాక్యమున కెనయైన వారు. వారి మనస్సు వెన్న. మాటమిన్న. తపము, దానము, దమము, శీలము వారివ్యక్తిత్వమునకు వన్నె. వారు సృజించిన సాహిత్యము విశ్వశ్రేయోదాయకము. శాశ్వతానందప్రదము. 'ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్' అను వాక్యము రామాయణ కావ్య పఠన ప్రయోజనమును సూచించును. 'రామాదివ వర్తితవ్యమ్,

---

3. ‘The poets are unacknowledged legislators of the world.’
"The purpose of the poem is to teach and delight."

4. 'యత్ర ననుత్తమ పురుష చరితం న నిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ తద్విషయాచ స్మృతిః[1] కావ్యాలాపాంశ్చ వర్జయేత్'

నరావణాది వత్' అనునది రామాయణ మహాకావ్యమునందలి ప్రధాన సందేశము.

మహాభారతేతిహాసమునకు సృష్టికర్త వ్యాసమునీంద్రుడు. వేద విభాగ మొనర్చి, అష్టాదశపురాణ సంచయమును శిష్యుల కుపదేశించి వారిని దేశమునందభివ్యాప్త మొనర్చిన సంయమివరుడు, వేద సంస్కృతిని, నితరానేకానేక ధర్మ రహస్యములను భారతమునందు నిక్షేపించి భవిష్యజ్జన సామాన్యమునకు నిర్దేశకుడయ్యెను.

ఇట్టివారి వ్యక్తిత్వము మేరు సదృశము, ఉపదేశము త్రికాలావచ్ఛిన్నము. పరమేశ్వరతత్త్వమే తామయి, తత్తత్త్వ ప్రతిపాదనమునకు మాత్రమే సాహిత్యమును సృజించి లౌకికమైన జీవనమును సుఖసంధాయకముగ నొనర్చుకొనెడు విధానమును ధర్మబద్ధముగా నిరూపించి, నిరతిశయానంద సంధాయకముగ సాహిత్య పరమార్థమును నిర్దేశించి జాతిని జాగృతమొనర్చు ఋషికల్పుల వ్యక్తిత్వము జగత్సంభావ్యమై, జగత్సేవ్యమై, జగద్వ్యాప్తమై తేజోమయమై యుండును.

సంస్కృతమహాకవులందిట్టి వారింకను లేకపోలేదు. మహాకవి కాళిదాసు 'మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్' అని ప్రకటించుకొనిన వినీతుడు. ఇట్టి వ్యక్తిని తెలుగు సారస్వతములో నొక్క ఎఱ్ఱాప్రెగడను గాంతుము. కవిత్వమునందు మహోన్నత సంప్రదాయమును పాటించిన మేటి మహాకవి కాళిదాసు బాణుడు మానవుని మనసుకును, మనసుకును సౌహార్దసేతువును నిర్మించినసుకవి. మాఘు, భారవ్యాదులు పరంపరాగత సంస్కృతిని మనకొసంగి యుప్పదీఱిచిన యశఃకాయులు. వారు కవిత్వకుధరములకు శిఖరముల వంటివారు. ఆ సంస్కృతికి వారసులై యథాతథముగ తెలుగు జాతికి పునరంకితము చేయుటకయి యవతరించిన పుణ్యమూర్తులు భారతకవులు. ఋషితుల్యులై, మహాయజన శీలురై, కవిత్వ నూత్న శిల్పాచార్యులై

కవిత్రయము వారు ప్రథిత యశస్కులై రి, భారతీయ సంస్కృతి నిక్షే పమును కడు వపేక్షితో, నౌదార్యముతో, నయోచితముగా తమ వారసుల కందించి పూర్వస్మృతిని విస్మృతిగాకుండ నొనర్చిన మహనీయులు నన్నయాదులు.

ఏతత్సంస్కృతికి వారసపుత్రునిగ భావించుకొన్న శ్రీ విశ్వనాథ, యూరు కే సంస్కృతిని గురించి గొప్పలు చెప్పుటగాక దానినుపాసించి, సేవించి, ధరించి, తత్ఫల భోక్తయై, యాభోక్తృత్వమున కందఱు సర్వులుగా నొనర్ప యత్నించిన యుదారుడు. ఇది యాయన జీవనిష్టమైన వ్యక్తిత్వము. ఇచట జీవనిష్టమనగా తజ్జీవుని వేదనయే

కాని యీ రచయిత వ రమానమందున్న మహామనీషి బహుహాయనము లాయన సాహిత్య సంస్కృతి నుపాసించి తరించిన యశస్వి. బహుగ్రంథ పరిశీలనము. జన్మాంతర ప్రతిభ, విస్తృత పర్యాటము లాయన వ్యక్తిత్వము నిరూపించుటకు బనికివచ్చెడు మూల ద్రవ్యములు. ఆయన సందేశమును గ్రహించుటకును నివి హేతువులు.

"అవిచ్ఛిన్న సంప్రదాయమూర్తి శ్రీ విశ్వనాథ" ఇది యాయన వ్యక్తిత్వమును బహిర్గతమొనర్చుటకు బ్రకృష్టమైన వాక్యము, జట్టు కట్టు బొట్టు - ఇవి సర్వాత్మనా ఆయనను భారతీయునిగ నిరూపించును. శ్రీమద్రామాయణ కల్పవృక్షమును రచింపుచు 'మరల నిదేల రామాయణం బను వారికి ప్రతిరోజును తినెడి యన్నమే నుమరల తినుట యేల"? అని ప్రశ్నించునే సమాధానమిచ్చిన గడుసువాడు. 'తన జీవుని వేదన తనది' యని సాత్త్వికమయిన యుత్తరము. అహంకార సాత్త్విక ప్రకృతులు రెండును శ్రీ విశ్వనాథ వ్యక్తిత్వమునకు రెండు ముఖములు. లేనిచో నాయన 'అలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభార దోహల బ్రాహ్మీమయ మూర్తి' కాజాలడు. ఇది యాయన వ్యక్తిత్వములోని పరమ సూక్ష్మమైన రహస్యము.

అనితర సాధారణమయిన లౌకిక ప్రజ్ఞ, సంప్రదాయ ప్రవణత, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యముల నిశిత పరిశీలన, జన్మాంతరగతమైన ప్రతిభాదులు నీయనను శిష్టులలో విశిష్టునిగ నొనర్చినవి. అంతటితో నది యాగినచో శ్రీ విశ్వనాథను గుఱించి చెప్పవలసిన దేమియు నుండదు. ఆశిష్టునకొక విశిష్ట లక్ష్యమేర్పడినది. 'ఒక జాతి జాతీయతకు దాని సంప్రదాయము పునాది' యను వాక్య మాయనకు ప్రాతఃస్మరణీయ మయ్యెను. తన ప్రతిభ భగవద్దత్తమైనది. తన విద్యాకర్మలు, ప్రజ్ఞలు పూర్వ పూర్వ సంజనితములు. బహు పూర్వజన్మల నుండి తానొక యుత్తమ సంస్కృతిని వహించి వచ్చుచున్న క్రామిక జీవి. అట్టి సంస్కృతి జాతి యొక్క యభ్యుదయమునకు జీవగఱ్ఱ. ఈ సంస్కృతి భారతీయమా, వైదేశికమా ! యను వివాదమునకు గాక విశ్వమానవ కల్యాణమునకు, వసుధైక కుటుంబమునకు సంబంధించినదిగా భావింప వలసియున్నది. జాతి నిర్వీర్యమై, నిస్తేజమై, పతన ప్రమాదము నొందకుండ, సువిశాలమైన, విశ్వజనీనమయిన ధర్మస్రవంతిని యవిచ్ఛిన్నముగా ప్రవహింపజేయుటయే యుత్తమ పరిష్కారముగా విశ్వసించి సాహిత్యమును తన్ముఖమున బయనింపజేసినవాడు. ఆయన రచనము లందెచ్చట గాంచినను నాలక్ష్యమును ప్రదర్శించుట కాయన పడిన తపన సుస్పష్టము కాకపోదు.

'కాల మొక్కరీతి గడువబోదు' అనునానుడి నాశ్రయించియే కాలచంక్రమణము జరుగుచున్నది. మన యదృష్టవశమున శ్రీ విశ్వనాథ యిట్టి విపత్కరమయిన పరిస్థితులందు జనించినాడు. కాల ప్రభావమునకు ఢుల్లిన యాకువలె గాక, కోమలపల్లవములె కాలమునే ఆశ్రయించి దాని ప్రభావమునకు లొంగినట్లే లొంగి, దానికనుకూల మయిన మార్గమున తన కార్యమును సాధింపనెంచిన జాణయయ్యెను. తనను నమ్ముకొన్న ప్రజలకు దాను తరణోపాయమును జూపింపవలెను

తాను విశ్వసించిన ధర్మమును వారి కందింప వలెను. ఇది భారతీయతా చిహ్న చిహ్నితమగుటచేగాక విశ్వమానవ సంస్కృతికిది మూలమును ప్రమాణ బుద్ధితో నభివ్యాప్తమొనర్ప వలయును. తా నాంధ్రుడు. భారతీయుడు - అదిగాక విశ్వమానవునిగా ప్రపంచ పౌరసత్వమును పొంది, విరాడ్రూపియై తత్త్వరమరహస్య మనదగిన సంస్కృతి పరమార్థమును ప్రజ కందించుటయే తనవ్యక్తిత్వముగా భావింప జేసికొనిన చరితార్థుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

ఇట్టి నియతైక దృక్పథము జీవితాంతము వరకు గలిగి, జీవిత కాలమంతయు తాను చేసిన రచనలయందు దానిని నిరూపించిన నిర్దేశకులు తెలుగు సాహిత్యరంగమున బహ్వల్పము, శ్రీ విశ్వనాథ యట్టిడు. ఆయన అంతర్దృష్టి, ప్రాక్ప్రతీచీ సంస్కృతుల నామూలచూడముగ నాపోశనము పట్టినవాడు. తరతమ భేదము లెఱిఁగిన జ్ఞాని. వర్తమాన మందభివ్యాప్తమైన భౌతిక సౌఖ్యలోలుపతను పసికట్టిన మేధావి. ఇది యిట్లే కొనసాగినచో ఎచ్చటికి నేగు నాత్మచక్షువుతో దర్శించిన ద్రష్ట.

ఇది పురాణవైర గ్రంథమాలయందెట్లు వ్యక్తమయ్యెనో గమనింతము. పరంపరాగతమయిన సంస్కృతి విస్మృతి యయి, యల్ప బుద్ధులు, నల్పసారులు నగు వ్యక్తులచేత నసత్యగోపురపు టధిష్ఠానములందు ప్రమగ్గుచున్న సత్యమును పెల్లగించి సత్యమను నధిష్టానముపై పునర్నిర్మితము గాబడిన గోపురముతో 'నీపురాణవైర గ్రంథమాల'ను బోల్ప వచ్చును. దీనికి నిర్మాత శ్రీ విశ్వనాథ. ఇట్టి సాహసమునకు బూను కొన్న మహా మహులెవ్వరును నాంధ్ర సాహిత్య చరిత్రలో నాటి నుండి నేటి దనుక ముమ్మాటికి లేరనియే చెప్పవలెను. ఈ సాహసమే యీయన వ్యక్తిత్వము.

ఇంకను నీయన వ్యక్తిత్వము ప్రస్ఫుటమగుటకు నీ క్రింది వాని నాశ్రయింప వచ్చును, అవి-

1) గ్రంథమాల కుంచిన శీర్షిక, 2) పురాణవైరనవలలకు బెట్టిన పేర్లు, 3) ఇందు సృజింపబడిన పాత్రలు, 4) సంభాషణలు.

క్రమమున నివి విశదీకరింపబడుచున్నవి.

1) ఈ గ్రంథమాల యంతటికిని శీర్షిక 'పురాణవైర గ్రంథమాల'. ఈ శీర్షికయే కడుచోద్యమయినది. పురాణవైర మనగా నేమి? వెంటనే బుద్ధికి భాసింపని సమాధానమున కనువైన ప్రశ్న యిది. "పాతపగ" యని తెలుగున తేటగా జెప్పవచ్చును. "పాత" యయినచో 'నెంతటి పాత?' ఇట్లాలోచించినచో నిది తేలదు సప్తమీ తత్పురుష చేయవలయును. పురాణమందలి వైరమని యపుడు తోచును ప్రధానముగా నేటి ప్రజలు వేద వేదాంత పురాణేతిహాస ములందు బూనిన వైరమని యొక యర్థము. ఇది బాహ్యదృష్టికి గోచరించునది. ఈ గ్రంథమాలలోని పీఠికలు గమనించుచో పురాణ ములలోని చరిత్రాంశములకు నాంగ్లేయులు తమ బుద్ధి వైభవముచే గావించిన వికృత కల్పనలు, వాని వలన మన ప్రాచీన చరిత్రకు వారి వలన గలిగిన యొకానొక మహానర్థమందు భాసించును. మొదటిది మన సంస్కృతి పయి పగ, రెండవది మన ప్రాచీన చరిత్ర పయి వైరము. వీనివలన మనము నేడెదుర్కొనుచున్న క్లేశ పరంపరలు-వీని వివరణము. ఇట్లాలోచింపవలయును.

మరియొక విశేషము, పురాణుడెవ్వడు? భగవంతుడు. ఆతని కంటె పురాతనుడు మరి యెవ్వరు? మరియొకడుండుటకు వీలులేదు. ఆతనిపై పగ. అనగా భగవద్విరోధము. జీవుడు, జన్మలు, కర్మపరంపర, సుఖ దుఃఖములు, పాపపుణ్యములు, జనన మరణ క్లేశములు. తన్నివారణమునకు భగవత్సేవ, అనన్యశరణ్యము. వీని ద్వారమున భగవత్ప్రాప్తి - ఇది ప్రాచీనము నుండి యీ దేశమున నెలకొనిన యొక ప్రావాహికమైన యూహ. ఈ యూహ పద్ధతికి విఘాతము

కల్గించుటయే నాస్తికత. ప్రబలిన యీ నాస్తికత నాధారముగా గొని దానికి ప్రధానమైన హేతువును, నా హేతుచ్ఛేదనమునకు భేషజమును తన ప్రజకెఱుక పఱచుటలో నింత మర్మమును బెట్టెను. అనగా ధ్వని మార్గము ననుసరించెనని చెప్పవచ్చును. ఆయన ధిషణాహంకార వ్యక్తిత్వము 'రామాయణము' నందే కాదు. పురాణవైరమందును ప్రతి భాసించినది. వైరానుబంధముతో కార్యము సాధించుకొనుట యన నిట్టిది. పురాణవైర గ్రంథమాల శీర్షికలోని రహస్యమిది.

2) పురాణవైర గ్రంథముల శీర్షిక యెట్టిదియో "భగవంతుని మీది పగ" యను మొదటి నవల కుంచిన పేరును నట్టిదియే యగును. ఇదియేమి పేరు? యని పాఠకుని కన్పించుట విడ్డూరము కాదు. బహు గ్రంథ నిర్మాతయై, లబ్ధప్రతిష్ఠుడై, సంప్రదాయ భీష్ముడైన శ్రీ విశ్వనాథ వ్రాసెడి నవల లిట్టివియా? యని సనాతనులు, ఇట్టి వాడు నయితమీ మార్గమునే వలచినాడని యధునాతనులు భావింతురు. ఒకరికి సంతాపము, ఒకరికి సంతోషము. ఇందు రచయిత భావమేమి? అట్లు కావలెననియే యాయన సంకల్పము. అభిమాన, వ్యతిరేక భావ భేదములేక యెల్లరు తనకు పాఠకులు కావలయును, తన గ్రంథమే యొక్కరికో వర్గమునకో, పక్షమునకో సంబంధించినట్లుగా నిర్మింప దలంచలేదు. ఇంతకు బూర్వమున్న మహాకవి శబ్దవాచ్యులు నయితము తమ గ్రంథములకిట్టి నామముల నుంచిన వారుగారు, కనుక నవియే యొక వర్గమువారికో చెందినవను భావముతో గ్రంథపఠనమునకే వీలొసంగదు. ఇది యట్లుగాక యున్నది. ఇందలి విషయ మెద్దియైన గానిండు. గ్రంథము చదువ నాశించుట యొక ప్రయోజనము. చదువుటకు వీలుగా నున్న సులభప్రక్రియలో నవతరింపచేయుట రెండవ ప్రయోజనము.

ఇది భగవంతుని మీది పగ, గూఢముగా నున్న పురాణ శబ్ద

మునకు వికృతి యిది. ఇది యాధ్యాత్మిక ప్రవచనముగాని, వేదాంతోపన్యాసముగాని కాదు. ప్రాచీనమయిన వేద, వేదాంత, పురాణేతిహాసముల పయి పగతో కలియుగాదినుండి యనుస్యూతముగా బురాణములు ప్రసంగించిన భ్రాంత చరిత్రపయి పగ మిళిత మయినది. ఇది కించిదుద్గాఢము, కించిత్ప్రకాశము నయిన చంద్రుని లక్షించుచున్నది, నవల బహిరాకృతి అన్ని నవలల వంటిది కాదు. అన్ని నవలల వలె చదివి వదలివేయ వలసినదికాదు. మననము చేయవలసినది. దానికయి యీ కథ యాకర్షణ, ఆకర్షణలో గడుసుతనము. అది యీ రచయితకు వెన్నతో బెట్టిన విద్య. అది యీయన వ్యక్తిత్వము.

అది ఎట్లుండెననగా నాకానొక మహారహస్యమును ప్రజాక్షేమము నభిలషించి అనాయాసముగా నలవోకగా, దానినందుకొనుట కుచితమయిన ప్రక్రియను స్వీకరించిన మహామేధావి వ్యక్తిత్వమట్లుండెను. సర్వమానవులకు అస్థానాస్థాన వర్ణతల ప్రసక్తి లేక మోక్షోపాయ ప్రదీపిక యగు శ్రీమదష్టాక్షరీ మహామంత్రమును దేవాయతన సింహద్వార గోపుర పురోభాగమున నిల్చి యుపదేశించిన భగవద్రామానుజుని వ్యక్తిత్వమెట్టిది ?

మిగిలిన గ్రంథములందు వేని పేరు వానికున్నను, ప్రధానమయిన శీర్షిక మాత్ర మిదియే. ఇందు చివరి నవల పేరు నివేదిత. ఇదియొక స్త్రీ పేరు. లేక దీనిని క్రియాపదముగ నెంచినచో 'నివేదింపబడినది' యను నర్థమునకు నాకరమగును. ఈ పగ అన్ని వైరుద్ధ్యభావ కోణముల నుండి ప్రసారము చేయబడినది. నివేదింపబడినదని తాత్పర్యము. ఇట్టి యూహ చేయుట కాదనిన గ్రంథములే ప్రమాణము

3) ఇందు సృజింపబడిన పాత్రలు :- ఒక దీర్ఘ ప్రణాళికను రచించుకొని దానిని విశిష్టమార్గమున పయనము చేయించుట శ్రీ విశ్వనాథ ప్రత్యేకత. ప్రణాళికారచనములేనిదే గ్రంథరచనము లేదు, దానికి

తానొనర్చెడి యూహ లోకోత్తరము. ఆయూహ శ్రీ విశ్వనాథయే చేయును, ఇంకొకని కది యసాధ్య మనునట్లుగా నాయూహను ప్రతిపాదించును. ఇది శ్రీ విశ్వనాథ విశిష్ట వ్యక్తిత్వమున కుదాహరణ మగుచున్నది.

లోకోత్తరమైన వ్యక్తిత్వముచే ప్రకాశించెడి యొకానొక మహామహుడుగాని జయద్రథుని పాత్రను తీర్చిదిద్ద లేదనుటకు నీలుగా మలచెను. ఇది యాయన ప్రజ్ఞాశక్తి యందు వ్యక్తమయిన వ్యక్తిత్వము.

రచయిత ప్రత్యేకముగా నీ నవలలందు శతాధికమయిన పాత్రలను రూపొందించెను. పాత్రలను రూపొందించుటలోను, ఆ పాత్రలకు బెట్టెడి పేళ్ల యందును గూడ నీయన వ్యక్తిత్వము సుసంపన్న మగును.

నవల యందు రచయిత తానుగా ప్రవేశించియు, పాత్రల ముఖమునను తన భావములను ప్రకటించుటలో దోసగు లేదని విమర్శ లంగీకరింతురు. అందును నొక నియత దృక్పథముతో నిర్మించెడి యట్టి తావులందు పాత్రల ద్వారమున రచయిత భావము వ్యక్తీకరింప బడకుండుట న్యాయము కాదు.

రచయిత యీ గ్రంథములందలి పాత్రల నన్నింటిని ద్విధా విభక్తము గావించెను. అవి 1) ధర్మ బద్ధమై, భారతీయ సంస్కృతిని విశ్వమానవ సంస్కృతిగా నిబంధించు పాత్రలు, 2) ధర్మేతరమై, ఏ తత్సంస్కృతికిని, విశ్వమానవ కల్యాణమునకును విఘాతము కల్గించు పాత్రలు, ఈ రెండింటికిని రచయితయే సృష్టికర్త.

1) జయద్రథుడు :- ఈ పాత్ర ప్రకల్పనముననే శ్రీ విశ్వనాథ విశిష్ట వ్యక్తిత్వము. ఈతని కొక పేరుగాదు, ఒక కాలముకాదు.
ఈతనిని కాలస్వరూపునిగా నొనర్చెను. విదేశములందును స్వదేశమునందును ప్రభవింపజేసెను. రచయిత కెదిరి పక్షమున నిల్చెడి

వారి కీతనిని నాయకునిగా నొనర్చెను. వారి ప్రశ్నలను తానే వైచును. ఇది పాలకపక్షమువారు ప్రతిపక్షము వారు వేయవలసిన ప్రశ్నలను వైచుట వంటిది. భగవద్గీత యందిద్దరు ప్రధాన పాత్రధారులు. ఒకరు నరుడు. రెండవ వాడు నారాయణుడు. ప్రజాప్రతినిధి నరుడు. ధర్మ పక్షపాతి నారాయణుడు. తానేదియాచరించునో యదియే పరమధర్మమను వాడు నరుడు. కాదనువాడు నారాయణుడు. శ్రీకృష్ణు డతని మార్గము ననే కొంతదూరము పయనించి యాతనికి ధర్మాధర్మ వివేకము కల్గించి ధర్మ మార్గప్రవిష్టునిగా నొనర్చెను. శ్రీ విశ్వనాథ మార్గము నడియే.

జయద్రథ పాత్రను నిర్మించి దేశమందెల్లెడల చెలరేగిన నాస్తికత్వము నాతనియందు నిక్షేపించి సర్వనాస్తిక వాదుల పక్షమునుండి భగవత్తత్త్వముపై విమర్శను విజృంభింపజేసెను. భగవంతుని మీద పగలో జయద్రథుడు - "సైంధవుడు ద్రౌపదిని వాంఛించుటలో దప్పేమి? అది స్త్రీపురుష సహజమైన కామము. మీరు వావి వరుసలందురు... ..."

నాస్తిక ధూమములో జయద్రథుడు-'గిరివ్రజములో నున్న గంగాధరశర్మ చాతుర్వర్ణ్యమునకు వ్యాఖ్యానము చేసినాడు. వాని వ్యాఖ్యానమును నీఱుకారింతును.' నేటివారు వర్ణము లక్కరలేదు' వావి వరుసలతో బనిలేదు. సర్వము సమానమని చెప్పుదురుగదా! దాని కనుకూలమైన వాక్యములను జయద్రథుని నోట బలికించెను. ధూమరేఖలో "దేవుడే లేడు" అని చెప్పుచు జయద్రథుడు-'ఆ శివుడును కృష్ణుడును వేఱు వేఱను కొనునంత యవివేకము నాకు లేదు. వారు నన్ను మించిన వారు కాదు. వారెంతటివారో నేనంతటివాడను. వారు

కాలస్వరూపులు. నేను కాలస్వరూపుడను, వారు సర్వజ్ఞులు. నేను సర్వజ్ఞుడను.' ఇట్లీ పాత్రయందు తాను వినుచున్న నాస్తిక భావపరం పరను ప్రస్ఫుటీకరించెను.

2) ఇందు ధర్మేతరమైన పాత్రవలె ధర్మ బద్ధమయిన పాత్ర నొక్కటిగా మలచలేదు. పండ్రెండు నవలలందును నాయకులు భిన్నులు. ఇందు కొన్ని నవలలందు జయద్రథున కనకూలమైన నాయకులు లేకపోలేదు. (ధూమరేఖ - శిశునాగుడు. నందోరాజా భవిష్యతి - నందుడు. చంద్రగుప్తుని స్వప్నము - చంద్రగుప్తుడు, పులిముగ్గు - శ్రీముఖుడు, నాగసేనుడు - గౌతమీపుత్ర శాతకర్ణి) వీరందఱు వైదికేతరమతమును బోషించి రాజ్యము నేలినవారే. దీనికి గారణమును మన మిట్లూహింప వచ్చును.

1) ఒకే పాత్రచే నటింపించినచో జారిత్రకాంశములకు విరోధ మగుట, 2) పాత్రలకంటె భావ ప్రాధాన్యము నవలయందు స్థాపింప నగుట. 3) చారిత్రకమున ధర్మవిరోధమునకు సమన్వయము చేయ వలసివచ్చుట.

కనుక మొదటి నవలలో శ్రీముఖుడు, రెండవ నవలలో ప్రద్యోతనుడు నాయకులై ధర్మ రక్షణము గావించిరి. అట్లే పుష్యమిత్రుడు (6వ నవల) వాసుదేవుడు (7వ నవల) సముద్రగుప్తుడు, (10) విక్రమార్కుడు (11) శాలివాహనుడు (12) నాయకులై ధర్మాభివృద్ధిని గావించిరి.

దీనిలో రచయిత లక్ష్యమొకటియే, ఎల్లప్పుడు ధర్మమునకు నధర్మమునకు సంఘర్షణము- ధర్మమొకప్పుడు తగ్గి యధర్మము

విజృంభించును. అధర్మము తగ్గి ధర్మమును విజృంభింపజేయును. ఇవి దేవాసుర ప్రకృతులు. అసుర ప్రకృతి నశగించి దైవీ ప్రకృతిని పెంపొందింప జేసికొనవలయుననియే శ్రీ విశ్వనాథ సందేశము.

౪) శివకేశవాద్వైతమును పాటించినను శ్రీనాథుని వలె విశ్వనాథ కీశ్వరుని యందే కొంత మొగ్గు. ధూమరేఖలో (౬) పరాశర శాస్త్రి వంకజాబిల్లితో శివధ్యానము జ్ఞానహేతువుగా నిర్ణయించును.

'నీవు భగవంతుని ధ్యానించుచుండుము, కృష్ణ ధ్యానము చేయకుము. శివధ్యానము చేయుము ... శివుడు లయ హేతువు. లయమనగా జ్ఞానము. నీవు శివునియందు భద్రాకృతినిగమ్ము. చంద్రగుప్తుని స్వప్నములో (5) చాణక్యుని శిష్యులు శివవేషమును ధరింతురు. మిగిలిన యవతారములన్నింటికి నొక్కొక్క వాక్యమును జెప్పి శివవేషవర్ణనమిట్లు చేయును. "తలమీద నింత జడ నమర్చి దానిపై నొక తెల్లని యాకు చందురుని రేకగా బొదివి జడలలో కనుపించకుండ నొక జలకలశమును బెట్టి .... .... శివుడు నాట్యమాడుచుండగా జటలలోని గంగ తొణికిస లాడిందన్నమాట." ఇట్లే

నాగసేనుడన్న నవలలో కంజగాల గ్రామ వర్ణనము (౯)

"పూర్వమది యొక గొప్ప పుణ్యక్షేత్రమనియు, నావీధియొక్క దక్షిణపు చివర నొక శివాలయముండెడిదనియు, గొప్ప యుత్సవములు జరిగెడివనియు ... తొలుతటి దినములలో నది గ్రామమే కాదు- శివక్షేత్రము మాత్రమే."

ఈయన విశ్వనాథుడు కదా ! కనుకనే ఈ శివపారమ్యము. పాత్రల కుంచెడి పేళ్ల యందును దీనిని గమనింపవచ్చును. ఒక పవిత్ర

మైన భావమును పాఠకున కందించుటయే యాపాత్రలకుంచెడి పేళ్ల నావరించియున్న మర్మము. ఇది శ్రీ విశ్వనాథ ప్రత్యేకత. దిఙ్మాత్రముగా గొన్ని పాత్రల పేళ్లు.

శ్రీముఖుడు, రోమపాదుడు, విజయుడు, నాగార్జునుడు, నీల, కాళింది, జాహ్నవి, మహేశ్వరి, తులసి, గంధవాహుడు, చంద్రమతీదేవి, పరాశరశాస్త్రి, చిత్ర శిఖండి, గంగాధరశర్మ, నారాయణభట్టు, మేధావి భట్టు, అమృతవల్లి, శ్రీవత్సలాంఛనుడు, కాలంజరి, రామడుగు. చాముండి, పినాకి, రోహిణి, దుష్యంతుడు, వేదవతి, కలాపిని, ప్రస్తరఖని, మధుగుంజ, దీపశిఖాదేవి, శర్యాతి, గంగా శంతనుడు. ఛాయ, సుమతి, చంద్రకళాధరుడు, నివేదిత, ధూర్జటి, శౌరి. శిలాభద్రుడు. కొన్ని చమత్కారమయిన పేళ్లు. కేలంగి, నిశితమతి, టికటిక, కటకటయోగి, నిమేషధారి, ఇట్టి పేళ్లను పెట్టుటలోనే యొక వైలక్షణ్యమును ప్రదర్శించును.ప్రతిపేరు వెనుకను పౌరాణికముగనో, చారిత్రకముగనో, చమత్కారముగనో కొంత చరిత్రను పాఠకు డూహింపవచ్చును. ఇది శ్రీ విశ్వనాథ విలక్షణచక్షువు దర్శింపగల, ధర్మసూక్ష్మము.

కొన్ని పాత్రల ప్రసంగములు :- శ్రీ విశ్వనాథకు మంత్రశాస్త్రము నందును, వైదిక కర్మలందును ప్రత్యేకాభినివేశము. ఆయిన ఉపాసనాపరుడు. నిత్యము మహా మంత్రానుష్ఠానము చేయువాడు. యోగాభ్యాసము నందును పరిణత ప్రజ్ఞ కలవాడు. పాత్రలెట్లు దేవాసుర ప్రకృతులుగా విభాగింపబడెనో మంత్ర శాస్త్రమునందును నీ విభాగమును జూపెను,

బగళ, కాలంజరి, మ్లేచ్ఛ విద్యలు, పులిముగ్గు విద్యలతో మహామంత్రానుష్ఠాన విషయమును బరిచయము చేసి తులనాత్మక పరిశీలనము గావించెను. అవి-

1) గంగు కుమారుని చే కోటి రామమంత్రము నుపాసింపజేసి తుచ్ఛవిద్యనాతనిపై ప్రయోగింప నదియేమియు చేయజాలకపోయెను. 2) గంగాధరశర్మ చే నుపాసింపబడిన మహామంత్రమును జయద్రధుడు తులసిపై ప్రయోగించిన తుచ్ఛమంత్రమును వమ్ము చేసెను 3) పరాశర శాస్త్రి తన మహామంత్ర విద్య చే జయద్రధ పిశాచపు బెత్తిగపలు డిల్లవోవునట్లు చేయగల్గెను

'ధూమరేఖ'లో పరాశరశాస్త్రి వంకజాబిల్లితో ప్రసంగవశమున - "నావంటి వారుండరు. నా వంటివారున్నారన్నచో విశ్వసించెడి వారే యుండరు. నేను మంత్రానుష్ఠానపరుడను. ఆమంత్రాధిదేవతలు నాకు సర్వమును విశదీకరింతురు.' ఇందు శ్రీ విశ్వనాథ ప్రస్ఫుటమగుట లేదా ?

ఒక మహోపాసకుని వ్యక్తిత్వమిందు దర్శింపవచ్చును.

వైదిక కర్మలలో ప్రధానమైనది అశ్వమేధము. అశ్వమేధమున కంటె పుణ్యమైన క్రతువు, బ్రహ్మహత్యకంటె పాపకర్మము లేదని సూత్రకారుని వచనము. దీనిని సమర్థించుట కాయన యొక సంభాషణమును కల్పించెను. 'అశ్వమేధము'లో దీనిని నిర్వహించును.

యజ్ఞము పరమేశ్వర భావనతో నొనర్చిన నది హింస కాదు కాని లోకమున నీవిషయమై చెలరేగుచున్న దుర్వాదమును ముందుగా బుష్యమిత్రుని చే ప్రసంగింప జేయును.

పృష్య : యజ్ఞమందు పశువిశసనము జరుగును కదా ! అశ్వమును వధింతురు కదా !

ఇది జనపక్షమున గల విమర్శ - దీనికి మేధావి భట్టు ప్రత్యుత్తరము.

'ఈ సృష్టిలో హింసను పరిహరించుట యెట్లు ? వైదికమతము పరిహరించరాని హింసను యజ్ఞముగా మార్చినది. మనము ప్రతి దినము నన్నమును తినుచున్నాము. శాకములను భుజించుచున్నాము. ఇది యంతయు ప్రాణిమయము. ప్రాణిహింసచేయుచునే యున్నాము. దాని యందు యజ్ఞభావన చేసినచో నాహింస హింసకాదు. వైదికులు పరిహరింపరాని ప్రాణిహింస యందు యజ్ఞభావన చేసి హింసాదూరు లగుచుండగా యజ్ఞభావన లేని వైదికేతరులు హింసామూర్తులగు చున్నారు.'

ఈ నవలయందే దీనికి దృష్టాంతమును దర్శింపవచ్చును.

ఇందు రెండు గుఱ్ఱములున్నవి. రెండు గుఱ్ఱములును వధింపబడి నవి. ఒకటి హింసాత్మకముగా, క్రూరముగా యవన ముష్కరులచే యుగపద్వధ గావింపబడి వారిచే నానందముగా నాపిశితము భుజింప బడె. రెండవది యజ్ఞమందు పరమేశ్వర భావనతో, నుపాసనా మార్గమున, నున్నతమయిన, దివ్యమయిన శ్రౌతమార్గమున విశసనము గావింపబడి పరమేశ్వరార్పణము చేయబడినది. ఈ రెండింటికి గల తారతమ్యవివేచనము చేయబడి పరమేశ్వరార్పణతో నేకార్యమయి మయినను చేసినచో దోషములేదని పాఠకులకు సందేశమొసంగిన నవల యిది,

నాగసేనుడను నవలయందు దూర్జటి యనుష్ఠానము చేతనే కబంధుని పీడ వదలించుకొన గలిగెను. దానియందు విశ్వాసము లేకుండుటచేనది నాగసేనుని పాలబడెను.

వైదికవిషయమందు ప్రగాఢమైన నిష్ఠ ఊరకే విశ్వాసము చేతగాదు. దానియందు ప్రత్యయబుద్ధిగలిగి దానినెదుటి వారికి వివరించుటలో జూపెడి తార్కిక ప్రజ్ఞ శ్రీవిశ్వనాథ వ్యక్తిత్వమని చెప్పవచ్చును.

ఉపనిషత్తులు :- బృహదారణ్యకమందలి యశోపాసనము, ఛాందోగ్యమందు పంచాగ్ని విద్య. కఠోపనిషత్తు నందలి నాచికేతాగ్ని చయనవిధి, ప్రాణ నియమనమునకై జైమిని, పతంజలి, కపిలాసురి పంచశిఖాదుల వాదములు ప్రసంగింపబడినవి. ఇవి శ్రీ విశ్వనాథను సర్వభారతీయ సంవిత్పరమేశ్వరునిగ దెలుపును. 'అవిచ్ఛిన్న సంప్రదాయార్థి' యనుటలోని పరమరహస్య మిదియే. ఇది యాయన మహోన్నతవ్యక్తిత్వము. ఇట్లుండ శ్రీ విశ్వనాథ లౌకికుడు కాడు ప్రాచీనుడు అని యాయన వ్యక్తిత్వముపై యొక విమర్శగలదు. దీనికి విశ్వనాథ వారి నవలలందే సమాధానము.

అశ్వమేధములో బుష్యమిత్రుడు :- "ఏమయ్యా ! మీరు మాకంటె లౌకికులుగ గన్పించుచున్నారు?" ఇది నారాయణ భట్టును గుఱించి వేయబడిన ప్రశ్నము. ఆయన ప్రముఖ శ్రోత్రియుడు. బుద్ధి జాడ్యజనితోన్మాదు లని పెద్దనగారొక సూక్తినిసాయించిరిగదా! శాస్త్రములు, శ్రుతి స్మృతీతిహాసాదుల పయి ప్రత్యయము గలిగిన మహానుభావులకు లౌకికముతో బనియేముండును ? వారు వెఱ్ఱివారని యాధునికుల విశ్వాసము. ఆ ప్రశ్నకు నారాయణభట్టు ప్రత్యుత్తరము గమనింపుడు-

'స్వామీ ! శాస్త్రమనగా విశేషపరిజ్ఞానముతో గూడిన లౌకికమే. లౌకికమన్నచో నేమియో తెలియని మూఢులు శాస్త్ర జ్ఞానమును నిందింతురు. శాస్త్రము లెక్కడ నుండి వచ్చినవి. ప్రధాన

ముగా లోకము నుండి వచ్చినవి. అలౌకిక పరిజ్ఞానముతో సంబంధింప జేయుటయే శాస్త్రము.'

శ్రీ విశ్వనాథ 'ఎంతవైదికుడో అంత లౌకికుడ'ను వాక్యమును ఋజువు చేయు సన్నివేశమిది. ఇది సందేశము కూడను.

ఒక్కొక్కచో బరిష్కారము నాయననిర్దేశింపడు. పాఠకుని వివేక మునకు వదలిపెట్టును. పరస్పర విరుద్ధములైన సన్నివేశములను బ్రద ర్శించును. గ్రాహ్యమేదియో, పరిత్యాజ్యమేదియో నిశ్చయించికొన వలసినది పాఠకుడే. ఇవి యుపదేశ ప్రసారములో నొక గడుసు పోకడ-

ఆమేషా (అశ్వమేధము) మ్లేచ్ఛ మంత్ర తంత్రముల నెఱింగిన జాణ. పుష్యమిత్రుని మేనల్లుడయిన సోమశర్మ వృద్ధ భార్గవీ కరుణావృష్టిలబ్ధ మంత్రజ్ఞుడు. ఆతని పెండ్లియాడి యాతనిని మ్లేచ్ఛ ప్రభువుగా నొనర్చును. అతని సర్వాత్మనా యవనునిగా నొనర్చును.

హెలీనా, నివేదితలు యవన స్త్రీలు. భారతీయ భావనగల వారు. ఒకరు సముద్రగుప్తుని, మరియొకరు మంత్రికుమారుడైన చంద్ర కళాధరుని పెండ్లియాడిరి. వారిని భారతధర్మమునుండి జాఱనీయ లేదు. తాము మ్లేచ్ఛ ధర్మమువలంబింపను లేదు.

ఇవి రెండును విరుద్ధ సన్నివేశములు. ఇందేది గ్రాహ్యము, ఏది పరిత్యాజ్యము? భారతీయ ధర్మ వివాహ మనుసరణీయమా? మ్లేచ్ఛ వివాహము స్వీకారయోగ్యమా? ఫలితములు చూపబడినవి. సద సన్నిర్ణయము పాఠకుని వివేకము పయి నాధారపడియుండును. ఆదర్శ దాంపత్యము, వర్ణాంతర వివాహమని చిందులు త్రొక్కెడి నేటి యువతీయువకులకు హెచ్చరిక వంటిది నీల-నాగార్జునుల ప్రణయము, (భగవంతుని మీది పగ) ఛాయా నిరాకులుల పెండ్లి. తుచ్ఛమైన

తాంత్రిక శక్తులకంటె దైవిక శక్తి, మహామంత్రానుష్ఠానము, ఇహాముత్రఫల భోగసాధనమని మొదటి మూడు నవలలనుండి పాఠకుడు గ్రహించు సందేశము. తరవు గాని పనికిపోయి తనకును నితరులకును సిలుగులు తెచ్చిన గంధవాహుని పాత్ర యట్టి పరాధికార వినియోగులను హెచ్చరించును. మాహేశ్వరీదేవి రాణి. రిపుంజయుని సతి. ఆమె యంతఃపుర రక్షక సేనాని గంధవాహుడు, మునీకుడు మాహేశ్వరి మర్యాదనపహరింప యత్నించును. గంధవాహుని పని యప్పటికి మునీకునితో పోసట. కాని యాతడు మునీకుని యాలోచన చేసి తనకు తనరాణికి ముప్పు తెచ్చిన వాడయ్యెను.

"అది యేమయినను సరే! లోకములు ముంచుకొని పోయినను సరే! ముందు వెనుకలు చూడకుండ తనకప్పుడు విధింపబడ్డ ధర్మమును తానెప్పుడు చేయునో నాడు తీవ్రవ్రతుడు వాడు సాహసికుడు, వాడు వీరుడు."

కనుక వీరుడు వీరుని లక్ష్యమునే యనుసరింపవలెను ఆలోచనాపరుని మార్గము ననుసరింపరాదు. ఆలోచన మంత్రి ధర్మము' క్రూరమయిన భావములకు క్రూరమయిన మరణమును సుశర్మ పాత్ర ప్రబోధించును (పులిముగ్గు) విశ్వాసములేని వైదికభావసముచ్చయము సందేశము ఉన్నతునైననుపతనము ంపెంచునని నాగసేనుని నవలనిరూపించును. ధర్మ పరిరక్షణకుద్యుక్తమయి తీవ్రమయిన కృషిసలుపుచో నెంతటి క్లేశమయినను నవలీలగా తరింపవచ్చును, ఇది వేదవతి, నివేదితలు తెలిపెడి సత్యము. ధర్మ ప్రణయమునం దాసక్తులయ్యేని విదేశీయువతులైనను పరిగ్రహణయోగ్యలే యగుదురని సందేశమా? హెలీనా! నివేదితాదులు, అట్లేయున్నది. కారణమేమన!

"స్వజాతి యందున్న స్వమతద్రోహిని శంకింపవలసినంత యవసరము మందేశమునందు నివసించుచు మన ధర్మము నందభిమానము

కలిగియున్న పెరజాతి వారిని గుఱించి యక్కఱలేదు." ఇది సత్యమే కదా ! ఇంక పురాణవైర నవలలందలి ప్రధానమయిన సందేశము. మన సంస్కృతి పయి దెబ్బతీసిన వారాంగ్లేయులు, అట్లే మన చరిత్ర పయి గూడ వారనంతమయిన ద్రోహమొనర్చిరి. మన సంస్కృతిని, మన ప్రాచీనతను విస్మరింపరాదని యాయన మనకిచ్చిన ప్రధాన సందేశము. ఆయన మాటలలోనే దీనిని ముగింతును.

"భారతీయులనగా భారతదేశమందు పుట్టుట మాత్రమే కాదు· అనంతమై, అగాధమై, అపరిచ్ఛేద్యమై, నిత్యమైన వేద వేదాంత పురాణేతి హాసములందు విశ్వాసము కలిగియుండుట"—నివేదిత.

ఇది మన సంస్కృతి

ఇది మన సంప్రదాయము

ఇది విశ్వజనీనత.

# అనుబంధములు

1) సప్తర్షి చలనము - రాజవంశక్రమము.

2) జనమేజయుని వంశవృక్షము.

3) పురాణవైరములోని సామెతల ఆమెతలు.

4) ప్రాచీన భారతదేశ పటము.

5) అశ్వమేధము, విద్యారణ్యమునకు సంగ్రహానువాదము

6) మహాభారత యుద్ధకాల పరామర్శ.

# అనుబంధము - 1

## సప్తర్షి చలనమాధారముగా కల్యాది రాజవంశ క్రమము.

సప్తర్షి శకమును పురాణములన్నియు పేర్కొన్నవి. కలియుగ రాజవృత్తాంతమందు పేర్కొన్న యీ రాజవంశముల చరిత్ర సప్తర్షి చలన మాధారముగా గ్రహింపబడినట్టిది.

'సప్తవింశతి పర్యంత్తే కృత్స్నే నక్షత్రమండలే ।
సప్తర్షయస్తుతి తిష్ఠంతి పర్యాయేణశతం శతమ్ ॥1

సప్తర్షీణాం యుగంహ్యేతత్ దివ్యయా సంఖ్యయా స్మృతమ్ ।
సమాదివ్యాస్మృతాః సప్తదివ్యామాసాషడ్వైవహి ॥ 2

ఋషౌ దృక్షం శతేనాబ్దై ర్యాంతి చిత్రశిఖండినః ।
దివ్యం సప్తర్షి కాలోయం క్రమాదేవం ప్రవర్తతే ॥ 3

సప్తర్షీణాం తు యౌపూర్వౌ దృశ్యతే హ్యుదితే దివి ।
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యేతే యత్సమం నిశి ॥ 4

తేన సప్తర్షయోయుక్తా స్తిష్ఠన్త్యబ్ధ శతం నృణామ్ ।
నక్షత్రాణాం ఋషీణాంచ యోగస్యైతన్ని దర్శనమ్ ॥ 5

యదా ద్వేర్షయః సప్త మఘాసు విచరన్తిహి ।
తదా ప్రవృత్తశ్చ కవి ర్ద్వాదశాబ్ద శతాత్మకః ॥ 6

యదా దేవర్షయః సప్త మఘాసు విచరన్తిహి ।
తదా ప్రవృత్తశ్చ కలిర్ద్వాదశాబ్దై శతాత్మకః ॥ 7

యస్మిన్ కృష్ణో దివం యాతా స్తస్మిన్నేవహి వత్సరే ।

# తాత్పర్యము

సురర్షులు ఇరువదియేడు నక్షత్రములు గల నక్షత్రము మండల మందొక్కొక్క నక్షత్రమును నూరు సంవత్సరముల కాలములో చుట్టి వత్తురు. అనగా ఒక్కసారి నక్షత్రమండలమును పరిభ్రమించుటకు బట్టుకాలము ఇరువదియేగు వందల సంవత్సరములు. ఈ యిరువదియేడు వందల మానవ సంవత్సరములను దివ్యసంవత్సరములుగా లెక్కించి నచో 7½ సంవత్సరములగును. (360) మానవ సంవత్సరములు 1 దివ్య సంవత్సరమునకు సమానము) ఈ సప్తర్షులు (మరీచి, అరుంధతీ సహితుడైన వశిష్టుడు, అంగీరస, అత్రి, పులస్త్య, పులహ, క్రతువులు) అశ్విన్యాది నక్షత్రములలో నొక్కొక్క దానిని చుట్టివచ్చుటకు నూరేండ్లు పట్టును. ఇది అపసవ్యముగా నుండెడి భ్రమణము. ఈ యిరువదియేడు వందల సంవత్సర కాలము సమీకృతమై 'సప్తర్షి కాల' మని పిలువబడును. రాత్రియందు ఉత్తర దిక్కున చూపబడెడి సప్తర్షి మండల ముదయింపగనే ముందటనున్న పులహ, క్రతువులకు సమాంత రముగా నశ్విన్యాది నక్షత్రములలో నేదియుండునో నా నక్షత్రము నది పరివర్తించుచున్నదనియు, నా నక్షత్రమును నూరేండ్లు చుట్టు ననియు చెప్పవలెను. సప్తర్షి భ్రమణమును. నక్షత్రము యొక్క యుని కిని నీప్రకారముగా గుర్తింపవలెను. సప్తర్షులు మఘయందు సంచ రించు చున్నప్పుడు 1200 దివ్య సంవత్సరముల ప్రమాణముగల (4,32,000 మానవ సంవత్సరములకు సమానము)కలియుగ మారంభ

ప్రతిపన్నం కలియుగ మితి ప్రాహుః పురావిదః ॥ 8
యావత్ సభగవాన్ విష్ణుః పస్పృశేమాం వసుంధరాం ।
తావత్ పృథివీం పరిక్రాంతం సమర్థో్ ౹నా భవత్ కలిః ॥ 9
యథా మఘాభ్యో యాన్యన్తి పూర్వాషాఢా మహర్షయః ।
తతః ప్రభృత్యేవ కవిర్వృద్ధిం యాశ్చతి నిశ్చితమ్ ॥ 10
యదా యుధిష్ఠిరో రాజా శక్రప్రస్థే ప్రతిష్ఠితః ।
తథాసప్తర్షయః ప్రాపుర్మఘాః పితృహితేరతాః ॥ 11
పంచ సప్తతి వర్షాణి ప్రాకాక్లేః సప్తతే ద్విజాః ।
మఘాస్వాసన్ మహారాజ శాసత్యుర్వీం యుధిష్ఠిరే ॥ 12
పంచవప్షతి వర్షేషు గతే ష్వథ కలెయుగే ।
సమాశ్రయిష్య న్త్యశ్లేషాం మునయస్తే శతం సమాః ॥ 13
తద్వైవ ధర్మ పుత్రే పి మహా ప్రస్థాన మాస్థితః ।
భువం పరిభ్రమన్నంతే స్వర్గమారోక్ష్యతి ధ్రువమ్ ॥ 14
తదైవలౌకికాబ్దేఽపి సప్తవింశశతాత్మకః ।
ధర్మపుత్ర జ్ఞాపకార్థం లోకేతావత్ప్రవర్తిత ః ॥ 15
సప్తవింశాంధ్ర నృపతే కాలే భావ్యస్యతే పునః ।
ఆశ్లేషాం సంప్రయాస్యన్తి యుగస్యాన్తే సురర్షయః ॥ 16
సప్తర్షయో మఘా యుక్తాః కాలే యాధిష్ఠిరే శతం ।
శ్రవణేతే భవిష్యన్తి కాలే నందస్య భూపతేః ॥ 17
చతుర్వింశేథ నక్షత్రే భవిష్యన్తి శతంసమాః ।
అంధ్ర రాజ్యారంభ కాలాదారభ్యైతే సురర్షయః ॥ 18
మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరీక్షితః ।

మగును. శ్రీకృష్ణుడు మానవ లోకమును విడచి దివ్యలోకమునకు దరలినపుడే యీ యిరువది యెన్మిదియవ మహాయుగములోని కలి యుగ మారంభమయ్యెనని పురావిదులు పేర్కొందురు. దివ్యమైన, శ్రీమహావిష్ణ్వవతారమైన శ్రీకృష్ణుడు తన దివ్యపాదమును భూమి యందు స్పృశింపజేయునంతవరకు కలి భూమిని స్పృశింప సమర్థుడు కాకుండెను. మఘా నక్షత్రమునుండి పూర్వాషాఢా నక్షత్రమునకు సురర్షులు ప్రవేశించు నప్పటికి కలి వివృద్ధమగుట ఆరంభించును. పితృదేవతాకమైన మఘా నక్షత్రమునందు సురర్షులు ప్రవేశించునప్పటికి భూమి (ఇంద్రప్రస్థము) యుధిష్ఠిరునిచే శాసింపబడుచుండెను. ఈ సప్తర్షులు కలియుగారంభమునకు 75 సంవత్సరములకు పూర్వమే (3177 బి. సి.) మఘయందు ప్రవేశించిరి. ఈ సమయమునకు యుధిష్ఠిరుడు రాజ్యము చేయుచుండును. కల్యాది ఇరువదియైదు సంవత్సరములకు మఘను వీడి సురర్షులు ఆశ్లేషను (3077) ప్రవేశింతురు. (అపసవ్య గమనము). ఈ నక్షత్రమునందు పూర్వోదితముగ నూఱేండ్లు వసింతురు. (3077-2977) ఆశ్లేషను ప్రవేశించిన కాలముననే (3077) యుధిష్ఠిరుడు స్వర్గారోహణ మొనర్చును. తదాది యుధిష్ఠిరుని స్వర్గారోహణవిషయ జ్ఞాపకార్థము (2700 సం॥ కాలమును) లౌకికాబ్దముగా లోకము గుర్తించి ప్రవర్తించుచున్నది. ఆశ్లేషను తెంగి సురర్షులు చేరునాటికి ఆంధ్ర వంశములోని 27వ రాజు (శివ శ్రీశాతకర్ణి) మగధను పాలించును. (ఇది 27 2) యుధిష్ఠిర శకమునకును బి. సి. కును సమానము) మఘయందు నూరేండ్లున్న యీసురర్షులు నపసవ్యగమనములో శ్రవణ నక్షత్రమును జేరునాటికి (15వ నక్షత్రము) మహాపద్మ

ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచ శతోత్తరమ్ ॥ 19
ఆంధ్రరాజ్యోపక్రమాత్తు యావన్నందాభిషేచనమ్ ।
అంతరంతచ్ఛతాన్యష్టౌ ప్రమాణజ్ఞై స్సమాస్మృతాః ॥ 28
యదాపునర్వసు ర్యాస్యన్త్యేతే సప్తర్షయః పునః।
తదా శ్రీ గుప్తవంశానాం రాష్ట్రం దైన్యంగమిష్యతి ॥ 21
పూర్వా భాద్రా యదాతేతు ప్రవేశ్యతి పునర్ద్విజాః।
గుప్తేభ్యో మాగధం తదా పాలాన్ గమిష్యతి ॥ 22

కలియుగ. రాజవృత్తాంతము 3వ భాగము, 3వ అధ్యాయము.

నందుడు రాజ్యము చేయును. సురర్షులు అపసవ్య గమనములో నిర్వాది నాల్గవ నక్షత్రమును చేరిన (చిత్త) కాలమునకు ఆంధ్రరాజ్యపాలన మారంభమగును. అర్జునుని మనుమడైన పరీక్షిత్తు కాలమునకు నంద వంశీయుడైన మహాపద్మనందుని పాలన కాలమునకుగల యంతరము పదునైదు వందల సంవత్సరములు. మహాపద్మనందుని కాలమునకును నాంధ్రుల రాజ్య పాలనకాలమునకునుగల యంతరమును 800 సంవత్సరములుగా ప్రమాణజ్ఞులు చెప్పుదురు. ఈ సురర్షులు పునర్వసు నక్షత్రమును చేరునాటికి (మహాభారత యుద్ధమైన తర్వాత రెండవ పర్యాయము) గుప్తరాజ్యము క్షీణించును. పూర్వాషాఢా నక్షత్రమును చేరునాటికి రాజ్యము గుప్తులను వీడి పాలరాజుల నాశ్రయించును.

# అనుబంధము – 5

## పురాణవైర గ్రంథములలోని సామెతల - ఆమెతలు.

### (అకారాది క్రమము)

### తెలుగు

1) అజ్ఞాన మసద్వస్తువు.
2) అసమర్థులందరు సత్పురుషులే.
3) అష్టమ చంద్రుడు - నైధన తార.
4) అందఱును సన్యాసులయినచో సృష్టిసాగుట యెట్లు ?
5) ఆచారములు, నిష్టానిష్టములు, సౌందర్యాసౌందర్యములు దేశమును బట్టి కాలమును బట్టి యుండును గదా.
6) ఇంత దూరము వచ్చి యింటిముంగిట చచ్చినట్లు. (ఇంత బ్రతుకు బ్రతికి ఇంటావల చచ్చినట్లు, అని గూడ వ్యవహార మున్నది.)
7) ఇంటిలో స్త్రీ యెట్టిదో దేశములో వైశ్యుడట్టివాడు. (ఇరుపురును సాధారణముగా ధర్మమును వీడరని భావము.)
8) ఉదయించిన సత్ఫలము నిర్వహింపబడుటకు నితరములైన బహుసత్కర్మలు వచ్చియాదుకొనవలయును.
9) ఏక పురుషలగ్న చిత్తవృత్తియైన స్త్రీ భగవంతుని సన్నిధానమున నుండును.
10) ఒక కుంటుబములోని దుష్టుడు చేసెడి పని దీర్ఘకాలమున కుటుంబమునకు విద్రోహకారి యగును,
11) ఒక రాజశాసనముయొక్క పాలింపబడుట రాజోద్యోగుల యధీనమున నుండును.

12) ఓరీ ! దొంగా ! ముక్కుటికెదవురా !

13) ఓసీ ! తద్దినమా ! మా యింటికి రమ్మా !

14) ఒడలు తెలియని శివముండదు.

15) కంచెయే చేను మేసిన కలదె దిక్కు.
(చక్కటి పద్యపాదములో నిముడ్చబడిన సామెత)

18) కొండను బోయి తగరు దాకినట్లు.
(బలహీనునకు బలవంతునితో వైరము చేటు.)

19) గుణపమున కన్న కష్టములును లోకువయే.

20) చెడ్డ చేనికి మంచెలు మూడేమిటి ?

21) చల్లకువచ్చి ముంత నెందుకు దాచుట.

22) చావుయనునది మానవునియొక్క అజ్ఞానమను సంచికిమూతి కట్టి వేసిన ముద్ర

23) చచ్చిపోయెడి భార్య నమ్మా! యని పిలిచినచో బ్రదుకునా!

24) చెడిపోయిన బ్రాహ్మణుడుగాని, బ్రాహ్మణస్త్రీగాని లోకమునకు చేసినంత యపకారము చెడిపోయిన యితర వర్ణస్థులు చేయలేరు.

25) జన్మ పరంపరా విశ్వాసములేని మతములలోగూడ మహాసత్పురుషు లుదయింతురు.

26) జుగుప్స వైరాగ్యమును గల్గించును.

27) తలకుమించి పని చేయబూనినవాడు ప్రతివాడు సిలుగులలో బడును పరులకు సిలుగులు తెచ్చును.

28) తల్లిబడి కొల్లిబట్ట
(తల్లి బడి కోల్బెట్ట - అముక్తమాల్యదలోని పాఠము)

29) తాడిచెట్టు క్రింద కూర్చుండి పానకము త్రావినను కల్లే యనుకొందురు.

లలో పర్వతము పరమాణు భూతముగానుండును.
(ప్రజలలో 'గోరంతలు కొండంతలు'గా జేయబడుట పెద్ద వంశము
లలో కొండంత గోరంతగా జేయబడుట వ్యవహారములలో నున్నది

41) బత్తె నింటివద్ధపెట్టి యంగడిలో బేరమాడి నట్లున్నది.
(నీటిలో గీదెనుపెట్టి బేరమాడినట్లు వ్యవహారమున గలదు.

42) భగవంతు డెవనియందు దయాపూర్ణుడగునో వానికి కష్ట
ములు తెచ్చిపెట్టును,
"యస్యానుగ్రహమ్యహమ్ తస్యవిత్తాపహారిణమ్। బంధూన్వానాశయి
ష్యామి ...." విష్ణు. పు.న వాక్యము.

43) మనకు బరులయందు దయకలిగినచో దానిని క్రియారూప
మున జూపింపవలయును,

44) మనకు మంచిదినములు కానిచో కప్పకుబండ్లు మొలుచును
(మనరోజు (దినం) మంచిది కాకపోతే కప్పే పామై కరుస్తుంది.
కర్తే పామై కరుస్తుంది. కప్పకు పండ్లువచ్చి కరుస్తుంది. తాడే పామై
కరుస్తుంది. ఇత్యాది సామెతలు వ్యవహారములో నున్నవి.)

45) మనుజునకు వివేక మానత్సమయముననే గదా వచ్చునది.

46) మృత్యువు నీడ వంటిది

47) రాజు కొలువులో జేరినపుడే నీ ప్రాణములమీద నాశ
వదలుకొని జేరవలయును. (రాజసేవ అంతటి ప్రమాదమని
హెచ్చరిక

48) రాజసేవ నీ యాచారములను నిన్ను చేయనీయదు. నీకిష్టము
లేక పోయినను దురాచారములను నీ చేత చేయించును.

49) రాజసౌధములకు ననాహూతుడై పోరాదు

50) రాజుయొక్క శిక్ష లేకుండ బనులయందు ధర్మము ప్రవ
ర్తింపదు.

51) లోకమునందు వ్యర్థుడైన వానిని త్వాష్ట్రుడందురు.

(త్వష్ట ప్రజాపతి యొక్క కుమారుడు వృత్రాసురుడు. వీనికి త్వాష్ట్రుడనిపేరు. ఈతడింద్రుని సంహరింపనెంచి 'ఇంద్రశత్రుర్వర్ధస్వ' అను మంత్రముతో హోమమొనర్చెను. ఉదాత్తము పలుకవలసినచోట ననుదాత్తముచ్చరించుటచే శత్రువైన యింద్రుడు వర్ధిల్లుగాక యని యర్థమేర్పడెను. ఇట్లు నిష్ప్రయోజనకరమైన కార్యమొనర్చి తానింద్రునిచే సంహరింపబడెను. తత్కారణమున నాటి నుండి వ్యర్థుడైనవానిని త్వాష్ట్రుడనుట వ్యవహార మయ్యెను.)

52) వాఙ్నియమము మంచిది. వాఙ్నియమముతోబాటు నీ హృదయమును స్వచ్ఛముగా నట్టిపెట్టుకొన్నచో నది సత్పురుషుడైన లౌకికుని లక్షణము.

53) విద్య యనగా నాలోచన, ఆలోచన విద్యయొక్క పరమార్థము.

54) విప్పనన్నాళ్లు మంటిపాము - విప్పినంతలో త్రాచుపాము.

55) వెట్ట గలిగిన గాని పాము పడగ విప్పదు.

56) వైద్యులు పంక్తి బాహ్యులు.

(రసవిషగంధకాదులతో నిత్య సన్నిహితత్వము గల్గియుండుటచే పూర్వము వారిని దూరముగా నుంచుట ఆచారములో నుండెను.

57) సత్పురుషులయొక్క వినయము బ్రహ్మపదార్థ చోడాకుసుమము వంటిది.

58) సృష్టి గుణ దోష సంకరమైనది.

59) సామర్థ్యము కలిగియుండుటలో దోషములేదు అసామర్థ్యముతో గలసి దురాశ, దుర్నీతి, దుశ్శీలము నున్నచో దోషము పుట్టును.

## సంస్కృతము

1. అనాహూతో౽ధ్వరంగచ్ఛేత్।
2. అన్నం బ్రహ్మేతివ్యజానాత్।
3. ఏక క్రియా ద్వ్యర్థికరీ బభూవ।
4. కౌపీన సంరక్షణార్థమయం పటాటోపః।
5. గతానుగతికో లోకః – నలోకః పారమార్థికః।
6. నమాతుః పరదైవతమ్।
7. బ్రహ్మవేత్యతి బ్రహ్మైవభవతి।
8. యత్నేకృతే యది నసిద్ధ్యతి కో౽త్ర దోషః।
9. రాజానుమతో ధర్మః।
10. వివాహశ్చ వివాదశ్చ సమయో రేవశోభతే।

## ఉపజీవ్య గ్రంథ పట్టిక

( అకారాది )

1) అధర్వ వేదము
2) అక్షమాలికోపాసనము ప్రాచీన తాళపత్రప్రతి
3) అష్టాధ్యాయి
4) ఆమ్నాయమందారము
5) ఈశావాస్యోపనిషత్
6) ఋగ్వేదము
7) కల్కిపురాణము
8) కృష్ణ మిశ్రీయము
9) గరుడ పురాణము
10) ఛాందోగ్యోపనిషత్
11) తైత్తిరీయ బ్రాహ్మణము, 8,9 ప్రపాఠకములు (అశ్వమేధము) విద్యారణ్య భాష్యము

12) త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్
13) తైత్తిరీయోపనిషత్ - శీక్షా - ఆనందవల్లి
14) దేవీ భాగవతము
15) నారద పురాణము
16) పద్మ పురాణము
17) భాగవతము - శ్రీధరీయ వ్యాఖ్య
18) బృహదారణ్యకోపనిషత్
19) భవిష్య పురాణము
20) బ్రహ్మపురాణము
21) బ్రహ్మాండ పురాణము
22) భగవద్గీత
23) బృహత్సంహిత - పంచసిద్ధాంతిక - వరాహమిహిర
24) భారతచరిత్ర పరీక్షా - కావ్యకంఠగణపతి ముని
25) మహాభారతం

ఆది, అరణ్య, మౌసల, స్త్రీ, శాంతి. వన ఆనుశాసనిక పర్వములు

26) మనుస్మృతి
27) మత్స్యపురాణము
28) మార్కండేయ పురాణము
29) యజుర్వేదము
30) రాజతరంగిణి
31) వామన పురాణము
32) వాయు పురాణము
33) విష్ణు పురాణము
34) విష్ణు సహస్ర నామము - శాంకర భాష్యము
35) వేదార్థోపన్యాసములు-శ్రీ రేమెళ్ల సూర్యప్రకాశ శాస్త్రి
36) వైఖానస మహిమమంజరి
37) వైఖానస కల్పసూత్రము

38) శతపథ బ్రాహ్మణము
39) శ్రీమద్రామాయణము—అయోధ్య, సుందర
40) సిద్ధాంత శిరోమణి
41) సుబాల్యోపనిషత్
42) హరివంశము
43) అరవింద జీవితము సి హెచ్. వెంకటకృష్ణయ్యగారు
44) ఆంధ్రజ్యోతి 19-5-75 (దినపత్రిక)
45) ఆంధ్రప్రభ 9-7-76 (దినపత్రిక)
46) కలిశకవిజ్ఞానము (1నుండి 3సంపుటములు
47) కవలలు శ్రీ విశ్వనాథ
48) తెలుగు నవలా వికాసం మొదలి నాగభూషణ శర్మ
49) తెలుగు నవల - నూఱు సంవత్సరాలు అకాడమీ ప్రచురణ
50) బ్రహ్మాండ పురాణము (తెలుగు)
51) భారతీయశకములు - కోట వెంకటాచలం
52) భారతము - ఆదిపర్వము - నన్నయ శ్రీ విశ్వనాథ పీఠిక
53) భారతము - అరణ్య పర్వము
54) భారతము - ద్రోణ పర్వము
55) భాగవతము (తెలుగు)
56) పురాణ వాఙ్మయము డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
57) విశ్వనాథవారి పురాణవైరం డా॥ త్రిపురనేని (1962) విశాలాంధ్ర
59) విశ్వనాథ కవితా వైభవం-జువ్వాడి గౌతమరావు
60) విశ్వనాథ వాఙ్మయ సూచిక - స్నాతకోత్తర కేంద్రం ప్రచురణ, వరంగల్
60) విశ్వశ్రీ - సాహిత్య సంచిక
61) శృంగార నైషధము

# అశ్వమేధము

శ్రుతియందు హయమేధమునకు మూలహేతు విట్లున్నది. చతుర్ముఖుని యక్షిగోళక మొకానొక వ్యాధిచే భూపతన మయ్యెను. అది యశ్వరూపమున నావిర్భవింప దేవతలందఱు నయ్యశ్వమును మేధ్యము నొనర్చి ప్రజాపతికి జక్షుస్సంయోగ మొనర్చిరి. దీనివలన ప్రజాపతియు, దేవతలును దృప్తులైరి. నాటినుండి యది సర్వప్రాయశ్చిత్తార్థమయిన యాగమయ్యెను. సర్వరోగభేషజమనియు, బ్రహ్మహత్యాది మహాపాతకములు నయితము నీయాగము నిర్వహించిన యజమానిని విడచుననియు శ్రుతియందు జేర్కొనబడెను. ఇట్టి ఈ యశ్వమేధ యాగమును దేవతలు నిర్వహించి సర్వపాప విముక్తులైరి[1]

ఈ యాగ నిర్వహణమును గుఱించి తైత్తిరీయబ్రాహ్మణము నందు తృతీయ కాండమున నెనిమిది, తొమ్మిది ప్రపాఠకములలో పేర్కొన బడినది. సర్వంసహా చక్రవర్తి మాత్రమే యీ యాగ నిర్వహణమున కర్హుడగును[2]. శ్రవణమాత్ర పుణ్య సంప్రాప్త ప్రదేశములయిన కాశీకురుక్షేత్రాది మహాపుణ్యభూములందు చైత్ర పూర్ణిమ నాడు యజమానుడు పాత్రి రగ్నిహోత్రవిధిని నిర్వహించి యశ్వమేధ సంకల్పము చేయును.[3] అనంతరము జనసంగ్రహార్థము 'సాంగ్రహణేష్టి' చేయును.[4] ద్వాదశారత్ని పరిమితమైన యశ్వబంధ రజ్జువును నిర్మించ వలెను. సంవత్సరమునకు

1. ప్రజాపతే రక్ష్యశ్వయత్, తత్పరాఽపతత్ । తదశ్వో భవత్, యదశ్వయత్ తదశ్వస్యాశ్వత్వమ్ ।
సర్వస్యవా ఏషా ప్రాయశ్చిత్తి:సర్వస్య భేషజమ్ । సర్వంవా ఏతేన పాప్మానం దేవా అతరన్ ।
అపివా ఏతేన బ్రహ్మహత్యా రుతరన్ సర్వం పాప్మానం తరతి । తరతి బ్రహ్మహత్యాం: యోఽశ్వమేధేన యజతే । య ఉచైన మేవం వేద ।

2. 'రాజా సార్వభౌమోఽశ్వమేధేన యజేత'

3. "పుణ్యనామ దేవయజన మధ్యవస్యతి, పుణ్యామేవ తేన కీర్తి మభిజయతి"

4, సాంగ్రహణ్యేష్ట్యాయజతే। ఇమాం జనతాగ్ం సంగృహ్ణానీతి

పండ్రెండు మాసములగుటచే నిట్లు చేయుట కర్తవ్యము.[5] దీనిని ముంజగడ్డితో నిర్మాణము చేయుటచేత యజమానుడు బలము పొందును. ఇష్టి పశుసోమాద్యనేక క్రతుసమృద్ధిగల యాగమగుట చేత నీయాగము చిత్రానక్షత్రము నందారంభింప వలెను.[6] యాగమును నిర్వహించు ఋత్విక్కులందఱను సుబ్రహ్మణ్యునితో గూడ హయాందోళికలపయి నుపవిష్టులను జేసి యాగస్థలికి జేర్చుట కర్తవ్యము. ఈ సుబ్రహ్మణ్యుడు సామవేదీయమైన యౌద్గాత్రగణములలో నుండెడి యుద్గాత. ప్రస్తోత, ప్రతిహర్త సుబ్రహ్మణ్యులను నలుపురిలో నాల్గవవాడు.[7] ఇట్లు తీసికొని వచ్చుట చేత యజమానికి కీర్తి ప్రాప్తించును. కేశ శ్మశ్రువపనము, నఖ నికృంతనము, స్నానము, వస్త్రధారణము యజమాని పాపనివృత్తి కొఱకు, వాగ్యమనము కొఱకు నధ్వర్యుడు చేయించును. స్వర్గప్రాప్తి కొఱకు యజమానిచే రాత్రిజాగరణమును జేయింతురు.

ఇది ప్రథమానువాకము

2. అనంతరము బ్రహ్మౌదనవిధి నిర్వర్తితమగును. చతుశ్శరావ[8] మాత్ర ధాన్యమును వర్ష, కూప, స్థావర, వహన్తీ జలములతో నొసర్చిన పాకమునకు బ్రహ్మౌదనమని పేరు. ఈ బ్రహ్మౌదనము చతుర్దిక్షస్థితము కావలెను. దీని వలన నుదకములు, నుదకములు వలన నన్నము, నన్నమున రేతోప్రాప్తి సిద్ధించుటచేత తదుభయము యజమానియందు నిక్షిప్తమగును. ఒకపాత్రయందు సువర్ణశలాక నుంచి తద్బ్రహ్మౌదనము నాపాత్రయందుంచిన నది యాగయోగ్య మగును. దాని నాజ్యప్లుతము గావింపవలెను. అనంతరము దీనిని మహర్త్విజులైన యధ్వర్యు, బ్రహ్మాదులు ప్రాశనము గావింతురు.[9] ఒకప్పు డాలబ్ధాశ్వమునుండి మహిమ వెల్వడి

---

5. 'ద్వాదశారత్ని రశనాభవతి, ద్వాదశమాసా త్సంవత్సరః'।
6. 'చిత్రా నక్షత్రం భవతి, చిత్రంవా ఏతత్కర్మ'।
7. 'అపదాతీన్ ఋత్విజస్సమావహన్త్య సుబ్రహ్మణ్యాయాః'।
8. ప్రజాపతి దేవతాకమైన అశ్వమునకుగల చతుశ్శఫసామ్యమున చతుర్విధ జలములు.
9. ప్రాశనముచేయగా మిగిలిన బ్రహ్మౌదనమును దర్భమయ మయిన రశనకు బట్టింతురు.

యీ ఋత్విక్కులను బొందుటవలన వీరు మహర్త్విజులైరి. వీరు ప్రాశనము చేయుటచేత యజమాని మహిమను పొందుచున్నాడు. ఈ ప్రాశన మొనర్చిన యొక్కొక ఋత్విక్కునకు సహస్రహేమనిష్కములను దానమొనర్చిన చతుర్థి జ్యోతిస్సును యజమాను డావహింప జేసికొనిన వాడగును.

ఒకప్పు డాలబ్ధాశ్వము నుండి రేతస్సారభూతాంశము బహిర్గతము కాగా నది బంగారమయ్యెను. ఓదనమువలన రేతోత్పత్తియగును. బ్రహ్మోదన ప్రాశనముచేత, హిరణ్యాదానములచేత యజమాని రేతోధారణ మొనర్చుచున్నాడు.

భూమి యందనేకాపవిత్ర ప్రదేశములందు యాగాశ్వము సంచరించుటచే నది యాగయోగ్యము కానేరదు. కనుక నీరజ్జువు నయ్యశ్వమునకు బంధన మగుచో నది యాగయోగ్యమగును. కారణ మీ రజ్జువు పవిత్రమైన దర్భలతో నిర్మింపబడుటయే.

ఇది రెండవ యనువాకము

3. ఋత్విగ్రూపుడగు బ్రహ్మయొక్క యనుమతి గైకొనక యశ్వమేధ యాజి దేవార్థము, ప్రజాప్రత్యర్థము నశ్వబంధము చేసినచో దేవతానుగ్రహము లేక దరిద్రు డగును. కనుక యజమాని బ్రహ్మనుజ్ఞబొంది, బ్రహ్మన్నశ్వన్' అను మంత్రముతో నశ్వమును బంధించుచో బ్రహ్మది దేవతలకే నివేదించి నట్లగును. తత్కారణమున దేవతానుగ్రహమును, దారిద్ర్యమును యజమానుడు పొందడు. అశ్వరజ్జువును 'దేవస్యత్వా' అను మంత్రముతో దీసికొని 'ఇమామగృభ్ణన్' అను మంత్రముతో నభిమంత్రణ మొనర్చును. ఇది ద్వాదశారత్నిగా నుండ వలెనా, త్రియోదశారత్ని 10గాగా నుండవలెనా యని బ్రహ్మవాదులు విచారణ చేసినారు. వృషభమునకు కకుభ మెక్కువగా నుండుట స్పష్టము. అట్లే పదిరెండు నెలలుగల సంవత్సరమున కధిక మాసము మూపురస్థానీయము..అట్లే యజ్ఞములందశ్వమేధము శ్రేష్ఠము. ఈ కారణమున త్రియోదశారత్ని మాత్రముగా నశ్యబంధన రజ్జువు నిర్మితమైనచో నశ్వమేధము యొక్క విష్టపము సంస్కృత మగును. అభిమన్త్రణముచే నాయుర్భృత్యాదులను, నశ్వబంధనము వలన భూమ్యాదులను యజమానుడు పొందుచున్నాడు.

ఇది మూడవ యనువాకము

---

10. చతుర్వింశ త్యంగుళయోఽరత్నిః ।

4, బంధింపబడిన మేధీయాశ్వమును జలావగాహన నిమిత్తమై ప్రవాహము గల నదికి గొంపోవుదురు. ఈ యశ్వమును సంహరింతమను తలంపుతో నొక చతురక్ష శ్వాన మనుగమించును[11] ఈ కుర్కురమున కిరుపక్కల ననగా దూర్పున యజమాని మేనత్త కుమారుడు, పశ్చిమమున పినతల్లి పుత్రుడు వెంటనడతురు. ఇట్లు వీరను గమించుటచే యజమాని పాపము నశించును. స్నానజలమున నెక్కడ నా చతురక్షశ్వానము యొక్క పాదములు భూమిని స్పృశింపవో యచట నొక దాసీ పుత్రుడు సైధ్రకముతో[12] నధ్వర్యుడు 'యోఅర్వన్త' మనుమన్త్రముచే నొసంగిన ప్రేషచే సంహరించును. ఈ సంహారమువలన శత్రురూపమగు పాపమును రూపటి జేసినట్లగును. యజమానిచే నీయాగమున నిర్వర్తింపబడు బహువిధహింస వలన బొందెడి పాపము నుపశమింపజేయుటకు నా చనిపోయిన శ్వానము నయ్యశ్వపాద సంఘట్టనలచే ధట్టింప జేయుదురు. వజ్ర సదృశమైన నా డెక్కల ఘట్టనచే నది యుపశమింపగలదు. అనంతర మాశ్వానమును జలమధ్యమున దక్షిణదిశను బాఱ వైవవలయును. అశస్థానమగు జలము నందుత్పన్నమయిన ప్రిబ్బలిగడ్డి నొక కాష్ఠ మునకు జుట్టి యాయురమృతరూపములగు నా గ్రాసమును జూపి యయ్యశ్వమును తీరమునకు గొని రావలయును.[13]

ఇది నాల్గవ యనువాకము

5. ఈ యనువాకము తీరమునకు గొని రాబడిన యశ్వమునకు జతుర్దిశల గావించెడి ప్రోక్షణ విధిని దెలుపును. రాజ్యస్వరూపుడైన యధ్వర్యుడు తూర్పున బశ్చిమముఖుడై 'అనేనాశ్వేన' అను మన్త్రముతో బలక్షత్ర రాజ్యస్వరూపులగు

---

11. అక్ష్ణో రుపరిభాగేఽక్షి సదృశం బిందుద్వయ లాంఛనం యస్య శునః సోఽయం చతురక్ష :

12. మహాసార వృక్షమున లోహసమానసారము కలిగి కృష్ణాదికాది : ష్టయుక్తమై మహాతీక్ష్ణవంతమైన యా యుధముగా జేయబడిన దానిని 'సైధ్రక' మందురు. పూర్వము దేవతలు దానియందే శోకముంచిన హేతువున నామె పుత్రుడే శోక రూపమగు నా కుక్కను జంపుట న్యాయమని యధ్వర్యుడు ప్రేష యొసంగును.

13. ఇట్లు తీరమునకు గొనివచ్చుటచే యజమాని యాయువు ఖండింపబడదు.

సూర్గురు రాజకుమారులతో గలిసి యశ్వమును బ్రోక్షించును. ఇది యజమానికి బల సంపాదనము ననుగ్రహించును. బ్రహ్మ బలస్వరూపుడు. ఆయన దక్షిణదిశను నుత్తరముఖుడై రాజానర్థులు, క్రూరులునగు శతసంఘాత రాజపుత్ర పరివేష్టితుడై యా మంత్రముతోనే యశ్వమును బ్రోక్షించును. ఇదియును యజమానికి బలము చేకూర్చెడి క్రియయే యగుచున్నది. భూమస్వరూపుడగు హోత ప్రాఙ్ముఖుడై నూరుగురు గ్రామాధిపతుల. సారథులతో నదే మన్త్రముతో బ్రోక్షించును. దీని ఫలితమున మహదైశ్వర్యసంపన్నమైన ప్రజలకు ప్రభుడగును. ఉద్గాత ఉత్తరమున దక్షిణాభిముఖుడై వైశ్యశూద్రులకు గలిగిన నూరుగురు క్షత్రసంగ్రహీతులగు కుమారులతో నయ్యశ్వమును బ్రోక్షించును. ఉద్గాత అయుస్స్వరూపుడగుటచే యజమానికి కార్యమున నాయువు గల్గును.

ఇది యైదవ యనువాకము

6. స్నాతాశ్వమునుండి జలకణములు భూమిపై బడుట దోషము. తద్దోష శమనార్థ మధ్వర్యుడు 'అగ్నయేస్వాహా' అను మంత్రమూదిగా 'వరుణాయస్వాహా' మంత్రి పర్యంతముగల పది ఋక్కులను స్కన్నమైన జలబిందువను నరణముగా బఠించును. దీనివలన నయిదోషము పరిహరింప బడుటయే గాక యాగాశ్వమును సర్వజలబిందు సహితాశ్వమేధహోమము చేయబడినట్లగును. దశమంత్రి సంఘము నొక్కొక యావృత్తిగా పది పర్యాయము లొనర్చుట వలన దశాక్షర స్వరూపపుడగు విరాట్టు బహ్వన్న ప్రాప్తుడగును. ఈ దశమంత్రా వృత్తి చేయని యాజమాని కిహలోక ప్రతిష్ఠ కలుగక చ్యుతుడగును. ఈ యపరిమిత మంత్రానువచనమున యజమాని స్వర్గమును బొందును. అగ్నిస్వరూపమగు భూమియందు బడిన జలబిందువుల ననుసరించి స్వాహాకార మంత్రపఠనమున నగ్న్యాది దేవతలకే జలబిందువులను హోమము గావించినట్లయి వర్షోదకప్రాప్తి యజమానికి సంభవించును, ఒక సమయమందు ప్రజాపతి స్తోక్యానువచన మంత్రముననే యశ్వమేధక్రతు సమాప్తి చేసెను. దీనివలన యజ్ఞద్రవ్య మస్కన్నమగుటచే దీని ప్రశంస నధ్వర్యుడు చేయును, మిగిలిన దంతయు ప్రతిపత్తి కర్మయే యగుచున్నది[14]

ఇది యారవ యనువాకము

14. ఉపయుక్తస్య అకీర్ణకరస్య విహితదేశే ప్రక్షేపః ప్రతిపత్తి కర్మ ఇత్యుచ్యతే[1] స్కన్నమన జారుట యని యర్థము.

7. ఆనంతర మధ్వర్యుడు యాగాశ్వమునకు ప్రాగాది నల్దిక్కులందు 'ప్రజాపతయేత్వా' 'ఇంద్రాగ్నిభ్యాం' 'వాయువేత్వా' 'విశ్వేభ్యస్త్వా' అను మంత్రములతో బ్రోక్షించును. ప్రజాపతి దేవతలలో మహాన్నభక్షణ సమర్థుడు ప్రసిద్ధుడు. తత్కారణమున ప్రజాపతి నుద్దేశించి యాగాశ్వమునకు ప్రాఙ్ముఖమున నధ్వర్యుడు ప్రోక్షించును. దీనివలన బశువులందు నీయశ్వ మన్నాదము, వీర్యవత్తము నగుచున్నది. దేవతలందు ఇంద్రాగ్నులోజోబల సంపన్నులు. అశ్వమునకు దక్షిణపు బార్శ్వమున బ్రోక్షించిన హేతువున తద్దేవతల యోజోబలములు ఈ యశ్వమునకు సిద్ధించును. ఉత్తరదిశ యందు విశ్వే దేవతల నుద్దేశించి ప్రోక్షించుటచే వారికి గల యశ మియ్యశ్వమును జేరును. దేవతందఱకు బూజ్యులయిన హేతువున 'దేవేభ్యస్త్వా' అను మంత్రముచే నశ్వాధోభాగ ప్రోక్షణము జరిపి యమ్మేధ్యాశ్వమును పశుగణములో మిక్కిలి పూజనీయమైన దానిగా నధ్వర్యు డొనర్చును. దేవతాదీప్తి, కార్యదక్షత, తేజము లశ్వమునకు సంక్రమించుటకయి యశ్వోర్ధ్వభాగమున బ్రోక్షణ మొనర్చును. 'సర్వేభ్యస్త్వా' యను మంత్రముతో నీవిధి నిర్వర్తించును. ప్రోక్షణవిధిచే సర్వప్రాణులు నీయశ్వమేధయాజి ననుసరించి జీవింతురు.

ప్రజాపతియే సర్వదేవతా స్వరూప మయినచో నన్య దేవతాత్మకమగు ప్రోక్షణమేల? యని బ్రహ్మవాదులు ప్రశ్నించుకొని సర్వదేవతానుగతి మేధ్యాశ్వమునందు నిక్షేపించుటకే వేరుగా బ్రోక్షించుట యావశ్యక మయ్యెనని సమాధానించుకొనినారు.

ఇది ఏడవ యనువాకము

8. ప్రోక్షితాశ్వ స్కన్నబిందు దోష నివృత్త్యర్థము 'ఈ జ్కారాయస్వాహ మొదలుగా నున్న మంత్రములతో నశ్వచరిత హోమము జేసి యయ్యాగాశ్వమును సమృద్ధముగా నానర్తురు. సర్వచేష్టారూపములు గల యీ హోమక్రియ తెలసిన యజమాని మేధ్యాశ్వ సర్వావయవములతో క్రత్వాది యందే హోమమొనర్చి క్రతుసమాప్తి నొందించిన వాడగును. వీనిని శతృరాహిత్య, బహుపశు, స్వర్గాది

15 ఈజాంకారాయస్వాహా। ఙ్కృతాయస్వాహే త్యాహ। ఏతాని వా ఽశ్వ చరితాని చరితేనే వైనగ్గ్ స్సమర్థయతి।

ప్రాస్త్రికి సావిత్రేష్టి స్విష్టకృతులకు బూర్వమే యాహవనీయాగ్ని యందుహోమము చేయవలెను.[16] అశ్వచరిత హోమానంతరము 'అంజేతాయస్వాహా' అను నలుబది యశ్వయూప హోమముల[17] నొనర్చి సర్వప్రజకు ప్రభువు సమర్థుడగుటకు సర్వస్మై స్వాహా' అను హోమ మధికముగా నొనర్పవలయును.[18]

## ఇది ఎన్మిదవ యనువాకము

9. అధ్వర్యుడు అశ్వము యొక్క దక్షిణకర్ణమందు విభూరాద్యశ్వ నామములను జెప్పించును.[19] దీనివలన యజమాని భూరాది లోకములకీ యశ్వము నొసంగిన వాడగుచున్నాడు. అనంతరము 'అగ్నయేస్వాహా'[20] అ మన్త్రము తో శత్రుంజయహోమమొనర్చి 'భూరసి భువేత్వా' అనుమంత్రముతో రాజబంధు గణ సంబధిత శతసంఖ్యాక రాజపుత్ర పరివేష్టితమైన యశ్వమును స్వేచ్ఛా సంచా రార్థము వదలుదురు. ఇట్లు ప్రవిముక్తముగా బడిన మేధీయాశ్వము నిశాకాలమందు రాజపుత్రులేమఱియుండగా దప్పించు కొనిపోవునను భీతిచే సాయంతనమున రథ కారుని గృహమున[21] మంత్రసామర్థ్యమున నశ్వ బంధనము నొనర్తురు. అశ్వ పాదస్థానములందు 'ఇహధృతి', 'ఇహవిధృతి', ఇహరన్తి', ,ఇహరమతి' యను

---

16. సావిత్రమష్టాకపాలం నిర్వపతి । 'స్విష్టకృతః పురస్తాత్' ఇతికాలవిధిః ఆహవనీయ ఇతి దేశవిధిః

17. జగతీఛందస తత్సంఖ్యాయుక్తా ఉక్తరో పేతత్వాత్ పశూనాం జగతీఛందోల భ్యతే । తేనాశ్వస్య జగతత్వా తాదృశో శ్వః ప్రజాపతి ర్దేవతాకః ।

19. ఏక మతిరిక్తం జుహోతి ।తస్మాదేకః ప్రజాస్వర్ధుకః।

19. విభు, ప్రభుః అశ్వ, హయ, అత్య నర, అర్య, సప్తి వాజి, యయు వసు దశనామములు.

20. అగ్నయేస్వాహా, స్వాహేంద్రాగ్నిభ్యామ్, స్వాహాప్రజాపతయే, స్వాహా విశ్వేభ్యో దేవేభ్యః, స్వాహా సర్వాభ్యో దేవతాభ్యః ।

21. బ్రాహ్మణ్యాం క్షత్రియా దుత్పన్నో మాహిష్యః । క్షత్రియాయాం వైశ్యా దుత్పన్నో కరణీ। తస్యాః కరణ్యాం మాహిష్యా దుత్పన్నో రథకారః ।

మంత్రములచే హోమ మొనర్చుటయే యశ్వబంధనము.[22] అశ్వము పట్టుబడరాదు. పట్టుబడినను విడిపింపలేని సామర్ధ్య హీనుడైన ప్రభువు ఈ యాగము తలపెట్టినచో చతుశ్శతసంఖ్యాక వీరులను రాజు సిద్ధము చేసి యశ్వరక్షణ మొనర్ప జేయవలెను. రాష్ట్రమును, రాష్ట్రాంతరమును బొంద యత్నించుటయే యజమాని కర్తవ్యము గాని రాష్ట్ర భ్రంశము నొంది చ్యుతుడగుట కాదు. వీరు సయితము తమ యసమర్థతను వెలార్చినచో నయ్యశ్వము నష్టమగుటచే, నట్టియశ్వమునే మఱియొక దానినితెచ్చి దానిని పూర్వము వలెనే ప్రోక్షింపవలెను. ఇదియే పూర్వాశ్వ నష్టమునకు ప్రాయశ్చిత్తమగు చున్నది.

ఇది తొమ్మిదవ యనువాకము

10 ప్రజాపతి యశ్వమేధార్థము తప మొనర్ప ముఖ్య ప్రాణరూపమగు సప్త సంఖ్యాక దేవత లాయననుండి వెల్వడిరి. తత్కారణమున దీక్ష సప్త దేవత్మాక మయ్యెను. ప్రజాపతి తద్దీక్ష యందు 'స్వాహాధిం' అను[23] సప్త వైశ్వదేవమంత్ర

---

22.

| | | |
|---|---|---|
| 1. ఇహధృతి | దక్షిణపూర్వపాదస్థానము | నైశ్చల్యమునకు |
| 2. ఇహవిధృతి | వామపూర్వపాదస్థానము | ధారణమునకు |
| 3. ఇహరన్తి | దక్షిణ పృష్ఠ పాదస్థానము | స్థైర్యార్థము |
| 4. ఇహరమతి | వామపృష్ఠ పాద స్థానము | క్రీడార్థము |

23. 1, 2 దినములు హోమ మొనర్చవలసినవి.

స్వాహా ధిమాధీతాయ, స్వాహా ధీతం మనసే, స్వాహామనః ప్రజాపతయే, కాయ, కస్మై, కతమస్మై అను (6) మంత్రములు, 3వ దినమున అదిత్యైస్వాహా దిత్యైమహ్యై స్వాహా, అదిత్యైసుమృడీకాయస్వాహా (3), 4వ దిన మున సరస్వత్యై సరస్వత్యై బృహత్యై, సరస్వత్యై పావకాయై, 5వ దినమున పూష్ణే, పూష్ణే ప్రపథ్యాయ, పూష్ణే నిరంధరాయ, 6వ దినమున త్వష్ట్రే, త్వష్ట్రే తురీపాయ, 7వ దినమున విష్ణవే, విష్ణవే నిఖుర్యపాయ, విష్ణవే విభూయపాయ.

ద్రష్టయై సప్త దినములు హోమమొనర్చి దీక్షను స్వాధీన మొనర్చు కొనెను. మూడు వైశ్వదేవ హోమములు వరుసగా నేడు దినములు చేయుటచే ద్వాదశ మాసములు, పంచ ఋతువులు, త్రిలోకములు, బ్రహ్మలోకమును జేరుటకు బ్రకాశ మానమైన యాదిత్య మండల మొకటి కలిసి ఇరువది యొకటి యగుచు నేకవింశతి దేవలోకములను యజమానుడు పొందిన వాడగున్నాడు.[24] అదియును గాక నశ్వ మేధానుష్ఠాన యోగ్యతను, నన్నప్రాప్తిని గూడ చెందును. పూర్ణాహుతి సప్తాహదీక్షతో నొనర్చుటచే యజమానుడు తత్ఫల సంపాదనము చేయును

ఇది పదియవ యనువాకము

పదునొకండవ యనువాకములో పూర్వోదితహోమ విషయము విస్తరమైనది.

12. అశ్వము ప్రవిముక్తము కాగా యజమాని యజ్ఞప్రదేశ మందా సంవత్సరము నిర్వర్తింపవలసిన కార్యమున్నది. ప్రాతర్మధ్యందిన సాయం సవన ములను నిత్య మొనర్ప వలయును. సవితృ దేవతాకమైన యష్టాకపాల పురోడాశ నిర్వపణ ప్రాతః కాలముననను, ప్రసవితృ దేవతాకమైన యేకాదశ కపాల పురోడాశ నిర్వాపము మధ్యందిన మందును, ఆసవితృదేవతాకమైన ద్వాదశ కపాల పురోడాశ నిర్వాపము సాయం సమయముననను చేయవలసి యున్నది. ఉదయమున గాయత్రి, మధ్యందినమందు త్రిష్టుప్, సాయమున జగతీఛందము లధివసింతురు. ఈ యిష్టులను యజమాను డొనర్చుటచే నాయా ఛందముల యనుగ్రహముచే నశ్వమేధము నిర్మించిన వాడగుచున్నాడు.

దేవతలనుండి యెకప్పుడు ప్రజాపతి ప్రచ్ఛన్నుడై యశ్వరూప ధరుడై యశ్వత్థవృక్ష మందుండెను. తత్కారణముననే యది యశ్వత్థవృక్ష మైనది. అతడిట్లొక సంవత్సరకాల మాత్ర మధివసించుట చేత యాగము సంవత్సర దీక్ష నొందినది. అశ్వత్థ కాష్ఠముతో[25] నిర్మించిన శాలయందు స్వేచ్ఛా సంచారము

---

24. ఏకవిగ్ంశతి వైశ్వదేవాని జుహోతి। ఏకవిగ్ంశతిర్వై దేవలోకాః।
ద్వాదశమాసాః। పంచఋతవః (హేమంత శశిరములు కలిపి యొకే ఋతువుగా పేర్కొనబడెను.) త్రయఇమేలోకాః। అసావాదిత్య ఏకవిగ్ంశః।
25. అశ్వత్థో వజ్రో భవతి।

పూర్తియై, మరలిన యశ్వము నుంచవలెను. రాత్రి కాలమున నెచటకు బోవకుండుట కయి అవహనీయాగ్ని యందు ఇహధృతి మొదలుగా గల నాల్గు మంత్రములతో హోమ మొనర్చుటచే నయ్యశ్వము దిక్కులచే గట్టినట్లగును.

ఇది పదిరెండవ యనువాకము

13. గత యనువాకములో జెప్పబడిన యిష్టులు సంవత్సర కాలము నిర్వర్తించిన యనంతర మూఖాసంభరణము చేయవలయును. 'అబ్రహ్మన్' అను మంత్రారంభానువాకముతో నీయిగ్న్యుపస్థానమును పఠింతురు. ఈ విధమైన యుపస్థాన మంత్ర సామర్థ్యమున బ్రాహ్మణుడు బ్రహ్మ వర్చస్సు నొందును. ప్రభువు శూరుడగును. గోవు సమృద్ధిగా క్షీరమొసంగును. అనడ్వాహము వీర్యవత్తమ మగును. తురంగము వేగము కలది యగును. స్త్రీ రూపవతి యగును. రథికుడు జయశీలుడగును. యజమాని శూరసంతతిని బొందును. ఇచ్ఛామాత్రమున మేఘ ముత్పన్నమై వర్షించును. ఓషధులు సమృద్ధిగా ఫలించును. అశ్వమేధయాగము జరిగిన నాట జనులకు యోగక్షేమములు కలుగును.

ఇది పదుమూడవ యనువాకము

14. ఇక్కడ నుండి వరుసగా హోమానువాకము లున్నవి. ఇది యన్నహోమమునకు సంబంధించినది. యజ్ఞశాలలో నా రాత్రి యందధ్వర్యుడు ఖాదిరస్రువములతో నన్నహోమ మొనర్చును. మొదట ప్రజాపతి యశ్వమేధమును సుపల కొనసంగిలేదు. దాని యందు భాగలబ్ధులు కావలెననెడి కోరికను దేవతలు ప్రజాపతికి దెలిపిరి. ఆయన అన్నహోమములతో మాత్రము దేవతలను సంతోషపెట్టెను. కనుక నీ యన్నహోమము సర్వదేవతాతృప్తి కొఱకని తెలియవలయును. అగ్ని నాజ్యమున, మహాదేవుని మధువుతోడను, వసువులను తండులము తోడను, రుద్రుల నటుకులతోను, ఆదిత్యులను లాజలతోను, విశ్వదేవతలను కరంభము (అజ్యమిశ్రితసక్తువు) తోడను, నక్షత్రములను ధానము (భర్జించిన యవలు, తండులములు) తోడను ప్రజాపతిని ఉత్తరదేశమున వ్యవహారము నందున్న మసూన్య మసు ధాన్యము వలన వచ్చెడి పిష్టముతోను హోమము లొనర్చి యా యా దేవతలను సంతోషింప జేయవలయును. ఆ యా వస్తు విశేషముల కా యా దేవత లధిదేవతలు గనుక వానినే హోమ మాచరించుట కర్తవ్యము. ప్రియంగు తండులములతో బూర్వము దేవతలు అశ్వాంగములను జేకూర్చుటచేత వానితో

హోమ మొనర్చిన నయ్యశాంగములను సంపాదించినట్లగును, దశాన్నములను హోమము చేయుటతో విరాట్టు దశాక్షర సమన్వితము గాన నీ విరాట్టు సమస్తావయవములను యజమానుడు పొందినవాడగును.

ఇది పదునాలుగువ యనువాకము

15. రాత్రి యందు అనుష్ఠానయోగ్యమగు నన్నహోమములచే ప్రజాపతి రాక్షస మారణ మొనర్చును. వారు రాత్రిచరులు గాన యజమానియు నీ యన్న హోమమును తత్కాలమందు నిర్వహించి రాక్షససంహార మొనర్చును. ఆజ్యము వజ్ర స్వరూపమయిన హేతువున హోమముల కాద్యంతము న్నందాజ్యహోమమే చేయవలెను. దీనివలన యజమానికి నాద్యంతములందు ఖండితాయువు సంభవింపదు. ప్రాణసంపాదనము జరుగును. 'ఏకస్మై' మొదలుగుకొని 'శతాయ'[26] అనువరకు పది యనువాకములలోని మంత్రములతో నాజ్యాన్నహోమముల నయుజాయుజ క్రమమున హోమమొనర్ప వలెను. ఇట్లు వ్యత్యాస హోమ మొనర్చుటచే నుభయ ప్రాప్తుడగును. అనగా నన్నహోమముల వలన గవాదికములను, నాజ్యహోమముల వలన భూస్వర్లోకప్రతిష్ఠయు నొందును. శతనాడుల యందును దశేంద్రియ సంచారము కలుగును. తత్ఫలితముగా బురుషునకు శత వీర్యత్వము కలుగును.

ఇది పదునైదవ యనువాకము

16. పై యనువాకము నందు జెప్పబడిన హోమవిశేషము లిందు విస్తరింప బడెను. కొందఱు ప్రజాపతిని పొందుటయే యశ్వమేధఫలమని పేర్కొనగా నితరబ్రహ్మవాదులు 'ఏకస్మై' యను మంత్రముచే నొనర్పబడు హోమమువలన ప్రజాపతి యొక్కడై న కారణమున నాతని పొందుట సత్యమేననియు, ద్విత్రిచతు రాది క్రమమున హోమమొనర్చుట చేత సర్వభూతప్రాప్తిని' స్వర్గప్రాప్తిని, సంతత భోగానుభవములు యజమానికి గలుగు ననిరి. 'అయుతాయ' అను మంత్ర

---

26. ఏకస్మా, ఏకస్మై, ద్వాభ్యాం, త్రిభ్య: చతుర్భ్య:, పంచభ్యో, వింశత్యై, పంచశతే, శతాయ - ఈ పది యనువాకములు సప్తమ కాండములోని ద్వితీయ ప్రపాఠకము లోనివి.

హోమముచే ముల్లోకములను గూడి పదార్థాంతరములను సైతము పొందును. అహోరాత్రాభిమాన దేవతా స్వాధీనమునకయి 'ఉషసే స్వాహా' అను మంత్రముతో నొక హోమ మధికముగా జేయవలయును.

ఇది పదునాఱవ యనువాకము

17. ఇందశ్వనామ హోమములు పేర్కొనబడినవి. విభుప్రభ్వాద్యశ్వ నామ హోమము లొనర్పవలయును. వీనిచేత నుభయలోక సుప్రతిష్ఠుడగును. శత్రుంజయత్వము ప్రాప్తించును. తత్తదృతువుల యందు వాంఛితఫల ప్రాప్తి డగును. 'దద్భ్యస్స్వాహా' అను మంత్రము మొదలుగా గల నంగ మంత్రహోమము లచేత యజమానికి ప్రత్యంగము అందు సంక్రమించిన పాపము పోవును. 'అంజ్యే తాయ' అను రూపమంత్ర హోమముచే రూప సమృద్ధి నొందును. ఓషధీభ్యస్స్వాహా' అను ఓషధీ మంత్ర హోమమున సర్వౌషధులు ప్రాప్తింప జేసికొనిన వాడగును.[27] 'వనస్పతిభ్యస్స్వాహా:' అను వనస్పతి మంత్ర హోమముచే నీవారాదికములను, 'మేషస్త్వా' అను అపావ్య మంత్ర హోమమున[28] ప్రాణరక్షణము, తద్వారమున దేహ సంరక్షణము, 'కూప్యాభ్యస్స్వాహా' అను నుదకమంత్ర హోమములచే నుదకములు, నుదకమువలన నన్నప్రాప్తిని యజమానుడు సమృద్ధిగా పొందును.

ఇది పదినేడవ యనువాకము

18. ఉదకములు భూలోక స్వరూపము. ఉదకాధిపతులు వసువులు. ప్రకా శకు డగ్నిదేవత. భూలోకమును, వసుసాయుజ్యము, అగ్నిర్జ్యోతిని యజమానుడు పొందుటకు 'అంభాగ్ంసి జుహోతి' యను మంత్రముతో హోమ మొనర్చును. నభస్సు అంతరిక్ష స్వరూపము. అధిపతులురుద్రులు. ప్రకాశకుడు వాయువు. వీనిని వశ మొనర్చు కొనుటకు 'నభాగ్ంసిజుహోతి' అను మంత్రముతో హోమమొనర్చును. మహస్సు స్వర్గలోక స్వరూపము. అధిపతు లాదిత్యులు. ప్రకాశకుడు సూర్యుడు. వీనిని వశమొనర్చుకొనుటకు 'మహాగ్ంసిజుహోతి' యను మంత్రముతో యజమానుడు హోమ మొనర్చును. 'నమోరాజ్ఞ' అను మంత్ర హోమముచే ప్రజాస్వామిత్వము.

---

27. ద్వాభ్యోవా ఓషధయః। పుష్పేభ్యో ఽ న్యాః ఫలంగృహ్ణన్తి। మూలేభ్యో ఽ న్యాః। తాఏవో భయీరవరున్ధే।

28. స్వయమితరరక్షకత్వా దన్యరక్షా నిరపేక్షేత్యర్థః।

'మయోభూర్వాతో' అను మంత్ర హోమముచే 'పశుప్రాప్తి', 'ప్రాణాయ స్వాహా' అను హోమంత్రమముచే సంతత స్వర్గప్రాప్తి, 'సితాయస్వాహా' అను మంత్ర హోమముచే సర్వదా స్వర్గ సంబంధము కలుగును. అనంతర మొనర్చెడి హోమములును స్వర్గ ప్రాప్తిని కల్గించెడివేయగును౹౹. ఇటు లన్న హోమములతో గూడిన యీ కార్య మశ్వమేధ యాజికిని, ననుష్ఠాన విదునకు సమఫలమును గల్గించును.

ప్రథమ దినము నందలి రాత్రి కార్యక్రమము హోమములతో ముగియుచున్నది. ఈ క్రతువు త్రిరాత్ర రూపము.

ఇది పదునెన్మిదవ యనువాకము

19. త్రిరాత్రి క్రతువగు నీ యశ్వమేధము నందు ప్రథమరాత్ర మందు అన్న హోమ క్రియా స్వరూపము వివరింపబడెను. తత్పూర్వ దినమందే నిర్వర్తింప వలసిన యూపసంఘ వివరణ మీ యనువాకము నందు విధింప బడుచున్నది.

యూపస్థాపనవిధి యితర క్రతువులలో నొకటిగాని, పదునొకండు గాని యని మతభేదము చెప్పబడెను. కాని యశ్వమేధమున స్వర్గజయము కొఱకు నేక వింశతియూపములు వేర్కొనబడినవి. ఈ యిరువది యొక్క యూపములలో

---

(స్వయముగా నితరరక్ష కత్వముచే నన్య రక్షక నిరపేక్షము గలది యపావ్యము')

29. 'పృథివ్యై' అను మంత్రహోమము, (భూలోక ప్రాప్తి) 'దత్వతే' (పితృలోక ప్రాప్తి) 3. కస్త్వాయునక్తి, యఃప్రాణత:, అగ్నయే సమనమత్పృథివ్యై, అను మంత్రములతో స్వర్గ ప్రాప్తిని. 6. ఆబ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ, అను మంత్రముతో బ్రహ్మవర్చసప్రాప్తి. 7. జజ్ఞి బీజమితి -అను మంత్రముతో ధాన్యాదిప్రాప్తి: 8. భూతాయ, భవిష్యతే, భూతాభవ్యో హోమాహోజుతి - అను దానిచే భూలోకమున పూర్వముననే సిద్ధించినవియు, స్వర్గ మందనంతరము సిద్ధించు భోగములు స్వాధీన మగును.

మధ్యనుండు యూప 'మగ్నిష్ఠ'30 మని చెప్పుదురు. ఇది యితర సవనములలో బైల్వ, ఖాదిర, పాలాశములలో దీనినయినను నీ కార్యముల నుపయోగింతురు. అశ్వమేధమునందు మాత్రము రాజ్జుదాల కాష్ఠమును మాత్రమే యీ యూపస్థాపనమున కుపయోగింపనగును. ఇది చతుర్వింశత్యరత్ని పరిమితముగా నుండవలయును. అశ్వమునకు రుధిర మధికముగా నుండు హేతువున నితర పశువులకు లేని యవదానసాధనమును 'తేజనీ' 31 నామమున దీనియందు నుపయోగింతురు. దీని వలన పాపము యొక్క అపహతి గలుగును. దీనికితర సాధనమును చెప్పబడుట గమనార్హము. ప్లక్షశాఖ యందితర పశ్వావదానము నిర్వర్తింప బడుచుండగా నిచట అశ్వవైతసములకు32 జన్మస్థాన మప్పులగుటచేతను, నశ్వమునకు నదియే నెలవగుటచేతను స్వస్థానమందే యవదానము చేసినట్లగును. 'రోహితో ధూమ్రరోహిత :, అని చెప్పబడిన పశువులు గ్రామ్యములు. 'ఇంద్రాయరాజ్ఞే సూకర :' ఇత్యాది మంత్రములలో చెప్పబడినవి యారణ్యకపశువులు. గ్రామ్యములను యూపస్తంభములకు గట్టి, యారణ్యకములను యూపాంతరాలమున రశనతో బంధించుటచే గ్రామ్యారణ్య వివేచనము స్పష్టమగును. గ్రామ్య పశువులను యూపములకు నాలంభము చేసి, యారణ్య పశువులను పర్యగ్నికరణా నంతరము విసర్జించవలెను. అట్లొనర్చిన యజమానుడు పాపమునుండి విముక్తి నొందును.

ఇది పందొమ్మిదవ యనువాకము

20 ఆహవనీయ సమీపమునందు రాజ్జుదాలాగ్నిష్ఠ యూపమును స్థాపించవలెను. గర్భాదిపథాదోషము నశించుట యీ స్థాపనము వలని ఫలము. ఈ ప్రధాన యూపమున కిరువైపుల నొక్కొక్క దేవదారు యూపమును, నట్లే మూదేసి బైల్వములను, మూడు ఖాదిర యూపములను మూడు పాలాశములను స్థాపనము చేయవలెను. పౌతుద్రవము వలన యజమానికి పుణ్యగంధము, బైల్వము వలన

9. 'యదక్రందచే' వశీకరణము.

30. ఆజ్యధార కొఱకు నడిమిని పొడవుగా రెండు పలకలుగా దొలువబడిన యూపము నందలి మధ్య భాగమును నగ్నిష్ఠ మందురు.

31. అశ్వస్య రుధిరస్య ధారయిత్రీ స్రుక్ తేజనీ త్యుచ్యతే ।

బ్రిహ్మ వర్చసము, ఖాదిరమువలన తేజము, పాలాశము వలన సోమపానము ప్రాప్తించును[32]. ద్వాదశ మాసములు, పంచఋతువులు, మూడులోకములు, ఒక ఆదిత్యుడు కలిసి ఇరువదియొక్కటి యగుటచేత యిరువది యొక్క యూపములను స్థాపనము చేయుటచే యజమానుడు స్వర్గమునందు కానుసు. పురుషునకు శతాయుపు శతేంద్రియము లందాయురింద్రియ ప్రతిష్ఠ కొఱకు నూరు పశువ్రీ యాగమునకు జెప్పబడును. స్వర్గ ఫలప్రాప్తి యపరిమితము గావున పశువు లపరిమితముగా నుండవలెను. సంఖ్యా నియమరహితమే కర్తవ్యము. అశ్వ, తూపర, గోమృగ హవిస్సుల నగ్నికి నుత్తరమున సాదితముకాగా నితరపశ్వపదాన హవిరాసాదనముగు దక్షిణదిశ నొనర్చు. నీ వైషమ్యమేల ? యని బ్రహ్మవేత్తల ప్రశ్నకు నుత్తరవాదు లిట్లు చెప్పుదురు. అశ్వము ప్రజాపతి దేవతాకము. వరుణుని కొఱకు దానినిచ్చెను[34]. కనుక నశ్వము వరుణ సంబంధి యగును. ఇది సర్వానిష్టనివారకత్వము చేత నుత్తరదిక్సంబంధియు నగుచున్నది[35], ఈ కారణమున నయ్యశ్వావదానము హవిరావదానము స్వకీయమైన దిశయందే సాదితమయినట్లు భావింపనగును. ఇతర పశువులను దక్షిణదిశ యందవదానము చేయుటచే బహుదేవతా

---

32. రాజ్జుదాల మేకవిగ్ంశ త్యరత్ని మగ్నిష్ఠం మినోతి పౌతుద్రవాఖిత ద్వయో బైల్వాదక్షిణతస్త్రయ ఉత్తరస్త్రయః ఖాదిరా దక్షిణతస్త్రయ ఉత్తరస్త్రయ పాలాశా దక్షిణస్త్రయ ఉత్తరస్త్రయ, ఇతి మాత్రకారేణ సంగృహీతమ్।

33. శృంగహీనపశు స్తూపరః, శృంగవాన్ మనుష్యహింసకో ధూర్తో బలివర్ధో గోమృగః, యద్వా గోహరిణ్యయో స్సంయోగే నోత్పన్నః సంకీర్ణ జాతి ర్గోమృగః

34. "ప్రజాపతి ర్వరుణా యాశ్వ మనయన్"

35. "ఉదీచీయ ముద్వాసయతి. ఏషావై దేవమనుష్యాణాం శాంతాదిక్"।

యాగఫలము లభించును. ఈ యవదానమును[36] వైతస శాఖలచే నిర్మింప బడిన యాసనము మీద నుంచినచో స్వకీయమైన స్థానమందుంచి నట్లగును. తూపర హవిస్సును అశ్వ హవిస్సునకు బ్రాగ్దిశయందు, గోమృగహవిస్సు పశ్చిమ దిశ యందుంచుటచే నశ్వ ప్రాణాపానములు సమముగా ధరింప జేసినట్లగును. అశ్వ తూపర గోమృగ హవిస్సులను లేశ మాత్రమైనను మిగులనీయక పూర్ణముగా హోమమొనరించి అశ్వానయవప్రతిపాదకములై నాత్మ శబ్దోపలక్షితమైన స్తే గాదగ్ స్తేఖ్యాం' అనుమంత్ర జాతముచే హోమమొనర్పగా మేధీయాశ్వము జీవాత్మతో గూడి సశరీరయగును. ఈ మహారహస్య పరిజ్ఞాత స్వర్గమందు సశరీరుడై పనోర్ధారను బొందును, ఖండాయురాహిత్యము కలుగును.

ఇది ఇరువదియవ యనువాకము

21. ఈ మహా యాగమున నేకవింశతి సంఖ్యాక పురుషులచే సమ్మిళితముగా బడిన అగ్ని చయనము (ఇష్టకోపధానము) ఇరువది యొక్క స్తోమము[37] ఇరువది యొక్క యూపములు నిర్వర్తింపవచ్చు ననుచు[38] పూర్వ పక్షము చేయగా నల్పక్రతు వున కట్టిది పొసగవచ్చునుగాని, మహా క్రతువైన యశ్వ మేధమున కిట్టి యల్పతను సూచించుటలో సామంజస్యము లేదని సిద్ధాంతులు సమాధానించిరి. అశ్వమేధక్రతు వునకు త్రిశీర్షములున్నవి. ఏకవింశతి యూపములు, ఏకవింశతిస్తోమము లనునవి యాశీర్షములు. వీనిని దెలిసికొని ప్రభువులలో మూర్ధన్యుడుగా యజమాను డుండును.

ఇది ఇరువదియొకటవ యనువాకము

ఈ యనువాకమున ద్వితీయ దిన కార్యము వివరింపబడినది. దీనిని 'ఉక్థ్యాహస్సు' అనిగూడ బిలుతురు ఇది బహిష్పవమాన విధిచే నారంభమగును. ఒకప్పుడు దేవత లశ్వమేధము ననుష్ఠించుచు, బహిష్పవమాన స్తోత్రముచే స్వర్గము నెఱుంగ

36. గ్రహించుట.
37. త్రివృత్, పంచదశ స్సప్తదశ ఏకవిగ్ంశః ఏతాని వావతాని జ్యోతీగ్ంషి యఏతస్య స్తోమాః । [వీనినే త్రివృదాది స్తోమములని యందురు.]
38. యూపములకు ద్వాదశసంఖ్య ప్రమాణము లేదు గనుక నేకాదశసంఖ్యనే ప్రతిపాదించిరి.

లేకుండిరి. మఱియు మేధీయాశ్వమును స్వర్గప్రాప్తిసాధన మనియు దెలియరైరి. అశ్వము మాత్రము ప్రజాపతి దేవతాకమగుటచే స్వర్గ మార్గము నెఱింగెను, తత్కారణమున నీ మేధీయాశ్వపుచ్ఛ గ్రాహులై ఋత్విజు లుదఙ్ముఖముగా బహిష్పవమాన దేశమునకు వెళ్ళుటచే వీరికి స్వర్గలోకస్థానము తెలియుచున్నది. శాస్త్రవిధిచే మనుష్యుడు స్వర్గలోక దృష్టి కలవాడై నను నది యదృష్టముగాన బాగుగా దెలియ డయ్యెను. ప్రజాపతిశక్తి వలన తల్లోక పరిజ్ఞాన మశ్వమున కుండుటచే ఋత్విక్కులద్దాని ననుసరించుచున్నారు. ఈ విధియందుద్గాత యౌద్గాత్రమును చెప్పడు. ఏలయన, లోకములో పురుషుడు మార్గము తెలియక మఱియొక మార్గములో నడిచి యన్యప్రదేశమును జేరినట్లు నుద్గాతవలనను నట్టిదే సిద్ధించుట తథ్యము. ఈ కారణముచే నుద్గాతను నిరాకరించి అశ్వమునే ఔద్గాత్రము చెప్పుటలో నుపయోగింపవలయును. దీనివలన యజమాని నిర్ణీతపథమున స్వర్గప్రాప్తినొందును. ఈ అశ్వమునకు ముందు 'బడబ' [అడుగుఱ్ఱము] నుంచిన నుత్సాహముతో జేసెడి హిం' కారమున కనుగుణముగ నదిగూడ హింకార మొనర్చును. అది యుపగాన సదృశమగును. అధ్వర్యుడు ప్రేషనొసంగుటచే నీహీంకారోత్పన్న మగుటవలన యజమాని ఋక్సామవేద సుప్రతిష్ఠితుడగును. అశ్వోపాకరణమును కుశలతో గాక జ్యోతిరూపమగు హిరణ్యముతో నొనర్చిన తన ప్రజకంటె ముందు జ్యోతిఃసంపాదనమొనర్చి హిరణ్యకాంతిని, స్వర్గమును బొందును.

ఇది ఇరువదిరెండవ యనువాకము

23. యాగము నందు సర్వ వ్యాపారాశ్రయుడు యజమానుడుగాన ఆయన యజ్ఞరూపుడగును. అశ్వమేధము ప్రజాపతి సంబంధి గనుక నీయనయు ప్రజాపతియే యగుచున్నాడు. మహాక్రతువయిన యీ యశ్వమేధము నందు నశ్వముగూడ యూపస్థానీయమేయయి తన్మేధీయాశ్వమునకు తదశ్వావయవ సంబంధిత పశుగణమును నియోజన చేయవలెను. దీనివలననితర పశు రూపయాగమును యజమాని సాధించినట్లగును. అగ్నిష్ఠమునకు నశ్వతూపర గోమృగములను నియోజింపవలెను. దీని ఫలిత మేమన ప్రభుసేనాగ్రమున నడుచు దళములు శౌర్యమునొందును. లోకములో పుడమిఱేడు భయంకరుడు గదా! అశ్వలలాట పూర్వభాగమున నగ్నిదేవతా కమగు నజమును, పశ్చిమమందు పూషదేవతాకమగు పశువును నియోజన చేయవలెను. దీనివలన రాజునకిరువైపుల న న్నాద్యులుండి యాయన నన్నాదునిగ నొనర్తురు. అశ్వము

పైభాగమున నింద్రదేవతాక పశువును నియోజింప వలెను. అశ్వబాహువులందు రెండు పశువులను యజమాని బాహువీర్యలబ్ధికయి నియోజనము గావింపవలెను. అశ్వోరువులకు రెండు పశువులను గట్టుటచే ప్రభువు యూరువులకు బలము కలుగును. ఈ పశువులు త్వష్ట్రదేవతాకములు. అశ్వపృష్ఠమునకు బృహస్పతి దేవతాకములగు రెండు పశువులను నియోజింప వలయును. దీనివలన యజమాని బ్రహ్మవర్చస్వంతుడగును. అశ్వమునకు ప్రకృతిచే దిశలయందు బశ్వాలంభ మొనర్చుటచే యజమానికి గవచప్రాప్తి, వీర్యప్రాప్తియు గలుగును. ధాతృదేవతాక పశువు నశ్వాధో భాగమునకు, సూర్య దేవతాక పశువు నశ్వ పుచ్ఛమునకు నాలంభము చేయుటచే నశ్వమునకు బ్రతిష్ఠ, ధైర్యము కలుగును. ఇవి మొత్తము పదునొకండు పశువులు.

ఇది ఇరువది మూడవ యనువాకము

8వ ప్రపాఠకము సంపూర్ణము.

1. ప్రజాపతిచే సృజింపబడిన యశ్వమేధ మొకప్పుడాయన నుండి విడిపోయెను.[37] ఆ సమయమున ప్రజాపతి యష్టాదశ సంఖ్యాక పశు[38] సంబంధమయిన దశానువాకములు పేర్కొనిన నూటఎనుబది పశువుల నాలంభము చేసి యశ్వమేధమును, పశువులను స్వాధీన మొనర్చుకొనిన వాడయ్యెను. ద్వాదశ మాసములు, పంచఋతువులు, సంవత్సరము కలిపి యష్టాదశ సంఖ్య యయ్యెను. ఈ పశ్వాలంభమున యజమాని సంవత్సరమును సయితము పొందును. అగ్నిష్ఠ యూపము కాక మిలిగిన యిరువది యూపములకు నవసంఖ్య ప్రకారము పశువులను బూన్చవలెను. అట్టిచో 180 పశువుల కాలంభము జరుగును. యజమాని దీనివలన వీర్యవత్తముడగును. యూపనిర్దేశములేని పశువుల నగ్నిష్ఠమున కాలంభము చేయవలయును. యూపమధ్యమ మందున్న నారణ్య పశువులను[39] యజ్ఞ సమాప్తి

37. అశ్వమేధ యాగాభిమానీ దేవః।

38. రోహితో 'ధూమ్రరోహిత ః అను మొదలుగా గలిగిన యనువాకములు పది యున్నవి. ఇందొకొక్కొక్క యనువాకమున బేర్కొనిన పశువులు 18. ఏకైకస్మి న్ననువాకేఽ ష్టాదశసంఖ్యాకా పశవః ఆమ్నాతా ।

39. 'ఇంద్రాయ రాజ్ఞే సూకరః' ఇత్యాద్యను వాకములందు బేర్కొనిన పశుగణము.

వరకు ప్రయోగము కూడదని యందున్న దోషములను, పితాపుత్ర విరోధము, అధ్వమధ్య సంచార పురుష విరోధము, బహుదూరములయిన గ్రామ సీమలందు భయంకరవ్యాఘ్రి, భల్లూక, చోరాది సంచారములుగా బేర్కొనినారు.

క్రతుసమాప్తి వరకు నారణ్య పశువులకు బశుకర్మ యొనర్పవలయునా? వీని కాలంభము కలదా? లేక పర్యగ్నికరణా నంతర ముత్సృజ్య విధాన మనుసరింప వలెనా యనునది విచార్యము. దీనికి బూర్వపక్ష మిట్లున్నది.

1. వీనికి బశు కర్మలేదు గాన నివి పశువులే కావు.
2. ప్రయోగమున్నచో నల్పకాలమునకే మృతినొందిన యజమాని యాయన పుత్రులచే నారణ్య పశునివాస స్థానమైన యరణ్యమునకు గొనిపోవబడి యచట యగ్న్యాహుతుడుగా నొనర్పబడును.
3. అరణ్య పశ్వాలంభము లేనిచో యజమానికి బశుప్రాప్తి లేదు.
4. పర్యగ్ని కరణానంతర విసర్జనమగుచో పశుప్రయోగ సమాప్తి లేదు. కాన యజ్ఞ విఘాతమగును.

ఈ పూర్వపక్ష మిట్లు సిద్ధాంతము చేయబడినది.

1. అరణ్య పశ్వాలంభము కొఱకు చేయు నుపాకరణముచేతనే నాలంభదోషమును తొలగించి పశుప్రాప్తిని గలిగించును.
2. ఉపాకృత పశువుల యందు బర్యగ్ని కరణమే పశుకర్మ.
3. తత్పశుకర్మ మనుష్ఠింపబడెను గాన యజ్ఞవిఘ్నము సంభవింపదు.
4. అరణ్య పశు విశసనము శాస్త్ర విధికాదు కాన యజమానికి శీఘ్ర మృతిగాని, మృతయజమాని కరణ్య ప్రాప్తిగాని లేదు.

యజ్ఞ సమాప్తి పర్యన్తము ప్ర యో గిం చె డి పశువులకు క్షేమమని పేరు. అరణ్య పశువులకు యజ్ఞ సమాప్తి పర్యంతము ప్రయోగ ముండుట వలననే పితాపుత్ర విరోధాది దోషములు చెప్పబడెనో అవి యిచట నుండవు.

ఇది ఒకటవ యనువాకము

2. ప్రజాపతి భూస్వర్లోక సంపాదనమునకయి గ్రామ్యారణ్య పశువుల నాలంభము చేసెను. అట్లే యజమాని తద్విధమయిన పశ్వాలంభముతో నుభయ

లోకములను బొందును. చైత్రపౌర్ణమాసాది సంవత్సరకాల మందాగతమయిన చాతుర్మాస్య పర్వమునందు విహిత పశ్వాలంభముచేసి సంపూర్ణవత్సరమును స్వర్గమును బొందును. 'ఆగ్నేయంకృష్ణగ్రీవే' త్యాది, ప్రావృత, 'అగ్నయే నీకృతే' త్యాద్యాశ్వమేధిక యేకాదశసంఖ్యాకమగు పశ్వాలంభము చేసి ప్రజా పశుసంపదను యజమానుడు సంపాదించును. ఇట్లే దశనామక పశ్వాలంభముచే నన్నమును, ఏకాదశానువాకములలో చెప్పబడిన పశ్వాలంభమునొనర్చి త్రిష్టుప్ఛంద స్సహితమైన పశువులను పొందును. బహురూప, నానాదేవతాక రూపములు పశువులయిన హేతువున నశ్వము సర్వదేవతాక మగుచున్నది.

ఇది రెండవ యనువాకము

3. అశ్వమేధయాజి గ్రామ్య పశ్వాలంభముచేత 'భూలోక ప్రాప్తియు, నారణ్య పశ్వాలంభముచే స్వర్లోక ప్రాప్తియు నుభయ పశ్వాలంభముచే నుభయ లోకప్రాప్తిని బొందును. 'త్రయఇమేలోకా:' అనుటచేత ఒక్కొక్క దేవతకు మూడు పశువుల చొప్పున నాలంభము గావించి మూడులోకములను యజమాని పొందుచున్నాడు. బహుపశువుల నాలంభము గావించుటలోని యౌచిత్యమును బ్రహ్మవేత్తలిట్లు సమర్థించుచున్నారు. లోకమునందొక్కొక్క పురుషునకు పుత్రపశు ధనాది విషయకమైన బహువిధ కామములుండుట కానవచ్చుచున్నది. తత్కారణమున బహుకామసాధన నిమిత్తము బహుపశ్వాలంభము గావించుట యుక్తమే యగును. ఉదాహరణమునకు ప్రజాపతికి 'రోహితో ధూమ్రరోహిత కర్కన్ధురోహిత' మనుమూడు పశువుల వపాహోమము త్రిలోక ప్రాప్తికి ఒకేపర్యాయ మొనర్పవలయును. అరణ్యపశువులకు మాత్రము పర్యగ్నికరణ మాత్రమే.

ఇది మూడవ యనువాకము

4. ఇందు రథయోజనాలంకారాదులు విధింపబడుచున్నవి. "యుంజంతిబ్రధ్న" మను మంత్రముతో ఋత్విక్కులు సర్వదేవతాకమైన అశ్వమును యుగదక్షిణ పార్శ్వమందు బంధించుటచే నాదిత్యుడు మొదలైన దేవతలే యజమాని కొఱకు బంధింపబడిన వారగుదురు. 'యుంజత్యస్యకామ్య' అనుమంత్రముచే ప్రష్ట్యశ్వములను గట్టుటచేత[40] యజమాని స్వర్గాది లోకప్రాప్తికయి ద్యావాపృథివ్యాదులనే రథమునకు

---

40. "అశ్వస్యపార్శ్వ వర్తినా వశ్వౌ ప్రష్టీ ఇత్యుచ్యతే" సూత్రకారేణ.

గట్టినట్లగును. 'కేతుంకృణ్వన్' అను మంత్రముచేత రథధ్వజమును స్థాపింప వలయును. ధ్వజప్రతిష్ఠాపముచేత రాజులలో నీ యజమాని యశమును బొందు చున్నాడు. అనంతరము ప్రభువు రథారోహణ మొనర్చి యుత్తర దిశగా జల సమీపమును గుఱిచి పయనించును. అచట నధ్వర్యుడు రాజుచే 'యేతేపంథానః' అను మంత్రమును జయార్థము పలికించును. యజమానిచే నుపాకరణ సంస్కృతమయిన పశువున కన్య దేశ గమనము జరిగినచో యజ్ఞ విచ్ఛిత్తి సంభవించును. గాన "ఏతగ్గస్తోతరేతేన' అను మంత్రమును జపింపవలెను. దీనివలన నశ్వపృష్ఠ భాగమునందు వాయువు మేధీయాశ్వమును పోషనీక మసల్చును.

పూర్వము మొనర్పబడిన హవిస్కన్నదోష ప్రాయశ్చిత్తమునకు వలెనే యుపాకృత పశులోమపతన దోష నివృత్తి కొఱకు నమ్మేధీయాశ్వము యొక్క లోమములందు స్వర్ణాద్యలంకారములను చేయవలయును. అట్లొనర్చుట వలన పతనమయిన లోమములను తిరిగి సంపాదించి నట్లగును. ఇదియే మేధీయాశ్వమున కొనర్చెడు శృంగారమని చెప్పవలయును. లోకములు ప్రజాపతికి శరీరము. భూరాదివ్యాహృతులు లోకత్రయమును జెప్పును. అశ్వము ప్రజాపతి దేవతాకము గనుక నీ యశ్వము స్వదేవతతోనే సమృద్ధి కలది యగును,

ప్రభువగు నీ యజమాని పట్టమహిషి 'భూ' యనియు, 'వావాతా' యను పేరున మధ్యమసతి 'భువః' యనియు, 'పరివృక్తి' యను పేరున కనిష్ఠసతి 'సువః' యనియు, త్రిస్రోవ్యాహృతులుగా పిలుపబడి యజమానికి ముల్లోకములందు జయము, స్వర్లోకప్రాప్తికి హేతువులై నీయలంకారమును నిర్వర్తింతురు.

హిరణ్యము జ్యోతిస్స్వరూపము. అశ్వమేధము రాష్ట్రవేదమగుచున్నది. తత్కారణమున బంగారముతో నశ్వము నలంకరించుచో నా యజమానికి జ్యోతిస్సు, రాష్ట్రము ప్రాప్తించును. సహస్ర స్వర్ణమణ్యాదులతో నయ్యశ్వము నలంకరింప వలెను. స్వర్ణాలంకారముల నశ్వమునకు మూర్ధ్నన పట్టమహిషి 'భూః' అను వ్యాహృతితోను, 'వావాతా' భువః అని రజతాలంకారములను. 'పరివృక్తి' సువః అను వ్యాహృతితో సాముద్రిక మణులను శ్రోణికి నడ్డముగా నలంకరింపవలయును. ఇదియే యుపాకృత పశులోమ పతన దోష ప్రాయశ్చిత్త మగుచున్నది.

యజమాని కభ్యంజనవిధి :- అశ్వమేధ యాగమును నిర్వర్తించు యజమాని బహుద్రవ్య వ్యయము, శరీర ప్రయాసము నొందును. తత్కారణమున చతురా

దీంద్రియ పాటవము, శరీర కాంతి, గవాది ధనసమృద్ధి తగ్గిపోవును. ఇది యభివృద్ధి యగుటకు నైశ్వర్య రూపులగు రాజసతులు యజమానునకు మజ్జన మాచరింప జేయుదురు. పట్టమహిషి 'వసవస్త్వాంజన్తు' అను మంత్రము చేతను, రెండవ భార్య 'రుద్రాస్త్వాంజన్తు' అను మంత్రము చేతను, 'ఆదిత్యాస్త్వాంజన్తు' అను మంత్రముతో కనిష్ఠ సతియు తేజస్సు, ఇంద్రియ పాటవము, గవాది ధనసమృద్ధి క్షీణముగా కలుగుట కీయభ్యంజనమును నిర్వర్తింతురు.

'లాజీన్' అను మంత్రముచే నన్నహోమమున మిగిలిన యన్నమును మేధీయాశ్వముచే భుజింపజేసి యజమాని తన ప్రజలను సన్నపంతులుగా నొనర్చుచున్నాడు. ఈ యన్నమును అశ్వము తనంతనే యాఘ్రాణించినచో 'ఏతద్దేవా' అను మంత్రమును పఠింపనక్కర్లేదు. అట్లుకాని పక్షమున నా మంత్రమును పఠించి ప్రజల యందన్నము సంపాదించిన వాడగును. 'అక్రాన్‌రాజీ' 'సమిద్ధోఅంజన్' అను మంత్రములను బఠించుటచే ముల్లోకజయము, నశ్వమునకు బ్రీతియు గల్గును.

ఇది నాల్గవ యనువాకము

బ్రహ్మోద్య సంవాదము

5. అశ్వమేధయాజికి శరీరాయాసాదులచే దేజోహాని, వర్చోహాని జరుగును. తన్నివృత్తికయి హోత, బ్రహ్మలిరువురు జగత్సృష్టి ధ్వంసాత్మ హేతువగు పరబ్రహ్మ విషయమును సంవాదమొనర్చి యజమానికి తేజోబ్రహ్మ వర్చస్సులను సంపాదింతురు. యజమానివలె యాగయూపము సయితము పశుప్రయోగమును నిర్వహించును. తత్కారణమున ముఖ్యమయిన అగ్నిష్ఠయూపము యజమాని వంటిదే యగుచున్నది. బ్రహ్మ, బృహస్పతి దేవతాకమగుటచేతను, బ్రహ్మ దక్షిణ స్థాన నియతమగుటచేతను, దక్షిణహస్తముచే హోమపూజాదుల నొనర్చుటచేతను నగ్నిష్ఠయూపమునకు దక్షిణముగ బ్రహ్మయుపస్థితుడయి బ్రహ్మోద్యమున సమాధానించుటచే లోకమున పురుషునకు దక్షిణభాగమున బ్రహ్మవర్చస్సు ఎక్కువగా నుండినట్లే యజమానికి దక్షిణభాగమున బ్రహ్మవర్చస్సును కూర్చి పెట్టినవాడగును. హోత అగ్ని దేవతాకము. లోకమున నగ్నితేజస్సు. వేదికి నుత్తరభాగమునందు హోతకు స్థానము (ఉత్తరతో హోతా' అని శ్రుతి) మానవులకు నుత్తర భాగమున శక్తి నిక్షిప్తమగును. దీనిచే నగ్నిష్ఠ యూపమునకు నుత్తర భాగమున హోత బ్రహ్మోద్యప్రశ్నము చేయును. ఇందుచే యజమాని తన శరీరోత్తర భాగమున

మంచిశక్తి కలిగియుండును.

బ్రహ్మోద్యము నందు హోత ప్రశ్నములు ద్వాదశ సంఖ్యాత్మకము. అవి —

1. మొదటగా బ్రతికించునది ఏమి ? 'ద్యులోకము.'
2. ఎక్కువ వయస్సు కలదేది ? 'యుద్ధము నందు జయమొసంగు గుఱ్ఱము'
3. ఎక్కువ రూపము కలదేది ? 'వెన్నెల నక్షత్రములతో గూడిన రాత్రి.'
4. జన సమూహము వలన గలుగు 'పిలిప్పిల' అను ధ్వనియేది ? ఐశ్వర్యము.'
5. ఎవరు ఏకాకిగా జరింతురు ? 'సూర్యుడు.'
6. తిరిగితిరిగి ఎవరు జనించుచున్నారు ? 'చంద్రుడు.''
7. మంచుకు నివారక మేమి ? 'అగ్ని.''
8. వీహ్యాద్యావాపమునకు యోగ్యభూమి ఏమి ? 'ఈ లోకమే'.
9. యాగభూమి యుక్క పృష్ఠస్థానమేది ? 'వేది.'
10. భువన మధ్యభాగ మేది ? యజ్ఞము.''
11. అశ్వరేతస్సు ఏది ? 'సోమము' [ఈ సోమమున్ననే గాని త్రిరాత్రరూపమగు నశ్వమేధ, సోమయాగము జరుగదు కదా.]
12. వాక్కు యొక్క పర్యవసాన భూమి ఏది ? "బ్రహ్మ,"

సర్వ వేదములు పర్యవసానమున నా బ్రహ్మనే చెప్పుచున్నది. (సర్వే

---

కిగ్గ్ంస్విదాసీత్పూర్వచిత్తిః కిగ్గ్ంస్విదాసీద్బృహద్వయః। కిగ్గ్ంస్విదాసీత్పిశఙ్గిలా కిగ్గ్ంస్విదాసీత్పిలిప్పిలా। ద్యౌరాసీత్పూర్వచిత్తిరశ్వఆశీద్బృహద్వయః। రాత్రిరాసీత్పిశఙ్గిలావిరాసీత్పిలిప్పిలా। కస్స్విదేకాకీ చరతి కఉస్స్విజ్జాయతే పునః। కిగ్గ్ం స్విద్ధిమస్య భేషజం। కిగ్గ్ం స్విదావపనం మహత్। సూర్య ఏకాకీ చరతి। చంద్రమా జాయతే పునః। అగ్నిర్హిమస్య భేషజం భూమి రావపనం మహత్। పృచ్ఛామిత్వా పృథివ్యా పృచ్ఛామిత్వా భువనస్య నాభిమ్। పృచ్ఛామిత్వా వృష్ణో అశ్వస్యరేతః పృచ్ఛామి వాచః పరమం వ్యోమ। వేదిమాహుః పరమన్తం పృథివ్యా యజ్ఞమాహుర్భువనస్య నాభిమ్। సోమామాహుర్వృష్ణో అశ్వస్యరేతో బ్రహ్మైవ వాచః పరమంవ్యోమ।

వేదాయత్వదమామనన్తి¹) ఆహేతువున బ్రహ్మోద్య ప్రశ్నోత్తర శ్రవణము చేత యజమాని ద్యులోకాది బ్రహ్మ సర్వసాది ఫలములను బొందును.

ఇది యైదవ యనువాకము

6. అశ్వ సంజ్ఞపన కాలములోని యనుష్ఠాన హోమములను ఈ యనువాకము విధించు చున్నది.

అశ్వమేధయాజికి నశ్వవధా దోషము సంక్రమించు కారణమున నాయనకు నపమృత్యువు కలుగవచ్చును.

అనంతరము అశ్వ ప్రదక్షిణము విధింప బడుచున్నది.

రాజ పత్నులు మొదటిమారు త్రిప్రదక్షిణములు ముల్లోక వ్యవహార నిమిత్తమై యొనర్పవలెను. ఋతువుల ప్రీణనము కొఱకు మరల మూడు ప్రదక్షిణము లొనర్పవలయును. ఇట్లొనర్చనను నొక్కొక సమయమందపమృత్యువు యజమానిని వీడకపోవచ్చును, తత్కారణమున నయ్యశ్వమునకు రాణులచే నవ ప్రదక్షిములొనర్ప జేసి నవరంధ్ర స్థిత ప్రాణములను ప్రతిష్ఠింప జేసికొనుట యజమాని కర్తవ్యము.

అనంతరము ప్రతిప్రస్థాత 'అంబే, అంబాలి, అంబిక, యను నామములతో పట్టమహిషిని తీసికొని వచ్చి యిట్లు సంబోధించును. ఓ పట్టపురాణీ ! నీవు ఈ యశ్వమును రక్షించుచున్నావు' అనంతరము అధ్వర్యుడు మేధీయాశ్వమును జేరి ఓ గుఱ్ఱమా ! నీవు ప్రియమైన వస్తువులందత్యంత ప్రియమైనదానవు. శంఖ పద్మ నిధుల కధిపతివి. అని ప్రస్తుతించును. మృతాశ్వము నిట్లాహ్వానించుట యుక్తమా ! అనగా నిది యౌపచారికతమే యగుననిసూత్రకారుని నిర్దేశము

మఱియు, ప్రతిప్రస్థాత పట్టమహిషితో 'నీవు సౌభాగ్యయుక్తవై, శృంగారార్థము చిత్ర విచిత్ర వర్ణయుత వస్త్రమును ధరించియున్నావు. 1 అని ప్రశంసించును. ఈ ప్రశంస యామెకు దాపమును గూర్చును. ఇంకను గుఱ్ఱముతో నామె నుద్దేశించి 'స్వర్గలోక సుఖప్రాప్తికై యిర్వురును వస్త్రముచే గప్పుకొనుడు. గర్భ

1. 'అయంభాగో మహిష్యైవ పఠితుం యుక్తస్తథాఽపి స్తదభిప్రాయాఽనువాద రూపేణాఽధ్వర్యుః పఠతీ త్యవిరోధః ।

ధారణ హేతువగు పట్టపురాణి నిన్ను పొందినట్లే, నీవును గర్భమును ధరించు రాణి శరీరమును పొందుము.[2] అని పలుకును. ఈ భాగమవశ్యము రాణి పఠింప వలయును. కానియామె యభిప్రాయము నామెకు మారుగా నధ్వర్యుడు పఠించు చున్నాడు.[1]

గర్భము ప్రజాపతి రూపము. కనుక నీ మంత్రి పఠనముచే యజమాని ప్రజాపశు సంపదను దనయందు స్థాపింప జేసి కొనిన వాడగుచున్నాడు.

సూచీద్వారమున నసిపథాకల్పనము :—

ఒకప్పుడు దేవతలు బహిష్పవమాన స్తోత్రము జరుగు చుండగా నశ్వము స్వర్గ సాధనముగా నెఱుంగ లేకుండిరి. స్వర్గజ్ఞానము కొఱకు [లోకములో సూకరమెట్లు ఖడ్గముచే ఛిద్యమానమయినట్లు] మృతాశ్వ శరీరమున సూచీద్వారమున నసిపథమును విపరించుచున్నారు.

లోహరజిత సువర్ణ వికారములగు[3] మూడుసూదులు భూమ్యన్తరిక్ష ద్యులోక రూపములుగా భావించి పట్టపుదేవి మృతాశ్వము యొక్క భుజమునకు బూర్వ భాగమున గాయత్రీ త్రిష్టుప్పులతో బంగారు సూదుల చేతను, అనంతర మంత్రము చేత 'వావాతా' భుజములకు వెనుక, నాభికి బూర్వ మందు వెండి సూదులతోను, తరువాత మంత్రముతో 'పరివృక్తి' మిగిలినదేహ మందు లోహపు సూదులతో నీ యసిపథములను కల్పింతురు.[4]

---

2. అజహామిజాని గర్భధమా త్వమజాసి గర్భధమిత్యాహ। ప్రజా వై పశవో గర్భః। ప్రజామేవ పశూనాత్మన్ ధత్తే।
3. దిశోనా అయస్మయ్యః। అవాన్తరదిశా రజతాః। ఊర్ధ్వా హిరణ్యః। దిశ ఏవా స్మైకల్పయతి ;
4. గాయత్రీ త్రిష్టుబ్జగ త్యనుష్టుక్పజ్క్త్యా సహ। బృహత్యుష్ణిహా కకుత్సూచీభి శ్శిమ్యన్తుత్వా ॥ [5వ కాండము-చివరి యనువాకము]

| | | | | |
|---|---|---|---|---|
| గాయత్రి | ——— | పట్టమహిషి | ——2—— | బంగారుసూది |
| జగతీ | ——— | వావాతా | ——1—— | వెండిసూది |
| అనుష్టుప్ | ——— | పరివృక్తి | ——1—— | లోహపుసూది |

అనంతర మధ్వర్యు డిట్లు చెప్పును. ఓ అశ్వమా! ప్రజాపతి జగత్సృష్టి కర్త. ఆ ప్రజాపతియే నిన్ను ఖడ్గముతో కోయును. కనుక నిది హింస కాదు.

ఇది యాఱవ యనువాకము

7. బహు ధనవ్యయముననుసు, దీర్ఘకాలము రాజ్యపాలనమందు శ్రద్ధ కలిగి యుండని హేతువునను యాగ నిర్వహణము చేయు నశ్వమేధయాజి రాజ్యశ్రీలను కోల్పడును. వీనిని తిరిగి సాధించు విధానమును వేదపురుషుడీ యనువాకమున నిర్దేశించుచున్నాడు.

అధ్వర్యుడు మృతాశ్వమునకు బట్టపురాణికి బట్టువస్త్రము నాచ్ఛాదింప జేయును. ఈ యశ్వము నిదురించుచున్నది యని పట్టమహిషి చింతనొందువేళ యితర ఋత్వులు వాజియొక్క శిశ్నోత్థాపన ప్రసక్తి యొనర్తురు. రాష్ట్రశ్రీరూపములగు టచే నీ యుత్థాపన ప్రసక్తి రాష్ట్రైశ్వర్యౌన్నత్యములను నియమించును. ఈ విషయము దృష్టాంతములచే వేదపురుషుడు నిర్ధారణము చేయుచున్నాడు.

1. ఒకానొక వేణుభారవాహుడు అరణ్యమున తద్వహనార్థము సౌకర్యము నపేక్షించి యున్నత ప్రదేశము నాధార మొనర్చుకొని వానిని శిరము పైకెత్తికొనును. అట్లే రాష్ట్రభారమును యజమాని తదుత్థాపన ప్రసక్తిచేత సంపాదించినట్లగును. మరియు శిశ్నోత్థాపన ప్రసక్తిచే బట్టపురాణి శరీరమధ్య మందున్న యోని యుత్సాహముతో వృద్ధిపొందునుగాక! యని చెప్పెడి మంత్రము రాష్ట్రమధ్య మందున్న ధనాది సమృద్ధి రూపమయిన ఐశ్వర్యముతో గూడిన క్షేమమును యజమానికి చెప్పును.

2. రాత్రియందు అరణ్యమునుండి యొకానొక యాడులేడి క్షేత్రమునకు వచ్చి సస్యమును భక్షించి వెడల, క్షేత్రస్వామి సద్దాని నెఱుంగజాలని యట్లే సర్వభూస్వామి యయిన యీ యశ్వమేధయాజి తనవృత్తిచేత పశుపోషణము నెఱుంగజాలడు. పశుపోషణము వృత్తిచే వైశ్యుని దగుచున్నది కదా!

3. ఒకానొకప్పుడు దాసి ప్రభువుతో సంగమించినంత మాత్రమునకే సంతసించునుగాని తన కుటుంబ పరిపోషణమునకు దగిన ధనమును ప్రభువునుండి యపేక్షింపదు కదా! అట్లే మనుష్య శరీరధారి వయిన నీవు దేవతా శరీరమును దాల్చిన యీ యశ్వము నిన్ను స్వీకరించినంతకే సంతసింపుము. తుచ్ఛ మానుష భోగము నపేక్షింపకుము. దీనిచేత దాసియయిన యొక వేశ్యాపుత్రునకు రాజ్య పట్టాభిషేకము జరుగుట యసంభవమని భావము.

4. శకుంతములు మగపక్షి వెనుక కూయుచు ననుగమించునేగాని దాని వెనుక నిలిచియుండవు. అశ్వమేధము రాష్ట్రస్థానీయము. శకుంతము ప్రజాస్థానీయ మయిన హేతువున ప్రజ రాష్ట్రము కొఱకు ప్రవర్తించుచుండును. వర్ణవ్యత్యయము చేత భగము గభమయ్యెను. ఇది ప్రజార్థ సూచకము. శఫము పస యయ్యెను. ఇది రాష్ట్రస్థానీయము. ఈ విధముగా లోకమున స్త్రీయందు పురుషుడు సంయోజిత డగు చున్నటులే ప్రజయందు రాష్ట్రము సంయోజిత మగుచున్నది.

5. లోకమునందు తల్లిదండ్రులెట్లు సంయోగమును బొందుదురో, యట్లే మాతా పితృశబ్దములచే నుపలక్షితమగు పృథివీద్యులోకములను యజమాని రక్షణ కొఱకు నిచ్చినట్లగును. వృక్షాగ్రమున నిర్మింపబడిన శయనముపై తల్లి దండ్రులు శయింతు రనుమంత్రముచేత నగ్రమున్నతము గనుక యజమాని యున్నతమైన యైశ్వర్యమును బొందినవాడగును. మరియు 'నో పట్టపురాణీ!' నీ తండ్రి 'నేనే నీ యందు ప్రవేశించుచున్నాననుచు' నీ తల్లి యోనియందు ముష్టి శబ్దముచే జెప్పబడు శిశ్నమును ప్రవేశపెట్టినట్లు యీ యశ్వముగూడ జేసెను గదా! గభశబ్దముచే ప్రజ, ముష్టిశబ్దముచే రాష్ట్రము చెప్పబడెను కనుక నీ రెండిటి సంబంధమును యజమాని పొందినట్లయ్యెను.

ఇదంతయు పట్టపురాణి అశ్వము నిదురించుచున్నదని నిందించుట వలన జరిగిన సంవాదముగా నెఱుంగ వలయును. అశ్వమేధయాగ మధ్య మందిట్టి యసభ్యగ్రామ్య సంభాషణ జరుగుటచేత యజ్ఞమపూతమగుట, ప్రాణములే నిగ్గ

---

ఇచట నొక విషయమును గమనింప వలసియున్నది. "అట్లు అశ్వము జేసెను గదా!" (ఏవ మయ మశ్వశ్చకార।) అని యనిన వారు కౌశేయ పిధానము చేయబడిన మహిష్యశ్వములకు సంభోగ మయ్యెనను భ్రమ పడుచున్నారు. వీరే ఒకచోట 'దేవతాశ్వ స్వీకారము చాలును. తుచ్ఛ మానుష సంభోగమును వాంఛింపకుము' అని చెప్పిరి. (హే! మహిషి! మనుష్య శరీరాత్వమపి దేవతారూప స్యాశ్వస్య స్వీకారాదేవ పరితుష్టాభవ! నతు తుచ్ఛమిమం మానుష సంభోగ మపేక్షస్వ) ఇచట నేమి కలదు? నిజముగా నీ విషయమున లోకమున గల ప్రాచుర్యమున కేమియైన యాధారమిందుగాన వచ్చుచున్నదా! ఊరకదుర్వ్యామోహములు, కుతర్కములు సద్భావుకులను సయితము నపమార్గమున పెట్టుటలో విజయము సాధించి యుండెనని విశ్వసింప వచ్చును గదా!

మించుట జరుగకుండునట్లు నచటి వారందఱు 'దధిక్రావ్ణ్ణ' అను మంత్రమును జపించి ముఖమును సురభిళ మొనర్చుకొందురు. దేవతాది జగత్సృష్టికి బూర్వమే జగత్కారణముగా నుదకములు చెప్పబడియుండుటచేతను, (అపోవా ఇదమాసన్ సలిలమేవ) సర్వదేవతా స్వరూపములుగా నుదకములనే పేర్కొనుటచేతను 'అపో హిష్ఠామయోభువః' అను మంత్రముచే మార్జనము గావించుకొని తమ తమ యాత్మలను శోధనము గావించుకొందురు.

ఇది ఏడవ యనువాకము

8. ఒకప్పుడు ప్రజాపతి ప్రజను సృజించి వారియందు అనుకంపాయుతుడై వారిలో ప్రవేశించెను గాని తిరిగి స్వస్వరూపముతో వారి నుండి రాజాలకయ్యెను. అశక్తుడైన ప్రజాపతి తన్నెవడు ప్రజాసమూహము నుండి స్వస్వరూపముతో సమావిర్భవింప జేయునో వాడు సమృద్ధి నొందునని పలికెను. అంతట వీరలశ్వమేధా నుష్ఠానము చేసి ప్రజాపతి స్వస్వరూప సంభవునిగా నొనర్చి తాము సమృద్ధి నొందిరి. అట్లే అశ్వమేధ మొనర్చిన వారెవ్వరయినను ప్రజాపతి వలన సంపాదింప నగిన సమృద్ధి నొందుదురు.

ఇక నీయనువాకమున వివిధ పశువిధులు పేర్కొనబడినవి.

3: మనుష్య విధి :— 'సోమాయ స్వరాజ్ఞే' అను యనువాకము మనుష్యత్రీ విరాట్ దేవతకలదిమై, పశువుగా జెప్పబడినది. విరాట్పురుష శరీరములు సమాకృతి వహించి యుండుటచే పురుషుడు విరాట్స్వ రూపుడగు చున్నాడు. తత్కారణము న పురుషాలంభము చేత యజమాని విరాట్టునే పొందిన వాడగుచున్నాడు. అన్నము కూడ విరాట్స్వ రూపమేగాన అన్నమును గూడ యజమాని పొందిన వాడగును. అహింసార్థము అరణ్య పశువుల వలెనే పురుషుని గూడ పర్యగ్ని కరణముచే నుత్సర్జనము గావింప వలెను.

2. అశ్వ విధి:— ప్రజాపత్యక్షి జన్యత్వముచే అశ్వము ప్రజాపతి దేవతాకము. ఏకశఫము శ్రీస్వరూపము. తత్కారణమున నశ్వాలంభముచే ప్రజాపతిని యాలంభము చేసినావాడగుచు శ్రీని పొందిన వాడగును.

1. గో విధి:— యజ్ఞస్వరూపమగు గవాలంభము చేసి యజ్ఞము నాలంభము చేసినవాడయి క్షీరాది ద్వారమున నన్నమును బొందును.

4. అజావి విధులు:- మేక, గొఱ్ఱె = ఈ రెండును నాలంభమొనర్చుటచేత యజమాని పుష్టిని బాహుళ్యమును పొందుచున్నాడు.

పురుషుడు సర్వోత్తముడు. వానికంటె నశ్వము, నశ్వము కంటె గోవు, దాని కంటె నజావులు నుత్తరోత్తరాల్పములు. ఇటు లల్పాధిక్యభావమును గల్గించు పశువులన్నియు దేవతలకు ప్రీతికరములై వారికి నగ్ని యందు హవ్యముగా సమర్పింప బడుచున్నవి. స్వభావము చేత నీపశువులు హింసించెడి వయినను యజ్ఞము నందు నియోజింపబడు విషయమున నశ్వమేధయాజిని, అశ్వమేధ ప్రక్రియ తెలిసిన వానిని హింసింపవు.

ఇది ఎనిమిదవ యనువాకము

9. త్రిరాత్ర దీక్షయందు ప్రథమ దినమందు నిర్వర్తింప బడునది చతుష్టోమము. కృతయుగము నందు ధర్మము నాలుగు పాదములతో గూడి యుండునట్లే చతుష్టోమముతో గూడిన ప్రథమాహస్సుతో సమృద్ధినొందును. (త్రివృత్పంచ దశ స్సప్త దశైక వింశాఖ్యైశ్చతుర్భి:)

ద్వితీయాహస్సు నందు శాక్వర సామగాన మొనర్పవలయును. పృష్ఠ స్తోత్రములు ఋతుప్రాప్తి కారణములు. సంవత్సరములో ఋతువులు నిష్పన్న మగును. పృష్ఠస్తోత్ర మందు శక్వర్ల సామగానము చేయవలెను. సామాధారమగు ఋక్కులు విభిన్న ఛందోయుతములు. తత్కారణమున గ్రామ్యారణ్య భేదముచే నీ క్రతువునందు నానావిధ పశ్వాలంభములు నిర్వర్తింప బడుచున్నవి. దీనిచే ద్వితీయాహస్సు ప్రతిష్ఠాకారణమై యజమానికి ఋత్వభిమాన దేవతల సాయుజ్యమును గల్గించి యీ యహస్సు స్వతస్సమృద్ధ మగుచున్నది.

యజమాని తృతీయాహస్సు నందు గవాలంభ మొనర్చి గ్రామ్యారణ్య పశువులను పొంది ప్రజాపత్యనుగ్రహము వలన స్వాధీనముగాని రాష్ట్రమును గూడ స్వాధీనపరచుకొనిన వాడగుచున్నాడు.

త్రిరాత్రాః సానము నందు సూర్యదేవతాకములైన నవ సంఖ్యాకములగు శ్వేత పశువుల నాలంభముచేసి యశ్వమేధయాజి బ్రహ్మ వర్చస్సును పొందును.

అనూబంధ్యానంతరము "సోమాయస్వరాజ్ఞే" అను అనువాకమునందు ద్వివచనముచే చెప్పబడిన పశ్వాలంభముచేత అహోరాత్రములను జయించును. యజమాని బహువిధ పశువుల నాలంభము చేయుటచేత పశువులను కోల్పడునని త్వష్టృదేవతాకములగు ప్రాతర్గవ్యములగు పశువుల నాలంభము చేయును.

"ఛగలం కల్మాషం కికిదీవిం విదీగయా మితి। త్వాష్ట్రీ న్స్వహా నాలభతే। (ఛగలం-మేక, కల్మాషం-నల్లబిందువు గల తెల్లని మేక, కికిదీవి-తిత్తిరి పక్షి, విదీగయము-శ్వేతబకను. ఇవి ప్రాతర్గవ్యములు)

అశ్వమేధయాజి చిరకాలము దీక్షయందుండుటచే నా యా ఋతువుల వలన లభించెడి భోగము లనుభవింపని కారణమున ఋతువులచే వియోగము నందినవాడగును. తత్పరిహారార్థము 'పిశంగా' ఇత్యాద్యనువాకోక్తములగు ఋతుదేవతాక పశువుల నాలంభము చేయవలయును. ఈ హేతువున యజమాని ఋతువులతో దాను గూడ సమృద్ధి గల వాడగుచున్నాడు. అశ్వమేధయాజి చేసెడి బహు పశు విచ్ఛేద రాహిత్యము కొఱకు బూర్వోక్త పశువులను పర్యగ్ని కరణానంతరము విడువవలెను.

ఇది తొమ్మిదవ యనువాకము

10. ఒకానొప్పుడు ప్రజాపతి ఐశ్వర్య గుణముచే నున్నతుడుగను, రోగ రాహిత్యముచే బహ్వన్నభుక్కుగను నుండనెంచిన వాడయి, వానిని సాధింప 'మహిమ' మనుపేరుగల రెండు గ్రహములను నిశ్చయించి, తద్వారమున నున్నతుడు, నన్నాదుడు నయ్యెను. ఇతరులను నశ్వమేధ మందు నిట్లే వానిని గ్రహించి యా ఫలములను సాధింపవచ్చును.

యజ్ఞము నందు యజమాని వలెనె నవ ముఖ్యముగాన, యజమాని దేవతాకము వవ యగుచున్నది. సౌవర్ణ రజితలోహములతో నిర్మితమయిన మహిమాఖ్య గ్రహములు 'రాజ' యనుపేరుతో వ్యవహరింప బడును. తత్కారణమున వపా హోమమునకు ముందు వెనుక మహిమాగ్రహ హోమములొనర్చి ఇహ పరలోకముల యందును గూడ యజమాని రాజ్యముతో గూడిన వాడగుచున్నాడు.

కొందఱు దేవతలు పురస్తాత్స్వాహాకారమును మఱికొందఱు ఉపరిష్టాత్స్వాహాకారము గలిగిన వారగుటచేత నీ వపాహోమమునకు బూర్వోత్తరములందు

మహిమాగ్రహహోమ మొనర్చి ద్వివిధమయిన దేవతానుగ్రహ ప్రాప్తిని బొందు చున్నాడు.

ఇది పదియవ యనువాకము

11. ఇందు శరీర హోమము స్విష్టకృదాహుతి విధానము ప్రోక్తమయ్యెను.

అశ్వము ప్రజాపతి దేవతాకము. అశ్వమునందు సర్వదేవతలకు భాగము కలదని 'అశ్వోవై సర్వా దేవతా అన్వాయత్తాః' అనుమంత్రముచే స్పష్టమగు చున్నది. కాని అశ్వము ప్రజాపతి దేవతాకమే యన్నచో హోమము చేయబడిన హవ్యము నందు అశ్వమందలి యితర దేవతలకు భాగము లేక పోవలసి వచ్చును. తత్కారణ మున నా దేవతలు నియుక్తులయి పరస్పరము కలహింతురు. తన్నివారణమునకయి నాజ్యావదాన మొనర్చి ప్రతి మంత్రమును హస్తముతో లెక్కించి 'స్తేగాదగ్ధాభ్యాం' అను ప్రియాసామలతో మొదలిడి 'కర్మైరత్య కర్మీరిత్యన్తము వరకు గల పదునే ననువాకము లందు చెప్పబడిన మంత్రములచే స్వాహాకారానంతరము శరీర హోమములను చేసి యా యా దేవతలను విభాగము కలవారుగను, సమృద్ధి గలవారు గను నొనర్చును.

ఇప్పుడు స్విష్టకృదాహుతిని చెప్పుచున్నాడు.

దేవాసురులు యుద్ధమునకు సిద్ధము కాగా స్విష్టకృదగ్ని లీ యశ్వ మందలి సర్వదేవతా సాధారణమగు భాగముల నుద్ధరించి రాక్షసార్థము రక్త గ్రహణ మొనర్చుచున్నామని పేర్కొనుచు నయ్యసురులను బరాభవించిరి. తత్కారణమున నేయజమాని యయ్యును శత్రుంజయము నభిలషించి స్విష్టకృత్తు యందు రక్తహోమ మొనర్చును. అశ్వతూపర గోమృగము లందు విశసన సమయమున గోమృగ కంఠ ప్రదేశములను బ్రత్యేకించి యుంచవలయును. ఏవం విధమయిన హేతువుననే వాజిలోహితమును, [రక్తమును] శఫమును, గోమృగ కంఠమును స్విష్టకృదాహుతుల కొఱకు ప్రత్యేకింప వలెనని సూత్రకారులు నిర్దేశించిరి.

స్విష్టకృదగ్ని యుగ్రము. తత్కారణమున జుహువునకు మారుగా (హవిర్గ్రహణ సాధనము) నీ కంఠముతో ప్రథమ స్విష్టకృద్ధోమము చేయుటచే రుద్రుని వలన సర్వ పశువులు లోపల ధరింప బడినట్లగును. అదియును గాక యే

ప్రదేశము నందు స్విష్టకృద్ధోమము నిర్వహింపబడునో అచ్చోట రుద్రుడు పశువులను హింసింపడు. ఇట్లే ఈ హోమమునకు మారుగా నశ్వ శఫముతో ద్వితీయ స్విష్టకృద్ధోమము చేయబడెను. దీనివలన పశువులను రుద్రు డభిమానించును. తృతీయ స్విష్టకృద్ధోమము నిముసుతో నొనర్పబడిన కమండలముతో నొనర్పబడెను. దీనివలన నయ్యాస్యనామక మహర్షి చేత సృజింపబడిన ప్రజలను రుద్రు డభిమానించును.

ఇది పదునొకండవ యనువాకము

అశ్వస్తోమీయ హోమము

12. ఆలబ్ధాశ్వము యొక్క సారభూత మయిన మేధ వెల్వడి 'యదక్రింద' యిత్యాద్యనువాక త్రియమందు స్ఫురమగు నశ్వస్తోమీయ మంత్రజాల మయ్యెను. ఆ మంత్రహోమముచే మేధో యుక్తమయిన నశ్వాలంభ మొనర్చినట్లగును. అజ్యము మేధో రూపమగుటచే నాజ్యముతో తన్మంత్రిములతో హోమ మొనర్చుట జరుగును. దీనివలన యజమాని మేధతో మేధను సంపాదించిన వాడగును. 'యదక్రింద' యిత్యాద్యనువాకములందుగల మంత్రముల సంఖ్య ముప్పదియైదు. 'క్రిమైరత్యక్రిమీత్' అనుదానితో ముప్పదియారు, బృహతీ ఛందోలభ్యములు పశువులగుటచేతను, బృహతీఛందము ముప్పదియారు అక్షరములు కలది యగుట చేతను పశువులను స్వయోగ్య ప్రమాణముచే సమర్ధించినట్లగును.

ద్విపదా హోమము :- లోకమున బురుషుడు రెండు పాదములచే స్థైర్యమును ప్రతిష్ఠను బొందుచున్నాడు. అట్లే రెండు పాదములు గలిగిన ఋక్కుతో హోమ మొనర్చి యజమాని ప్రతిష్ఠను పొందును.

ద్విపాద్ధోమము పూర్వమా ? అశ్వస్తోమీయము పూర్వమా ? యను విషయమును విచారించి అశ్వస్తోమీయ మశ్వరూపము, ద్విపాత్పురుష రూపమునియు, నందువలన నశ్వస్తోమీయము పూర్వమనసే హోమ మొనర్చినచో భోగ్యమయిన యశ్వమును మొదట సంపాదించిన యనంతరము ద్విపాత్పురుషుడు అనుభవించును. అదియునుగాక ద్విపాత్పురుషుని యందు చతుష్పాత్పశువును ప్రతిష్ఠ చేసినట్లగును. 'ద్విపదాహుత్యా నాన్యాముత్తరామాహుతిం జుహుయాత్' అను మంత్రముచేతను ముందశ్వస్తోమీయమే నిర్వర్తింపవలసియున్నది.

ఇది పండ్రెండవ యనువాకము

13. పూర్వము ప్రజాపతిచే నశ్వమేధ సాధనమయిన యశ్వము సృజింపబడినదై మరణ భయముచేత ప్రజాపతి కడనుండి పారిపోయెను. యూప స్తంభములకు గట్టుదురను భయముతో తిరుగుచున్న నయ్యశ్వమును యూపములు గల క్రతువుల యందాలంభము చేయలేదు. అనంతరము ప్రజాపతి యయ్యశ్వమును వెదకి యూపప్రసక్తి లేని యిష్టులతో నయ్యశ్వమును తిరిగిపొందెను. ఇట్లుపూర్వకముగా నా యశ్వము ప్రజాపతి చేత, నిష్టులచేత బొందబడిన కారణమున యూపములు లేని కర్మలకునిషులని పేరు కలిగెను. అందువలన దీక్షకు బూర్వము సంవత్సరకాల మిష్టులు నిర్వర్తించి తుదకీ యశ్వమును బొందుదురు. లోకమున నేపదార్థ మదృశ్యమయినను నశించినను తిరిగి భూమియందే లభించుచున్నది కదా !

ఇష్టుల యందు దేవతా ప్రసంశనము :‌- సవితృ దేవతాకమయిన సావిత్రి ప్రసవిత్రి, ఆసవిత్రిములను మూడు యిష్టులను నిర్వర్తించి భూ స్వరూపమగు సవితృ దేవతచే నసుజ్ఞ పొందినవాడయి యియ్యశ్వమును యజమాని భూమియందే పొందుచున్నాడు. ప్రాతరిష్టులచేత బొందబడిన యశ్వము సాయంభృతి హోమము చేత స్వేచ్ఛా సంచారము నుండి మరలింపబడినట్లే, లోకము నందు ప్రజలు కూడ సాయంకాలమందు గవాదులను తమ తమ నెలవులందు కట్టి నిల్పింపుచుగు చుందిరి కదా ! అశ్వాన్వేషణము కొఱకు ప్రాతః కాలము నందే యిష్టులొనర్చి యాగాశ్వ ప్రాప్తి నొందిన విధముననే లోకమున గవాదులు తప్పిపోయినప్పుడు వాని యజమానులు పగలే వెదకి పునః ప్రాప్తులగు చున్నారు. మఱియు ప్రాతస్సాయము లందు నిర్వర్తింపబడు హోమములచేత నహోరాత్రములతోనే నయ్యశ్వమును వెదకినట్లయి యుజమానికి నహోరాత్రములతో యోగక్షేమములను కల్పించినట్లగును.

ఇది పదమూడవ యనువాకము

ఇష్టులయందు వీణా గానము

14. అశ్వమేధయాగ దీక్ష సంవత్సర కాలములో యజమాని దీక్షకాలము నియమితుడయి యున్న హేతువున రాజోపచారముల నుండి మరల్పబడి ఐశ్వర్యము సయితము కనుమఱుగు కావచ్చును. క్రతు సమాప్తి పర్యంత మధ్వర్యుడే రాజు గనుక రాజ్యము కూడ పోవచ్చును. ఇవి రెండును తిరిగి సంపాదించుకొనుటకై నేర్పఱులయిన యిద్దరు బ్రాహ్మణులు వీణాగానము చేయవలెను. వీణగ్రీష్వదూ

పము. లోకములో మానవుడు ఐశ్వర్య లబ్ధిచే సుఖ నిమిత్తము వీణావాదనము గనుచున్నాడు కదా ! అట్లే ఐశ్వర్య ప్రాప్త్యర్థము రాజు వీణాగానము చేయించును. ఇద్దరును బ్రాహ్మణులే గానము చేయవలయునా ? లేక మరెట్లు ? యను విచారణము చేయబడి యిట్లు నిర్ణయము చేయబడుచున్నది. బ్రాహ్మణునియందు ఐశ్వర్యము నిలువని హేతువున నిద్దరు విప్రులే వీణాగాన మొనర్చినచో నయైశ్వర్యము ప్రాప్తించును. తత్కారణమున నొక బ్రాహ్మణుడు నొక క్షత్రియుడు కలిసి గానము చేయవలయును. బ్రాహ్మణుడు మంత్ర సామర్థ్యము చేత నైశ్వర్యమును ప్రాప్తింపజేయగా క్షత్రియుడు శౌర్య బలాదులచేత సంపాదింప బడిన శ్రీని కాపాడును.

వీరిద్దరు పగలే గానము చేయుటయా ? లేక రాత్రియందా ? అను విచారణము కల్గి, పగలే యిరువురును గానము నొనర్చినచో రాత్రియందు రక్షణ లేకపోవును గాన యజమాని నుండి రాష్ట్రము నిర్గమించును. బ్రాహ్మణుని యందు రాజ్యము నిలువదు. బ్రాహ్మణుడు పాలించు సమయమున క్షత్రియునకు రాజ్యాకాంక్ష గలిగినచో నాతని జయించి తిరిగి తన రాజ్యమును స్వాధీన పఱచు కొన గలడు. తత్కారణమునను మఱియు పగలు బ్రహ్మస్వరూపము గనుక బ్రాహ్మణుడు పగటియందు గానము చేయవలయును. అంధకారావృత మగుటచేతను, పగటి యనంతరము వచ్చెడి దగుటచేతను రాత్రియందు చోరాది భయనివృత్తి నొనర్చుట యందు సమర్థుడయిన క్షత్రియుడు గానము చేయవలెను. ఇట్లు అహోరాత్రములు బ్రాహ్మణ క్షత్రియులు క్రమముగా గాన మొనర్చుటచేత నైశ్వర్యము సంపాదింపబడి రాష్ట్రము పరిగ్రహింప బడుచున్నది. ఈ గానము సావిత్రేష్టి, స్విష్టకృద్ధోమము లకు బూర్వమే నిర్వర్తింప వలయును.

బ్రాహ్మణ గాన విధానము :— ఓ మహారాజా ! ఈ విధముగా నీవు బ్రాహ్మణులకు గోభూహిరణ్యాన్నాది దానములను చేయుచున్నావు. ఇష్టా పూర్తకర్మల యందధికారము కల్గినపుడు తత్సంబంధ మయిన గానము చేయుట యుచితమయి, యజమానిని సంపత్సమృద్ధి గలవానిగా జేసినట్లగును.

క్షత్రియగానము :— క్షత్రియుడు సాయంధృతి హోమము చేయబడు చుండగా నిట్లుగానము చేయవలయును. ఓ రాజా ! రథగజతురగాదుల తోడను, శూరభటుల తోడను, బాణములతోడను గూడి గొప్పయుద్ధములలో ననేక ప్రభువులను సంహారముల గావించితివి కదా! క్షత్రియునకు యుద్ధకర్మ యందధికారముగుటచేత తద్విషయక

గానము చేసి యజమానిని యూగ్ధసమృద్ధి గల వానినిగా నొనర్చును.

ఈ విధమయిన గాన ప్రకరణములను మూడేసి చెప్పుటచేత దీక్ష యందుండి షడృతు సంబంధమయిన భోగ నివృత్తుదయిన యజమానికి నీ యాఱు గానములు తత్తదృతూచిత భోగముల నిచ్చినట్లగును. ఇట్లు సంవత్సర పర్యంతము గానము చేసిన గాయకులకు నూఱు రెండెద్దులబండ్లు, నూఱు గోవుల చొప్పున నిచ్చి యజమాని పురుషునకు గల శతాయుష్యము, శతేంద్రియములను తాను పొంది వాని యందు ప్రతిష్ఠగల వాడగుచున్నాడు.

ఇది పదునాల్గవ యనువాకము

15. లోకమున ప్రజలు నివసించెడి తావులందు మరణములకు కారణములగు రోగాదులకు, మృత్యువులకు నశ్వమేధయాజి యాహుతు లొసంగనిచో నా యా ప్రదేశములందు యాజమానిని మృత్యువు గ్రసింపఁ జొచ్చును. ఆ మృత్యు పరిహారార్థము "మృత్యవే స్వాహా" అను మంత్రముతో నాహుతులీయవలెను. ఈ హోమ సామర్థ్యమున నా యా తావులందుండెడి మృత్యువు నశించుటచే యజమాని మృత్యుంజయుడగుచున్నాడు.

ఈ హోమాచరణ విషయమున బహ్వాహుతియా? ఏకాహుతియా? యని విచారణ చేయబడి ఏకాహుతి నిర్ధారణము చేయబడుచున్నది. లోకమున నుండెడి బహు వ్యాధి దారిద్ర్య రూపాత్మకమయిన బహు విధ మృత్యువులకు ప్రత్యేకముగా హోమము చేసిన యెడల యజమాని బహు విధ మృత్యువులను సంపాదించిన వాడగుచున్నాడు. స్వర్గము నందు మృత్యువు ఒక్కటియే గాన "మృత్యవే స్వాహా' అను మంత్రముతో నొక్క మృత్యు దేవతకే ఆహుతి చేయుట చేత స్వర్గ మందున్న 'ఆకలి' అను మృత్యువును జయించిన వాడగుచున్నాడు.

భ్రూణహత్యాపనోదనాహుతి:—

సాంగవేద విదుడు లేక గర్భస్థ శిశువు భ్రూణ మను పేర బరగును. వీరి హననము వలన వచ్చు దోషము పోగొట్టుకొనుటకై 'భ్రూణహత్యాయై స్వాహా' అను మంత్రముతో హోమము చేయవలయును. మఱియు కర్మాధికారము కొఱకు కర్మాదియందు కూష్మాండ హోమము చేయుట శాస్త్రవిహితము. అట్లే అశ్వమేధ కర్మాదియందు పవిత్రుడై కర్మంయందధికారియగుటకు మృత్యు స్వరూపమయిన భ్రూణ హత్యాపనోదనాహుతిని యజమాని నిర్వర్తింపవలెను.

అవభృధాహుతి విశేషవిధి :—

భ్రూణహత్య కంటె నితరములయిన పాపము లన్నియు నపమృత్యు కారకములు. భ్రూణహత్య అతిబాధకత్వముచే మృత్యువనియే బ్రహ్మవేతలు సిద్ధాంత మొనర్చిరి. దీనిని నివారించుట కవభృధాహుతి కంటె మార్గాంతరము లేదు. కర్మ మధ్యమందు ఈయాహుతిని హోమము చేయుటచే యజమాని మృత్యు దేవతను దృప్తి నొందించినట్లయి భ్రూణహత్య వలన సంక్రమించిన పాపము నుండి నివృత్త డగును.

ఉదక మాత్రముచే దృప్త డగునౌదన్య పుత్రుడగు ముండిభుడను తపో నిధి యశ్వమేధా వభృధము లేకనే నీయాహుతిని ప్రాయశ్చిత్తముగా తెలిసి కొనెను, కాని బ్రహ్మవేత్తలు దీని నీవిధముగా జెప్పుచున్నారు. యజమానికి సంబంధించిన భృత్య పుత్రాదులలో నొకడు బ్రహ్మహత్య నొనర్చినచో తద్దోషశమన మీయాహుతి యే యొనర్చుచుండగా సంపూర్ణాశ్వమేధా నుష్ఠాన కర్తను భ్రూణహత్య ఏల బాధిం చును ? అనిదీని పారమ్యమును బ్రకటించిరి.

ఇక 'జుంబకాయస్వాహా' యను మంత్రహోమముచే గర్మాంత మందీ వరుణునే నశింప జేసిన వాడగును. జుంబక శబ్దము వరుణవాచి. ఆయన సర్వ బాధానివారకుడు. సర్వోపద్రవపరిహారకుడు. ఇక హోమదేశమును గురించి శ్వేత కుష్ఠము, పింగళనేత్రములు. స్వేదసంయుతుడైన ఖర్వాటుని శిరముపయి నీ హోమ మాచరింప వలెనని చెప్పిరి. ఇది వరుణుని స్వరూపము గనుక నిట్టి కార్యము యుక్తము. ఇట్లొనర్చుటచే పాపరూపమును నశింపజేసిన వాడగును.

ఇది షట్పనేనవ యనువాకము

16. ఉపాకరణమంత్ర వ్యాఖ్యానాది విషయము నిరూపింపఁబడుచున్నది:—

అశ్వమును ప్రజాపతి దేవతాకముగా నొసర్చి కలిసినపుడు వారణమైన యీయశ్వమును, వరుణునితో నిమోచించి తత్పరిహారార్థము వరుణునకు సమర్పించవలెను. ఈ క్రియ వలన స్వదేవత తోడనే యీయశ్వమును సమృద్ధ మొనర్చినట్లగును. అశ్వము ప్రజాపత్యాది సంజనితము. కనుక నిది ప్రాజాపత్యము. అశ్వ, ప్రజాపతులకు సమర్పించుటచే నీ యశ్వము స్వదేవతతోడనే సమృద్ధ మయిన

దగుచున్నది. ధర్మాభిమాని యయిన దేవుడు అనుష్ఠానాధిపతియు కనుక నాయనకు నమస్కరించుటచే యజమాని ధర్మమును బొందును. ప్రభువు గుఱ్ఱమును సంబోధించుచు నిట్లనును. 'ఓ అశ్వరాజమా ! నీవనుష్ఠానమునకు నధిపతివి గాన నన్నధిపతినిగా జేయుము. నీయనుగ్రహము వలన నేను ప్రజల కధిపతిగా గలను. ఈ మంత్రపాఠముచే యజమాని సమానులలో నుత్తమ శ్లోకుడగును. 'మాం దేహి మయి ధేహి' యను మంత్రము చేత కర్మతల్పుల మూప సిద్ధికయి యజమాని ప్రార్థించుచున్నాడు. ఉపాకరణము కాగా 'ఉపాకృతాయ స్వాహా' యనియు, నియోజనము కాగా 'ఆలబ్ధాయస్వాహా' యనియు, అగ్నియందుంచ బడినపుడు 'హుతాయ స్వాహా' యనియు లోకత్రయ జయము కొఱకు హోమ మొనర్తురు.

అశ్వమేధయాగికి బహుదోషములు సంప్రాప్తించుట వలన లోకత్రయచ్యుతి కలుగును.* తన్నివారణ మునకయి అగ్నేయాది పశుత్రయము నాలబ్ధము చేయుట కార్యము. దీని వలన యజమానికి ముల్లోక ప్రతిష్ఠ కలుగును. అగ్నియందు దేవతలందఱు తమదేహముల నుంచిన కారణమున నగ్ని సర్వ దేవాత్మక స్వరూపము, ఆగ్నేయ యాగముచే సర్వ దేవతాప్రాప్తి, ఐంద్రాగ్న యాగముచే జాతిద్వయమును స్వాధీన మొనర్చు కొనిన వాడగును.* కోరతగిన ఫలప్రాప్తి కొఱకు 'అశ్విన' యాగమును చేసి ముల్లోక సుప్రతిష్ఠితు డగును. 'ఆగ్నేయే అగ్ంహోమముచే' అను అనువాకములో జెప్పబడిన దశవిధ హవిస్సులను హోమమొనర్చి విరాట్టుతో నన్నాదులను సయితము యజమాని పొందినవాడగును.

ఇది పదియాఱవ యనువాకము

17. అశ్వరోగాది దోషపరిహార నిమిత్తమయి పేర్కొనబడినవిధులు :—

ఉపతపని † వృత్తికయి, అగ్నే యమష్టాకపాలము, సౌమ్యంచరుః సావిత్ర మష్టాకపాలము నిర్వహింప వలెను. సర్వ దేవతాత్మకమయిన యగ్ని నుద్దేశించి యాగ్నేయ యాగము నిర్వహించుచో అశ్వము సర్వ దేవతలలోను రోగము లేని దానిగా జేసినట్లగును.

---

* బ్రహ్మావా అగ్నిః। క్షత్రం సోమః। యదైంద్రాగ్నో భవతి। బ్రహ్మక్షత్రే ఏవావరుంధే।

† ఉపతప త్సంజ్ఞకో రోగవిశేషః।

సోముడు ఓషధుల కధిపతి.*** ఓషధీ భక్షణముచే సంక్రమించిన రోగము తదధిపతి యగు సోమదేవతాకమయిన సౌమ్యచరు యాగ మొనర్చినచో నా యోషధులతోనే అశ్వరోగము నిర్మూలన మగుచున్నది.

సావిత్రి యాగముచే సవిత చేత ననుజ్ఞ నైకొనబడి చికిత్స బాగుగా జరిగినట్లగును. ఇట్లు అగ్ని, సోమ సవితృ దేవతలచే చేయబడిన యాగముల సర్వదా రోగ రాహిత్యము కలిగియగును.

చర్మదోష పరిహార ప్రాయశ్చిత్తము:- శ్లోణమనగా దుష్టచర్మము. దీని చికిత్సకుడు పూషదేవత. పూషదేవతాక చరుయాగ నిర్వహణము చేత తత్పరిహారము కల్గును. ఉపద్రవ కారక దేవతా విశేష గ్రహణదోష ప్రాయశ్చిత్తమును పశ్వాధిపతి రుద్రుడు గాన రుద్ర యాగముచే నిర్వర్తింప వలెను.

నివాసస్థాన మలభ్యమగుటచే వైశ్వానరేష్టియు అశ్వము బదరాఖ్యానము చేసినచో-

అగ్నిహోమ మగ్నికి అష్టాకపాలము
సౌర్య దేవతాకమునకు పయస్సు
వాయవ్యమునకు నాజ్య భాగములు ప్రాయశ్చిత్తములుగా విధింపబడినవి.

ఇట్లన్ని ప్రాయశ్చిత్తము లొనర్చుటచే యజమాని మిక్కిలి ధనవంతుడగును. అశ్వము రోగ వినిర్ముక్తమగును.

ఇది పదునేడవ యనువాకము

18. శాఖాంతరమందు నుదహరింపబడిన యిష్టులను నిరాకరించి బ్రహ్మోదన విధిని నుపదేశించుచున్నాడు.

అశ్వమేధ సమాప్త్యనంతరము యజమాని తన గృహమును ప్రవేశించి ద్వాదశ బ్రహ్మోదనముల నిర్వపణము చేయవలెనని వికల్పముగా నాగ్నేయ మష్టాకపాలాది ద్వాదశేష్టులను నిర్వర్తింపవలెననియు పక్షాంతరము చెప్పబడెను.

ఒకవేళ యిష్టుల నొనర్చినచో సంకల్పమైన యజ్ఞమునకు యజమాని ఫలమందుటయును సమాప్తము కాజాలదు. యజమాని యాగమునందు సమస్త మంత్ర గత ఛందముల నుపయోగించుకొనిన హేతువున తిరిగి శీఘ్రముగా వానిని

*** సోమఓషధీనా మధిపతి ::

ప్రయోగించుట యశక్యమగును. యజ్ఞము సమాప్తి యగునంతకు వాక్కు నిష్ప్రయోజన మగును. గత సారమగు నీ వాక్కును 'యాతయామ్ని' అని యందురు.

ఇట్లు పిష్టపేషణ న్యాయమున నీ వాక్కు పునః పునః ప్రయోగముచే బాధింపబడి, హింసింపబడిన దగును. తత్కారణముచే నీ వాక్కు ప్రయోగానర్హమని బ్రహ్మవేత్తలు చెప్పెదరు.

కనుక వికల్ప విధాన మనావశ్యకము. యజమాని గృహాగతుడై బ్రహ్మౌదనవిధి నిర్వర్తింప వలెను. ఓదనము గోజ్ఞము. యజ్ఞము ప్రజాపతి. ఓదన నిర్వాపణ మొనర్చుటచే నీ యజమానికి యజ్ఞతాదాత్మ్యము కలుగును. ఛందస్సు వాక్కులకు పునః పునః ప్రయోగ దోషముండుట లేదు. ఈ కారణమున యజమానికి పాపము లేదు. ద్వాదశ నిర్వాపణములచే సంవత్సరము నందు యజమాని సుప్రతిష్ఠుతుడగును.

ఇది పదునెన్మిదవ యనువాకము

19 అశ్వమేధ మీ యనువాకమున విభుత్వాది ద్వాదశ గుణములచే బ్రశంసిత మగుచున్నది.

1. విభువు, ప్రభువు, ఊర్జస్వము, పయస్వము, విధృతము, వ్యాపృతము, ప్రతిష్ఠ, తేజస్వి, బ్రహ్మవర్చసి, అతివ్యాధి, దీర్ఘము, క్లుప్తము అనునవి ద్వాదశ నామములు వీని వివరణము-

1. విభువు : వివిధములయిన శ్రేయములను భావనచేయు యజ్ఞమగుటచే నిది విభువనెడి యజ్ఞము. ఆ భావన వలన ఫలము గవాదికముల యభివృద్ధి.

2 ప్రభువు : గొప్పగా చేయబడు యజ్ఞము. ప్రభుత్వాభివృద్ధి ఫలము.

3 ఊర్జస్వము : అన్నపత్తు అయినది ఊర్జస్వము.

4. పయస్వము : క్షీరాది రసపత్తు అయిన యజ్ఞము పయస్వము.

5. విధృతము : విశేషధారణచే నియతఫలదాయినియగు సవనము విధృతము

6. వ్యాపృతము : ఫలాభిసంధిచే నితర యజ్ఞముల కంటె విలక్షణమయినది.

7. ప్రతిష్ఠ : చాంచల్య రహితమయిన జన్నము.

8. తేజస్వి : ఖ్యాతి యుతమయినది.

9. బ్రహ్మవర్చసి : మంత్రప్రయుక్తమైన తేజస్సుతో కూడినది.
10. అతివ్యాధి : ఎక్కువైన పాపమును పోగొట్టెడి స్వభావము గల యజ్ఞము.
11. దీర్ఘము : దీర్ఘమైన ఫలముతో గూడినది.
12. క్లృప్తము : సర్వసాధన సంపన్నమయిన యజ్ఞము క్లృప్తము.

ఇట్లు ద్వాదశ గుణములచే నీ యాగము ప్రశంసింపబడినది.

ఇది పందొమ్మిదవ యనువాకము

అశ్వసంజ్ఞపన ప్రకారము

20 ప్రబ్బలిగడ్డి (ప్రైతసము) పఱచి దానిపై తార్ప్యము* నుంచి తార్ప్యముపై కృత్యధీవాసమును • దానిపై హిరణ్యకశిపువును. * దానిపై రుక్మమును. * పఱచి దానిపై మేధ్యాశ్వము నుంచవలెను. అనంతర మధ్వర్యునిచే సంజ్ఞపన విధి నిర్వర్తింపబడును.

సంజ్ఞపనవిధికి ప్రధాన సాధనమగుటచే తార్ప్యమును యజ్ఞమందురు. దీని నాస్తరణము చేయుటచే యజ్ఞము చేతనే యశ్వము సమృద్ధమయినట్లగును. యమ సంబంధి సామను 'యామ మందురు. పితృమేధములో సామగులు గానముచేసెడి యీ 'యామ'ను ప్రస్తోత ఋత్విజు సమీపస్థితుడై యుపస్థానము చెప్పవలెను. కృత్యధీవాసము పశురూపమగుటచే యజమానికి పశుప్రాప్తి యగును. హిరణ్యము తేజో ప్రాప్తిని కల్గించి స్వర్గమును సయితము ప్రకాశింప జేసినది యగును. ఆస్తరణము లోని విశేషమేమన-

తార్ప్యము, కృత్యధీవాసము, హిరణ్యకశిపువు. స్వర్ణఫలకములు క్రమముగా భూలోక, అంతరిక్ష, ద్యులోకాదిత్యలోక స్వరూపములు. వీనిచే నా యా లోకములు యజమానికి ప్రాప్తించిన వగును. అశ్వము ప్రజాపతి స్వరూప మగుటచే ప్రజాపతి సాలోక, సాయుజ్యాదులు సిద్ధించును.

ఎవరీ యశ్వమేధ మాచరింతురో, తద్విధాన మెఱుంగుదురో, వారి

---

* 'ఘృతాక్తస్య కంబలస్య నామధేయమ్. తార్ప్యమ్.

* చర్మమయ మచ్ఛాదన పటమ్ కృత్యధీవాసమ్.

• సువర్ణఖచితాం శయ్యాం హిరణ్యకశిపుః ।

* సువర్ణ ఫలకం రుక్మమ్.